# సాత్త్వికాభినయం

డా॥ పి.ఎస్.ఆర్. అప్పారావు



ప్రచురణ

తెలుగు విశ్వవిద్యాలయం

హైదరాబాదు

SAATWIKABHINAYAMU - *Written by*
***Dr. P.S.R. Appa Rao***

---


తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురణ సంఖ్య : 138

ప్రథమ ముద్రణ : 1993

ప్రతులు : 1000





వెల : రూ.70/-

ప్రతులకు :
డైరెక్టర్
ప్రచురణల విభాగం
తెలుగు విశ్వవిద్యాలయం
లలిత కళాక్షేత్రం, పబ్లిక్ గార్డెన్స్
హైదరాబాదు - 500 004. ఆం.ప్ర.

ముద్రణ :
విష్ణ కంప్యూటర్ సర్వీసెస్
నల్లకుంట, హైదరాబాద్.
ఫోన్ : 66 74 76

# ప్రస్తావన

ఆచార్య పోణంగి శ్రీ రామ అప్పారావుగారు సుప్రసిద్ధ పండితులు, పరిశోధకులున్ను. అంతేగాక వారు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ విద్యాసాంస్కృతిక శాఖల్లో వివిధ పదవులను అలంకరించి పరిపాలనాదక్షులుగా పేరు గడించారు. విదేశపర్యటనలు కూడ జరిపి విశేషానుభవాన్ని గడించారు. వారు తెలుగు నాటక సాహిత్యాన్ని గురించి పరిశోధన చేసి పిహెచ్.డి.పట్టం పొందడమేగాక భరతుని నాట్యశాస్త్రాన్ని తెలుగులో అనువదించిన ఉత్తమ గ్రంథకర్త. పలు సాహిత్య ప్రక్రియల్లోను వారు ఎన్నో గ్రంథాలు రచించినారు. హైదరాబాదు కేంద్ర విశ్వవిద్యాలయంలో నృత్యశాఖకు రూపకల్పన చేసినారు. అన్నింటికన్న మించి వారు ఇప్పుడు తెలుగు విశ్వ విద్యాలయంలో విలీనమైన అంతర్జాతీయ తెలుగు కేంద్రానికి డైరెక్టరుగా కూడ వ్యవహరించినారు.

డా॥ అప్పారావుగారు ఇటీవల చతుర్విధ అభినయాలకు వివరణతో కూడిన వ్యాఖ్యానం చేసినారు. వాటిలో ఈ 'సాత్త్వికాభినయనం' మొదటిది. చతుర్విధ అభినయాలలో 'సాత్త్విక అభినయానికి విశిష్ట స్థానమున్నది. నృత్యశాఖ విద్యార్థులకు 'సాత్త్వికాభినయం' గురించి తెలుసుకోవడానికి ఇప్పటివరకు మనకు తెలుగులో ప్రామాణిక గ్రంథాలు లేవు. ఆలోటును తీర్చడానికి డా॥ అప్పారావుగారు ఈ కృషి చేసినారు. ప్రధానంగా భరతుని నాట్యశాస్త్రంలోని అంశాలను ఆధారంగా చేసుకొని ఇతర లాక్షణికులు చెప్పిన విషయాల్నికూడ దృష్టిలో పెట్టుకొని అవసరమున్నచోట వాటిని ఉదాహరిస్తూ 'సాత్త్వికాభినయం' గురించి ప్రామాణికమైన పద్ధతిలో డా॥ అప్పారావుగారు ఈ గ్రంథాన్ని సిద్ధం చేసినారు. దానిని మా తెలుగు విశ్వవిద్యాలయం పక్షాన ప్రకటించుకునే అవకాశం కల్పించినందుకు డా॥ అప్పారావుగారికి కృతజ్ఞతలు. ఇట్లా ముమ్ముందు ఇతర అభినయాలను గురించి వివరించే గ్రంథాలను కూడా త్వరలో ప్రచురించాలని మా యోచన. మా ఈ కృషిని పాఠకులు ఆదరిస్తారని ఆశిస్తున్నాను.

ఆచార్య పేర్వారం జగన్నాథం
ఉపాధ్యక్షులు
తెలుగు విశ్వవిద్యాలయం

అంగీరస మహాశివరాత్రి
19-2-1993

# విజ్ఞప్తి

పితరౌ జగతః పితరౌ వందే!

1983 లో ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక వ్యవహారాలశాఖ డైరక్టర్‌గా పదవీ విరమణ చేసిన తరువాత నా సాహిత్య వ్యాసంగం నృత్యకళకు పూర్తిగా అంకితమైంది.

నందికేశ్వర ప్రణీతమైన 'అభినయ దర్పణము'నకు ప్రతి పదార్థ-తాత్పర్య-టీకా సహితమైన నా తెలుగు అనువాదం 1987లో ముద్రింపబడింది. "నాట్యశాస్త్రం : విశ్లేషణాత్మక అధ్యయనం" అనే నా పరిశోధాత్మక రచన 1988 లో ముద్రింపబడింది (దీని ఆంగ్లానువాదం 1969 లోనే ముద్రణ భాగ్యం పొందింది). ఈ రెండు గ్రంథాల ముద్రణకు ప్రేరకులు శ్రీ గరిమెళ్ళ రామమూర్తిగారు, డా. వెంపటి చినసత్యంగారు; ఆర్థిక సహాయంచేసిన వారు శ్రీ బి.వి.యస్.యస్. మణిగారు.

1986 సెప్టెంబర్‌లో కేంద్ర ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాలశాఖవారు నాకు స్కాలర్‌షిప్ మంజూరుచేశారు - చతుర్విధాభినయాలపై పరిశోధనచేసి, స్వతంత్ర గ్రంథం వ్రాయటానికి; ఈ కృషి నాలుగు నెలలుపాటు సాగింది. ఇంతలో 1987 జనవరి నుంచి యు.జి.సి. వారు నా పరిశోధనకు ఆర్థికసహాయం అందించటానికి అంగీకరించినారు. అందుచేత కేంద్రప్రభుత్వం వారి స్కాలర్‌షిప్‌ను విడిచిపెట్టి, యు.జి.సి. వారి ఆర్థికసహాయాన్ని స్వీకరించాను; ఈ కృషి 1988 జూలై వరకు సాగింది. ఈ సమయంలో 'ఆంగికాభినయం' మీద రచన పూర్తి చేశాను. (ఇది ముద్రణలో సుమారు 1200 పుటలు ఉంటుంది).

నా అభినయదర్పణ అనువాదం చూసిన ఆచార్య టి. దోణప్ప (నాటి తెలుగు విశ్వవిద్యాలయం వైస్‌ఛాన్సలర్) గారు 400 శ్లోకాలతో సంక్షిప్తంగా ఉన్న "భరతరసప్రకరణము"ను కూడా అట్లాగే ప్రతిపదార్థ-తాత్పర్య-టీకా సహితంగా అనువదించటం అవశ్యకమని సూచించినారు. వెంటనే అందుకు పూనుకొని, ఆ రచన పూర్తిచేశాను.

1988 జూలైనుంచి కేంద్ర (హైదరాబాదు) విశ్వవిద్యాలయంలో "Sarojini Naidu School (=S.N. School) of Performing Arts, Fine Arts and Communication" ప్రారంభించాలని నిర్ణయించారు. వైస్‌ఛాన్సలర్ ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తిగారు. ప్రొఫెసర్ అండ్ కో-ఆర్డినేటర్‌గా బాధ్యత స్వీకరించి S.N. School ను స్థాపించవలసినదిగా ఆచార్య కృష్ణమూర్తి గారు కోరినారు.

ఆనందంతో, కృతజ్ఞతా పూర్వకంగా, నేను అంగీకారం తెలిపినప్పుడు, "మన గురువుగారు ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు రిటైర్ అయిన 12 సంవత్సరాలకు గాని శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్ కాలేదు, రిటైర్ అయిన అయిదు సంవత్సరాలకే మీరు ప్రొఫెసర్ అవుతున్నా"రని ఛలోక్తి కూడా విసిరినారు సతీర్థ్యులైన ఆచార్య కృష్ణమూర్తిగారు.

1988 జూలై 21 తేదీన S.N. School ప్రారంభోత్సవం జరిపించాను. ఆంధ్రప్రదేశ్‌లో సుమారు 37 సంవత్సరాలు పనిచేసి, వివిధములైన పదవులను నిర్వహించాను. ఆ సమయంలో చాలా క్రొత్తసంస్థలను స్థాపించే సదవకాశాలు నాకు కలిగాయి. అట్లాగే ఈ S.N. School ను స్థాపించే సదవకాశం కూడా నాకు లభించటం నా అదృష్టం. ఆచార్య కృష్ణమూర్తిగారి నిత్య పర్యవేక్షణలో, ఆచార్య ఆర్.వి.ఆర్. చంద్రశేఖరరావు (నాడు డీన్-ఇన్-ఛార్జి) గారి సహకారంతో ఈసారి కూడా వాక్పృషిలో విజయం పొందాను.

ఎస్.ఎన్. స్కూలులో, నృత్యవిభాగంలో ఎమ్.ఏ. మొదటి సంవత్సరం విద్యార్థులకు 'ఆంగికాభినయము'ను గూర్చి, రెండవ సంవత్సరం విద్యార్థులకు 'సాత్త్వికాభినయము'ను గూర్చి పాఠం చెప్పవలసి ఉన్నది. నేను ఈ బాధ్యతను చేపట్టి 1988-89 సంవత్సరంలో ఎమ్.ఏ. మొదటి సంవత్సరం విద్యార్థులకు 'ఆంగికాభినయం' బోధించాను; ఇందుకు నేను రచించిన 'ఆంగికాభినయం' పూర్తిగా ఉపయోగపడింది. 1989-90 సంవత్సరలో రెండవ సంవత్సరం విద్యార్థులకు 'సాత్త్వికాభినయం' పాఠం చెప్పాలి. ఇంతలో తెలుగు విశ్వవిద్యాలయంవారు ఎమ్.ఏ. కూచిపూడి నృత్యవిభాగం ప్రారంభించారు. అయితే ఎమ్.ఏ. స్థాయికి సంక్షిప్తంగా ఉన్న భరతరసప్రకరణం మాత్రం చాలదనిపించింది. అందుచేత 'సాత్త్వికాభినయం' అనే పేరుతో మరల రచన ప్రారంభించి, పూర్తిచేశాను.

ఆంగికాభినయం, సాత్త్వికాభినయం రచనలకు ప్రేరకులైన కేంద్ర ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాలశాఖవారికి, యు.జి.సి. వారికి, ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తిగారికి నా హృదయ పూర్వక కృతజ్ఞతలు. ఈ రచనలకు ప్రథమ శ్రోతలైన మా విద్యార్థినీ విద్యార్థులకు శుభాశీస్సులు.

సాత్త్వికాభినయంయొక్క స్వరూప స్వభావాలను, గ్రంథ ప్రమేయమును ప్రథమ ప్రకరణంలో వివరించాను. ఈ సాత్త్వికాభినయ రచనలో నాకు ప్రధానంగా తోడ్పడిన గ్రంథాలు : నాట్యశాస్త్రం, ధ్వన్యాలోకం, దశరూపకం, సంగీతరత్నాకరం, శృంగారప్రకాశం, సాహిత్యదర్పణం, ప్రతాపరుద్రయశోభూషణం, భావప్రకాశనం, రసార్ణవసుధాకరం, రసమంజరి, రసతరంగిణి, శృంగారమంజరి,

భరతరసప్రకరణం. అయితే, నాట్యశాస్త్రం తక్కిన గ్రంథాలన్నింటికి ఆధారగ్రంథం; అట్లాగే నా రచనకు కూడా నాట్యశాస్త్రమే ఆధారగ్రంథం. కాని, నాట్యశాస్త్రంలో సాత్త్వికాభినయానికి సంబంధించిన అంశాలు అన్నీ ఒక్కచోట లేవు. సందర్భానుసారంగా ఆయా అంశాలు ఆయా అధ్యాయాలలో వేరువేరుగా వివరింపబడినది; వీటిని అన్నింటిని ఒక క్రమపద్ధతిలో విశ్లేషించటం ప్రథమ కర్తవ్యమైనది. తరువాతి రచనలలో ఆయా అంశాలు కొంత విపులీకరింప బడినవి; కొన్ని గ్రంథాలలో క్రొత్త విషయాలు చేర్చబడినవి. ఉదా: భరతముని విభావంలో భేదాలను చెప్పలేదు. కాని, తరువాతివారు ఆలంబనం, ఉద్దీపనం అనే భేదాలను విభావానికి చెప్పారు. ఈ విభజన కాల్పనికమని అభినవగుప్తుడు త్రోసి పుచ్చినప్పటికీ, అర్వాచీనులందరూ ఈ విభజనను అంగీకరించినారు. ఆయా అంశములన్నింటిని సమన్వయం చేయవలసి ఉన్నది.

భారతీయ అలంకారశాస్త్ర గ్రంథాలన్నీ సంస్కృతభాషలో ఉన్నవి. రాజశేఖరుని కావ్యమీమాంస తప్ప తక్కినవన్నీ శ్లోకరూపంలో ఉన్నవని చెప్పవచ్చు. ఈ కారణాలవల్ల ఈ శాస్త్రాలు విద్యార్థులకు, నృత్యాచార్యులకు కూడా అందుబాటులో లేవనటం సత్యదూరం కాజాలదు. భరతముని నాట్యశాస్త్రమును తెలుగు వచనములోనికి అనువదించి, కొంతవరకు ఈ లోటును తీర్చటంలో కృతకృత్యుడనయ్యాను. కాని, మూలంలోని శ్లోకాలు కూడా పూర్తిగా ఇచ్చి ఉంటే మరింత బాగుండేదని కొందరు సూచించినారు. అంతమాత్రం సరిపోదు, మూలశ్లోకాలకు ప్రతిపదార్థ, తాత్పర్యాలు రెండూ ఉండాలని కొందరభిప్రాయ పడినారు. ఈ రెండింటికితోడు, పూర్వాపర సమన్వయం చేసే 'టీక' కూడా ఉండాలని నాకు తోచింది. ఆయా సూచనలను దృష్టిలో పెట్టుకొని, మూలశ్లోకాలు ఇస్తూ, వాటికి ప్రతిపదార్థ-తాత్పర్య-టీకలు వ్రాసి, నందికేశ్వరుని 'అభినయదర్పణం' 1988 లో ప్రచురించాము— శ్రీ బి.వి.యస్.యస్. మణిగారు ఉదారంగా అందించిన ఆర్థికసహాయంతో. ఇది విద్యార్థులకు, ఉపాధ్యాయులకు చాలా ఉపయోగకరంగా ఉన్నదనే ప్రశంస పొందింది. ముఖ్యంగా నాట్యశాస్త్ర శ్లోకాలను ఉదాహరించినప్పుడు ఇదే పద్ధతిని ఈ రచనలో కూడా అవలంబించాను.

కాగా, ప్రతిఅంశమునకు నాట్యశాస్త్రంనుంచి ఎన్నిక చేసిన వచనం లేదా శ్లోకాలు పేర్కొంటూ, వాటికి తొలుత ప్రతిపదార్థం, తరువాత తాత్పర్యం, పిమ్మట టీక వ్రాశాను. ఆయా అంశాల పూర్వాపర సమన్వయ పూర్వకాలైన విశేషాంశములతో కూడి ఉంటుంది 'టీక'. నాట్యశాస్త్రంలోలేని క్రొత్త అంశాలను విశదీకరించినప్పుడు, వాటిని విశదీకరించిన గ్రంథాలలోని శ్లోకాలను ఎన్నికచేసి

పైవిధంగా వివరించాను. ఉదాహరణ శ్లోకాలకు మాత్రం తాత్పర్యం ఒక్కటే వ్రాశాను.

సంస్కృత శ్లోకాలలో తు, చ, పి, తథా, ఇహ, హి మున్నగునవి సర్వసామాన్యంగా పాదపూరణాలుగా ఉంటాయి. అందువేత ప్రతిపదార్థం వ్రాసేటప్పుడు, వాటిని సంస్కృతభాగంలో కుండలీ కరణములందుంచి, అనువాదంలో చూపటం మానివేశాను.

అనుభావాదులను వివరించేటప్పుడు - వాటిని తృతీయా విభక్తిలోనో, సప్తమీ విభక్తిలోనూ చెప్పటం సర్వ సామాన్యం. ఉదా :

స్పర్శ-భయ-శీత-హర్షాత్ క్రోధా ద్రోగాచ్చ రోమాంచః ॥
ముహుః కంటకితత్వేన తథోల్లుకసనేన చ ।
పులకేనచ రోమాంచం గాత్రస్పర్శేన దర్శయేత్ ॥

దీనిని ఇట్లా అనువదించాలి -- స్పర్శవల్ల, భయంవల్ల, శీతంవల్ల, హర్షంవల్ల, క్రోధంవల్ల రోమాంచం (సంభవిస్తుంది). మాటిమాటికి కంటకితత్వంతో, ఉల్లుకసనంతో, పులకంతో, గాత్రస్పర్శతో రోమాంచం ప్రదర్శించాలి. కాని, దీనికి నా అనువాదం ఇట్లా సాగింది: స్పర్శ, భయం, శీతం, హర్షం వీటివల్ల; క్రోధం, రోగం-వీటివల్ల; రోమాంచం కలుగుతుంది. మాటిమాటికి కంటకితత్వం, ఉల్లుకసనం, పులకలు, గాత్రస్పర్శ - వీటితో రోమాంచాన్ని ప్రదర్శించాలి. ప్రతిపదార్థరచన అంతా ఇట్లాగే సాగింది. దీనిని గమనించాలి.

స్మృతః, విజ్ఞేయః, కథితః, పరికీర్తితః, ఉక్తః - - మున్నగు క్రియలకు అర్థాలు వేరువేరు అయినా, సారాంశం ఒక్కటే. కాబట్టి అనువాదంలో ఆయా భేదాలను నేను అంతగా పాటించలేదు.

సుబోధకం కావటంకోసం, సాధ్యమైనంతవరకు వ్యావహారికంలోనే రచన సాగించాను.

ఇట్లా సమగ్రంగా సిద్ధమైన వ్రాతప్రతిని పరిశీలించి, జ్ఞానపీఠ అవార్డు గ్రహీత, వైస్-ఛాన్సలర్ అయిన ఆచార్య సి. నారాయణరెడ్డిగారు, దీనిని తెలుగు విశ్వవిద్యాలయం పక్షాన ముద్రించటానికి అంగీకరించారు; వారికి హృదయ పూర్వక కృతజ్ఞతలు. ఈ గ్రంథ ముద్రణపట్ల విశేష ఆసక్తి చూపిన సర్వశ్రీ వేమరాజు భానుమూర్తి, ఆచార్య యస్. శివరామమూర్తి, డా. టి. గౌరీశంకర్, ఆచార్య బి. రామకృష్ణారెడ్డి, జి. రామకృష్ణారావు, ఆచార్య తిరుమలరావుగార్లకు శ్రీమతి ఉమారామారావుగారికి నా కృతజ్ఞతలు.

ఈ ముద్రణ కార్యమును పర్యవేక్షించిన ఆచార్య ఎమ్. వీరభద్రశాస్త్రిగారికి, శ్రద్ధతో లేజర్ కంపోజింగ్ చేసిన శ్రీ జి. సుబ్బారావునకు, విప్ల ప్రింటర్సువారికి నా కృతజ్ఞతలు.

నా ఇంకో రచన 'ఆంగికాభినయం' కూడా ఇట్లాగే వెలుగు చూడగలదని విశ్వసిస్తున్నాను.

'సాత్త్వికాభినయం' అనే ఈ రచన విశ్వవిద్యాలయ స్థాయిలో నృత్యవిద్యార్థులకేకాక, థియేటర్ ఆర్ట్స్ విద్యార్థులకు, సాహిత్య విద్యార్థులకు, ఆయా ఉపాధ్యాయులకు కూడా ఉపయోగపడ గలదని విశ్వసిస్తున్నాను; ఇందులకు సహృదయులే ప్రమాణం!

పోణంగి శ్రీరామ అప్పారావు

# అంకితం



నటుడు, రచయిత,

రాజకీయవేత్త, రసజ్ఞుడు,

సహృదయుడు, ఆత్మీయుడు

శ్రీ పసల సూర్యచంద్రారావు అన్న గారికి

\- శ్రీ రామ అప్పారావు

# కృతికర్త

## పోణంగి శ్రీరామ అప్పారావు ఎమ్.ఏ., పిహెచ్.డి.

| | |
|---|---|
| జననం | : రుధిరోద్గారి ఆషాఢ శుద్ధ అష్టమీ శనివారం (21-7-1923) |
| జన్మస్థలం | : పశ్చిమగోదావరిజిల్లా, కొవ్వూరు తాలూకా, బందపురం గ్రామం. |
| తల్లిదండ్రులు | : శ్రీమతి లక్ష్మీనరసమ్మ, శ్రీరామమూర్తి. |
| భార్య | : శ్రీమతి వేంకటరమణమ్మ. |
| సంతానం | : ఇద్దరు కుమార్తెలు : శ్రీమతి లక్ష్మి. ఎన్. దామరాజు M.A. Ph.D.; శ్రీమతి వేంకటలక్ష్మి పెమ్మరాజు M.Sc. ఒక కుమారుడు : శ్రీరవిప్రసాద్ పోణంగి M.Tech. |
| విద్యాభ్యాసం | : కొవ్వూరు ఉన్నత పాఠశాల, విజయవాడ శ్రీరాజా రంగయప్పారావు కళాశాల, ఆంధ్ర విశ్వవిద్యాలయం (తెలుగు సాహిత్యంలో ఎమ్.ఏ. - 1946). |
| పరిశోధన | : ఉస్మానియా విశ్వవిద్యాలయం (తెలుగు నాటకవికాసంపై పి.హెచ్‌డి. పట్టం - 1961). |
| ఉద్యోగాలు | : భీమవరం, రాజమండ్రి, కడప, శ్రీకాకుళం, మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలల తెలుగు శాఖలు; హైదరాబాదు డిగ్రీ కళాశాల ప్రిన్సిపాలు; పాఠ్యపుస్తకాల జాతీయాకరణ ప్రత్యేకాధికారి; సాంస్కృతిక వ్యవహారాల ప్రత్యేకాధికారి; తెలుగు అకాడమి, అంతర్జాతీయ తెలుగుసంస్థల వ్యవస్థాపక డైరక్టర్; సాంస్కృతిక వ్యవహారాలశాఖ డైరక్టర్‌గా పదవీ విరమణ. |
| విదేశ పర్యటనలు | : మలేషియా, సింగపూర్, లండన్, ప్రాగ్ (జకోస్లొవేకియా), వియన్నా, అమెరికా. |
| విశిష్టతలు | : ఉత్తమ గ్రంథకర్తగా జాతీయ బహుమానం (నాట్యశాస్త్రం-1961); ప్రథమ ప్రపంచ తెలుగు మహాసభల ప్రధాన కార్యదర్శి-1975; ఉత్తమకళాశాల అధ్యాపకసన్మానం (1980); యు.జి.సి. పథకంలో - "సంస్కృతనాటకాలు, చతుర్విధ అభినయాలు" - అనే అంశాలపై గ్రంథరచన (1987-88); హైదరాబాదు (కేంద్ర) విశ్వవిద్యాలయంలో ఆచార్యపదవి (1988 నుంచి) |

రచనలు : తాజ్‌మహల్ (నాటిక - 1942)
విశ్వభారతి (నవల - 1946)
వేణువు (పద్యాత్మక గద్యం - 1952)
నాట్యశాస్త్రము (భరతముని నాట్యశాస్త్రమునకు సమగ్రాను వాదం - గుప్త భావప్రకాశికా వ్యాఖ్యా సహితం - 1959; 1961 లో జాతీయ బహుమతి పొందిన గ్రంథం).
తెలుగు నాటక వికాసము (పిహెచ్.డి. సిద్ధాంత వ్యాసం - 1967)
A Monograph on Bharata's Natya Sastra (1967); ధర్మ వరం రామకృష్ణమాచార్య జీవితం-రచనలు-(1986); నృత్యకళ : తెలుగుదేశం (తెలుగు నృత్తరత్నావళికి 70 పుటలు పీఠిక - 1974).
ధూర్జటి కవితావైభవం (1976)
భారతీయనాటకరంగం (శ్రీ ఆద్యరంగాచారి ఆంగ్లగ్రంథాను వాదం - 1980)
అభినయదర్పణం (1987)
నాట్యశాస్త్రం - విశ్లేషణాత్మక అధ్యయనం (1988)
అముద్రితములు :
ప్రథమాంధ్ర నాటకకర్తలు;
ఆంధ్ర - ఆలంకారికులు; సాహిత్య సంప్రదాయాలు;
ఆంగికాభినయం.

సంపాదకత్వం : శ్రీ కాళహస్తీశ్వర మాహాత్మ్యం
(విపులపీఠికా సహితం)
Historical Tables (History of A.P. as main entry)
Select Prayers
విషాద సారంగధర (విపులపీఠికా సహితం)
Antonyms & Synonyms (English-Telugu)
మానవల్లి కవి రచనలు (తెలుగులో, ఆంగ్లంలో)

# సంకేత పదవివరణ

| | | |
|---|---|---|
| అ(భి).భా | — | అభినవభారతి (వ్యాఖ్య-అభినవగుప్తుడు) |
| అ(భి).శా | — | అభిజ్ఞాన శాకుంతలం (కాళిదాసు) |
| ఆం.మ.భా. | — | ఆంధ్రమహాభారతం |
| ఉ.రా.(చ) | — | ఉత్తర రామచరిత (భవభూతి) |
| ఔ.వి.చ | — | ఔచిత్య విచారచర్చ (క్షేమేంద్రుడు) |
| కు.సం | — | కుమారసంభవం (కాళిదాసు) |
| కృ.క | — | కృష్ణకర్ణామృతం (లీలాశుకుడు) |
| గా.స.శ | — | గాథాసప్తశతి (హాలసాతవాహనుడు) |
| ద.రూ | — | దశరూపకం (ధనంజయుడు) |
| ధ్వ.ఆ | — | ధ్వన్యాలోకం (ఆనందవర్ధనుడు) |
| నా.శా. | — | నాట్యశాస్త్రం (భరతముని) |
| వృ.ర | — | వృత్తరత్నావళి (జాయసేనాపతి) |
| ప్ర.రు.య | — | ప్రతాపరుద్ర యశోభూషణం (విద్యానాథుడు) |
| భ.ర.ప్ర | — | భరతరస ప్రకరణం (సీడామంగలం తిరు వేంకటాచార్యులు) |
| భాగ. | — | భాగవతం |
| భా.ప్ర. | — | భావప్రకాశనం (శారదాతనయుడు) |
| మా.(అ).మి | — | మాలవికాగ్నిమిత్రం (కాళిదాసు) |
| మా.మా | — | మాలతీమాధవం (భవభూతి) |
| మే.సం | — | మేఘసందేశం (కాళిదాసు) |
| ర.త | — | రసతరంగిణి (భానుదత్తుడు) |
| ర.మం | — | రసమంజరి (భానుదత్తుడు) |
| ర.వం | — | రఘువంశం (కాళిదాసు) |
| ర.సు | — | రసార్ణవ సుధాకరం (సింగభూపాలుడు) |
| రామా. బాల | — | రామాయణం బాలకాండ |
| రామా. సుంద | — | రామాయణం సుందరకాండ |
| వి. ఊర్వ | — | విక్రమోర్వశీయం (కాళిదాసు) |
| వేణీ. సం | — | వేణీసంహారం (భట్టనారాయణుడు) |
| శృం.మం | — | శృంగారమంజరి (అక్బర్ షా) |
| సం.ర | — | సంగీత రత్నాకరం (శార్ఙ్గదేవుడు) |
| సా.ద | — | సాహిత్యదర్పణం (విశ్వనాథ కవిరాజు) |
| సా.ద-.వా. | — | సాహిత్యదర్పణం (వేదంవారి అనువాదం) |

# విషయసూచిక

ఆంగికం భువనం యస్య
వాచికం సర్వవాఙ్మయమ్ ।
ఆహార్యం చంద్రతారాది
తం వందే సాత్త్వికం శివమ్ ॥

-అభినయదర్పణం-1

శృంగారవీర సౌహార్దం
మౌగ్ధ్యవైయాత్య సౌరభమ్ ।
లాస్యతాండవ సౌజన్యం
దాంపత్యం తద్భజామహే ॥

-రసార్ణవసుధాకరం-I-1

# సాత్త్వికాభినయం

## 1. సత్త్వం :

మూలం : "నాట్యం సత్త్వే ప్రతిష్ఠితం". -(నా.శా.XXII-1)
"సత్త్వం నామ మనః ప్రభవమ్. తచ్చ సమాహిత
మనస్త్వాదుచ్యతే. మనసః సమాధౌ సత్త్వనిష్పత్తి ర్భవతి."
(నా.శా. VII-93 శ్లో. తరువాతి గద్య)
". . .అవ్యక్తరూపం హి సత్త్వం". -(నా.శా.XXII-3)
"సత్త్వాతిరిక్తోఽ భినయో జ్యేష్ఠః; సమసత్త్వో
భవేన్మధ్యమః; సత్త్వహీనోఽ ధమః". -(నా.శా.XXII-2)

అర్థం : సత్త్వమందు నాట్యం ప్రతిష్ఠితమైంది.

సత్త్వం అనేది మనస్సు నుండి పుట్టేది అంటే, ఇది, సమాహితం అయిన (సమాధి లేదా ఏకాగ్రతతో కూడిన) మనస్సు కలది కావటం చేత 'సత్త్వం' అనబడింది. కాగా మనస్సు యొక్క సమాధి అవస్థ యందు సత్త్వ నిష్పత్తి జరుగుతుంది.

ఈ సత్త్వం అవ్యక్త (=అదృశ్య) రూపంగా ఉంటుంది. (అయితే రస భావాలకు అనుగుణంగా రోమాంచ-అస్రాదిరూపంగా ఇది అభివ్యక్తమవుతూ ఉంటుంది).

ఏ అభినయమందు 'సత్త్వం' (=సాత్త్వికాభినయం) అధికంగా ఉంటుందో అది జ్యేష్ఠ (=ఉత్తమ) అభినయం అవుతుంది. సత్త్వం తక్కినవాటితో సమానంగా ఉంటే అది మధ్యమం. ఇంక సత్త్వహీనమైన (=సత్త్వం అల్పంగా ఉన్న) అభినయం అధమం అవుతుంది.

టీక : యోఽయం స్వభావో లోకస్య సుఖ-దుఃఖ సమన్వితః ।
సోఽంగాద్యభినయోపేతో నాట్య మిత్యభిధీయతే ॥(నా.శా.I-119)

—సుఖ-దుఃఖాలు లోకస్వభావాలు. ఆ సుఖ-దుఃఖాలు ఆంగికాది అభినయాలతో కూడినవైనప్పుడు (=రంగస్థలం మీద ప్రదర్శింపబడినప్పుడు), అది 'నాట్యం' అనబడుతుంది. ఇది భరతమునిచేసిన నాట్యనిర్వచనం. 'ఆంగికాదిఅభినయాలు' అంటే ఆంగికాభినయం, వాచికాభినయం, సాత్త్వికాభినయం, ఆహార్యాభినయం అని అర్థం. ప్రస్తుతాంశం సాత్త్వికాభినయం; సత్త్వసంబంధమైనది సాత్త్వికాభినయం. సత్త్వబహుళమైనది ఉత్తమాభినయం అని భరతముని స్పష్టం చేసినాడు.

అయితే నాట్యంలో, దుఃఖాన్ని అభినయించటానికి నిజంగా దుఃఖంలో ఉన్న నటుడు, సుఖాన్ని అభినయించటానికి నిజంగా సుఖంగా ఉన్న నటుడు లభించడం సంభావ్యం కాదు. కాని నటుడు తాను నిజంగా సుఖం అనుభవిస్తూ ఉండకపోయినా లేదా తాను నిజంగా దుఃఖం అనుభవిస్తూ ఉండకపోయినా సుఖాన్ని, దుఃఖాన్ని రంగస్థలం మీద అభినయిస్తూనే ఉన్నాడు. అటువంటి అభినయం అతడు చేయగలగటం సత్త్వప్రభావం చేతనే. అంటే అదుఃఖితుడైన నటుడు దుఃఖితుడై అశ్రువును, అసుఖితుడైన నటుడు సుఖితుడై రోమాంచాన్ని అభినయించటానికి సాహాయ్యపడేది 'సత్త్వం' అని సారాంశం ('నటుడు' అన్నప్పుడు 'నటి' , 'నర్తకి' అన్నప్పుడు 'నర్తకుడు' గ్రాహ్యాలు).

మరి, 'సత్త్వం' అంటే ఏమిటి? సత్త్వం అనేది సకలమానవ సామాన్యమైన మనఃస్థితి. సుఖ- దుఃఖాలకు మనస్సు స్పందిస్తుంది. అంటే తగిన కారణం ఉన్నప్పుడే మనస్సు స్పందిస్తుందన్నమాట. తగిన కారణం లేనప్పుడు 'సత్త్వం' విశ్రాంతస్థితిలో ఉంటుంది. ఈ స్థితినే 'అవ్యక్తరూపం' అన్నాడు భరతముని. తగిన కారణం ఉన్నా ఒక్కొక్కప్పుడు మనస్సు స్పందించకపోవచ్చు. అంటే అప్పుడు మనస్సు ఆ వ్యక్తి యొక్క అధీనంలో లేదన్నమాట. అప్పుడా వ్యక్తి యొక్క మనస్సు ఏదో ఇంకో విషయంలో లగ్నమై ఉంటుంది. దీనినే 'అన్యమనస్కత' అంటారు. అట్లాకాక, మనస్సు స్వవశమందు ఉండగా, తగిన కారణం ఉన్నప్పుడు, ఆ కారణానికి ఆ వ్యక్తి తప్పక స్పందిస్తాడు. అంటే అప్పుడు అతని మనస్సు సమాధియందు లేదా ఏకాగ్రతతో ఉన్నదన్నమాట! ఆ సమయంలో అంతవరకు అవ్యక్తంగా ఉన్న సత్త్వం, రోమాంచ- అస్రాదిరూపంగా అభివ్యక్తమవుతుంది. నాట్యం లోకస్వభావానుకరణం కాబట్టి, నాట్యంలో కూడా 'సత్త్వం' అవశ్యకం. సత్త్వప్రధానమైన అభినయాన్ని 'సాత్త్వికాభినయం' అన్నారు.

ఈ సాత్త్వికాభినయం ప్రధానమైనప్పుడు అది ఉత్తమ నాట్యం అవుతుంది.

నాట్యంలో నాలుగు అంగాలు ఉన్నాయి- 1. నాయకుడు లేదా ఇతివృత్తం, 2. కవి, 3. నటుడు, 4. ప్రేక్షకుడు. సత్త్వబలం చేత రామాదినాయకులు నిజంగా ఎటువంటి అనుభూతులను పొందినారో మనకు తెలియదు. కానీ, సత్త్వబలంతో కవి వర్ణించిన లేదా చిత్రించిన దానిని బట్టి, వారి అనుభూతులను సత్త్వబలంతోనే మనం గుర్తించగలుగుతాము. అయితే, ఈ వర్ణించటం లేదా చిత్రించటం కవికి ఎట్లా సాధ్యమవుతుంది? లోకంలో తాము పొందిన రాగద్వేషాలను యథాతథంగా మాటలలో చెప్పటానికి చాలామంది సమర్థులు కారు. అట్లా చెప్పగలిగిన వారిలో చాలా కొద్దిమంది మాత్రమే అక్షరరూపంలో చిత్రించగలుగుతారు. అట్లా చిత్రించిన చిత్రాలలో కొన్ని మాత్రమే మన హృదయాలను ఆకర్షించగలుగుతాయి. ఇట్లా హృదయాకర్షకంగా వర్ణించగల సమర్థులు చాలా అరుదుగా ఉంటారు. ఈ సమర్థత, పూర్వజన్మ సంస్కారబలం చేతనో, ఈ జన్మలోని విశిష్టపరిస్థితుల ప్రభావం చేతనో వారికి లభిస్తుంది. ఈ సమర్థతనే కావ్యపరిభాషలో 'ప్రతిభ' అంటారు. ఈ ప్రతిభ రాణించవలెనంటే, దానికి 'వ్యుత్పత్తి' (= లోక-శాస్త్ర పరిశీలన వల్ల కలిగే జ్ఞానం), నిరంతరాభ్యాసం తోడుపడాలి. ప్రతిభా-వ్యుత్పత్తి-అభ్యాసదక్షుడైన వ్యక్తి, లోకంలో సహజంగా అందరూ అనుభవిస్తున్న సుఖ-దుఃఖాలను లేదా రాగద్వేషాలను విశిష్టదృష్టితో పరిశీలించి, మననం చేసి, స్వయంగా తాను అనుభూతి చెంది, రామాదులకు ఆపాదించి కావ్యంలో వర్ణిస్తాడు లేదా రూపకంలో చిత్రిస్తాడు. ఇట్లా వర్ణనానిపుణుడైన వ్యక్తినే 'కవి' అంటారు. అభినయం చేసే నటీనటులకు, నర్తకీనర్తకులకు కూడా ఈ ప్రతిభా-వ్యుత్పత్తి-అభ్యాసాలు అవశ్యకాలే.

ఇంక కవిచేత చిత్రింపబడిన సుఖ-దుఃఖాలను దక్షులైన నటులు, సత్త్వబలంతో, చతుర్విధాభినయాల ద్వారా రంగస్థలం మీద వ్యక్తం చేసినప్పుడు, దృశ్యమూ శ్రవ్యమూ అయిన నాట్యాన్ని తిలకిస్తున్న సహృదయ ప్రేక్షకులు, సత్త్వబలం వల్ల, తన్మయులై, ఆనందానుభూతిని పొందుతుంటారు. ఇట్లా కవిగతములైన (= కవిభావన చేసిన) సుఖ-దుఃఖాలు కావ్యగతములవుతున్నాయి; కావ్యగతములైనవాటిని దక్షులైన నటులు స్వాయత్తం చేసుకొని, రంగస్థలం మీద వ్యక్తం చేస్తున్నారు. అట్లా నటులు వ్యక్తం చేసిన భావాదులను సహృదయులైన ప్రేక్షకులు స్వాంతం చేసుకొని, తదనుభూతి పొందుతున్నారు. ఈ విధంగా కవి,

నటుడు లేదా నర్తకి, ప్రేక్షకుడు సమానమైన అనుభవం కలవారు అవుతున్నారు. ఇట్లా ముగ్గురూ సమానమైన అనుభవం పొందటానికి మూలహేతువు అందరకు సహజమైన సత్త్వమే!

"పరగత దుఃఖ-హర్షాది భావనాయా మత్యంతానుకూలాంతఃకరణత్వం సత్త్వం" అని ధనంజయాదుల సత్త్వనిర్వచనం. పరుల (=రూపకాలలోని రామాది ప్రకృతుల) దుఃఖాన్ని లేదా హర్షాన్ని తనవిగా భావించటానికి మిక్కిలిగా అనుకూలమైన అంతఃకరణత్వాన్ని 'సత్త్వం' అంటారు అని దీని అర్థం. ఇటువంటి అంతఃకరణత్వం కవి నట ప్రేక్షకులు ముమ్వురకు సమానంగా ఉన్నప్పుడే ఆ ప్రయోగం సిద్ధిని పొందుతుంది. కాగా సత్త్వబలం వల్ల వ్యక్తి తన కష్టసుఖాలకు తాను స్పందించటమే కాక, పరుల కష్టసుఖాలకు కూడా స్పందిస్తాడు. అంటే 'సత్త్వం' రెండు విధాల అభివ్యక్తమవుతుందన్నమాట. ఇందులో రెండవవిధమే నటీనటులకు లేదా నర్తకీ నర్తకులకు 'అభినయం' లో సహాయకారి అవుతుంది.

## 2. అభినయం :

'అభినయం' అనేది కవి-నట-ప్రేక్షకులలో నటునకు లేదా నర్తకికి మాత్రమే సంబంధించింది. 'అభినయం' అనే పదంలోని 'అభి' అనే ఉపసర్గకు 'అభిముఖంగా' అనీ, 'నీ' (=ణీఞ్=నీ=నయ) అనే ధాతువునకు 'పొందించటం' లేదా 'తీసుకొని రావటం' అనీ అర్థాలు. అంటే నటుడు లేదా నర్తకి సత్త్వసాహాయ్యంతో రూపకం లేదా పదాదుల అర్థాలను సామాజికుల హృదయాలకు అందజేయటం లేదా హత్తుకొనేటట్లు చేయటం అని అభినయ పదానికి అర్థం.

వాచిక-ఆంగిక-సాత్త్విక-ఆహార్యభేదాలచేత అభినయం చతుర్విధమని విజ్ఞులకు తెలిసినదే. ప్రదర్శన సమయంలో నటుడు లేదా నర్తకి ఈ అభినయాల సాహాయ్యంతో నాట్యం లేదా నృత్యంలోని అర్థాలను సామాజికుల హృదయాలకు హత్తుకొనేటట్లు చేయటం జరుగుతుంది. నటుడు లేదా నర్తకి రంగస్థలం మీద పర్యటనీవ వ్యాపారాన్ని ప్రదర్శించవలసి ఉంటుంది. మానవ వ్యాపారమంతా మనో-వాక్-కాయభేదాల చేత మూడు విధాలని విజ్ఞులెరుగుదురు (ఈ మూడింటిని త్రికరణములంటారు). ఈ మూడు వ్యాపారాలు నృత్య-నాట్యాలలో సాత్త్విక-వాచిక-ఆంగిక అభినయాలుగా రూపొందాయి. ఇవే త్రివిధాభినయాలు

(నాలుగవది అయిన ఆహార్యం ఈ మూడింటిలో అంతర్గతంగా ఉంటుంది).

ఆంగిక-వాచిక-సాత్త్వికాలు మూడు అభ్యాసప్రారంభంనుంచీ అవశ్యకాలే! ఆహార్యం యొక్క అవశ్యకం ప్రదర్శన సమయంలోనే కావున అభినయం చతుర్విధమైనప్పటికీ సాధారణంగా మొదటి మూడింటిని కలిపి 'త్రివిధాభినయాలు' అనటం పరిపాటి. అయితే ప్రదర్శన సమయంలో మాత్రం ప్రేక్షకుని తొలుత ఆకర్షించేది ఆహార్యమే. ఈ మూడు అభినయాలలోనూ 'సాత్త్వికాభినయం' ప్రధానమైనది. అంటే, లోకంలో మనస్సు ప్రధానమైనట్లే నృత్య నాట్యాలలో సాత్త్వికం ప్రధానం!

నాట్యశాస్త్రంలో 12 వ అధ్యాయం చివర, ప్రక్షిప్తంగా తలంచబడే భాగంలో క్రింది శ్లోకం ఉంది :

"వయోఽనురూపః ప్రథమస్తు వేషః వేషానురూపేణ గతి ప్రచారః ।
గతిప్రచారానుగతం చ పాఠ్యం పాఠ్యానురూపోఽభినయశ్చ కార్యః" ॥

--ప్రప్రథమంగా వయస్సుకు తగినట్లుగా వేషం (=ఆహార్యం) ఉండాలి. పిమ్మట వేషానికి అనురూపంగా గతిప్రచారం (= ఆంగికం) సాగాలి. ఈ గతిప్రచారానికి అనుగుణంగా పాఠ్యం (= వాచికం) ఉండాలి. ఇంక ఈ పాఠ్యానికి తగినట్లుగా అభినయం (= సాత్త్వికం) ఉండాలి. ఈ శ్లోకం భరత మునికృతం అయినా కాకపోయినా ఇందులో ఒక క్రమం అవిష్కృతమైంది. నిజానికి రంగస్థలం మీద తెరతొలగగానే ప్రేక్షకులను ఆకర్షించేది నటులవేషం (= ఆహార్యం). అసలు నటుల వేషం ద్వారానే ప్రేక్షకులు రామాదులను గుర్తించటం జరుగుతుంది. తరువాత ప్రేక్షకుల దృష్టికి వచ్చేవి నటుల అంగ విన్యాసాలు (=ఆంగికం), మాటలు (=వాచికం). ఈ రెండింటిలో మాటలు ముందు కావచ్చు లేదా అంగవిన్యాసాలు ముందు కావచ్చు లేదా రెండు సమ కాలికం కావచ్చు. అటు పిమ్మట ప్రేక్షకులను ఆకర్షించి, వారిని తన్మయులను చేసేది సత్త్వబలంతో నటులు చేసే భావప్రదర్శనా నైపుణ్యం (= సాత్త్వికం). ఈ క్రమంలో కూడా సాత్త్వికాభినయ ప్రాధాన్యం స్పష్టమవుతున్నది.

సాత్త్వికాభినయ ప్రాధాన్యాన్ని అభినయదర్పణకర్త అయిన నందికేశ్వరుడు నృత్యపరంగా కూడా విశదీకరించినాడు.

యతః హస్త స్తతః దృష్టి ర్యతః దృష్టి స్తతః మనః ।
యతః మన స్తతః భావ ర్యతః భావ స్తతః రసః ॥

—(నర్తకి యొక్క) హస్తం ఏమి సూచిస్తున్నదో, ఆ సూచనకు అనుగుణంగా దృష్టి ప్రసరించాలి. దృష్టి ఎట్లా ప్రసరించిందో, దానికి అనుగుణంగా అక్కడ మనస్సు లగ్నం కావాలి. మనస్సు దేనిమీద లగ్నమైనదో తదనుగుణంగా భావం వ్యక్తం కావాలి. భావం ఎప్పుడు చక్కగా వ్యక్తమైనదో, అప్పుట రసం తప్పక నిష్పన్నమవుతుంది.

ఈ శ్లోకంలో హస్తం అంగికాభినయానికి, మనస్సు సాత్త్వికాభినయానికి ప్రతీకలు. అంగిక-సాత్త్వికాభినయాలకు మధ్యవారధి దృష్టి. ఈ మూడింటి సమ్మేళనం వల్ల భావవ్యక్తీకరణ జరుగుతుంది. భావం చక్కగా వ్యక్తమైనప్పుడు రసనిష్పత్తి జరిగి తీరుతుంది. ఇందులో వాచికాభినయ ప్రస్తావనలేదు; అంటే వాచిక సాహాయ్యం లేకుండానే భావప్రకటన జరిగే అవకాశం ఉన్నదన్నమాట!

ఆంధ్రదేశంలో 'అభినయం' అనే పదానికి నృత్యపరంగా సాత్త్వికాభినయం అనే అర్థం రూఢమైంది. "ఈ పదానికి అభినయం చెయ్యి" అనే ప్రయోగంలో-యతః హస్తః . . . అనే శ్లోకార్థం అంతర్గతమై ఉంది. పూర్వం, సుశిక్షితలైన నర్తకీమణులు కూర్చుండి, ప్రతి-పద-అర్థ-అభినయం పెక్కు విధాల చేసి, ప్రేక్షకులకు రసానుభూతి కలిగించేవారు.

నటీనటులు కానీ, నర్తకీ నర్తకులు కానీ, నిజజీవితంలో తమకు వచ్చిన కష్టసుఖాలకు అనుగుణంగా ప్రవర్తించటం అభినయం కాజాలదు. కాని, రంగ స్థలంమీద ఉన్నప్పుడు, తాము ఏయే ప్రకృతులను అనుకరిస్తున్నారో వారికి అనుగుణంగా సంచరించటం, మాటాడటం, భావవ్యక్తీకరణ చేయటం— ఇదే అభినయం అవుతుంది. అంటే తనకు సహజంకాని, వేరే వ్యక్తికి చెందిన అంగిక-వాచిక-మానసిక వ్యాపారాలను తనమీద ఆరోపించుకొని తదనుగుణంగా ఆహార్యం చేకూర్చుకొని, ఆయావ్యక్తుల వలెనే ప్రవర్తించటం అభినయమవుతుంది.

కవి, నటుడు లేదా నర్తకి, ప్రేక్షకుడు సమానమైన అనుభూతి కలిగి ఉంటారని గుర్తించినాము. అయితే నటుడు లేదా నర్తకి రంగస్థలం మీద ఉన్నప్పుడు నిజంగా ఆ అనుభూతిని పొందుతారా? అనే ప్రశ్న ఉదయిస్తుంది. నటుడు, నర్తకి కూడా సత్త్వబలసంపన్నులే (లేదా వారు కళాకారులే కారు).

కావున వారికి కూడా రసానుభూతి తప్పక ఉంటుంది. కాని, ఆ రసానుభూతి మాత్రం రంగస్థలం మీద ఉన్నప్పుడు కలుగరాదు. నటీనటులు, నర్తకీనర్తకులు ప్రేక్షకుల అనుభూతికి లేదా రసాస్వాదనకు ఉపాయములు లేదా సాధనములు మాత్రమే; కావుననే వారు పాత్రము, పాత్రి అనబడినారు. మద్యాది, మధురాది రసాలను ఆస్వాదించటానికి పాత్రము తోడ్పడుతుందే కాని, దానికి తదనుభూతి ఉండదు; పాత్రము కేవలం ఆస్వాదన సాధనం మాత్రమే. అట్లాగే నటుడు, నర్తకి సహృదయ ప్రేక్షకుల రసాస్వాదనమునకు సాధనములు మాత్రమే. కావున రంగస్థలం మీద నటుడు, నర్తకి ఆయా అనుభూతులను నిజంగా అనుభవిస్తున్నట్లు కన్పట్టవలెనే కాని, నిజంగా అనుభవించరాదు.

అయితే ఇది ఎట్లా సాధ్యం? అంతేకాదు. కవి, తనకు బుద్ధి పుట్టినప్పుడే రచనకు పూనుకొంటాడు. అట్లాగే ప్రేక్షకుడు తనకు తీరుబాటు ఉన్నప్పుడే ప్రదర్శన తిలకిస్తాడు. నటుడు, నర్తకి విషయం అట్లాకాదే! ప్రకటించిన రోజున, ప్రకటించిన సమయానికి, తాము నిజజీవితంలో ఎటువంటి పరిస్థితులలో ఉన్నా, నాట్యశాలకు వచ్చి, ప్రదర్శనలో పాల్గొని తీరవలసినదే, చక్కగా అభినయం చేయవలసినదే. ఇది కూడా ఎట్లా సాధ్యం? ఇందుకు సమాధానం 'నిరంతరాభ్యాసం వల్ల' అనేది. నిరంతరాభ్యాసం వల్ల తాము నిరూపించవలసిన కష్ట-సుఖాలను అనాయాసంగా అప్రయత్నంగా, తాము నిజంగా అనుభవిస్తున్నట్లే నిరూపించగలుగుతారు! ఇందుకు ప్రతిభ, వ్యుత్పత్తి వారికి తోడ్పడతాయి.

## 3. రసానుభూతి :

అయితే నటుని లేదా నర్తకి యొక్క అభినయం ప్రేక్షకునిలో రసాను భూతి ఎట్లా కలుగజేస్తుంది? అనే ప్రశ్న మిగిలి ఉంది. భరతముని ప్రభృతి శాస్త్రకర్తలు రసానుభూతి ప్రేక్షకునిలో కలిగించటమే అభినయ పరమార్థమని స్పష్టం చేశారు. ప్రేక్షకునిలో రసానుభూతి కలిగే విధానాన్ని "విభావ-అనుభావ-వ్యభిచారి సంయోగాత్ రసనిష్పత్తిః" అనే ప్రసిద్ధ రససూత్రంలో భరతముని వ్యక్తం చేసినాడు. ఈ విధానాన్ని 'రసమీమాంస' అనే ప్రకరణంలో వివరిస్తాను. ప్రస్తుతం సారభూతంగా చెప్పుకొంటున్నాను.

సుఖ-దుఃఖాల అనుభూతులు తర-తమ భేదాలతో లోకంలోని ప్రతి వ్యక్తి లోనూ ఉంటాయి. కాని అవి సాధారణంగా నిద్రావస్థలో ఉంటాయి.

అవి కొందరిలో ఎల్లప్పుడూ నిద్రావస్థలోనే ఉంటాయి; మరికొందరిలో ఏదేని స్వల్పకారణం ఉన్నప్పటికీ సుఖమో, దుఃఖమో అతితీవ్రంగా వ్యక్తమవుతుంది. ఇంక తక్కినవారిలో, తగినంత హేతువు ఉన్నప్పుడు నిద్రాణస్థితినుంచి మేల్కొని తత్తదుచితంగా వ్యక్తమవుతూ ఉంటాయి. ఈ చివరి తరగతి వారే సంస్కారవంతులు. వీరిని 'సుమనస్కులు' అని భరతముని, 'సహృదయులు' అని తరువాతివారు పేర్కొన్నారు. ఇట్టివారే ఉత్తమప్రేక్షకులు. సుఖ-దుఃఖాల ఫలములైన రాగ-ద్వేషాలు నిద్రావస్థలో ఉన్న స్థితి, నిర్వికారచిత్త స్థితి; అంటే అన్యమనస్కం కాని స్థితి. ఇటువంటి స్థితిలో ప్రేక్షకుడు ప్రేక్షకాగారంలో ప్రవేశిస్తాడు. ఎదురుగా రంగస్థలంమీద నట-నర్తకులు రామాదుల రూపంలో దర్శనమిస్తారు. వారి అభినయనైపుణ్యం వల్ల, వారు నిజంగా రామాదులనే భ్రమ ప్రేక్షకునకు కలుగుతుంది. అటువంటి రామాదులు వ్యక్తం చేసే భావాలు ప్రేక్షకునిలో నిద్రాణమై ఉన్న అనుభూతులను మేల్కొల్పుతాయి. అట్లా ప్రేక్షకునిలో కలిగే ప్రథమ వికారం లేదా చిత్తవృత్తి విశేషం, కావ్యపరిభాషలో 'భావం' అనబడుతుంది. ఈ 'భావం' కలగడానికి హేతువైన దానిని కావ్యపరిభాషలో 'విభావం' అంటారు. కాగా విభావం కారణం, భావం కార్యం అవుతున్నాయి. శుష్కమైన కాష్ఠంలో అగ్నిసులువుగా వ్యాపించినట్లు నిర్వికారచిత్తంలో ఈ భావం సులువుగా వ్యాపిస్తుంది. విభావం (వ్యక్తి లేదా వస్తువు లేదా సన్నివేశం) కారణంగా, మనస్సులో మేల్కొన్న భావానికి అనుగుణంగా శరీరం మీద వ్యక్తమయ్యే కటాక్షాది చేష్టలను 'అనుభావములు' అంటారు (విభావ-అనుభావ పదాల చివర 'భావ' పదం ఉన్నప్పటికీ, ఇవి నిజానికి భావాలు మాత్రం కావు). ఈ అనుభావాలు రెండు విధాలు-- వ్యక్తిచే ప్రయత్నపూర్వకంగా వ్యక్తం చేసే కటాక్షాది చేష్టలు కేవలానుభావాలు. ఇంక వ్యక్తి ప్రయత్నం లేకుండా మనస్సులోని భావతీవ్రత వల్ల శరీరం మీద వ్యక్తమయ్యే స్వేదాదులు సాత్త్వికభావాలు (వీటిని సాత్త్విక భావప్రకరణంలో వివరిస్తాను). మనస్సులో ఉదయించిన భావం చంచలమైతే, దానిని 'సంచారి లేదా వ్యభిచారి భావం' అంటారు (ఈ సంచారిభావాలు ఉదయించి నశించేవి కాబట్టి వీటిని సముద్రపు అలలతో పోలుస్తారు). అట్లాకాక, మేల్కొన్న భావం [illegible] ప్రముఖంగా నిలిస్తే, దానిని 'స్థాయిభావం' అంటారు. ఈ స్థాయిభావమే రసానుభూతికి దారి సుగమం చేస్తుంది (ఇందుకు తోడ్పడేది

సాత్త్వికాభినయం). ఈ రసానుభూతి క్రమం మాత్రం ప్రేక్షకునకు తెలియదు; అంతేకాదు రసానుభూతి ఎక్కువకాలం ఉండదు. అందుచేతనే "రసాత్మకమైన ఒక్కవాక్యం కూడా కావ్యం అవుతుంది" అన్నాడు విశ్వనాథకవిరాజు.

## 4. గ్రంథప్రమేయం :

పై వివరణలో విభావ-అనుభావ- వ్యభిచారి భావాల స్థూల స్వరూపం విశదం చేయబడింది. విభావం సాధారణంగా వ్యక్తిపరమైనది. పురుషు నకు స్త్రీ విభావం, స్త్రీకి పురుషుడు విభావం; కావ్య-నాటకాలలో వీరు నాయికా-నాయకులవుతారు. కావున విభావస్వరూపం విశదం చేసిన తరు వాత పురుషులలోని భేదాలను నాయక ప్రకరణంలోనూ, స్త్రీలలోని భేదాలను నాయికా ప్రకరణంలోనూ వివరించాను. ఇంక అనుభావ ప్రకరణంలో కేవ లానుభావాలను వివరించాను. తరువాత స్థాయిభావాలను, సాత్త్వికభావాలను, వ్యభిచారిభావాలను వివరించాను. ఇదంతా రససామగ్రి.

విభావ-అనుభావ-వ్యభిచారి భావాల సంయోగం వల్ల ఉత్పన్నములయ్యే రసాలను 'రసాలు' అనే ప్రకరణంలోనూ, రసానుభూతిని రసవిశేషాలను 'రస మీమాంస' అనే చివరి ప్రకరణంలోనూ సమీకరించాను.

రససామగ్రి, రసానుభూతి అనే ప్రధానాంశాల ద్వారా సాత్త్వికాభినయం వివరింపబడినదన్నమాట.

అయితే, భరతముని 'భావాలు' అనే 7వ అధ్యాయంలో సాత్త్వికభావా లను, 'సామాన్యాభినయం' అనే 22 వ అధ్యాయంలో సత్త్వజాలంకారలను వివరించినాడే తప్ప 'నాట్యం సత్త్వే ప్రతిష్ఠితం' అని చెప్పి కూడా 'సాత్త్వి కాభినయం' పేర ప్రత్యేకంగా ఏమీ వివరించలేదు. మరి సామాన్యాభినయం అంటే ఏమిటి? "సామాన్యాభినయో నామ జ్ఞేయః వాగంగసత్త్వజః" అని 22 వ అధ్యాయ ప్రారంభంలోనే భరతముని పేర్కొన్నాడు. అంటే వాక్ (=వాచిక)-అంగ (=ఆంగిక)-సత్త్వ (=సాత్త్విక) అభినయాల సమీకృత స్వరూ పమే సామాన్యాభినయం అని స్పష్టమవుతున్నది. వెంటనే, ఆ శ్లోకం నాలుగవ పాదంలో "నాట్యం సత్త్వేప్రతిష్ఠితం" అని చెప్పటాన్ని బట్టే భరతముని సత్త్వ (=సాత్త్విక) అభినయానికే ప్రాధాన్యం ఇచ్చినట్లు స్పష్టమవుతున్నది. 22 వ

అధ్యాయంలోని సామాన్యాభినయం ప్రత్యేకమైన అభినయం కానట్లే, తరువాతి అధ్యాయంలోని చిత్రాభినయం కూడా ప్రత్యేకమైన అభినయం కాదు. వాచిక-ఆంగిక-సాత్త్వికాభినయములకు సంబంధించి, ఆయా అధ్యాయాలలో వివరింపబడని విశేషాంశాలు సామాన్యాభినయంలో వివరింపబడినట్లే, చిత్రాభినయంలో ప్రధానంగా ఆంగికాభినయవిశేషాలు వివరింపబడినవి.

నతత్ జ్ఞానం నతచ్ఛిల్పం
నసావిద్యా నసాకలా ।
నాసౌ యోగో నతత్కర్మ
నాట్యేఽస్మిన్ యన్నదృశ్యతే ॥
-నా.శా.I-116

అపారే కావ్యసంసారే కవిరేకః ప్రజాపతిః ।
యథాస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే ॥
శృంగారీచేత్ కవిః కావ్యే జాతం రసమయం జగత్ ।
స ఏవ వీతరాగశ్చేత్ నీరసం సర్వమేవతత్ ।
భావానచేతనానపి చేతనవచ్చేతనానచేతనవత్ ।
వ్యవహారయతి యథేష్టం సుకవిః కావ్యే స్వతంత్రతయా

-ధ్వన్యాలోకం-III-42 శ్లో. తరువాత

# విభావం

## 1. విభావం :

మూలం : అథ విభావ ఇతి కస్మాత్. ఉచ్యతే—విభావో విజ్ఞానార్థః.
విభావం, కారణం, నిమిత్తం, హేతుః-ఇతి పర్యాయాః.
విభావ్యంతేఽ నేన వాగంగసత్త్వాభినయా ఇత్యతో విభావః.
యథా విభావితం విజ్ఞాతం ఇత్యనర్థాంతరమ్.
అత్రశ్లోకః-
బహవోఽర్థా విభావ్యంతే వాగంగాభినయాశ్రయాః ।
అనేన యస్మాత్తే నాయం విభావ ఇతి సంజ్ఞితః ॥ 4

-(నా.శా.VII)

అర్థం : ఋషుల ప్రశ్న : (అథ) విభావః ఇతి కస్మాత్? = 'విభావం' అనే పదం ఎందుచేత (ప్రయుక్తమైనది)?

భరతముని సమాధానం : ఉచ్యతే=చెప్పబడుతున్నది; విభావః, విజ్ఞాన-అర్థః = 'విజ్ఞానం' అనే అర్థం కలది (= విశిష్ట జ్ఞానమునకు హేతువు అయినది) 'విభావం' అనబడుతుంది. విభావం, కారణం, నిమిత్తం, హేతుః-ఇతి, పర్యాయాః = విభావం, నిమిత్తం, కారణం, హేతువు-అని (=ఇవి) పర్యాయ పదాలు; అనేన, వాక్-అంగ-సత్త్వ-అభినయాః = దీనిచేత, వాచిక-ఆంగిక-సాత్త్విక అభినయాలు; విభావ్యంతే ఇతి, అతః, విభావః = విభావ్యములు (=విశిష్టంగా తెలిసికొనబడునవి), అని, అందుచేత, 'విభావం' (అనబడింది); (యథా) విభావితం, విజ్ఞాతం, ఇతి, అనర్థాంతరమ్ = విభావితం (= విశిష్టంగా భావింపబడినది), విజ్ఞాతం (= విశిష్టంగా తెలిసికొనబడినది), అని (ఈ పదాలు రెండూ) అర్థభేదం లేనివి (= ఏకార్థకములు).

అత్రశ్లోకః =ఇచ్చట (= ఈ విషయంలో) ఒక శ్లోకం (ఉన్నది): వాక్-అంగ-అభినయ-ఆశ్రయాః, బహవః, అర్థాః, అనేన, యస్మాత్, విభావ్యంతే = వాచిక-ఆంగిక- సాత్త్విక అభినయాలకు ఆశ్రయములైన, అనేకములయిన, అర్థాలు, దీనిచేత, ఎందువల్ల, విభావితములు అవుతున్నవో; తేన, అయం, విభావః, ఇతి, సంజ్ఞితః = అందుచేత, ఇది, 'విభావం', అనే పేరుకలది అయినది.

తాత్పర్యం : విశిష్టజ్ఞానం కలగటానికి హేతువయినది 'విభావం' అనబడుతుంది. విభావం, నిమిత్తం, కారణం, హేతువు- ఇవి పర్యాయపదాలు. వాచిక-ఆంగిక-సాత్త్వికాభినయాలకు ఆశ్రయభూతములయిన అనేకార్థములు దీనివల్ల విభావితములు (= విశిష్టంగా భావించబడినవి) అవుతాయి కాబట్టి ఇది 'విభావం' అనబడింది. విభావితం, విజ్ఞాతం - ఇవి ఒకే అర్థాన్ని బోధిస్తాయి.

టీక : 'విభావ్యంతే' అనటానికి బదులు 'నితరాం భావ్యంతే' (=గాఢంగా భావింపబడును) అని భరతరసప్రకరణం (4).

"లోకమందలి రత్యాదులకు ఉద్బోధకము లేవో, అవే కావ్యనాట్యములందు విభావములు" అని సాహిత్యదర్పణం (III-32).

"విశేషేణ భావయంతి-ఉత్పాదయంతి యే రసాం
తే విభావాః" అని రసతరంగిణి (II).
(= రసాలను ఉత్పాదింపజేసేవి).

"విభావం రసజ్ఞాపన కారణం" (= రసం ఉన్నదని తెలియజేస్తూ రసమునకు కారణమైనది విభావం) అని రసార్ణవసుధాకరం (I-59).

లోకంలో రతి మున్నగు భావాలు కలగటానికి ఏవి ఉద్బోధకాలో (= హేతువులో = నిమిత్తములో) అవి, కావ్య-నృత్య-నాట్యములందు 'విభావములు' అనబడతాయి. అంటే చిత్తవృత్తుల ఉద్భవానికి హేతువు అయిన విషయం-వ్యక్తి లేదా సన్నివేశం లేదా వస్తువు 'విభావం' అనబడుతుంది. కానా, కావ్య-నృత్య-నాట్యములందలి రామాది నాయకులు, సీతాది నాయికలు, రావణాది ప్రతినాయకులు (అట్లాగే సన్నివేశాలు, వస్తువులు కూడా) 'విభావ' పదంచేత గ్రహింపబడతారు.

అర్థం లేదా భావం వ్యక్తం కావటానికి అనేక హేతువులు ఉండవచ్చు- హర్షాదులవల్ల అశ్రువు జనిస్తుంది; ఘర్మ-ధూమ-రోగాదుల వల్ల కూడా

బాష్పములు జనిస్తాయి. ఆ బాష్పాదుల వల్ల ఏమి ప్రతీయమానం (= వ్యక్తం) అవుతున్నదో విభావమునుబట్టి మాత్రమే వెంటనే నిశ్చయింపగలము (నా.శా. 7 వ అధ్యాయంలో అభినవగుప్తుని 'విభావ' వ్యాఖ్య ఇది. దీని తరువాతనుంచి 9 వ అధ్యాయం పర్యంతం అభినవభారతీ వ్యాఖ్య లభించలేదు.)

## 2. ఆలంబన విభావం :

ఆలంబన-ఉద్దీపన భేదాలచేత విభావం రెండు విధాలని అర్వాచీనాలంకారికులు పేర్కొన్నారు- "ఆలంబనోద్దీపనత్వ ప్రభేదేన స (=విభావం) చ ద్వివిధా" (ద.రూ.IV-2). నాట్యశాస్త్రంలో ఇట్టి విభజన ప్రత్యేకంగా లేదు. అంతే కాదు, ఈ విభజన కాల్పనికమన్నాడు అభినవగుప్తుడు. కానీ, ఇంచుమించుగా అర్వాచీనాలంకారికులందరూ ఈ విభజనను అంగీకరించటం చేత, ఇది నేటికీ ప్రచారంలో ఉన్నది.

శృంగారరసంలో నాయికా-నాయకులు ఆలంబన విభావములు. నాయకపర మైన 'రతి' లో నాయకుడు ఆధారం, నాయిక విషయం. ఇంక నాయికాపరమైన రతిలో నాయిక ఆధారం, నాయకుడు విషయం (ర.సు. I.60).

విభావాలలో ఆలంబన విభావాలు 'అంతరంగములు', ఉద్దీపన విభావాలు 'బహిరంగములు'. ఆలంబన విభావంయొక్క ఆధారం వల్లనే రసప్రసరం ఉంటుంది. ఆలంబనవిభావం వల్ల ఉద్బుద్ధములయిన రత్యాదిభావాలను, ఉద్దీపనవిభావం ఉద్దీప్తం (=దీప్తిమంతం) చేస్తుంది (భా.ప్ర.I.57).

ఆలంబనమనగా 'నాయకాదులు'. నాయకాదులను అవలంబించి రసోత్పత్తి జరుగుతుంది కాబట్టి, నాయకాదులు 'ఆలంబనం' అనబడినారు. ఆది శబ్దం చేత నాయికా, ప్రతినాయకాదులు గ్రాహ్యం (సా.ద III.62-62 మా).

నాట్యశాస్త్రంలో ఆయా భావ-రసాలకు విభావాలను, అనుభావాలను విపులంగా వర్ణించినాడు భరతముని (6, 7 అధ్యాయాలలో). వాటిని ఆయా రసాలను విశదీకరించేటప్పుడు పరిశీలించవచ్చు. భరతముని భావవివేచనం సర్వరస సాధారణంగా చేసినప్పటికీ, అర్వాచీనాలంకారికులు, వాటిని శృంగారప్రధానంగానే వివరిస్తూవచ్చినారు. శారదాతనయుని వివరణ, ముఖ్యంగా భరతమతానుసారి. అంతేకాదు. ఆయా రసాలకు ఆశ్రయపీఠాలైన విభావాలకు 'లలితం' మొదలగు సంజ్ఞలున్నవని చెప్పి, వాటిని విపులంగా విశదీకరించినాడు శారదాతనయుడు (భావప్రకాశనము - I.36-56).

1. శృంగార విభావాలు – లలితములు.
2. హాస్య విభావాలు – లలితాభాసములు.
3. వీర విభావాలు – స్థిరములు.
4. అద్భుత విభావాలు – చిత్రములు.
5. రౌద్ర విభావాలు – ఖరములు.
6. కరుణ విభావాలు – రూక్షములు.
7. భయానక విభావాలు – వికృతములు.
8. బీభత్స విభావాలు – నిందితములు.

ఒక భావంలో లేదా భావద్వయంలో లేదా భావత్రయంలో ముందు నిరూపితములు కానున్న విభావాలు సంసృష్టములు అయితే, అవి రసోత్పత్తి విషయంలో సంగతములై 'ఉద్దీపన విభావాలు' అవుతాయి (39-40 శ్లో).

**1. లలిత విభావాలు :** ఇవి శృంగారమున ఉత్పత్తి హేతువులు. రూప-యౌవన శాలినులు .. తన్వంగీ-తరుణాదులు శృంగారమందు ఆలంబన విభావాలు. ఈ ఆలంబనములు మధురములు, సుకుమారములు; ఇంద్రియములకు గోచరించిన మాత్రముననే, ఆ ఇంద్రియముల ద్వారా, ఈ ఆలంబనములు మనస్సునకు ఆహ్లాదం కలిగిస్తాయి.

**2. లలితాభాస విభావాలు :** ఇవి హాస్యరసమును ప్రకాశింపచేస్తాయి. సాధారణంగా, కుహకం (వంచన, మోసం) మున్నగునవి హాస్యమందు ఆలంబన విభావాలు. అంగవిహీనములు, వికృతాకారాలు, పరచేష్టానుకరణములు ఇందులో ఉంటాయి. ఈ విభావాలు వినబడినా, కనబడినా, స్మరింపబడినా కూడా హాసజనకములవుతాయి.

**3. స్థిరవిభావాలు :** ఇవి వీరరసపోషకాలు. త్యాగులు, సత్త్వసంపన్నులు, శూరులు, వీరులు, విక్రమోపేతులు, శస్త్రప్రక్షిప్తశోభితులు వీరరసమునందు ఆలంబనములు. ఈ విభావాలు వినబడినా, కనబడినా, స్మరింపబడినా కూడా స్థైర్యం కలిగిస్తాయి.

**4. చిత్రవిభావాలు :** ఇవి అద్భుతరససంపాద్యములు. విచిత్రాకృతి, విచిత్ర వేషం, విచిత్రాలంకారభూషణం, మాయా-లీలా-విలాసాలు- ఇవి, లేదా ఇవి కలవారు అద్భుతమందు ఆలంబన విభావాలు. ఇవి మనస్సునందు వైచిత్ర్యమును కలిగిస్తాయి.

**5. రూక్ష విభావాలు :** ఇవి కరుణరసోత్పత్తికారకాలు. మృతములు, విషణ్ణములు, మలినములు, రోగములు, దుఃఖములు-ఇవి లేదా ఇవి కలవారు

టీక : ఇంక, ఈ నాలుగు భేదాలు వరుసగా వివరింపబడుతున్నవి. రత్యాదులను రసోన్ముఖంగా ఉద్దీపింపజేసేవి 'ఉద్దీపనవిభావాలు' అనబడుతాయి.

శాస్త్రకారులు, ఉద్దీపనవిభావాన్ని, అధికంగాశృంగారపరంగానే వివరించినారు. శృంగారంలో పురుషునకు స్త్రీ ఆలంబనం, స్త్రీకి పురుషుడు ఆలంబనం. ఈ స్త్రీ పురుషులను కావ్య-నృత్య-నాట్యాలలో నాయికా- నాయకులనీ, యౌవనంలో ఉన్న వారిని ప్రేయసీ-ప్రియులనీ పేర్కొనటం శాస్త్రసంప్రదాయం.

*(1) గుణాలు (ఉద్దీపన విభావం : ఆలంబన గత గుణాలు) :*

మూలం : యౌవనం రూపలావణ్యే సౌందర్య మభిరూపతా ।।
మార్దవం సౌకుమార్యం చేత్యాలంబనగతా గుణాః ।
(ర.సు.I-162-63)

అర్థం : యౌవనం, రూప-లావణ్యే, సౌందర్యం, అభిరూపతా=యౌవనం, రూపం, లావణ్యం, సౌందర్యం, అభిరూపత; మార్దవం, సౌకుమార్యం (చ) ఇతి =మార్దవం, సౌకుమార్యం- అని (ఇవి), ఆలంబనగతా గుణాః = ఆలంబనగతములైన గుణాలు.

టీక : ఇచ్చట ఆలంబనగతములైన గుణాలు ఏడు చెప్పబడినవి. వీనిలో మరల అవాంతరభేదాలు కూడా ఉన్నాయి. భావప్రకాశనంలో 'ప్రసాదం' అనే ఎనిమిదవ గుణం కూడా చెప్పబడింది.

స్త్రీలోకానీ, పురుషునిలో కానీ ఆయాగుణాలు ఉన్నప్పుడే, వారు పరస్పరం ఆకర్షితులవుతారు.

*(i) యౌవనం :*

మూలం : సర్వాసామేవ నారీణాం యౌవనభేదాః స్మృతాస్తు చత్వారః ।
నైపథ్యరూపచేష్టాగుణైశ్చ శృంగారమాపాద్య ।। (నా.శా.XXII-42)

అర్థం : సర్వాసాం ఏవ, నారీణాం = సమస్త, నారీమణులందు; యౌవనభేదాః, చత్వారః, స్మృతాః (తు) = యౌవనభేదాలు, నాలుగు (అని), చెప్పబడినవి; శృంగారం ఆపాద్య=శృంగారమును, పొంది (=శృంగారరసమందు); నైపథ్య-రూప-చేష్టా-గుణైః = వేషం, రూపం, చేష్టలు, గుణాలు-వీటిచేత (ఈ భేదాలు వ్యక్తం అవుతాయి.)

**తాత్పర్యం :** స్త్రీలు అందరిలోను యౌవనభేదాలు నాలుగు.

శృంగారరసమందు ఇవి నైపథ్య-రూప-చేష్టా-గుణముల ద్వారా వ్యక్తమవుతాయి.

**టీక :** ఇంచుమించుగా అర్వాచీనాకాలంకారికులందరూ యౌవనభేదాలను నాట్యశాస్త్రానుసారంగానే వివరించారు. ప్రతియౌవనంలోనూ వేషం, రూపం, చేష్టలు, గుణాలు వేరువేరుగా ఉంటాయి. అంటే, వేషాదుల వల్ల, ఆయా యౌవనభేదాలను గుర్తించవచ్చు.

అభినవగుప్తుడు నాలుగు యౌవనములకు సంబంధించిన వయస్సులను క్రింది విధంగా పేర్కొన్నాడు (అ.భా. 3 వ సంపుట 240) :

20 సంవత్సరాలవరకు ప్రథమయౌవనం.
20-30 సంవత్సరాలమధ్య ద్వితీయయౌవనం.
30-40 సంవత్సరాల మధ్య తృతీయయౌవనం.
40-50 మధ్య చతుర్థయౌవనం.

మరికొందరి దృష్టిలో--

16 సంవత్సరాల వరకు ప్రథమయౌవనం.
16-25 సంవత్సరాల మధ్య ద్వితీయయౌవనం.
25-35 మధ్య తృతీయయౌవనం.
35-45 మధ్య చతుర్థయౌవనం.

*(i) (అ) ప్రథమయౌవనం :*

**మూలం : పీనోరుగండ జఘనాధరస్తనం కర్కశం రతిమనోజ్ఞమ్ ।**
**శృంగార రసముత్సాహం ప్రథమం తద్ యౌవనం జ్ఞేయం ॥**
**నాత్యర్థం క్లేశసహా సతువ్యతి సప్రాప్యతి స్త్రీధ్యా ।**
**సౌభాగ్యగుణైన్స్యవసక్తా నారీ నవయౌవనా జ్ఞేయా ॥**

-(నా.శా. XXIII-43, 48)

**అర్థం :** *పీన-ఊరు-గండ-జఘన-అధరః =పీనములయిన (=బలిసిన) ఊరువులు, గండాలు, జఘనాలు, అధరం; కర్కశం, రతిమనోజ్ఞం, స్తనం =కర్కశములు, రతిమనోజ్ఞములు, అయిన స్తనాలు (కలిగినదై); శృంగార రసముత్సాహం, తద్, యౌవనం, ప్రథమం, జ్ఞేయమ్=శృంగార రసముత్సాహం (అయిన) ఆ, యౌవనం, మొదటిది (అని), తెలుసుకొనదగినది; న-అత్యర్థం,*

యౌవనం; ద్వితీయే, యౌవనభేదే = ద్వితీయ యౌవనభేదమందు; (స్త్రీ) కించిత్, మానం, కరోతి = కొంచెంగా మానం చూపుతుంది; కించిత్, క్రోధం, మత్సరం (చ.ఏవ) =కొంచెంగా, క్రోధం, మాత్సర్యం (కూడా) చూపుతుంది; క్రోధే, తూష్ణీం, భవతి (చ) = క్రోధమునందు, తూష్ణీం భావం (= ఊరక ఉండటం) వహిస్తుంది.

తాత్పర్యం : అవయవ సంపూర్తితో కూడిన శరీరం, పీనములైన పయోధరాలు, నతమధ్యము కలిగి, కామసారభూతమైన వయస్సు ద్వితీయయౌవనం. ద్వితీయయౌవనమందున్న స్త్రీ, కొంచెంగా మాన-క్రోధ-మాత్సర్యాలను చూపుతుంది; క్రోధసమయంలో ఊరక ఉంటుంది.

టీక : ద్వితీయయౌవనం యొక్క లక్షణాలను, ద్వితీయయౌవనంలో ఉన్న స్త్రీ యొక్క చేష్టలను సింగభూపాలుడు విపులంగా వివరించినాడు (ర.సు. I-170-74) :

మూలం : స్తనౌ పీనౌ తనుర్మధ్యః పాణి-పాదస్యరక్తిమా ।
ఊరూ కరికరాకారౌ అంగం వ్యక్తాంగసంధికమ్ ॥
నితంబో విపులో, నాభి ర్గభీరా, జఘనం ఘనమ్ ।
వ్యక్తరోమావళీ, స్నిగ్ధ్య మంగకేశరదాక్షిణి ॥
ద్వితీయం యౌవనం తేన కలితా వామలోచనా ।
సఖీషు ప్రాశయజ్ఞా మస్నిగ్ధా ప్రాయేణ మానినీ ॥
న ప్రసీ దత్యనునయైః సపత్నీ ష్వీర్ష్యమాయినీ ।
నాపరాధాని విషహతే, ప్రణయేర్ష్యాకషాయితా ॥
[illegible] చేష్టతే గర్వితా సదా ।
[illegible]

తాత్పర్యం : బలిసిన స్తనాలు, సన్నని నడుము, ఎర్రని పాణిపాదాలు (= అరచేతులు [illegible]), [illegible] ఊరువులు, సువ్యక్తంగా [illegible] అవయవ సంధులు కల దేహం, విశాలనితంబాలు, లోతైన నాభి, ఘనమైన జఘనం, వ్యక్తంగా కనిపించే రోమరాజి (= నూగారు), సొమ్మవోవేత [illegible] అంగాలు, కేశాలు, దంతాలు, కనులు కలిగి ఉండటం ద్వితీయయౌవనం.

ద్వితీయయౌవనంలో ఉన్న వామలోచన (= అందమైన కనులు కలది)- [illegible] సఖులయందు [illegible] కలిగి ఉంటుంది, సాధారణంగా
[illegible]

ప్రసన్నురాలు కాదు. సపత్నులవల్ల అసూయ కలిగి ఉంటుంది. అపరాధాలను సహించదు. ప్రణయేర్ష్య (= ప్రణయ కోపం)తో ఎరువెక్కి ఉంటుంది. రతి కేళిలో సిగ్గుపడదు. రహస్యంగా (= పడకటింటిలో), సగర్వంగా, ప్రవర్తిస్తుంది.

ఉదా :

మూలం : తన్వీ శ్యామా, శిఖరిదశనా, పక్వబింబాధరోష్ఠీ
మధ్యే క్షామా, చకితహరిణీ ప్రేక్షణా, నిమ్న నాభిః ।
శ్రోణీభారా దలసగమనా, స్తోకనమ్రా స్తనాభ్యాం
యా తత్ర స్యా ద్యువతి విషయే సృష్టి రాద్యేవ ధాతుః ॥
-(మే.సం.II-21)

తాత్పర్యం : సుకుమారాంగి, యౌవనమధ్యస్థ అయిన ఆమె (=నా ప్రియురాలు) మొనలుతేరిన దంతాలు, దొండపండువంటి క్రింది పెదవి, సన్నని నడుము, బెదరుతున్న ఆడులేడి చూపులు వంటి చూపులు, లోతైన నాభి కలిగి ఉన్నది. పిరుదుల బరువుచేత మెల్లగా నడుస్తుంది. కుచభారం చేత కొంచెంగా వంగి ఉంటుంది. ఆమె, విధాత చేసిన తొలి సృష్టిలో తొలి సృష్టి (=ఉత్తమోత్తమం) అని తలుస్తాను (మేఘునితో యక్షుడు చెప్పిన మాటలు).

(i) (ఇ) తృతీయ యౌవనం :

మూలం : సర్వశ్రీ సంయుక్తం, రతికరణోత్పాదనం రతిగుణాఢ్యమ్ ।
కామాప్యాయిత శోభం, యౌవన మేతత్ తృతీయం తు ॥
రతి సంభోగే దక్షా ప్రతిపక్షాసూయినీ, రతిగుణాఢ్యా ।
అవివృతగర్విత చేష్టా, నారీ జ్ఞేయా తృతీయే తు ॥
-(నా.శా. XX111-45, 50)

అర్థం : సర్వశ్రీ సంయుక్తం = సర్వాంగశోభాయుతం; రతికరణోత్పాదనం = (ప్రియునిలో) రతిని రగుల్కొల్పునది; రతిగుణాఢ్యం = అధికంగా రతిని కోరేది; కామాప్యాయిత శోభం = కామాప్తి అతిశయించడంచేత శోభకలది (అయిన); ఏతత్, యౌవనం, తృతీయం (తు) = ఈ యౌవనం, మూడవది.

రతిసంభోగే దక్షా = రతికేళిలో సమర్థురాలు; ప్రతిపక్ష-అసూయినీ=సపత్నులయందు అసూయ వహించేది; రతి గుణాఢ్యా=రతికేళులలో ఆరితేరినది; అవివృత-గర్విత చేష్టా = దాచుకొనని గర్వితచేష్టలు కలది (ఇటువంటి);

నారీ = స్త్రీ; తృతీయే(తు), జ్ఞేయా = తృతీయ యౌవనమందున్నది (అని), తెలియవలెను.

తాత్పర్యం : సర్వశ్రీ సంయుక్తం, రతికరణోత్పాదన సమర్థం, రతి గుణాఢ్యం, కామాప్యాయితశోభం అయిన యౌవనం మూడవది. ఈ మూడవ యౌవనంలో ఉన్న నారి, సంభోగమందు సమర్థురాలు, ప్రతిపక్షమందు అసూయ వహించునది, రతి గుణాఢ్య (=కామతంత్ర ప్రయోగము లందు ప్రగల్భ), సర్వంతో కూడిన చేష్టలను దాచుకొననిది-ఇటువంటి స్త్రీ తృతీయయౌవనంలో ఉన్నది.

టీక : తృతీయయౌవనంలో ఉన్న స్త్రీ "కాంతుని అభీష్టమునకు అనుకూలంగా ఉంటుంది." అని భావప్రకాశనంలో అధికంగా ఉంది.

తృతీయయౌవనం యొక్క లక్షణాలను, తృతీయ యౌవనంలో ఉన్న స్త్రీ చేష్టలను సింగభూపాలుడు క్రింది విధంగా వివరించినాడు (ర.సు.I.174-77):

మూలం : అస్నిగ్ధతా నయనయో ర్గండయో ర్మ్లాన కాంతితా ।।
విచ్ఛాయతా శిరస్పర్శోఽవయవానాం శ్లథతా మనాక్ ।
అధరే మసృణో రాగః, తృతీయే యౌవనే భవేత్ ।।
తత్ర స్త్రీణా మయం చేష్టా, రతితంత్రవిదగ్ధతా ।
వల్లభస్యావలిత్యాగః తదాకర్షణకౌశలం ।।
అనారోపోఽపరాధేషు, సపత్నిష్వమత్సరః ।

తాత్పర్యం : నేత్రములందలి లాలిత్యం సన్నగిల్లటం, చెక్కిళ్ళయందలి మనుపు తగ్గటం, దేహచ్ఛాయ తరగటం, స్పర్శ కఠినంగా ఉండటం (=మృదుత్వం పోవటం), కొంచెంగా అవయవాల పటుత్వం తగ్గటం, పెదవుల ఎఱుపుదనం మెరవటం- ఇవి తృతీయయౌవనమందలి లక్షణాలు.

రతితంత్రములందు విశేష చాతుర్యం, వల్లభుని ఎడబాటును ఏ మాత్రం సహించలేకపోవటం, వల్లభుని ఆకట్టుకొనే నేర్పు, వల్లభుని అపరాధములను లెక్క చేయకపోవటం, సవతులపట్ల మాత్సర్యం లేకపోవటం— ఇవి తృతీయ యౌవనమందలి స్త్రీ యొక్క చేష్టలు.

ఉదా: వక్త్రైః ప్రమత్తవికచైః వలితై [illegible]
[illegible] మాంసలితైః, [illegible] ।

నిర్మాంసములయిన గండాలు, జఘనాలు, అధరాలు, స్తనాలు, కొంచెంగా తగ్గిన గాత్ర లావణ్యం, కామ తంత్రమందు నిరుత్సాహం-ఇవి చతుర్థయౌవన మందలి లక్షణాలు.

చతుర్థయౌవనమందలి స్త్రీ చిత్తగ్రహణ సమర్థ,కామాభిజ్ఞ; అయినప్పటికీ సవత్నులపట్ల మత్సరం వహించదు. భర్తృ సాన్నిధ్యాన్ని ఎల్లప్పుడూ కోరుకొంటుంది.

**టీక :** చతుర్థయౌవనలక్షణాలను, చతుర్థయౌవనమందున్న స్త్రీయొక్క చేష్టలను సింగభూపాలుడు క్రింది విధంగా వర్ణించినాడు (ర.సు.I-177-79):

**మూలం :** జర్జరత్వం స్తన-శ్రోణీ-గండోరు-జఘనాదిషు ॥
నిర్మాంసలత్వం భవతి చతుర్థే యౌవనే స్త్రియాః ।
తత్ర చేష్టా రతివిధావనుత్సాహోఽ సమర్థతా ॥
సపత్నీ ష్వాసుకూల్యం చ కాంతేన విరహస్థితిః ।
తత్ర శృంగారయోగ్యత్వం రతాహ్లాదనకారణమ్ ॥
ఆద్యద్వితీయయో రేవ న తృతీయ చతుర్థయోః ।

**తాత్పర్యం :** చతుర్థయౌవనమందలి స్త్రీలకు స్తనాలు, శ్రోణి (=కటి), కపోలాలు, ఊరువులు, జఘనాలు (=పిఱుదులు)- వీనియందు జర్జరత్వం (= ముసలితనం లేదా శిథిలత్వం), నిర్మాంసలత్వం (మాంసభాగం తగ్గిపోవటం లేదా చిక్కిపోవటం) సంభవిస్తుంది. ఈ చతుర్థయౌవనమందలి స్త్రీలు రతి తంత్రమందు ఉత్సాహం లేనివారు, సమర్థత కూడా లేనివారు అవుతారు. సవత్నుల వట్ల అనుకూలత ఉంటుంది (= మాత్సర్యం ఉండదు). కాంతుని యొక్క ఎడబాటును సహించగలరు. రతి సంతోషకారణమగు శృంగారయోగ్యత్వం తొలిరెండు యౌవనాలకే ఉంటుంది; తృతీయ-చతుర్థ యౌవనాలకు ఆ యోగ్యతలేదు.

**టీక :** భరతముని చతుర్థయౌవనాన్ని మాత్రమే శృంగార శత్రుభూత మన్నాడు. కాని, సింగభూపాలుడు తృతీయయౌవనాన్ని కూడా శృంగార శత్రుభూతంగానే పరిగణించినాడు. అందుచేత సింగభూపాలుని తృతీయ యౌవనవర్ణన భరతముని చేసిన వర్ణనకంటె కొంత భిన్నంగా ఉన్నది. ఇంక చతుర్థయౌవనంలో స్త్రీ కాంతుని యొక్క విరహాన్ని సహించగలదని సింహభూపాలుడు చెప్పినాడు. కాని, భరతమునిప్రకారం వృద్ధాప్యంలో అడుగుపెట్టిన ఆ స్త్రీ, కాంతుని యొక్క

సాన్నిధ్యాన్ని నిత్యం కోరుకొంటుంది. అంటే ఎల్లప్పుడు తనదగ్గరనే ఉండవలెనని కోరుకొంటుంది. దగ్గర ఉండటానికి అవకాశం ఉన్నా లేకపోయినా లోకానుభవాన్ని పట్టి కూడా భరతముని చెప్పినది సమంజసంగా ఉన్నది-- అప్పుడు వానికి కావలసినది సహాయ సహకార సానుభూతులు మాత్రమే.

*(ii)* రూపం :

మూలం : అంగాన్యభూషితాన్యేవ ప్రక్షేపాద్యైర్విభూషణైః ।
యేన భూషితవద్భాంతి తద్రూపమితి కథ్యతే ॥
-(ర.సు.I-180)

అర్థం : ప్రక్షేప-ఆద్యైః విభూషణైః = పెట్టుకోవలసిన మంచి భూషణాల వేళ; అంగాని- అభూషితాని-ఏవ = అవయవాలు, అలంకరించబడకపోయినప్పటికీ; యేన, భూషితవత్-భాంతి = దేనివల్ల, అలంకరించబడినట్లుగానే ప్రకాశిస్తుందో; తత్ రూపం -ఇతి, కథ్యతే = అది, 'రూపం' అని, చెప్పబడుతున్నది.

తాత్పర్యం : శరీరమందలి అవయవాలు మంచి భూషణాల వేళ అలంకరింపబడకపోయినప్పటికీ, అలంకరింపబడినట్లుగానే ఆ శరీరం ప్రకాశిస్తూ ఉంటే, అది 'రూపం' అనబడుతుంది.

ఉదా : స్నాతుం విముక్తాభరణా విమాల్యా
భూమౌ సహ భూషయితుం శరీరమ్ ।
అనాదృతైః కాచిదుదారరూపా
యాం వీక్ష్య లజ్జాం వహతే సఖీషు ॥ *(ర.సు. 180)*

--స్నానం చేయటం కోసం, నగలను మాల్యాలను తీసివేసి, స్నానానంతరం, శరీరాన్ని అలంకరించుకొనటం మరచి ఉండుటకు వచ్చిన, సహజ సౌందర్యవతి అయిన ఆమెను చూచి, నగలు ధరించిన యువతులు (ఆమెకు తాము సరికామని) సిగ్గుపడిరి.

టీక : రూపాదులకు నిర్వచనాలు నా.శా. నందు లేవు. అందుచేత ర.సు. నుంచి ప్రధానంగా నిర్వచనాలను గ్రహించాను. శారదాతనయుడు 'రూపము'ను క్రింది విధంగా వర్ణించినాడు (భా.ప్ర. III-209-10):

మూలం : ఆవేధ్యారోప్య-నిక్షేప్య-బంధనీయై రభూషితమ్ ।।
యద్భూషిత మివాభాతి తద్రూప మితి కథ్యతే ।

**తాత్పర్యం :** ఆవేధ్యాలు, ఆరోప్యాలు, నిక్షేప్యాలూ, బంధనీయాలు అనే నాలుగు విధాలయిన ఆభరణాల చేత భూషితం కాకున్నప్పటికే, భూషితమై నట్లుగానే ప్రకాశించటం 'రూపం' అనబడుతుంది.

శారదాతనయుడు నాలుగు విధాల ఆభరణములను క్రింది విధంగా వర్ణించి నాడు (భా.ప్ర. III-210-13) :

ఆవేధ్య భూషణాలు : రత్నమయంగా లేదా కేవలం బంగారంతో చేయబడిన కర్ణ-నాసికాదుల ఆభరణాలు-అంటే చెవులను, ముక్కులను కుట్టి ధరింపజేసే ఆభరణాలు.

ఆరోప్య భూషణాలు : ఇంద్రచ్ఛందం మున్నగు హారాలు, బంగారు గొలుసులు మున్నగునవి. ఇవి కంఠమునందు వేసుకొనేవి.

బంధనీయభూషణాలు : ముత్యాలతో కూర్చినవి, స్వర్ణమయములు అయిన కటి సూత్రాలు, అంగదాదులు, గజ్జెలు, గ్రైవేయం (=కంఠమునందు ధరించే పట్టెడ మున్నగునవి)- ఇవి కట్టుకొనే భూషణాలు.

ని(ప్ర)క్షేప్యభూషణాలు =నూపురాలు, కంకణాలు, మున్నగునవి. ఇవి తొడుగుకొనే భూషణాలు.

సూచన : నా.శా. యందలి 'ఆహార్యాభినయ' విశ్లేషణ కూడా చూడదగును.

*(iii)* లావణ్యం :

మూలం : ముక్తాఫలేషు చ్ఛాయాయా స్తరళత్వ మివాంతరా ।
ప్రతిభాతి యదంగేషు లావణ్యం తదిహోచ్యతే ॥

(ఉ.నీ. I-181)

**అర్థం :** ముక్తాఫలేషు, అంతరే =మంచి ముత్యాల లోపల (ఉండే); ఛాయాయాః, తరళత్వం, ఇవ =ఛాయ (= నీడ) యొక్క తళతళల వలెనే; యత్-అంగేషు, ప్రతిభాతి =ఏది, అవయవములందు, ప్రకాశిస్తుందో; తత్, లావణ్యం (ఇహ), ఉచ్యతే = అది, 'లావణ్యం' అని చెప్పబడుతున్నది.

**తాత్పర్యం :** మంచి ముత్యాలలోని తళుకువలెనే శరీరం నుండి వ్యక్త మయ్యే కాంతి 'లావణ్యం' అనబడుతుంది.

ఉదా : అంగేషు స్ఫటికాదర్శ దర్శనీయేషు జృంభతే ।
అమలా కోమలా కాంతిః జ్యోత్స్నేవ ప్రతిబింబితా ॥
-(ర.సు.I-*181*)

— మణిదర్పణాల వలె దర్శనీయాలయిన ఆమె అవయవాలలో నిర్మలం, కోమలం అయిన కాంతి వెన్నెలవెలుగు వలె ప్రకాశిస్తున్నది.

టీక : శారదాతనయుడు లావణ్యాన్ని క్రింది విధంగా వర్ణించినాడు (భా.ప్ర. III-124) :

మూలం : ప్లవమాన మివాభాతి యదంగం కాంతివారిణి ।
లావణ్య మితి తత్ప్రాహుః పులకం ప్రతిమాదిషు ॥

తాత్పర్యం : ఏ శరీరం కాంతి అనే జలప్రవాహమందు ప్లవమానంగా (=తేలుతున్నట్లుగా) భాసిస్తుందో, ప్రతిమాదులలోని పులకం (= ఛాయా విశేషం) స్ఫురిస్తుందో, అది లావణ్యమనబడుతుంది.

(*iv*) సౌందర్యం :
మూలం : అంగప్రత్యంగకానాం యః సన్నివేశో యథోచితమ్ ।
సుశ్లిష్ట సంధిబంధః స్యాత్తత్సౌందర్య మితీర్యతే ॥
-(ర.సు. I-182)

అర్థం : అంగ-ప్రత్యంగ కానాం = అంగ-(ఉపాంగ)-ప్రత్యంగాల యొక్క; యః సన్నివేశం యథోచితం = ఏ, సన్నివేశం, యథోచితంగా (=ఎక్కువ తక్కువలు లేకుండా ఉంటుందో); సుశ్లిష్ట సంధిబంధః, స్యాత్ = మనోహరమైన, సంధిబంధములు, కలిగి ఉంటుందో; తత్, సౌందర్యం, ఇతి, ఈర్యతే = అది, 'సౌందర్యం' అని చెప్పబడుతున్నది.

తాత్పర్యం : అంగ-ఉపాంగ-ప్రత్యంగాలయొక్క అమరిక యథోచితమై మనోహరసంధిబంధం (= అవయవముల పొందిక) కలిగి ఉంటే అది 'సౌందర్యం' అవుతుంది.

ఉదా : దీర్ఘాక్షం శరదిందుకాంతివదనం బాహూ నతావంసయోః
సంక్షిప్తం నిబిడోన్నతస్తనమురః పార్శ్వే ప్రమృష్టే ఇవ ।

మధ్యః పాణిమితోఽ మితంచజఘనం పాదా వరాలాంగులీ
ఛందో నర్తయితు ర్యథైవ మనసి శ్లిష్టం తథా స్యాద్వపుః ॥

(- మాలవికాగ్ని మిత్రం-II-3 రాజు మాలవికను గూర్చి).

—ముఖం- నిడుదకన్నులు, శరచ్చంద్ర కాంతి కలిగి ఉంది. బాహువులు అంసముల వైపు వంగి ఉన్నవి. వక్షం-కఠినములు ఉన్నతములు అయిన స్తనాలు కలదై చిక్కనిదై ఉంది. పార్శ్వాలు మెఱుగు పెట్టినవా అన్నట్లుగా ఉన్నవి. నడుము పిడికిలి కొలది. పిఱుదులు విపులములు. పాదాలు వక్రాంగుళులు. నాట్యాచార్యుని మనస్సునందలి భావనకు తగినట్లుగా ఈమె శరీరం నిర్మితమై ఉన్నది.

(v) అభిరూప్యం (=అభిరూపత)

మూలం : యదాత్మీయగుణోత్కర్షై ర్వస్త్వన్య న్నికటస్థితమ్ ।
సారూప్యం నయతి ప్రాజ్ఞై రాభిరూప్యం తదుచ్యతే ॥
-(ర.సు. I-183)

అర్థం : యత్, ఆత్మీయ గుణ ఉత్కర్షైః = ఏది, స్వీయ (= తన యొక్క) గుణాధిక్యం చేత; నికటస్థితం, అన్యత్, వస్తు = (తన) సమీపమందున్న, ఇతర, వస్తువు; సారూప్యం, నయతి =తనతో సమానమైన రూపం పొందునట్లు చేస్తుందో; తత్, ఆభిరూప్యం, ప్రాజ్ఞైః ఉచ్యతే = అది, 'అభిరూప్యం' (అని), ప్రాజ్ఞులచేత చెప్పబడుతున్నది.

తాత్పర్యం : స్వీయగుణాధిక్యంతో, సమీపమందున్న ఇంకో వస్తువును కూడా తనతో సమానమగు రూపం పొందునట్లు చేయటం 'ఆభిరూప్యం' (=అభిరూపత) అవుతుంది.

ఉదా : (i) ఏకోఽపి త్రయ ఇవ భాతి కందుకోఽ యం
కాంతాయాః కరతలరాగరక్త రక్తః ।
భూమౌ తచ్చరణనఖాంశు గౌరగౌరః
స్వస్థః సన్ నయన మరీచినీలః ॥ (భోజచరితమ్-)

— ఆ కాంత కందుకం (=బంతి)తో ఆడుతున్నది. ఆ సమయంలో కందుకం ఆమెచేతిని తాకినప్పుడు ఆ చేతి ఎఱ్ఱదనం వల్ల ఎఱ్ఱనిదిగానూ, నేలపై పడినప్పుడు ఆమె కాలిగోళ్ళ తెల్లదనం వల్ల తెల్లనిదిగానూ, ఆకాశం

లోకి ఎగిరినప్పుడు ఆమె కనుల నల్లని కాంతివల్ల నల్లనిదిగానూ-అంటే ఒకే బంతి స్థానం మార్పువల్ల మూడు విధాలుగా కన్పట్టుతున్నది.

(ii) సుప్రసిద్ధమైన ఇంకో ఉదాహరణ :

జానక్యాః కమలామలాంజలిపుటే యాః పద్మరాగాయితా
న్యస్తా రాఘవమస్తకేతు విలసత్కుంద ప్రసూనాయితాః ।
స్రస్తా శ్యామలకాయ కాంతి కలితా యా ఇంద్రనీలాయితాః
ముక్తాస్తాశ్శుభదా భవంతు భవతాం శ్రీరామ వైవాహికాః ॥
(శ్రీరామకర్ణామృతం-I-82)

- ఏముత్యాలు, జానకి యొక్క ఎఱ్ఱని పద్మంవలె ఉన్న దోసిలిలో పద్మరాగమణులవలె ఉన్నవో, రాముని శిరము నందుంచబడుతున్నప్పుడు తెల్లని అంతరాళమందు (=సీత యొక్క దోసిలి, రాముని శిరస్సు మధ్య ఉన్న ఖాళీలో) తెల్లని మల్లెపువ్వుల వలె ఉన్నవో, రాముని శిరముపై పడి ఆయన నల్లని దేహకాంతివలన ఇంద్రనీలాలవలె ఉన్నవో - అట్టి రామవివాహ సమయమందలి తలంబ్రాల ముత్యాలు మీకు శుభమును కలిగించునుగాక!

(vi) మార్దవం :

మూలం : స్పృష్టం యద్యాంగ మస్పృష్ట మివ స్యా న్మార్దవం హి తత్ ।
(ర.సు. I-184)

అర్థం : యత్, అంగం, స్పృష్టం = ఏ, (=ఎవరి) అంగం (= అవయవం) (మనలను) స్పృశించినప్పటికీ; అస్పృష్టం ఇవ స్యాత్, తత్, మార్దవం (హి) =స్పృశించనట్లే, (=మనలను తాకనట్లే) ఉంటుందో, అది 'మార్దవం' (అనబడుతుంది.)

ఏవ్యక్తి అవయవమైనా మనలను తాకినప్పటికీ, అది మనలను తాకనట్లే ఉంటే అది 'మార్దవం' (=మృదుత్వం) అనబడుతుంది.

వ్యతిరేకవిధాన ఒక ఉదాహరణ :

ఉదా : లాక్షాం విధాతు మవలంబితమాత్రమేవ
సఖ్యాః కరేణ తరుణాంబుజకోమలేన ।
కస్యాశ్చిదగ్ర పద మాశు బభూవ రక్తం
లాక్షా రసః పున రభూ త్తు భూషణాయ ॥

- (ఉత్ప్రేక్షా వల్లభుని శ్లోకంగా 'సూక్తిముక్తావళి' లో)

- పాదాలకు లత్తుకప్రాయటం కోసం, నాయిక యొక్క పాదాగ్రాన్ని ఒక చెలికత్తె తరుణాబ్జములవలె కోమలములయిన తన కరములతో పట్టుకొని నంతనే , ఆ పాదం అవలీలగా ఎఱ్ఱనిది కాగా అలంకారమైన లాక్షారసం యొక్క అక్కర లేకనే పోయింది.

టీక : 'సుఖ స్పర్శత్వం మృదుత్వం' అని తాను చెప్పి, కొందరి అభిప్రాయంగా పై నిర్వచనాన్ని కూడా ఉటంకించినాడు శారదాతనయుడు (భా.ప్ర.III-120-21).

*(vii)* సౌకుమార్యం

మూలం:: యా స్పర్శాసహతాంగేషు కోమల స్యాపి వస్తునః ॥
తత్సౌకుమార్యం; త్రేధాస్యా న్ముఖ్య మధ్యాధమ క్రమాత్ ।
అంగం పుష్పాది సంస్పర్శాసహం యేన తదుత్తమం ॥
న సహేత కరస్పర్శం యేనాంగం మధ్యమం హి తత్ ।
యేనాంగ మాతపాదీనా మసహం తదిహాధమం ॥
-(ర.సు. I-184-86)

అర్థం : యా = ఏది; అంగేషు =అవయవములందు; కోమలస్య వస్తునః, అపి =కోమలములయిన వస్తువులు, అయినప్పటికీ (వాటియొక్క); స్పర్శ-అసహతా = స్పర్శను సహింపలేవో; తత్ సౌకుమార్యం =అది, 'సౌకుమార్యం' (అవుతుంది). ముఖ్య-మధ్య-అధమ, క్రమాత్, త్రేధా, స్యాత్ =(ఆ సౌకుమార్యం) క్రమంగా, ముఖ్యం (= ఉత్తమం), మధ్యమం, అధమం, (అనే) భేదాలచేత, మువ్విధం.

యేన= దేని (=ఏ గుణం) చేత; అంగం =శరీరం; పుష్పాది, సంస్పర్శ-అసహం=పుష్పం వంటి (సుకుమార వస్తువుల) సంస్పర్శను కూడా సహించలేదో; తత్, ఉత్తమం =అది ఉత్తమ (సౌకుమార్యం).

యేన =దేని (= ఏ గుణం) చేత; అంగం =శరీరం; కరస్పర్శం, న సహేత = కరస్పర్శను కూడా సహించలేదో; తత్, మధ్యమం (హి) = అది, మధ్యమ (సౌకుమార్యం).

యేన = దేని (= ఏ గుణం) చేత; అంగం =శరీరం; ఆతపాదీనాం-అసహం =ఎండ మొదలగు వానిని, సహింపలేదో; తత్ (ఇహ), అధమం =అది, అధమ (సౌకుమార్యం).

తాత్పర్యం : కోమలములయిన వస్తువులయొక్క స్పర్శను కూడా సహింప లేకపోవటం 'సౌకుమార్యం' అవుతుంది. అది ముఖ్యం (=ఉత్తమం),మధ్యమం, అధమం అనే భేదాల చేత క్రమంగా మూడు విధాలు.

పుష్పాదుల స్పర్శను కూడా ఓర్వలేకపోవటం ఉత్తమసౌకుమార్యం.

కరస్పర్శను సహించలేకపోవటం మధ్యమసౌకుమార్యం. ఎండ, చలి మున్నగు వానిని సహించలేకపోవటం అధమసౌకుమార్యం.

ఉదా : ఉత్తమసౌకుమార్యం :

మహార్హశయ్యా పరివర్తనచ్యుతైః
స్వకేశపుష్పైరపి యా స్మ దూయతే ।
అశేత సా బాహులతోపధాయినీ
నిషేదుషీ స్థండిల ఏవ కేవలే ॥ (కు.సం. v-12).

-- మహార్హ (= మిక్కిలి మెత్తనైన, విలువైన) శయ్యపై అటునిటు పొరలటం వల్ల తలనుండి జారిపడిన పూవుల ఒత్తిడినే ఆ పార్వతి తాళజాలకపోయినది! మరి తపస్సమయంలో, లతవంటి బాహువునే తలగడగా చేసుకొని, కటిక నేలపై-కూర్చుండియే-నిదురించినది!

టీక : పై ఉదాహరణలో పట్టుదలగల పార్వతి దేవియొక్క శరీరం, మనస్సు, క్లేశాన్ని సహించినది; కానీ, సంతోషసమయంలో ఆమె శరీరం పూవుల ఒత్తిడిని కూడా సహించలేకపోయినదన్నమాట!

ఉదా : మధ్యమ సౌకుమార్యం :

మానిన్యా మాననోదార్థ ప్రణతే దయితే సతి ।
తత్పాణి స్పర్శమాత్రేణ లాక్షయేవాంకితం పదమ్ ॥
(ర.సు. 186)

--మానిని యొక్క కోపం పోగొట్టదలచి, ప్రియుడామె పాదాలపై పడగా, అతని కరస్పర్శమాత్రముననే ఆమె పాదాలు లత్తుకపూసినట్లు అయినవి (ఎఱ్ఱబడినవి).

(viii) ప్రసాదం :

త్రిధా ప్రసాదో వదనే దృశో శ్చిత్తే చ కథ్యతే
లావణ్యరసనిష్యంది స్మితమాన మివానకృత్ ॥
పులకోల్లాసిగండం యుత్ప్రసన్నవదనం భవేత్ ।
సభ్రూ విలాసలలితం సకటాక్ష నిరీక్షణమ్ ॥

స్మేరతారం స్మృతః స్నిగ్ధం ప్రసన్న నయనం భవేత్ ।
కృతజ్ఞతోపకర్తృత్వం భూయో దోషానభిజ్ఞతా ॥
ఏతత్ ప్రసన్న చిత్తానాం లక్షణం సముదాహృతం ।

-(భా.ప్ర.III.222-25)

**అర్థం :** వదనే, దృశోః, చిత్తే (చ) ప్రసాదః, త్రిధాకథ్యతే = వదనమందు, చూపులో (= కనులయందు), చిత్తమందు-(ఇట్లా), ప్రసాదం, మూడు విధాలు (అని) చెప్పబడుతున్నది.

యత్, లావణ్యరస నిష్యంది, అనకృత్ స్మయమానం- ఇవ, పులకోల్లాసి గండం = ఏది, లావణ్యరసపూర్ణమై, నిత్యం నవ్వుతున్నట్లుగా, పులకలతో నిండిన గండములు (కలిగి ఉంటుందో); ప్రసన్నవదనం, భవేత్ = (అది) ప్రసన్నవదనం, అవుతుంది.

సభ్రూవిలాసలలితం, సకటాక్షనిరీక్షణం, స్మేరతారం, స్మృతః స్నిగ్ధం = (ఏది), భ్రూవిలాసాలతో కటాక్షనిరీక్షణాలతో, నవ్వుతున్నట్లున్న తారకలతో, సహజంగా స్నిగ్ధంగా (ఉంటుందో); ప్రసన్ననయనం, భవేత్ = (అది) ప్రసన్న నయనం (లేదా చూపు), అవుతుంది.

భూయః, కృతజ్ఞతా-ఉపకర్తృత్వం, దోష- అనభిజ్ఞతా = (ఏది) కృతజ్ఞతాభావంతో, ప్రత్యుపకారబుద్ధితో (ఉంటుందో), (ఎదుటివారి) దోషాలను, గుర్తించదో; ప్రసన్నచిత్తానాం, లక్షణం, సముదాహృతం = (అది) ప్రసన్న చిత్తులయొక్క, లక్షణంగా, చెప్పబడింది.

**తాత్పర్యం :** 'ప్రసాదం' మూడు విధాలు- వదన ప్రసాదం (= ముఖం ప్రసన్నంగా ఉండటం), నయన ప్రసాదం (= కనులు లేదా చూపు ప్రసన్నంగా ఉండటం), చిత్తప్రసాదం (= మనస్సు నిర్మలంగా ఉండటం).

లావణ్యరసనిష్యంది, నిత్యం నవ్వుతూ ఉండేది, పులకలతో నిండిన గండములు కలది ప్రసన్నవదనం (= వదన ప్రసాదం) అవుతుంది.

భ్రూవిలాసాలతో, కటాక్షనిరీక్షణాలతో, స్మేరతారకలతో, సహజంగా స్నిగ్ధంగా ఉండేది ప్రసన్ననయనం (= దృక్ప్రసాదం) అవుతుంది.

అధికమైన కృతజ్ఞతాభావంతో, ప్రత్యుపకారబుద్ధితో, దోషాలు గుర్తించనిది ప్రసన్నచిత్తం (= చిత్తప్రసాదం)– ఇది ప్రసన్నచిత్తుల లక్షణం.

టీక : ఈ ఎనిమిదవ గుణం భావప్రకాశనంలో మాత్రమే వర్ణింప బడినది. ఎనిమిది గుణాలను వివరించిన పిమ్మట శారదాతనయుడు మరికొన్ని పదాలను ఇట్లా వివరించినాడు (భా.ప్ర.III-232-244) :

మాననం : తన ఉపభోగమునకు అర్హములైన వస్తువులతో ఇతరులను సత్కరించటం (= సమ్మాననం).

భాషామాధుర్యం : అనురాగంతో, హర్షంతో, స్మితవదనంతో సాదరంగా మాటాడటం.

త్యాగం : ఇచ్చేదానికి మితిలేకుండా, ఎంత ఇవ్వబడుతున్నదో తెలియనీయకుండా , పుచ్చుకొనే వానికి హర్షం కలిగేటట్లుగా ఇవ్వటం.

త్రాణం : దేనిచేత దుఃఖం పోగొట్టుతారో అది.

ఉద్రవం : దుఃఖాన్ని విదలించేది.

ఉల్లాసం : హర్షం ఉదయింపజేసేది.

దంభం : ఇతరులను ఖేదపెట్టేది.

కౌశలం : కృత్యములలో సుఖప్రయోగచాతుర్యం.

నైపుణం : ద్రవ్య-గుణ-క్రియాదులకు సంబంధించిన హాన-ఉపాదన కర్మలలో, సూక్ష్మార్థప్రాప్తినిరతమయిన ధీవ్యాపారం.

సామర్థ్యం : (అర్థం = వ్యాపారం, సామర్థ్యం = ప్రయోజన సహితమైన వ్యాపారంలో ఉండటం) ఎవని వ్యాపారం ప్రయోజన సహితంగా ఉంటుందో అతడు సమర్థుడు.

విలోభనం : అసద్రూపమందు, సద్రూపోత్కర్షణ కూర్పటం.

ఆతంకం : ఉల్కా-అశని-సృప-వ్యాఘ్రాదుల వల్ల కలిగే చిత్తవిప్లవం; ఇది సాధారణంగా కరుణరూపంగా ఉంటుంది.

శిల్పం : వాక్-మనః-కర్మ విశేషాలతో ఒకే పదార్థానికి నానా రూపకల్పన.

వైదగ్ధ్యం : లౌకిక-వైదిక-సామయికార్థములందు సమ్యక్ పరిపక్వప్రౌఢి.

ప్రతారణం : ప్రకృతి సహజంగా దుస్తరస్వభావం కలదానికి, ఏదో ఒక కర్మవిశేషంతో, మిథ్యాతరణయోగ్యతాకల్పన.

ఇట్లా కవులు, యథారసంగా ఆయా భావాలను ఊహించుకోవాలి.

పైని వివరించిన కొన్ని పదాలు, నాయకుని సామాన్యగుణాలను పోలి ఉండటం గమనించవచ్చు. (చూ. నాయక గుణాలు).

(2) చేష్టలు (ఉద్దీపన విభావం : ఆలంబన గత చేష్టలు) :
మూలం : చేష్టాస్తు యౌవనోద్భూత కటాక్షాదయ ఈరితాః ।
(భ.ర.ప్ర.-98)

అర్థం : యౌవన-ఉద్భూత, కటాక్ష ఆదయః = యౌవనం వల్ల జనించే, కటాక్షాలు మున్నగునవి; చేష్టాః (తు), ఈరితాః = (ఆలంబనగత) చేష్టలు, (అవి), చెప్పబడేనవి.

తాత్పర్యం : యౌవనంలో సంపన్నమయ్యే కటాక్షం మున్నగునవి ఆలంబనవిభావచేష్టలు.

టీక : "తచ్చేష్టా లీలా-విలాసాదయః, తేప్యనుభావప్రకరణే వక్ష్యంతే" (ర.సు.I). తత్, చేష్టా, లీలా-విలాసాదయః=ఆలంబనగతములైన శృంగార చేష్టలు, లీల, విలాసం మున్నగునవి; తే (అపి) అనుభావ ప్రకరణేవక్ష్యంతే = అవి, అనుభావప్రకరణంలో చెప్పబడతాయి- అని సింగభూపాలుడు పేర్కొన్నాడు. ఇంక భరతరసప్రకరణంలో చెప్పిన కటాక్షం మున్నగునవి లోకప్రసిద్ధాలు; కావున వీటికి ఎవ్వరూ లక్షణం చెప్పలేదు.

(3) అలంకరణ (ఉద్దీపన విభావం : ఆలంబనగత అలంకరణ=అలంకృతి):
మూలం : చతుర్ధాలంకృతి ర్వాసో భూషా మా ల్యానులేపనైః ॥
(ర.సు.I-187)

అర్థం : వాసః-భూషా-మాల్య-అనులేపనైః = వస్త్రాలు, భూషణాలు, దండలు, మైపూతలు-అనే వానిచేత; అలంకృతిః, చతుర్ధా = (ఆలంబన గత మైన) అలంకరణం, నాలుగు విధాలు.

తాత్పర్యం : వస్త్రాలు, భూషణాలు, మాల్యాలు, మైపూతలు అనే భేదాలతో ఆలంబనగతమయిన అలంకరణం నాలుగు విధాలు.
ఉదా : వస్త్రాలంకారం :
మూలం : క్షీరోదవేలేవ సఫేనపుంజా
పర్యాప్త చంద్రేవ శరత్త్రియామా ।

నవం నవక్షౌమ నివాసినీ సా
భూయో బభౌ దర్పణ మాదధానా ॥

(కు.సం. vii-*26*)

—క్రొత్త తెల్లపట్టుచీర ధరించిన ఆ పార్వతి, నురుగు గుంపుతో కూడిన పాలకడలి ఒడ్డువలె, నిండు చంద్రునితో అలరారే శరద్రాత్రి వలె భాసమాన మవుతూ దర్పణం ధరించి మరింత ప్రకాశించినది.

ఉదా : భూషాలంకారం :

మూలం : సా సంభవద్భిః కుసుమై ర్లతేవ
జ్యోతిర్భి రుద్యద్భిరివ త్రియామా ।
సరిద్విహంగై రివ లీయమానై
రాముక్త ముక్తాభరణా చకాశే ॥

(కు.సం. vii-*21*)

—వికసించిన పూలతోడి తీగవలె, ఉదయించిన నక్షత్రాలతోడి రాత్రివలె, వ్రాలుతున్న విహంగాలతో కూడిన నదివలె, ముత్యాల నగలు ధరించిన పార్వ తీదేవి మిక్కిలిగా ప్రకాశించినది.

ఉదా : మాల్య-అనులేపనాలంకారములు (ర.సు.*I-186* తరువాత) :

మూలం : ఆలోకై రనుమీయతే మధుకరైః కేశేషు మాల్యగ్రహః
కాంతిః కాపి కపోలయోః ప్రథయతే తాంబూలమంతర్గతం ।
అంగానా మనుగమ్యతే పరిమళై రాలేపన ప్రక్రియా
వేషః కోఽపి విదగ్ధ ఏష సుదృశః సూతే సుఖం చక్షుషోః ॥

—శిరస్సు పైని తిరుగుతున్న మధుకరాల వల్లనే కబరీభారమందు మాల్య ములున్నవని తెలుస్తున్నది. చెక్కిళ్ల కాంతి వల్లనే తాంబూలగ్రహణం వ్యక్త మవుతున్నది. అవయవాల పరిమళం వల్లనే మైపూత స్పష్టమవుతున్నది. ఈవనిత యొక్క ఈవిదగ్ధ వేషం కన్నులపండువు చేస్తున్నది.

టీక : నా.శా.లో 'ఆహార్యాభినయం' అనే 21 వ అధ్యాయంలో 'అలం కారము' నకు సంబంధించిన వర్ణన విపులంగా ఉన్నది.

(*4*) తటస్థాలు (ఉద్దీపన విభావం : ఆలంబనగత తటస్థాలు) :

మూలం : తటస్థా శ్చంద్రికా ధారాగృహ చంద్రోదయాదయః ॥
కోకిలాలాప మాకంద మందమారుత షట్పదాః ।
లతామంటప భూగేహ దీర్ఘికా జలదారవాః ॥

ప్రాసాదగర్భ సంగీత క్రీడాద్రి సరిదాదయః ।
ఏవమూహ్యా యథాకాల ముపభోగోపయోగినః ॥

(ర.స.I-187-89)

అర్థం : చంద్రికా, ధారాగృహ, చంద్ర-ఉదయ-ఆదయః= వెన్నెల, ధారా గృహం (= నీటి ధారలతోడి చల్లని ఇల్లు), చంద్రోదయం మున్నగునవి; కోకిల-ఆలాప, మాకంద, మందమారుత, షట్పదాః = కోకిల ఆలాపాలు, మాకం దాలు (= తియ్యమామిడిచెట్లు), మందమారుతం, తుమ్మెదలు; లతామం టప, భూగేహ, దీర్ఘికా, జలదారవాః = పొదరిల్లు, భూగృహాలు (= Cellars), దిగుడు బావి, మేఘనాదాలు (= ఉరుములు విద్యుత్తు మొ.); ప్రాసాదగర్భ, సంగీత, క్రీడాద్రి, సరిత్-ఆదయః = ప్రాసాదమధ్యభాగం, సంగీతం, క్రీడా పర్వతం, సెలయేరు మున్నగునవి; తటస్థాః (చ) = (ఇవి ఉద్దీపన విభావం యొక్క) తటస్థగుణాలు; ఉపభోగ-ఉపయోగినః, యథాకాలం, ఏవం, ఊహ్యాః = సంభోగ శృంగారమునకు, ఉపయుక్తములయిన తటస్థ ఉద్దీపన విభావాలు ఆయాకాలములకు తగినట్లుగా, ఇట్లా ఊహింపదగినవి.

తాత్పర్యం : వెన్నెల, ధారాగృహం, చంద్రోదయం, కోకిలరుతం, తీయ మామిడి, మలయానిలం, తుమ్మెదలు, లతామండపం, పొదరిల్లు, భూగృహం, ప్రాసాదగర్భం, సంగీతం, క్రీడాద్రి, సెలయేరు మున్నగునవి తటస్థ-ఉద్దీపన విభావాలు. ఇవి సమయానుకూలంగా ఉపభోగమునకు ఉపకరిస్తాయి.

టీక : రసార్ణవసుధాకరమునందు ఈ తటస్థములన్నింటికి ఉదాహరణ ...న్నవి; మచ్చునకు ఒకటి— విద్యుత్ విషయం :

మూలం : వర్షాసు తాసు క్షణరుక్ ప్రకాశాత్
త్రస్తా రమా శార్ఙ్గిణమాలిలింగ ।
విద్యుచ్చ సామీక్ష్య తదంగశోభాం
హ్రీణేవ తూర్ణం జలదం జగాహే ॥

— ఆ వర్షములందు, మెఱుపుల కాంతులకు భయపడి, లక్ష్మీదేవి విష్ణువును కౌగిలించుకొన్నది. మెఱుపు, లక్ష్మీదేవి యొక్క శరీరకాంతిని కాంచి, సిగ్గుప డిన దానివలె మేఘము చాటునకు పోయినది (నీలమేఘ శరీరుడు విష్ణువు, విద్యుత్తువంటి ప్రకాశం కలది లక్ష్మీదేవి).

రమ్యాణివీక్ష్య మధురాంశ్చనిశమ్యశబ్దాన్
పర్యుత్సుకో భవతి యత్సుఖితోఽపిజంతుః ।
తచ్చేతసా స్మరతి నూనమబోధపూర్వం
భావస్థిరాణి జననాంతర సౌహృదాని ॥

-అభిజ్ఞానశాకుంతలం-V-2

# నాయకులు

## 1. నాయకుడు :

టీక : “నయతి ప్రాప్నోతీతి వృత్తం ఫలం వేతి నాయకః.”

(అ.భా. సం. 2. పుట-418)

– ఇతి వృత్తాన్ని నడిపేవాడు, లేదా ఇతివృత్త ఫలాన్ని పొందేవాడు నాయకుడు- ఇది సర్వరూపక సాధారణ లక్షణం.

“శృంగార-ఆలంబన విభావం అయిన పురుషుడు నాయకుడు” అని శృంగార మంజరీ కర్త. ఈ లక్షణం శృంగారరస ప్రధానమైన రూపకభేదాలకు వర్తిస్తుంది. “గుణవంతుడైన పురుషుడు నాయకుడు” అని చెప్పి నాయకగుణాలను వివరించినాడు సింగభూపాలుడు.

ఇటువంటి నాయకుని చరిత్ర ప్రతిఅంకంలోను ప్రత్యక్షంగా ఉండాలి. అంతే కాదు, వాని అభ్యుదయం కూడా ప్రత్యక్షంగా ఉండాలి; కేవలం సూచన సరిపోదు. అయితే ఇటువంటి పురుషులు ఏ రూపకంలో అయినా పలువురు ఉండవచ్చు. అప్పుడు నాయకుడెవరు?

మూలం : వ్యసనీ ప్రాప్య దుఃఖం వా యుజ్యతేఽభ్యుదయేన యః ।
తథా పురుష మాహుస్తం ప్రధానం నాయకం బుధాః ॥
యత్రానేకస్య భవతో వ్యసనాభ్యుదయౌ పునః
ప్రకృష్టౌ యత్ర తౌ స్యాతాం స భవేత్తత్ర నాయకః ॥

(నా.శా. XXIV-21-23)

అర్థం : యః, వ్యసనీ, వా దుఃఖం ప్రాప్య, అభ్యుదయేన, యుజ్యతే = ఏ పురుషుడు, వ్యసని అయికానీ, దుఃఖితుడు అయికానీ, (తరువాత) అభ్యుదయంతో కూడినవాడు అవుతాడో; తథా, తం ప్రధానం పురుషం, బుధాః, నాయకం, ఆహుః = అప్పుడు, ఆ ప్రధాన పురుషుని, బుధులు, నాయకుడు (అని) అంటారు.

పున:, యత్ర, అనేకస్య వ్యసనాభ్యుదయౌ, భవత: = మరల, ఎక్కడ, అనేకులకు వ్యసన-అభ్యుదయాలు, ఉంటాయో; యత్ర, తౌ, ప్రకృష్టౌ, స్యాతాం =ఎక్కడ (= ఎవనికి) ఆ వ్యసన-అభ్యుదయాలు అధికములో; స:, తత్ర, నాయక:, భవేత్ =అతడు, అప్పుడు, నాయకుడు, అవుతాడు.

తాత్పర్యం : ఏ పురుషుడు వ్యసని అయికానీ, దు:ఖితుడు అయికానీ, (=తొలుత నుంచీ వ్యసని అయికానీ, లేదా సుఖితుడై దు:ఖప్రాప్తి పొందికానీ) అభ్యుదయం పొందుతాడో, ఆ ప్రధానపురుషుడు నాయకుడు అవుతాడు. అనే కులకు వ్యసనాభ్యుదయాలు ఉంటే, ఎవని వ్యసనాభ్యుదయాలు అధికములో అతడు నాయకుడవుతాడు (ఉదా : రామాయణ కథలో రామ- సుగ్రీవ-విభీ షణులలో రాముడే నాయకుడు).

టీక : సాధారణంగా ప్రతికథలో ప్రధానంగా ఒకసాధ్యఫలం ఉంటుంది. అంటే చతుర్విధపురుషార్థాలలో ఏదో ఒకదానిని ప్రధానంగా సాధించవలెనన్న దృష్టి ఉంటుంది. (తక్కిన మూడింటిలో ఒకటికాని, అంతకుమించికాని ఆనుషంగికఫలములు కావచ్చు). ఈ ప్రధానఫలాన్ని తానుగా సాధించుకొనే వాడు లేదా పొందేవాడు ప్రధానపురుషుడు అవుతాడు; అతడే ఆ కథలో నాయకుడు అవుతాడు. ప్రధానఫలం నాయకుడు స్వయంగా సాధించుకోవచ్చు; లేదా ఇతరుల సహాయం వల్ల పొందవచ్చు. ఇట్లా నాయకునకు సహాయపడే వారిని ఉపనాయకు లంటారు. అయితే నాయకుని యొక్క అమాత్యులు, సేనాపతులు మున్నగువారు ఉపనాయకులు కాజాలరు; వారు నాయకుని బాహ్యపరివారంలోని వారు, వారె ల్లప్పుడూ నాయకుని అధీనంలో ఉంటారు. వారేపనిచేసినా, తమ నాయకుని అభ్యుదయం కాంక్షించి మాత్రమే చేస్తారు. కావున, ప్రధానఫలం ఎవరు సాధించినా, ఆ ప్రధానఫలభోక్త ఎవరో అతడే నాయకుడవుతాడు. వత్సరాజు కథలలో ప్రధానఫలం యౌగంధరాయణాది అమాత్యులచేత సాధింపబడినప్పటికీ, దానిని అనుభవించే వత్సరాజే ఆ కథలలో నాయకుడవుతున్నాడు.

ఫలసిద్ధి మూడు విధాలుగా ఉంటుంది :

1. స్వాయత్త సిద్ధి, 2. సచివాయత్త సిద్ధి, 3. ఉభయాత్త సిద్ధి. శృంగారి అయిన ధీరలలితునకు సచివాయత్త సిద్ధి. శమప్రధానుడైన ధీరశాంతునకు ఉభయాత్త సిద్ధి. విజిగీషువైన ధీరోదాత్తునకు కూడా ఉభయాత్తసిద్ధియే. ఇంక సాహసకారి లేదా అకృత్యకారి అయిన ధీరోద్ధతునకు స్వాయత్తసిద్ధి.

కాగా, శాస్త్రవిహితమైన చతురాతోద్యవిధానం, శాస్త్రవిహితమైన నాట్య సర్వస్వం, ఫలప్రాప్తిపర్యంతం, ఎవరివలన లేదా ఎవనిని గూర్చి సాగుతుందో, అతడే నాయకుడవుతాడు.

ఇతివృత్తంలో ఉన్న ప్రాధాన్యాన్ని పట్టి, పురుషులను అయిదు వర్గాలుగా విభజించవచ్చు.

1. నాయకుడు : ప్రధానఫలభోక్త.
2. ఉప (=గౌణ) నాయకుడు (లు) : నాయకునకు ఒకస్థాయి క్రిందివారై, వ్యూహరచన చేసేవాడు(రు).
3. అను (=వి) నాయకులు : ఉపనాయకవ్యూహాన్ని ఆచరణలో పెట్టేవారు.
4. ప్రతినాయకుడు : నాయకునకు ప్రత్యర్థి (= నేటి 'విలన్') (వీనివెంట కూడా. ఉపనాయక-అనునాయకులు ఉండవచ్చు.
5. నాయకపరివారం : ఇది రెండువిధాలు.
   (1) ఆభ్యంతర పరివారం : (ఈ పరివారం 18 విధాలు : వీరిని గూర్చి నాయికా ప్రకరణంలో వివరిస్తాను.)
   (2) బాహ్యపరివారం : ఈ పరివారాన్ని ఈప్రకరణమందే వివరిస్తాను.

## 2. నాయక గుణాలు :

మూలం : నేతా వినీతో మధుర స్త్యాగీ దక్షః ప్రియంవదః ।
రక్తలోకః శుచి ర్వాగ్మీ రూఢవంశః స్థిరో యువా ॥
బుద్ధ్యుత్సాహ-స్మృతి-ప్రజ్ఞా-కలా-మాన-సమన్వితః ।
శూరో దృఢశ్చ తేజస్వీ శాస్త్రచక్షుశ్చ ధార్మికః ॥

(ద.రూ. II-1-2)

అర్థం : నేతా = నాయకుడు (క్రింది గుణములు కలవాడు కావలె). వినీతః, మధురః, త్యాగీ, దక్షః, ప్రియంవదః = వినయ సంపన్నుడు, ప్రియ దర్శనుడు, సర్వస్వదాయకుడు, క్షిప్రకారి, ప్రియభాషి; రక్తలోకః, శుచిః, వాగ్మీ, రూఢవంశః, స్థిరః, యువా = లోకుల అనురాగం పొందినవాడు, పవిత్రుడు, వాక్పటువు, ప్రసిద్ధ వంశజుడు, స్థిరసంకల్పుడు, యువకుడు; బుద్ధి-ఉత్సాహ-స్మృతి-ప్రజ్ఞా-కలా-మాన-సమన్వితః = బుద్ధి, ఉత్సాహం, స్మృతి, ప్రజ్ఞ, కలావేత్తృత్వం, మానం-ఇవి కలవాడు; శూరః, దృఢః (చ), తేజస్వీ,

శాస్త్రచక్షుః (చ), ధార్మికః = శూరుడు, దృఢవ్రతుడు, తేజోవంతుడు, శాస్త్రమే కనులుగా కలవాడు, ధర్మపరాయణుడు.

**తాత్పర్యం :** నాయకుడు– *1.* వినీతుడు, *2.* ప్రియదర్శనుడు. *3.* త్యాగి, *4.* దక్షుడు, *5.* మృదుభాషి, *6.* లోకప్రియుడు, *7.* పవిత్రుడు, *8.* వాగ్మి, *9.* ప్రసిద్ధవంశజాతుడు, *10.* స్థిరుడు, *11.* యువకుడు, *12.* బుద్ధిమంతుడు, *13.* ఉత్సాహశీలి, *14.* స్మృతిమంతుడు, *15.* ప్రజ్ఞాశాలి, *16.* కళావంతుడు, *17.* మానవంతుడు, *18.* శూరుడు, *19.* దృఢవ్రతుడు, *20.* తేజస్వి, *21.* శాస్త్రచక్షువు, *22.* ధార్మికుడు- కావాలి.

**టీక :** భరతముని "పురుషులందరి సత్త్వజాలంకారాలు" ఎనిమిదింటిని మాత్రమే వివరించినాడు. ధనంజయ-విశ్వనాథ-సింగభూపాలాదులు ఈ ఎనిమిదింటిని సాత్త్వికగుణాలుగా పేర్కొంటూ మరికొన్ని సామాన్యగుణాలను పేర్కొన్నారు. విద్యానాథుడు ఏడు, భోజ-విశ్వనాథులు పంద్రెండేసి, సింగభూపాలుడు పదిహేను, రుద్రటుడు పదహారు గుణాలు వివరించగా, ధనంజయుడు 22 గుణాలను వివరించినాడు. సింగభూపాలుని వివరణ క్రింది విధంగా ఉంది:

**మూలం :** . . . . . (తత్ర) నాయకో గుణవాన్ పుమాన్ ।
తద్గుణాస్తు మహాభాగ్య మౌదార్యం స్థైర్యదక్షతే ॥
ఔజ్జ్వల్యం ధార్మికత్వం చ కులీనత్వం చ వాగ్మితా ।
కృతజ్ఞత్వం నయజ్ఞత్వం శుచితా మానశాలితా ॥
తేజస్వితా కలావత్త్వం ప్రజారంజకతాదయః ।
ఏతే సాధారణాః ప్రోక్తా నాయకస్య గుణా బుధైః ॥
-(ర.సు.I-61-63)

ఉక్తైర్గుణైశ్చ సకలై ర్యుక్తః స్యాదుత్తమో నేతా ॥
మధ్యః కతిపయహీనో బహుగుణహీనోఽధమో నామ ।
-(ర.సు.I-71-72)

**తాత్పర్యం :** గుణవంతుడైన పురుషుడు నాయకుడు. ఆతని గుణాలు : *1.* మహాభాగ్యం, *2.* ఔదార్యం, *3.* స్థైర్యం, *4.* దక్షత, *5.* ఔజ్జ్వల్యం, *6.* ధార్మికత్వం, *7.* కులీనత్వం, *8.* వాగ్మిత, *9.* కృతజ్ఞత్వం, *10.* నయజ్ఞత్వం, *11.* శుచిత, *12.* మానశాలిత, *13.* తేజస్విత, *14.* కలావత్త్వం . *15* ప్రజారంజకత మున్నగునవి. . . . ఈ గుణాలు అన్నీ

కలవాడు ఉత్తమనాయకుడు, కొన్ని గుణాలు తక్కువ కలవాడు మధ్యముడు, బహుగుణహీనుడు అధముడు.

భరతముని చెప్పిన సాత్త్వికాలంకారాలు నాలుగింటిని -ధైర్య (= స్థైర్య)-గాంభీర్య-ఔదార్య-తేజస్సులను సింగభూపాలుడు నాయక సామాన్య గుణాలుగానే పరిగణించటం గమనించవచ్చు. ఇంక సింగభూపాలుడు చెప్పిన క్రొత్త గుణాలు రెండు - 1. మహాభాగ్యం, 2. కృతజ్ఞత్వం. ఇట్లా అయి శాస్త్రకర్తలు చెప్పిన నాయకసామాన్యగుణాలు ముప్పదికి పైగా ఉన్నవి.

*1* నుంచి *8* : శోభాదులు (భరతముని వివరించిన పురుషుల అయత్నజాలంకారాలు ఇవి తరువాత వివరింపబడగలవు.)

9. మహాభాగ్యం : సర్వాతిశాయి అయిన సామ్రాజ్యాధికారం చేకూరటం.
10. ఔజ్జ్వల్యం : నయనానందం కలిగించటం.
11. ధార్మికత్వం : ధర్మప్రవణచిత్తత్వం.
12. కులీనత : ప్రసిద్ధవంశమందు జననం.
13. వాగ్మిత : సమయోచిత సంభాషణా సామర్థ్యం.
14. కృతజ్ఞత : పొందిన ఉపకారాన్ని జ్ఞప్తియందుంచుకొనటం.
15. శుచిత్వం : అంతఃకరణ శుద్ధత.
16. నయజ్ఞత : సామ-దాన-భేద-దండోపాయ ప్రయోగములందు నేర్పు. (శాస్త్రచక్షువు కావటం).
17. మానిత్వం : కార్పణ్యం (=కుత్సితం) సహింపలేకపోవటం.
18. కలావత్త్వం : సర్వవిద్యా-కలాకౌశలం.
19. ప్రజారంజకత్వం : సకలజనచిత్తాహ్లాదనకారిత్వం. (=రక్తలోక.)
20. వినయం : తాను గొప్పవాడు అయినా, పెద్దలపట్ల వినయం చూపటం (లోకమర్యాదను, శాస్త్రార్థాలను అతిక్రమించకుండటం).
21. త్యాగం : త్రికరణశుద్ధిగా వదాన్యుడు కావటం.
22. ప్రియంవదత్వం : ఆదరపూర్వకంగా మాటాడటం.
23. యౌవనం : రూపసంపన్నమైన దేహం కలిగి ఉండటం (= యౌవనంలో ఉండటం)
24. బుద్ధిమత్త్వం : యుక్త-అయుక్త వివేచనాశక్తి.
25. స్మృతి : జ్ఞాపకశక్తి.

26. ఉత్సాహం : కార్యశీలత.
27. ప్రజ్ఞ : మేధాశక్తి.
28. శౌర్యం : పరులను వశం చేసుకొనే శక్తి.
29. దార్ఢ్యం : స్థిరమైన నియమం కలిగి ఉండటం.
30. దయావత్త్వం : భూతదయ కలిగి ఉండటం.
31. సుభగత్వం : సౌభాగ్యవంతుడు కావటం.
32. దక్షత : దుష్కరకార్యం కూడా వేగంగా నిర్వర్తించటం.
33. యశస్సు : కీర్తిమంతుడు కావటం.
34. ధురంధరత : భారాన్ని వహించగలనేర్పు.

కొన్ని ఉదాహరణలు :

మహాభాగ్యం :

పౌత్రః కుశస్యాపి కుశేశయాక్షః
ససాగరాం సాగరధీరచేతాః ।
ఏకాతపత్రాం భువనైకవీరః
పురార్గలాదీర్ఘ భుజో బుభోజ ॥ -(ర.వం . XVIII-4)

— సముద్రం వలె గంభీరమైన హృదయం కలవాడు, ఏకచ్ఛత్రాధిపతి, ఎదురులేనివీరుడు, నగరద్వారపు అడ్డుగడియలవలె పొడవైన భుజములు కలవాడు, కుశుని పౌత్రుడు అయిన కుశేశయాక్షుడు సముద్రవలయితమూ, నిస్సపత్నమూ అయినభూమిని ఏలినాడు.

దక్షత :

స దక్షిణం తూణముఖేన వామం
వ్యాపారయన్ హస్త మలక్ష్యతాజౌ ।
ఆకర్ణకృష్టా సకృదస్య యోద్ధుః
మౌర్వీవ బాణాన్ సుషువే రిపుఘ్నాన్ ॥ -(ర.వం. VII-57)

— ఆ అజమహారాజు యుద్ధమందు, అందమైన తనకుడిచేతిని అమ్ముల పొదిపై ఉంచటం మాత్రమే కనపడుతున్నది, బాణాలను వెలికి తీయటం కానరాకుండెను. ఒక్కసారి కర్ణాంతం వరకు లాగబడిన ఆ వీరుని వింటి నారియే శత్రువులను కొట్టజాలిన బాణాలను వెలువరిస్తున్నట్లున్నది.

ఔజ్జ్వల్యం :

తా రాఘవం దృష్టిభి రాపిబంత్యో
నార్యో న జగ్ము ర్విషయాంతరాణి ।

తథా హి శేషేంద్రియ వృత్తిరాసాం
సర్వాత్మనా చక్షురివ ప్రవిష్టా ॥ -(ర.వం. VII-12)

— నగరప్రవేశమొనరించే అజమహారాజును చూసి నగరస్త్రీలు తదేక దృష్టితో అతనినే చూస్తూ తక్కిన విషయాలను తెలియకున్నారు; వారికి మిగిలిన ఇంద్రియవ్యాపారం సర్వవిధాల కన్నులయందే లగ్నమైనట్లున్నది.

ధార్మికత్వం :

స్థిత్యై దండయతో దండ్యాన్ పరిణేతుః ప్రసూతయే ।
అప్యర్థకామౌ తస్యాస్తాం ధర్మ ఏవ మనీషిణః ॥ (ర.వం. I-25)

— దిలీపుడు లోకప్రతిష్ఠకొరకు శిక్షింపదగినవారిని శిక్షిస్తాడు, సంతానార్థం వివాహం చేసుకొన్నాడు. ఈ రీతిని అర్థ-కామాలు, ధర్మవిషయమందే ప్రవర్తిల్లినవి.

కృతజ్ఞత్వం :

ఏకస్యైవోపకారస్య ప్రాణాన్ దాస్యామి తే కపే ।
ప్రత్యహం క్రియమాణస్య శేషస్య ఋణినో వయమ్ ॥

— ఓవానరోత్తమా! నీవొనర్చు ఒక్క ఉపకారానికే నా ప్రాణాలు ఇస్తాను. ప్రతిదినం మీరు చేసే ఉపకారాలకు మేము నీకు ఋణపడియే ఉంటాము.

శుచిత్వం :

కా త్వం శుభే! కస్యపరిగ్రహోవా
కిం వా మదభ్యాగమ కారణం తే ।
ఆచక్ష్వ మత్వా వశినాం రఘూణాం
మనః పరస్త్రీవిముఖప్రవృత్తి ॥ -(ర.వం. XVI-8)

— (అర్ధరాత్రి తన శయనమందిరంలో ప్రవేశించిన రాజ్యలక్ష్మితో కుశ మహారాజు) "అమ్మా! నీవెవ్వతెవు? నీవు ఎవ్వరి భార్యవు? నాయొద్దకు వచ్చినపనియేమి? రఘువంశీయుల శీలమును గుర్తించియు, వారిమనస్సు పర స్త్రీపరాఙ్ముఖమగుట ఎరిగియు— నీవు చెప్పదలచినది చెప్పుము".

ప్రజారంజకత్వం :

అహ మేవ మతో మహీపతే
రితి సర్వః ప్రకృతి ష్వచింతయత్ ।
ఉదధే రివ నిమ్నగాశతే
ష్వభవ న్నాస్య విమాననా క్వచిత్ ॥ (ర.వం. VIII-8)

– ప్రకృతులలో ఒక్కొక్కడు- "నేనేరాజునకిష్టుడను, నేనే ఇష్టుడను" అని తలంచుచుండిరి. కాని, సముద్రుడు సర్వనదులను గ్రహించునట్లు ప్రకృతుల నందరిని ఆ అజమహారాజు సమానంగా గారవించినాడు; ఒక్కనిని కూడా తక్కువ చేయలేదు.

త్యాగం :

త్వచం కర్ణః శిబి ర్మాంసం జీవం జీమూతవాహనః ।
దదౌ దధీచి రస్థీని నాస్త్యదేయం మహాత్మనామ్ ॥

–చర్మం కర్ణుడు, మాంసం శిబి, జీవం జీమూతవాహనుడు, అస్థిని దధీచి ఇచ్చినారు. మహాత్ములు ఇవ్వరానిదేదీ ఉండదు.

స్థిరత్వం :

ప్రారభ్యతే నఖలు విఘ్నభయేన నీచైః
ప్రారభ్య విఘ్ననిహతా విరమంతి మధ్యాః ।
విఘ్నైః పునః పున రపి ప్రతిహన్యమానాః
ప్రారబ్ధ ముత్తమజనా న పరిత్యజంతి ॥

(భర్తృహరిశతకం- నీతిశతకం-73)

– అరంభింపరు నీచమానవులు విఘ్నాయాస సంత్రస్తులై
అరంభించి పరిత్యజింతు రురువిఘ్నాయత్తులై మధ్యముల్
ధీరుల్ విఘ్ననిహన్యమానులగుచున్ ధృత్యున్నతోత్సాహులై
ప్రారబ్ధార్థము లుజ్జగింపరు సుమీ ప్రజ్ఞానిధుల్ గావునన్.
(ఏనుగు లక్ష్మణకవి అనువాదం).

ప్రజ్ఞ :

యద్య త్ప్రయోగవిషయే భావిక ముపదిశ్యతే మయా తస్యై ।
తత్త ద్విశేష కరణాత్ ప్రత్యుపదిశతీవ మే బాలా ॥

(మా.మి. I-5)

–ప్రయోగవిషయంలో భావికమును గూర్చి నేను ఏమి ఉపదేశించానో, ఆయా అంశాలను అంతకంటె అతిశయంగా నిర్వర్తించి, అబాల నాకు తిరిగి ఉపదేశిస్తున్నదా అనిపిస్తున్నది. (నాట్యాచార్యుడు గణదాసుడు శిష్యురాలు మాలవికను గూర్చి చేసిన ప్రశంస).

## 3. పురుషుల యందలి సత్త్వభేదాలు :

మూలం : శోభా విలాసో మాధుర్యం స్థైర్యం గాంభీర్య మేవ చ ।
లలి-తౌదార్య-తేజాంసి సత్త్వభేదాస్తు పౌరుషాః ॥
-(నా.శా.XXII-33)

అర్థం : శోభా, విలాసః, మాధుర్యం, స్థైర్యం, గాంభీర్యం (ఏవచ), లలిత-ఔదార్య-తేజాంసి = శోభ, విలాసం, మాధుర్యం, స్థైర్యం, గాంభీర్యం, లలితం, ఔదార్యం, తేజస్సు (-ఈ ఎనిమిదిన్నీ); పౌరుషాః, సత్త్వభేదాః (తు) = పౌరుషములయిన (= పురుషులయందలి), సత్త్వభేదాలు (=సాత్త్విక గుణాలు).

తాత్పర్యం : *1. శోభ, 2. విలాసం, 3. మాధుర్యం, 4. స్థైర్యం, 5. గాంభీర్యం, 6. లలితం, 7. ఔదార్యం, 8. తేజస్సు- ఈ ఎనిమిదిన్నీ* పురుషులయందలి సత్త్వభేదాలు.

టీక : ఇవి అయత్నజాలైన పురుషుల అలంకారాలు. వీనిని 'నాయక గుణాలు' గా కూడా పేర్కొంటారు. ధనంజయ-సింగభూపాల-విశ్వనాథాదులు కూడా ఎనిమిది పౌరుషసాత్త్వికభావాలను ఇట్లే పేర్కొన్నారు. అంతేకాదు. 'నాయకగుణాలు' గా సుమారు 20 భేదాలను అధికంగా చెప్పినారు; వీనిని భర తముని చెప్పలేదు. ఈ ఎనిమిదింటిని వివరించిన పిమ్మట సింగభూపాలు డిట్లా పేర్కొన్నాడు: "పై వానిలో గాంభీర్య-ధైర్యములు రెండున్నూ చిత్తజములు. తక్కినవి శరీరజములు. కాని, కొందరు ఇవి, చిత్త-గాత్రజాలు రెండింటికిని సాధారణములే అని తలంచినారు" (ర.సు. I-219).

*(i) శోభ :*

మూలం : దాక్ష్యంశౌర్య మథోత్సాహో నీచార్థేషు జుగుప్సనమ్ ।
ఉత్తమైశ్చ గుణైః స్పర్ధా యతః శోభేతి సా స్మృతా ॥
-(నా.శా. XXII-34)

అర్థం : దాక్ష్యం, శౌర్యం (అథ), ఉత్సాహః, నీచ అర్థేషు జుగుప్స నమ్, ఉత్తమైః (చ) గుణైః, స్పర్ధా = సర్వకార్యములందు దక్షత, శౌర్యం, ఉత్సాహం, నీచార్థములందు జుగుప్స, ఉత్తముల (= అధికుల) గుణాలతో

స్పర్ధ; యత్ర, సా, శోభా-ఇతి, స్మృతా = (ఈ గుణాలు), ఎక్కడనో, అది, శోభ అని, చెప్పబడింది.

తాత్పర్యం : దక్షత, శౌర్యం, ఉత్సాహం, నీచ విషయములందు ఏవగింపు, ఉత్తముల గుణములను మించవలెననెడి పట్టుదల-ఇవి కలిగి ఉండటం (= ప్రకటితం కావటం), 'శోభ' అవుతుంది.

టీక : యుద్ధమందు శూరత్వం, కార్యములందు దక్షత, గుణముల యందు అనురాగం, లౌకిక విషయములందు సాధుత్వం, సత్యవాదిత్వం- వీటి సముదాయం 'శోభ' (నా.ల.కో). 'నీచార్థేషు జుగుప్సా'- దీనికి బదులు ర.సు.లో 'నీచే దయా' (నీచుని యందు దయ) అని ఉన్నది (ర.సు. I-216). సింగభూపాలుడు కొన్ని పదాలకు అర్థాలు కూడా ఇచ్చినాడు :

శౌర్యం = సత్త్వ (= బల) సారం.

స్థైర్యం = ఉత్సాహం (= ఎట్టి పరిస్థులలోనూ చలించకుండా ఉండటం).

దక్షత = క్షిప్రకారిత్వం (= పనులను వేగంగా పూర్తి చేయగలగటం).

ఉదా : క్షుద్రాః సంత్రాస మేనం విజహత హరయో! భిన్నమత్తేభకుంభా
యుష్మద్గాత్రేషు లజ్జాం దధతి పరమమీ సాయకా స్సంపతంతః ।
సౌమిత్రే! తిష్ఠ పాత్రం త్వమపి నహి రుషాం నన్వహం మేఘనాదః
కించి ద్భ్రూభంగలీలానియమితజలధిం రామ మన్వేషయామి ॥
(హనుమన్నాటకం)

ఓ నీచవానరములారా! భయం వలదు; మత్తమాతంగాల కుంభాలు కూల్చిన ఈ బాణాలు మీదేహాలపై పడటానికి లజ్జిస్తున్నవి. ఓ లక్ష్మణా! నాకోపానికి నీవును స్థానమవు కావు. మేఘనాదుడనగు నేను, కొంచెపు బొమముడిపాటుతో సముద్రాన్ని స్తంభింపజేసిన రామునికొరకు వెదకుతున్నాను.

పై శ్లోకంలో మొదటి సగమందు ఇంద్రజిత్తునకు కపులయెడ దయ, రెండవ సగమున రాముని తోడి స్పర్ధ వ్యక్తములవుతున్నవి.

(ii) విలాసం :

మూలం : ధీరసంచారిణీ దృష్టి ర్గతి ర్గోవృషభాంచితా ।
స్మితపూర్వ ముఖాలాపో విలాస ఇతి కీర్తితః ॥
(నా.శా. XXII-35)

అర్థం : ధీరసంచారిణీ దృష్టిః=ధీరంగా ప్రసరించే దృష్టి; గోవృషభాంచితా గతిః = వృషభ (=ఆంబోతు) గతివంటి గతి; (అథ) స్మితపూర్వం, ఆలాపః =మందహాసంతో కూడిన మాటలు— ఇవి కలిగి ఉండటం; విలాసః, ఇతి, కీర్తితః='విలాసం' అని చెప్పబడింది.

తాత్పర్యం : సూటిగా చూసే దృష్టి, గంభీరమైన గతి, చిరునవ్వుతో కూడిన మాటలు- ఇవి కలిగి ఉండటం లేదా ప్రకటితం కావటం 'విలాసం'.

ఉదా : గంభీరగమనం—

మూలం : తానర్ఘ్యానర్ఘ్యమాదాయ దూరం ప్రత్యుద్యయౌ గిరిః ।
నమయన్ సారగురుభిః పాదన్యాసై ర్వసుంధరామ్ ॥
(కు.సం.VI-50)

— హిమవంతుడు, చేతిలో అర్ఘ్యం పట్టుకొని, మిక్కిలి బలమైన అడుగుల చేత భూమిని వంగజేస్తూ, పూజార్హులైన మునులకు ఎదురువచ్చినాడు.

స్మితపూర్వాలాపం—

మూలం : జ్యోతిస్తాంతస్సుభైః కుందకుట్మలాగ్రదతః స్మితైః ।
స్నపితే వాభవత్తస్య శుద్ధవర్ణా సరస్వతీ ॥
(శిశుపాలవధ-II)

— మల్లె మొగ్గలవంటి అగ్రాలు కల దంతాలు కల అతని (=శ్రీకృష్ణుని) చిరునవ్వు చేత, సభామధ్యం వెలుగు లీనింది. అందతని శద్ధవర్ణమగు వాక్కు స్నానం చేసిన దానివలె అయినది.

(iii) మాధుర్యం :

మూలం : అభ్యాసా త్కరణానాం తు శ్లిష్టత్వం యత్ర జాయతే ।
మహత్స్వపి వికారేషు తన్మాధుర్య మితి స్మృతమ్ ॥
-(నా.శా.XXII-36)

అర్థం : అభ్యాసాత్, మహత్సు-అపి-వికారేషు, కరణానాం (తు), యత్ర, శ్లిష్టత్వం, జాయతే = అభ్యాసపాటవం వల్ల, మహా వికారము (= సంక్షోభము) లందు కూడా, చేష్టలలో, ఎక్కడ, శ్లిష్టత్వం (=అనుల్బణత్వం=సంక్షోభంలేకుండటం) ఉంటుందో; తత్, మాధుర్యం, ఇతి, స్మృతం = అది, మాధుర్యం, అని, చెప్పబడినది.

**తాత్పర్యం** : చిరకాలాభ్యాసం చేత, మహాసంక్షోభములందు కూడా, చేష్ట లలో శ్లిష్టత్వం కలిగి ఉండటం మాధుర్యం.

**టీక** : యుద్ధ-నియుద్ధాది వికారాదులలో, అభ్యాసపాటవం చేత కర-చర ణాది క్రియలు అనుల్బణంగా చూపటం 'మాధుర్యం' అని అభినవగుప్తుడు.

మహాసంక్షోభములందు కూడా వికారం అల్పంగా ప్రకటితం కావటం మాధుర్యం అని ధనంజయుడు (ద.రూ. II-*12*). ప్రస్తుత రూపం నుంచి, రూపాంతరం పొందటం 'వికారం' అని నాట్యదర్పణకర్తలు. చేష్టలు, ఆలాపం, స్పర్శ-వీని యందలి స్పృహణీయత 'మాధుర్యం' అని శారదాతన యుడు. చేష్ట, దృష్టి మున్నగు వానియందలి స్పృహణీయత (= అభిలషింప దగుటం) మాధుర్యం అని సింగభూపాలుడు.

**ఉదా** : సింగభూపాలోదాహరణ :

**మూలం** : ఋజుతాం నయతః స్మరామితే శర ముత్సంగ నిషణ్ణధన్వనః ।
మధువా సహ సస్మితాం కథాం నయనోపాంత విలోకితం
చ యత్ ॥
(కు.సం. IV-*23*)

(ఓ మన్మథా!) ఉత్సంగమునందుంచుకొన్న ధనుస్సునకు ఋజుత్వం కలిగిస్తూ వేసిన నీ శరాన్ని మిత్రుడగు వసంతునితో జరిపే చిఱునవ్వు తోడి నీ సంభాషణమును, నీ క్రీగంటి చూపును స్మరిస్తున్నాను.

(iv) స్థైర్యం :

**మూలం** : ధర్మార్థ కామ సంయుక్తా చ్ఛుభాశుభసముత్థితాత్ ।
వ్యవసాయా దచలనం స్థైర్య మిత్యభిసంజ్ఞితమ్ ॥
-(నా.శా.XXII-37)

**అర్థం** : ధర్మ-అర్థ-కామ సంయుక్తాత్=ధర్మం, అర్థం, కామం (అనే పురుషార్థాలకు) సంబంధించి; శుభ-అశుభసముత్థితాత్ = శుభకరంగా లేదా అశుభకరంగా (ఫలితం వచ్చినా); వ్యవసాయాత్-అచలనం=వ్యవసాయం (=పూనిక) నుంచి చలించకపోవటం; స్థైర్యం, ఇతి, అభిసంజ్ఞితమ్ =స్థైర్యం, అని, పిలువబడింది.

**తాత్పర్యం** : ధర్మ-అర్థ-కామములందలి పూనిక, ఫలితం శుభకరమైనా, అశుభకరమైనా, స్థిరంగా ఉండటం 'స్థైర్యం'.

టీక : అనేక విఘ్నాలు సంభవించినా తన పూనిక నుంచి చలింపకుండటం స్థైర్యం అని ధనంజయుడు (ద.రూ. II-13).

శారదాతనయ విశ్వనాథాదులు ఈ గుణాన్ని 'ధైర్యం' గా పేర్కొన్నారు. సింగభూపాలుడు రెండు పదాలను వాడినాడు - "ఫలప్రాప్తి పర్యంతం వ్యాపారం (= ప్రయత్నించటం) స్థైర్యం" అని సింగభూపాలుడు (ర.సు.I-65).

ఉదా :

> న నవఃప్రభు రాఫలోదయాత్
> స్థిరకర్మా విరరామ కర్మణః ।
> న చ యోగవిధే ర్న వేతరః
> స్థిరధీ రాపరమాత్మదర్శనాత్ ॥ (ర.వం. VIII-22)

— (కుమారుడైన అజమహారాజును సింహాసనమందునిల్పి, తండ్రి అయిన రఘుమహారాజు తపస్సునకు వెళ్లినాడు) ఆ క్రొత్త ప్రభువు (అజుడు) స్థిరకర్ముడయి, ఫలం లభించేవరకు తన కర్మనుంచి విరమించలేదు. ఇంక ప్రాత రాజైన రఘువు స్థిరప్రజ్ఞుడై పరమాత్మ గోచరించేవరకు తనయోగ సమాధిని విరమించలేదు.

(v) గాంభీర్యం :

మూలం : యస్య ప్రభావా దాకారా హర్ష-క్రోధ-భయాదిషు ।
భావేషు నోపలక్ష్యంతే తద్గాంభీర్య మితి స్మృతమ్ ॥
-(నా.శా.XXII-38)

అర్థం : హర్ష-క్రోధ-భయాదిషు, భావేషు = హర్షం, క్రోధం, భయం మున్నగు భావములందు; ఆకారా, యస్య ప్రభావాత్, న-ఉపలక్ష్యంతే = ఆయా భావాలకు ఉచితములైన ఆకారాలు (= ముఖంలో హర్షం, క్రోధం, భయం మున్నగు భావాలు), దేని ప్రభావం (= ఏ గుణం) వల్ల కన్పట్టవో; తత్, గాంభీర్యం, ఇతి, స్మృతం = అది, గాంభీర్యం, అని చెప్పబడింది.

తాత్పర్యం : హర్ష-క్రోధ-భయాది భావాలు కలిగినప్పుడు, తత్తదుచితములైన ఆకారాలు లేదా మార్పులు (ముఖంలో) కన్పట్టకపోవటం 'గాంభీర్యం'.

టీక : దేని ప్రభావం (= ఏ గుణం) చేత వికారం కన్పట్టదో అది గాంభీర్యం అని ధనంజయుడు. మాధుర్యంలో అల్పంగా వికారం ఉంటుంది;

అసలు వికారమే కన్పట్టని గాంభీర్యం మాధుర్యం కంటె భిన్నమైనది (ద.రూ.II-12).

ఉదా : దధతో మంగళక్షౌమే వసానస్య చ వల్కలే।
దదృశు ర్విస్మితా స్తస్య ముఖరాగం సమం జనాః॥
(ర.వం. XII-8)

— (అభిషేకార్థం) మంగళకరములైన దుకూలాలు ధరించినప్పుడు, (వనవాస ప్రయాణం కోసం) నారచీరలు కట్టుకొన్నప్పుడు కూడా ఒక్క రీతి ముఖవికాసం గల అతనిని (= రాముని) చూసి ప్రజలు విస్మితులైనారు!

(vi) లలితం :

మూలం : అబుద్ధిపూర్వకం యత్తు నిర్వికారస్వభావజమ్।
శృంగారాకార చేష్టత్వం లలితం తదుదాహృతమ్॥
-(నా.శా. XXII-39)

అర్థం : యత్ (తు) = ఏది, అబుద్ధి పూర్వకం, నిర్వికార స్వభావజమ్ = ప్రయత్నం లేకయే, ఏవికారం లేని స్వభావమందు (=సహజంగా) పుట్టిన; శృంగార-ఆకార-చేష్టత్వం = శృంగారపరమైన ఆకారం, చేష్టలు కలిగి ఉండటం; యత్ (తు), తత్ = ఏదో, అది; లలితం, ఉదాహృతం = లలితం (అని), చెప్పబడింది.

తాత్పర్యం : అప్రయత్నంగా, నిర్వికారమైన స్వభావంలో జనించిన, శృంగార-ఆకార-చేష్ట 'లలితం' అనబడుతుంది.

చర్చ : 'అబుద్ధిపూర్వకం' అంటే "శృంగారానుకూలమైన స్వాభావిక స్వయంచేష్ట" అనీ, 'చేష్ట' అంటే వెనుకకు తిరిగి చూడటం, వక్రోక్తి భాషణం, శరీర సంస్కారం మున్నగునవి అనీ నాట్యదర్పణకర్తలు (పుట 375).

ఉదా : కపోలే జానక్యాః కరికలభదంతద్యుతిముషి
స్మరస్మేరం గండోడ్డమరపులకం వక్త్రకమలం।
ముహుః పశ్యన్ శృణ్వన్ రజనిచరసేనాకలకలం
జటాజూటగ్రంథిం ద్రఢయతి రఘూణాం పరివృఢః॥
(హనుమన్నాటకం - I-[illegible])

— శ్రీరాముడు - సీతయొక్క కరికలభములదంత కాంతిని దొంగిలించే (తెల్లని) కపోలాలను, స్మరస్మేరమయి గండములపై వ్యాపించే పులకలు గల ముఖపద్మాన్ని ఒకవంకచూస్తూ, (వేరొకవైపు) రాక్షససేనా కలకలాన్ని వింటూ, తన జడముడిని గట్టిగా బంధించినాడు.

*(vii)* ఔదార్యం :

మూలం : దాన మభ్యుపపత్తిశ్చ తథా చ ప్రియభాషణమ్ ।
స్వజనే పరే వాపి తదౌదార్యం ప్రకీర్తితమ్ ॥
-(నా.శా.XXII-40)

అర్థం : దానం, అభ్యుపత్తిః (చ), (తథా) (చ) ప్రియభాషణమ్, స్వజనే, పరే (వా) (అపి) = స్వజనుల యందు లేదా పరజనుల యందు (= మిత్ర-శత్రుభేదం లేకుండా), దానం, అభయప్రదానం, ప్రియభాషణం చేయటం; తత్=అది; ఔదార్యం, ప్రకీర్తితమ్= ఔదార్యం (అని), చెప్పబడింది.

తాత్పర్యం : దానంకాని, అభయప్రదానం కాని, ప్రియభాషణం కాని స్వ-పరభేదం లేకుండా చేయుటం 'ఔదార్యం'.

టీక : ప్రియవచన పూర్వకంగా జీవన పర్యంతం దానంచేయుటం, సదుపగ్రహం (=సజ్జనులను సంతుష్టిపర్చటం లేదా అనుకూలం చేసుకొనటం) ఔదార్యం-అని ధనంజయుడు (ద.రూ. II-*14*). ప్రియాలాపంతో, సస్మితంగా దానం చేయటం ఔదార్యం అని శారదాతనయుడు. విశ్రాణనశాలిత్వం (=దానంచేసే స్వభావం) ఔదార్యం అని సింగభూపాలుడు (ర.సు. I-*64*.

ఉదా : జనస్య సాకేత నివాసిన స్తౌ
ద్వా వప్యభూతా మభినంద్యసత్త్వౌ ।
గురుప్రదేయాధిక నిఃస్పృహోఽర్థీ
నృపోఽర్థికామాదధిక ప్రదశ్చ ॥
(ర.వం. v-*31*)

— సాకేతనగరమందలి జనులందరికీ గురువుకీయవలసిన ధనం కంటె అధికంగా ఒల్లని అర్థయాచకుడు (=కౌత్సుడు), యాచకుడడిగిన దానికంటె అధికంగా ఇచ్చే ఆ ప్రభువు (= రఘువు) - ఈ ఇరువురును కొనియాడదగిన ఉత్తమగుణాలు కలవారైనారు.

*(viii)* తేజం (=తేజస్సు) :

మూలం : అధిక్షేపావమానాదేః ప్రయుక్తస్య పరేణ యత్ ।
ప్రాణాత్యయేఽప్యసహనం తత్తేజః సముదాహృతమ్ ॥
-(నా.శా. XXII-41)

అర్థం : పరేణ, ప్రయుక్తస్య, అధిక్షేప-అవమానాదేః = శత్రువుల చేత ప్రయుక్తమైన (= శత్రువులు చేసిన), అధిక్షేపం, అవమానం మున్నగువాటిని; ప్రాణాత్యయే, అపి, అసహనం,యత్ = ప్రాణాత్యయమందు కూడా (= ప్రాణం పోయినా సరే) సహింపలేకపోవటం, ఏదో; తత్, తేజః, సముదాహృతం = అది, తేజస్సు, (అని) చెప్పబడినది.

తాత్పర్యం : శత్రుకృతమైన అధిక్షేపాన్ని కానీ, అవమానాన్ని కానీ ప్రాణాత్యయమందు కూడా సహింపలేక పోవటం తేజం (= తేజస్సు) అవుతుంది.

టీక : ఇతరులు అవమానించినా, అధిక్షేపించినా, ప్రత్యవాయం ఎదురు అయినా, ప్రారంభించిన పనినుంచి వెనుదిరుగకపోవటం 'తేజం' అని సాగరనంది (నా.ల.కో-పుట.142)

ఉదా : (నా.శా. అనుగుణమైనది) :

న తేజ స్తేజస్వీ ప్రసృతమపరేషాం విషహతే
స తస్య స్వో భావః ప్రకృతినియతత్వా దకృతకః ।
మయూఖైః రశ్రాంతం తపతి యది దేవో దినకరః
కిమాగ్నేయో గ్రావానికృత ఇవ తేజాంసి వమతి ॥
(ఉ.రా.చ. vi-7)

– (చంద్రకేతువు లవుని పరిచయం చేసినప్పుడు రాముడు) "తేజోవంతుడు పరుల తేజస్సును సహించలేడు, అది వానికి సహజగుణం. దినకరుడు అశ్రాంతం తన కిరణాలతో తపింపజేయగా, సూర్యకాంతశిల, సూర్యుని ధిక్కరించే దానివలె తేజస్సు వెళ్ళగ్రక్కుతూ ఉంటుంది."

## 4. పురుషులలో యౌవనభేదాలు :

మూలం : అరభ్య షోడశా ద్వర్షా ద్ద్వాత్రింశ ద్వత్సరావధి ।
యౌవనం పురుషాణాం తు తథా యౌవన చేష్టితమ్ ॥
సాధారణ్యేన సర్వేషా మేకరూప మితి స్మృతం ।

తదేవ సంపత్ప్రకృతి గుణాది పరివర్ధితమ్ ॥
తత్ర ద్విశేషత స్త్రేషు విశిష్ట మివ దృశ్యతే ।

(భా.ప్ర.v-25-27)

తాత్పర్యం : పురుషులకు *16* వ సంవత్సరం మొదలు *32* వ సంవత్సరం వరకు యౌవనం, యౌవనచేష్టితం ఉంటాయి. సాధారణంగా సర్వజనుల యందు యౌవనం ఇట్లాగే ఏకరూపంగానే ఉంటుంది. ఈ యౌవనం సంపదల చేత, వారి వారి ప్రకృతులను పట్టి, గుణాదుల చేత పరివర్ధితమవుతుంది; ఆయా విశేషాల వల్ల, వారలలో అది విశిష్టంగా గోచరిస్తూ ఉంటుంది.

టీక : భరతాదులు స్త్రీలలోని నాలుగు యౌవన భేదాలు వివరించినారేకాని, పురుషుల విషయం ప్రస్తావించలేదు. శారదాతనయుడొక్కడే ఈ విషయాన్ని వివరించినాడు.

## 5. నాయకభేదాలు :

టీక : 1. నా.శా.లో, 24 వ అధ్యాయంలో భరతముని స్త్రీ-పురుషులందరిని, వారి వారి ప్రకృతులను (=స్వభావాలను) పట్టి ముచ్విధాలుగా విభజించినాడు:

1) ఉత్తములు, 2) మధ్యములు, 3) అధములు.

వీరిలో ఉత్తములను జ్యేష్ఠులు అనీ, అధములను కనిష్ఠులు లేదా నీచులు అనీ అంటారు.

2. ఉత్తమ-మధ్యమ ప్రకృతులలో నానా లక్షణ లక్షితులయిన నాయకులు నాలుగు విధాలుగా ఉంటారని కూడా భరతముని పేర్కొన్నాడు. (నా.శా. XXIV-17-30):

ధీరోద్ధతనాయకులు-దివ్యులు.

ధీరలలిత నాయకులు-నృపులు.

ధీరోదాత్తనాయకులు-సేనాపతి-అమాత్యులు.

ధీరప్రశాంతనాయకులు-బ్రాహ్మణ-వణిజులు. (ఈ నలుగురకు సరి అయిన నాయికలను కూడా భరతముని పేర్కొన్నాడు).

ధనంజయాదులు ఈ నాలుగు భేదాలను భరతుని అనుసరించి వివరించి నప్పటికీ, వారి నిర్వచనాలు, వివరణలు భరతముని నిర్వచనాదుల కంటె భిన్నంగా ఉన్నవి.

3. కామతంత్ర మందరి (=స్త్రీ సంప్రయోగ విషయంలో) పురుషులు అయిదు విధాలని కూడా భరతముని వివరించినాడు (XXIII-52-62): చతురుడు, ఉత్తముడు, మధ్యముడు, నీచుడు, సంప్రవృత్తకుడు-వీరు ఒకరి కంటె ఒకరు, వరుసగా, స్థాయిలో తక్కువవారు. వీరినే కాక 'వైశికుడు' అనే ఆరవ భేదాన్ని కూడా చాలా విపులంగా వివరించినాడు భరతముని. ఉత్తమ-మధ్యమ-అధమ భేదాలు వైశికునకు కూడా వర్తించగలవని కొందరి అభిప్రాయం.

4. స్వభావాన్ని పట్టి నాయకులు మువ్విధాలుగా ఉంటారని భోజుడు వివరించినాడు : (1) సాత్త్విక పురుషులు, (2) రాజసిక పురుషులు, (3) తామసికపురుషులు; వీరిలో సాత్త్విక పురుషుడు ఉత్తముడనీ, ధీరోదాత్తుడనీ, అట్లాగే రాజసిక పురుషుడు మధ్యముడనీ ధీరోద్ధతుడనీ చెప్పవచ్చు. ప్రాచీనాలంకారికుల మతం ప్రకారం అధముడైన తామసిక పురుషుడు ఉత్తమ కావ్య-నాటకాలలో నాయకుడుగా ఉండదగిన వాడుకాదు.

5. అర్వాచీనాలంకారికులు శృంగారపరంగా కొన్ని నూత్నకల్పనలు చేసినారు. అందులో ఒక విభజన ప్రకారం నాయకులు మూడు విధాలు:

పతి, ఉపపతి (= ప్రచ్ఛన్నపతి), వైశికుడు (= కళల యందు విశేషించినవాడు). ఎవ్వడేనా, ఈ మూడు భేదాలు, ఒకే నాయకునకు వర్తించగలవు-శాస్త్ర విహితంగా వివాహమైన భార్యకు పతి, పరకీయాసంగమం చేత ఉపపతి, వేశ్యాసంగమంచేత వైశికుడు కాగలడు.

6. శృంగార పరంగా చేయబడిన ఇంకో ప్రధాన విభజన ప్రకారం నాయకులు నాలుగు విధాలు :

అనుకూలుడు : ఏకపత్నీవ్రతుడు (రాముడువలె).

దక్షిణుడు : బహుభార్యలున్నా, అందరినీ సమానంగా చూసేవాడు (కృష్ణుడువలె).

శఠుడు : భార్యపట్ల వంచనకు పాల్పడి, పైకి గౌరవంగా మెలగేవాడు.

ధృష్టుడు : భార్యపట్ల తనవంచన బయల్పడినప్పటికీ సిగ్గుపడనివాడు.

7. కొందరాలంకారికులు అనుకూలాది నాలుగు భేదాలకు మాని, చతురుడు అనే మరో రెండు భేదాలు చేర్చినారు. కొందరు, ఈ రెండు భేదాలను శఠునకు

చెప్పగా, మరికొందరు ధృష్టునకుచెప్పినారు. శృంగారమంజరీకర్త మాత్రం వీనిని క్రొత్తభేదాలుగానే వివరించినాడు. ఇంక కొందరు అనభిజ్ఞుడు లేదా గ్రామ్యుడు అనే భేదం కల్పించినారట; కాని, ఇతడు రసాభాసోదాహరణ అవుతాడు కాబట్టి, వీనిని నాయకుడుగా ఎవ్వరూ అంగీకరించలేదు.

8. శృంగారమంజరీకర్త ఇంకోవిధమైన విభజన కూడా చేసినాడు-- ప్రోషితుడు, అమిలితుడు, విరహి. ఈ విభజన తత్సదృశలయిన నాయికలను దృష్టిలో పెట్టుకొని చేసినట్లున్నది.

9. కొందరు, రూపకనాయకులను ముప్విధాలుగా విభజించినారు-- దివ్యులు (= ఇంద్రాదులు), అదివ్యులు (= రాజులు), దివ్యాదివ్యులు (= రామాదులు).

10. కేవలం కామశాస్త్రప్రోక్తమై, క్రమంగా అలంకారశాస్త్రంలోకి తొంగి చూసిన ఇంకో విభజన ఉంది:

పాంచాలుడు : కళాకుశలుడు, సుకుమారుడు.

కూచుమారుడు : మందుమాకుల ప్రయోగంలో దిట్ట.

దత్తకుడు : వేశ్యాతంత్రంలో నిపుణుడు (ఇతడు వైశికతుల్యుడు).

భద్రుడు : శృంగార చేష్టలలో అతిగా ఉండేవాడు.

11. కేవలం కామశాస్త్రాలకే పరిమితమయిన విభజన :

శశ-వృష-మృగ-అశ్వజాతులవారు.

12. మదనాశ్రయమైన సమాగమమందు నాయికలు నాయకుల విషయంలో ఉపయోగింపదగిన 14 పదాలను వివరించినాడు భరతముని. ఇందులో ప్రియ-కాంతాది పదాలు ఏడు ప్రీతి సూచకాలు; ఇంక దుఃశీలాది పదాలు ఏడు అప్రీతి సూచకాలు. ఈ సంబోధనలు ఆయా నాయకుల స్వభావాలను సూచించేవిగా ఉన్నవి (నా.శా. XXII-301-319).

ఆయా అలంకారికులు సర్వసామాన్యంగా చెప్పిన భేదాలమొత్తం క్రింది విధంగా ఉంటుంది:

ఉత్తమాది భేదాలు- 3X ధీరోదాత్తాది భేదాలు 4 X అనుకూలాది భేదాలు- 4 =3X4X4=48.

ఉజ్జ్వలనీలమణి కర్త అయిన రూపగోస్వామి 96 భేదాలు చెప్పినాడు. పతి, ఉపపతి-2X ధీరోదాత్తాదులు -4X అనుకూలాదులు -4X పూర్ణ-పూర్ణతర-పూర్ణతములు -3=2X4X4X3=96.

భోజరాజు ప్రకారం 104 భేదాలు.

గుణాన్ని పట్టి-ఉత్తమాదులు-3;

ప్రకృతిని పట్టి-సాత్త్వికాదులు-3;

ప్రవృత్తిని పట్టి- అనుకూలాదులు-4;

పరిగ్రహాన్ని (భార్యలసంఖ్యను) పట్టి- సాధారణ (పలువురు భార్యలు) -అసాధారణ (ఒకేభార్య)-2

పై 12 భేదాలను ప్రధానభేదాలయిన ధీరోదాత్తాదులకు అన్వయించినప్పుడు-

ఉదాత్త-8 భేదాలు, ఉద్ధత-44 భేదాలు,

లలిత-44 భేదాలు, ప్రశాంత-8 భేదాలు -

మొత్తం 104 భేదాలు వస్తాయి.

## 6. ఉత్తమాది భేదాలు :

ప్రకృతిని లేదా శీలాన్ని లేదా స్వభావాన్ని పట్టి, స్త్రీ-పురుషులందరిని మువ్విధాలుగా విభజించి, వారి గుణాలు వివరించినాడు భరతముని : (i) ఉత్తములు, (ii) మధ్యములు, (iii) అధములు. ఇప్పుడు పురుషులలోని ప్రకృతిత్రైవిధ్యం నిరూపింపబడుతున్నది. (స్త్రీల ప్రకృతి త్రైవిధ్యం నాయికాప్రకరణంలో వివరింపబడగలదు). ఇటువంటి విభజన ఇతరులు చేసినట్లు కానరాదు. ఇంక నపుంసకాదులను మిశ్రప్రకృతులుగా పేర్కొన్నాడు భరతముని.

*(i) ఉత్తమప్రకృతి*

మూలం : జితేంద్రియా జ్ఞానవతీ నానాశిల్ప విచక్షణా ।
దక్షిణాథ మహాలక్ష్యా భీతానాం పరిసాంత్వనీ ॥
నానాశాస్త్రార్థ సంపన్నా గాంభీ-ర్యౌదార్య శాలినీ ।
స్థైర్య-త్యాగ గుణోపేతా జ్ఞేయా ప్రకృతి రుత్తమా ॥
-(నా.శా. XXIV-2-3)

అర్థం : జితేంద్రియా, జ్ఞానవతీ, నానా శిల్పవిచక్షణా=ఇంద్రియాలను జయించినది, జ్ఞానవతి, వివిధ కళలు తెలిసినది; దక్షిణా (-అథ), మహాలక్ష్యా, భీతానాంపరిసాంత్వనీ = దయలేదా నేర్పు కలది, గొప్ప లక్ష్యం కలది;

('మహాలక్ష్మ్యా' బదులు 'భోగదక్షా' = అని పాఠాంతరం), భయపడినవారిని వేదతీర్చేది; నానాశాస్త్ర-అర్థ సంపన్నా, గాంభీర్య-ఔదార్యశాలినీ = పలుశాస్త్రాలు, వాని అర్థాలు తెలియటం వల్ల సంపన్నమైనది, గాంభీర్యం-ఔదార్యం కలది; స్థైర్య-త్యాగగుణ-ఉపేతా = స్థిరత్వం, త్యాగం అనే గుణాలు కలది; ఉత్తమా ప్రకృతిః జ్ఞేయా= 'ఉత్తమ ప్రకృతి' అని తెలియవలెను.

తాత్పర్యం : జితేంద్రియ, జ్ఞానవతి, నానా శిల్పవిచక్షణ, దక్షిణ, మహాలక్ష్మీయుత, భయపడినవారిని సాంత్వన పరచేది, నానాశాస్త్రార్థ సంపన్న, గాంభీర్య-ఔదార్యశాలిని, స్థైర్య (లేదా ధైర్య)-త్యాగగుణోపేత అయిన ప్రకృతి 'ఉత్తమప్రకృతి'.

టీక : సంస్కృతభాషలో 'ప్రకృతి' అనే పదం స్త్రీలింగం; అందుచేత ప్రకృతి గుణాలన్నీ స్త్రీ లింగాంతాలుగానే చెప్పబడినవి. పుంలింగాంతాలుగా చెప్పవలెనంటే "జితేంద్రియుడు, జ్ఞానవంతుడు. . . . . " ఇట్లాచెప్పాలి. మధ్యమ ప్రకృతి గుణాలు కూడా ఇట్లాగే స్త్రీలింగాంతములుగా చెప్పబడినవి. కానీ, అధమ ప్రకృతి గుణాలు మాత్రం పుంలింగాంతాలుగా చెప్పబడినవి.

పైని చెప్పిన గాంభీర్య - ఔదార్య-స్థైర్య-త్యాగాలు ఇంతకుముందు చెప్పబడిన నాయకగుణాలే.

(ii) మధ్యమ ప్రకృతి :

మూలం : లోకోపకారచతురా శిల్పశాస్త్రవిశారదా ।
విజ్ఞానమాధుర్యయుతా మధ్యమా ప్రకృతిః స్మృతా ॥
-(నా.శా. XXIV-4)

అర్థం : లోక-ఉపచారచతురా, శిల్పశాస్త్రవిశారదా = లౌకిక వ్యవహారములందు దక్ష, కళలయందు-శాస్త్రములందు నిపుణ; విజ్ఞాన-మాధుర్య యుతా = విజ్ఞానశాలిని, మధుర స్వభావోపేత (అయినది); మధ్యమా ప్రకృతిః, స్మృతా= మధ్యమ ప్రకృతి, (అని) చెప్పబడినది.

తాత్పర్యం : లౌకిక వ్యవహారములందు దక్ష, కలా-శిల్ప-శాస్త్ర విశారద, విజ్ఞాన శాలిని, మధురస్వభావ అయినది మధ్యమ ప్రకృతి.

టీక : పురుషపరంగా చెప్పవలెనంటే - "లోకోపచార చతురుడు, శిల్ప-శాస్త్ర విశారదుడు. . . ." ఇట్లా చెప్పాలి.

*(iii)* అధమ ప్రకృతి :

మూలం : రూక్షా వచసి దుఃశీలాః కుసత్త్వాః స్థూలబుద్ధయః ।
క్రోధనా ఘాతకాశ్చైవ మిత్రఘ్నాశ్ఛిద్రమానినః ॥
[వృథారంభప్రసక్తాశ్చ యుక్త్యాంచ ద్వాదినోఽల్పకాః]
పిశునా హ్యుద్ధతా వాక్యై రకృతజ్ఞా స్తథాలసాః ।
మాన్యామాన్యావిశేషజ్ఞా స్త్రీలోలాః కలహప్రియాః ॥
సూచకాః పాపకర్మాణః పరద్రవ్యాపహారిణః ।
ఏభిః దోషైస్తు సంపన్నా భవంతి హ్యధమా నరాః ॥

(నా.శా. XXIV-5-7)

అర్థం : రూక్షావచసి, (అథ) దుఃశీలాః, కుసత్త్వాః, స్థూలబుద్ధయః = పరుషవాక్యాలు పలికేవారు, చెడుశీలం కలవారు, కుసత్త్వులు, స్థూల (= స్వల్ప) బుద్ధులు; క్రోధనా, ఘాతకాః (చ-ఏవ), మిత్రఘ్నాః, ఛిద్రమానినః = క్రోధనులు, ఘాతకులు, మిత్రఘ్నులు, ఛిద్రమానులు (= దోషాన్వేషణం చేసి తరింపచేవారు) [వృథా-ఆరంభప్రసక్తాః చ(అ), యుక్-తిర్యక్-వాదినః అల్పకాః ప్రయోజనరహితమునైన పనులు తలపెట్టువారు (తలపొగరుతో) తక్కువ మాటాడేవారు]

పిశునాః (తు), ఉద్ధతాః వాక్యైః, అకృతజ్ఞాః (తథా), అలసాః = పిశునులు (= క్రూరులు), కొట్టవచ్చినట్లు మాటాడేవారు, పొందిన ఉపకారంమరచేవారు, అలసులు; మాన్య- అమాన్య అవిశేషజ్ఞాః, స్త్రీలోలాః, కలహప్రియాః = మాన్యులు- అమాన్యులు అనే విశేషజ్ఞానం లేనివారు, స్త్రీలోలురు, కలహప్రియులు; సూచకాః, పాపకర్మాణః, పరద్రవ్యాపహారిణః = సూచకులు (= కొండెములు చెప్పేవారు), పాపకార్యాలు చేసేవారు. పరద్రవ్యాన్ని అపహరించేవారు; ఏభిః దోషైః (తు), సంపన్నా (ఇహ), అధమా నరాః, భవంతి = ఈ దోషాలతో నిండినవారు, అధమ మానవులు అవుతారు.

తాత్పర్యం : రూక్ష వాక్యయుతులు, దుశ్శీలురు, కుసత్త్వులు, స్థూలబుద్ధులు ('శల్యబుద్ధులు' అని పాఠాంతరం = కంటకంగా ఉండేవారు), క్రోధనులు, ఘాతకులు, మిత్రఘ్నులు, ఛిద్రమానులు, ప్రయోజనరహితములైన పనులు తలపెట్టేవారు, తలపొగరుతో తక్కువ మాటాడేవారు, పిశునులు, ఉద్ధత వాక్యోపేతులు, అకృతజ్ఞులు, అలసులు, మాన్య-అమాన్య విశేష జ్ఞాన రహితులు, స్త్రీలోలురు, కలహప్రియులు, సూచకులు, పాపకర్ములు, పరద్రవ్యాపహారులు- వీరు 'అధమప్రకృతి' కి చెందినవారు.

టీక : అధమ ప్రకృతికి చెందిన వారిలో పై గుణములన్నీ మూర్తీభవించి, ఒక్కనియందే ఉంటాయని తలంచరాదు; పై గుణాలలో ఏ కొన్ని గుణాలు ఉన్నా అతడు 'అధమ ప్రకృతి' యే అవుతాడు. ఉత్తముల విషయం అట్లాకాదు; వారియందు పైని చెప్పిన గుణసంపద అంతా సుసంపన్నమై ఉండాలి.

*(iv) మిశ్ర (= సంకీర్ణ) ప్రకృతి :*

మూలం : నపుంసకస్తు విజ్ఞేయః సంకీర్ణోఽధమ ఏవ చ ।
ప్రేష్యాది రపి విజ్ఞేయా సంకీర్ణా ప్రకృతి ర్ద్విజాః ॥
శకారశ్చ విటశ్చైవ యే చాన్యే ప్యేవమాదయః ।
సంకీర్ణాస్తేఽపి విజ్ఞేయా హ్యధమా నాటకే బుధైః ॥
-(నా.శా.XXIV-13-14)

తాత్పర్యం : నపుంసకుడు సంకీర్ణ ప్రకృతికాని, అధమ ప్రకృతి కాని అవుతాడు. ప్రేష్యాదులు కూడ సంకీర్ణ ప్రకృతులే. (= సహజమైన అధమత్వం, స్వామిని అనుసరించి ఉండటం వల్ల ఉత్తమత్వ ప్రాప్తి కలగటం చేత సంకీర్ణ లేదా మిశ్రప్రకృతులు). శకారుడు, విటుడు, ఇంకా ఇటువంటి వారు కూడా సంకీర్ణప్రకృతులే. అయితే నాటకమందు మాత్రము వీరెల్ల (= ప్రేష్య-విట-శకారాదులందరూ) అధమప్రకృతులే.

## 7. ధీరోదాత్తాది నాయకులు :

అత్ర చత్వార ఏవ స్యు ర్నాయకాః పరికీర్తితాః ।
మధ్యమోత్తమ ప్రకృతౌ నానాలక్షణ లక్షితాః ॥
ధీరోద్ధతా ధీరలలితా ధీరోదాత్తా స్తథైవచ ।
ధీరప్రశాంతకా శ్చైవ నాయకాః పరికీర్తితాః ॥
దేవాః ధీరోద్ధతా జ్ఞేయః స్యు ర్ధీరలలితా నృపాః ।
సేనాపతి రమాత్యశ్చ ధీరోదాత్తా ప్రకీర్తితా ।
ధీరప్రశాంతా విజ్ఞేయా బ్రాహ్మణా వణిజ స్తథా ॥
ఏతేషాం చ పునః జ్ఞేయా శ్చత్వారం చ విదూషకాః ।
లింగీ ద్విజో రాజజీవి శిష్యశ్చేతి యథాక్రమమ్ ॥
దేవ క్షితిభృ తామాత్య-బ్రాహ్మణానాం ప్రయోజయేత్ ।
విప్రలంభ సుహృదోఽమీ సంకథాలాపపేశలాః ॥
-(నా.శా. XXIV-16-21)

"మధ్యమ-ఉత్తమ ప్రకృతులలో నానా లక్షణలక్షితులగు నాయకులు నాలుగు విధాలుగా ఉంటారు–" అని చెప్పి భరతముని వారిని, వారికి తగిన నలుగురు విదూషకులను ఇట్లా పేర్కొన్నాడు:

| నాయకులు : | వ్యక్తులు : | విదూషకులు : |
|---|---|---|
| 1. ధీరోద్ధతనాయకులు : | దివ్యులు : | లింగి(=ఋషి). |
| 2. ధీరలలితనాయకులు : | నృపులు : (=రాజులు) | ద్విజుడు. (=బ్రాహ్మణుడు) |
| 3. ధీరోదాత్తనాయకులు : | సేనాపతులు, అమాత్యులు : | రాజజీవి. |
| 4. ధీరప్రశాంతనాయకులు : | బ్రాహ్మణులు, వణిజులు : | శిష్యులు. |

ఈ విదూషకులు మంచి కథలను చెప్పుట యందు నిపుణులై, ఆయా నాయకులకు విప్రలంభమందు మిత్రులుగా ఉంటారు.

భరతముని చేసిన ధీరోదాత్తాది నాయకవిభజనను అర్వాచీనులందరూ అంగీకరించినప్పటికీ, భరతముని ఇచ్చిన నిర్వచనాలను మాత్రం ఎవ్వరూ అంగీకరించలేదు. ధనంజయాదులు ధీరోదాత్తుని ఉత్తమ నాయకునిగా పేర్కొన్నారు; అతడు సాధారణంగా రాజు అయి ఉంటాడు. భోజరాజు, శృంగారప్రకాశంలో, ధీరోదాత్తాది భేదాలను చతుర్విధపురుషార్థ సహితమయిన శృంగారపరంగా అన్వయించినాడు:

ధీరోదాత్తుడు : ధర్మశృంగారం.

ధీరోద్ధతుడు : అర్థశృంగారం.

ధీరలలితుడు : కామశృంగారం.

ధీరశాంతుడు : మోక్షశృంగారం.

నాట్యదర్పణకారులు భరతుని అనుసరించినప్పటికీ, రాజులు మాత్రం ఉదాత్తాది నాలుగు అవస్థలు కలిగి ఉంటారని పేర్కొన్నారు.

శారదాతనయుడు కూడా భరతుని అనుసరించినప్పటికీ ధీరలలిత, ధీరోదాత్త నాయకులను వ్యత్యస్తంగా చెప్పినాడు; అంటే వీని దృష్టిలో నృపాదులు ధీరోదాత్తులు, అమాత్యసేనాపతులు ధీరలలితులు. అంతేకాదు కథావశాన, రసవశాన ఈ నాయకులు వ్యత్యస్తులు కావటం కూడా కద్దు అని పేర్కొన్నాడు (భా.ప్ర. IX-284-85).

"ధీరోదాత్తాది నాయకులు నలుగురు సర్వరస సాధారణులు అయి నప్పటికీ యథాక్రమంగా వీర- రౌద్ర-శృంగార-శాంత ప్రధానులని వక్ష్యమాణ లక్షణ పర్యాలోచనం వల్ల స్పష్టం కాగలదు" అని ప్రతాపరుద్రయశోభూషణ వ్యాఖ్య (ప్ర.రు.య.I-31). ఈ సందర్భంలో ధనికాది వ్యాఖ్యాతల వివరణలు ఇట్లా ఉన్నవి: ఈ ధీరోదాత్తాది సంజ్ఞలు గుణ విశిష్టతను పట్టి ఏర్పడినవే కాని ప్రత్యేకజాతిబోధకాలు కావు. ధీరలలితాది పారిభాషిక పదాలు ఆయా ప్రకరణములందు వర్ణింపబడిన గుణాలతో కూడిన దశావిశేషాలను బోధించునట్టివి. అందుచేత ఒకే నాయకుడు అవస్థను పట్టి ఒక్కొక్కప్పుడు లలితుడు, ఇంకొకప్పుడు శాంతుడు, మరొక్కప్పుడు ఉదాత్తుడు, ఒకప్పుడు ఉద్ధతుడు కాగలడు. ఒకే జంతువు వత్సం, వృషభం, మహోక్షం అని వ్యవహృతమగునట్లే ఒకే నాయకుడు జాతివిబట్టి కాక, అవస్థాభేదాన్ని పట్టి లలితాది వ్యపదేశాలను పొందుచున్నాడు. అట్లాకాక దేవతలే ధీరోద్ధతులు, నృపులే ధీరలలితులు ఇత్యాదిగా చెప్పితే, మహాకవుల వర్ణనలన్నియును అసంగతాలు కాగలవు. భవభూతి, మహావీర చరితంలో పరశురాముని ఒక్కనినే-రావణుని విషయంలో ధీరోదాత్తుని గానూ, రాముని విషయంలో తొలుత ధీరోద్ధతుని గానూ తరువాత ధీరలలితునిగానూ వర్ణించినాడు. కావున ధీరోదాత్తత్వాదు లాయా అవస్థాద్యోతకాలే కాని నియతజాతులు కావు. అవి సర్వజాతి సాధారణములు. అయితే ప్రధాన నాయకుని చివరవరకు ఒకే అవస్థలోనూ, అప్రధాన నాయకుని భిన్నఅవస్థలలోనూ, వర్ణించవచ్చునని కొందరి భావన.

ధీరశబ్దానికి అకాతరత్వం (=భయరాహిత్యం) అని అర్థం. ఈ అర్థం సర్వత్ర సమానమే. ధీర-ధైర్య శబ్దాలు పర్యాయపదాలు; మహావ్యసనమందు కూడా అకాతర్యం అని వీటి అర్థం.

ఇంక, ధీరోదాత్తాదులను అర్వాచీనాలంకారికులను అనుసరించి వివరిస్తాను.

*(i) ధీరోదాత్తుడు*

మూలం : మహాసత్త్వోఽతి గంభీరః క్షమావా నవికత్థనః ॥
స్థిరో నిగూఢాహంకారో ధీరోదాత్తో దృఢవ్రతః ।
-(ద.రూ. II-4-5)

అర్థం : *మహాసత్త్వః, అతి గంభీరః, క్షమావాన్, అవికత్థనః* = మహాసత్త్వుడు (= శోక-క్రోధాదులచేత చలించని అంతఃకరణ కలవాడు), అతిగంభీరుడు, క్షమావంతుడు (=క్షమించేగుణం కలవాడు), అవికత్థనుడు (= ఆత్మ

శ్లాఘా పరాఙ్ముఖుడు = తన్నుతాను పొగడుకొననివాడు); స్థిరః, నిగూఢ-అహంకారః, దృఢవ్రతః =స్థిరమైన నియమం కలవాడు, నిగూఢ అహంకారం (= వినయంచేత కప్పబడిన గర్వం) కలవాడు, స్థిరమైన నియమం కలవాడు-ఇట్టివాడు; ధీరోదాత్తః = ధీరోదాత్త (నాయకుడు అవుతాడు).

తాత్పర్యం : మహాసత్త్వుడు, అతిగంభీరుడు, క్షమావంతుడు, అవికత్థనుడు, స్థిరుడు, నిగూఢాహంకారుడు, దృఢవ్రతుడు- ఇట్టివాడు ధీరోదాత్త నాయకుడు.

టీక : ఉత్+అత్తః =ఉదాత్తః = ఉత్కర్షం ప్రాప్తః; ఉదాత్తత = ఔదాత్యం = సర్వోత్కర్షేణ వృత్తిః = సర్వోత్కృష్టమైన అంతఃకరణవృత్తి అని ధనికుడు. ఉదాత్తుడు విజిగీషువు అవుతాడు అని శారదాతనయుడు.

'క్షమావాన్' కు బదులు 'దయావాన్' (= దయకలవాడు) అనీ, 'మహాసత్త్వః' కు బదులు 'సత్త్వసారవంతుడు' అనీ చెప్పి, వినీతుడు (= వినయం కలవాడు), తితిక్షావంతుడు (= సహనశీలి) అనే రెండు గుణాలను అధికంగా చెప్పినాడు సింగభూపాలుడు (ర.సు I-73-74). నాయకునకు ఇంతకుముందు చెప్పినవి సామాన్యగుణాలు కాగా ఇవి విశేషగుణాలు (ధీరోదాత్తునియందు ఉత్కర్షతో విశేషించి ఉంటాయి).

శ్రీరాముడు, జీమూతవాహనుడు, యుధిష్ఠిరుడు మున్నగువారు ధీరోదాత్త నాయకులుగా సుప్రసిద్ధులు.

ఉదా : (1) మహాసత్త్వుడు (శ్రీరాముడు).

దధతో మంగళక్షౌమే వసానస్య చ వల్కలే ।
దదృశు ర్విస్మితా స్తస్య ముఖరాగం సమం జనాః ॥
(ర.వం. XII-8)

– (పట్టాభిషేకం కోసం) మంగళకరములైన దుకూలములు ధరించి నప్పుడు, (వనవాసం కోసం) నారచీరలు కట్టుకొన్నప్పుడు కూడా ఒక్క రీతిగానే ఉన్న ముఖవిలాసం గల శ్రీరాముని చూసి ప్రజలు విస్మితులయినారు.

(2) శిరాముఖైః స్యందత ఏవ రక్త
మద్యాపి దేహే మమ మాంస మస్తి ।
తృప్తిం న పశ్యామి తవైవ తావ
త్కిం భక్షణాత్త్వం విరతో గరుత్మన్ ॥ (నాగానందం-V-16)

– (పరోపకారం నిమిత్తం తన శరీరాన్ని గరుత్మంతునకు అర్పించి, కొన ఊపిరితో ఉన్న జీమూతవాహనుడు గరుత్మంతునితో)– నానాడులలో ఇంకా రక్తం కారుతున్నది, నాదేహంలో ఇంకా మాంసం ఉంది, నీవు ఇంకా తృప్తిపొందినట్లుగా లేవు. మరి నన్ను భక్షించటం ఎందుకు మానివేశావు, ఓ గరుత్మంతుడా!

టీక : జీమూతవాహనుడు ధీరశాంతనాయకుడే కాని ధీరోదాత్తనాయకుడు కాడు అనే వాదాన్ని ప్రస్తావించి, జీమూత వాహనుని ధీరోదాత్తనాయకునిగానే నిరూపించినాడు ధనికుడు తన అవలోకవ్యాఖ్యానంలో.

*(ii)* ధీరోద్ధతనాయకుడు

మూలం : దర్పమాత్సర్య భూయిష్ఠో మాయా ఛద్మ పరాయణః ।
ధీరోద్ధత స్త్వహంకారీ చల శ్చండో వికత్థనః ॥ -(ద.రూ. II-5-6)

అర్థం : దర్ప-మాత్సర్య, భూయిష్ఠః, మాయా-ఛద్మ పరాయణః = దర్పం (= శౌర్యాదిమదం) , మాత్సర్యం (= అసహనత = అసూయ అధికంగా కలవాడు); మాయ (= మంత్రబలంతో వస్తువులను పుట్టించటం), ఛద్మం (= వంచన చేయటం) కలవాడు; అహంకారీ, చలః, చండః, వికత్థనః = అహంకారం కలవాడు, స్థిరత్వం లేనివాడు, రౌద్రమూర్తి (= కోపిష్ఠి), వికత్థనుడు (= తన్ను తాను పొగడుకొనేవాడు) - ఇటువంటివాడు; ధీరోద్ధతః (తు) = ధీరోద్ధతనాయకుడు.

తాత్పర్యం : దర్పం మాత్సర్యం కలవాడు, మాయా ఛద్మ పరాయణుడు, అహంకారి, చపలుడు, చండుడు, వికత్థనుడు- ఇటువంటివాడు ధీరోద్ధతనాయకుడు.

పరశురామ, రావణ, భీమాదులు, ధీరోద్ధతనాయకులుగా సుప్రసిద్ధులు.

ఉదా :

న త్రస్తం యదినామ భూతకరుణా సంతాన శాంతాత్మనః
తేన వ్యారుజతా ధనుర్భగవతో దేవా ద్భవానీపతేః ।
తత్పుత్రస్తు మదాంధతారకవధా ద్విశ్వస్య దత్తోత్సవః
స్కందః, స్కంద ఇవ ప్రియోఽహ మథ వా శిష్యః కథం విస్మృతః ॥
(మహావీరచరిత-II)

— (శివుని విల్లు విరిచిన రాముని గూర్చి పరశురాముడు) ప్రాణులపట్ల అపారకరుణ కలిగిన పార్వతీపతికి రాముడు భయపడకపోయిన పోవుగాక! మదించిన తారకాసురుని సంహరించిన వానిని- ఆ దేవదేవుని పుత్రుని-(తారక సంహారం వల్ల) లోకాలకు ఉత్సవం చేకూర్చిన వానిని— కుమారస్వామిని మరచినాడా? ఆ శివుని ప్రియశిష్యుడు కుమారనిర్విశేషుడు అయిన నన్ను మరచినాడా?

(iii) ధీరలలిత నాయకుడు

**మూలం : నిశ్చింతో ధీరలలితః కలాసక్తః సుఖీ మృదుః ॥**

-(ద.రూ. II-3)

**అర్థం :** నిశ్చింతః, కలాసక్తః, సుఖీ, మృదుః = (మంత్రి ప్రభృతులు యోగక్షేమాలు వహించటం చేత) చింతలేనివాడు, (నృత్య-గీతాది) కళల యందు ఆసక్తి కలవాడు, భోగపరాయణుడు, శృంగారియై సుకుమార సత్త్వాచారం (= చేష్టలు) కలవాడు- ఇట్టివాడు; ధీరలలితః = ధీరలలితనాయకుడు.

**తాత్పర్యం :** నిశ్చింతుడు, కలాసక్తుడు, సుఖి, మృదువు అయినవాడు ధీరలలితనాయకుడు.

**టీక :** వత్సరాజు మున్నగువారు ధీరలలితనాయకులుగా సుప్రసిద్ధులు. కొంతవరకు మృచ్ఛకటికాప్రకరణనాయకుడైన చారుదత్తుడు కూడా ఇట్టివాడే. రెడ్డిరాజులలో వసంతరాయలుగా ప్రసిద్ధికెక్కిన కుమారగిరిరెడ్డి కూడా ఇట్టివాడే. 'యువకుడు' అనేది ర.సు.లో అధికం. "మృదుః' దీనికి బదులు 'వనితలకు వశుడు' అన్నాడు సింగభూపాలుడు. శృంగారమయచేష్ట 'లలితం' అనబడుతుంది. శృంగారమయ ఆకారం, చేష్ట కలిగినవాడు 'మృదువు.'

**ఉదా :** సోఽధికార మభికః కులోచితం
కాశ్చన స్వయ మవర్తయ త్సమాః ।
సన్నివేశ్య సచివే ష్వతఃపరం
స్త్రీ విధేయ నవయౌవనోఽభవత్ ॥

-(ర.వం.XIX-4)

— ఆ రాజు (=అగ్నివర్ణుడు), కులోచితమైన అధికారాన్ని కొన్ని వత్సరాలు పాలించినాడు; పిదప, రాజ్యభారాన్ని మంత్రులపై పెట్టి, స్త్రీలకు స్వాధీనముగునవయౌవనం కలవాడై సుఖాలను అనుభవించినాడు.

(iv) ధీరశాంత నాయకుడు :

మూలం : సామాన్య గుణయుక్తస్తు ధీరశాంతో ద్విజాదికః ।

-(ద.రూ. II-4)

అర్థం : సామాన్య గుణయుక్తః (తు), ద్విజాదికః, ధీరశాంతః = వినయం మున్నగు నాయక సామాన్య గుణాలు కల, ద్విజాదులు (= విప్ర-వణిక్-సచివులు), ధీరశాంతనాయకులు.

తాత్పర్యం : సామాన్య గుణయుక్తులయిన ద్విజాదులు ధీరశాంతనాయకులు.

మూలం : సమప్రకృతికః క్లేశసహిష్ణుశ్చ వివేకః ।
లలితాది గుణోపేతో విప్రో వా సచివో వణిక్ ॥
ధీరశాంత శ్చారుదత్త-మాధవాది రుదీరితః ।

- (ర.సు. I-76-77)

అర్థం : సమప్రకృతికః, క్లేశ సహిష్ణుః (చ), వివేకః = (కష్ట-సుఖము లందు) సమానమైన శీలంకలవాడు, కష్టాలను ఓర్చుకొనేవాడు, మంచి-చెడ్డల తేడాలు తెలిసినవాడు; లలిత-ఆది గుణ-ఉపేతః = లాలిత్యం, మున్నగు సుకుమారగుణాలు కలవాడు; (అయిన), విప్రః, వా, సచివః, వణిక్ = విప్రుడు లేదా, సచివుడు (లేదా) వణిజుడు; ధీరశాంతః (చ) = ధీరశాంతనాయకుడు (అవుతాడు); చారుదత్త, మాధవ-ఆదిః, ఉదీరితః = (మృచ్ఛకటిక నాయకుడు) చారుదత్తుడు, (మాలతీమాధవనాయకుడు) మాధవుడు మున్నగువారు (ధీరశాంతనాయకులుగా) చెప్పబడినారు.

తాత్పర్యం : సమప్రకృతి, క్లేశసహిష్ణువు, వివేకి, లలితాది గుణోపేతుడు-ఇటువంటి విప్రుడు లేదా మంత్రి, లేదా వణిజుడు ధీరశాంతనాయకుడు అవుతాడు. చారుదత్తుడు, మాధవుడు ఇందుకు ఉదాహరణ.

టీక : ధనంజయుని నిర్వచనం కంటె, సింగభూపాలుని నిర్వచనం సమగ్రంగా ఉన్నది. అహంకారం లేకపోవటం శాంతత్వమనీ, శాంతప్రసక్తి వల్ల వైశ్చింత్యాది గుణసంభవం ఊహ్యమనీ ధనికుని వ్యాఖ్య. కృపాలుత్వం, వినయం, నయత్వం-వీటిని అధికంగా చెప్పారు నాట్యదర్పణకర్తలు. ధీరశాంతుని, ధీరప్రశాంతుడు అని కూడా అంటారు.

ఉదా : మఖశతపరిపూతం గోత్రముద్భాసితం మే
సదసి నిబిడ చైత్య బ్రహ్మఘోషైః పురస్తాత్ ।
మమ నిధన దశాయాం వర్తమానస్య పాపైః
తదసదృశ మనుష్యైః ఘుష్యతే ఘోషణాయామ్ ॥
- (మృచ్ఛకటిక-X-12)

– (ఉరిశిక్షపొంది, వధ్యశిలకు కొనిపోబడుతున్న చారుదత్తుడు) వంద యజ్ఞములందలి వేదఘోషల చేత పూర్వం నా కులం పవిత్రమై ప్రశస్తి చెందింది. ఇప్పుడు, నా అంత్యదశలో, నాదురదృష్టం వల్ల, అసదృశజనులు (=వేదఘోష చేసే వారికి పూర్తిగా భిన్నులైన వారు = చండాలురు) చాటింపు వేస్తున్నారు.

## 8. పతిమున్నగు శృంగారనాయకులు :

మూలం : పతిశ్చోపపతి శ్చైవ వైశికశ్చ తతఃపరమ్ ।
స్వీయాదీనాం నాయికానాం నాయకాః కథితా బుధైః ॥
- (భ.ర.ప్ర.-64)

అర్థం : పతిః (చ), ఉపపతిః (చ, ఏవ), (తతఃపరమ్) వైశికః (చ) = పతి, ఉపపతి, (తరువాత) వైశికుడు (-వీరు మువ్వురూ); స్వీయ ఆది నాయికానాం, నాయకాః, బుధైః, కథితాః =స్వీయ మున్నగు (స్వీయ-పరకీయ-సామాన్య అనే ముగ్గురు), నాయికలకు, (క్రమంగా) నాయకులు (అని), బుధులచేత, చెప్పబడింది.

తాత్పర్యం : పతి, ఉపపతి, వైశికుడు- వీరు ముగ్గురు శృంగారనాయకులు. ఈ మువ్వురకు నాయికలు క్రమంగా స్వీయ, పరకీయ, సామాన్య.

టీక : "ధీరోదాత్తాది నాయకులు అన్ని రసాలకును సాధారణులు. ఇంక శృంగారవిషయంలో మాత్రం ఈ నాయకులు మువ్విధాలుగా ఉంటారు" అని చెప్పి సింగభూపాలుడు పతి మున్నగు మూడు భేదాలు వివరించినారు. అంతేకాదు. అనుకూలాది నాలుగు భేదాలచేత పతి నాలుగు విధాలు అవుతాడనీ, అట్లాగే 'ధీరోదాత్తాది భేదాల చేత అనుకూలుడు నాలుగు విధాలు అవుతాడనీ పేర్కొని, వాటిని వివరించినాడు సింగభూపాలుడు (ర.సు. I-78-81).

నా.శా.లో ఈ విభజనలేదు. కానీ, వైశికుని గూర్చి మాత్రం అందులో చాలా విపులమైన వివరణ ఉన్నది.

(i) పతి :

మూలం : వేదశాస్త్రానురోధేన, పాణిం గృహ్ణాతి యః స్త్రియః ।
స ఏవ పతి రిత్యుక్తః విద్వద్భి రిహ శాస్త్రతః ॥
-(భ.ర.ప్ర.-65)

అర్థం : వేద-శాస్త్ర-అనురోధేన = వేదములందు శాస్త్రములందు చెప్పబడిన రీతిగా; యః, స్త్రియః, పాణిం, గృహ్ణాతి = ఎవడు, స్త్రీయొక్క, పాణిని, గ్రహిస్తాడో; సః ఏవ పతిః = ఆతడే 'పతి' (అని); (ఇహ) శాస్త్రతః, విద్వద్భిః, ఉక్తః = శాస్త్రాలను అనుసరించి, విద్వాంసుల చేత, చెప్పబడినది.

తాత్పర్యం : వేదములందు, శాస్త్రములందు చెప్పబడిన రీతిగా ఎవడు, ఏ స్త్రీ యొక్క పాణిని గ్రహిస్తాడో (= పాణిగ్రహణం చేస్తాడో), ఆ పురుషుడు ఆమెకు 'పతి' అవుతాడు.

టీక : 'పతి' యొక్క అనుకూలాది భేదాదులు తరువాత వివరింపబడతాయి.

(ii) ఉపపతి :

మూలం : లంఘితాచారయా యస్తు వినాపి విధినా స్త్రియా ।
సంకేతం నీయతే ప్రోక్తో బుధై రుపపతి స్తు సః ॥
-(ర.సు. I-83)

ప్రలోభ్యాన్యవధూం భుంక్త ఉపాయై ర్వివిధై రపి ।
స తూపపతి రిత్యుక్తో విద్వద్భి రిహ శాస్త్రతః ॥
-(ర.సు.అధస్సూచిక పుట-58)

అర్థం : యః (తు) = ఎవడు, విధినావినా (-అపి), లంఘిత-ఆచారయా, స్త్రియా = యథావిధిగా వివాహము చేసికొనని, కులాచారాన్ని అతిక్రమించిన, స్త్రీచేత; సంకేతం, నీయతే, సః, ఉపపతిః (తు), బుధైః, ప్రోక్తః=సంకేతస్థానమునకు తీసికొనిపోబడతాడో, అతడు, 'ఉపపతి' (అవుతాడు అని), బుధులచేత చెప్పబడినది.

వివిధైః, ఉపాయైః (అపి) = నానావిధాలయిన, ఉపాయాలతో; అన్యవధూం, ప్రలోభ్య, భుంక్తః = అన్యవధువును (= పరుని భార్యను), ప్రలోభ (= ఆశ) పెట్టి, అనుభవిస్తాడో; సః(తు), ఉపపతిః, ఇతి = అతడు, ఉపపతి,

అని; (ఇహ) శాస్త్రతః విద్వద్భిః, ఉక్తః=శాస్త్రాలను అనుసరించి, విద్వాంసుల చేత, చెప్పబడినది.

తాత్పర్యం : యథావిధిగా వివాహము చేసుకొనని, కులాచారాన్ని అతిక్ర మించిన స్త్రీ, సంకేతమునకు కొనిపోగా ఆమెను అనుభవించేవాడు ఉపపతి.

నానావిధములయిన ఉపాయాలతో, అన్యవధువును ప్రలోభపెట్టి, అనుభ వించేవాడు 'ఉపపతి' (=ఆ అన్యవధువుకు రెండవపతి) అవుతాడు.

టీక : మొదటి శ్లోకం స్త్రీపరంగా ఉన్నది; అంటే స్త్రీ కోరగా ఆమెను అనుభవించేవాడు 'ఉపపతి'. ఇంక రెండవ శ్లోకం పురుషపరంగా ఉన్నది; అంటే అనేకములైన ఉపాయాలు పన్ని, అన్యవధువును వశంచేసుకొనేవాడు 'ఉపపతి'.

'ఉపపతి' భేదాలను గూర్చి సింగభూపాలుడిట్లా వివరించినాడు: ఉపపతి నియుతుడుగా ఉండడు. కావున ఉపపతియందు దక్షిణ-అనుకూల-ధృష్ట భేదా లుండవు. కాని ఎల్లప్పుడు పరస్త్రీ చిత్తుడు కావటం వల్ల శఠుడు మాత్రం అవుతాడు (ర.సు. I.84). (శఠోపపతికి గాథాసప్తశతి నుంచి ఉదాహరణ ఇచ్చినాడు.) ఈ విషయంలో భానుదత్తుడు ఇట్లా వివరించినాడు: ఉపపతి కూడా అనుకూలాది భేదాల చేత నాలుగు విధాలు; అయితే, అతనికి శఠత్వం నియతం, తక్కిన మూడు నియతం కావు. పై రెండు వివరణల సారం ఇంచుమించుగా ఒక్కటే. 'ఉపపతి'ని తెలుగులో 'రంకుమగడు' అంటారు; ఈ రతిని 'చౌర్యరతి' అంటారు.

*(iii)* వైశికుడు :

మూలం : విశేషయే త్కలాః సర్వా యస్మా త్తస్మాత్తు వైశికః ।
వేశ్యోపచారే సాధు ర్వా వైశికః పరికీర్తితః ॥
యోహి సర్వకలోపేతః సర్వశిల్ప విచక్షణః ।
స్త్రీ చిత్త గ్రహణాభిజ్ఞో వైశికః స భవే త్పుమాన్ ॥
గుణాస్తస్యతు విజ్ఞేయాః స్వశరీరసముత్థితాః ।
ఆహార్యాః సహజాశ్చైవ త్రయ స్త్రింశ త్సమాసతః ॥
శాస్త్రవిచ్ఛిల్ప సంపన్నో రూపవాన్ ప్రియదర్శనః ।
విక్రాంతో ధృతిమాం శ్చైవ వయోవేషకులాన్వితః ॥
సురభి ర్మధుర స్త్యాగీ సహిష్ణు రవికత్థనః ।
అశంకితః ప్రియాభాషీ చతురః శుభదః శుచిః ॥

కామోపచారకుశలో దక్షిణో దేశకాలవిత్ ।
అదీనవాక్యః స్మితవాక్ వాగ్మీ దక్షః ప్రియంవదః ॥
స్త్రీలుబ్ధః సంవిభాగీ చ శ్రద్ధధానో దృఢస్మృతిః ।
గమ్యాసుచాప్యవిస్రంభీ మానీ చేతి హి వైశికః ॥
అనురక్తః శుచిర్దక్షో దక్షిణః ప్రతిపత్తిమాన్ ।
భవే చ్చిత్రాభిధాయీ చ వయస్య స్తస్య తద్గుణః ॥
-(నా.శా. XIII-1-8)

అర్థం : యస్మాత్ = ఎందుచేత (= ఎవనియందు); సర్వాః, కలాః విశేషయేత్ = కళలన్నీ విశేషించి ఉంటాయో; తస్మాత్ (తు) = అందుచేత (= అతడు); వైశికః = వైశికుడు (అనబడతాడు). వా=లేదా; వేశ్యోపచారే, సాధుః = వేశ్యోపచారమందు, సాధువు (=నిపుణుడు) (అయినవాడు); వైశికః పరికీర్తితః = వైశికుడు (అని) చెప్పబడినాడు. యః (హి), సర్వకల-ఉపేతః, సర్వశిల్ప విచక్షణః= ఎవడు, సర్వకళాసంపన్నుడు, సర్వశిల్పజ్ఞుడు; స్త్రీ చిత్త గ్రహణ-అభిజ్ఞః, = స్త్రీల చిత్తములను గ్రహించగలవాడు (అవుతాడో); సః పుమాన్, వైశికః, భవేత్=ఆ పురుషుడు 'వైశికుడు' అవుతాడు.

స్వశరీర సముత్థితాః, తస్యగుణాః (తు) = స్వీయశరీర సముద్భవములగు, ఆతని, గుణములు; ఆహార్యాః, సహజాః (చ), ఇతి = ఆహార్యములు (= సంపాదించుకొన్నవి = శాస్త్రజ్ఞతాదులు), సహజములు (= పుట్టుకతో వచ్చినవి = రూప-లావణ్యాదులు), అని (= అనే భేదాలతో); సమాసతః, త్రయస్త్రింశత్ = మొత్తం మీద, ముప్పది మూడు.

శాస్త్రవిత్, శిల్పసంపన్నః, రూపవాన్, ప్రియదర్శనః = శాస్త్రవేత్త, శిల్పసంపన్నుడు, రూపవంతుడు, ప్రియదర్శనుడు; విక్రాంతః, ధృతిమాన్ (చ, ఏవ), వయోవేష-కుల-అన్వితః = శక్తిశాలి, ధైర్యసంపన్నుడు, యువ వయస్సు, మంచి వేషం, గొప్ప కులం కలవాడు; సురభిః, మధురః, త్యాగీ, సహిష్ణుః, అవికత్థనః = సుగంధ ద్రవ్యములనుపయోగించేవాడు, మధురస్వభావుడు, త్యాగి, సహిష్ణువు, అవికత్థనుడు; అశంకితః, ప్రియభాషీ, చతురః, శుభదః, శుచిః = నిశ్శంకితుడు లేదా నిర్భయుడు, ప్రియభాషి, చతురుడు, శుభాలను చేకూర్చేవాడు (పాఠాంతరం 'శుభగుడు' = సుందరుడు), శుచి; కామ-ఉపచారకుశలః, దక్షిణః, దేశ-కాలవిత్ = కామోపచారమందు నేర్పరి,

ఉదారుడు, దేశ-కాలవిశేషాలు తెలిసి ప్రవర్తించేవాడు; అదీనవాక్యః, స్మిత వాక్, వాగ్మి, దక్షః, ప్రియంవదః = దీనవాక్య రహితుడు, స్మితపూర్వభాషి, సంభాషణ చతురుడు, సమర్థుడు, ప్రియభాషి; స్త్రీలుబ్ధః, సంవిభాగీ(చ), శ్రద్ధధానః, దృఢస్మృతిః =స్త్రీలుబ్ధుడు (= స్త్రీలను కోరేవాడు- పాఠాంతరం 'అలుబ్ధః' లోభికానివాడు), సంవిభాగి (= భాగస్వామి), శ్రద్ధకలవాడు, జ్ఞాపకశక్తి కలవాడు (పాఠాంతరం- 'దృఢవ్రతః = గట్టినియమంకలవాడు); గమ్యాసు (చ), అవిస్రంభీ, మానీ(చ), ఇతి(హి), వైశికః = గమ్యావిషయ మందును అవిస్రంభి (= తొందరపాటు లేదా నమ్మకం లేనివాడు), మాని (=ఆత్మగౌరవం కలవాడు) - అని (=ఇటువంటివాడు) వైశికుడు.

అమరక్తః, శుచిః, దక్షః, దక్షిణః, ప్రతిపత్తిమాన్, చిత్రాభిధాయీ (చ) = అమరక్తుడు, శుచి, సమర్థుడు (పాఠాంతరం 'దాంతః' = ఆవేశం అణచు కోగలవాడు), దయాశీలి, బుద్ధిమంతుడు, వక్రోక్తి కుశలుడు - (ఇటువంటి వాడు); తస్యవయస్యః, తద్గుణః, భవేత్ = అతని (= వైశికుని) యొక్క మిత్రుడు, (ఇవిఆరూ) వానియొక్క గుణాలు అవుతాయి.

తాత్పర్యం : వైశికుడు : ఎవనియందు కళలన్నీ విశేషంచి ఉంటాయో ఆతడు 'వైశికుడు' లేదా, వేశ్యోపచారమందు సాధువు అయినవాడు వైశి కుడు. కాగా, సర్వకళాసంపన్నుడు, సర్వశిల్పవేత్త, స్త్రీ చిత్తగ్రహణ సమర్థుడు అయిన పురుషుడు 'వైశికుడు' అనబడతాడు.

వైశిక గుణములు : వ్యాయశరీర సముత్థితములగు వైశిక గుణాలు ముప్పది మూడు. ఇవి స్థూలంగా రెండు విధాలు : ఆహార్యాలు, సహజాలు.

శాస్త్రవిదుడు, శిల్పసంపన్నుడు, రూపవంతుడు, విత్తాంతుడు, ప్రియద ర్శనుడు, ధృతిమంతుడు, వయో-వేష-కులాన్వితుడు, మధుర, మధురస్వభా వుడు, త్యాగి, సహిష్ణువు, అవికత్థనుడు, అశంకితుడు, ప్రియభాషి, చతురుడు, శుభదుడు లేదా సుభగుడు, శుచి, కామోపచారకుశలుడు, దక్షిణుడు, దేశ-కాలవిదుడు, దీనవాక్యరహితుడు, స్మితవంతుడు, వాగ్మి, దక్షుడు, ప్రియం వదుడు, స్త్రీలుబ్ధుడు లేదా అలుబ్ధుడు, సంవిభాగి, శ్రద్ధాళువు, దృఢస్మృతి లేదా దృఢవ్రతుడు, గమ్యావిషయమందున అవిస్రంభి, మాని—ఇట్టివాడు వైశికుడు.

వైశికుని వయస్యుడు : అమరక్తుడు, దక్షుడు, దక్షిణుడు, శుచి, ప్రతిప త్తిమంతుడు, చిత్రాభిధాయి— ఇట్టివాడు వైశికుని వయస్యుడు కావలెను.

టీక : 'కళలన్నీ విశేషించి ఉన్న' అంటే సర్వకళావేత్త అని అర్థం. వేశము = వేశ్యలేదా వేశ్యోపచారం, దానియందు సాధువు (= నిపుణుడు) వైశికుడనబడతాడు.

సింగభూపాలుడు సుమారు 20 పైగా వైశిక గుణాలను పేర్కొన్నాడు; అందులో 'శూరః, యువా' అనేవి నాట్యశాస్త్రమందు కంటె అధికం (ర.సు.I-87).

"కలకంఠం మున్నగు భాణములందే వైశికుడు గోచరిస్తాడు; అతడు జ్యేష్ఠ-మధ్య- నీచభేదాలచేత మూడు విధాలు" అంటూ భావప్రకాశమందు చెప్పబడిన ఆ ముఖ్వురి లక్షణాలను ఉద్ధరించినాడు సింగభూపాలుడు (ర.సు. I.88).

మూలం : అవశోఽపి హి కామస్య వశం యాతీవ దృశ్యతే ।
అసంగోఽపి స్వభావేన సక్తవ చ్చేష్టతే ముహుః ॥
త్యాగీ స్వభావమధురః సమదుఃఖసుఖః శుచిః ।
కామతంత్రేషు నిపుణః క్రుద్ధానునయకోవిదః ॥
స్ఫురితేఽప్యధరే కించిద్దయితాయా విరజ్యతి ।
ఉపచారపరోఽప్యేష ఉత్తమః కథ్యతే బుధైః ॥
వ్యలీకమాత్రే దృష్టేఽప్యా న కుప్యతి న రజ్యతి ।
దదాతి కాలే కాలే చ వసవాదీని భావతః ॥
సర్వ్యార్థై రపి మధ్యస్థతయైవోపచరేత్ పునః ।
దృష్టేదోషే విరజ్యేత స భవేన్మధ్యమః పుమాన్ ॥
కామతంత్రేషు నిర్లజ్జః కర్కశో రతికేలిషు ।
అవిజ్ఞాత భయామర్షః కృత్యాకృత్య విమూఢధీః ॥
మూర్ఖః ప్రసక్తభావశ్చ విరక్తాయా మపి స్త్రియాం ।
మిత్రై ర్నివార్యమాణోఽపి పారుష్యం ప్రాపితోఽపి చ ॥
అన్యస్నేహ పరావృత్తాం సంక్రాంత రమణా మపి ।
స్త్రియం కామయతే యస్తు సోఽధమః పరికీర్తితః ॥
-(భా.ప్ర.V-37-44)

తాత్పర్యం : వైశికుడు-ఉత్తముడు : తాను అవశుడయ్యు కామునకు వశుడైనట్లు కన్పట్టుతాడు. స్వభావం చేత సంగరహితుడైనప్పటికీ, సక్తునివలె ప్రవర్తిస్తాడు. త్యాగి, మధుర స్వభావుడు, సుఖ-దుఃఖము లందు సమానుడు, శుచి, కామతంత్రములందు నిపుణుడు, కోపించినవనితలను అనునయించటంలో నేర్పరి. ప్రియురాలు తనపట్ల ఏ కొంచెం అయినా అనాదరం

చూపినట్లు స్ఫురిస్తే విరక్తుడవుతాడు. అంటే ఉపచారపరుడయినప్పటికీ అనాదరం సహించడు— ఇట్టి వాడు ఉత్తమవైశికుడు.

వైశికుడు-మధ్యముడు : వనిత యొక్క కపటం గోచరించినప్పటికీ కోపించడు, రక్తుడును కాడు. తత్తదుచితకాలములందు వస్త్రాదులను బహూకరిస్తాడు. సర్వవిధాల మధ్యస్థుడుగానే వనితలకు ఉపచారం చేస్తాడు. కాని, దోషం గోచరిస్తే మాత్రం విరక్తుడవుతాడు— ఇట్టివాడు మధ్యమ వైశికుడు.

వైశికుడు-అధముడు (= నీచుడు) : కామతంత్రములందు లజ్జా రహితుడు. సురతక్రీడలలో కర్కశుడు. భయం, అమర్షం తెలియనివాడు. మూర్ఖుడు, మిత్రులు నివారించినప్పటికీ, పరుష వాక్యాలు పడినప్పటికీ విరక్తవనిత పట్ల కూడా ఆసక్తి కలవాడు. తన చెలిమి విడనాడి, అన్యపురుషునితో చెలిమి చేసిన దానిని, భర్తతో కూడియున్న దానిని కూడా కామించుతాడు— ఇట్టివాడు అధమవైశికుడు.

భయం కృప లజ్జలేనివాడు, కామక్రీడలందు కృత్యాకృత్యవిచారహీనుడు అధమవైశికుడని రసమంజరీకారుడు.

టీక : భరతరస ప్రకరణంలో వైశికుని నిర్వచనమిట్లున్నది :

మూలం : వేశ్యాబహుళ సంభోగ సమాసాదిత గౌరవః ।
విత్తవ్యయీ విలాసీ చ వైశికః పరికీర్తితః ॥

తాత్పర్యం : పలువురు వేశ్యలతోడి సంభోగాలచేత చేకూరిన గౌరవం కలవాడు, తనసొమ్ము ఖర్చు పెట్టేవాడు, విలాసపురుషుడు— ఇట్టివాడు వైశికుడు.

తెలుగు 'క్రీడాభిరామం' లోని గోవిందమంచనశర్మ ఇట్టివాడు. నాట్యశాస్త్రంలో వైశికునకు చెప్పబడిన 33 గుణాలు చాలావరకు అర్వాచీనులు చెప్పిన నాయక సామాన్యగుణాలను పోలి ఉండటం గమనింపవచ్చు.

## 9. ప్రోషితాది శృంగారనాయకులు :

శృంగారమంజరీకర్త ఇట్లా వివరించినాడు (పుట. 51) :

పతి, ఉపపతి, వైశికుడు— ఈ ముగ్గురు ఉత్తమ-మధ్యమ-అధమభేదాలచేత మూడేసి విధాలుగా ఉంటారు.

ఉత్తముడు :- కోపించిన నాయికకు ఉపచారాలొనర్చేవాడు.

మధ్యముడు : నాయిక కోపించినప్పుడు, తనకోపానురాగాలు ప్రకటించక, నాయికా కోపాన్ని సహించి, ఆమె ఆశయాన్ని మెల్లగా గ్రహించేవాడు.

అధముడు : లజ్జకాని, దయకాని లేక కేవలం సంభోగం కోరేవాడు.

ఇంక ఈ ముప్వురూ, ప్రోషిత-అమిలిత-విరహి భేదాలచేత మూడేసి విధాలు అవుతారు. కాగా మొత్తం (3X3=) తొమ్మిది భేదాలు.

ప్రోషితుడు : నాయికా వియుక్తుడై, ప్రవాసంలో, ఖిన్నుడుగా ఉన్నవాడు. (మేఘసందేశంలోని యక్షుని వలె).

అమిలితుడు : నాయికా సంగమం కాక పూర్వం, విరహవేదన అనుభవించేవాడు (అయోగశృంగారంలోని నాయికవలె).

విరహి : సమీపంలోనే ఉన్నప్పటికీ, కార్యవిలంబం చేత, నాయికా సంయోగ రహితుడుగా ఉన్నవాడు (విరహోత్కంఠితవలె).

టీక : భరతముని, స్త్రీ-పురుషులందరిలోనూ, వారివారి స్వభావాలను అనుసరించి, ఉత్తమ- మధ్యమ-అధమభేదాలు వివరించినాడు. అంతేకాక, వేశ్యల యందు, కామతంత్రమందలి పురుషులయందు కూడా ఉత్తమ-మధ్యమ-అధమ భేదాలు వివరించినాడు. ఇంక శృంగారమంజరీకర్త విభజన కేవలం సంభోగ శృంగారానికి సంబంధించిఉన్నది.

పతి-ఉపపతి-వైశికుడు— ఈ ముప్వురు ప్రోషితనాయకులు అవుతారు. (= ప్రోషితపతి, ప్రోషిత ఉపపతి, ప్రోషిత వైశికుడు) అని భానుదత్తుడు వివరించినాడు (ర.మం. 112-114). దీనికి తోడు అమిలితుడు, విరహి అనే భేదాలు కూడా చెప్పినాడు శృంగారమంజరీకర్త. ప్రోషితపతికాది నాయికా భేదాలు సుప్రసిద్ధం; అట్లాగే పురుషులలో కూడా ఆ భేదాలు కల్పించబడినవన్నమాట!

## 10. అనుకూలాది శృంగారనాయకులు :

మూలం : పతిస్తు విధినా పాణిగ్రాహకః కథ్యతే బుధైః ।
చతుర్థా సోఽపి కథితో వృత్త్యా కావ్యవిచక్షణైః ॥
అనుకూలః శఠో ధృష్టో దక్షిణ శ్చేతి భేదతః ।

-(ర.సు. I-80-81)

అర్థం : విధినా, పాణిగ్రాహకః, పతిః(తు), బుధైః, కథ్యతే = విధివిహిత పూర్వకంగా, పాణిని గ్రహించినవాడు, పతి (అని); సః (అపి), వృత్త్యా, చతుర్ధా, కావ్యవిచక్షణైః, కథితః = అతడు (= పతి), ప్రవృత్తిని అనుస రించి, నాలుగు విధాలు (అని), కావ్యవేత్తలచేత, చెప్పబడినది; అనుకూలః, శఠః, ధృష్టః, దక్షిణః (చ), ఇతి, భేదతః = అనుకూలుడు, శఠుడు, ధృష్టుడు, దక్షిణుడు, అనే భేదాల చేత (పతి నాలుగు విధాలు).

తాత్పర్యం : యథాశాస్త్రంగా వివాహం చేసుకొన్న వాడుపతి. ప్రవృత్తిని, అనుసరించి, పతి-అనుకూలుడు, శఠుడు, ధృష్టుడు, దక్షిణుడు అని నాలుగు విధాలు.

టీక : 'పతి' విషయం ఇంతకు ముందు వివరించబడినది. అనుకూలుని యందు ధీరోదాత్తాది భేదాలు కూడా చెప్పినాడు సింగభూపాలుడు; అవి ఇప్పుడు వివరింపబడతాయి. ప్రచ్ఛన్న- ప్రకాశభేదాలచేత శఠుడు, రెండు విధాలనీ, ధృష్టుని యందు 'ధూర్తుడు' అనే భేదం కలదనీ, మూని చతురుడు అనే మరో రెండు భేదాలు కలవనీ శృంగారమంజరీకర్త వివరించినాడు.

(i) అనుకూలనాయకుడు :

మూలం : ఏకాయత్తోఽను కూలస్స్యా త్సదా తామను రంజయన్ ।
అన్యస్త్రీ దర్శనాదిభ్యో నివృత్త నిజమానసః ॥
- (భ.ర.ప్ర.-60)

అర్థం : అన్యస్త్రీ దర్శన ఆదిభ్యః, నివృత్త నిజమానసః= పరస్త్రీ లను దర్శించటం మున్నగు వ్యాపారాలనుంచి, మరలింపబడిన తన మనస్సు కలవాడు; ఏకాయత్తః, సదా, తామ్, అనురంజయన్, అనుకూలఃస్యాత్ =ఒక్కతె (= తనభార్య) యందే ప్రేమకలవాడు, ఎల్లప్పుడు, ఆమెను, రంజింప చేస్తూ, అనుకూలుడు అవుతాడు.

తాత్పర్యం : (శాస్త్రోక్త విధిని వివాహమాడిన) భార్యయందే అనురాగం కలవాడై, ఆమెను ఎల్లప్పుడూ సంతోషపరుస్తూ, పరస్త్రీ దర్శనాది వ్యాపార రహితుడు అయినవాడు 'అనుకూలనాయకుడు.'

టీక : అనుకూలుడు ఏకజాని అనీ, ఏకనాయికుడు (= ఒక్క భార్యకల వాడు) అనీ సింగభూపాలాదులు. "సర్వకాలములందు పరాంగనా పరాఙ్ముఖుడై,

సర్వదా స్వీయయందు అనురక్తుడు అనుకూల నాయకుడు" అని రసమంజరీకారుడు. శ్రీరామాదులు ఇందుకు ఉదాహరణ. వైష్ణవవాఙ్మయంలోని ధర్మరాను కూడా ఇందులకు ఉదాహరణమే.

ఉదా : అనుకూలనాయకుడు—

పృథ్వి త్వం భవకోమలా దినమణే త్వం శైత్య మంగీకురు
త్వం వర్త్మన్ లఘుతాం ప్రయాహి, పవన త్వం స్వేద ముత్సారయ ।
సాన్నిధ్యం శ్రయ దండకావన, గిరేనిర్గచ్ఛ మార్గా ద్బహిః
సీతాఽసౌ విపినం మయా సహ యతో నిర్గంతు ముత్కంఠతే ॥
- (రసమంజరి-100)

— శ్రీరాముడు : భూమీ! నీవు మృదుత్వం వహించు. సూర్యుడా! నీవు చల్లదనం పొందు. మార్గమా! నీవు లఘుత్వం పొందు. గాలీ! నీవు స్వేదం అపనయించు. దండకావనమా! నీవు దగ్గరకు రమ్ము. ఓ గిరీ! నీవు దారినుండి తొలగు. ఎందుచేతనంటే, ఈ సీత నాతో కూడా అడవికి తరలుటకు ఉవ్విళ్ళూరుతున్నది.

అద్వైతం సుఖదుఃఖయో రనుగతం సర్వాస్వవస్థాసు యత్
విశ్రామో హృదయస్య యత్ర జరసా యస్మి న్నహార్యో రసః ।
కాలేనావరణాత్యయా త్పరిణతే యత్ స్నేహ సారే స్థితం
భద్రం తస్య సుమానుషస్య కథ మప్యేకం హి తత్ప్రాప్యతే ॥
- (ఉ.రా. I-31).

— (తన భుజం తలగడగా, తన ఒడిలో విశ్రమిస్తున్న సీతను గూర్చి రాముడు) - సుఖ దుఃఖములందు ఏకవిధంగా ఉండేది, మనస్సునకు ఊరట కలిగించేది, సర్వదశలందును అనుసరించి ఉండేది, జరావస్థలో కూడా వివిధంగామా తగ్గనిది, కాలం గడచిన కొద్దీ ప్రేమతత్త్వసారంగా విరిచేది అయిన దాంపత్యజీవనం యొక్క భద్రతను కోరుతున్నాను.

ధీరోదాత్తానుకూలుడు :

సీతాం హిత్వా దశముఖరిపు ర్నోపయేమే యదన్యాం
తస్యా ఏవ ప్రతికృతిసఖో యత్క్రతూ నాజహార ।
వృత్తాంతేన శ్రవణవిషయప్రాపిణా తేన భర్తుః
సా దుర్వారం కథమపి పరిత్యాగదుఃఖం విషేహే ॥
- (ర.వం. XIV-87)

— రాముడు (లోకాపవాద కారణంగా) సీతను పరిత్యజించినప్పటికీ వేరొక కాంతను పెండ్లాడలేదు. ఆమె ప్రతిమను సాయంగా చేసుకొని అశ్వమేధ యాగం పూర్తిచేసినాడు. ఈ వృత్తాంతం సీతకు తెలిసినప్పుడు, వారింపరాని పతిపరిత్యాగదుఃఖాన్ని ఆమె ఎట్టెట్లో సహించింది.

ధీరోద్ధతానుకూలుడు :

కిం కంఠే శిథిలీకృతో భుజలతాపాశః ప్రమాదా న్మయా
నిద్రాచ్ఛేద వివర్తనే ష్వభిముఖం నాద్యాసి సంభావితా ।
అన్యస్త్రీజన సంకథా లఘురహం స్వప్నేఽపి నో లక్షితో
దోషం పశ్యసి కం ప్రియే! పరిచయోపాలంభయోగ్యే మయి ॥

- (వేణీసంహారం- II-8)

— (దుర్యోధనుడు భార్యయగు భానుమతితో) రాత్రి నిద్రలో ప్రమాదవశాన నీ కంఠం నుంచి నా బాహుపాశాన్ని విడదీసితినా? నిద్రలేక ఇటునటు పొరలునప్పుడు, నీకు అభిముఖంగా కాక వెనుదిరిగి ఉంటినా? స్వప్నమందు అన్యస్త్రీలను స్మరించితినా? నావలన ఏమి తప్పు కలిగినది? నన్ను నిందించుటకు నీకు హక్కు ఉన్నది కదా?

ధీరలలితానుకూలుడు :

న కదాచి దపేక్షితప్రజః, సహదేవ్యా విజహార సుప్రజాః ।
నగరోపవనే శచీ సఖో, మరుతాం పాలయితేవ నందనే ॥

-(ర.వం. VIII-32)

— ప్రజల కష్టసుఖాలను అరయుచున్నవాడును, ఉత్తమపుత్రుడును కల ఆ అజమహారాజు, ఒకప్పుడు తనదేవితో కూడి నగరోద్యానవనమున విహరింప నేగినాడు. అప్పుడతడు శచీదేవితో కూడ నందనవనమందు విహరిస్తున్న దేవేంద్రుని విధంగా ప్రకాశించినాడు.

ధీరశాంతానుకూలుడు :

ప్రియమాధవే! కిమసి మయ్యవత్సలా
నను సోఽహమేవ య మనందయ త్త్వరా ।
అయమాగృహీత కమనీయ కంకణ
స్తవమూర్తిమా నివ మహోత్సవః కరః ॥

- ( మాలతీమాధవం-)

— మాధవుడు ప్రియుడుగా గల ఓమాలతీ! ఏల నాపై నిర్దయురాలవు అయినావు? పూర్వం కంకణాలతో అలంకరింపబడి, మూర్తీభవించిన మహో

్నవం వలె ఉన్న ఈ సీకరముచేత ఆనందింపజేయబడిన, ఆ మాధువుడను ఁనే!

ii) దక్షిణనాయకుడు :

మూలం : బహ్వీషు విద్యమానాసు స్వాశ్రితాసు నిరంతరం ।
సమప్రీతిం ప్రకుర్వాణః స దక్షిణ ఇతి స్మృతః ॥
- (భ.ర.ప్ర.-70)

అర్థం : స్వాశ్రితాసు, విద్య మానాసు, బహ్వీషు = (ఎవడు) తనను ఆశ్రయించి (= విధిపూర్వంగా తాను వివాహమాడి) ఉన్న, పలువురు స్త్రీల యందు; సమప్రీతిం, కుర్వాణః =సదా సమానమైన ప్రేమను, చూపుతు న్నాడో; సః దక్షిణః, ఇతి, స్మృతః = అతడు, దక్షిణనాయకుడు, అని చెప్ప బడినాడు.

తాత్పర్యం : తనకు ఎందరు భార్యలున్నారో ఆ అందరిని సదా సమాన మగు ప్రేమతో ఆదరించేవాడు 'దక్షిణనాయకుడు.'

ఉదా : స్నాతా తిష్ఠతి కుంతలేశ్వరసుతా వారోఽంగరాజస్వసుః
ద్యూతే రాత్రిరియం జితా కమలయా దేవీ ప్రసాద్యాత్వయా ।
ఇత్యంతఃపురసుందరీః ప్రతి మయా విజ్ఞాయ విజ్ఞాపితే
దేవే నాప్రతిపత్తి మూఢమనసా ద్విత్రాః స్థితం నాడికాః ॥
- (ర.మ. I-82)

– (ఒకానొక కంచుకి, తన రాజు విషయంలో)- "కుంతల రాజపుత్రి స్నానం చేసి సిద్ధంగా ఉన్నది. ఇది అంగరాజు సోదరియొక్క వంతురోజు. ఈ మేను రాత్రి జూదమున కమల జయించినది. మహాదేవిని ప్రభువులు ప్రస న్నురాలిని ఒనర్పవలె." ఇట్లా అంతఃపురసుందరీమణులను గూర్చి తెలిపికొని, నేను (=కంచుకి) ప్రభువునకు విన్నవింపగా, ఆయన (సర్వయువతుల యందు సమానానురాగం కలవాడు కావటం చేత) ఏమిచేయుటకును తోచక, రెండు మూడు గడియల కాలం స్తబ్ధంగా ఉండిపోయినాడు.

టీక : సకల నాయికలయందును సమానానురాగం కలవాడు దక్షిణుడని సారాంశం. 'దక్షిణుడు' అనగా సరలుడు, ఉదారుడు అని అమరకోశార్థం. అష్టమహిషులను సమానానురాగంతో చూచిన శ్రీకృష్ణుడు దక్షిణనాయకుడుగా సుప్రసిద్ధుడు. ఆ అనురాగం సహజమైనది కావాలని రసమంజరీకారుడు.

శృంగారతిలకం (II-26) లో దక్షిణనాయక నిర్వచనం ఇట్లా ఉంది :

యో గౌరవం, భయం, ప్రేమ, దాక్షిణ్యం పూర్వయోషితి ।
న ముంచ త్యన్యచిత్తోఽపి జ్ఞేయోఽసౌ దక్షిణో యథా ॥

అర్థం : యః, అన్యచిత్తః, అపి, పూర్వయోషితి = ఎవడు, ఇంకో స్త్రీ యందు అనురాగం కలవాడు, అయినప్పటికీ, అంతకుముందున్న స్త్రీ పట్ల, గౌరవం, భయం, ప్రేమ, దాక్షిణ్యం; యథా నముంచతి = గౌరవం, భయం, ప్రేమ, దయ ఎట్లా విడిచిపెట్టడో; అసౌ, దక్షిణః, జ్ఞేయః = (అందుచేత) అతడు, దక్షిణ నాయకుడు (అని), తెలియవలెను.

తాత్పర్యం : రెండవభార్య వచ్చిన తరువాత కూడా, పూర్వ (= జ్యేష్ఠ) భార్యపట్ల గౌరవం, భయం, ప్రేమ, దయ కలిగి ఉండేవాడు దక్షిణనాయకుడు అవుతాడు.

టీక : శృంగారతిలకలక్షణం సమగ్రంగా ఉన్నది.

"స దక్షిణః శఠో ధృష్టః పూర్వాం ప్రత్యన్యయాహృతః"

(ద.రూ.II-6) అని ధనంజయుడు పేర్కొన్న దానిని బట్టి ఇంకోస్త్రీకి వశీభూతుడైన నాయకుడు, మొదటి భార్య పట్ల దక్షిణుడు కాని, శఠుడు కాని, ధృష్టుడు కాని అవుతాడు. ఇది ఆనాయకుని ప్రవర్తనను అనుసరించి సంభావ్యం. కాగా వత్సరాజు, అగ్నిమిత్రుడు మున్నగువారు రెండవభార్యలభించే వరకు అనుకూల నాయకులు, రెండవభార్య లభించిన తరువాత దక్షిణనాయకులు అయినారు.

(iii) శఠనాయకుడు :

మూలం : ప్రియాయా మనురక్తాయాం గూఢవిప్రియ కర్మకృత్ ।
అతః శఠ ఇతి ప్రోక్తః భావశాస్త్ర విచక్షణైః ॥

-(భ.ర.ప్ర.-72)

అర్థం : అనురక్తాయాం, ప్రియాయాం = తనయందు అనురక్త అయిన, ప్రియురాలిపట్ల; గూఢ, విప్రియ, కర్మకృత్ = రహస్యంగా, అప్రియకర్మ (= అన్యస్త్రీ సంగమం) చేసేవాడు; అతః, భావశాస్త్ర విచక్షణైః, శఠః, ఇతి, ప్రోక్తః= అందుచేత (అతడు), భావశాస్త్రవేత్తలచేత, శఠుడు, అని, చెప్పబడినాడు.

తాత్పర్యం : తనయెడ అనురాగం గలప్రియురాలిని నమ్మిస్తూనే రహస్యంగా అప్రియకర్మ చేసేవాడు 'శఠనాయకుడు' అవుతాడు.

టీక : 'శఠ' శబ్దానికి నికృతః (= వంచకుడు), అనృజుః (=అసత్యవాది) అని అమరకోశ అర్థాలు. ప్రియురాలి పై ప్రేమకురిపిస్తూ నమ్మిస్తూనే గూఢంగా అప్రియం చేసేవాడు శఠుడని సారాంశం. అయితే దక్షిణనాయకుడు కూడా శఠుడు కాడా అన్న ప్రశ్నకు ధనికుడు సమాధానం చెప్పినాడు: దక్షిణనాయకుడు కూడా జ్యేష్ఠ భార్యపట్ల అప్రియకారియే; కాని అతడు ఆమెయందు కూడా బద్ధానురాగుడుకావటంచేత దక్షిణనాయకుడు, గూఢ విప్రియకారియైన శఠుని కంటె భిన్నుడు అవుతున్నాడు.

'సాపరాధి అయినప్పటికీ, నిరపరాధి వలె ప్రవర్తించేవాడు శఠుడు. అతడు ప్రచ్ఛన్న- ప్రకాశభేదాల చేత రెండు విధాలు' అని చెబుతూ , వారిని సోదాహరణంగా వివరించినాడు శృంగారమంజరీకర్త (శృం.మం. 287-89).

నాయికకు మాత్రమే తన అపరాధం తెలిసినప్పుడు ప్రచ్ఛన్నశఠుడు.

తన అపరాధం తెలిసి నాయిక కోపించగా, వెడలిపోయి, ఆమె శాంతించి నప్పుడు మరల ఆమెను చేరేవాడు ప్రకాశశఠుడు.

ఉదా : శఠోఽన్యస్యాః కాంచీమణిరణిత మాకర్ణ్య సహసా
యదాశ్లిష్యన్నేవ ప్రశిథిలభుజగ్రంధి రభవః ।
తదేత్ క్వాచక్షే ఘృతమధుమయం త్వద్బహువచో
విషేణాఘూర్ణంతీ కిమపి న సఖీ మే గణయతి ॥
- (అమరుశతకం-73)- (ద.రూ. II-86).

– (చెలికత్తెమాటలు) ఓ శఠుడా! మా చెలిని ఆలింగనం చేసుకొంటూనే, ఇంకో ప్రేయసియొక్క కాంచీమణిరణితం వినపడగానే (= గుర్తుకు రాగానే), నీ భుజపాశాన్ని శిథిలంచేశావు, దీనికి నిన్ను ఏమనగలమ? ఘృతం-మధువు కలిసిన రసాయనం వలె తియ్యనైన నీ మాటలు విషపూరితాలని నా చెలి గుర్తించలేకున్నది.

(iv) ధృష్ట నాయకుడు :

మూలం : భూయో నిశ్శంక కృతదోషోఽపి, భూయో నివారితోఽపి,
భూయః ప్రశ్రయపరాయణో ధృష్టః.
-(రసమంజరి-102)

అర్థం : భూయః, నిశ్శంక కృతదోషః, అపి = మరల మరల, నిర్భయంగా, (కాంతపట్ల) అపరాధం చేసినవాడయినప్పటికీ; భూయః, నివారితః, అపి = మరల మరల, (కాంతచేత) నివారింపబడినప్పటికీ; భూయః, ప్రశ్రయపరాయణః, ధృష్టః=(ఆకాంతపట్ల) అధికంగా వినయం అవలంబించేవాడు, ధృష్టుడు.

తాత్పర్యం : ప్రియురాలి పట్ల నిర్భయంగా మరల మరల అపరాధం చేసి (= అన్యాసంగమం) చేసి కూడా, ఆమెచేత తిరస్కరింపబడి కూడా, ఆమె పట్ల అధికంగా వినయం ప్రదర్శించేవాడు ధృష్టనాయకుడు.

ఉదా : బద్ధోహారైః కరకమలయో, ర్ద్వారతో వారితోఽపి
స్వాపం జ్ఞాత్వా పునరుపగతో దూరతో దత్తదృష్టిః ।
తల్పోపాన్తే కనకవలయం ముక్త మన్వేషయన్త్యా
దృష్టో ధృష్టః పునరపి మయా పార్శ్వ ఏవ ప్రసుప్తః ॥
- (రసమంజరి 102)

– (నాయిక) ఆ ధృష్టుడు, నాచేత, హారాలతో చేతులు కట్టుబడినవాడు, ద్వారంనుంచి వెడలగొట్టబడినవాడు అయినప్పటికీ, దూరంనుంచి చూస్తూ నిద్రించటం తెలిసికొని, తిరిగి వచ్చి, (నాకు తగులకుండ) నాశయ్య యొక్క అంచున నిద్రించినాడు. నాచేతినుంచి జారిపడిన కంకణాన్ని వెదకుతున్నప్పుడు అతడు నాచేతికి తగిలినాడు, అప్పుడు అతనిని చూచితిని.

అమరుశతకమందలి "లాక్షా లక్ష్మ . . . . " అనే 71 వ శ్లోకం కూడా ఇందులకు ఉదాహరణమే.

టీక : ప్రేయసికి కోపం వచ్చినదని తెలిసిన వెంటనే ఆమె కాళ్ళమీద పడటం, బతిమిలాడటం వంటివి చేసే వాడు ధృష్టుడని భ.ర.ప్ర.కర్త. "తప్పుచేసి కూడా నిర్భయంగా ఉండేవాడు, తిరస్కరింపబడినప్పటికీ సిగ్గుపడనివాడు, దోషం కనిపించినప్పటికీ అబద్ధం ఆడేవాడు ధృష్టనాయకుడు" అని విశ్వనాథుడు.

(v) ధూర్తుడు :

ధృష్టునిలో 'ధూర్తుడు' అనే భేదం తాను కల్పించినట్లుగా శృంగారమంజరీకర్త చెప్పినాడు: అపరాధం చేసిన తప్పై నాయిక కోపించగా, మొదట తాను కూడా కోపించి, తరువాత పశ్చాత్తాప పడేవాడు ధూర్తశఠుడు. నాయిక కోపించినా,

వారించినా తాను కోపించక, ఆమెను అనునయించటానికి ప్రయత్నించేవాడు కేవలం ధృష్టుడు.

(vi) మాని :

తాను స్వయంగా అపరాధి అయినప్పటికీ, నాయిక కోపిస్తే, తాను కూడా కోపించేవాడు 'మాని' (శృం.మం).

'మాని' కోపంతో వెడలిపోతాడు; కాని, ధూర్తుడు తిరిగివస్తాడు.

(vii) చతురుడు :

ఏదో ఒక ఉపాయం చేత, తన సురతేచ్ఛను నాయికకు వ్యక్తం చేసేవాడు 'చతురుడు' (శృం.మం.). చతురుడు మరల రెండు విధాలు : వాక్ చతురుడు, క్రియాచతురుడు. మాటలతో మనస్సును రంజింపచేసేవాడు వాక్ చతురుడు; నాయికను స్పృశించి, అలంకరిస్తూ రంజింపజేసేవాడు క్రియాచతురుడు.

టీక : మాని, చతురుడు-అనే ఈ రెండు భేదాలు శఠుని యందు అంతర్భవిస్తాయని రసమంజరీకర్త. కాని ఈ అభిప్రాయం అయుక్తమని చెప్పి శృం.మం. కర్త వీనిని వేరుగానే వివరించినాడు.

## 11. చతురాది శృంగారనాయకులు :

మూలం : చతురోత్తమౌ తు మధ్య స్తథా చ నీచః ప్రవృత్తక శ్చైవ ।
స్త్రీ సంప్రయోగవిషయే జ్ఞేయాః పురుషా స్త్వమీ పంచ ॥
సమదుఃఖః క్లేశసహః ప్రణయక్రోధప్రసాదనే కుశలః ।
యోఽర్థి నాత్మచ్ఛందో దక్షశ్చతురః స బోద్ధవ్యః ॥
యో విప్రియం నకురుతే నార్యా కించి ద్విరాగ సంజ్ఞాతమ్ ।
అజ్ఞాతేప్సితప్రాదయః స్మృతి మాప్నుతిమాన్ స తు జ్యేష్ఠః ॥
మధుర స్త్యాగీ రాగం నయతి న మదనస్య నాపి వశమేతి ।
అవమాని తశ్చ నార్యా విరజ్యతే చోత్తమః స పుమాన్ ॥
సర్వార్థై ర్మధ్యస్థో భావగ్రహణం కరోతి యో నార్యాః ।
కించిద్దోషం దృష్ట్వా విరజ్యతే మధ్యమః స భవేత్ ॥
కాలే దాతా హ్యవమానితోఽపి న క్రోధ మతితరా మేతి ।
దృష్ట్వా వ్యలీకమాత్రం విరజ్యతే మధ్యమోఽయ మపి ॥

అవమానితో౽పి నార్యా నిర్లజ్జతయాభ్యుపై త్యనిక్రుతాన్యః ।
అన్యతరం సంక్రాంత మన్యస్నేహపరావృత్తభావశ్చ ॥
అభినవకృతే వ్యలీకే ప్రత్యక్షం రజ్యతే దృఢతరం యః ।
మిత్రై ర్నివార్యమాణో విజ్ఞేయః సో౽ధమః పురుషః ॥
అవిగణితభయామర్షో మూర్ఖప్రకృతిః ప్రవక్తహాసశ్చ ।
ఏకాంతదృఢగ్రాహీ నిర్లజ్జః కామతంత్రేషు ॥
రతికలహసంప్రహారే ష్వకర్కశః క్రీడనీయకం స్త్రీణామ్ ।
ఏవం విధస్తు తజ్జై ర్విజ్ఞేయః సంప్రవృత్తస్తు ॥
- (నా.శా. XXIII-53-62)

అర్థం : చతుర-ఉత్తమౌ (తు), మధ్యః (తథా), నీచః, ప్రవృత్తకః (చ, ఏవ) = చతురుడు, ఉత్తముడు, మధ్యముడు, నీచుడు, సంప్రవృత్తకుడు; స్త్రీ సంప్రయోగ విషయే = స్త్రీ సంప్రయోగ (= సమాగమ లేదా ఉపచార) విష యంలో; అమీ, పురుషాః (తు), పంచ = ఈ (= ఈ విధంగా) పురుషులు అయిదు విధాలు.

(i) చతురుడు : యః = ఎవడు; సమదుఃఖః, క్లేశసహః, ప్రణయక్రోధప్ర సాదనేకుశలః = (సుఖ-) దుఃఖములందు సముడు, క్లేశములను సహించ గల వాడు, ప్రణయకుపితయగు నాయికను ప్రసన్నురాలిని చేసుకొనటంలో నేర్పరి; అర్థివాత్మచ్ఛందః, దక్షః = నాయిక యొక్క ఇష్టమును అనుసరించేవాడు (పాఠాంతరం- "రత్యుపచారే నిపుణః = రతి సంబంధి ఉపచారములందు నిపుణుడు), సమర్థుడు; సః, చతురః, బోద్ధవ్యః = అతడు, చతురుడు, (అని), తెలియవలెను.

(ii) ఉత్తముడు : యః=ఎవడు; నార్యాః విరాగసంజ్ఞాతమ్, కించిత్ విప్రియం, న కురుతే = స్త్రీలకు, విరాగం జనించే, కించిత్, విప్రియం కూడా, చేయనివాడు (అవిప్రియకారీ, ధీరోదాత్తుడు, ప్రియంవదుడు, మానీ- అని. పాఠాంతరం); అజ్ఞాత-ఈప్సిత హృదయః, స్మృతిమాన్, ధృతిమాన్ = హృదయమందలి ఇష్టాలను తెలిసికోగలవాడు, స్మృతిమంతుడు, ధృతిమం తుడు- అవుతాడో; సః(తు), జ్యేష్ఠః = అతడు, జ్యేష్ఠుడు (= ఉత్తముడు); (యః = ఎవడు) మధురః, త్యాగీ, రాగం నయతి(చ), అపి మదనస్య వశం న ఏతి = మధుర స్వభావుడు, త్యాగి, అనురాగం కలవాడు, అయినప్పటికీ కామవశుడు కానివాడు; నార్యా అవమానితః (చ), విరజ్యతే = స్త్రీచేత

అవమానం పొందినప్పుడు, విరక్తి చెందేవాడు; సః(చ), పుమాన్, ఉత్తమః= ఆ పురుషుడు, ఉత్తముడు.

(iii) మధ్యముడు : యః, నార్యాః, సర్వార్థైః మధ్యస్థః, భావగ్రహణం కరోతి = ఎవడు, స్త్రీల సర్వావస్థలందును, తటస్థుడుగా ఉండి భావగ్రహణం చేస్తాడో; కించిత్-దోషం, దృష్ట్వా, విరజ్యతే, సః, మధ్యమః భవేత్ = ప్రియు రాలియందు, కించిత్, దోషం, కన్పట్టినను, విరక్తి చెందుతాడో, అతడు, మధ్యముడు అవుతాడు.

కాలే దాతా, అవమానితః అపి అతితరామ్ కోపం న ఏతి = (ఎవడు) యుక్త సమయములందు దానమిస్తూ ఉంటాడో, అవమానింపబడినప్పటికీ ఎక్కువ కోపం చెందడో; వ్యలీకమాత్రం, దృష్ట్వా విరజ్యతే, అయం, అపి, మధ్యమః = కపటం ఏ మాత్రం కన్పట్టినా విరక్తుడవుతాడో, అతడు కూడా మధ్యముడే.

(iv) అధముడు : యః = ఎవడు, నార్యా అవమానితః అపి, నిర్లజ్జతయా, అవికృతాస్యః, అభ్యుపైతి = స్త్రీచేత, అవమానితుడైనప్ప టికీ, సిగ్గువిడిచి, వికారంపొందని ముఖంతో, ఆమెను చేరుతాడో; అన్యతరం సంక్రాంతాం, అన్యస్నేహపరావృత్తభావః (చ) = ఆమె అన్యపురుష సంక్రాంత అయినను, తన స్నేహభావాన్ని మరలింపలేడో; అభినవకృతే వ్యలీకే ప్రత్యక్షం, మిత్రైః, నివార్యమాణః = ఆమె క్రొత్తగా చేసిన కపటం తనకు ప్రత్య క్షంగా కన్పట్టినప్పటికీ, మిత్రులచేత, వారింపబడినప్పటికీ; దృఢతరం రజ్యతే, సః పురుషః, అధమః విజ్ఞేయః = మరింత ఎక్కువగా, ఆమెయందు, అనుర క్తుడు అవుతాడో, ఆ పురుషుడు, అధముడు (అని) తెలియవలెను.

(v) సంప్రవృత్తకుడు : అవిగణిత భయ- అమర్షః, మూర్ఖప్రకృతిః, ప్రసక్త హాసః (చ) = భయం, అమర్షం లెక్కచేయనివాడు, మూర్ఖస్వభావుడు, హాస్య పాత్రుడు లేదా వెక్కిరిస్తే నవ్వేవాడు; ఏకాంత దృఢగ్రాహీ, కామతంత్రేషు నిర్లజ్జః = మొండి పట్టుదలకలవాడు, కామ తంత్రమందు లజ్జారహితుడు; రతికలహసంప్రహారేషు అకర్కశః, క్రీడనీయకః స్త్రీణామ్ = రతికలహమందలి సంప్రహారాలలో కర్కశత్వం లేనివాడు (పాఠాంతరం- కర్కశుడు), స్త్రీలకు ఆటవస్తువు అయినవాడు; ఏవం, విధః (తు), సంప్రవృత్తః(తు), తజ్జ్ఞైః, విజ్ఞేయః = ఇటువంటివాడు, సంప్రవృత్తుడు (పాఠాంతరం 'సంప్రవృద్ధుడు' అని) తజ్జ్ఞుల చేత, తెలియదగినది.

తాత్పర్యం : *1.* చతురుడు- సుఖ-దుఃఖములందు సముడు, క్లేశాన్ని సహింపగలవాడు, ప్రణయక్రోధ ప్రసాదనకుశలుడు, నాయిక ఇష్టాన్ని అనుస రించేవాడు, అర్థి, దక్షుడు అయిన పురుషుడు 'చతురుడు' *(53-54).*

*2.* ఉత్తముడు- స్త్రీలకు విరాగం జనించేట్లుగా కించిత్ విప్రియం కూడా చేయనివాడు (అవిప్రియకారి, ధీరోదాత్తుడు, ప్రియంవదుడు, మాని- అని కాశీముద్రణపాఠం), ఆజ్ఞాతేప్సితప్రాదయుడు (మనసులలోని కోరికను తెలిసి కోగలవాడు, గంభీరుడు), స్మృతిమంతుడు, ధీమంతుడు, మధురస్వభావుడు, త్యాగి, రాగి అయినను మదనవశుడు కానివాడు, స్త్రీచే అవమానితుడైన ప్పుడు విరక్తుడగువాడు 'ఉత్తముడు' *(55-56).*

*3.* మధ్యముడు- తాను మధ్యస్థుడుగా ఉండి సర్వార్థములచేతను స్త్రీల భావగ్రహణం చేసేవాడు, కించిద్దోషం కన్పట్టినను విరక్తుడగువాడు, యుక్త కాలమందు దాత, అవమానితుడైనను అధికక్రోధం చెందని వాడు, వ్యలీక మాత్రం (అపవాదు) చేతనే విరక్తుడగువాడు 'మధ్యముడు' *(57-58).*

*4.* అధముడు- స్త్రీచే అవమానితుడైనను నిర్లజ్జతో అవిక్రుతాస్యంతో ఆమెను చేరేవాడు, అన్యనరసంక్రాంత అయినను తన స్నేహాన్ని మరలింప లేని వాడు, మిత్రులచే వారింపబడినప్పటికీ ఆమె క్రొత్తగా చేసిన వ్యలీకం తనకు ప్రత్యక్షంగా కన్పట్టినప్పటికీ ఆమెను ఇంతకుముందుకంటె ఎక్కువగా ప్రేమించేవాడు 'అధముడు' *(59-60).*

*5.* సంప్రవృత్తుడు- భయ-అమర్షాలను లెక్క చేయనివాడు, మూర్ఖస్వభా వుడు, ప్రసక్తహాసుడు (= వెళ్లినప్పు నవ్వేవాడు), ఏకాంత దృఢగ్రాహి (= మొండి పట్టుదలకలవాడు), కామతంత్రమందు నిర్లజ్జుడు, రతికలహసంప్రహా రములందు అకర్కశుడు (కర్కశుడు-అని కాశీ ముద్రణపాఠం), స్త్రీలకు క్రీడనీయకమైన వాడును 'సంప్రవృత్తకుడు' *(61-62).*

టీక : శారదాతనయాదులు పైశికభేదాలుగా చెప్పిన ఉత్తమ-మధ్యమ-అధ ములు, శృంగారమంజరీకర్త చెప్పిన ఈ మూడు భేదాలు, భరతముని చేసిన పై విభజన మందలి ఉత్తమ- మధ్యమ-అధమ భేదాలతో సంపదిస్తున్నవి. చెప్పిన పద్ధతులు భిన్నములైనా, సారాంశం ఒక్కటే. చతుర-సంప్రవృత్త భేదాలు నా.శా.లో అధికం.

# 12. పాంచాలాది శృంగార నాయకులు :

శృంగారమంజరీకర్త పాంచాల-కూచిమార-దత్త-భద్రనాయకులను పేర్కొని, వారు క్రమంగా పద్మినీ-శంఖిణీ-చిత్రిణీ-హస్తినీ గుణసంపన్నులుగా ఉంటారని చెప్పి, పద్మిన్యాదుల లక్షణాలు మాత్రమే చెప్పినాడు. కాగా పాంచాలాదుల స్వరూపం క్రింది విధంగా ఉంటుంది:

1. పాంచాలుడు : పద్మినీ గుణసంపన్నుడు. మృదువుగా, అనురక్తితో ఆనందపరచి, అనుభవించేవాడు.

2. కూచి (చు) మారుడు : శంఖిణీ గుణసంపన్నుడు, మనస్సుతో రంజింపలేక, మందుమాకుల మరిగించి కారించేవాడు (= సంభోగోపకారకాలైన మందుమాకుల ప్రయోగంలో ప్రవీణుడు).

3. దత్త (= దత్తకు)డు : చిత్రిణీగుణ సంపన్నుడు, ధనంతో వశపర్చు కొనేవాడు, వేశ్యాతంత్రప్రవీణుడు (ఇతడు వైశికతుల్యుడు).

4. భద్రుడు : హస్తినీగుణ సంపన్నుడు, శృంగారచేష్టలలో అతిగా ఉండేవాడు.

టీక : డా.వి. రాఘవన్ శృంగారమంజరికి వ్రాసిన విపులమైన పీఠికలో ఆ యా విషయాలను విపులంగా చర్చించినారు (పుటలు. 33-37).

అలంకారికులెవ్వరూ, పై విభజనను చెప్పలేదు. వాత్స్యాయనుని కామసూత్రంలో కూడా ఈ విభజన లేదు. తెలిసినంతలో ఈ విభజనను పేర్కొన్న ప్రథముడు 'రతిరహస్య' కర్త అయిన కొక్కోకుడు; నందికేశ్వరమతానుసారంగా తాను ఈ విభజనను పేర్కొంటున్నట్లు కొక్కోకుడు చెప్పినాడు.

కూచుమారుడు, బాభ్రవ్య పాంచాలుడు అనేవారు వాత్స్యాయనుని కంటె ముందున్న కామశాస్త్రకర్తలు. కూచుమారుడు, ఔపనిషదికాధికరణంలో ప్రవీణుడు. 'కూచిమారతంత్రం' అనే గ్రంథం కూడా ఉన్నది. బాభ్రవీయుడయిన పాంచాలుడు, శ్వేతకేతువు రచించిన 500 అధ్యాయాల గ్రంథాన్ని ఏడుభాగాలుగా క్రోడీకరించటమే కాక, 64 సంభోగదశలను 'పాంచాలికీ చతుష్షష్టి' అనే పేరుతో ప్రపంచించినాడు.

కూచుమార-పాంచాలురు కామశాస్త్రకర్తలైనట్లే, దత్త-భద్రులు కూడా కామశాస్త్రకర్తలు కావటం సంభావ్యం. పాటలీపుత్రవేశ్యలకొరకు వైశకాధికరణాన్ని

ప్రత్యేకంగా రచించిన దత్తకుడు, ఈ దత్తుడే కావచ్చు. శూద్రక-శ్యామిలక-ఈశ్వరదత్తుల భాగాలలో పేర్కొనబడిన 'దత్తక సూత్రాలు' కర్త ఈ దత్తకుడే.

ఇంక భద్రుని గూర్చి గట్టిగా చెప్పదగిన ఆధారం ఏమీ లభించలేదు. పెక్కు కథలలో నాయకుడుగా, కామశాస్త్రవేత్తగా సుప్రసిద్ధుడైన 'మూలదేవుడు' ఈ భద్రుడు ఒక్కరే అని శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు అభిప్రాయపడినారు.

కాగా, ఆయాగుణాలకు లేదా రచనలకు సుప్రసిద్ధులైన కామశాస్త్రకర్తల పేరనే ఈ శృంగారనాయకుల విభజన జరిగి ఉంటుందని చెప్పవచ్చు.

నన్నిచోడుని తెలుగు 'కుమారసంభవం' లో చిత్రంగా, ఈ నాయకుల ప్రశంస ఉన్నది (VIII-145) :

"కమియుని లేని శృంగారాతి చేష్టలఁ
బచరించుచుండునా భద్రునొల్ల
మృదురేఖనమరక్తిఁ బొదలించి, రసమెల్ల
గాలించి కొమనాపాంచాలునొల్ల
ధనమెత్తి మీఁయ తగులుగా రతిబెట్టి
దమునేయునట్టి దత్తకుని నొల్ల
మనసీక మందులమాయలఁ గరిగించి
కారించు నాకూచిమారునొల్ల."

*(ii)* శశజాతి మున్నగు శృంగారనాయకులు :

వాత్స్యాయనుడు తన 'కామశాస్త్రం' లో శృంగార నాయకులు జాతిభేదంచేత మువ్విధాలని పేర్కొన్నాడు— శశజాతి, వృషజాతి, అశ్వజాతి; అర్వాచీనులు 'మృగజాతి' అనే నాలుగో భేదాన్ని కూడా చెప్పినారు. ఈ నలుగురు నాయకులకు నాయికలను క్రింది విధంగా జతకూర్చినది 'స్మరదీపిక' :

| నాయకుడు | | నాయిక |
|---|---|---|
| 1. శశజాతి (పాంచాలుడు) | - | పద్మిని. |
| 2. వృషజాతి (కూచుమారుడు) | - | శంఖిణి. |
| 3. అశ్వజాతి (భద్రుడు) | - | హస్తిని. |
| 4. మృగజాతి (దత్తుడు) | - | చిత్రిణి. |

టీక : భరతముని స్త్రీల శీలభేదాలను వివరిస్తూ మనుష్య-పశు-పక్ష్యాదుల శీలాలు గల 23 గురు స్త్రీ ప్రకృతులను వివరించివాడు. అందులో మృగ-అశ్వ-హస్తి శీలాలు కలవారున్నారు. అట్లాగే పురుషులలో కూడా ఆయాశీలాలు కలవారిని పేర్కొనటం సంభావ్యమైనదని చెప్పవచ్చు.

## 13. నాయకాభాసుడు :

మూలం : అనభిజ్ఞో నాయకో నాయకాభాస ఏవ ।

-(రసమంజరి-115)

అర్థం : అనభిజ్ఞః, నాయకః =(ఎంతసూచన చేసినా) భావం తెలుసు కోలేని నాయకుడు; నాయకాభాసః, ఏవ=నాయకాభాసుడు, మాత్రమే.

తాత్పర్యం : నాయిక ఎన్నివిధాల సూచనలుచేసినా, ఆమె భావం గ్రహించలేని వాడు నాయకాభాసుడు అవుతాడేకాని, 'నాయకుడు' కాజాలడు (ఇది నటన కాదు; అతనికి స్త్రీచిత్త గ్రహణ యోగ్యత లేక పోవటమే).

ఉదా : శూన్యే సద్మని యోజితా బహువిధాభంగీ, వనం నిర్జనం
పుష్పవ్యాజ ముపేత్య నిర్గతా, మథ స్వీకృతా దృష్టయః ।
తాంబూలాహరణచ్ఛలేన విహితౌ వ్యక్తౌ చ వక్షోరుహౌ,
వేత్తే నాపి న వేత్తి, దూతి, కియతాయత్నేన స జ్ఞాస్యతి ॥

— ఎవ్వరూ ఇంటలేని సమయంలో సమాగమం ఏర్పాటు చేశాను. పువ్వుల కోసమని మిష పెట్టి జనరహితమయిన వనానికి తీసుకొని వెళ్ళాను. అతనినే సాభిలాషంగా చూస్తూవచ్చాను. తాంబూలం ఇచ్చేమిషతో పయ్యెదజారవేసి, పాలిండ్లు కన్పడునట్లుచేశాను. ఓ దూతీ! ఇంతచేసినా అతడు నాభావం గ్రహించలేదు. ఇంకేమిచేస్తే తెలిసికొంటాడే? (తెలిసికోలేని మొద్దు అని భావం) -(*రసమంజరి-115*).

టీక : రతిపరవశమై, కదలక పడిఉన్న అలివిచూసి, ఆమె చచ్చిపోయినదని భయపడి పరుగెత్తిపోయిన హాలికుడు కూడా నాయకాభాసుడే (గాథాసప్తశతి-IV-60).

ఇప్పట్ల శ్రీనాథుని పద్యం జ్ఞాపకం రావటం సహజం.

పనిపడి, నారికేళ ఫలపాకమునంజవియైన భట్టుహా

ర్షని కవితామగుంభములు సోమరిపోతులు కొందరయ్యలౌ
నని కొనియాడనేర; రదియట్టిద; లేజవరాలు చెక్కుఁగీ
టిన పసవల్చు బాలకుఁడు డెందమునం గలఁగంగనేర్చునే!

(శృం.నై.I-17).

అయితే, నాయికకు చెప్పిన భేదాలు నాయకునకు కూడా చెప్పవచ్చును గదా? అన్న ఆశంకకు భామదత్తుడిట్లా సమాధానం చెప్పినాడు (115 శ్లోకం తరువాతి గద్య) :

అవస్థాభేదం చేత నాయికా భేదాలు కలుగుతాయి; స్వభావభేదం చేత నాయకభేదాలు కలుగుతాయి. అందుచేత అనుకూలత్వ, దక్షిణత్వ, శఠత్వ, ధృష్టత్వాలు అనే నాలుగే నాయక స్వభావాలు. అట్లాకాక అవస్థాభేదం చేత నాయకభేదాలు ఏర్పడతాయంటే విరహోత్కంఠ, విప్రలబ్ధ, ఖండితాది నాయకులను కూడా అంగీకరించవలసివస్తుంది; ఇది అనుచితం. అట్లాగే శఠత్వాదులు స్త్రీల పట్ల అనుచితం; అవిరసాభాసకారణం అవుతాయి.

## 14. ప్రతినాయకుడు : ఉపనాయకుడు :

మూలం : లుబ్ధో ధీరోద్ధతః స్తబ్ధః పాపకృ ద్వ్యసనీ రిపుః ॥

-(ద.రూ.II-9)

తాత్పర్యం : లోభి, ధీరోద్ధతుడు, దురాగ్రహం కలవాడు, పాపకార్యాలు చేసేవాడు, వ్యసన పరాయణుడు అయినవాడు నాయకునకు శత్రువు (=ప్రతి నాయకుడు) అవుతాడు — రామయుధిష్ఠిరులకు, రావణ-దుర్యోధనులవలె.

టీక : ధీరోద్ధతుడు, పాపకారి, వ్యసని అయినవాడు 'ప్రతినాయకుడు' అని స్పష్టం చేసినాడు విశ్వనాథుడు (సా.ద.III-160).

ఉపనాయకుడు :

మూలం : పతాకా నాయక స్త్వేషా ముపనాయక ఉచ్యతే ।
తస్యైవానుచరో భక్తః కించి న్న్యూనశ్చ తద్గుణైః ॥

-(భా.ప్ర.IV-179)

అర్థం : తేషాం, పతాకనాయకః, ఉపనాయకః, ఉచ్యతే=వారికి(=ధీరో దాత్తాది నాయకులకు), పతాక (=ఉపకథా) నాయకుడు, ఉపనాయకుడు (అని) చెప్పబడును; తస్య-ఏవ-అనుచరః, భక్తః, తత్ గుణైః కించిత్, న్యూనః=(అతడు) నాయకునకు అనుచరుడు, భక్తుడు, ఆతని గుణాలకంటె కొంచెం తక్కువ గుణాలు కలవాడు అవుతాడు.

తాత్పర్యం : ధీరోదాత్తాది నాయకులకు పతాకనాయకులు ఉపనాయకులు. ఉపనాయకుడు, నాయకునకు అనుచరుడుగా భక్తుడుగా ఉంటాడు; ఆతని కంటె కొంత తక్కువ గణాలు కలవాడు అవుతాడు.

మూలం : పతాకా నాయక స్త్వన్యః పీఠమర్దో విచక్షణః ।
తస్యైవానుచరో భక్తః కించి దూనశ్చతద్గుణైః ॥
-(ద.రూ.II-8)

తాత్పర్యం : ప్రధాన (=ఆధికారిక) కథానాయకుడేకాక, పతాక (=(ప్రాసంగిక) కథానాయకుడు కూడా ఉంటాడు; అతనిని 'పీఠమర్దుడు' అంటారు; ఇతడు నాయకునకు అనుచరుడు, భక్తుడు, ఆతని గుణాలలో కొన్ని లోపించినవాడు.

టీక : నాటకాదులలో కథ రెండు విధాలు: ఆధికారికం, ప్రాసంగికం. ప్రాసంగికం మరల రెండు విధాలు : పతాక, ప్రకరి. పతాక అంటే ఉపకథ అని అర్థం. పతాక నాయకుడు 'ఉపనాయకుడు' అని శారదాతనయుడు చెప్పగా, ఆఉపనాయకుని 'పీఠమర్దుడు' అంటారని ధనంజయుడు స్పష్టంచేసి నాడన్నమాట.

రామాయణకథలో సుగ్రీవుడు పతాకానాయకుడు (=పీఠమర్దుడు).

## 15. బాహ్యపరివారం :

"సర్వప్రకృతులకును ఉపచారం, బాహ్య-అభ్యంతర భేదాల చేత రెండు విధాలు. అయినా ఉపచారాలకు తగిన పరివారం నియతంగా ఉంటుంది. అంతఃపుర ఉపచారాన్ని 'అభ్యంతరం' అనీ, బాహ్యోపచారాన్ని 'బాహ్యం' అనీ అంటారు. "రాజోపచారమందు బాహ్యచరులైన పురుషులను, వారి లక్షణాలను, రాజాంతఃపుర సమాశ్రయులైన స్త్రీల విభాగాన్ని వివరిస్తాను"

అంటూ భరతముని బాహ్యపరివారాన్ని ఆభ్యంతరపరివారాన్ని 24వ అధ్యాయంలో వివరించినాడు. బాహ్యపరివారం 'రాజు'తోనే ప్రారంభమైనది; కాని, ఇచ్చట రాజు అనగా 'యువరాజు' గ్రాహ్యమని అభినవగుప్తుడు వ్యాఖ్యానించినాడు :

*1.* రాజు (=యువరాజు), *2.* సేనాపతి, *3.* పురోధసుడు, *4.* మంత్రులు, *5.* సచివులు, *6.* ప్రాడ్వివాకులు, *7.* కుమారాధికృతులు — వీరు రాజు యొక్క బాహ్యపరివారం; వీరేకాక మరికొందరు మాన్యులైనవారు సభలో ఉంటారు.

*1.* రాజు (= యువరాజు) :

మూలం : శీలవాన్ బుద్ధిసంపన్నః సత్యవాదీ జితేంద్రియః ।
దక్షః ప్రగల్భః స్మృతిమాన్ విక్రాంతో మతిమాన్ శుచిః ॥
దీర్ఘదర్శీ మహోత్సాహః కృతజ్ఞః ప్రియవాక్ మృదుః ।
లోకపాలవ్రతధరః కర్మమార్గవిశారదః ॥
ఉత్థితాశ్చాప్రమత్తశ్చ వృద్ధసే వ్యర్థశాస్త్రవిత్ ।
నానానయప్రచారజ్ఞః ఊహాపోహవిచక్షణః ॥
పరభావేంగితజ్ఞశ్చ శూరో రక్షాసమన్వితః ।
నానాశాస్త్రార్థ తత్త్వజ్ఞో నానాశిల్పప్రవర్తకః ॥
నీతిశాస్త్రేచ కుశలస్తథా చైవానురాగవాన్ ।
స్థానవృద్ధి క్షయజ్ఞశ్చ పరరంధ్ర విచక్షణః ॥
ధర్మజ్ఞోఽవ్యసనీ చైవ గుణై రేభి ర్భవేన్నృపః ।

*2.* సేనాపతి :

శీలవాన్ సత్యసంపన్నః త్యక్తాలస్యః ప్రియంవదః ॥
పరరంధ్ర విధిజ్ఞశ్చ యాత్రాకాలవిశేషవిత్ ।
అర్థశాస్త్రార్థతత్త్వజ్ఞో హ్యనురక్తః కులోద్భవః ॥
దేశవిత్ కాలవిచ్చైవ భవేత్ సేనాపతి ర్గుణైః ।

*3, 4.* మంత్రులు, పురోహితుడు :

కులీనా బుద్ధి సంపన్నా శ్రుతినీతివిశారదాః ॥
స్నిగ్ధాః పరై రహార్యశ్చ స ప్రమత్తాశ్చ దేశజాః ।
అలుబ్ధాశ్చ వినీతాశ్చ శుచయో ధార్మికా స్తథా ॥
పురోధో మంత్రిణశ్చైవ గుణై రేతై ర్భవంతి హి ।

5. అమాత్యుడు :

బుద్ధిమాన్ నీతిసంపన్నో విక్రాంతః స్యాత్ ప్రియంవదః ॥
అర్థశాస్త్రే చ కుశలో హ్యానురక్తః ప్రజాసు చ ।
యో ధార్మిక స్తథామాత్యః కర్తవ్యో భూమిపైః సదా ॥

6. ప్రాడ్వివాకులు :

వ్యవహారార్థ తత్త్వజ్ఞా బుద్ధిమంతో బహుశ్రుతాః ।
మధ్యస్థాః ధార్మికా ధీరాః కార్యాకార్యవిచక్షణాః ॥
క్షాంతా దాంతా జితక్రోధా నోద్ధతాః సమదర్శినః ।
ఈదృశాః ప్రాడ్వివాకాశ్చ స్థాప్యా ధర్మాసనే స్వథ ॥

7. కుమారాధికృతులు :

ఉత్థితా శ్చాప్రమత్తాశ్చ త్యక్తాలస్యా జితశ్రమాః ।
స్నిగ్ధాః క్షాంతా వినీతాశ్చ మధ్యస్థా నిపుణాస్తథా ॥
నయజ్ఞా వినయజ్ఞాశ్చ ఊహాపోహ విచక్షణాః ।
సర్వశాస్త్రార్థ సంపన్నాః కామాద్యవికృతా స్తథా ॥
క్రమాయాతా హితాసక్తాః కుమారాధికృతా స్తథా ।

8. సభాస్తారులు :

నానారూపైః సమాయుక్తా గుణై రేతైః భవంతి హి ॥
బృహస్పతిమతా దేషాం గుణాం శ్చాప్యభిలక్షయున్ ।
విజ్ఞేయశ్చాపి కర్మజ్ఞైః సభాస్తారవికల్పనమ్ ॥

-(నా.శా. XIV-76-90)

తాత్పర్యం :

**1.** రాజు(=యువరాజు) : శీలవంతుడు (పాఠాంతరం-బలవంతుడు), బుద్ధిసంపన్నుడు, సత్యవాది, జితేంద్రియుడు, దక్షుడు, ప్రగల్భుడు, స్మృతి మంతుడు, విక్రాంతుడు, మతిమంతుడు, శుచి, దీర్ఘదర్శి, మహోత్సాహి, కృతజ్ఞుడు, ప్రియభాషి, మృదుస్వభావుడు, (పాఠాంతరం-ప్రియవాక్ పటుః = ప్రియభాషణమందు నేర్పరి), లోకపాలవ్రతధరుడు, కర్మమార్గవిశార దుడు, ఉత్థితుడు (=సావధానుడు), అప్రమత్తుడు, వృద్ధులను సేవించు వాడు, అర్థశాస్త్రవిదుడు, నయశాస్త్రప్రచారకుడు, ఊహాపోహవిచక్షణుడు, పరభావేంగితజ్ఞుడు, శూరుడు, అంగరక్షకలవాడు (పాఠాంతరం-ధీరః, క్షమా

న్విత=ధీరుడు, క్షమించగలవాడు), వివిధ శాస్త్రార్థాల తత్త్వం తెలిసినవాడు, నానాశిల్ప ప్రయోజకుడు, నీతిశాస్త్రకుశలుడు, రాజనీతిశాస్త్రమందు అను రాగి, స్థానవృద్ధి-క్షయాలను గుర్తించేవాడు, శత్రువుల లోపాలను గుర్తించగల వాడు, ధర్మజ్ఞుడు, వ్యసనరహితుడు (=స్త్రీ-మద్య- మృగయ-అక్షక్రీడలందు ఆసక్తి లేనివాడు) – ఇట్టివాడు నృపుడు (=యువరాజు).

2. సేనాపతి : శీలవంతుడు (పాఠాంతరం-బుద్ధిమంతుడు), సత్యసంప న్నుడు (పాఠాంతరం-నీతి సంపన్నుడు), అలసతలేనివాడు, ప్రియంవదుడు, శత్రువుల లోపాలను తెలిసి కొనటంలో సమర్థుడు, దండయాత్రాకాల విశే షాలు తెలిసినవాడు, అర్థశాస్త్రార్థకుశలుడు, రాజుపట్ల అనురక్తుడు, సత్కు లోద్భవుడు, దేశ-కాలవిశేషాలు బాగా తెలిసినవాడు - ఇట్టివాడు సేనాపతిగా ఉండవలెను.

3, 4. మంత్రులు, పురోహితుడు : కులీనులు, బుద్ధిసంపన్నులు, నానా శాస్త్రవేత్తలు (పాఠాతరం-శ్రుతి-నీతి విశారదాః=వేదములందు, నీతి శాస్త్ర మందు నేర్పరులు), స్నిగ్ధులు, పరులచేత అహార్యులు (=శత్రువులకు అభే ద్యులు), అప్రమత్తులు, దేశజులు (=దేశమందు పుట్టినవారు), లోభిత్వం లేనివారు, వినీతులు, శుచులు, ధార్మికులు-ఇట్టివారు మంత్రులుగా, పురోహి తుడుగా ఉండదగినవారు.

5. అమాత్యుడు : బుద్ధిమంతుడు, నీతిసంపన్నుడు, విక్రాంతుడు, ప్రియం వదుడు, అర్థశాస్త్రమందు కుశలుడు, ప్రజలయందు అనురక్తుడు, ధార్మికుడు - ఇట్టివానివి ఎల్లప్పుడు రాజు అమాత్యునిగా నియమించాలి.

6. ప్రాడ్వివాకులు : వ్యవహారములందలి తత్త్వం తెలుసుకోగలవారు, బుద్ధిమంతులు, బాగా చదువు కొన్నవారు, మధ్యస్థులు, ధార్మికులు, ధీరులు, కార్య-అకార్య విచక్షణులు, క్షాంతులు, దాంతులు, క్రోధాన్ని జయించిన వారు, ఉద్ధతులుకావివారు, సమదర్శులు (పాఠాంతరం - సర్వత్ర సమదర్శినః =సర్వదా సమదర్శులు) - ఇట్టివారినే (పాఠాంతర - ఇట్టి ద్విజులనే) 'ధర్మా సన'మందు ప్రాడ్వివాకులుగా రాజు నియమించాలి.

7. కుమారాధికృతులు : ఉత్థితులు (=సావధానులు), అప్రమత్తులు, అల సతలేనివారు, జితశ్రములు, స్నిగ్ధులు, క్షాంతులు, వినీతులు, మధ్యస్థులు, నిపు ణులు, నయజ్ఞులు, వినయవంతులు, ఊహాపోహ విచక్షణులు, సర్వశాస్త్రార్థ సంపన్నులు, కామాదివికారాలు లేనివారు, వంశపారంపర్యంగా (పదవిలోకి)

వచ్చినవారు, రాజపుత్రులపట్ల ఆసక్తి కలవారు - ఇట్టివారు కుమారాధికృతులుగా ఉండవలెను.

8. సభాస్తారులు (=సభాసదులు=సభ్యులు) : బృహస్పతి మతానుసారంగా, కర్మలను, గుణాలను గ్రహించి, వివిధజనులను సభాస్తారులుగా రాజు నియమించాలి.

టీక : బాహ్య పరివారం అంటే రాజాస్థానమందు, ఆస్థానం వెలుపలకూడా సంచరించేవారని అర్థం. ఇచ్చట 'రాజ' శబ్దంచేత యువరాజు గ్రాహ్యమని అభినవగుప్తుడు. పై వర్ణనలనుపట్టి, మంత్రివేరు, అమాత్యుడు వేరు అని స్పష్టమవుతున్నది. అమాత్యుడనగా 'సహచరుడు' అని అర్థం (అమ=సహ); రాజునకు సహచరుడని అర్థం. అమాత్యపదం ఏక వచనంలో ఉండటాన్నిబట్టి 'అమాత్యుడు' ఒక్కడే ఉంటాడా? బహుశః ముఖ్యమంత్రికావచ్చు.

ప్రాట్+వివాకః=ప్రాడ్వివాకః=వివాదసమయంలో వాది - ప్రతివాదులకు నిర్ణయం చెప్పేవాడు.

రాజు ప్రజలను మాత్స్యన్యాయ్యం (=పెద్దచేప చిన్నచేపను మ్రింగటం =ప్రబలుడు దుర్బలుని పీడించటం) అనే అక్రమం నుంచి రక్షించాలి. అట్టి రక్షణను, వివాదనిర్ణయం ద్వారా చేయటంలో ప్రాడ్వివాకులు అత్యంత ప్రధానులు. కావున ప్రాడ్వివాకుడు రాజంతటివాడుగానే లోకమందు భావింపబడుతున్నాడు.

రాజపుత్రుల, రాజకుమారికల రక్షణభారం వహించటమేకాక వారిని శాస్త్రములందు, కళలందు సుశిక్షితులను చేసే భారం కూడా వహించాలి కుమారాధికృతులు (=రాజపుత్ర రక్షణోద్యోగులు). ఇంతటి, బాధ్యతకల ఉద్యోగులను 'బృహస్పతి మతానుసారంగా నియమించాలి' అని అనువదించటం సమంజసమేమో? అంటే 'బృహస్పతి' మతానుసారంగా అనేది కుమారాధికృతుల నియామకానికి సంబంధించినది కావాలి. సభాస్తారులకు సంబంధించిన భాగం మూలంలో విశదంగా లేదు; ఆయా అనువాదాలు ఊహలకు లోబడి జరిగినవి; ఇచ్చటకూడా అట్లే అనువాదం జరిగింది. సభాస్తారులు (=సభాసదులు=సభ్యులు) అంటే అభినయదర్పణంలో చెప్పబడిన 'సభా-సప్తాంగం'లోని వారు అవుతారు.

## 16. నాయక సహాయులు :

బాహ్యపరివారం అంటే, రాజునకు రాజ్యపాలనాదులందు సహాయపడేవారని అర్థం. వీరేకాక రాజునకు శృంగార వ్యవహారములందు సహాయపడేవారు కూడా

ఉంటారు - వారే పీఠమర్ద- విదూషక - విట-చేటులు; వీరిని గూర్చి తరువాత వివరిస్తాను. మొత్తం నాయక సహాయులను శారదాతనయుడు, విశ్వనాథుడు కొన్ని వర్గాలుగా పేర్కొన్నారు :

శారదాతనయుని విభజన (భా.ప్ర.IV-181-84) :

ధీరోదాత్తాది నాయకులకు 'నర్మసచివులు' కొందరుంటారు; వారు ముప్విధాలు - ధర్మసచివులు, అర్థసచివులు, కామసచివులు.

*1.* ధర్మ సచివులు : ఋత్విజులు, పురోహితులు, తాపసులు, వేదవిదులు, బ్రాహ్మణులు, వ్రతధారులు, ఆశ్రమగతులు. వీరు ధర్మాచరణమందు రాజునకు తోడుపడతారు.

*2.* అర్థ సచివులు : మంత్రులు, సేనాపతులు, రాజకుమారులు, సుహృదులు. వీరు రాజునకు ఆయా అర్థచింతనములందు సహాయపడతారు.

*3.* కామ సచివులు : పీఠమర్దుడు, విటుడు, విదూషకుడు. వీరు సఖ్యాది పరివారంలోవారై, కామతంత్రమందు రాజునకు సహాయపడతారు.

ఇంక, విశ్వనాథుని విభజన (సా.ద.) :

*1.* శృంగార సహాయులు : విట-చేట-విదూషకాదులు. వీరు నాయకునకు భక్తులు, పరిహాసమున నేర్పరులు. శుద్ధులు. అలిగిన స్త్రీల కోపం పోగొట్టగలవారు.

*2.* అర్థచింతనమందు సహాయులు : మంత్రులు.

*3.* ధర్మచింతనమందు సహాయులు : ఋత్విజులు, పురోహితులు, బ్రహ్మవిదులు, తాపసులు.

*4.* దండ(=దుష్టనిగ్రహమందు) సహాయులు : సుహృత్తులు, రాజకుమారులు, ఆటవికులు, సామంతులు, సేనాపతులు.

*5.* అంతఃపుర సహాయులు : వామనులు, షండులు, కిరాతులు, మ్లేచ్ఛులు, ఆభీరులు, శకారులు, కుబ్జులు, మూగవారు మొదలగువారు.

ఈ సహాయులందరిలోనూ, పీఠమర్ద-మంత్రి-పురోహితాదులు ఉత్తములు; విట-విదూషకులు మధ్యములు; ఇంక శకార-చేట-తాంబూలిక-మాలాకార-గాంధిక ప్రభృతులు అధములు.

విశ్వనాథుడు చేసిన విభజనలోని మొదటి మూడువర్గాలవారు, శారదాతనయుని మూడు వర్గాలవారితో సంవదిస్తున్నారు; దండసహాయులు కూడా

అర్థచింతనసహాయులలో ఉన్నారు. ఇంక 'అంతఃపుర సహాయులు' భరతముని వివరించిన 'అభ్యంతర పరివారం'లోనివారు; వీరిని గూర్చి నాయికాప్రకరణమందు చూడగలరు.

శృంగార సహాయులు :

మూలం : తేషాం నర్మసచివః-పీఠమర్ద-విట-చేట-విదూషక
భేదా చ్చతుర్విధః; కుపిత స్త్రీప్రసాదకః పీఠమర్దః.
కామతంత్రకలాకోవిదో విటః; సంధానచతు
రశ్చేటః. అంగాది వైకృతైర్హాస్యకారీ విదూషకః.
-(రసమంజరి-116-119)

తాత్పర్యం : ధీరోదాత్తాది నాయకులకు నర్మసచివులు నలుగురు - పీఠమర్దుడు, విటుడు, చేటుడు, విదూషకుడు. కోపించిన స్త్రీని ప్రసన్నురాలిని చేసేవాడు పీఠమర్దుడు. కామతంత్రకలాకోవిదుడు - విటుడు. ప్రేయసీ-ప్రియుల సంధానంలో చతురుడు-చేటుడు. అంగ-వేష-భాషా వికారాలతో హాస్యం పుట్టించేవాడు - విదూషకుడు.

టీక : ఇంచుమించుగా, ధనంజయాదులందరి నిర్వచనాలు పై నిర్వచనాలతో సంవదిస్తున్నవని చెప్పవచ్చు. ఇప్పుడు ఈ నలుగురిని వివరిస్తాను.

*i)* పీఠమర్దుడు :

నాట్యశాస్త్రంలో ఈ పేరు కానరాదు.

పీఠం=ఆసనం; మర్దనం=సంవహనం-అని అమరకోశార్థం. అంటే ఎదుట పీఠమధిష్ఠించి, నాయకాదుల విషయంలో ప్రయోక్త అవుతాడు. పీఠమర్దుడు విశ్వసనీయుడు, కుపితస్త్రీప్రసాదకుడు. (భా.ప్ర-IV-186).

పీఠమర్దుడు 'పతాకానాయకుడు' అని ధనంజయుడు చెప్పగా రామునకు సుగ్రీవునివలె అని ధనికుడు స్పష్టం చేసినాడు; పతాకానాయకుడు ఉపనాయకుడు అని శారదాతనయుడు పేర్కొన్నాడు.

కాగా, 'కుపిత స్త్రీ ప్రసాదకుడు' అనే విశేషణం పీఠమర్దునకు సమంజసం కాదు (ధనంజయుడు ఈ విశేషణం చెప్పలేదు). కాగా, ఈ పీఠమర్దుడు పతాకానాయకుడైన పీఠమర్దునికంటె భిన్నుడు కావాలి.

*ii)* విటుడు :

మూలం : సూత్రధారగుణై ర్యుక్తః సర్వ ఏవ ప్రయోగే యః
వేశ్యోపచారకుశలో మధురో దక్షిణః కవిః ।
శాస్త్రార్థతత్త్వ వేదీ చ నిపుణో వైశికేషు చ
ఊహాపోహక్షమో వాగ్మీ చతురశ్చ విటో భవేత్ ॥
-(నా.శా. XXXV-76-77)

తాత్పర్యం : నాట్యప్రయోగమందంతటా సూత్రధారుని గుణాలవంటి గుణాలు కలవాడు, వేశ్యోపచార కుశలుడు, మధురస్వభావుడు, దాక్షిణ్యం కలవాడు, కవి, శాస్త్రార్థాల తత్త్వం తెలిసినవాడు, వైశిక విషయములందు నిపుణుడు, ఊహాపోహసమర్థుడు, వాగ్మి, చతురుడు - ఇట్టివాడు విటుడు.

టీక : 'ఏకవిద్యో విటః' అని ధనంజయాదులు; విటుడు ఏదో ఒక విద్య లేదా కళయందు నిపుణుడని అర్థం. కావి, నా.శా. నిర్వచనం విపులంగా ఉన్నది.

"సంభోగమునకు చాలని సంపదకలవాడు, నృత్య-గీతాది కళలలో కొంతనేర్పరి, ఉపచరించటంలో సమర్థుడు, మాటనేర్పరి, మధురస్వభావుడు, గోష్ఠియందు చతురుడు" అని విశ్వానాథుడు విటుని వర్ణించినాడు (సా.ద.)

మృచ్ఛకటికప్రకరణమందు 'విటుడు' కన్పట్టగలడు; అందు అతడు ఉత్తమవైశికుడుగా చిత్రింపబడినాడు. విటుని గతి ప్రచారం నా.శా. 12వ అధ్యాయంలో వివరింపబడింది.

*iii)* చేటుడు :

మూలం : కలహప్రియో బహుకథో విరూపో బంధసేవకః ।
మాన్యామాన్య విశేషజ్ఞ శ్చేటో హ్యేవం విధః స్మృతః ॥
-(నా.శా.XXXV-80)

తాత్పర్యం : కలాప్రియుడు (పాఠాంతరం-కలహప్రియుడు), బహుకథాకథనకుశలుడు, విరూపుడు, గంధ సేవకుడు (పాఠాంతరం-బంధసేవకః =bonded labourer), మాన్య-అమాన్య విశేషజ్ఞుడు - ఇట్టివాడు చేటుడు.

టీక : నాయికానాయకులకు సంధానకర్త అని సింగభూపాలాదులు.

మృచ్ఛకటికప్రకరణంలో 'చేటుడు' కూడా చక్కగా చిత్రింపబడినాడు; అతడు మాన్య-అమాన్య విశేషజ్ఞుడు.

iv) విదూషకుడు :

మూలం : వామనో దంతురః కుబ్జో ద్విజిహ్వో వికృతాననః ।
ఖలతి పింగలాక్షశ్చ స విధేయో విదూషకః ॥
-(నా.శా.XXXV-79)

తాత్పర్యం :వామనుడు, దంతురుడు (=పొడుగు దంతాలు కలవాడు), కుబ్జుడు, ద్విజుడు (పాఠాంతరం- ద్విజిహ్వుడు =అక్కడి మాటలు ఇక్కడ, ఇక్కడి మాటలు అక్కడ చెప్పేవాడు), వికృతాననుడు, ఖలతి (=బట్టతల వాడు), పింగలాక్షుడు - ఇట్టివాడు విదూషకుడు.

మూలం : లోకాహ్లాదాశ్రయకృతం సర్వప్రకృతి పదుపచార సంయుక్తమ్ ।
నానాశ్రయం ప్రకురుతే తథా చ నార్యాశ్రయం వాఽపి ॥
ప్రత్యుత్పన్నప్రతిభో నర్మకృతై ర్నర్మగర్భ నిర్భేదైః శ్చ ।
ఛేకో విదూషితవచనో విదూషకో నామ విజ్ఞేయః ॥
-(నా.శా.XXXV-92-93)

తాత్పర్యం : లోకులను సంతోష పెట్టేవాడు, సర్వప్రకృతుల చేష్టలను అను కరించగలవాడు, అనేక ఉపాయాలను కనిపెట్టగలవాడు, స్త్రీలలో కలిసి పోగల వాడు, ప్రత్యుత్పన్నప్రతిభుడు, నర్మప్రయోక్త, నర్మగర్భభేద్యుడు, చతురుడు, విదూషితవచనుడు (=మాటలమధ్య కలుగజేసుకొని ప్రసంగాంతరమునకు కొని పోయేవాడు) - ఇట్టివాడు విదూషకుడు.

టీక : మొదటి శ్లోకం ప్రయోక్తల గుణాలను వర్ణించే సందర్భంలోనిది; ఇంక పై శ్లోకాలు రెండు 'భరతుల వికల్పనం' వివరించిన సందర్భంలోనిది. సాహిత్యదర్పణకారుని వివరణ ఇట్లా ఉన్నది (సా.ద.):

"కుసుమవసంతాది నామాలు కలవాడు, చేష్ట-దేహం - వేషం - భాష మున్నగువాటిచేత హాస్యకారి, జగడగొండి, తనపని (=భోజనాదికం) బాగా ఎరిగినవాడు."

'విదూషక' పదానికి అభినవగుప్తుడు రెండు వ్యుత్పత్తులు చెప్పినాడు (నా.శా. 3వ సం. పుట 251) :

1. విగ్రహాన్ని (=కలహాన్ని) సంధిచేసి దూషించె (=పోగొట్టే)వాడు కావున విదూషకుడు (అట్లాగే సంధిని విగ్రహంచేత పోగొట్ట గలవాడు - నా.ద).

2. విప్రలంభమందు, వినోదం కలిగించి, విప్రలంభాన్ని మరపించే వాడు కావున 'విదూషకుడు'.

ధీరోదాత్తాదిచతుర్విధనాయకులకు చతుర్విధ విదూషకులుంటారనీ, వీరు శృంగార విషయంలో నాయకులకు సహాయులుగా ఉంటారనీ, మంచిమంచి కథలను చెప్పటంలో నిపుణులై నాయకులకు విప్రలంభమందు మిత్రులుగా ఉంటారనీ భరతముని, అభినవగుప్తుడు వివరించినారు (నా.శా.XIV) :

| | | |
|---|---|---|
| దివ్యనాయకునకు | — లింగి(=ఋషి) | విదూషకుడు |
| నృపులకు | — ద్విజుడు | ,, |
| సేనాపతి, అమాత్యులకు | — రాజజీవి | ,, |
| బ్రాహ్మణ-వణిజులకు | — శిష్యుడు | ,, |

నాట్యశాస్త్రమందలి ఈవిభజనను పురస్కరించుకొని, నలుగురు విదూషకుల లక్షణములను శారదాతనయుడు ఇట్లా వివరించినాడు (భా.ప్ర.IX-288-94):

*1.* దేవ విదూషకుడు : సత్యవచనుడు, త్రికాలవేత్త, కార్య-అకార్య విశేష విదుడు, ఊహాపోహ విశారదుడు, యథాదృష్టార్థవాది, నాట్యవిదుడు, పరిహాసకుడు.

*2.* భూపాల విదూషకుడు : అగ్రామ్యపరిహాసకుడు, ద్రవ్యవిషయంలో, స్త్రీ విషయంలో దోషదూరుడు, శుద్ధుడు, దేవి పరిజనులకు ఇష్టుడు, ఈర్ష్యను కలహాన్ని పుట్టించేవాడు, సదా అంతఃపురసంచారి.

నర్మవిదుడు, ప్రణయకుపిత అయిన దేవిని ఒకింత ప్రసన్నురాలిని చేయగ లవాడు, భూపతికి భోగినీవనితలకు పరస్పరప్రీతి రతి కలిగించటంలో నేర్పరి. ఒకప్పుడు ఘటనం కూర్చగలడు, మరియొకప్పుడు విఘటనం కూడా కూర్చగలడు.

*3.* అమాత్యాదుల విదూషకుడు : అశ్లీలవాక్కు. దంపతుల అపరాధం వ్యక్తం చేసేవాడు. నిత్యం భక్ష్య-అభక్ష్య ప్రియుడు. మర్మస్పృక్ నర్మవచనములు పలికేవాడు. ద్రవ్యం లభించితే ప్రీతి ప్రదర్శించగలడు. భోగినీవనితలను సంతోష పెట్టేవాడు. పరిహాసవాక్యములందు, పరిహాసప్రాయకథలందు ఆసక్తి కలవాడు.

*4.* వణిజుల విదూషకుడు : ఇతడు శఠుడు. విరూపవేషుడు, విరూపాం గుడు, విరూపవచనుడు, విరూప పరిహాసకుడు, విరూప-అభినయాన్వితుడు - అంతా విరూపంగానే ఉంటుంది ఇతని చేష్ట.

టీక : రత్నావళి నాటికలోని విదూషకుని పేరు 'వసంతకుడు'. అతడు, రాజునకు, రత్నావళితోడి సమాగమంలో తోడ్పడినాడు.

## 17. దూతలు :

మూలం : నిసృష్టార్థో మితార్థశ్చ తథా సందేశహారకః ।
కార్యప్రేష్య స్త్రిధా దూతో దూత్యశ్చాపి తథా విధాః ॥
ఉభయో ర్భావమున్నీయ స్వయం వదతి చోత్తరమ్ ।
సుశ్లిష్టం కురుతే కార్యం నిసృష్టార్థస్తు స స్మృతః ॥
మితార్థభాషీ కార్యస్య సిద్ధికారీ మితార్థకః ।
యావద్భాషిత సందేశహారః సందేశహారకః ॥ -(సా.ద.III-58-60)

తాత్పర్యం : కార్యప్రేష్యుడు (=పనిమీద పంపబడినవాడు =దూత) ముప్విధాలు - నిసృష్టార్థుడు, మితార్థుడు, సందేశహారకుడు. దూతికలు కూడా ఇట్లాగే ముప్విధాలు - నిసృష్టార్థ, మితార్థ, సందేశహారిక.

*1.* ఉభయుల (=పంపిన వ్యక్తి యొక్క, ఎవరి వద్దకు పంపబడినాడో ఆ వ్యక్తి-యొక్క) భావాలను ఊహించి, తానే సమాధానం చెప్పి, కార్యాన్ని చక్కగా ఘటింపజేసేవాడు నిసృష్టార్థుడు.

*2.* మితంగా మాటాడి, కార్యసిద్ధిని సాధించేవాడు మితార్థుడు.

*3.* చెప్పినది చెప్పినట్లు సందేశమందించేవాడు సందేశహారకుడు.

టీక : భరతముని దూతికలను, వారి గుణాలను మాత్రమే వర్ణించినాడు (నా.శా.xxiii-9-17) తరువాత అయన వర్ణించిన విదూషక, విట, చేటులకు పీఠమర్దుని కలిపి, అర్వాచీనాలంకారికులు, ఈ నలుగురిని నాయకులకు శృంగార సహాయులన్నారు. అయితే వీరు కూడా దూతలు కావచ్చు. ఇంక పై సా.ద. వివరణలోని ముప్వురు కేవలం శృంగార దూతలే కానక్కరలేదు; ఇటువంటివారు రాజకీయాదులందు కూడా దూతలు కాగలరు.

పీఠమర్దాది సహాయుల గుణాలను సింగభూపాలుడిట్లా వర్ణించినాడు (ర.సు.I-92-93):

మూలం : దేశకాలజ్ఞతా భాషామాధుర్యం చ విదగ్ధతా ॥
ప్రోత్సాహనే కుశలతా యథోక్తకథనం తథా ।
విగూఢమంత్రతేత్యాద్యాః సహాయానాం గుణామతాః ॥

తాత్పర్యం :దేశ-కాలాలను గుర్తెరగటం, భాషామాధుర్యం, విదగ్ధత, ప్రోత్సహించటంలో కుశలత, చెప్పినదానిని చెప్పినట్లే చెప్పటం, ఆలోచనను గుప్తంగా ఉంచటం - ఇవి సహాయులయొక్క గుణాలు.

టీక : భరతముని దూతీగుణాలుగా, దూతీకృత్యాలుగా చెప్పినవి కొన్ని, పైగుణాలతో సంవదిస్తున్నవి. క్రింది గుణాలు కలవారిని దూతగా కాని, దూతికగా కాని పంపరాదని భరతముని దూతీ ప్రసక్తిలోనే ఇట్లా చెప్పినాడు. (నా.శా.XXIII)-

| | | |
|---|---|---|
| దూత | — | దూతిక |
| దీనుడు | — | దీన |
| రూపవంతుడు | — | రూపవంతురాలు |
| అర్థవంతుడు | — | అర్థవంతురాలు |
| అతిచతురుడు | — | అతిచతుర |
| ఆతురుడు | — | ఆతుర |
| జడుడు | — | జడమతి |

ఇందులో మొదటి నలుగురు, మధ్యలో, తమ స్వార్థంచూసుకోగలరు; చివరి ఇరువురు కార్యభంగానికి కారకులవుతారు.

నాయకసహాయులను (=దూతలను) గూర్చి, వారి గుణాలను గూర్చి వాత్స్యాయనుడు ఇట్లా వివరించినాడు (వాత్స్యాయన సూత్రాలు-పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారి అనువాదం - పుటలు : 214-218 - సూత్రాలు 251-56). దూతలను మూడు అంశాలనుపట్టి నిర్ణయించుకోవాలి: 1. స్నేహం, 2. గుణం, 3. జాతి.

*i)* స్నేహంవల్ల :

సహపాంశు క్రీడితుడు (చిన్నతనం నుంచీ తనతో, దుమ్ములో, ఆటపాట లలో పాల్గొంటూ, స్నేహభావం నెరపేవాడు)

ఉపకారసంబుద్ధుడు (ఉపకారం పొందటంవల్ల కృతజ్ఞుడు)

సమానశీల -వ్యసనములు కలవాడు (స్వభావంలో, వయస్సులో, అలవా ట్లలో తనతో సమానుడు)

సహాధ్యాయి (ఒక గురువువద్ద తనతో కలిసి చదువు కొన్నవాడు)

మర్మజ్ఞుడు (తన రహస్యాలు తెలిసినావాడు)

రహస్యధరుడు (తన రహస్యాలను దాచగలిగినవాడు)

ధాత్రపత్యం (తనకు స్తన్యమిచ్చిన దాదియొక్క కుమారుడు)

సహసంవృద్ధుడు (ఒకే గ్రామంలో పుట్టి, పెరిగి, చిన్నప్పటినుంచీ ప్రేమతో ఉండేవాడు)

— పై తొమ్మిదిమంది, స్నేహంవల్ల, నాయకులకు మిత్రులు (దూతలు కూడా).

*ii) గుణం వల్ల :*

పితృపైతామహుడు (తాతముత్తాల కాలంనుంచి మైత్రికల కుటుంబంలోని వాడు)

అవిసంవాదకుడు (సర్వదా చెప్పినట్లు నడచుకొనేవాడు)

అదృష్టవైకృతుడు (ఐశ్వర్యవంతుడు)

వశ్యుడు (వశుడై ఉండేవాడు)

ధ్రువుడు (స్థిర స్వభావుడు)

అలోభశీలుడు (లోభికానివాడు)

అపరిహార్యుడు (పరులకు లొంగనివాడు)

అమంత్రవిస్రావి (=రహస్యాలను వెలిబుచ్చనివాడు)

— వీరు గుణాను పట్టి మిత్రులు.

**iii) జాతివల్ల :**

రజకుడు (=చాకలి), నాపితుడు (=మంగలి), మాలాకారుడు, గాంధికుడు (=చందనాదులమ అమ్మేవాడు), శౌరికుడు (పానీయాలు లేదా సుర అమ్మేవాడు), భిక్షుకుడు, గోపాలకుడు, తాంబూలికుడు, సౌవర్ణికుడు (=విశ్వబ్రాహ్మణుడు), పీఠమర్దుడు, విటుడు, విదూషకుడు మున్నగువారు జాతినిపట్టి మిత్రులు.

పైవృత్తులవారి భార్యలు కూడా మిత్రులు కాగలరు; ఇతరుల ఇండ్లలో స్త్రీలు చొరబడి విశ్వాసంకలిగించినంతగా పురుషులు చేయజాలరు కదా!

నాయికా నాయకులిరువురకు మిత్రుడు, ఇరువురి పట్ల ఉదారుడు, విశేషించి నాయిక యొక్క విశ్వాసం చూరగొన్నవాడు - ఇట్టివాడే దూతకర్మయందు సిద్ధిపొందగలడు.

దూతగుణాలు :

పటుత్వం, ధార్ష్ట్యం (=ప్రోడతనం)

ఇంగితజ్ఞత (ముఖరీతిని పట్టి భావం గ్రహించటం)

అనాకులత్వం (వ్యాకులపాటు లేకపోవటం)

పరమర్మజ్ఞత (ఇతరులమర్మాలను కనిపెట్టటం)

ప్రమాణత (నియమంతో మెలగటం)

ప్రతారణం (అవసరమైతే వంచించి తప్పుకొనటం)

దేశకాలజ్ఞత (తాను ఉన్నప్రదేశాన్ని, ప్రోత్సహించతగిన కాలాన్ని గుర్తించటం)

విషహ్యాబుద్ధిత్వం (వివేచన పూర్వకమైన పట్టుదల కలిగి ఉండటం)

లఘుప్రతిపత్తిసోపాయత (కార్యసాధనలో ఉపాయాలను అనుసరించి మెల గటం)

—పైగుణాలు కేవలం శృంగారమునందేకాక, రాజకీయాదులందును ఉపయుక్తాలే!

భోజుని విభజన (శృం.ప్ర. 28, 29 ప్రకాశనములు) :

కామసూత్రకారుడుచేసిన - స్నేహ - గుణ - జాతి అనే త్రివిధవిభజన భోజుని ప్రకారం పది విధాలయినది; ఇందులో మొత్తం 84 మంది దూతలు నిర్దేశింపబడినారు.

*1. జాతి :* దేవ-మనుష్య-కిన్నర-వానర-శుక-శారికా-పారావత-హంసాదులు.

*2. గుణం :* పితృపితామహ-అదృష్టవైకృత-అవిసంవాదక-అలోభశీల- అమంత్రవిశ్రావి-ధార్మిక-భారసహిష్ణువులు.

*3. క్రియ :* సహపాంశుక్రీడిత-ఉపకారసంబద్ధ-జన్మాంతరార్జిత-సహాధ్యాయి-సమాన శీలవ్యసన-మర్మజ్ఞ-ధాత్రపత్య-సహసంవృద్ధులు.

*4. ద్రవ్యం :* మాలాకార-తాంబూలిక-గాంధిక-సౌరిక-పీఠమర్ద-విట-విదూషక- పాషండ-మిత్రులు (వైద్య-వైదికులు కూడా తరువాత చేరినారు).

5. సంబంధం : గురు-సఖా-శిష్య-ప్రేష్య-ఆత్మ-జ్ఞాతి-ఔరస-కనీయసులు.

6. అర్థం : అర్థానర్థ-ప్రతిఘాత-సహోర్థత-ప్రాప్తి-ప్రతారణ-ఆనృణ్య-కీర్తి-ప్రతీతులు.

7. ప్రయోజనం : దయా-స్నేహ-కుతూహల-అభిప్రాయోపలంభ-పూర్వప్రార్థనా- అన్యతరప్రార్థనా-శీల-సంఘర్షములు.

8. ప్రయోగం : ప్రచ్ఛన్న-ప్రకాశహీన-ఉత్కృష్ట-ఉద్ధత-ఉదాత్త-ధృష్ట-శఠులు.

9. యోగ్యత : నిస్సృష్టార్థ-పరిమితార్థ-పత్రహారక-మూకదూత-స్వయందూత- మూఢదూత-భార్యాదూత-వాతదూత-ఛద్మదూత-మంత్రదూత- తంత్రదూతలు.

10. స్త్రీత్వం : ఈక్షణికా-భిక్షుకీ-సఖీ-ధాత్రేయికా-విధవా- దాసీ-శిల్పకారికా-శిల్పినులు.

టీక : పై పదివర్గాలలో అర్థం, ప్రయోజనం - అనే రెండు వర్గాల క్రింద వ్యక్తులు నిర్దేశింపబడలేదు.

భోజుని క్రియ వాత్స్యాయనుని స్నేహంతోను, ద్రవ్యం-జాతితోను, గుణం గుణంతోను సంవదిస్తున్నవి.

కవికర్ణపూరగోస్వామి ప్రకారం శ్రీకృష్ణుని మిత్రులు నాలుగు విధాలు (ఈ విభజన ప్రేమయొక్క, నర్మజ్ఞత యొక్క అధిక్యంమీద ఆధారపడినది):

1. సఖుడు 2. ప్రియసఖుడు
3. నర్మసఖుడు 4. ప్రియనర్మసఖుడు

అట్లాగే నాయిక విషయంలో కూడా :

1. సఖి 2. ప్రియసఖి (ఛాయవలె అనుసరించి ఉండేది)
3. నర్మసఖి 4. ప్రియనర్మసఖి (=స్వ-పర సంకోచం లేనిది)

## 18. దూతకర్మలు :

శృంగారప్రకాశం, 28 వ ప్రకాశనంలో, భోజుడు 24 దూతకర్మలను పేర్కొన్నాడు (ఇందులో కొన్ని ఇంతకుముందు పేర్కొన్నవే):

1 ప్రవేశం, 2. విశ్వాసనం, 3. ఉపావర్తనం, 4. అనువర్తనం, 5. కార్యోపన్యాసం, 6. అవస్థానివేదనం, 7. ఇంగితాకారజ్ఞానం,

8. ఉపాయజ్ఞానం, 9. ప్రకరణజ్ఞానం, 10. ప్రతారణం, 11. సమాశ్వాసనం, 12. అత్యయప్రతీకారం, 13. ప్రయోజ్య ప్రేషణం, 14. సంధిరక్షణం, 15. ప్రతాపవ్యావర్ణనం, 16. ప్రయోజ్యోపజాప్యం, 17. పరాక్రమణం, 18. బంధు రత్నాపహారం, 19. మిత్రోపగ్రహం, 20. సుహృద్విభేదం, 21. చారజ్ఞానం, 22. గూఢదండాతిచారం, 23. చారసమాధానం, 24. సమాధిమోక్షణం.

— ఈ కర్మలలో మరల అనేక భేదాలున్నవి. (ఉదా: ప్రవేశం 18 విధాలు). ఈ భేదోపభేదాలకు మాలతీమాధవం నుంచి చాలా ఉదాహరణలు ఈయబడినవి.

ఉపమైకా శైలూషీ సం
ప్రాప్తా చిత్రభూమి భేదాన్ ।
రంజయంతి కావ్యరంగే
నృత్యంతీ తద్విదాం చేతః ॥

-అప్పయ్యదీక్షితులు

కావ్యం యశసేఽర్థకృతే వ్యవ
హారవిదే శివేతరక్షతయే।
సద్యఃపర నిర్వృతయే కాంతా
సమ్మితతయోపదేశయుజే ॥

కావ్యప్రకాశము-I-2

# నాయికలు

మూలం : ఏతే తు నాయకా జ్ఞేయా కావ్యబంధేషు సర్వదా ।
నాయికాశ్చైవ వక్ష్యామి చతస్రః పున రేవ తు ॥
దివ్యాచ నృపపత్నీచ కులస్త్రీ గణికా తథా ।
ఏతాస్తు నాయికా జ్ఞేయా నానా ప్రకృతిలక్షణాః ॥
ధీరా చ లలితా చైవ ఉదాత్తా నిభృతా తదా ॥
దివ్యా రాజాంగనాశ్చైవ గుణైర్యుక్తా భవంతి హి ।
ఉదాత్తా నిభృతా చైవ భవేత్తు కులజాంగనా ॥
లలితే చాప్యుదాత్తే చ గణికా శిల్పకారికా ।
–(నా.శా. XXIV-23-26)

తాత్పర్యం : వీరు (=ధీరోదాత్తాది నాయకులు నలుగురు) కావ్యబంధము లందు నాయకులుగా ఉంటారు. ఇంక నలుగురు నాయికలను గూర్చి వివరి స్తాను :

దివ్యస్త్రీ, నృపపత్ని (=మహారాణి), కులస్త్రీ, గణిక (=సామాన్య =వేశ్య) - ఈ నలుగురు నాయికలు. వీరు శీలాన్ని అనుసరించి, లక్షణా లను అనుసరించి నాలుగు విధాలుగా ఉంటారు - ధీర, లలిత, ఉదాత్త, నిభృత. దివ్య-నృపపత్నులిరువురు ఈ నాలుగు లక్షణాలు కలిగి ఉంటారు. కులజాంగన (= కులస్త్రీ) ఉదాత్త, నిభృతగా ఉంటుంది. గణికా-శిల్పకారి కలు లలితలు, ఉదాత్తలు అవుతారు.

టీక : ఇటువంటి విభజనను అర్వాచీను లెవ్వరూ అనుసరించలేదు. అయితే గణిక, తరువాతి కాలంలో 'సామాన్య' అయినది. లలిత-ఉదాత్త పదాలను గ్రహించి, ఉద్ధత-శాంత పదాలను చేర్చి, నాయకులలోని ధీరోదాత్తాది విభజనవంటి విభజనను నాయికల విషయంలో శారదాతనయుడు చేసినాడు. ధీరోదాత్త, ధీరోద్ధత, ధీరలలిత, ధీరశాంత (ఇవి తరువాత వివరింపబడగలవు).

మూలం : త్రివిధా ప్రకృతిః స్త్రీణాం నానాసత్త్వసముద్భవా ।
బాహ్యా చాభ్యంతరా చైవ స్యాద్బాహ్యాభ్యంతరా పరా ॥
కులీనాభ్యంతరా జ్ఞేయా బాహ్యా వేశ్యాంగనా స్మృతా ।
కృతశౌచా తు యా నారీ సా బాహ్యాభ్యంతరా స్మృతా॥
-(నా.శా. XXII-152-53)

నానాశీలాలుగల స్త్రీల ప్రకృతి ముత్త్రివిధాలు– బాహ్య, అభ్యంతర, బాహ్యాభ్యంతర. కులీన 'అభ్యంతర' అవుతుంది; వేశ్యాంగన 'బాహ్య'; ఇంక కృతశౌచ 'బాహ్యాభ్యంతర' అవుతుంది.

టీక : ఈ భేదాలను శీలభేదాలు అన్నప్పటికీ, వీటిని నాయికా భేదాలుగా పరిగణించవలసి ఉంటుంది. కులీన అంటే కులస్త్రీ=కులజాంగన=ఉన్నత కులంలో పుట్టిన స్త్రీ. బాహ్య అంటే వేశ్యాంగన. ఇంక కృతశౌచ అంటే శుద్ధశీలంకల లేదా ఒకనికే కట్టుబడి ఉన్న వేశ్య - మృచ్ఛకటికలోని వసంతసేన వంటిది. ఈ సందర్భంలో భరతముని ఇంకా ఇట్లా వివరించినాడు.

"నాట్యధర్మమందు స్త్రీ-పురుష సంశ్రయమైన కామోపభోగం బాహ్య-అభ్యంతర భేదంచేత రెండు విధాలు. వీటిలో 'అభ్యంతరం' కులీనపరంగా నాటకమందు రాజులచేత అనుసరింపబడుతుంది. ఇంక 'బాహ్యం' ప్రకరణమందు వేశ్యాగతంగా ఉంటుంది. అంతఃపురోపచారమందు నాయిక కులజకాని, కన్యకాని అవుతుంది. రాజకృతమైన కామోపచారమందు బాహ్యస్త్రీ భోగం వాంఛనీయం కాదు. అయినా రాజునకు దివ్యవేశ్యాంగనతో సంగమం కలుగవచ్చు". ఉదా: విక్రమోర్వశీయమందలి ఊర్వశి. అర్వాచీనులు చెప్పిన స్వీయా-పరకీయా-సామాన్య భేదాలకు భరతముని పేర్కొన్న పైవిభజన మార్గదర్శకం అయిఉంటుంది. పురుషులకు అభిగమ్యయగు నాయికా గుణాలను, స్త్రీలకు అభిగమ్యుడగు నాయక గుణాలను శారదాతనయుడిట్లా పేర్కొన్నాడు (భా.ప్ర. V-27-31):

మూలం : మహోదయో మహాభాగః కృతజ్ఞో రూపవాన్ యువా ॥
మాన్యః సుశీలః సుభగో విదగ్ధో వంశవాన్ శుచిః ।
అల్పనిద్రో మధురవా గభిగమ్యో భవేత్ స్త్రియా ॥
విజ్ఞానరూపసంపన్నా రూపయౌవనశాలినీ ।
దేశకాలవిభాగజ్ఞా కలాశిల్పవిచక్షణా ॥
కార్యాకార్యవిశేషజ్ఞా భావజ్ఞా వినయాన్వితా ।

వ్రీడావతీ క్షమాయుక్తా లోకయాత్రానువర్తినీ ॥
ఏవమాదిగుణైర్యుక్తా పుంసాం గమ్యైవ నాయికా ।

తాత్పర్యం : మహోదయుడు, మహాభాగుడు, కృతజ్ఞుడు, రూపవంతుడు, యువకుడు, మాని, సుశీలుడు, సుభగుడు, విదగ్ధుడు, కులీనుడు, నిర్భయుడు, అల్పనిద్ర కలవాడు, మధురభాషి - ఇటువంటి నాయకుడు స్త్రీలకు అభిగమ్యుడు.

విజ్ఞానసంపన్న, రూపసంపన్న, రూపశాలిని, యౌవనశాలిని, దేశ-కాల విభాగాలు తెలిసినది, కలలు శిల్పాలు-వీటియందు నిపుణ, కార్య-అకార్యాలను గుర్తించగలది, భావాలను తెలిసికోగలది, వినయవంతురాలు, వ్రీడావతి, క్షమించగలది, లోకయాత్రను అనుసరించేది - ఇట్టి గుణాలు కల నాయిక పురుషులకు అభిగమ్య అవుతుంది.

భరతముని నాయికా-నాయక భూమికలను ధరించే నటీ-నటులను గూర్చి ఇట్లా వివరించినాడు (నా.శా. XXXV-*75-76, 84-86*):

మూలం : తజ్జ్ఞో రూపవాం శ్చైవ దృష్టోపకరణక్రియః ॥
మేధావీ చ విధానజ్ఞః స్వకర్మకుశలో నటః ।
- - - - -
రూప-గుణ-శీల-యౌవన-సువర్ణ-మాల్యాభరణైః సంపన్నా ।
విశదా స్నిగ్ధా మధుర పేశలవచనా శుభరక్తకంఠీ చ ॥
యోగ్యాయా మసంక్షుభితా లయతాలజ్ఞా రసైశ్చ సంపన్నా ।
వస్త్రాభరణ సంయుక్తా గంధమాల్యోపశోభితా ॥
ఏవంవిధ గుణై ర్యుక్తా కర్తవ్యా నాయికా తజ్జ్ఞైః ।

తాత్పర్యం : తజ్జ్ఞుడు, రూపవంతుడు, ఉపకరణ క్రియాదక్షుడు, మేధావి, విధానజ్ఞుడు, స్వకార్యకుశలుడు-అయిన పురుషుడు నటుడు (=నాయక భూమికాధారి) గా ఉండాలి.

రూపసంపన్న, గుణసంపన్న, శీలవతి, యౌవనవంతురాలు, బంగారం వంటి శరీరకాంతి కలది, మాల్య- ఆభరణ సంపన్న, విశద, స్నిగ్ధ, మధుర స్వభావ, పేశల వచన, శుభ్ర రక్తకంఠ (= శుభకరమై అనురాగం సూచించే కంఠస్వరం కలది), అభ్యాస సమయమందు క్షోభపడనిది, లయ—తాలజ్ఞ, రస-

భావజ్ఞ, సర్వాభరణసంయుక్త, గంధ-మాల్యోపశోభిత-అయిన స్త్రీ నాయికా భూమికాధారిణి కావాలి.

టీక : భరతముని నాయికా-నాయక భూమికలను ధరించే వారే ఎంత ఉన్నతులుగా ఉండవలెనో వర్ణించినప్పుడు, ఇంక అసలు నాయికా-నాయకులు ఎట్లుండవలెనో మనం ఊహించగలం. అంతేకాదు. ఎటువంటి స్త్రీ నాయికా భూమికకు అర్హురాలు కాదో కూడా వర్ణించినాడు: "అస్థానహాసిని, రూక్ష, అవిద్ధగతిచేష్టాయుత, దీర్ఘరోష, దీన, ఉద్వృత్త, ఉద్భట, సర్వదోషయుత, గంధ-మాల్య శోభారహిత అయిన స్త్రీ నాయికా భూమికకు అర్హురాలు కాదు" (నా.శా. XXXV-86-87).

ఇప్పట్ల, నందికేశ్వరుడు నిషిద్ధపాత్రములు పట్ల చెప్పిన శ్లోకం జ్ఞప్తికి రాకమానదు - పుష్పాక్షీ...

మూలం : స్వాన్యా సాధారణ స్త్రీతి తద్గుణా నాయికా త్రిధా ।
-(ద.రూ. II-15)

అర్థ : తత్-గుణా=వానియొక్క (=నాయకునియొక్క) సామాన్య గుణాలవంటి గుణాలు కలదై; నాయికా త్రిధా, స్వా-అన్యా-సాధారణ స్త్రీ(=నాయిక కూడా మువ్విధాలు - స్వ(=స్వీయ=స్వకీయ), అన్య(=పర కీయ), సాధారణ స్త్రీ=గణిక=వేశ్య).

తాత్పర్యం : అలంకారికులచేత - పతి, ఉపపతి, వైశికుడు అనే భేదాల చేత నాయకుడు మూడు విధాలుగా వర్ణించబడినాడు. ఆ మువ్వురు నాయకులకు చెప్పబడిన సామాన్య గుణాలే ఈ మువ్వురు నాయికలకు క్రమంగా అనువర్తిస్తాయి - పతి-స్వీయ; ఉపపతి- పరకీయ; వైశికుడు-సామాన్య.

టీక : నాయికలోకూడా నాయక సామాన్యగుణాలైన త్యాగాదులు యథా సంభవంగా ఉంటాయని విశ్వనాథుడు (సా.ద. III-68). భరతముని స్వీయాది భేదాలనుకాని, పతిమున్నగు భేదాలను కాని వర్ణించలేదు. కాని, ఆయన చెప్పిన అభ్యంతర-బాహ్యభేదాలు స్వీయా-సామాన్య భేదాలతో సంవదిస్తాయి.

సింగభూపాలుడు స్వీయాదిభేదాలను ఇట్లా వర్ణించినాడు (ర.సు. I-94):

రసాలంబనభూతా యా నాయికాత్ర నిరూప్యతే ।
స్వకీయా పరకీయా చ సామాన్యా చేతి సా త్రిధా ॥

అర్థం : యా, నాయికా, రసాలంబనభూతా=ఏ, నాయిక, (శృంగార) రసానికి ఆధారంగా; అత్ర, నిరూప్యతే=ఇచ్చట, నిరూపింపబడుతున్నదో; సా=ఆమె (=ఆ నాయిక); స్వకీయా, పరకీయా, సామాన్యా, ఇతి, త్రిధా=స్వకీయ, పరకీయ, సామాన్య, అని, మూడువిధాలు.

తాత్పర్యం : (శృంగార) రసానికి ఆధారమైనది నాయిక. అటువంటి నాయిక మూడువిధాలు.

1. స్వకీయ(=స్వీయ)-శాస్త్రోక్తరీతిగా వివాహంచేసుకొనబడిన భార్య.
2. పరకీయ(=అన్య)-పరుని భార్య.
3. సామాన్య (=వేశ్య=గణిక).

టీక : ఈ మువ్వురిని సంక్షిప్తంగా శారదాతనయుడు ఇట్లా వివరించినాడు (భా. ప్ర. IV-211-13):

"సమానకులం, సమానశీలం కల వరుడు వహ్నిసాక్షికంగా వివాహం చేసికొంటే, ఆమె 'స్వీయ' అవుతుంది. వహ్నిసాక్షికంగా వివాహం అయిన స్త్రీ, భర్తృవ్యతిక్రమం కలదైతే, ఆమె 'అన్య' (=పరకీయ) అవుతుంది. పెండ్లికాని కన్య, కులాచారవ్యతిక్రమం కలది అయితే ఆమెకూడా 'అన్య'యే అవుతుంది. స్వీయవనితలు భోగేచ్ఛ కలవారు. అన్యవనితలు భోగ-ధనేచ్ఛ కలవారు. గణికలు (=సామాన్యలు) ధనేచ్ఛ కలవారు. కవులు వీరిని ఇట్లాగే వర్ణించాలి."

# 1. నాయికా భేదాలు :

కావ్య-నాట్యాలలో నాయిక కూడా యథాసంభవాలయిన నాయక గుణాలు కలిగిఉంటుంది. అంటే ప్రబంధవ్యాపకత్వం (=కథలో అంతటా వ్యాపించి ఉండటం), ప్రధాన ఫలభోక్తృత్వం (=ప్రధానఫలానుభవం), మహాకులీనత మున్నగునవి నాయికా-నాయకు లిరువురికీ సమానమే.

పురుషులలోవలెనే స్త్రీలలోకూడా, రెండు వర్గాలుగా, సమాన విభజన లున్నవి.

1. సర్వసామాన్యం :

i) ఉత్తమ (=జ్యేష్ఠ)-మధ్యమ-అధమ (=నీచ =కనిష్ఠ) ప్రకృతులు.

ii) సాత్త్విక-రాజసిక-తామసిక భావోపేతలు.

iii) దివ్య (=ఇంద్రాణిమున్నగువారు), అదివ్య(=రాణి), దివ్యాదివ్య (=సీతవంటివారు).

iv) ఉదాత్త, ఉద్ధత, లలిత, శాంత.

v) నాయిక, ఉపనాయిక, అనునాయిక, ప్రతినాయిక (సాధారణంగా పట్టపురాణి- రాజు ఇంకో కన్యను ప్రేమించే సమయంలో).

vi) అభ్యంతర పరివారం.

2. శృంగారపరంగా :

i) స్వీయ, పరకీయ (=కన్య, అన్య), సామాన్య.

ii) ముగ్ధ-మధ్య-ప్రౌఢ.

iii) మదనాతుర, రక్త, విరక్త.

iv) ధీర, అధీర, ధీరాధీర.

v) జ్యేష్ఠ, కనిష్ఠ.

vi) బాహ్య, అభ్యంతర, బాహ్యాభ్యంతర.

vii) పద్మిని, చిత్రిణి, శంఖిణి, హస్తిని.

స్త్రీ-పురుషులందరూ సంగ్రహంగా ఉత్తమ-మధ్యమ-అధమ భేదాల చేత మువ్విధాలని భరతముని వివరించినాడు. అర్వాచీనాలంకారికులందరూ కూడా ఈ భేదాలను పాటించినారు.

భోజుడు చెప్పిన సాత్త్విక, రాజసిక, తామసిక భేదాలు పైమూడు భేదాలతో క్రమంగా సంపదిస్తాయి.

దివ్య, అదివ్య, దివ్యాదివ్య భేదాలనేకాక, భరతముని దివ్య, నృపపత్ని, కులస్త్రీ, గణికభేదాలను కూడా పేర్కొని ప్రకృతిలక్షణ భేదంచేత వీరు ధీర-లలిత-ఉదాత్త-నిభృతలు అవుతారని చెప్పినాడు. ధీరోదాత్తాది నాయకులవలె ఉదాత్తాదినాయికలు కూడా ఉంటారని శారదాతనయుడు వివరించినాడు.

ఇంక శృంగారపరంగా అభ్యంతర, బాహ్య, బాహ్యాభ్యంతర భేదాలను, మదనాతుర, రక్త, విరక్తభేదాలను భరతముని చెప్పినాడు.

స్వీయ, పరకీయ, సామాన్యభేదాలను ధనంజయాదులందరూ చెప్పినారు.

ముగ్ధ-మధ్య-ప్రౌఢ భేదాలు, ధీర-అధీర-ధీరాధీర భేదాలు, జ్యేష్ఠ-కనిష్ఠ భేదాలు, ఇవి స్వీయాదులలోని భేదాలు. స్వీయ, పరకీయ, సామాన్య

కన్య, స్వైరిణి భేదాలచేత నాయికలు అయిదు విధాలని కొందరన్నారు అని రసమంజరీవ్యాఖ్య. కులజ-దివ్య-క్షత్రియ-పణ్యకామినీ భేదాలచేత నాయిక చతుర్విధమని నాట్యదర్పణకారులు (IV.172).

నాయిక, ఉపనాయిక, అనునాయిక, ప్రతినాయిక—వీరు క్రమంగా నాయక, ఉపనాయక, అనునాయక, ప్రతినాయక సదృశులు. 'ప్రతినాయిక' అంటే 'సపత్ని' అని హేమచంద్రుడు పేర్కొన్నాడు.

పురుషుల విషయంలో బాహ్యపరివారాన్ని వివరించినట్లే స్త్రీలవిషయంలో అభ్యంతర పరివారాన్ని వివరించినాడు భరతముని - ఈ పరివారం 18 విధాలు.

భరతముని స్త్రీలలో నాలుగుయౌవన భేదాలను వివరించినాడు; దీనిని అర్వాచీనులందరు అనుసరించినారు. అంతేకాదు, భరతముని, బాహ్య-అభ్యంతర కామోపచారాలను విపులంగా వర్ణించినాడు; దీనిని శారదాతనయుడు తప్ప తక్కినవారంతగా పాటించలేదు.

భరతముని స్త్రీలలోని ముప్విధములైన సత్త్వజాలంకారాలను మొత్తం 20 వివరించినాడు; వీనిని అర్వాచీనులందరూ వివరించినారు. శృంగార నాయికలకు ప్రోషితభర్తృకాది ఎనిమిది అవస్థలను భరతముని చెప్పినాడు. దీనిని అందరూ అనుసరించారు. మానవులలోని పశు- పక్ష్యాదుల ప్రవృత్తిని పురస్కరించుకొని, భరతముని, కామోపచారాన్ని వివరించే సందర్భంలో, ఒక విచిత్రమైన వర్గీకరణ పేర్కొన్నాడు; దీనిప్రకారం, స్త్రీలలో-ప్రవృత్తిని లేదా శీలాన్నిపట్టి - 23 భేదాలున్నవి — దేవశీల, అసురశీల... వానరశీల... శ్వశీల...గోశీల. భరతముని చెప్పిన ఈ 23 భేదాలను అర్వాచీనులలో ఒక్క శారదాతనయుడే మరల వివరించినాడు. కొక్కోకుని 'రతిరహస్యం'లో కాకసత్త్వ (=కాకశీల), జ్యోతిరీశ్వరుని పంచసాయకంలో 'ప్రేతసత్త్వ' అనే భేదాలు కనిపిస్తున్నాయి. ఇంక కామశాస్త్రాదులందు పేర్కొనబడిన వర్గీకరణ మృగి-బాడబ-హస్తిని—వీరు ముగ్గురు క్రమంగా శశ-వృష-అశ్వజాతి పురుషులకు తగిన నాయికలు. అర్వాచీన కామశాస్త్రకర్తలు - కొక్కోకాదులు, వాత్స్యాయనుని ఈ విభజనను అంగీకరించలేదు.

పద్మిని-చిత్రిణి-హస్తిని-శంఖిని—వీరు నలుగురు క్రమంగా శశ-మృగ-అశ్వ-వృషభ జాతి పురుషులకు తగినవారు. కాని, తరువాతి వారి విభజన ప్రకారం పద్మిన్యాదులు నలుగురు క్రమంగా పాంచాల-దత్త (=వైశిక) - భద్ర - కూచుమారులకు తగిన నాయికలు.

## 2. నాయికల సంఖ్య :

మూలం : స్వీయా త్రయోదశవిధా ద్వివిధా చ పరాంగనా ॥
వేశ్యైకైవం షోడశధా తాశ్చావస్థాభి రష్టభిః ।
ఏకైక మష్టధా తాసా ముత్తమాది ప్రభేదతః ॥
త్రైవిధ్య మేవం స చతురశీతి స్త్రిశతీ భవేత్ ।
అవస్థాత్రయ మేవేతి కేచిదాహుః పరస్త్రియాః ॥
-(ర.సు. I-157-59).

తాత్పర్యం : ముగ్ధ, మధ్య, ప్రౌఢ భేదాలచేత స్వీయ ప్రధానంగా మూడు విధాలు. ముగ్ధ ఒకేవిధం. మధ్యాప్రౌఢలు ధీర-అధీర-ధీరాధీరాది భేదాలచేత, జ్యేష్ఠా-కనిష్ఠా భేదాలచేత ఆరేసి విధాలు. కాగా స్వీయ *13* విధాలు; పరాంగన (=వేశ్య) రెండువిధాలు; వేశ్యఏకవిధం - కాగా నాయికలు *16* విధాలు అవుతున్నారు. ఇందులో ఒక్కొక్కరు స్వాధీనభర్తృకాది ఎనిమిది అవస్థలు కలిగి ఉంటారు; అంతేకాదు వీరు మరల ఉత్తమాది భేదాల చేత మూడేసి విధాలు అవుతారు - అంటే మొత్తం *384* భేదాలు వస్తాయి *(16×8×3=384)*. పరకీయకు మూడే అవస్థలుంటాయని కొందరన్నారు.

టీక : నాయికలు 16 విధాలుఅనే సూత్రానికి, మొత్తం భేదాలు 384 అనటానికి మూలపురుషుడు రుద్రభట్టు (కావ్యాలంకారం-I-33-65). అంతే కాదు. జాతి, వయస్సు, అవస్థాది భేదాలచేత నాయికా భేదాలు అసంఖ్యాకము లన్నాడు.

384 భేదాలు, దివ్య-అదివ్య-దివ్యాదివ్య భేదాలచేత మొత్తం (384×3) 1152 భేదాలుఅవుతాయని కొందరు చెప్పిన దానిని భానుదత్తుడు పేర్కొని, ఈ అభిప్రాయం అంగీకారయోగ్యం కాదన్నాడు - కారణం దివ్యాదిభేదాలు జాతి భేదాలేకాని అవస్థా భేదాలు కాకపోవటం. ఇంకా ఇట్లా చెప్పినాడు: ప్రజ్ఞాసామగ్రి లేకపోవటం చేత ముగ్ధకు ధీరాదిభేదాలు ఉండవు; అట్లాగే అష్టవిధావస్థలు కూడా ఉండవు. కానీ, ప్రాచీమల వ్రాతలనువట్టి, ఇచ్చట నవోఢగ్రాహ్యం; అందుచేత ముగ్ధావిషయంలో ఈభేదాలు ఉండవచ్చు. అట్లాగే 'మూఢం'కల పరకీయ పట్లకూడా ధీరాదిభేదాలు ఉండవచ్చు.

ప్రధాన నాయికా భేదాలను పట్టిక రూపంలో చూడవచ్చు:




పై విభజనలో పరకీయ రెండేవిధాలు; కాని భానుదత్తుడు పరకీయలో క్రింది విధంగా 12 భేదాలు చెప్పినాడు:

పరోఢ (=పరకీయ=అన్య) : ధీరాది భేదాలచేత, జ్యేష్ఠ-కనిష్ఠ భేదాలచేత 3×2 =6 విధాలు.

అట్లాగే కన్యకూడా ధీరాది భేదాలచేత, జ్యేష్ఠ-కనిష్ఠ భేదాలచేత (3×2) 6 భేదాలు.

ఇంక ముగ్ధ– అజ్ఞాతయౌవన, జ్ఞాతయౌవన భేదాల చేత రెండువిధాలు కాగామొత్తం (13+12+1=)26 భేదాలు.

స్వీయా-పరకీయా- సామాన్యలు అనే వర్గీకరణలో, వాత్స్యాయనుడు పరకీయకు బదులు 'పునర్భూవు' (=మారుమనువు చేసికొన్నది) అనే భేదం

గ్రహించినాడు. (రుద్రభట్టు దృష్టిలో ఈ పునర్భువు ముగ్ధాతుల్యం). చారాయ ణుడు 'విధవ'ను, సువర్ణనాభుడు పరివ్రాజికను, ఘోటకముఖుడు వేశ్యాపుత్రిని, ప్రేష్యను (=దాసిని) కూడా నాయికలుగా గ్రహించినారు.

భోజుడు స్వీయాదులకు 'పునర్భూ' భేదాన్ని కూడా చేర్చి, దీనిని ప్రధాన వర్గీకరణగా పేర్కొన్నాడు. ఇందులో :

పునర్భువు : అక్షత-క్షత-యాతాయాత-యాయావరభేదాలచేత నాలుగు విధాలు.

సామాన్య : ఊఢ-అనూఢ-స్వయంవర-స్వైరిణి-వేశ్యా భేదాలచేత అయిదు విధాలు.

వేశ్య : గణిక-విలాసిని-రూపాజీవభేదాల చేత ముప్పేధాలు.

కొందరు, కన్య (=అనూఢ)ను ప్రత్యేక భేదంగా చెప్పి, పరకీయ ముప్పి ధాలన్నారు-సధవ, విధవ, పునర్భువు.

కొందరు పరోఢ (=పరకీయ=అసతి) యందుకొన్ని భేదాలు చెప్పినారు.

గుప్త : భూత-భావి-వర్తమాన రతగోపనంవల్ల ఈమె మూడు విధాలు.

విదగ్ధ : వాగ్విదగ్ధ, క్రియావిదగ్ధ భేదాలచేత రెండు విధాలు.

లక్షిత : తన ఉపపతి అనురాగం ఇతరులకు తెలిసినది; ముదిత-సాహసిక మున్నగు భేదాలచేత లక్షిత పెక్కు విధాలు. కులట-(అనేకులయందు అనురాగం కలది). అనుశయాన (సంకేత భంగంవల్ల దుఃఖపడేది - ఈమె మూడు విధాలు). ముగ్ధా విషయంలో కూడా కొందరు కొన్ని భేదాలు చెప్పినారు: నవోఢ (=అజ్ఞాతయౌవన), విస్రబ్ధనవోఢ (=జ్ఞాత యౌవన), నిపుణ (=స్వయందూతి).

స్వతంత్ర, జనవ్యధీన, నియమితమున్నగు భేదాలచేత సామాన్యకూడా అనేక విధాలు.

పరకీయకు మూడే అవస్థలు ఉంటాయన్న దానిని సింగభూపాలుడిట్లా వివరించినాడు: పరస్త్రీ తొలుత విరహోత్కంఠిత అవుతుంది; పిమ్మట స్వయంగా విటుని వద్దకుపోయి అభిసారిక అవుతుంది; సంకేత స్థానమునకు విటుడు రాకపోతే విప్రలబ్ధ అవుతుంది (ర.సు. I-160-161).

ప్రాచీనార్వాచీన మతాలను జోడించి, శృంగారమంజరీకర్త ఇట్లా విపులవేచన చేసినాడు. (శృం.మం. పుటలు 3-15) :

**1. స్వీయ :**

శృంగారరసాలంబన అయిన స్త్రీ నాయిక; ఆమె మూడు విధాలు - స్వీయ, పరకీయ, సామాన్య. స్వీయ: తన భర్తయందు అనురక్త; యావజ్జీవమూ పతియందే అనురక్త; పతివ్రత. స్వీయ మూడువిధాలు - ముగ్ధ, మధ్య, ప్రగల్భ.

ముగ్ధ : పురుషవిశేషం తెలియనది ముగ్ధ; ఈమె రెండువిధాలు - అజ్ఞాతయౌవన, (=స్వీయ యౌవనోత్పత్తి విశేషం తెలియనిది); జ్ఞాతయౌవన (=స్వీయయౌవనోత్పత్తిని గుర్తించినది).

జ్ఞాతయౌవన రెండు విధాలు : నవోఢ (=లజ్జా-భయాలకులోనైన రతికలది); విస్రబ్ధనవోఢ (పతిలాలనతో విశ్వాసం కలిగినది).

మధ్య : లజ్జ, కామం సమానంగా కలది మధ్య; ఈమె రెండు విధాలు: ప్రచ్ఛన్న మధ్య, ప్రకాశమధ్య. లజ్జా-కామములు సమానమని పతికిమాత్రమే తెలిసినది ప్రచ్ఛన్నమధ్య; లజ్జా- అనురాగాలు సమానములని చెలికత్తెలకు కూడా తెలిసినది ప్రకాశమధ్య.

ప్రగల్భ -: మదనునిచేత జయింపబడిన లజ్జకలది ప్రగల్భ (=ప్రౌఢ); (ఈమె పతిని ప్రేమతో లాలించగలదు); ప్రగల్భ రెండు విధాలు : రతి ప్రీతమతి (మరల మరల సంగమం కోరేది); రత్యానంద పరవశ (=సంగమ సంతుష్టయై పరవశం పొందేది).

ధీరమున్నవారు :

మధ్యధీర : కోపసూచకంగా మాట్లాడేది.

మధ్య అధీర : అన్యాపదేశంగా పతిమీద కోపం ప్రకాశింపజేసేది.

మధ్యధీరాధీర : కొంతవ్యంగ్యంగా, కొంతప్రకాశంగా కోపం ప్రకటించేది.

ప్రగల్భధీర : రతిని పరిహరించి, తన కోపం ప్రకటించేది.

ప్రగల్భ అధీర : తర్జనతాడనాదుల ద్వారా తన కోపం ప్రకటించేది.

ప్రగల్భధీరాధీర : రతిని పరిహరించటం, తర్జనాదులు—వీటి ద్వారా తన కోపం ప్రకటించేది.

జ్యేష్ఠ : పతియొక్క ప్రేమను అధికంగా పొందేది.

కనిష్ఠ : పతియొక్క ప్రేమను తక్కువ పొందేది.

**2. పరకీయ :**

పరపురుషానురక్త పరకీయ : ఈమె రెండు విధాలు - కన్య, పరోఢ.

కన్య : వివాహం కానిది; పితరులకు తెలియకుండా పరపురుషునియందు అనురాగం కలది.

పరోఢ : వివాహమైనది; కాని పరపురుషానురక్త. పరోఢ రెండు విధాలు - ఉద్బుద్ధ, ఉద్బోధిత.

ఉద్బోధిత మూడు విధాలు : ధీర, అధీర, ధీరాధీర.

ఉద్బుద్ధకూడా మూడు విధాలు : గుప్త, నిపుణ, లక్షిత.

గుప్త మూడు విధాలు : వృత్త సురతగోపన (=జరిగిన సురతాన్ని దాచినది), వర్తిష్యమాణ (=జరుగబోయే) సురతగోపన, వృత్త-వర్తిష్యమాణ సురతగోపన.

నిపుణ మూడు విధాలు : వాక్ నిపుణ, క్రియానిపుణ, పతివంచనా నిపుణ.

లక్షిత రెండు విధాలు : ప్రచ్ఛన్నలక్షిత, ప్రకాశలక్షిత.

ప్రకాశలక్షిత నాలుగు విధాలు : కులట, ముదిత, అనుశయాన, సాహసిక.

అనుశయాన మూడు విధాలు : విఘటిత సంకేత, అప్రాప్త భావిసంకేత, శంకిత సంకేత జారగమన.

ఇట్లా ముఖ్య-అవాంతర భేదాల మొత్తం ఇరవై అయిదు. ప్రగల్భ యొక్క ధీరాదిభేదాలు పరకీయకు కూడా అన్వయిస్తాయి.

ఉద్బోధిత : ఏదోవిధంగా నాయకుని చేత ప్రేరేపింపబడినది.

ఉద్బుద్ధ : నాయక సౌందర్యంచూచి, తానే అనురాగిణి అయ్యేది.

నిపుణ : జారిణీవర్తనమందు చతుర; ఈమె స్వయందూతి కూడా అవుతుంది.

వాఙ్నిపుణ : సురతేచ్ఛను మాటల ద్వారా జ్ఞాపకం చేసేది.

క్రియానిపుణ : చేష్టలతో సురతేచ్ఛను జ్ఞాపకం చేసేది.

పతివంచనా నిపుణ : తన ప్రవర్తనను గుర్తించిన పతిని వంచించి, జార సంభోగం చేసేది.

లక్షిత : తన జారసంభోగం సఖులకు తెలిసినది.

ప్రచ్ఛన్న లక్షిత : సఖులతో, స్వబుద్ధితో ఆలోచించి, పరపురుషానురాగం సాధించుకొనేది.

ప్రకాశలక్షిత : కటాక్షాది చేష్టలతో లోకానికి స్ఫుటంగా తెలిసిన పరపురుషానురాగం కలది.

కులట : జారకులమందు తిరిగేది.

ముదిత : ఇష్టం ప్రాప్తించినందువల్ల హర్షంపొందేది.

అనుశయాన : సంకేతం లభించకపోవటంవల్ల వ్యాకులపడేది.

విఘటిత సంకేత : లభించిన సంకేతం విఘటితంకావటం వల్ల ఖిన్నురాలు అయ్యేది.

అప్రాప్తభావి సంకేత : సంకేత ప్రాప్తి విషయంలో సందేహం కలది.

శంకిత సంకేత జారగమన : సంకేత స్థలానికి ఉపపతి రాడేమో అని శంకించేది.

సాహసిక : సాహసంతో జారసంభోగం చేసేది.

3. సామాన్య :

వివాహం కానిది, ధనంకోసం అనేకపురుష సంభోగంచేసేది సామాన్య; ఈమె అయిదు విధాలు— స్వతంత్ర, జనన్యధీన, నియమిత, క్లప్తానురాగ, కల్పితానురాగ.

స్వతంత్ర : స్వచ్ఛంద విహారిణి.

జనన్యధీన : తల్లిచాటుది (తల్లి ఆజ్ఞను దాటలేనిది).

నియమిత : ఒక్కని ఆశ్రయంలో ఉన్నది.

క్లప్తానురాగ : ఒక్కనియందే అనురాగం కలది. ఈమెవల్ల ధీరాది భేదాలు ఉంటాయి.

కల్పితానురాగ : విత్తంకోసం అనురాగాన్ని నటించేది.

# 3. స్వీయాదినాయికలు :

## 1. స్వీయ :

మూలం : సంపత్కాలే విపత్కాలే యా న ముంచతి వల్లభమ్ ।
శీలార్జవ గుణోపేతా సా స్వీయా కథితా బుధైః ॥
సా చ స్వీయా త్రేధా ముగ్ధా-మధ్యా-ప్రౌఢేతి కథ్యతే ।
-(ర.మ. I-95-96)

అర్థం : సంపత్ కాలే, విపత్ కాలే =సంపదఉన్న సమయంలో (నేకాక), ఆపద సంభవించినప్పుడు (కూడా); యా, వల్లభం, న ముంచతి =ఎవతె (=ఏ స్త్రీ) భర్తను విడనాడదో; శీల-ఆర్జవ-గుణ-ఉపేతా=మంచిశీలం, ఆర్జవం (=ఋజుస్వభావం, చక్కదనం), సద్గుణాలు కలిగి ఉంటుందో; సా, స్వీయా, బుధైః, కథితా =ఆమె (=ఆనాయిక), స్వీయ (అని) పండితుల చేత, చెప్పబడినది.

సా(చ)=ఆ స్త్రీ; ముగ్ధా-మధ్యా-ప్రౌఢా (=ప్రగల్భా), ఇతి, త్రేధా, కథ్యతే=ముగ్ధ, మధ్య, ప్రౌఢ, అని, మూడు విధాలుగా చెప్పబడుతున్నది.

తాత్పర్యం : ఏ స్త్రీ మంచిశీలం, ఆర్జవం, సద్గుణాలు కలిగినదై, సంపత్ కాలంలోనే కాక, విపత్ కాలంలో కూడా భర్తను విడనాడదో, ఆమె, 'స్వీయ (నాయిక)' అవుతుంది. స్వీయ మూడు విధాలు - ముగ్ధ (=నవవధువు), మధ్య (=నడిమియౌవనంలో ఉన్నది), ప్రౌఢ (=ఆరితేరినది).

టీక : సమాన కులశీలములు కలదై, వహ్నిసాక్షికంగా (వేద-శాస్త్రానుసారంగా) పాణిగ్రహణం చేయబడిన నాయిక ధర్మపత్ని లేదా స్వీయ అవుతుంది అని భా.ప్ర. 'శీలం' అనగా స్వభావం, సద్వృత్తం అని అమరకోశార్థం.

ద.రూ. నిర్వచనంలోని "శీలార్జవాయుక్తా"ను ధనికుడు "శీలం(=సువృత్తం) కలది; పతివ్రత, అకుటిల, లజ్జావతి, పురుష (=భర్తృ) ఉపచారనిపుణ అయిన నాయిక స్వీయ" అని వ్యాఖ్యానించినాడు.

స్వీయ-ఏకాంత సంభోగలాలస అని శారదాతనయుడు, గృహకర్మదక్ష అని విశ్వనాథుడు, మరణమందు కూడా భర్తను విడనాడనిది అని శృంగారతిలక కారుడు, క్షమించగలది అని రసమంజరీకారుడు అధికంగా చెప్పినారు.

ఉదా : కిం తాతేన నరేంద్ర శేఖరఖాలీఢాగ్రపాదేన మే
కిం వా మే శ్వశురేణ వాసవమహాసింహాసనాధ్యాసినా ।
తే దేశా గిరయశ్చ తే వనమహీపైవచ మే వల్లభా
కౌసల్యాతనయస్య యత్ర చరణౌ వందే నందామి చ ॥
-(ర.సు.I-95)

— (భర్తతో వనగమనమునకు సిద్ధపడిన సీత) రారాజుల కిరీట కోటులచేత స్పృశింపబడిన పాదాగ్రాలుకల నాతండ్రి వలన ఏమి ప్రయోజనం? ఇంద్రుని మహాసింహాసన మధిష్ఠించిన మామగారి వల్ల ఏమివని? కౌసల్యాతనయుడు ఎచ్చటెచ్చట నడయాడుతాడో ఆదేశాలు, ఆగిరులు, అ వనవృక్షాలు - అవేనాకు ప్రియం; ఆ శ్రీరామచంద్రుని పాదాలకు ప్రణమిల్లుతూ, నేను ఆనందిస్తాను.

టీక : భరతముని చెప్పిన ప్రథమ-ద్వితీయ-తృతీయ యౌవన భేదాలకు క్రమంగా ముగ్ధా- మధ్యా-ప్రౌఢాభేదాలు అన్వయిస్తాయి.

(1) ముగ్ధ (స్వీయ నాయికా భేదం) :

మూలం : ముగ్ధా నవవయః కామా రతౌ వామా మృదుః క్రుధి ॥
యతతే రతచేష్టాయాం గూఢం లజ్జామనోహరా ।
కృతాపరాధే దయితే వీక్షతే రుదతీ సతీ ॥
అప్రియం వా ప్రియం వాపి న కించి దపి భాషతే ।
-(ర.సు. I.96-98)

అర్థం : నవవయః, కామా=నవవయస్సు (=నూత్నయౌవనం), క్రొత్త వలపు కలది; రతౌ, వామా, క్రుధి, మృదుః=రతిక్రియయందు, విపరీతంగా ఉండేది లేదా స్వాతంత్ర్యం వహించనిది, కోపంవచ్చినప్పుడు (కూడా) మృదువుగా ఉండేది; రతిచేష్టాను, గూఢం, యతతే, లజ్జా, మనోహరా=రతి చేష్టలయందు, గూఢంగా, ప్రవర్తించేది, సిగ్గుతో, మనోహరంగా కన్పట్టేది; దయితే, కృతాపరాధే, వీక్షతే, రుదతీ, సతీ=భర్త, అపరాధం చేసినప్పటికీ, ఊరక చూస్తూఉండేది, లేదా రోదించేది; అప్రియం, వా, ప్రియం, వా, కించిత్, అపి, న, భాషతే =అహితం కానీ, హితం కానీ, కొంచెంకూడా, పలుకనిది - (ఇట్టిస్త్రీ) ముగ్ధా=ముగ్ధా (నాయిక అవుతుంది).

తాత్పర్యం : నవవయస్సులో ఉన్నది (పాఠాంతర-నవవధూః=క్రొత్తగా పెండ్లి అయినది), క్రొత్తగా వలపు కలిగినది, రతిక్రీడలందు స్వాతంత్ర్యం

వహించనిది, రతిక్రీడలందు గూఢంగా ప్రవర్తించేది, కోపంవచ్చినప్పుడు కూడా మెత్తగా ఉండేది, సిగ్గుతో మనోహరంగా కన్పట్టేది, భర్త అపరాధం చేసినప్పుడు కూడా ఏడుస్తూ, ఊరక ఉండటమే తప్ప ప్రియంకానీ, అప్రియం కానీ కొంచెం కూడా చెప్పనిది ముగ్ధానాయిక అవుతుంది.

టీక : "నవవయాః కామా, రతి వామా, మృదుఃక్రుధి" - అని ధనంజయుడు (ద.రూ.II.16). "లజ్జచేత మన్మథ భావాన్ని అణచుకొనేది" అని విద్యానాథుడు; "శీల-ఆర్జవాలుకలది, రహస్య సంభోగం ఇచ్ఛగించేది" అని శారదాతనయుడు; "క్రొత్త క్రొత్త నగలయందు కోరికకలది" అని భానుదత్తుడు- అధికంగా చెప్పినారు. ఇంకముగ్ధా నాయికల కన్యల - అనురాగాన్ని ఇంగితాన్ని ఇట్లా వర్ణించినాడు విశ్వనాథుడు (సా. 155.III-132): అనురాగిణియగు బాల-ప్రియుడు తనను చూస్తే సిగ్గుపడుతుంది. అతనిని ఎప్పుడూ సమ్ముఖంలో చూడదు; చాటునుండి లేదా అతడు సంచరిస్తున్నప్పుడు, లేదా అతడు తనను దాటిముందుకు వీగినప్పుడు అతనిని చూస్తుంది. ప్రియుడు పలుమారు అడిగినప్పటికీ ప్రాయికంగా, మెల్లమెల్లగా, తలవాల్చి, గద్గదంతో, క్రిందుచూస్తూ, ప్రియంగా, ఇంచుక పలుకుతుంది. అన్యులు అతని కథను చెప్పకొంటున్నప్పుడు, తాను వేరొకచోట చూస్తూ, సావధానంగా వింటుంది.

"అంకురిత యౌవన ముగ్ధ" అని రసమంజరీకారుడు చెప్పగా దానిని అంగీకరించక "పురుష విశేష-అనభిజ్ఞ ముగ్ధ" అని నిర్వచించి, జ్ఞాతయౌవన, అజ్ఞాతయౌవన అనే ముగ్ధా భేదాలను, జ్ఞాతయౌవనలోని నవోఢ, విస్రబ్ధనవోఢా భేదాలను అంగీకరించినాడు శృంగారమంజరీకారుడు.

అజ్ఞాతయౌవన : స్వీయయౌవనోత్పత్తిని ఎరుగనిది.

జ్ఞాతయౌవన : స్వీయయౌవనోత్పత్తిని ఎరిగినది.

నవోఢ : (=కొత్తగా పెండ్లి అయినది); లజ్జా-భయాలకు వశమైన రతి కలది.

విస్రబ్ధ (నమ్మిక కుదిరిన) నవోఢ : పతిలాలనతో, విశ్వాసం కుదిరినది (=బెదరు తీరినది).

పై భేదాలన్నింటికీ ఆలంకారికులు ఉదాహరణ లిచ్చినారు.

నవోఢా ఉదాహరణ:

హస్తే ధృతాఽపి, శయనే వినివేశితాఽపి,
క్రోడీకృతాఽపి, యతతే బహి రేవ గంతుమ్ ।

జానీమహే నవవధూ రథ తస్య వశ్యా
యః పారదం స్థిరయితుం క్షమతే కరేణ ॥
-(ర.మం. 7)

– చేయి పట్టుకొన్నప్పుడు, పాన్పుమీద ఉంచినప్పుడు, కౌగలించు కొన్నప్పుడు కూడా (గది నుంచి) వెలుపలికి పోవుటకే ఆమె ప్రయత్నిస్తున్నది. పాదరసాన్ని కదలకుండ పట్టుకొనే నేర్పుకలవాడే నవవధువును వశం చేసుకొనగల సమర్థుడని తలంచుచున్నాము.

(2) మధ్య (స్వీయ నాయికా భేదం) :
మూలం : సమానలజ్జామదనా ప్రోద్య త్తారుణ్య శాలినీ ॥
మధ్యా కామయతే కాంతం మోహాంత సురతక్షమా
మధ్యా త్రేధా మానవృత్త్యా ధీరాధీరోభయాత్మికా ॥
-(ర.సు.I-98-99)

అర్థం : సమాన లజ్జా-మదనా =సిగ్గు, కామం సమంగా ఉన్నది; ప్రోద్యత్-తారుణ్య శాలినీ =వృద్ధిపొందిన యౌవనం కలది; కాంతం కామయతే=కాంతుని సన్నిధిని నిత్యంకోరుకోనేది; మోహాంత సురతక్షమా=తనకు పారవశ్యం కలిగే వర్యంతం సురతాన్ని సహించేది (పాఠాంతరం- మోహాంతే సురతక్షమా=తనకు పారవశ్యం కలిగిన తరువాత కూడా సురతాన్ని సహించేది); మధ్యా=మధ్యా (నాయిక అవుతుంది).

మానవృత్త్యా='మానం' అనే కోప వ్యాపారం చేత; ధీర-అధీర-ఉభయాత్మికా=ధీర, అధీర, ధీరాధీర అనే భేదాలు కలదై; మధ్యా, త్రేధా=మధ్యా నాయిక, మూడువిధాలు.

తాత్పర్యం : లజ్జ కామం సమానంగా కలది, విజృంభించిన యౌవనం కలది, కాంతుని సన్నిధిని నిత్యం కోరుకొనేది, తనకు పారవశ్యం కలిగే వర్యంతం సురతాన్ని సహించేది - మధ్యానాయిక అవుతుంది. 'మానం' అనే కోప వ్యాపారం వల్ల మధ్యా నాయిక మూడు విధాలు - ధీర, అధీర, ధీరాధీర.

టీక : స్వీయాభేదం అయిన మధ్యా నాయికకు, ప్రియాపరాధం వల్ల ముప్విధాలుగా 'మానం' కలుగుతుంది - లఘుమానం, మధ్యమానం, గురుమానం.

మానంతో ఉన్న నాయిక ముప్విధాలుగా ప్రియుని నిందిస్తుంది - అంటే ఆమె మూడువిధాలుగా ఉండవచ్చు; ధీర, అధీర, ధీరాధీర.

**అర్థం** : సంపూర్ణ యౌవన-ఉన్మత్తా=నిండుయౌవనంతో మదించినది; రూఢమన్మథా=మన్మథ వ్యాపార పారంగత; రతికేలీషు, దయిత-అంగేవిలీన-ఏవ, యతతే=రతికేళులందు, నాయకుని శరీరంలో లీనమైపోయిన దానివలె, ప్రవర్తించేది; రతి ప్రారంభమాత్రేణ, ఆనందమూర్ఛనాం గచ్ఛతి=రతిక్రీడ ఆరంభంలోనే ఆనందంతో పరవశత్వం చెందేది; ప్రగల్భా=(స్వీయా) ప్రగల్భా (నాయిక అవుతుంది).

మానవృత్త్యా, ధీరాదిభేదతః, ప్రగల్భా, అపి, త్రేథా='మానం' చేత, ధీర-అధీర-ధీరాధీర అనే భేదాలవల్ల, ప్రగల్భానాయిక, కూడా (మధ్యానాయిక వలె), మూడేసివిధాలు.

**తాత్పర్యం** : సంపూర్ణ యౌవనంతో మదించినది, మన్మథ వ్యాపార పారంగతురాలు, ప్రియుని శరీరంలో లీనమైపోయినదా అన్నట్లుగా రతిక్రీడలలో ప్రవర్తించేది, రతి ప్రారంభంలోనే ఆనందపరవశ (=అచేతన) అగునది స్వీయాప్రగల్భ(=ప్రౌఢా) నాయిక అవుతుంది.

స్వీయామధ్యానాయికవలె, స్వీయా ప్రౌఢానాయిక కూడా మానవృత్తి చేత మూడేసివిధాలు— లఘుమాన, మధ్యమాన, గురుమాన; ధీర, అధీర, ధీరాధీర.

**టీక** : స్మరాంధయు, గాఢయౌవనయు, సమస్తరత కోవిదయు, భావోన్నతయు, స్వల్పవ్రీడయు, ఆక్రాంత నాయకయు 'ప్రగల్భ' అనబడుతుంది అని విశ్వనాథుడు (సా.ద. 102 సూ.).

రతప్రగల్భకు అమరుశతకమందలి శ్లోకం (కాంతే తల్ప ముపాగతే...), అల్పవ్రీడకు అమరుశతక మందలి 65వ శ్లోకం (క్వచి త్తాంబూలాక్తః...) ఉదాహరణలు.

"పతిమాత్ర విషయకేళీ కలాపకోవిద ప్రగల్భ" అని రసమంజరీకారుడు చెప్పిన దానిని శృంగారమంజరీకారుడు త్రోసిపుచ్చినాడు; పరకీయా-సామాన్యలు కూడా ప్రగల్భలు కావచ్చునని చెప్పి లక్షణాలు చెప్పి, ఉదాహరణలు ఇచ్చినాడు.

ప్రగల్భ : మదనవిజితలజ్జా ప్రగల్భ (=మదనునిచేత జయింపబడిన లజ్జకలది).

స్వీయా ప్రగల్భా : పతిని ప్రేమతో లాలించేది స్వీయా ప్రగల్భ; ఆమె రెండు విధాలు - రతిప్రీతిమతి, రత్యానందపరవశ.

(18-08-11, [illegible]) [illegible]

రతిప్రీతిమతి : మరల మరల పతి సంగమం కోరేది.

రత్యానంద పరవశ : సంగమ సంతుష్టయై, ఆనంద పరవశ అయ్యేది.

2. పరకీయ :

మూలం : పరానురాగ వ్యాపారగోపనే దత్తమానసా ।
పరకీయేతి సా ప్రోక్తా భరతాగమవేదిభిః ॥
సా చాపి ద్వివిధా కన్యా పరోఢా చేతి భేదతః ।
-(ర.సు.I-107-08)

అర్థం : (యా), పర-అనురాగ వ్యాపార గోపనే=(ఎవతె) పరపురుషుని తోడి తన అనురాగ వ్యాపారాన్ని కప్పిపుచ్చటంలో (=పరపురుషుని తోడి తన ప్రేమ కలాపాలను రహస్యంగా ఉంచుకొనటంలో); దత్తమానసా=ఇవ్వబడిన (=నిమగ్నమైన) మనస్సుకలది అవుతుందో; సా, పరకీయా, ఇతి, భరతాగమవేదిభిః, ప్రోక్తా=ఆమె, పరకీయ, అని భరతవేదవేత్తలచేత, చెప్పబడినది.

సా(చ)=ఆమె (=ఆ పరకీయా నాయిక); కన్యా, పర-ఊఢా, ఇతి, ద్వివిధా, పరికీర్తితా=కన్య (=అనూఢ=అవివాహిత)), పరోఢ (=పరుని వివాహమాడినది=పరభార్య), అని రెండు విధాలుగా చెప్పబడింది.

తాత్పర్యం : పరపురుషునితోడి తన ప్రేమకలాపాలను రహస్యంగా ఉంచుకొనేది పరకీయ నాయిక అవుతుంది. ఈ పరకీయ రెండు విధాలు-1. కన్య (అవివాహిత=అనూఢ=వివాహంకానిది), 2. పరోఢ(=పరునిభార్య=వివాహం అయినది).

టీక : 'కన్య' అంటే వివాహంకానిది; అంటే నాయకునకు అందు బాటులో లేనిది అని అర్థం. కన్యగా ఉన్న పార్వతిని ఇందుకు ఉదాహరణగా ఇచ్చినాడు సింగభూపాలుడు; అందుచేత, నిజానికి కన్య పరకీయ కాదు. కానీ, కన్య, కులాచారాన్ని అతిక్రమించినప్పుడు మాత్రమే, పరకీయ అవుతుంది. కన్య, నాటకాదులందు ప్రధానంగానూ, అప్రధానంగానూ కూడా ఉంటుంది; మాలతీమాధవమందలి మాలతి, మదయంతికలు క్రమంగా, ఇందుకు ఉదాహరణములన్నాడు సింగభూపాలుడు. పరోఢను ఎన్నడును ప్రధానరసనాయికను చేయరాదు. కన్యను, కవి ఇచ్ఛానుసారంగా, ప్రధాన రసనాయికను లేదా అప్రధానరసనాయికను చేయవచ్చునని తెలియజేసినాడు (ర.సు.II-20-21).

వివాహిత భర్తయొక్క అధీనంలో ఉంటే, కన్య తలిదండ్రుల అధీనంలో ఉంటుంది. శృంగారమంజరీకారుని ప్రకారం పరపురుషానురక్తికలిగి ఉంటేనే ఆమెను పరకీయ అనవచ్చు; అది రహస్యంగా ఉంచుకొనటం తరువాతి విషయం.

"గుప్త, విదగ్ధ, లక్షిత, కులట, అనుశయాన, ముదిత ప్రభృతులు పరకీయయందే అంతర్భవిస్తారు" అంటూవారిని సోదాహరణంగా వివరించినాడు రసమంజరీకారుడు భానుదత్తుడు.

పరకీయా భేదాలు :

*(1)* కన్య :

మూలం : (తత్ర) కన్యా త్వనూఢా స్యాత్ సలజ్జా పితృపాలితా ॥
సఖీ కేలిషు విస్రబ్ధా ప్రియే ముగ్ధా గుణాన్వితా ।
-(ర.మ. I-108-9)

అర్థం : అనూఢా, సలజ్జా, పితృపాలితా = అవివాహిత, లజ్జావతి, పితృపాలిత (=తండ్రిసంరక్షణలో ఉన్నది); సఖీకేలిషు విస్రబ్ధా, ప్రియే ముగ్ధా గుణాన్వితా=చెలుల తోడి ఆటలందు మక్కువ కలది, (సాధారణంగా) ప్రేమ విషయంలో ముగ్ధా నాయికయొక్క గుణాలుకలది; కన్యా (తు), స్యాత్=కన్య, అవుతుంది.

తాత్పర్యం : అవివాహిత, లజ్జావతి, పితృపాలిత, సఖీకేలీరత, ప్రియుని పట్ల ముగ్ధాగుణాన్విత అయినది 'కన్య' ('యువతి' కూడా అయి ఉండాలని భ.ర.ప్ర.)

ఉదా :

తాం నారదః కామచరః కదాచిత్, కన్యాం కిల ప్రేక్ష్య పితుః సమీపే ।
సమాదిదేశైకవధూం భవిత్రీం ప్రేమ్ణా శరీరార్ధహరాం హరస్య ॥
-(కు.సం.1-50)

— స్వేచ్ఛా సంచారియగు నారదుడొకప్పుడు కన్యయగు పార్వతిని తండ్రియగు హిమవంతుని యెద్దచూసి, ఆమె శివునికి ఏకైకపత్ని కాగలదని, అనురాగంతో ఆతని శరీరంలో సగపాలు కాగలదని తెలియజెప్పినాడు.

టీక : పై లక్షణంలోకాని, ఉదాహరణలో కాని 'పరపురుషానురక్తి' ప్రసక్తి లేదని గ్రహించదగును.

(2) పరోఢ :

మూలం : పరోఢా తు పరేణోఢా ప్యన్యసంభోగలాలసా ॥
లక్ష్యా క్షుద్ర ప్రబంధే సా సప్తశత్యాదికే బుధైః ।
-(ర.సు.I-110-11)

అర్థం : ప్రియేణ, ఊఢా=ప్రియుని(=ప్రేమించినవాని) చేత, పెండ్లి ఆడబడినది (అయినప్పటికీ); అన్యసంభోగలాలసా=పరపురుషసంభోగమందు ఆసక్తి కలది; పరోఢా(తు)=పరోఢా (నాయిక అవుతుంది); సా, సప్తశతి-ఆదికే, క్షుద్ర ప్రబంధే, బుధైః లక్ష్యా=ఆమె(=పరోఢా నాయిక), (గాథా) సప్తశతిమున్నగు, క్షుద్ర(=చాటు) ప్రబంధములందు, బుధులచేత, చూడదగినది.

తాత్పర్యం : తనను ప్రేమించిన వానిచేత పెండ్లి ఆడబడినప్పటికీ, తాను ప్రేమించిన పరపురుషునితోడి సంభోగమందు ఆసక్తి కలది 'పరోఢ' అవుతుంది. పరోఢకు లక్ష్యాలు (=ఉదాహరణలు) గాథాసప్తశతివంటి చాటు ప్రబంధములందు లభించగలవు.

టీక : పరోఢ విషయంలో "నిపుణాగృహకృత్యేషు, భర్తృచిత్తానువర్తినీ" అని అధికంగా చెప్పినాడు భరతరస ప్రకరణకర్త. అంటే గృహకృత్యములందు నిపుణురాలే కాక, భర్తమనస్సును అనుసరించి నడిచేది అని అర్థం. కానీ, భర్తృచిత్తానువర్తిని కావటం భర్తకు అనుమానం కలుగకుండా ఉండటానికే అని చెప్పవచ్చు. పరకీయా భేదాలను శృంగారమంజరీకారుడిట్లా వివరించినాడు:

పరకీయ : పరపురుషానురక్త.

కన్యక : అపరిణీత, పరపురుషానురాగిణి.

పరోఢ : పరిణీత, కాని పరపురుషానురాగిణి. ఈమె రెండు విధాలు - ఉద్బుద్ధ, ఉద్బోధిత.

ఉద్బోధిత : పరపురుష ప్రయత్నంతో నాయకుడిపట్ల అనురాగవతి. ఈమె మూడు విధాలు - ధీరా, అధీరా, ధీరాధీరా.

(ప్రగల్భ నాయిక యొక్క ధీరాది భేదాలే పరకీయ పట్ల కూడా అన్వయిస్తాయి)

ఉద్బుద్ధ : నాయక సౌందర్యంచూసి, ముగ్ధురాలై, స్వయంగా అనురాగం కలది. ఈమె మూడువిధాలు - గుప్త, నిపుణ, లక్షిత.

గుప్త : స్వకార్య గోపనశీల. ఈమె మూడువిధాలు - వృత్త సురతగోపన (=జరిగిపోయిన సురతాన్ని దాచేది), వర్తిష్యమాణ సురతగోపన (=జరగబోయే సురతాన్ని దాచేది), వృత్తవర్తిష్యమాణ సురతగోపన (జరిగిన, జరగబోయే సురతాన్ని దాచేది).

నిపుణ : జారిణీవర్తనమందు చతుర. ఈమె స్వయందూతి కూడా అవుతుంది. నిపుణ మూడు విధాలు - వాఙ్నిపుణ, క్రియానిపుణ, పతివంచనా నిపుణ. వాక్‌చాతుర్యంతో సురతేచ్ఛను తెలిపేది వాఙ్నిపుణ. చేష్టలద్వారా సురతేచ్ఛను తెలిపేది క్రియానిపుణ. పతికంటబడినప్పటికీ అతనిని వంచించి జారసంభోగంచేసేది పతివంచనా నిపుణ. ఇందుకు ఒక ఉదాహరణ:

'అమ్మ! తేలుగుట్టె' నని చేతులు వీచు
చిన్నదాన్ని బట్టి చెలులు జాణ
లదిగో! మగని కనులయెదుటనే కొంచుబో
యెదరు జారవైద్యు నిల్లుచేర. -(గా.స.శ.III-37)

లక్షిత : తన జారసంభోగం సఖులకు తెలిసినది. ఈమె రెండువిధాలు - ప్రచ్ఛన్న లక్షిత, ప్రకాశలక్షిత.

ప్రచ్ఛన్నలక్షిత : సఖులు స్వబుద్ధితో ఆలోచించి, ఆయాచిహ్నాలవల్ల ఆమె జారసంభోగం గుర్తించితే, ఆమె ప్రచ్ఛన్నలక్షిత అవుతుంది.

ప్రకాశలక్షిత : కటాక్షాది చేష్టలవల్ల ఆమె యొక్క జారానురాగం లోకానికి తెలిసినది. ఈమె నాలుగు విధాలు - కులట, ముదిత, అనుశయాన, సాహసిక.

కులట : జారకులమందు స్వేచ్ఛగా తిరిగేది.

ముదిత : ఇష్టప్రాప్తివల్ల హర్షంపొందేది.

అనుశయాన : సంకేత ప్రాప్తిలేక పోవటంచేత వ్యాకులపడేది. ఈమె మువ్విధాలు - విఘటిత సంకేత, అప్రాప్తభావిసంకేత, శంకితసంకేతజారగమన.

[illegible] విచారాలు [illegible] విఘటిత సంకేత.
[illegible] ప్రాప్తి [illegible] అప్రాప్త
[illegible] సంకేతస్థానానికి [illegible]
[illegible]
[illegible]

మూలం : i) భర్తా నిఃశ్వసితేఽప్యసూయతి మనోజిఘ్రః సపత్నీజనః
శ్వశ్రూ రింగిత దైవతం నయనయో రీహాలిహో యాతరః ।
తద్దూరాదయమంజలిః కిమమునా దృగ్భంగి పాతేన తే
వైదగ్ధీ రచనా ప్రపంచరసిక! వ్యర్థోఽయ మత్ర శ్రమః ॥
-(ర.సు.I-110)

— నిట్టూర్చినను భర్త(=అన్నం, ఆచ్ఛాదనం ఇచ్చేవాడు) అనుమాన పడతాడు; సవతులు మనస్సును పసిగట్టగలరు; అత్త ఇంగితాన్ని గ్రహింపగలదు. తోడికోడండ్రు చూపులనుపట్టి నాఆశయం గ్రహింపగలరు. కావున, వైదగ్ధ్యమున నేర్పుగల ఓ రసికూడా! నీకు నమస్కారం. నీ చూపులు నాపై ప్రసరించకు. నీశ్రమ ఇచ్చట వ్యర్థం.

ii) అత్త పడినదింట మత్తెక్కి; పతి యెందొ
పోయినాడు; కుక్కపోతు వచ్చె;
ప్రతిచేను విఱుఁగఁగఁబడమేసె నెనుబోతు;
దీని నతని కెవరు తెలుపువారు?
-(గా.శ.III-49)

— "ఇంటనేను ఒంటిగా ఉన్నాను, అడ్డంకులు లేవు, రావచ్చును" అనేధ్వని పొంచివింటున్న ఉపపతికి కలిగించుటకై పరోఢ చెప్పినమాటలు!

3. సామాన్య :

మూలం : సాధారణస్త్రీ గణికా కలాప్రాగల్భ్య ధౌర్త్యయుక్ ॥
ఛన్నకామ సుఖార్థాజ్ఞ స్వతంత్రాహంయు షండకాన్ ।
రక్తేవ రంజయే దాఢ్యా న్నిఃస్వాన్మాత్రా వివాసయేత్ ॥
-(ద.రూ.II-21-22)

అర్థం : కలా-ప్రాగల్భ్య-ధౌర్త్యయుక్=కళలు-ప్రగల్భత-ధూర్తత- వీటితో కూడిన; *గణికా, సాధారణస్త్రీ=గణికయే సాధారణస్త్రీ(=సామాన్యనాయిక)*; ఛన్నకామ-సుఖార్థ-అజ్ఞ- స్వతంత్ర-అహంయు-షండకాన్=ఛన్నకాముకులు(=ప్రయాసలేకుండ ధనం లభించినవారు, లేదా సుఖాన్ని కోరేవారు), అజ్ఞులు(=మూర్ఖులు), స్వతంత్రులు(=నిరంకుశులు), అహంయువులు(=అహంకారులు), షండకులు లేదా పండకులు (=నపుంసకులు); *ఆఢ్యాన్, రక్తా-ఇవ, రంజయేత్=(వీరు) బాగా ధనవంతులయితే, అనురక్త*

వలెనే, రంజింపజేస్తుంది; నిఃస్వాన్, మాత్రా, వివాసయేత్=వారు నిర్ధను లయినప్పుడు, తల్లిద్వారా, వెడలగొట్టిస్తుంది.

తాత్పర్యం : కళాకారిణి, ప్రగల్భ, ధూర్తురాలు అయిన గణికయే సామాన్యా నాయిక. ఛన్నకాముకులు, సుఖార్థులు, అజ్ఞులు, స్వతంత్రులు, అహంకారులు, నపుంసకులు-వీరు ధనాఢ్యులయితే, కేవలం అనురక్తవలెనే వారిని రంజింపజేస్తుంది. కాని, వారు నిర్ధనులయితే వారిని వెంటనే తల్లి చేత గెంటిస్తుంది.

టీక : 'గణం' అంటే సమూహం; జనసమూహం వలెగా కలది 'గణిక'. నాటకాదులందు దివ్యపురుషుడు లేదా రాజునాయకుడుగా ఉంటాడు; అందు గణిక ప్రధాననాయికకారాదు. ప్రకరణమందు రక్త అయిన గణిక నాయిక కావచ్చు. లటకమేళకాది ప్రహసనములందు విరక్త అయిన గణిక నాయిక కావచ్చు (ద.రూ.II-23). భరతరసప్రకరణంలో సామాన్య వివరణ మరికొంత విపులంగా ఉన్నది:

మూలం : సామాన్యా సైవ గణికా కలా ప్రాగల్భ్య ధార్ష్ట్యయుక్ ।
విత్తమాత్రాశయా లోకే పురుషే ష్వనురాగిణీ ॥
నీతస్యా నానురాగస్స్యాత్ గుణవత్యపినాయకే ।
ఛన్నకామాన్ రతార్థజ్ఞాన్ బాలపాషండ షండకాన్ ॥
రక్తేవ రంజయే న్నిత్యం నిఃస్వా నాశు వివాసయేత్ ।
తస్యా దౌత్య ప్రభృతయో గుణా స్తదుపయోగినః ॥
-(భ.ర.ప్ర-34-36)

అర్థం : కలా ప్రాగల్భ్య-ధార్ష్ట్యయుక్=కళలలో (నృత్య-సంగీతాదు లందు) ప్రావీణ్యం కలది, ధూర్తత్వం కలది; లోకే, పురుషేషు, విత్తమాత్ర-ఆశయా, అనురాగిణీ=లోకంలో, పురుషులపట్ల, ధనాశచేతనే, అనురాగం చూపేది; గణికా=వేశ్య (అవుతుంది); సా-ఏవ, సామాన్యా=ఆమె(=ఆ గణిక)యే, సామాన్య (అవుతుంది).

నాయకే, గుణవతి-అపి=నాయకుడు, గుణవంతుడు అయినప్పటికీ; నీతస్యా, అనురాగః, నస్యాత్=(ధనవంతుడు కాకపోతే) ఆమెకు, అనురాగం, ఉండదు.

ఛన్నకామాన్, రత-అర్థ-అజ్ఞాన్, బాల-పాషండ-షండకాన్=ఛన్నకాముకులు (=రహస్యంగా కామం తీర్చుకొనే వారు =శ్రోత్రియులు) (పాఠాంతరం-భగ్నకామాన్=భగ్నప్రేమికులు), రతికోసమే వచ్చేవారు, అజ్ఞులు (=మూఢులు; పాఠాంతరం- బుత్తార్థజ్ఞాన్=కపటం తెలియనివారు), బాలురు, పాషండులు (=పాషండవ్రతస్థులు==వేదబాహ్యులు), నపుంసకులు-(వీరు ధనవంతులయితే); నిత్యం, రక్తా-ఏవ, రంజయేత్=ఎల్లప్పుడూ అనురాగం కలదానివలెనే రంజింపజేస్తుంది; నిఃస్వాన-ఆశువివాసయేత్=(కాని, వారే) నిర్ధనులయితే వెంటనే విసర్జిస్తుంది (పాఠాంతరం-నిః స్వాన్మాత్రా వివాసయేత్=తల్లి ద్వారా వెడల గొట్టుతుంది); దౌత్య ప్రభృతయః=దౌత్యం (పాఠాంతరం-ధౌర్త్య=ధూర్తత్వం) మున్నగునవి; తత్-ఉపయోగినః, తస్యాః గుణాః=అందులకు ఉపయోగపడే ఆమె గుణాలు.

తాత్పర్యం : సంగీతాది కళలయందు నైపుణ్యం కలది, ధూర్తురాలు, ధనాశ చేతనే అనురాగం చూపేది గణిక; ఈమెయే 'సామాన్య' నాయిక. నాయకుడు గుణవంతుడయినప్పటికీ అతడు ధనవంతుడు కాకపోతే వానిమీద ఆమెకు ప్రేమఉండదు. ఇంక ధనవంతుడైతే చాలు, వారు ఛన్న లేదా భగ్న కాముకులు అయినా, రతార్థులయినా, అజ్ఞానులు లేదా అమాయకులు అయినా, బాల- పాషండ-షండులయినా [illegible] మీద ప్రేమ ఒలకబోస్తుంది. వారు ధనహీనులయితే [illegible] లేదా తల్లిచేత వెడల గొట్టిస్తుంది. దౌత్యం [illegible] ధూర్తత్వం మున్నగునవి [illegible] ఉపయోగపడతాయి.

[illegible] సామాన్య నాయిక రక్త-విరక్త భేదాల చేత రెండు విధాలు అని అందరూ అంగీకరించినారు. ఈ ప్రసంగంలో సింగభూపాలుని వివరణ ఇట్లా [illegible] (1-119) "రక్త [illegible] సామాన్య నాటకములందు అప్ర-[illegible] అగ్నిమిత్రుని వేశ్య [illegible] నాటకేతర రూప[illegible] ఈ సామాన్య, దేవవేశ్యఅయితే నాటకములందు [illegible] విక్రమోర్వశీయమందలి ఊర్వశివలె. ఇంక విరక్త అయిన సామాన్య ప్రహసనం మున్నగు [illegible] రూపకములందుండ వచ్చు.... కేవలం ద్రవ్యాపేక్షగల వేశ్యకు [illegible] డగు నాయకునియందు కూడా రక్తి ఉండదని, అట్టి అరక్తను [illegible] రసాభాసహేతువు కాగలదని, కావున వేశ్యను నాటకాదులందు వర్ణించరాదని

కొందరంటారు. కాని, ధీమంతుడైన సింగభూపతి ఈమతాన్ని అంగీకరించటం లేదు. విలయున-వేశ్యకు భావానుబంధం లేకపోతే నాయికాత్వమే నశిస్తుంది; నాయికాత్వం లేనిచోట రసాభాసమే అవుతుంది. అప్పుడు మానవవేశ్య నాయికగా ఉన్న ప్రకరణాధులు రసాశ్రయములుకాక పోవలసి వచ్చును. కాని, నాటక- ప్రకరణాదులు రసాశ్రయములని పెద్దలు నిర్ణయించి ఉన్నారు. కావున మానవవేశ్యకు గుణవంతుడగు నాయకునియందు అమరాగం ఉంటుంది. దీనిని రుద్రటుడు కూడా అంగీకరించినాడు - నాయకునకు కులస్త్రీ పట్ల ఈర్ష్య ఉండదు; పరస్త్రీల పట్ల విశ్శంకమగు రతి ఉండదు; వేశ్యలు మన్మథుని సర్వస్వంకావటంవల్ల - వారి పట్ల ఈర్ష్య, సందేహంలేని రతి సంభవమవుతుంది.

రక్తయగుమానవ వేశ్య నాయికగా గల రూపకానికి మృచ్ఛకటిక ప్రకరణం ఉదాహరణము.

శృంగారమంజరీకారుడు సామాన్యను ఇట్లా వర్ణించినాడు:

సామాన్య : అపరిణీత. కాని, ఫలనిమిత్తం అనేకపురుషసంభోగ. ఈమె అయిదు విధాలు - స్వతంత్ర, జనన్యధీన, నియమిత, క్లప్తానురాగ, కల్పితానురాగ.

స్వతంత్ర : స్వచ్ఛంద విహారిణి.

జనన్యధీన : తల్లిమాట జవదాటలేనిది.

[illegible] : [illegible] అధీనంలో ఉన్నది. [illegible]

క్లప్తానురాగ : [illegible] కట్టుబడి [illegible] (క్లప్తకాలంలో ఉండే అమరాగవతి). [illegible]

కల్పితానురాగ : విత్తగ్రహణార్థం అమరాగాన్ని అభినయించేది.

4. గంతుకాము

మూలం [illegible] [illegible] వాలనం చానవ్య చ [illegible]

[illegible] నావసానం [illegible] ఙ్గచాలనమ్ ॥

[illegible] చ [illegible] ముహుర్మూర నిరీక్షణం ।

[illegible]

[illegible] ॥

-(భా.ప్ర. V-152-54)

అర్థం : ప్రథమం, అనాసనం (చ), ఆసనస్య (చ), చాలనం (చ) =అసలు (నాయకుని వద్ద) కూర్చుండదు,* (ఒకవేళ కూర్చున్న ప్పటికీ, ఆతడు కూర్చున్న) ఆసనాన్ని కుదిపివేస్తుంది; అర్ధ-ఆసనేన-అ వస్థానం, పార్శ్వాత్ పార్శ్వే, అంగచాలనం=(అట్లా కూర్చుండటంలో కూడా) సగం కూడా కూర్చుండదు, (కూర్చుండి) శరీరాన్ని ఆవైపుకు ఈవైపుకు కదలాడిస్తుంది; బహుశః, విజృంభణం (చ), ముహుఃద్వార నిరీ క్షణం =ఎక్కువగా ఆవులిస్తుంది, మాటిమాటికి ద్వారంవైపు చూస్తూ ఉంటుంది; పాద-బాహ్వోః, ప్రసార్య-ఆకుంచనం, ఉత్కటికాసనం=పాదా లను చేతులను చాచుతూ, ముడుచుకొంటూ ఉంటుంది, గొంతు కూర్చుం టుంది; గాత్రభంగః, అంగులిస్ఫోటః, బహిః వార్తా - అవకర్ణనం =ఒడలు విరు చుకొంటుంది. చిటికెలు వేస్తుంది, వెలుపలి వార్తలు చెవి ఒగ్గి వింటుంది; ఏతాని, గంతుకామానాం, చిహ్నాని, ఇతి ఉపలక్షయేత్=ఇవి, 'గంతుకామ' యొక్క, చిహ్నాలు, అని, గుర్తించాలి.

తాత్పర్యం : 'గంతుకామ' అయినస్త్రీ - నాయకునితో కలిసి అసలు కూర్చుండదు; కూర్చుండటం తప్పనిసరి అయితే-సగమే (=ఒక పిరుదుమీద) కూర్చుంటుంది. నాయకుడున్న ఆసనాన్ని కుదిపివేస్తుంది. తన శరీరాన్ని ఆవైపు, ఈవైపు కదలాడిస్తూఉంటుంది. ఎక్కువగా ఆవులిస్తుంది, మాటి మాటికి ద్వారం వైపు చూస్తుంటుంది. పాదాలను, బాహువులను చాచి ముడుస్తూ ఉంటుంది. ఒడలు విరుచుకొంటుంది. చిటికెలు వేస్తుంది. వెలు పలి వార్తలు ఆసక్తితో వింటుంది. గొంతుకూర్చుంటుంది.

టీక : 'గంతుకామ' అనే భేదాన్ని శారదాతనయుడు ఒక్కడు మాత్రమే చెప్పినాడు. విరక్త నాయికను వివరించే సందర్భంలో, ప్రకృతనాయకుని (పీడ) వదలించుకొని పోజూచే నాయికనుగా 'గంతుకామ'ను వర్ణించినాడు శారదాతన యుడు. దీనిని విరక్తనాయికాభేదంగా పరిగణించవచ్చు.

## 4. మానభేదాలు (మధ్యానాయికావిషయం) :

మూలం : ప్రియాపరాధావగమా త్పంజాతో మాన ఇష్యతే ।
లఘుమానో మధ్యమానో గురుమాన ఇతి త్రిధా ॥

-(భ.ర.ప్ర-19)

అర్థం : ప్రియ-అపరాధ-అవగమాత్, సంజాతః, మానః, ఇష్యతే=ప్రియుడు చేసిన, అపరాధం, తెలియటంవల్ల, (నాయికలో) జనించే (కోపం అనే వ్యాపారం), 'మానం' అనబడుతుంది; లఘుమానః, మధ్యమానః, గురు మానః, ఇతి త్రిధా=(ఈమానం) లఘు (=తక్కువకాలం ఉండే) మానం, మధ్యమానం, గురు(=ఎక్కువకాలం ఉండే), మానం—అని, మూడువిధాలు.

తాత్పర్యం : ప్రియుడుచేసిన అపరాధం తెలిసినప్పుడు నాయికలో జనించే కోపం 'మానం' అనబడుతుంది. ఈమానం మూడువిధాలు - లఘుమానం, మధ్యమానం, గురుమానం.

టీక : 'రతి' భేదాలలో 'మానం' ఒకటి. విప్రలంభశృంగారంలో 'మాన విప్రలంభం' ఒక భేదం. (వీటి వివరాలు ఆయా సందర్భములందు చూడదగును).

(1) లఘుమానం (మధ్యానాయికావిషయం) :

మూలం : అన్యస్త్రీదర్శనాదిభ్యో లఘుమానః ప్రజాయతే ।
వాగా ద్యల్పై రసౌ మాన స్త్వపనేయః ప్రకీర్తితః ॥
-(భ.ర.ప్ర-20)

అర్థం : అన్యస్త్రీ దర్శనాదిభ్యః =(తన ప్రియునితో ఉన్న) పరస్త్రీని చూడటం మున్నగువాటివల్ల; లఘుమానః ప్రజాయతే=లఘుమానం పుట్టు తుంది (=కలిగిన మానం లఘువుగా ఉంటుంది); అసౌ మానః, వాక్-ఆది-అల్పైః (తు), అపనేయః ప్రకీర్తితః=ఈ లఘుమానం, మంచిమాటలు మున్నగు తక్కువ ప్రయత్నాలతో, తొలగింపదగినది (అని), చెప్పబడినది.

తాత్పర్యం : తన ప్రియునితో ఉన్న అన్యస్త్రీని చూడటం మున్నగువాటి వల్ల నాయికలో కలిగే కోపం లఘుమానం. దీనిని, మంచిమాటలు మున్నగు వాటితో అంటే అల్పప్రయత్నంతో, పోగొట్టవచ్చు.

[illegible] మధ్యమానం (మధ్యానాయికావిషయం) :

[illegible] మధ్యమాన స్తథాన్యస్యా నామగ్రహణతో భవేత్ ।
విన మ్రాపో హ్య పనేతవ్య శ్శపథా ద్యనువర్తనైః ॥
-(భ.ర.ప్ర. 21)

అర్థం : (అథ) అన్యస్య, నామగ్రహణాత్, మధ్యమానః (తు), భవేత్=(సరససల్లాపాలు చేస్తున్నప్పుడు లేదా నిద్రలో వాని నోటి నుంచి) అన్యస్త్రీ నామం వినబడటంవల్ల (దీనినే 'గోత్రస్ఖలనం' అంటారు), (నాయికలో కలిగే కోపం), మధ్యమానం, అవుతుంది.

ఏషమ్మానః, శపథ-ఆది-అనువర్తనైః, అపనేతవ్యః=ఈమధ్యమానం, శపథం (=ప్రమాణం) చేయటం మున్నగు, నమ్మకపు పనులచేత, పోగొట్టదగినది.

తాత్పర్యం : నాయకునితో సరసల్లాపం చేస్తున్నదు, లేదా నిద్రలో ఆ నాయకుడు అన్యస్త్రీ ప్రసంగించేస్తే, నాయికలో కలిగే కోపం మధ్యమానం అవుతుంది. ప్రమాణం చేయటంవంటి వ్యాపారాలవల్ల, విశ్వాసం కలిగించి ఈమానం తొలగించవచ్చు.

(3) గురుమానం (మధ్యానాయికావిషయం) :

మూలం : అన్యాసంగకృత చిహ్నైర్ద్యై ర్గురుమానః ప్రజాయతే ।
పాదప్రణామానునయై రపనేయో భవే దసౌ ॥

-(భ.ర.ప్ర-22)

అర్థం : అన్యాసంగకృత చిహ్నైర్ద్యైః, గురుమానః, ప్రజాయతే=అన్యస్త్రీతో చేసిన సంభోగం యొక్క గుర్తులు మున్నగునవి (నాయకునియందు చూడటం వల్ల నాయికలో), గురుమానం, పుట్టుతుంది.

అసౌ ఇది (=ఈ గురుమానం); పాదప్రణామ-అనునయైః, అపనేయః, భవేత్=నాయకుడు నాయికయొక్క పాదాలపై పడటంవంటి ఉపచారాలవల్ల, తొలగింపబడుతుంది.

తాత్పర్యం : అన్యస్త్రీ సంభోగసూచక ఆ గుర్తులతో [illegible] నాయకుని చూసినప్పుడు, నాయికలో కలిగేది గురుమానం, [illegible] నాయిక పాదాలపైపడి, క్షమార్పణ చెప్పుకోవటంవంటి వ్యాపారాల వల్ల ఆమెకు కలిగిన గురుమానం పోగొట్టుకున్న [illegible]) [illegible] (*)

టీక : భామదత్తుడు మానభేదాలను ఇలా వివరించాడు: "ప్రియాపరాధ సూచిక అయిన చేష్టామానం ... మెల్లగా పోగొట్టదగినది లఘుమానం,

కష్టంగా పోగొట్టదగినది మధ్యమానం, కష్టతరంగా పోగొట్టదగినది గురుమానం. ఇంక పోగొట్టటానికి అసాధ్యమైన మ్లానం రసాభాసమే అవుతుంది."

## 5. ధీరాదిభేదాలు :

(1) మధ్యానాయికా విషయం :

మూలం : ధీరా తు వక్తి వక్రోక్త్యా సోత్ప్రాసం సాగసం ప్రియమ్ ।
అధీరా పరుషైర్వాక్యైః ఖేదయేద్వల్లభం రుషా ॥
ధీరాధీరా తు వక్రోక్త్యా సబాష్పం వదతి ప్రియం ।
(ర.సు.I-100-101)

అర్థం : సాగసం ప్రియం=అపరాధం చేసిన ప్రియుని (చూచి); సోత్ప్రాసం, వక్రోక్త్యా వక్తి=సాభిప్రాయంగా, వంకరమాటలు చెప్పేది; ధీరా(తు)=(మధ్యా) ధీర (నాయిక అవుతుంది).

రుషా=కోపంతో; పరుషైః వాక్యైః=పరుషములగు వాక్యాలతో; వల్లభం, ఖేదయేత్=(అపరాధం చేసిన) వల్లభుని ఖేద పెట్టేది; అధీరా=(మధ్యా) అధీర (నాయిక అవుతుంది).

సబాష్పం, వక్రోక్త్యా, ప్రియం, వదతి, ధీరాధీరా(తు) =కన్నీళ్ళతో, వంకరమాటలతో, (అపరాధం చేసిన) ప్రియుని గూర్చి చెప్పేది (=ప్రియుని నిందించేది) (మధ్యా) ధీరాధీర (నాయిక అవుతుంది).

తాత్పర్యం : అపరాధం చేసిన ప్రియుని

i) వంకర మాటలతో దెప్పిపొడిచేది ధీర.

ii) పరుష వాక్యాలతో ఖేదపెట్టేది అధీర.

iii) కన్నీళ్ళతో, వక్రోక్తులతో నిందించేది ధీరాధీర.

[illegible] కన్నీళ్ళవల్ల అధీరత్వం, వక్రోక్తులవల్ల ధీరత్వం - ఈ రెండూ కలిసి ఉన్నాయి.

[illegible] ... 50 వ శ్లోకం "[illegible]" విముంచ ..." ధీరాధీరకు ఉదాహరణ కాగలదు.

(2) ప్రగల్భా నాయికా విషయం :

మూలం : ఉదాస్తే సురతే ధీరా సావహిత్థాచ సాదరా ॥
సంతర్జ్య నిష్ఠురం రోషా దధీరా తాడయే త్ప్రియమ్॥
ధీరాధీర గుణోపేతా ధీరాధీరేతి కథ్యతే ॥

-(ర.సు. I-103-104)

అర్థం : స-ఆదరా, స-అవహిత్థా=ఆదరసహిత అయినప్పటికీ (ప్రియుని అపరాధంవల్ల కలిగిన మానంతో) దానిని దాచిపెట్టి; సురతే, ఉదాస్తే, ధీరా=సురతమందు ఉపేక్షవహించేది ప్రగల్భాధీరా నాయిక అవుతుంది.

రోషాత్, ప్రియం, అరం, సంతర్జ్య, తాడయేత్, అధీరా=రోషంతో, ప్రియుని, మిక్కిలిగా (=నిష్ఠురంగా), బెదరించి, కొట్టేది, (ప్రగల్భా) అధీర నాయిక (అవుతుంది).

ధీరా-అధీరా గుణ-ఉపేతా=ధీరప్రగల్భా నాయికయొక్క, అధీరప్రగల్భా నాయికయొక్క గుణాలతో కూడినది; ధీరాధీర, ఇతి, కథ్యతే=ధీరాధీర (ప్రగల్భానాయిక), అని, చెప్పబడుతున్నది.

తాత్పర్యం : ప్రియుడు అపరాధం చేసినప్పుడు కుపితయై –

(i) ప్రేమ ఉన్నప్పటికీ, దానిని దాచిపెట్టి, సురతమందు ఉపేక్ష వహించేది ప్రగల్భా ధీరానాయిక;

(ii) రోషంతో ప్రియుని బెదరించి, కొట్టేది ప్రగల్భా అధీరానాయిక;

(iii) ధీరా-అధీరా నాయికల గుణాలు రెండూ కలిగినది ప్రగల్భా ధీరా నాయిక (అంటే రతియందు ఉదాసీనత, తర్జన తాడనాదులు-రెండూ ఉంటాయన్నమాట).

టీక : ప్రౌఢ(=ప్రగల్భ) ధీరాదుల రతిగతులను శారదానయుడు ఇట్లా వర్ణించినాడు (భా.ప్ర.IV-218-22);

ధీర : రతిపరిశ్రాంత అయినప్పటికీ మరల మరల రతివిధికి ప్రోత్సహిస్తుంది. పురుషాయితమునకు ప్రయత్నిస్తుంది. సవినయోపచారాలచేత ప్రోత్సాహం ఇస్తుంది.

ఇంక భోగాపరాధం చేసిన ప్రియుని అక్రమభాషణముల (=వక్రోక్తుల) చేత ఖేదపెడుతుంది; రోషంతో అతనిని చూడనే చూడదు (=రతి విషయంలో ఉదాసీనగా ఉంటుంది).

అధీర : ప్రియుడాలింగనం చేసుకొన్న వెంటనే అన్యవనితా సంభోగ చిహ్నాలను గుర్తించలేదు. వరవశురాలవుతుంది. సంభోగ ముగ్ధఅవుతుంది. స్వేదరోమాంచమంథరంగా రతిమూర్ఛిత అవుతుంది.

ఇంక ప్రియుడు సాపరాధుడని తెలిశాక మాటిమాటికి హుంకరిస్తుంది. కోపంతో, చెలికత్తెల సమక్షమందే, ప్రియుని జుట్టుపట్టుకొంటుంది; కొట్టుతుంది.

ధీరాధీర : పై ఇరువురి చేష్టలు చేస్తుంది.

మధ్యా-ప్రగల్భా నాయికల ధీరాదిభేదాల ప్రధానగుణాలను సంక్షిప్తంగా ఇట్లా వివరించవచ్చు.

ముగ్ధ - లజ్జాప్రధానం; మధ్య- లజ్జా-మదన సామ్యం;

ప్రగల్భ - ప్రకాశత్వం ప్రధానం; ధీర=ధైర్యం ప్రధానం;

అధీర - అధైర్యం ప్రధానం ; ధీరాధీర=ధైర్య-అధైర్యాలు ప్రధానం;

మధ్యధీర - క్రోధసూచక భాషణం;

మధ్యాఅధీర - అన్యాపదేశంగా పతిమీద కోపంచూపటం;

మధ్యాధీరాధీర - వ్యంగ్య-అవ్యంగ్య భాషణాలతో కోపం ప్రకటించటం;

ప్రగల్భధీర - రత్యుపేక్షద్వారా కోపప్రకాశనం;

ప్రగల్భాఅధీర - తర్జనాదులతో కోపప్రకాశనం;

ప్రగల్భా ధీరాధీర - రత్యుపేక్ష, తర్జనాదులు-రెండూ ఉంటాయి;

ఉదా :

| | | | | | |
|---|---|---|---|---|---|
| సాపహ్నవ, సాదర | — | అమరుశతకం | 17 | వ శ్లోకం | (ఏకత్రాసన...) |
| రతి-ఉదాసీన | — | ” | 63 | ” | (అయస్తా కలహం...) |
| అధీర-ప్రగల్భ | — | ” | 10 | ” | (కోపాత్కోమల...) |
| ధీరాధీర ప్రగల్భ | — | ” | 33 | ” | (కోపో యత్ర...) |

## 6. జ్యేష్ఠా-కనిష్ఠలు (మధ్యా-ప్రగల్భా భేదాలు) :

మూలం : ఏతే జ్యేష్ఠా కనిష్ఠేతి [illegible] ద్వివిధే మతే ।
[illegible] జ్యేష్ఠా సా తు విగద్యతే ॥
[illegible] ప్రకీర్తితా ।
-(దశ.ప్ర. 28-29)

[illegible]

తాత్పర్యం : వారు (మధ్యాధీరాదులు, ప్రౌఢాధీరాదులు= మొత్తం ఆరు గురు) జ్యేష్ఠ, కనిష్ఠ భేదాలచేత రెండేసి విధాలు. భర్తకు ఎవతెయందు ఎక్కువ ప్రేమఉంటుందో ఆమె జ్యేష్ఠ; ఎవతెయందు తక్కువ ప్రేమఉంటుందో ఆమె కనిష్ఠ.

టీక : మధ్యానాయిక ఆరువిధాలు - మధ్యా ధీరజ్యేష్ఠ, మధ్యా-అధీర జ్యేష్ఠ, మధ్యాధీరాధీర జ్యేష్ఠ, మధ్యా ధీరకనిష్ఠ, మధ్యా-అధీర కనిష్ఠ, మధ్యాధీరాధీరకనిష్ఠ - కాగా మధ్యా నాయిక ఆరువిధాలు. ఇట్లాగే ప్రౌఢకూడా ఆరువిధాలు. ఈ జ్యేష్ఠ-కనిష్ఠత్వాలు వయస్సునుపట్టి లేదా వివాహకాల భేదాన్నిపట్టి ఏర్పడినవికావు. ఇరువురు భార్యలు ఉన్నప్పుడు, పతికి ఎవతెయందు అధికమగు ప్రేమ ఉంటుందో ఆమె జ్యేష్ఠ; ఇంక రెండవ ఆమె కనిష్ఠ అవుతుంది.

ఈజ్యేష్ఠా-కనిష్ఠత్వాలు విధివిహితంగా పరిణయమాడిన భార్యలకు వర్తిస్తా యికాని, పరకీయా, సామాన్యలకు వర్తించవని భానుదత్తుడు స్పష్టంచేసినాడు.

ఉదా :అమరుశతకమందలి 17వ శ్లోకం (ఏకత్రాసన ...) ఇందులకు కూడా ఉదాహరణ.

ఇందులో, ఒక నాయిక చూస్తూ ఉండగా రెండవ ఆమెయొక్క కన్నులను మూయటంవల్ల - ఆమె గౌరవార్హ అనియు, అందుచేత జ్యేష్ఠ అనియు గ్రాహ్యం. ఒకతెకు కన్నులు మూసి రెండవ ఆమెను ముద్దుపెట్టుకొనటం చేత, రెండవ ఆమె గౌరవానికి అంతగా అర్హతలేనిది అని ఎంచాలి; అందుచేత ఆమె కనిష్ఠ.

## 7. ఉత్తమాది భేదాలు :

టీక : నాట్యశాస్త్రంలో ఉత్తమాది భేదాలు రెండుసార్లు వర్ణింపబడినవి. బరోడా ముద్రణ 24వ అధ్యాయంలో పురుషులప్రకృతులతో పాటు స్త్రీల ప్రకృతులుకూడా మూడువిధాలుగా వివరింపబడినవి.

పురుషులు : ఉత్తముడు, మధ్యముడు, అధముడు.

స్త్రీలు : ఉత్తమ, మధ్యమ, అధమ.

ఇంక 'బాహ్యోపచారం' అనే 23వ అధ్యాయంలో రక్త-విరక్తల గుణాలను వివరించే సందర్భంలో మరల స్త్రీలకు సంబంధించి—ఉత్తమ-మధ్యమ-అధమభేదాలు వివరింపబడినవి. కాగా, 24వ అధ్యాయంలోని వర్ణన స్త్రీల సహజశీలాలకు సంబం ధించినదనీ; 23వ అధ్యాయంలోని వర్ణన శృంగార సంబంధిచేష్టలకు చెందినదనీ

తలంచవలసి ఉన్నది; లేదా 23 వ అధ్యాయంలోని వర్ణనలు 'బాహ్యోపచారాని'కి సంబంధించినవి కాబట్టి, అవి కేవలం వేశ్యలకు సంబంధించినవైనా కావాలి.

కావి, చిత్రంగా, తరువాతి అలంకారికులు, 24వ అధ్యాయంలోని విభజనను విడిచివేసి, 23వ అధ్యాయంలోని విభజననే సర్వస్త్రీసాధారణ విభజనగా గ్రహించినట్లు గోచరిస్తున్నది. నా.శా. అనువాదకులు కూడా రెండింటి భేదాన్ని గుర్తించలేదు.

*(1) ఉత్తమస్త్రీప్రకృతి :*

మూలం : మృదుభావా త్వచపలా స్మితభాషి త్వనిష్ఠురా ।
గురూణాం వచనేదక్షా సలజ్జా వినయాన్వితా ॥
రూపాభిజనమాధుర్యగుణైః స్వాభావికై ర్యుతా ।
గాంభీర్య ధైర్యసంపన్నా విజ్ఞేయా ప్రమదోత్తమా ॥
-(నా.శా.XXIV-9-10)

యా విప్రియేఽపి తిష్ఠంతం ప్రియం వదతి నాప్రియమ్ ।
న దీర్ఘరోషా చ తథా కలాసు చ విచక్షణా ॥
శీలశోభా కులాధిక్యా పురుషై ర్యా చ కామ్యతే ।
కుశలా కామతంత్రేషు దక్షిణా రూపశాలినీ ॥
గృహ్ణాతి కారణాత్ రోషం విగతేర్ష్యా బ్రవీతి చ ।
కార్యకాలవిశేషజ్ఞా సురూపా సా స్మృతోత్తమా ॥
-(నా.శా. XXIII-36-38)

అర్థం : మృదుభావా(తు), అచపలా, స్మితభాషిణీ, అనిష్ఠురా=మృదుస్వభావ, అచపల, స్మితభాషిణి, అనిష్ఠుర; గురూణాం వచనేదక్షా, సలజ్జా, వినయ-అన్వితా=గురుజనులతో మాటాడటంలో సమర్థురాలు, లజ్జా-వినయములతో కూడినది; స్వాభావికైః రూప-అభిజన- మాధుర్య గుణైః యుతా=రూపం-కులీనత-మాధుర్యం అనే స్వాభావిక గుణాలతో కూడినది; గాంభీర్య-ధైర్యసంపన్నా, ప్రమదా, ఉత్తమా, విజ్ఞేయా=గాంభీర్యం-ధైర్యం-తేజస్సు కలది; (-ఇటువంటి) ప్రమద, ఉత్తమ (అని) తెలియవలె.

యా, విప్రియే, తిష్ఠంతం, ప్రియం, అపి=ఎవతె, అప్రియకారి అయిన ప్రియుడైన గూర్చికూడా; న-అప్రియం, వదతి=అప్రియం పలుకనిది; న, దీర్ఘరోషా(చ), (తథా), కలాసు(చ) విచక్షణా=దీర్ఘరోషం లేనిది, కళలయందు

నేర్పరి; శీల-శోభా-కుల-ఆధిక్యైః, పురుషైః, యా(చ), కామ్యతే=శీలం-శోభ-కులం—వీటియొక్క ఆధిక్యం కలిగి ఉండటంచేత ఎవతె పురుషులచేత కోరబడుతుందో (=కోరబడేది), కామతంత్రేషు, కుశలా, దక్షిణా, రూపశాలినీ=కామతంత్రమందు కుశల, దయాన్విత, రూపశాలిని; కారణాత్ రోషం గృహ్ణాతి, విగత-ఈర్ష్యా, బ్రవీతి (చ)=(తగినంత) కారణం ఉన్నప్పుడే రోషపడేది, ఈర్ష్యారహితంగా మాటాడేది; కార్య-కాల విశేషజ్ఞా, సురూపా=కార్య-కాలవిశేషాలను గుర్తించగలది, సురూప; సా, ఉత్తమా, స్మృతా=(అయిన) ఆమె, ఉత్తమ (అని), చెప్పబడినది.

తాత్పర్యం : ఉత్తమస్త్రీ ప్రకృతి— మృదుస్వభావ, అచపల, స్మితభాషిణి, అనిష్ఠుర, గురుజనులతో మాటాడటంలో దక్ష, లజ్జాన్విత, వినయాన్విత (లేదా వచన దక్ష అయినప్పటికీ గురుజనులపట్ల వినయాన్విత, లజ్జాన్విత), రూప-అభిజన-మాధుర్యములు అనే స్వాభావిక గుణములతో కూడినది, గాంభీర్య-ధైర్య సంపన్న అయిన ప్రమద 'ఉత్తమ ప్రకృతి' (24వ అధ్యా.).

ప్రియుడు తనకు విప్రియం చేస్తున్నప్పటికీ తాను అప్రియం పలుకనిది (తూష్ణీం భావంతో ఉండేది—భా.ప్ర.), దీర్ఘరోషం లేనిది, కలావిచక్షణ, శీల-శోభా-కులాధికులగు పురుషులచేత కూడా కోరబడేది, కామతంత్ర మందు కుశల, దక్షిణ, రూపశాలిని, తగినంత కారణం ఉన్నప్పుడే రోషపడేది, (కాని అనునయంతో ప్రసన్నురాలు అగునది—ర.సు.), ఈర్ష్యారహితంగా మాటాడేది, కార్య-కాల-విశేషాలను గుర్తెరిగినది, రూపవంతురాలు - ఇట్టిది రక్త అయిన ఉత్తమ స్త్రీ ప్రకృతి (23 అధ్యా.).

(2) మధ్యమాప్రకృతి :

మూలం : నాత్యుత్కృష్టైరనికృష్టైః శీలరేవాన్వితా గుణైః ।
అల్పదోషానువిద్ధా చ మధ్యమా ప్రకృతిః స్మృతా ॥
-(నా.శా.XXIV-11)

పురుషైః కామ్యతే యా తు తథా కామయతే చ తాన్ ।
కామోపచారకుశలా ప్రతిపక్షాభ్యసూయినీ ॥
ఈర్ష్యాతురా త్వనిభృతా క్షణక్రోధాతిగర్వితా ।
క్షణప్రసాదా యా చైవ సా నారీ మధ్యమా స్మృతా ॥
-(నా.శా.XXIII-39-40)

**అర్థం :** న-అతి-ఉత్కృష్టైః, అనిఖిలైః, ఏభిః-ఏవ, గుణైః, అన్వితా=అతి ఉత్కృష్టములు, అశిథిలములు (=అసమగ్రములు) కాని ఈ (=ఉత్తమ యొక్క) గుణములతోనే కూడినది; అల్పదోష-అనువిద్ధా (చ), మధ్యమా ప్రకృతిః, స్మృతా=అల్పదోషాలు కలది, మధ్యమప్రకృతి (అవి) చెప్పబడినది.

యా, పురుషైః, కామ్యతే(తు), తథా(చ) తాన్ కామయతే =ఎవతె, పురుషులచేత కామింపబడేది, అట్లాగే, వారిని తాను కామించేది (=పురుషులను వలచి, వలపించుకొనే నేర్పుకలది); కామోపచారకుశలా, ప్రతిపక్ష-అభ్యసూయినీ=కామోపచారము లందునేర్పరి, ప్రతిపక్షం (=సవతుల) వట్ల అసూయకలది; ఈర్ష్యా-ఆతురా(తు), అనిభృతా, క్షణక్రోధా, అతిగర్వితా, క్షణప్రసాదా=ఈర్ష్యాపరమైన తొందరపాటు కలది, అనిభృత, క్షణక్రోధ, అతి గర్విత, క్షణప్రసాద (అయిన); సా, నారీ, మధ్యమా, స్మృతా=ఆ, నారి, మధ్యమ(అని) చెప్పబడినది.

**తాత్పర్యం :** మధ్యమస్త్రీ ప్రకృతి : అంతఉత్కృష్టములు, అంత అసమగ్రములుకాని ఉత్తమా ప్రకృతి గుణాలతో కూడినది, అల్పదోషాలు కలది 'మధ్యమాప్రకృతి' అవుతుంది (24 వ అధ్యాయంలో).

పురుషులను వలచి, వలపించుకొనే నేర్పుకలది, కామోపచారములందు కుశల, ప్రతిపక్షమునందు అసూయకలది, ఈర్ష్యాతుర, అనిభృత, క్షణక్రోధ-క్షణప్రసాద, అతిగర్విత- ఇట్టి రక్త అయిన స్త్రీ మధ్యమ ప్రకృతి (23 వ అధ్యా.).

[illegible] శ.ను.లో మధ్యమాప్రకృతి ఇట్లా వర్ణింపబడినది (I.153-55): ఎవరు, పురుషుడు తనను కామిస్తే, తానుకూడా కామిస్తుందో, అతడు కోపిస్తే తాను కూడా కోపిస్తుందో, అతడు సత్యంపలికితే తానుకూడా సత్యం పలుకుతుందో, అతడు అపరాధి అయితే తానుకూడా అపరాధం చేస్తుందో, అతడు స్నేహంచూపితే తానుకూడా స్నేహం చూపుతుందో - ఆమె మధ్యమ నాయిక అవుతుంది.

**(3) అధమాప్రకృతి**

మూలం : అధమా ప్రకృతి ర్యాతు పురుషాణాం ప్రకీర్తితా ।
[illegible] నారీణా మధమానాం సమాసతః ॥
-(నా.శా. XXIV-12)

అస్థాన కోపనా యా తు దుష్టశీలాతిమానినీ ।
చపలా పరుషా చైవ దీర్ఘరోషాఽధమా స్మృతా ॥
-(నా.శా. XXIII-41)

అర్థం : పురుషాణాం, యా(తు) ప్రకృతిః, అధమా, ప్రకీర్తితః=పురుషులయందు, ఏ ప్రకృతి, అధమం (అని) చెప్పబడినదో; సా-ఏవ, సమాసతః అధమానాం నారీణాం విజ్ఞేయా=అదే, మొత్తంమీద, అధమస్త్రీలవట్ల కూడా, తెలియవలె (24 వ అధ్యా.).

యా(తు), అస్థాన కోపనా, దుష్టశీలా, అతిమానినీ=ఎవతె, కోపించరాని చోట కోపించేది, దుష్టశీలం కలది, మానం అధికంగా కలది; చపలా, పరుషా (చ-ఏవ), దీర్ఘ రోషా, అధమా స్మృతా=చపల, పరుష స్వభావ, దీర్ఘరోష (అయినది), అధమప్రకృతి (అని) చెప్పబడినది (23 వ అధ్యా.).

తాత్పర్యం : అధమస్త్రీ ప్రకృతి : పురుషులలోని అధమప్రకృతికి చెప్పిన లక్షణాలే స్త్రీలయందలి అధమ ప్రకృతికి కూడా మొత్తంమీద వర్తిస్తాయి (24 వ అధ్యా.).

అస్థానకోపన, దుశ్శీల, అతిమానిని, చపల, పరుషస్వభావ, దీర్ఘరోష - ఇవి రక్తఅయిన అధమస్త్రీయొక్క స్వరూప-చేష్టలు (23 వ అధ్యా.).

టీక : పింగభూపాలుడు అధమస్త్రీ యొక్క స్వభావ-చేష్టలను ఇట్లా వర్ణించినాడు (ర.సు.I-155-57):

"ఏ స్త్రీ అకారణంగా కోపిస్తుందో, ప్రార్థించినా కోపం విడిచి పెట్టదో, నాయకుడు - రూపవంతుడయినా, కురూపిఅయినా, గుణవంతుడయినా, గుణహీనుడయినా, ముసలివాడయినా, తరుణుడయినా - ఎటువంటి వాడయినా ఆ పురుషుని మరల మరల కామిస్తుందో, ఈర్ష్యా-కోపం-విషాదం కలిగి ఉంటుందో ఆమె అధమ నాయిక".

(4) శృంగారపరంగా వివరణ :

భామదత్తుడు క్రిందివిధంగా ఉత్తమాదులను శృంగారపరంగానే నిర్వచించినాడు (ర.మం.88-90):

ఉత్తమ : ప్రియుడు అహితం చేసినా తాను హితమే చేసేది.

మధ్యమ : ప్రియుడు హితంచేస్తే తాను హితం చేస్తుంది; అతడు అహితంచేస్తే, తాను అహితం చేస్తుంది.

అధమ : ప్రియుడు హితంచేసినా, తాను అహితమే చేస్తుంది. నిర్నిమిత్తంగా కోపించే ఈమెను 'చండి' అంటారు.

శృంగారమంజరీకర్త కూడా ఉత్తమాదులను శృంగారసంబంధిగానే, చాలా విపులంగా వివరించినాడు.

ఉత్తమ : ప్రియుడు చేసిన హితంకంటె అధికంగా హితం చేసేది.

మధ్యమ : ప్రియుడుచేసిన హితంతో సమానంగా హితంచేసేది.

అధమ : ప్రియుడు చేసిన హితం కంటె తక్కువ హితంచేసేది.

శృంగారాలంబనాన్ని పురస్కరించుకొని :

నాయిక యొక్క ప్రగల్భాత్వదశ ఉత్తమాత్వదశ.

నాయిక యొక్క మధ్యాత్వదశ మధ్యమాత్వదశ.

నాయిక యొక్క ముగ్ధాత్వదశ అధమాత్వదశ.

స్వీయ :

ఉత్తమ - పతియందు యావజ్జీవం అనురాగం కలదై ఆజ్ఞానువర్తినిగా ఉండేది; పతివ్రత.

మధ్యమ - నాయకహిత-అనురాగానుకూల; ప్రపంచధర్మంగా నాయకానువర్తిని.

అధమ - చంచలమతి.

పరకీయ :

ఉత్తమ - ఉపపతియందు యావజ్జీవం అనురాగిణియై, రహస్యంగా సంచరించేది.

మధ్యమ - ఉపపతిమీది అనురాగం ప్రకటితమైనది.

అధమ - చంచల హృదయ, సర్వత్రానురాగిణి.

సామాన్య :

ఉత్తమ - క్లిష్టానురాగ, నియమిత.

మధ్యమ - కల్పితానురాగ, స్వతంత్ర.

అధమ - కల్పితానురాగ, జనవ్యాధీన.

స్వాధీనపతిక :

ఉత్తమ - ప్రణయకలహానికి తానే కారణమైనా ప్రియుని చేత అనునయింపబడేది.

మధ్యమ - స్వయంగా ప్రణయకలహం కల్పించి, తానే ప్రియుని అనునయించేది.

అధమ - స్వయంగా ప్రణయకలహానికి కారణమై, ప్రియుడు తనను అనునయించాలని కోరేది.

వాసకసజ్జిక :

ఉత్తమ - ప్రియతముని హృదయానురంజకంగా అలంకరించుకొని, మరల మరల సఖిని పుత్తెంచి, అతని రాకకు ఎదురుచూస్తూ, తత్సంగమోత్సవ నిమగ్నఅయినది.

మధ్యమ - ప్రియుడు పంపిన భూషణాలను ధరించి, తదాగమనమునకు ప్రతీక్షచేసేది.

అధమ - ప్రియుని ఆగమనసమయంలో నిరలంకారంగా, సాధారణమైన దుస్తులతో ఉండేది.

విరహోత్కంఠిత :

ఉత్తమ - ప్రియుని చూడటంలో రెప్పపాటువల్ల కలిగే విఘ్నంచేత కూడా విరహవేదన అధికంగా పొందేది.

మధ్యమ - వల్లభుడు కనిపించపోతే, మూర్ఛకు లోనయ్యేది.

అధమ - నాయక విప్రలంభ అధికంగా వేదనవతి అయ్యేది.

విప్రలబ్ధ :

ఉత్తమ - నాయకుడు అన్యాసక్తుడై, తనను వంచించినప్పటికీ, దానిని మరచి, అత్యంతం వ్యాకులపాటు పొందేది (అంటే ప్రేమ అధికమవుతుంది).

మధ్యమ - అధమ - వంచన చేత వీరి ప్రేమ క్రమంగా తగ్గుతుంది.

**ఖండిత :**

ఉత్తమ - నాయకుని అపరాధం గొప్పదైనా, కొంచెమే కోపం పొందేది.

మధ్యమ - నాయకాపరాధానికి సమానమైన కోపం పొందేది.

అధమ - నాయకాపరాధం కంటె అధికమైన కోపం పొందేది.

**మానవతి :**

ఉత్తమ - లఘుమానవతి.

మధ్యమ - మధ్యమానవతి.

అధమ - గురుమానవతి.

**ధీర :**

ఉత్తమ - కోపవాక్యాలు గూడంగా వ్యంగ్యంగా బహుమాన (=గౌరవం) పురస్సరంగా చెప్పేది.

మధ్యమ - కోపవాక్యాలు వ్యంగ్యంగా చెప్పేది.

అధమ - కోపవాక్యాలు కించిత్ వ్యంగ్యంగా మాత్రమే చెప్పేది.

**అధీర :**

ఉత్తమ - ప్రియుని కించపరుస్తూ కోపంగా మాట్లాడేది.

మధ్యమ - ప్రియుని బెదరిస్తూ మాట్లాడేది.

అధమ - ప్రియుని [illegible] కొట్టేది.

**ధీరాధీర :**

ధీర-అధీర కృత్యాలు కలిపి ఉత్తమాదులవల్లే అన్వయిస్తాయి.

[illegible] త్రైవిధ్యాన్నే ఊహించాలి.

**వక్రోక్తిగర్విత :**

ఉత్తమ - తనకంటె ప్రియుని అధికంగా వర్ణించేది.

మధ్యమ - తనను, ప్రియుని సమానంగా వర్ణించేది.

అధమ - తనను మాత్రమే వర్ణించుకొనేది.

**కలహాంతరిత :**

ఉత్తమ - ప్రియుడు తనను అనునయించినప్పటికోపం కంటె అధికంగా తరువాత పశ్చాత్తాపపడేది.

మధ్యమ - ప్రియుని అనునయంతో సమానంగా పశ్చాత్తాపం కలది.

అధమ - ప్రియుని అనునయం కంటె చాలా తక్కువ పశ్చాత్తాపం పొందేది.

**ప్రోషితభర్తృక :**

ఉత్తమ - ప్రియప్రవాస కథనమాత్రం చేతనే వ్యాకులపడేది.

మధ్యమ - ప్రియుని వర్తమాన ప్రవాసంచేత ఖిన్నఅయ్యేది.

అధమ - ప్రియుడు ప్రవాసం వెళ్ళిన తరువాత వేదనాపతి అయ్యేది.

**అభిసారిక :**

ఉత్తమ - దేహాన్ని విస్మరించి, సాహసమే సహాయంగా అభిసరించేది. ఈమెయే కామాభిసారిక.

మధ్యమ - సహాయం తీసుకొని అభిసరించేది.

అధమ - సమయంకోసం నిరీక్షించి, అభిసరించేది.

**సఖి :**

ఉత్తమ - అత్యంత హితాభిలాషిణి

మధ్యమ - నాయిక మనస్సుకు అనుకూలంగా మాటాడేది.

అధమ - ఏదోచెప్పి, ఏదో సహాయం చేసేది.

## 8. ఉదాత్తాదిభేదాలు :

టీక : ధీరోద్ధతాది భేదాలతో నాయకులు నాలుగు విధాలు అని చెప్పి, నాయికలను భరతముని ఇట్లా వివరించినాడు (నా.శా. XXIV-23-26):

"నాయికలు కూడా నాలుగు విధాలు : దివ్య, నృపపత్ని, కులస్త్రీ, గణిక. ప్రకృతి లక్షణ (=గుణ) భేదాలచేత వీరు నానావిధాలుగా ఉంటారు - ధీరలు, లలితలు, ఉదాత్తలు, నిభృతలు. దివ్య- నృపపత్నులిరువురు ఈ నాలుగు

గుణాలను కలిగి ఉంటారు. కులజాంగనలు ఉదాత్తలు, నిభృతలు అవుతారు. గణికా-శిల్పకారికలు లలిత-ఉదాత్తలుగా ఉంటారు."

భరతముని నాయకులకు వాడిన 'ధీర' శబ్దాన్ని, తరువాత వారు మధ్యా-ప్రౌఢా-స్వీయా నాయికలపట్ల ఉపయోగించినారు - ధీర, ధీరాధీర, అధీర - అని.

దివ్యాదులు నలుగురిలో శిల్పకారికలేదు; కాని గణిక యొక్క ప్రకృతి లక్షణాలను వివరిస్తూ, శిల్పకారికను చేర్చి, "గణికా-శిల్పకారికులు లలితోదాత్తలుగా ఉంటా"రని వివరించినాడు భరతముని.

దివ్యాదిభేదాలను నాయికల విషయంలో ఇంత ఎవ్వరూ చెప్పలేదు. కాని, శారదాతనయుడు, వారి ప్రకృతి లక్షణములందలి ఉదాత్త-లలిత భేదాలను గ్రహించి, ఉద్ధత-శాంతభేదాలను చేర్చి, మొత్తం నాలుగు నాయికా భేదాలను వివరించినాడు (భా.ప్ర. IV-226-35). ఈవిభజన ధీరోదాత్తాది నాయకభేదాలను పోలిఉన్నది. ఈ ఉదాత్త-శాంత-లలితభేదాలను మధ్యమా-ప్రగల్భ నాయికులకు మాత్రమే నిరూపించినాడు శారదాతనయుడు; కానీ, ఇవి అందరు నాయికలలోనూ కార్యవశాన కన్పట్టగలవని కొందరన్నారు.

(1) ఉదాత్త :

మూలం : ఉదాత్తా కేశవాసోఽఙ్గ మాల్య భూషాసు సాదరా ।
[illegible] సంస్కార [illegible] ॥
[illegible] ।
[illegible] ॥
[illegible] ।
[illegible] ॥
(భా.ప్ర. IV-226-28)

అర్థం : కేశ-వాస, అంగ-మాల్య-భూషణము సాదరా= కేశ సంస్కారం, వస్త్రాలంకారం, అంగరాగం, మాల్యధారణం, భూషావిన్యాసం-వీటియందు [illegible] సంస్కార, [illegible] కృతజ్ఞ(వ), [illegible] కలది, కృతజ్ఞరాలు, [illegible] [illegible] మానయంతీ (వ),

నిత్యోత్సవరతా (అపి, చ)=మాన్యులను బహుమానించేది, ఎల్లప్పుడు ఉత్సవాలు నిర్వహించేది; బంధుసంబాధముదితా, కృతజ్ఞా, ప్రియవాదినీ=బంధువులు ఎక్కువగా వస్తే సంతోషించేది, వారిపట్ల కృతజ్ఞురాలుగా ఉండేది, ప్రియవాదినీ; ఏవం-ఆదిగుణైః యుక్తాం, ఉదాత్తాం, పరిచక్షతే=ఇటువంటి గుణాలతో కూడిన స్త్రీని 'ఉదాత్త' (అని) అంటారు.

తాత్పర్యం : కేశసంస్కారం, వస్త్రాలంకారం, అంగరాగం (=మైపూతలు), మాల్యధారణం, భూషావిన్యాసం, శయ్యారచన-వీనియందు సాదరంగా ఉండేది, స్థిరమైన స్నేహంకలది, కృతజ్ఞురాలు, దానప్రియ, ఆశ్రితవత్సల, మాహాత్ములను బహుమానించేది, నిత్యోత్సవరత, బంధువులు అధికంగావస్తే సంతోషించేది, వారిపట్ల తనకర్తవ్యం గుర్తెరిగినది, ప్రియవాదిని అయిన స్త్రీ 'ఉదాత్తనాయిక'.

(2) ఉద్ధత :

మూలం : సౌందర్యైశ్వర్య సౌభాగ్య విద్యా భోగై రహంకృతా ।
విద్యాభిజనసంపన్నా న్బంధూ నవమన్యతే ॥
గర్వాభిమానభరితా మాయాఛద్మపరాయణా ।
ఆత్మకుక్షింభరా ఘోరా సోద్ధతా పరికీర్తితా ॥
-(భా.ప్ర.IV-229-30)

అర్థం : సౌందర్య-ఐశ్వర్య-సౌభాగ్య-విద్యా-భోగైః, అహంకృతా=సౌందర్యం, ఐశ్వర్యం, సౌభాగ్యం, విద్య, భోగాలు - ఇవి కలిగి ఉండటంవల్ల అహంకారం పొందినది; విద్యా-అభిజన సంపన్నాన్, బంధూన్, అపి, అవమన్యతే=విద్యావంతులు, అభిజాత్యం కలవారు అయిన, బంధువులను, కూడా, అవమానించేది; గర్వ-అభిమాన భరితా, మాయా-ఛద్మ పరాయణా =గర్వం-అభిమానం పూర్ణతాల్చినది, వంచన-మోసంచేసేది; ఆత్మకుక్షింభరా, ఘోరా, సా, ఉద్ధతా పరికీర్తితా=తన పొట్టమాత్రమే నింపుకొనేది, ఘోరమైన ప్రవర్తన కలది - ఇటువంటి స్త్రీ, ఉద్ధత (అని) చెప్పబడేనది.

తాత్పర్యం : సౌందర్యం, ఐశ్వర్యం, సౌభాగ్యం, విద్య, భోగాలు - ఇవి కలిగి ఉండటం చేత అహంకరించినది, విద్యావంతులు కులీనులు అయిన బంధువులను కూడా అవమానించేది, గర్వంతో అభిమానంతో నిండినది, మాయా-ఛద్మ పరాయణ, ఆత్మకుక్షింభర, ఘోరప్రకృతి అయిన స్త్రీ 'ఉద్ధత నాయిక'.

(3) శాంత :

మూలం : సుశీలా నిత్యసంతుష్టా సమ్యగ్మానావమానయోః ॥
అమాయా రహంమానహీనా విగతమత్సరా ।
ఉపకారపరా నిత్యమపకారపరేష్వపి ॥
ఉపాచరతి బంధూన్ యా సా శాంతేతి చ కథ్యతే ।
-(భా.ప్ర.IV-231-33)

అర్థం : సుశీలా, నిత్యసంతుష్టా, సత్-సమ్యగ్మాన-అవమానయోః=సుశీలం చటం తెలిసినది, నిత్యసంతుష్ట, మాన-అవమానములందు ఏకవిధంగా ఉండేది; అమాయా, అహంమానహీనా, విగతమత్సరా=అమాయ లేనిది, అహంమానం లేనిది, మాత్సర్యంలేనిది; అపకారపరేష్వపి, నిత్యం, ఉపకార పరా=అపకారులకు కూడా, నిత్యం, ఉపకారమే తలపెట్టేది; బంధూన్ ఉపా చరతి, యా, సా, శాంతా, ఇతి, కథ్యతే =బంధువులకు ఉపచారాలు చేసేది, ఎవరో, ఆమె, శాంత అని, చెప్పబడుతున్నది.

తాత్పర్యం : సుశీల, నిత్యసంతుష్ట, మానావమానములందు సమదృష్టి కలది, అమాయారహిత, అహంకారరహిత, మాత్సర్యరహిత, అపకారులకు కూడా నిత్యం ఉపకారం తలపెట్టేది, బంధువులకు [illegible] ఉప చారాలు చేసేది, 'శాంత నాయిక'.

(4) లలిత :

మూలం : రూపయౌవన సంపన్నా రతికేళీకృతోద్యమా ।
[illegible] మాల్య [illegible] ప్రియా ।
సంభోగరసికా హేలా[illegible] ॥
కలాశిల్ప విశారదా లలితా పరికీర్తితా ।
-(భా.ప్ర.IV-233-35)

అర్థం : రూపయౌవన సంపన్నా, రతి కేళికృత-ఉద్యమా=రూపం-యౌ వనం [illegible] ఆలాపాలందు ఆసక్తితో పాల్గొనేది; హావ-అంగహారా, [illegible], వేషా, శైల, సరిత్, ప్రియా=మంచిన [illegible], అంగహారాలు, [illegible] మొదలైనవాటి [illegible], పాటలీరం, శైల సరిహరాలు, [illegible] సంభోగ రసికా, హేలా-భావ-

హావసమేధితా=సంభోగప్రియ, అంగజాలంకారాశ్రైన హేల-భావం-హావం-వీటితో కూడినది; కలా-శిల్పవిశాలాఢ్యా, లలితా, పరికీర్తితా=కళలందు, శిల్పములందు పరిపూర్ణ, (ఇటువంటి స్త్రీ) లలిత, (అని) చెప్పబడినది.

తాత్పర్యం : రూప-యౌవనసంపన్న, సఖులతోడి కేళియందు ఆసక్తి కలది, అందుకు ప్రయత్నం చేసేది, వస్త్రాలు-అంగరాగాలు-మాల్యాలు-వీని యందు ఆసక్తి కలది, వసంతఋతువులో సాగరతీరములందు, శైలపరిసరములందు, సరిత్తటములందు విహరించటం ఇష్టపడేది, సంభోగరసిక, భావ-హావ-హేలా పరిపూర్ణ, కలా-శిల్ప చతుర, 'లలిత నాయిక' అవుతుంది.

## 9. స్త్రీల శీలభేదాలు :

టీక : కామోపచారాన్ని వివరించిన సందర్భంలో భరతముని, స్త్రీలలో 23 శీల లేదా సత్త్వ భేదాలను పేర్కొని, వివరించినాడు. (నా.శా.XXII-100-144): "స్త్రీలు - దేవ-దానవ- గంధర్వ-రక్షో-నాగ-పక్షి-పిశాచ-యక్ష-వ్యాల-నర-వానర-హస్తి-మృగ-మీన-ఉష్ట్ర-మకర-ఖర- సూకర-వాజి-మహిష-అజ-శ్వ-గవాదులతో తుల్యములయిన శీలాలు కలిగి ఉంటారు (నా.శా.XXII-100-101). శీలం, సత్త్వం, చైతన్యం, బుద్ధిపూర్వకత, స్వభావం, సేవాకం అనేవి పర్యాయపదాలు; గవాదులలోని ఆది పదం చేత ఇంకా పలురకాల శీలాలు కల స్త్రీలు ఉండవచ్చునవి గ్రహించాలి".

అర్వాచీనాలంకారికులలో శారదాతనయుడు ఒక్కడే 22 శీలభేదాలను, భరత మతానుసారంగా వివరించినాడు(శ్వశీల భేదం భా.ప్ర.లో లేదు).

ఈ శీలభేదాలను వివరించటంలో తొలుత, భరతముని చెప్పిన దానిని పేర్కొని, అంతకంటె విశేషం భా.ప్ర.లో ఉంటే దానిని కూడా చివర పేర్కొంటున్నాము.

మూలం : నానాశీలాః స్త్రియో జ్ఞేయాః స్వభావం సత్త్వం సమాశ్రితాః ।
విజ్ఞాయ చ యథాసత్త్వముపసేవేత తాః పుమాన్ ॥
ఉపచారో యథాసత్త్వం స్త్రీణాం సర్వోఽపి పార్థదః ।
మహాన వ్యన్యథాయుక్తో నైవ తుష్టికరో భవేత్ ॥
యథా సంప్రార్థితావాప్త్యారతిః సముపజాయతే ।
స్త్రీపుంసయోశ్చ రత్యర్థ ముపచారో విధీయతే ॥

ధర్మార్థం హి తపశ్చర్యా సుఖార్థం ధర్మ ఇష్యతే ।
సుఖస్య మూలం ప్రమదా స్తాసు సంభోగ ఇష్యతే ॥
-(నా.శా.XXII-145-48)

తాత్పర్యం : తమతమ సత్త్వాన్ని ఆశ్రయించుకొని, స్త్రీలు నానా విధాలైన శీలాలను కలిగి ఉంటారు. అయినా స్వభావాలను గుర్తించి, తదనుగుణంగా వారిని సేవించాలి (=కామోపచారం చేయాలి). సత్త్వానుగుణంగా చేసిన ఉపచారం, అది అల్పమైనప్పటికీ, వారికి హర్షదాయకమవుతుంది. వారివారి శీలాలను గుర్తించక కావించే ఉపచారం ఎంత గొప్పది అయినప్పటికీ, అది వారికి తుష్టికరం కానేరదు. ప్రార్థించిన (=కోరిన) దానిని పొందటం చేతనే కదా రతి జనించేది! కావున స్త్రీ పురుషులందు పరస్పరం రతిజనించటానికి ఉపచారం ఆవశ్యకం. ('ఉపచారం' అంటే అన్యోన్య హృదయ గ్రహణోచితమైన వ్యాపారం). ధర్మసాధనకోసం తపశ్చర్య అవశ్యకం; సుఖార్థం ధర్మం ఆచరించాలి. అట్టి సుఖానికి మూలం ప్రమదలే. అందుచేతనే వారితో సంభోగం కోరదగినది.

1. దేవశీల :

మూలం : స్నిగ్ధాంగీ రుచిరాంగీ చ స్థిరా మందనిమేషిణీ ।
అరోగా దీప్త్యుపేతా చ దాన సత్త్వార్జవాన్వితా ॥
అల్పస్వేదా సమరతా స్వల్పభుక్ మధుప్రియా ।
గంధపుష్పరతా హృద్యా దేవశీలాంగనా స్మృతా ॥
-(నా.శా.XXII-102-103)

తాత్పర్యం : స్నిగ్ధములైన అంగోపాంగప్రత్యంగాలు, నిలుకడ, మందమ్ములగు నిమేషాలు, ఆరోగ్యం, కాంతి, దానేచ్ఛ, సత్త్వం, ఆర్జవం, అల్ప స్వేదం, సమరతియందు ఆసక్తి, అల్పభోజనం, మధురపదార్థములందు ప్రీతి, గంధ-పుష్పాలంటే ఇష్టం, కలదై, మనోహరంగా ఉండే అంగన దేవశీల.

సంగీతాభిరతి, భావజ్ఞానం, కృతజ్ఞత- ఇవి భా.ప్ర.లో అధికం.

2. అసురశీల :

మూలం : అధర్మశాఠ్యాభిరతా స్థిరక్రోధాతినిష్ఠురా ।
మద్యమాంసప్రియా నిత్యం కోపనా చాతిమానినీ ॥

చపలా చాతిలుబ్ధా చ పరుషా కలహప్రియా ।
ఈర్ష్యాశీలా చలస్నేహా చాసురం శీలమాశ్రితా ॥

-(నా.శా.XXII-104-105)

తాత్పర్యం : అధర్మమందు శాఠ్యమందు ఆసక్తి, స్థిరమైన క్రోధం, అతిపారుష్యం (నిష్ఠుర భాషణి-భా.ప్ర.) మద్య-మాంసములందు ప్రీతి, లోభం, కలహమందు ప్రీతి, ఈర్ష్యా స్వభావం, చంచలమైన స్నేహం కలదై, నిత్య కోపన, అతిమానవతి, చపల అయిన అంగన అసుర (=దైత్య) శీల.

3. గంధర్వశీల :

మూలం : క్రీడాపరా చారునేత్రా నఖదంతైః సుపుష్పితైః ।
స్వంగీ చ స్థిరభాషీ చ మందాపత్యా రతిప్రియా ॥
గీతే వాద్యే చ నృత్తే చ రతా హృష్టా మృజావతీ ।
గంధర్వసత్త్వా విజ్ఞేయా స్నిగ్ధత్వక్కేశలోచనా ॥

-(నా.శా.XXII-106-107)

తాత్పర్యం : క్రీడలయందు ఆసక్తి, సుందరములైన నేత్ర-నఖ-దంతాలు, సౌష్ఠవోపేతాలయిన అంగాలు, స్థిరభాషణాలు, అల్పసంతానం, రతియందు ప్రీతి, గీత-వాద్య- నృత్తములందు ఆసక్తి, హర్షం, పరిశుద్ధత, స్నిగ్ధములైన చర్మ-కేశ-నేత్రాలు కలిగిన అంగన 'గంధర్వశీల'.

నఖక్షత-దంతక్షతప్రియ, ఆరామభోగ్య, స్మితపూర్వభాషిణి, తన్వి, పుష్పశయ్యాభిలాషిణి (భా.ప్ర.).

4. రాక్షసశీల :

మూలం : బృహదాయతసర్వాంగీ రక్తవిస్తీర్ణలోచనా ।
ఖరరోమా దివాస్వప్నపరా చాత్యుచ్చభాషిణీ ॥
నఖదంతక్షతకరీ క్రోధేర్ష్యా కలహప్రియా ।
నిశావిహారశీలా చ రాక్షసం శీలమాశ్రితా ॥

-(నా.శా.XXII-108-109)

తాత్పర్యం : పెద్దవి విశాలములు అయిన అంగాలు, విస్తీర్ణములైన ఎఱ్ఱని కనులు, ఖరరోమాలు, పగటి నిద్రయందు ఆసక్తి, ఉచ్చభాషణాలు, క్రోధ—

ఈర్ష్యా-కలహములందు ప్రీతి, రాత్రులందు విహరించే స్వభావం కలదై, నఖ క్షతదంతక్షతాలు చేసే అంగన 'రాక్షసశీల'.

5. నాగశీల :

మూలం : తీక్ష్ణ నాసాగ్రదశనా సుతను స్తామ్రలోచనా ।
నీలోత్పలసవర్ణా చ స్వప్నశీలాఽతికోపనా ॥
తిర్యగ్గతి శ్చలారంభా బహుశ్వాసాతిమానినీ ।
గంధమాల్యాసవరతా నాగసత్త్వాంగనా స్మృతా ॥
-(నా.శా.XXII-110-111)

తాత్పర్యం : కొనదేరిన ముక్కు, వాడిదంతాలు, అందమయిన శరీరం, ఎఱ్ఱని కనులు, నీలోత్పలంవంటి రంగు, అతికోపం, తిర్యగ్గమనం (=అడ్డంగా నడవటం), ఆరంభములందు చాంచల్యం, అధిక (=బుసపెట్టి నట్లు) నిశ్వాసం, అతిమానం, గంధ-మాల్య-ఆసవములందు ప్రీతి, నిద్ర యందు ప్రీతి కలిగిన అంగన 'నాగశీల' (నాగం=త్రాచుపాము)

6. శకునశీల :

మూలం : అత్యంత వ్యావృతాస్యా చ తీక్ష్ణశీలా సరిత్ప్రియా ।
సురాసవక్షీరరతా బహ్వపత్యా ఫలప్రియా ॥
నిత్యం శ్వసనశీలా చ తథోద్యానవన ప్రియా ।
చపలా బహువాక్శీఘ్రా శాకునం సత్త్వమాశ్రితా ॥
-(నా.శా.XXII-112-13)

తాత్పర్యం : బాగా ప్రక్కకు తిరిగిన ముఖం, తీక్ష్ణమైన స్వభావం, నదులయందు ప్రీతి, సుర- ఆసవ-క్షీరములందు ప్రీతి, నిత్యశ్వాస, చాపల్యం, ఎక్కువమాటాడడం, తొందర—కలది 'శకునశీల' (శకునం=పక్షి).

శీఘ్రగతి ప్రతిపత్తి (=తెలివితేటలు) కలది, పరాఙ్ముఖి (భా.ప్ర.)

7. పిశాచశీల :

మూలం : హీనాధికాంగులి కరా ధ్వాంక్షా నిష్కుటచారిణీ ।
బాలోద్వేజన శీలా చ పిశునా క్లిష్టభాషిణీ ॥
సురతే కుత్సితాచారా రోమశాంగీ మహాస్వనా ।
పిశాచసత్త్వా విజ్ఞేయా మద్యమాంసబలిప్రియా ॥
-(నా.శా.XXII-114-15)

తాత్పర్యం : ఎక్కువ-తక్కువలుగా ఉన్న వ్రేళ్లుగల చేతులు, గృహ-ఆరామ సంచార ప్రీతి, పిల్లలను పీడించే స్వభావం, నైచ్యం, క్లిష్టములయిన మాటలు, సురతంలో కుత్సితాచారం, రోమశాలయిన అంగాలు, మహోస్వనం, మద్య-మాంస-బలులందు ప్రీతి కలది 'పిశాచశీల'. చేతులవ్రేళ్లుమాత్రమేకాక కనులు, దంతాలు, పెదవులు, చెవులు, స్తనాలు, నఖాలు కూడా ఎక్కువ తక్కువ లుగా ఉంటాయి, అనృతభాషిణి (భా.ప్ర.).

8. యక్షశీల :

మూలం : స్వప్నప్రస్వేదనాంగీ చ స్థిరశయ్యాసనప్రియా ।
మేధావినీ బుద్ధిమతీ మద్య-గంధామిష ప్రియా ॥
చిరదృష్టేషు హర్షం చ కృతజ్ఞత్వా దుపైతి సా ।
అదీర్ఘశాయినీ చైవ యక్షశీలాఽంగనా స్మృతా ॥
-(నా.శా.XXII-116-17)

తాత్పర్యం : స్వప్నంలో చెమర్చే స్వభావం కల శరీరం, స్థిరములయిన శయ్యా- ఆసనములందు ప్రీతి, మేధ, బుద్ధి, మద్య-గంధ-మాంసములందు ప్రీతి, చాలాకాలం తరువాత కనిపించిన వారి పట్ల హర్షం, కృతజ్ఞత, తక్కువ నిద్ర- కలిగిన అంగన యక్షశీల. చిరవిస్మృతులయిన వారిని చూడగానే, కృత జ్ఞతతో ప్రియంగా మాటాడేది (భా.ప్ర.).

9. వ్యాలశీల :

మూలం : తుల్యమానాపమానా యా పరుషత్వక్ ఖరస్వరా ।
శఠానృతోద్ధతకథా వ్యాలసత్త్వా చ పింగదృక్ ॥
-(నా.శా.XX-118)

తాత్పర్యం : మాన-అవమానములందు సమత్వం, పరుషమైన చర్మం, ఖరస్వరం, శాఠ్యం, అనృత-ఉద్ధత భాషణాలు, పింగళదృష్టులు కలది 'వ్యాల శీల' (వ్యాలం=క్రూరజంతువు=పులి). ధృష్ట, విశాలనేత్ర (భా.ప్ర.).

10. మనుష్యశీల :

మూలం : ఆర్జవాభిరతా నిత్యం దక్షా క్షాంతిగుణాన్వితా ।
విభక్తాంగీ కృతజ్ఞా చ గురుదేవ ద్విజప్రియా ॥

ధర్మకామార్థ నిరతా హ్యహంకార వివర్జితా ।
సుహృత్ప్రియా సుశీలా చ మానుషం సత్త్వమాశ్రితా ॥
-(నా.శా.XXII-119-120)

**తాత్పర్యం :** ఆర్జవమందు నిత్యాసక్తి, దక్షత, ఓరిమి, సమంగా విభక్తము లైన అవయవాలు, కృతజ్ఞత, గురు-దేవ-ద్విజులందు ప్రీతి, ధర్మ-కామ-అర్థ ములందు ఆసక్తి, అహంకారరాహిత్యం, సుహృత్తులందు ప్రీతి, మంచిశీలం కలి గిన అంగన 'మనుష్యశీల'. నిత్యం ఉపచారపరాయణ, గంధ-మాల్య ప్రియ *(భా.ప్ర.)*

## *11.* వానరశీల :

**మూలం :** సంహతాల్పతను ర్ధృష్టా పింగరోమా ఫలప్రియా ।
ప్రగల్భా చపలా తీక్ష్ణా వృక్షారామవనప్రియా ॥
స్వల్పమప్యుపకారం తు నిత్యం యా బహుమన్యతే ।
ప్రసహ్యారతిశీలా చ వానరం సత్త్వమాశ్రితా ॥
-(నా.శా.XXII-121-22)

**తాత్పర్యం :** కుదింపబడిన చిన్నశరీరం, హర్షం, పింగళ రోమాలు, ఫల (=పిమార్పుట) మందుప్రీతి, ప్రాగల్భ్యం, చాపల్యం, తీక్ష్ణత, వృక్ష-ఆరామ-వనములందు ప్రీతి, స్వల్పమయిన ఉపకారాన్ని కూడా అధికంగా తలంచటం, బలాత్కరింపబడి రతిఫలమివ్వటం కలిగిన అంగన 'వానరశీల' (వానరం=కోతి).

శ్రమ-కోప-ప్రసాదాలు కలది *(భా.ప్ర.)*

## *12.* హస్తిశీల :

**మూలం :** మహాహనులలాటం చ శరీరోపచయాన్వితా ।
పింగాక్షీ రోమశాంగీ చ గంధమాల్యాసవప్రియా ॥
కోపనా స్థిరచిత్తా చ జలోద్యానవనప్రియా ।
మధురాభిరతా చైవ హస్తిసత్త్వా ప్రకీర్తితా ॥
-(నా.శా.XXII-123-24)

**తాత్పర్యం :** పెద్దదవుడలు నుదురు, బలిసిన శరీరం, పింగళము లయిన నేత్రాలు, రోమశములయిన అంగాలు, గంధ-మాల్య-ఆసవములందు ప్రీతి,

కోపం, చిత్తస్థైర్యం, జల-ఉద్యానవనములందు ప్రీతి, మధురములగువాని యందు ప్రీతి, రతియందు ఆసక్తి కలిగిన అంగన 'హస్తిశీల'.

మందగతి, ఆయతగతి (=నడిచేటప్పుడు పాదానికి పాదానికి మధ్య వ్యవధానం అధికం), మందచేష్ట, దీప్తరోష-ప్రసాదాలు చూపేది (భా.ప్ర.).

*13.* మృగశీల :

మూలం : స్వల్పోదరీ భగ్ననాసా తనుజంఘా వనప్రియా ।
చలవిస్తీర్ణనయనా చపలా శీఘ్రగామినీ ॥
దివాత్రాసపరా నిత్యం గీతవాద్యరతిప్రియా ।
నివాసస్థిరచిత్తా చ మృగసత్త్వా ప్రకీర్తితా ॥
-(నా.శా.XXII-125-26)

తాత్పర్యం : స్వల్పమైన ఉదరం, చప్పిడిముక్కు, సన్నని పిక్కలు, వనములందు ప్రీతి, విశాలములైన చంచలనేత్రాలు, చపలత, శీఘ్రగమనం, పగటివేళ భయం, గీత-వాద్యరతులందు ప్రీతి, స్థిరనివాసమందు ఆసక్తి కలది 'మృగశీల'. విరహం సహించలేనిది (భా.ప్ర.)

*14.* మత్స్యశీల :

మూలం : దీర్ఘపీనోన్నతోరస్కా చలా వాతినిమేషిణీ ।
బహుభృత్యా బహుసుతా మత్స్యసత్త్వా జలప్రియా।
-(నా.శా.XXII-127)

తాత్పర్యం : దీర్ఘం పీనం ఉన్నతం అయినవక్షం, చాంచల్యం, అతినిమేషం, బహుభృత్యులు, బహుసుతులు, జలమునందు ప్రీతికల అంగన 'మత్స్యశీల' (మత్స్యం-చేప).

దూరగామిని, దురాచార, అనిమేషిణి (=రెప్పపాటు లేకుండా చూసేది) (భా.ప్ర.)

*15.* ఉష్ట్రశీల :

మూలం : లంబోష్ఠీ స్వేదబహులా కించి ద్వికటగామినీ ।
కృశోదరీ పుష్పఫల లవణామ్లకటుప్రియా ॥

ఉద్బంధకటి పార్శ్వా చ ఖరనిష్ఠురభాషిణీ ।
అత్యున్నత కటీ గ్రీవా ఉష్ట్రసత్త్వాఽటవీప్రియా ॥
-(నా.శా.XXII-128-29)

తాత్పర్యం : వ్రేలాడుతున్న పెదవి, అధికస్వేదం, వికటగమనం, కృశించిన ఉదరం, పుష్ప-ఫలములందు ఉప్పు-పులుపు-వగరు రుచులయందు ప్రీతి, వదులుగా ఉండే కటి-పార్శ్వాలు, పరుష-నిష్ఠురభాషణాలు, పొడవైనమెడ, అడవులందు ప్రీతి కలిగిన అంగన 'ఉష్ట్రశీల' (ఉష్ట్రం=ఒంటె)

*16.* మకరశీల :

మూలం : స్థూల శీర్షాంచితగ్రీవా దారితాస్యా మహాస్వనా ।
జ్ఞేయా మకరసత్త్వా చ క్రూరా మత్స్యగుణైర్యుతా ॥
-(నా.శా.XXII-130)

తాత్పర్యం : స్థూలమైన శిరస్సు, వంగినమెడ, తెరచిన నోరు, పెద్దకంఠధ్వని, క్రూరత్వం, మత్స్యశీలయొక్క గుణాలు కలది 'మకరశీల'. మత్స్యగుణాలు అన్నీ ఈమెలో ఉంటాయి (భా.ప్ర.)

*17.* ఖరశీల :

మూలం : స్థూలజిహ్వోష్ఠదశనా రూక్షత్వ క్కటుభాషిణీ ।
రతియుద్ధకరీ ధృష్టా నఖదంత క్షతప్రియా ॥
సపత్నీద్వేషిణీ దక్షా చపలా శీఘ్రగామినీ ।
సరోగా బహ్వపత్యా చ ఖరసత్త్వా ప్రకీర్తితా ॥
-(నా.శా.XXII-131-32)

తాత్పర్యం : స్థూలమైన నాలుక పెదవులు దంతాలు, పరుషమయిన చర్మం, కటు భాషణాలు, రతియుద్ధంలో ఆసక్తి, ధార్ష్ట్యం, నఖక్షత-దంతక్షతములయందు ప్రీతి, సవతియందు ద్వేషం, దక్షత, చాపల్యం, శీఘ్రగమనం, రోగం, బహుసంతతి కలది 'ఖరశీల' (ఖరం=గాడిద).

*18.* వానర శీల :

మూలం : [illegible] రోమశాంగీ బలాన్వితా ।
[illegible] చ కందమూల ఫలప్రియా ॥

కృష్ణా దంష్ట్రోత్కటముఖీ ప్రాస్వేదక శిరోరుహా ।
హీనాచారా బహ్వపత్యా సౌకరం సత్త్వమాశ్రితా ॥
-(నా.శా.XXII-133-34)

**తాత్పర్యం :** దీర్ఘములయిన పృష్ఠ-ఉదర-ముఖాలు, రోమశములయిన అవయవాలు, బలం, సన్నని నుదురు, కందమూల-ఫలములందు ప్రీతి, నలుపు రంగు, పండ్లచేత వికృతమైన ముఖం, చిన్నపొట్ట, పొట్టిజుట్టు, హీనమయిన ఆచారం, బహుసంతతి కలది 'సూకరశీల' (=సూకరం=పంది)

సపత్నీద్వేషిణి, దరీరత (=మూలగదులలో ఉండటానికి ఇష్టపడేది (భా.ప్ర.)

*19.* హయశీల :

మూలం : స్థిరా విభక్త పార్శ్వోరుకటీ పృష్ఠ శిరోధరా ।
సుభగా దానశీలా చ ఋజుస్థల శిరోరుహా ॥
కృశా చంచల చిత్తా చ స్నిగ్ధవాక్ శీఘ్రగామినీ ।
కామక్రోధపరా చైవ హయ సత్త్వాంగనా స్మృతా ॥
-(నా.శా.XXII-135-36)

**తాత్పర్యం :** స్థైర్యం, సుభగత్వం, దానస్వభావం, నిడుపాటి పెద్దజుట్టు, కృశత్వం, చాంచల్యం, వాక్కులో స్నిగ్ధత, శీఘ్రగమనం, కామం, క్రోధం, సమవిభక్తములయిన పార్శ్వ-కటీ-ఊరు-పృష్ఠ-గ్రీవాలు కలిగిన అంగన 'హయ శీల'.

*20.* మహిషశీల :

మూలం : స్థూలపృష్ఠాక్షిదశనా తనుపార్శ్వోదరా స్థిరా ।
హరి రోమాంచితా రౌద్రీ లోకద్విష్టా రతిప్రియా ॥
కించి దున్నతవక్త్రా చ జలక్రీడావనప్రియా।
బృహల్లలాటా సుశ్రోణీ మాహిషం సత్త్వమాశ్రితా ॥
-(నా.శా.XXII-137-38)

**తాత్పర్యం:** స్థైర్యం, బిరుసెక్కిన రోమాలు, రౌద్రం (=ఎఱ్ఱని కనులు), లోకద్వేషం, రతిప్రీతి, ఉన్నతవక్త్రం, జలవన క్రీడలందు ఆసక్తి, పెద్ద నుదురు, అందమైన పిరుదులు, స్థూలములైన పృష్ఠ-నేత్ర-దంతాలు, సన్నని

పార్శ్వాలు ఉదరం కలది, మహిషశీల. స్థూలదంత, అభీరువు (=భయం లేనిది) (భా.ప్ర.)

*21.* అజశీల :

మూలం : కృశా తనుభుజోరస్కా నిష్టబ్ధ స్థిరలోచనా ।
సంక్షిప్తపాణి పాదా చ సూక్ష్మ రోమసమాచితా ॥
భయశీలా జలోద్విగ్నా బహ్వపత్యా వనప్రియా ।
చంచలా శీఘ్రగమనా హ్యజసత్త్వాంగనా స్మృతా ॥
-(నా.శా.XXII-139-40)

తాత్పర్యం : కృశత్వం, సన్నని భుజాలు ఉదరం, నిశ్చలములు స్థిరములు అయిన నేత్రాలు, పొట్టి కాళ్ళు-చేతులు, సూక్ష్మములయిన రోమాలు, భయం, నీటిని చూస్తే భయం, బహు సంతతి, వనములందు ప్రీతి, చాంచల్యం, శీఘ్ర గమనం కలిగిన అంగన 'అజ శీల' (అజము= మేక)

భుజాల అంతరం అల్పం, శీతభీరువు, వేడిశరీరం (భా.ప్ర.)

*22.* శ్వశీల :

మూలం : ఉద్బంధగాత్ర నయనా విజృంభణ పరాయణా ।
దీర్ఘాల్పవదనా స్వల్పపాణిపాదవిభూషితా ॥
ఉచ్చైః స్వనా స్వల్ప నిద్రా క్రోధనా సుకృతప్రియా ।
హీనాచారా కృతజ్ఞా చ శ్వశీలా పరికీర్తితా ॥
-(నా.శా.XXII141-42)

తాత్పర్యం : గాత్రలాఘవం, నేత్రపాటవం, ఒడలు సాగదీయటం, పొడ వైన చిన్నముఖం, పొట్టికాళ్లు-చేతులు, ఉచ్చస్వనం, తక్కువ నిద్ర, క్రోధం, మంచి పనులందు ప్రీతి, హీనమయిన ఆచారం, కృతజ్ఞత కలిగిన అంగన 'శ్వశీల' (శ్వ=కుక్క)

ఈభేదం భా.ప్ర.లో లేదు (అందులో 22 భేదాలే ఉన్నవి).

*23.* గోశీల :

మూలం : పృథుపీనోన్నత శ్రోణీ తనుజంఘా సుహృత్ప్రియా ।
సంక్షిప్తపాణి పాదా చ దృఢారంభా ప్రజాహితా ॥

పితృదేవార్చనరతా సత్యశౌచ గురుప్రియా ।
స్థిరా పరిక్లేశసహా గవాం సత్త్వం సమాశ్రితా ॥
-(నా.శా.XXII-143-44)

**తాత్పర్యం :** స్థూలములు-పీనములు-ఉన్నతములు అయిన పిరుదులు, సన్నని జంఘలు, సుభృత్తులందు ప్రీతి, పొట్టికాళ్ళు చేతులు, ప్రయత్నమందు పట్టుదల, ప్రజాహితకారిత్వం, పితృ-దేవార్చనలందు ప్రీతి, సత్య-శౌచము లందు గురువులందు ప్రీతి, స్థైర్యం, క్లేశమందు ఓరిమి కలది 'గోశీల'.

'ప్రజాహితా' అన్నదానికి కన్నసంతానం మీద ఆదరం కలది అని కూడా అర్థం చెప్పవచ్చు.

# 10. వాసకసజ్జాది నాయికావస్థలు :

**మూలం :** తత్ర వాసకసజ్జా చ విరహోత్కంఠితాపి వా ।
స్వాధీనభర్తృకా చాపి కలహాంతరితాపి వా ॥
ఖండితా విప్రలబ్ధా వా తథా ప్రోషితభర్తృకా ।
తథాభిసారికా చైవ జ్ఞేయా స్త్వష్టౌ తు నాయికాః ॥
. . . . . . . . . . .
అష్టావస్థాసు విజ్ఞేయా నాయికా నాటకాశ్రయా ।
-(నా.శా. XXII-211-12, 21)

**అర్థం :** (తత్ర) వాసకసజ్జా (చ), విరహోత్కంఠితా (అపి,వా), స్వాధీనభర్తృకా (చ, అపి), కలహాంతరితా (అపి, వా), ఖండితా, విప్రలబ్ధా (వా), (తథా), ప్రోషితభర్తృకా, (తథా) అభిసారికా (చ, ఏవ), అష్టౌ(తు) నాయికాః, జ్ఞేయాః (తు) = వాసకసజ్జ, విరహోత్కంఠిత, స్వాధీనభర్తృక, కలహాంతరిత, ఖండిత, విప్రలబ్ధ, ప్రోషితభర్తృక, అభిసారిక- ఈ ఎనిమిది మంది నాయికలు (అని) తెలియవలె. . . . . . . . . నాటకాశ్రయా, నాయికా, అసు-అవస్థాసు, విజ్ఞేయా = నాటకాశ్రయ అయిన నాయిక, ఈ అవస్థలలో (ఉంటుందని) తెలియవలె.

**తాత్పర్యం :** నాయికలు ఎనిమిది విధాలు- 1. వాసకసజ్జ, 2. విరహోత్కంఠిత, 3. స్వాధీనభర్తృక, 4. కలహాంతరిత, 5. ఖండిత, 6. విప్రలబ్ధ, 7. ప్రోషితభర్తృక, 8. అభిసారిక. . . . . . . . నాటకమందలి నాయిక ఈ అవస్థలను పొందుతుంది.

టీక : కామోపచారాన్ని వివరించే సందర్భంలో నా.శా.లో ఈ ప్రసక్తి ఉంది. తొలుత 'నాయికలు ఎనిమిది విధాలు' అని చెప్పి, చివర నాటకము నందలి నాయిక ఈ ఎనిమిది అవస్థలు కలిగి ఉంటుంది అని చెప్పినాడు భరతముని. 'నాయికలు ఎనిమిది విధాలు' అని చెప్పటం వల్ల 'అష్టవిధనాయి కలు' అనే భావం ప్రచారంలోకి వచ్చింది. కాని, వీరు వేర్వేరు నాయికలు కారు; అంటే నిజంగా ఇవి ఎనిమిది నాయికా భేదాలు కావు. నిజానికి ఇవి నాయికలయొక్క అవస్థాభేదాలు మాత్రమే. ఒకే నాయిక పెక్కు అవస్థలకు లోనుకావచ్చు. అందుచేతనే, చివర, 'నాటకమునందలి నాయికావస్థలు పై విధంగా ఉంటాయి' అని భరతముని హెచ్చరించటం గమనార్హం. అయితే, ఆయా అవస్థలలో ఉన్న నాయికను, ఆ అవస్థ పేరుతో పిలవటం సంప్రదాయం-వాసకసజ్జ, విరహోత్కంఠిత మొ.

అష్టవిధ నాయికావస్థల అభినయం :

చింత, నిఃశ్వాసం, ఖేదం, హృదయతాపం, సఖీసంలాపం, తన అవస్థను పర్యాలోకనం చేసుకొనటం, గ్లాని, దైన్యం, అశ్రుపాతం, రోషం తెచ్చుకొనటం, భూషణాలను త్యజించటం, కేశ సంస్కారాదులు లేకుండటం, దుఃఖం, రోదనం అనే వాటిచేత ఖండితా-విప్రలబ్ధా-కలహాంతరితా-ప్రోషితభర్తృకలు తమతమ అవ స్థలు నిరూపించాలి.

విచిత్రం ఉజ్జ్వలం అయిన వేషం, ప్రమోదం చేత వికసించిన ముఖం, అధికమైన శోభ-వీటచేత స్వాధీనభర్తృకావస్థ నిరూపితం కావాలి (నా.శా. XXII-222-25). వాసకసజ్జ- అభిసారికలు కూడా స్వాధీనభర్తృక వలెనే తమ తమ అవస్థలను నిరూపించవలెనని అభినవగుప్తుడు సూచించినాడు. (అ.భా.3 వ సంపుటి. 210).

ఏ ప్రకృతికి ఏ లీలా- గతి-స్థితులు నియతములై ఉంటాయో వాటినే, రంగప్రవేశం చేసినప్పటినుండి, రంగము నుంచి నిష్క్రమించేవరకు పాటించాలి.

ఈ ఎనిమిదిమందిలో స్వాధీనపతికా-వాసకసజ్జా-అభిసారికలది 'సంభోగశృం గారం'; ఇంక తక్కినవారిది విప్రలంభశృంగారం.

స్వాధీనపతికాది భేదములందలి ఉపభేదాలను శృంగారమంజరీకారుడిట్లా వివ రించినాడు (శృంగారమంజరి : పుటలు : 112-13) :

1. స్వాధీనపతిక : సామాన్యభేదాలు (6) : స్వీయ, ముగ్ధ, మధ్య, ప్రౌఢ, పరకీయ, సామాన్య. విశేషభేదాలు : దూతవంచిత, భావిశంకిత.

2. వాసకసజ్జిక : సామాన్యభేదాలు (6) : స్వీయాదులు.

విశేష భేదం : అవసితప్రవాసపతి.

3. విరహోత్కంఠిత : అనుత్పన్న సంభోగ, కార్యవిలంబిత సురత.

సామాన్యభేదాలు (5) స్వీయ, మధ్య, ప్రౌఢ, పరకీయ, సామాన్య.

విశేషభేదాలు (4) : దర్శనానుతాపిత, శ్రవణానుతాపిత, చిత్రానుతాపిత, స్వప్నానుతాపిత.

4. విప్రలబ్ధ : నాయకవంచిత, సఖీవంచిత.

సామాన్యభేదాలు (5) : స్వీయ, మధ్య మొ.

5. ఖండిత : సామాన్యభేదాలు (5) : స్వీయ, మధ్య మొ.

విశేషభేదాలు (5) : మానవతి, ధీర, అధీర, ధీరాధీర, అన్యాసంభోగ దుఃఖిత.

మానవతి భేదాలు (3) : గురుమాన, మధ్యమాన, లఘుమాన.

అన్యాసంభోగదుఃఖిత భేదాలు (4) : దూతీసంభోగ దుఃఖిత, దూతీ సమాసక్తి దుఃఖిత, ఇతర రతి శ్రుతి ఖిన్న, ఈర్ష్యాగర్విత.

6. కలహాంతరిత : సామాన్యభేదాలు (5) : స్వీయ, మధ్య మొ.

విశేషభేదాలు : ఈర్ష్యాకలహాంతరిత, ప్రణయకలహాంతరిత.

7. వక్రోక్తి గర్విత : సామాన్యభేదాలు (5) : స్వీయ, మధ్య మొ.

విశేషభేదాలు (4) : ప్రేమగర్విత, సౌందర్యగర్విత, సౌభాగ్యగర్విత, నైపుణ్యగర్విత.

సౌందర్యగర్వితాభేదాలు : స్మితగర్విత, యౌవన గర్విత, సౌకుమార్యగర్విత, విలాసగర్విత.

8. ప్రోషిత భర్తృక : ప్రవత్స్యత్పతిక, ప్రవసత్పతిక, ప్రోషితపతిక.

సామాన్యభేదాలు (6) : స్వీయ, ముగ్ధ మొ.

విశేషభేదం : విగలిత ప్రస్థానపతిక.

9. అభిసారిక : సామాన్యభేదాలు (6) : స్వీయ, ముగ్ధ, మొ.

విశేషభేదాలు : జ్యోత్స్నాభిసారిక, తమోభిసారిక, దివాభిసారిక, గర్వాభిసారిక, కామాభిసారిక, ప్రేమపాశ్యాభిసారిక.

(1) వాసకసజ్జిక :

మూలం : ఉచితే వాసకే తు రతిసంభోగలాలసా ।
మండనం కురుతే హృష్టా సా వై వాసకసజ్జికా ॥
-(నా.శా. XXII-213)

అర్థం : ఉచితేవాసకే, యా(తు), రతి సంభోగలాలసా = ఉచిత వాసక మందు, ఎవతె, రతి సంభోగలాలసయై; హృష్టా, మండనం కురుతే, సా (వై), వాసకసజ్జికా = సంతోషంతో, అలంకరించుకొంటుందో, ఆమె, వాసకసజ్జిక.

తాత్పర్యం : ఎవతె ఉచితవాసకసమయంలో, రతిసంభోగలాలసయై సంతోషంతో తనను అలంకరించుకొంటుందో, ఆమె 'వాసకసజ్జిక' అవుతుంది.

సంభోగాభిలాషతో, రాత్రి అంతా వసించి ఉండే చోటు అంటే పడకటిల్లు 'వాసం'; అందుకు ఉచితమైన కాలం 'వాసకం' (అ.భా). వాసక సమయంలో తనను, పడకటింటిని అలంకరించుకొని ప్రియాగమనాన్ని ప్రతీక్ష చేసేది వాసకసజ్జిక (= వాసకసజ్జ). నాయికకు అలంకరణ సఖిచేస్తుందని సా.ద. "ముహుర్ముహుః మండయంతీ" = పడకటింటిని, తనను మరల మరల అలంకరించుకొంటుంది, అంటే అలంకరించుకొంటూ, నచ్చక, సరి దిద్దుకొంటూ ఉంటుందని సింగభూపాలుడు. ఆమె చేష్టలను ఇట్లా ఇంకా వర్ణించినాడు:

ప్రియునితోడి కలయికను గూర్చి, మనోరథాన్ని (= తన మనస్సులోని కోరికను) గూర్చి ఆలోచిస్తుంది. ఎక్కువగా చెలికత్తెలతో వినోదిస్తుంది. మాటి మాటికి దూతికను సాభిప్రాయంగా చూస్తుంది (= తప్పక వస్తాడా? వచ్చే సమయం అయిందా? మున్నగు మూగప్రశ్నలతో). ప్రియుడు వచ్చే దారిని దీక్షగా చూస్తుంది (ర.మ. 125-27).

మనోరథాన్ని గూర్చి రసమంజరీకారుడు క్రింది ఉదాహరణ ఇచ్చినాడు (67) :

"అవయోః రంగయోః ద్వైతే భూయో విరహ విప్లవః ।
అద్వైతే చ స్మిత స్ఫీతం నస్యాదన్యోన్య వీక్షణమ్ ॥

— (నాయిక సఖితో) మా ఇరువురి దేహాలు విడివిడిగా ఉంటే విరహమనే ఉపద్రవం సంభవిస్తుంది, కాని రెండు దేహాలు ఒక్కటిగా అయితే చిరునవ్వులతో పుష్టమైన ఒండొరుల దర్శనం కలుగదు!

వాసకోచితకాలాలు ఆరు :

మూలం : పరిపాట్యాం ఫలార్థీ వా నవే ప్రవస వివవా ।
దుఃఖే చైవ ప్రమోదే చ షడేతే వాసకాః స్మృతాః ॥
ఉచితే వాసకే స్త్రీణా మృతుకాలేఽపి వా నృపైః ।
ద్వేష్యానా మథవేష్టానాం కర్తవ్య ముపసర్పణమ్ ॥
-(నా.శా. XXII-208-09)

తాత్పర్యం : *1. పరిపాటి (= బహుభార్యలున్నప్పుడు వారి వారి వంతుల చొప్పున వెళ్ళవలసిన రోజు), 2. ఫలార్థం (= ఋతుకాలం = సంతానం కోసం), 3. నవత్వం (= నవోఢా విషయం), 4.* ప్రవసనసమయం, *5.* దుఃఖసమయం, *6.* అధికసంతోషసమయం— ఇవి ఆరున్నూ 'వాసకములు'.

ఉచితవాసకసమయంలోనూ, ఋతుకాలం లోనూ, ధర్మపరుడైన రాజు, నాయిక తనకిష్టురాలు అయినా, కాకపోయినా, తప్పక ఆమెను చేరి కామోప చారం పాటించాలి.

టీక : నిఘంటువులందు ఆరు వాసకము లిట్లా ఉన్నవి : వారం (= పరిపాటి), ఋతుకాలం, ప్రవాసం నుంచి రాక, ప్రసాదనం, ఉత్సవం, నవోఢాలాలనం.

'నేడు నాకు ప్రియుమైన వాసరం (= రోజు)' అని నిశ్చయించుకొని తదనుగుణంగా సురత సామగ్రిని సజ్జీకరించేది 'వాసకసజ్జ' అవుతుందని రస మంజరీకారుడు.

వాసకసజ్జ చేసే ప్రతీక్షాదులు నా.శా.లో ఇట్లా వర్ణితములైనాయి (నా.శా. XXII-243-259):

భూషణాలను, పుష్పాలను, ధరించి ప్రియుని రాకను ప్రతీక్షించాలి. అది రుద్ధంగా, సవిలాసంగా నాయిక తనను అలంకరించుకోవాలి. ఇట్లా వాసకోచిత విధిని నిర్వర్తించి, నాళిక (= అవాటి గడియారం) శబ్దాన్ని వినటానికి చెవియొగ్గి, కాలాన్ని నిర్దేశిస్తూ, ఉండాలి (ఇంతకాలం గడచిందీ, ఎందుచేత ఇంతవరకు రాలేదు? అని వితర్కించుకోవాలి). అనుకొనిన వేళదాటిపోతే నాయకుడు రాకపోవటం చేత, విక్లబయై, కంపిస్తున్న గాత్రంతో, విషణ్ణమైన హృదయంతో ద్వారం దగ్గరకు పోవాలి.

వామహస్తంతో ద్వారాన్ని, దక్షిణహస్తంతో కవాటాన్ని పట్టుకొని, ద్వారానికి చేరబడి, నాయకుని రాకను నిరీక్షించాలి. అట్లా ద్వారానికి చేరబడి శంకా-చింతా-భయాలను ప్రదర్శించాలి. ప్రియుడు ఎంతకును కంటపడకపోతే, ఆమె క్షణం సేపు విషణ్ణయై దీర్ఘంగా నిఃశ్వసించి, కంటనీరుపెట్టి, సన్నహృదయంతో ఆసనమందు కూలబడాలి.

మంచి-చెడ్డలను తర్కిస్తూ, అతడు రాకపోవటానికి కారణం బహువిధాలుగా విమర్శించుకోవాలి. అంటే ప్రియుడు రాకపోవటానికి కారణం గురుకార్యమా? మిత్రులతో కలిసి ఉన్నాడా? లేదా ఇంకొక ప్రియురాలిచేత బద్ధుడైనాడా? - అని చింతించాలి. చివరకు, కనులదరటం, భుజాలదరటం మున్నగు నిమిత్తాలచేత, శుభ-అశుభ శకునాలను సూచించాలి. స్త్రీలకు వామపార్శ్వమందు కలిగే నిమిత్తాలు శుభసూచకాలు, దక్షిణపార్శ్వమందు కలిగేవి, అరిష్ట సూచకాలు. వామపార్శ్వమందలి నేత్ర-లలాట-భ్రూ-నాసా-ఓష్ఠ-ఊరూ-బాహూ-స్తనాలు అదరితే, అది ప్రియసమాగమాన్ని సూచిస్తుంది. ఇంక దక్షిణపార్శ్వములందలి అవయవాలు అదరటం దుర్నిమిత్త సూచకం. అట్లా దుర్నిమిత్తాలు కన్పట్టగానే క్షణకాలం మోహం పొందాలి. నాయకుడు రానంతసేపును చెక్కిలిని చేతికానించి, తన అలంకరణాన్ని నిరసించుకొంటూ ఆమె ఏడ్వాలి. తరువాత ప్రియుని రాకను గూర్చి శుభనిమిత్తాలు కనుపట్టినంతనే, అతడు ధరించిన పుష్పమాల్యాదుల గంధాన్ని అఘ్రాణిస్తూ, వాని రాకను సూచించాలి. అల్లంతదూరంలో నాయకుని చూచి, ఆనందంతో, యథావిధిగా ఎదురేగి ప్రహర్షంతో, వికసించిన కనులతో కాంతుని చూడాలి.

వాసోపచారమందు అధికంగా భూషణాలను ధరింపరాదు, ధ్వనించే రశనా-నూపురాదులిందు ప్రశస్తం.

స్వీయా నాయికా భేదాలైన ముగ్ధా-మధ్యా-ప్రౌఢలే కాక, సామాన్యా-పరకీయలు కూడా వాసకసజ్జికలు కాగలరు. ఇందులకు ఉదాహరణలు. రసమంజరీకర్త, శృంగారమంజరీకర్త ఇచ్చినారు.

**అపసితప్రవాసపతికా భేదం :**

నిఘంటువులు 'ప్రవాసం నుంచి తిరిగి రావటం' అన్నదానిని కూడా వాసకభేదంగా గ్రహింపటం చేత "అపసితప్రవాసపతిక" అనే భేదాన్ని కూడా వాసకసజ్జికా భేదంగా పరిగణించాలని శృం.మం.కర్త నిర్ధరించి, దానికి లక్షణం చెప్పి, ఉదాహరణ ఇచ్చినాడు. (కొందరు తలంచినట్లుగా, ఈమె, ప్రోషిత భర్తృక లేదా స్వాధీన భర్తృకలో అంతర్భవించదు).

వాసకసజ్జిక : నాయకాపేక్షతో, సంతోషంతో చేసే ప్రయత్నం కలది (= సంతోషంగా తనను, పడకటింటిని అలంకరించుకొనేది).

అవసితప్రవాసపతిక : ప్రవాసం నుంచి పతి (శీఘ్రంగా) రాబోవుచున్నాడని తెలిసి సంతోషంతో చేసే ప్రయత్నం కలది. ఈ అవసిత ప్రవాసపతికను 'సమాగచ్ఛత్ పతిక' అని కూడా అంటారు.

*(2) విరహోత్కంఠిత :*

మూలం : అనేక కార్య వ్యాసంగా ద్యస్యా నాగచ్ఛతి ప్రియః ।
తదనాగత దుఃఖార్తా విరహోత్కంఠితా తు సా ॥
-(నా.శా. XXII-214)

అర్థం : అనేక కార్య వ్యాసంగాత్, యస్యా, ప్రియః, న ఆగచ్ఛతి = అనేక కార్యవ్యాసంగాల వల్ల, ఎవతె ప్రియుడు, (రావలసిన సమయానికి) రాడో; తత్-అనాగతదుఃఖార్తా, సా (తు), విరహోత్కంఠితా = (ఆ ప్రియుడు) రాకపోవటం వల్ల దుఃఖార్త అయిన, ఆమె, విరహోత్కంఠిత.

తాత్పర్యం : అనేక కార్యక్రమాలవల్ల, రావలసిన సమయానికి ప్రియుడు రాకపోతే, దుఃఖార్త అయ్యే నాయిక 'విరహోత్కంఠిత'.

టీక : ఒకేచోట ఉన్నప్పటికీ సంభోగానికి అవకాశం లేకపోవటం చేత ఉత్కంఠిత అయ్యే నాయిక కూడా విరహోత్కంఠిత అవుతుందని రసచంద్రికాకర్త విశ్వేశ్వరుడు. 'అనేక కార్యవ్యాసంగాలవల్ల' అనటం చేత, నాయకుడు ఇంకో నాయికాసక్తుడై రావటానికి అలస్యం చేస్తున్నాడు అనే అర్థం అపాస్తమవుతున్నది; ఇదికేవలం కార్యవిలంబిత మాత్రమే. రసమంజరీకారుడు మున్నగువారు కొందరు ఈభేదాన్ని 'ఉత్క' అని మాత్రమే పేర్కొన్నారు. అంతే కాదు "సంకేత స్థలానికి భర్తరాకపోవటం చేత ఆలోచించేది ఉత్క" అని నిర్వచించి, గడువు దినమున భర్తరానట్టి 'ప్రోషితభర్తృక' యందు ఈమెకు అతివ్యాప్తి లేదన్నాడు భానుదత్తుడు.

సింగభూపాలుడు విరహోత్కంఠితా లక్షణాన్ని ఆమె చేష్టలను ఇట్లా వర్ణించినాడు:

మూలం : అనాగసి ప్రియతమే చిరయ త్యుత్సుకా తు యా ।
విరహోత్కంఠితా భావవేదిభిః సా సమీరితా ॥

అస్యాస్తు చేష్టా స్సంతాపో వేపథు శ్చాంగసాదనమ్ ।
అరతి ర్బాష్పమోక్షశ్చ స్వావస్థా కథనాదయః ॥
-(ర.సు. I-128-29)

అర్థం : అనాగసి, ప్రియతమే, చిరయతి = నిరపరాధి అయిన, ప్రియుడు, రావటానికి ఆలస్యం చేయటం చేత; యా, ఉత్సుకా (తు) = (కాలవిలంబం ఓర్వలేక) ఎవతె, తత్తరపడూ ఉంటుందో (ఆమె); భావవేదిభిః, విరహోత్కంఠితా, పరికీర్తితా = భావవేత్తలచేత, విరహోత్కంఠిత, (అని) చెప్పబడినది.

సంతాపః, వేపథుః, అంగసాదనం, అరతిః, బాష్పమోక్షః (చ), స్వ-అవస్థాకథనం-ఆదయః = సంతాపం (పాఠాంతరం-హృత్తాపం = హృదయవేదన), వేపథువు, అవయవాల వేదన, దేనిమీదను ఆసక్తి లేకపోవటం, కన్నీళ్ళు విడువటం, తన అవస్థలను (సఖులతో) చెప్పుకొనటం, మున్నగునవి; అస్యాః (తు), చేష్టాః = ఆమె (= విరహోత్కంఠిత) యొక్క చేష్టలు.

తాత్పర్యం : నిరపరాధి (= భోగాపరాధం చేయని) ప్రియుడు కార్యవశాన అనుకొన్న సమయానికి రాలేక జాగుచేస్తే తత్తరపడేది విరహోత్కంఠిత అవుతుంది. వేపథువు, మనస్తాపం, అవయవ వేదన (= ఒడలు విరుచుకొనటం), కన్నీరు కార్చటం, తనగోడు చెలికత్తెలకు విన్నవించుకోవటం మున్నగునవి విరహోత్కంఠిత చేష్టలు.

టీక : 'అవులింతలు' అనే చేష్ట అధికం రసమంజరిలో. శృంగారమంజరీకర్త ఇట్లా వివరించినాడు :

విరహోత్కంఠిత : ఒకే చోట ఉన్నప్పటికీ, ప్రియుడు కార్యాంతరవ్యాసంగంలో ఉండటం వల్ల విరహవతి అయ్యేది. ప్రాచీనులు 'విరహోత్కంఠిత' 5 విధాలు అని చెప్పినారు. కాని శృంగారరసానుకూలంగా ఈమె రెండు విధాలు-కార్యవిలంబితసురత, అనుత్పన్నసంభోగ.

కార్యవిలంబితసురత : ప్రియుడు ఆలస్యం చేయగా, రత్యర్థం ఖిన్న అయ్యేది. స్వీయా-మధ్యా- ప్రగల్భభా-పరకీయా-సామాన్యలందరూ ఇట్టివారు కాగలరు.

అనుత్పన్నసంభోగ : అసలు, ప్రియుని తోడి కలయికయే జరుగని స్థితిలో ఉన్న నాయిక; అందుకు ఉత్కంఠ పొందేది. ఈమె నాలుగు విధాలు:

దర్శనానుతాపిత : ప్రియుని చూసినప్పటికీ సంభోగప్రాప్తి పొందలేనిది.

శ్రవణానుతాపిత : ప్రియగుణశ్రవణం వల్ల విరహాకుల అయ్యేది.

చిత్రానుతాపిత : ప్రియుని చిత్రాన్ని, అవలోకించి, కలయికలేకపోవటం చేత ఖిన్నురాలు అగునది.

స్వప్నానుతాపిత : స్వప్నంలో కనిపించిన ప్రియుడు నిజంగా దర్శనమీయకపోవటం వల్ల ఖిన్నురాలు అగునది.

అనుత్పన్నసంభోగభేదాలను 'అయోగవిప్రలంభ' నాయికాభేదాలుగా కూడా చెప్పవచ్చు.

(3) స్వాధీనభర్తృక :

మూలం : సురతాతిరసైః బద్ధో యస్యాః పార్శ్వేతు నాయకః ।
సాంద్రామోద గుణప్రాప్తా భవేత్ స్వాధీనభర్తృకా ॥
-(నా.శా. XXII-215)

అర్థం : నాయకః, సురతాతిరసైః బద్ధః, యస్యాః, పార్శ్వే (తు) = నాయకుడు, సురతాతిరసబద్ధుడై, ఎవతె, పార్శ్వమందే (ఉంటాడో); సాంద్ర ఆమోదగుణ ప్రాప్తా, స్వాధీనభర్తృకా, భవేత్ = (అందువల్ల), అధికమగు హర్షం, అభిమానం పొంది ఉంటుందో (ఆమె) స్వాధీనభర్తృక అవుతుంది.

తాత్పర్యం : నాయకుడు, సురతాతి రసబద్ధుడై ఎల్లప్పుడూ తన ప్రక్కనే ఉంటూ ఉంటే, అధికమైన ఆమోదం అభిమానం కలిగి ఉండే నాయిక 'స్వాధీనభర్తృక.'

టీక : ఈమెను 'స్వాధీనపతిక' అన్నారు రసమంజరీకర్త ప్రభృతులు. "ఎవతె యొక్క రతి గుణం చేత ఆకృష్టుడై పతి ఆమె పార్శ్వాన్ని విడిచి పెట్టడో, ఆమె స్వాధీనభర్తృక" అని శృంగారతిలకకర్త (I.133). "ఎల్లప్పుడును సాకూత (= సాభిప్రాయ) సంజ్ఞల చేతనే ఎరుక పడే తన ఆజ్ఞలను నెరవేర్చే ప్రియతముడు కలది స్వాధీనపతిక" అని రసమంజరి. స్వాధీనపతికలైన ముగ్ధా, మధ్యా, ప్రౌఢా, పరకీయా, సామాన్యలకు ఉదాహరణ లిచ్చినాడు భానుదత్తుడు.

"నిత్యం ప్రియుని చేత లాలింపబడే నాయిక స్వాధీనపతిక. స్మరపూజోత్సవాదులు, వనకేళి, జలక్రీడ, కుసుమావచయం మున్నగునవి ఆమె చేష్టలు" అని

సింగభూపాలుడు. మదాహంకారం, మనోరథావాప్తి-వీనిని అధికంగా చెప్పినాడు భానుదత్తుడు.

"అనుకూలుడైన ప్రియుడు కలది స్వాధీనపతిక" అని చెప్పి, ఆమె ఎనిమిది విధాలని వివరించినాడు శృంగారమంజరీకర్త: స్వీయ, ముగ్ధ, మధ్య, ప్రగల్భ, పరకీయ, సామాన్య, దూతీవంచిక, భావిశంకిత,

దూతీవంచిక : ప్రేమను దాచిపెట్టి, ప్రియుని అనుమతితో, పరిహాసార్థం, మాయామానాన్ని ప్రకటించి, దూతిని వంచించేది.

భావిశంకిత : ప్రస్తుతం ప్రియునితో కలిసి ఉన్నప్పటికీ, భవిష్యత్తులో ఏమి జరుగుతుందో అని శంకించేది.

*(4) కలహాంతరిత :*

మూలం : ఈర్ష్యాకలహనిష్క్రాంతో యస్యా నాగచ్ఛతి ప్రియః
సామర్షవశ సంప్రాప్తా కలహాంతరితా భవేత్॥
-(నా.శా.XXII-216)

అర్థం : యస్యా, ప్రియః, ఈర్ష్యాకలహనిష్క్రాంతః, నాగచ్ఛతి = ఎవతె, ప్రియుడు, ఈర్ష్యాకలహం చేత వెడలిపోయి, తిరిగి రాలేదో; అమర్ష వశ సంప్రాప్తా, సా, కలహాంతరితా, భవేత్ = (అందువల్ల), అమర్షవశ (= క్రోధంతో సంతప్త) అయిన, ఆమె 'కలహాంతరిత' అవుతుంది.

తాత్పర్యం : ఈర్ష్య కలహంచేత వెడలిపోయిన ప్రియుడు, తిరిగి రాకపోవటం చేత అమర్షవశ అయిన నాయిక, కలహాంతరిత.

టీక : కలహంచేత, అంతరిత (= వ్యహిత = దూరం) కాబడినది కావున కలహాంతరిత.

"పతిని అవమానించి, పిమ్మట అందుకై దుఃఖించేది కలహాంతరిత" అని రసమంజరి.

సింగభూపాలుడిట్లా వర్ణించినాడు (ర.సు. I-132-33) : చెలుల ఎదుట తన పాదాలపై పడిన ప్రియుని, తొలుత కోపంతో తిరస్కరించి, పిమ్మట పశ్చాత్తాప పడేది కలహాంతరిత. నిఃశ్వాసం, భ్రమించటం, మనస్తాపం, మోహం, జ్వరం, తొట్రుపాటు, మాటిమాటికి ప్రలపించటం (= పలవరింతలు) మున్నగునవి కలహాంతరిత చేష్టలు.

శృంగారమంజరీకర్త ఇట్లా వివరించినాడు :

కోపంతో కాంతుని పరాభవించి, తరువాత పశ్చాత్తాపపడేది కలహాంతరిత; ఈమె రెండు విధాలు - ఈర్ష్యాకలహాంతరిత, ప్రణయకలహాంతరిత.

*ఈర్ష్యాకలహాంతరిత :* అన్యకాంతాసక్తుడైన ప్రియుని పరిభవించి, తరువాత పశ్చాత్తాపపడేది.

*ప్రణయకలహాంతరిత :* తన ఆజ్ఞను ఉల్లంఘించటం వల్ల జనించిన కోపంతో నాయకుని పరిభవించి, తరువాత పశ్చాత్తాపపడేది.

పై రెండు విధాల నాయికలకు, ముగ్ధను విడిచి స్వీయాదులకు, అతిరాగ రమణీయమైన ప్రణయకలహాంతరితకు, మధ్యాదులకు, ఉదాహరణలు ఇచ్చినాడు రసమంజరీకారుడు.

కలహాంతరిత కోపావస్థలో 'ఖండిత' తో సమానమే; కానీ తరువాత పశ్చాత్తాపం చెందటంవల్ల ఈమె, ఖండిత కంటె భిన్నమవుతున్నది.

ఉదా : సా.ద.లో విశ్వనాథుని తాతపాదుల శ్లోకం :

నో చాటు శ్రవణం కృతం న చ దృశా హారోఽంతికే వీక్షితః
కాంతస్య ప్రియహేతవే నిజసఖీ వాచోఽపి దూరీకృతాః ।
పాదాంతే వినిపత్య తత్క్షణ మసౌ గచ్ఛ న్మయా మూఢయా
పాణిభ్యా మవరుధ్య హన్త! సహసా కంఠే కథం నార్పితః ॥

— కాంతుని ప్రియోక్తులను సరకుగొననైతిని. నాచెంత ఆతడు పెట్టిన హారాన్ని కంటితో చూడనైతిని. అతనిపై దయతాల్చుమని నా నెచ్చెలులు పలికిన మాటలను లక్ష్యపెట్టనైతిని. నా పాదాల వ్రాలి తత్క్షణ మతడు పోవుచున్నప్పుడు, అయ్యో!, ఎంతటి మూఢురాలను, తటాలున అతనిని నారెండు చేతులతోను అడ్డగించి, వాటిని కంఠమునందర్పించుకొననైతివి.

## (5) ఖండిత :

మూలం : వ్యాసంగా దుచితే యస్యా వాసకే నాగతః ప్రియః ।
తదనాగమ దుఃఖార్తా ఖండితా సా ప్రకీర్తితా ॥

-(నా.శా. XXII-217)

అర్థం : యస్యా,ప్రియః, ఉచితేవాసకే, వ్యాసంగాత్, నాగతః = ఎవతె, ప్రియుడు, ఉచితవాసకమందు, ఇతరవ్యాసంగం వల్ల, రాడో; తత్-అనాగమ

దుఃఖార్తా, సా, ఖండితా, ప్రకీర్తితా = ఆతడు రాకపోవటం చేత, దుఃఖార్త (అయిన), ఆమె, ఖండిత (అని), చెప్పబడినది.

తాత్పర్యం : ఉచితవాసకమందు (= తనతో కలిసి ఉండవలసిన సమయంలో) ప్రియుడు ఇతర వ్యాసంగం వల్ల (= ఇంకొక నాయికతో కలిసి ఉండటం చేత) తన వద్దకు రాకపోవటం చేత దుఃఖార్త అయిన నాయిక 'ఖండిత' అవుతుంది.

టీక : ఇంకొక నాయికతో భోగించి, ఆ భోగచిహ్నాలతో, సమయం అతిక్రమించి, ఉదయం వచ్చిన నాయకుడు కలది 'ఖండిత' అని శారదాతనయ-సింగభూపాలురు. ఖండిత యొక్క చేష్టలు ఇట్లా ఉంటాయి. (ర.సు. I-131):

"చింత, నిఃశ్వాసం, మౌనం, కన్నీరు కార్చటం, సంతాపం, స్వేదం, భ్రాంతి, అస్ఫుటభాషణం మున్నగునవి."

వాసకసజ్జికా విషయంలో 'ప్రతీక్ష'ను వివరించిన పిమ్మట, సాపరాధుడైన నాయకుని పట్ల ఖండితా నాయిక యొక్క ప్రవర్తనను భరతముని ఇట్లా వివరించినాడు (నా.శా. XXIV- 258-60) :

". . . . . . . అప్పుడు కాంతునియందు వేరొక స్త్రీతో కలిసిన చిహ్నాలు, దంతక్షతాదులు కన్పట్టితే, చెలికత్తెభుజంపై చేతిని ఆనుకొని, ఆయతస్థానకమందు నిల్చి, వానిని పరిశీలించవలె. అంతట, సాపరాధుడైన ఆ నాయకుని కోపసూచకాలైన ఆయా చేష్టలతో, నిందాపూర్వకాలైన మాటలతో, ఉపాలంభించాలి. మానం, అవమానం, సంమోహం, అవహిత్థ, భయం- ఇవి స్త్రీలయొక్క ఈర్ష్యావచనములందు కన్పట్టుతాయి".

ఈర్ష్యావిషయం విపులంగా వర్ణితమైంది నాట్యశాస్త్రంలో. ఇంక 'మానం' అనేదానిని అర్వాచీనులు 'రతి' స్థాయి భావం యొక్క ఒకభేదంగా పరిగణించినారు. ఈ రెండింటిని ఆసందర్భంలో వివరిస్తాను. (చూ. 'రతి').

ఖండిత నాయికను గూర్చి శృంగారమంజరీకారు డిట్లా వివరించినాడు:

ప్రియుని అన్యకాంతా విషయక జ్ఞానం మనః క్షోభకారణం; అటువంటి మనః క్షోభంనుంచి పుట్టినది కోపం, అటువంటి కోపం యొక్క కార్యములే మానాది చేష్టలు.

మానం : కోపోత్పన్నమౌనం లేదా కోపచేష్ట.

ఖండిత : శృంగారరసానుకూల కోపవతి. (ఖండిత అంటే ఖండములుగా చేయబడిన = శకలీకృతమైన ప్రేమకలది అని అర్థం).

భేదాలు : మానవతి, ధీర, అధీర, ధీరాధీర, అన్యాసంభోగదుఃఖిత, ఈర్ష్యాగర్వితా.

స్వీయా- మధ్యా-ప్రగల్భా-పరకీయా-సామాన్యానాయిక లందరూ ఖండితలు మానవతులు కావచ్చు.

మానవతి : ప్రియాపరాధజనిత కోపజన్యమౌనమే మానం; మానం కలిగినది మానవతి, ఇది లఘు-మధ్య-గురు భేదాలచేత ముప్పిధాలు (వీటిని ఇంతకుముందే వివరించాను).

అన్యాసంభోగదుఃఖిత : ఈమె నాలుగు విధాలు - దూతీ సంభోగదుఃఖిత, దూతీ సమాసక్తి దుఃఖిత, ఇతర రతిశ్రుతి ఖిన్న, ఈర్ష్యాగర్వితా.

అన్యాసంభోగదుఃఖిత : నాయకపరోక్షంలో కోపప్రకాశనశీల.

దూతీసంభోగదుఃఖిత : నాయకుడు, తానుపంపిన దూతితో సంభోగించటం వల్ల దుఃఖిత.

దూతీ సమాసక్తి దుఃఖిత : దూతీ సమాసక్తి చేత దుఃఖిత.

ఇతర రతి శ్రుతి ఖిన్న : ప్రియుని ఇతర నాయికా రతి వినటం వల్ల ఖిన్న.

ఈర్ష్యా గర్వితా : నాయకపరోక్షంలో, వక్రోక్తులతో, నాయకావిషయక కోపప్రకాశిక.

(6) విప్రలబ్ధ :

మూలం : యస్యా దూతీం ప్రియః ప్రేష్య దత్త్వా సంకేత మేవవా ।
నాగతః కారణేనేహ విప్రలబ్ధా తు సా భవేత్॥
-(నా.శా. XXII-218)

అర్థం : యస్యా, ప్రియః, దూతీం, ప్రేష్య, సంకేతం ఏవ(వా) దత్త్వా = ఎవతె, ప్రియుడు, దూతిని, పంపించి, సంకేతం (= ఫలాని చోటికి రమ్మని) చెప్పి ఉన్నప్పటికీ; కారణేన (-ఇహ), నాగతః, సా, విప్రలబ్ధా (తు), భవేత్ = ఏదేని కారణం చేత, (అతడు), రాకపోతే ఆమె, విప్రలబ్ధ అవుతుంది.

తాత్పర్యం : దూతిని పంపి, సంకేతం చెప్పి ఉన్నప్పటికీ, ఏదేని కారణం చేత ప్రియుడు అక్కడకు రాకపోవటం వల్ల వంచిత అయిన నాయిక విప్రలబ్ధ.

టీక : విప్రలబ్ధ అంటే 'వంచిత' అని అమరకోశం. 'నితాంతం అవమానితా' (= బాగా అవమానం పొందినది) అని సాహిత్యదర్పణం. "సంకేతనికేతనంలో ప్రియుడు కానరాకపోతే సమాకుల హృదయ అయ్యేది (= ఆశాభంగం పొందినది) విప్రలబ్ధ " అని రసమంజరి. ప్రియుడు కానరాకపోతే స్మరార్త అగునది విప్రలబ్ధ అని చెప్పి ఆమెచేష్టలు వర్ణించినాడు సింగభూపాలుడు (.ర.సు. I-149):

"నిర్వేదం, చింత, ఖేదం, దీనత (= దైన్యం), అశ్రువు, నిఃశ్వాసం, మూర్ఛ మున్నగునవి."

'సఖీజనోపాలంభం'- దీనిని అధికంగా చెప్పినాడు రసమంజరీకారుడు.

ప్రియుడు రాకపోవడం చేత దుఃఖార్త కావటం విరహోత్కంఠితకు, విప్రలబ్ధకు, ఖండితకు సమానమే. ప్రియుని రాక ఆలస్యం కావటం లేదా విశ్వేశ్వరుడు చెప్పినట్లుగా సన్నిహితంగా ఉన్నా కలయికకు అవకాశం లేకపోవటం మాత్రమే విరహోత్కంఠిత వట్ల వర్తిస్తుంది. కాని, విప్రలబ్ధ వంచిత అయింది; వస్తున్నట్లు చెప్పివంపికూడా ప్రియుడు రాలేదు. ఇంక ఖండిత మోసగించబడింది; తనతో ఉండవలసిన సమయంలో ప్రియుడు ఇంకొకతెతో కులుకుతున్నాడు!

ఇంచుమించుగా శాస్త్రకర్తలందరూ 'సంకేతం' విషయం ప్రస్తావించారు. శృంగారమంజరీకర్త ప్రకారం, నాయిక, సంకేత స్థానానికి వెళ్ళి, విప్రలబ్ధ (=వంచిత లేదా అవమానిత) కానక్కరలేదు, తన ఇంటిలోనే ప్రతీక్ష చేస్తూ చెప్పినట్లుగా ప్రియుడు రాకపోవటం చేతకూడా, నాయిక విప్రలబ్ధ అవుతుంది. అంతేకాదు. నాయకుడు తనతో చెప్పిన ప్రకారం వచ్చి ఉన్నప్పటికీ, పరిహాసం కోసం, వానిని దాచి, రాలేదని సఖి చెప్పటం వల్ల కూడా నాయిక తాత్కాలికంగా విప్రలబ్ధ అవుతుంది. కావున విప్రలబ్ధ రెండు విధాలు : నాయకవంచిత, సఖీవంచిత. ఈ రెండు భేదాలలో మరల ముగ్ధ మున్నగు అయిదేసి విభేదాలకు ఉదాహరణలున్నవి.

విప్రలబ్ధ : వంచనా ప్రయుక్త విరహవేదనావతి.

నాయక వంచిత : నాయకుని చేత వంచిత అయినది.

సఖీవంచిత : సమయానికి వచ్చిన నాయకుని దాచి పరిహాసం కోసం, రాలేదని సఖిచేత చెప్పబడినది.

ఉదా : కిం రుద్ధః ప్రియయా కయాచి? దథవా సఖ్యా మ మోద్వేజితః?
కిం వా కారణగౌరవం కిమపి?య న్నా ద్యాగతో వల్లభః ।
ఇ త్యాలోచ్య మృగీదృశా కరతలే విన్యస్య వక్త్రామ్బుజం
దీర్ఘంశ్వసితం చిరం రుదితం క్షిప్తాశ్చ పుష్పస్రజః. [శృంగారతిలకం]
"ప్రియ ఎవతె యేని అడ్డగించినదా? లేక నాసఖి బెదరగొట్టినదా?
వేఱే గొప్ప కారణ మేమయిన కలిగినదా? ఏల వల్లభుడు రాడా
యెను?" ఇట్లని తలపోసి యాలేడికంటి అఱచేత మోము దమ్మి
నుంచుకొని నిడుదయూర్పులు విగిడించి తడవుగా ఏడ్చి పూసరము
లను విసరి పాఱవైచినది.

(7) ప్రోషితభర్తృక :

మూలం : నానాకార్యాణి సంధాయ యస్యా వై ప్రోషితః ప్రియః ।
ప్రరూఢాలక కేశాంతా భవేత్ ప్రోషితభర్తృకా ॥
-(నా.శా. XXII-219)

అర్థం : యస్యా (వై), ప్రియః, నానాకార్యాణి సంధాయ, ప్రోషితః = ఎవతె యొక్క ప్రియుడు, నానా కార్యాసక్తుడై, దేశాంతరమందుండగా, ప్రరూఢ-అలక-కేశాంతా, ప్రోషితభర్తృకా, భవేత్ = అలకలు, కేశాంతాలు వ్రేలాడుతున్న (= కేశసంస్కారం లేని) (ఆమె), ప్రోషిత భర్తృక అవుతుంది.

తాత్పర్యం : నానా కార్యాలను సాధించటం నిమిత్తం (= ధనార్జన కోసం లేదా రాజకార్యంతో) ప్రియుడు దేశాంతరంలో ఉండగా, కేశసంస్కారాదులను వర్జించి ఉండేది 'ప్రోషితభర్తృక.'

టీక : ఈమెను 'ప్రోషిత పతిక' అని కూడా అంటారు. 'ప్రోషితప్రియ' అన్నాడు ధనంజయుడు. 'ప్రోషితుడు' అనగా దేశాంతరగతుడు = ఇతర దేశమందున్న వాడు అని అర్థం. ముగ్ధా-మధ్యా-ప్రౌఢా-పరకీయా-సామాన్యా భేదాలచేత ప్రోషితభర్తృక అయిదు విధాలు. భర్త దేశాంతరగతుడు కాగా

సంతాప వ్యాకుల అయిన ప్రోషితభర్తృక యొక్క చేష్టలను సింగభూపాలు డిట్లా వర్ణించినాడు (ర.సు. I-*123-24*):

జాగారం, కృశత్వం, (మంచి) శకునాలు చూడటం, మాలిన్యం, అస్థిరత, తరచు పరుండటం, జాడ్యం, చింతమున్నగునవి.

దశావస్థలు ఈమెచేష్టలు అని రసమంజరి. 'సంతాపవ్యాకులత్వం' సమానమైనా పతిదేశాంతరగతుడు కాకపోవటం చేత ఉత్కా–కలహాంతరితా- విప్రలబ్ధలు ప్రోషితభర్తృక కంటె భిన్నలు.

ఉదా : తాం జానీథాః పరిమితకథాం జీవితం మే ద్వితీయం,
దూరీభూతే మయి సహచరే చక్రవాకీ మి వైకామ్ ।
గాఢోత్కంఠాం, గురుషు దివసే ష్వేషు గచ్ఛత్సు, బాలాం,
జాతాం, మన్యే, శిశిర మథితాం పద్మినీం వాన్యరూపాం ॥
-(మేఘసందేశం-II-22)

– 'సహచర మయిన చక్రవాకం దవ్వయిన చక్రవాకియుం బోలె సహచరుడనయిన నేను దవ్వు అయినందున ఒంటియైన దానిని మితభాషిణిని నా రెండవ ప్రాణమునుగా నెఱుంగుము. గాఢోత్కంఠ యాబాల విరహ దున్సహము లయిన ఈ దినములు గడచుటలో శిశిరముచే గాసిం బడిన తామర తీవెయుం బోలె రూపాంతర మొంది యుండు నని తలంచెదను.'

టీక : ప్రోషిత భర్తృకను గూర్చి శృంగారమంజరీకర్త ఇట్లా వివరించినాడు :

"ప్రోషితభర్తృక" లోని 'ప్రోషిత' పదానికి భూతార్థమే కాక వర్తమాన-భవిష్యత్తులు కూడా అర్థమే; అంటే అది త్రైకాలికమన్నమాట! అంతేకాదు. పశ్చాత్తాపిత, విగలితప్రస్థానపతిక- అవి మరో రెండు భేదాలను కూడా చెప్పవచ్చు. కాగా, ప్రోషితపతిక అయిదు విధాలు.

ప్రోషిత భర్తృక : పతిప్రవాసం (= పరదేశగమనం) వల్ల ఖిన్న అయినది. భూత- (ప్రవాసం భూతకాలంలో), భవిష్యత్, వర్తమాన భేదాలచేత ఈమె మూడు విధాలు :

ప్రవత్స్యత్ పతిక : ప్రియుని ప్రవాసయత్నోద్యమం తెలిసి వేదనవతి అగునది(ప్రియాదులు అరుగురకు ఉదాహరణము లిచ్చినాడు).

ప్రవసత్ పతిక : వర్తమాన కాలంలో అంటే ప్రియుని (ప్రవాసం వర్త మానకాలంలో) ప్రవాసం ప్రారంభమయ్యే సమయంలో వేదనపడుతున్నది (స్వీయాదులారుగురకు ఉదాహరణములిచ్చినాడు).

విగలితప్రస్థానపతిక : ప్రియురాలి వేదనను గ్రహించిన ప్రియుడు తన ప్రస్థానమును విరమించుకొంటే ఆమె విగలితప్రస్థానపతిక.

సఖ్యనుతాపిత = నాయకుని పరదేశగమనానంతరం తనను సమాధాన పరచే సఖికూడా వేరే ప్రయాణం చేస్తే, ఆమె సఖ్యనుతాపిత.

*(8) అభిసారిక :*

**మూలం : హిత్వా లజ్జాం తు యా శ్లిష్టా మదేన మదనేన చ ।**
**అభిసారయతే కాంతం సా భవే దభిసారికా ॥**
-(నా.శా. XXII-220)

**అర్థం :** యా (తు), మదేన, మదనేన (చ) శ్లిష్టా, లజ్జాం, హిత్వా = ఎవతె, మద్యమదం చేత, (లేదా) మదన పారవశ్యం చేత, లజ్జను విడనాడి; కాంతం, అభిసారయతే, సా, అభిసారికా, భవేత్ = కాంతుని వద్దకు, పయ నమై పోతుందో, ఆమె, అభిసారిక, అవుతుంది.

**తాత్పర్యం :** మద్యమదంచేత, మదన పారవశ్యం చేత, సిగ్గు విడిచి, కాంతుని యొద్దకు పయనమై వెళ్ళేది - అభిసారిక.

**టీక :** 'రిరంసుః సురతార్థినీ నాయికా అభిసారికా' అని నా.ద. (=సుర తార్థిని అయిన నాయిక అభిసారిక). "కామార్తయై కాంతుని అభిసరించేది లేదా కాంతుని అభిసరింపజేసేది అభిసారిక" అని ధనంజయ-సింగభూపాల - భానుదత్తులు. అంటే కాంతుని వద్దకు తాను స్వయంగా వెళ్ళినా, లేదా కాంతుని తన వద్దకు (దూతికాదులద్వారా) రప్పించుకొన్నా, ఆమె అభిసారిక అవుతుందన్నమాట! భానుదత్తుడు, అభిసారిక చేష్టలను ఇట్లా వర్ణించినాడు:

పరకీయచేష్టలు : సమయానుకూలములైన వేషం, భూషణాలు ధరిం చటం, శంక, ప్రజ్ఞ, నైపుణ్యం, కపటం, సాహసమున్నగునవి.

స్వీయచేష్టలు : సహజమగు వేష-భూషలు తాల్చటమే.

ముగ్ధా-మధ్యా-ప్రౌఢా - పరకీయా - సామాన్యలకేకాక, జ్యోత్స్నా - తమిస్రా - దివాభిసారికలకు కూడా భానుదత్తుడుదాహరణ లిచ్చినాడు.

"ప్రియుని అభిసరింపజేస్తుంది" అనే భేదాన్ని అంగీకరించలేదు శృంగారమంజరీకర్త; ఇది వాసకసజ్జికాభేదంలో అంతర్భవిస్తుందని అతని నిర్ణయం. ఇంక, శృం.మం.లోని అభిసారికా భేదాలు ఆరు :

జ్యోత్స్నాభిసారిక : వెన్నెలరాత్రి శుభ్ర (=తెల్లని) వేషంతో అభిసరించేది.

తమోఽభిసారిక : చీకటిరాత్రి శ్యామ (=నల్లని) వేషంతో (=తమిస్రాభిసారిక) అభిసరించేది.

దివాభిసారిక : పగటివేళ అభిసరించేదు.

గర్వాభిసారిక : సంకేతస్థానంచేరి, తనప్రేమను కప్పివుచ్చి, కార్యాంతరంచేత వచ్చితిని అని వార్తాలాపంచేసేది.

కామాభిసారిక : మన్మథావేశంతో అభిసరించేది.

ప్రేమవాక్యాభిసారిక : నాయకునిచేరి, ప్రేమసంలాపం చేసేది.

వెన్నెలలో తెల్లని వస్త్ర-భూషాదులు ధరించి వెళ్ళేది జ్యోత్స్నాభిసారిక; చీకటిలో నల్లని వస్త్ర- భూషాదులు ధరించివెళ్ళేది తమిస్రాభిసారిక. ఈ అభిసరణం కన్యకూడా చేయవచ్చు. వేశ్య, వైశికుని అభిసరిస్తుంది.

సా.ద.లో కులటలకు, అభిసారస్థానాలు ఎనిమిది చెప్పబడినవి: పొలం, ఆరామం, పడినగుడి, కుంటెనగత్తె ఇల్లు, అడవి, పూలతోట, వల్లకాడు, నద్యాదులదరి. అట్లాగే చీకటి కమ్మిన ప్రదేశం.

నాట్యశాస్త్రంలో, భావప్రకాశనంలో అభిసరణం క్రింది విధంగా వివరింపబడింది :

1. వేశ్యాంగనమదవతియై, సుకుమారచేష్టలు చేస్తూ, నానాభరణాలు ధరించినదై, పరిజనులతో కూడి, మెల్లగా సాగుతుంది. వెళ్ళిన పిమ్మట అచ్చట ప్రియుడు నిద్రిస్తూఉంటే, చల్లని పరిమళాలచేత ప్రియుని మేల్కొల్పాలి. వేశ్యోపచారం లోకంలో రహస్యంగా ఆచరింపదగినదే అయినా, నాటకంలో సర్వావస్థలు ప్రత్యక్షంగా అభినయించాలి కదా (నా.శా. )

...... పరిజనులు, నానావిధాలు సమధికాలు అయిన భోగోపకరణాలచేత సముజ్జ్వలంగా ఉంటారు. ఇంక ఆమె రశనాలంబితనితంబ, మణిమంజీరమంథర, చరణాంభోరుహ, సంప్రీతురాలు అయి వైశిక నాయకుని అభిసరిస్తుంది. వెళ్ళిన పిమ్మట అచ్చట ప్రియుడు నిద్రపోతూ ఉంటే, మృదుస్పర్శతో, కేశ-ఉల్లేఖనంతో ప్రబోధిస్తుంది. అతడు లేచినప్పుడు ప్రణయంతో క్షణంసేపు కోపిస్తుంది (భా.ప్ర.IV-262-65,67).

2. కులాంగన (=స్వీయ) ఇతరులు చూస్తారనే జంకుతో, అవయవాలు ముడుచుకొని, భయపడుతూ, ముఖంవంచి, మునుగు వేసుకొని సాగాలి. వెళ్ళిన పిమ్మట అచ్చట ప్రియుడు నిద్రపోతూఉంటే, నూపురాదులను ధ్వనింపజేయటం ద్వారా వానిని మేల్కొల్పాలి (నా.శా.)

రూపయౌవనసంపన్న, కుల-భోగ-ధనాధిక అయిన స్వీయాంగన వాస-అంగ రాగ- మాల్య-ఋతు-చందన-ఇందూదయాది ఉద్దీపనాలవల్ల, పంచబాణుని పంచ బాణాలచేత ప్రణీతయై, కాంతుడు అభిసరించేటట్లు (=తనవద్దకు వచ్చేటట్లు) చేస్తుంది (భా.ప్ర.IV-257-58). – భరతముని కులాంగనాభిసరణాన్ని వర్ణించగా శారదాతనయుడు కాంతుని అభిసరణాన్ని వర్ణించినాడు.

3. ప్రేష్యాంగన మదంచేత మాటలు తొట్రుపడుతూఉండగా, విభ్రమం చేత వికసించినలోచనాలు కలదై, ఆవిద్ధగతితో సాగాలి. వెళ్ళిన పిమ్మట అచ్చట ప్రియుడు నిద్రపోతూ ఉంటే తన చీర చెరగుతో విసరుతూ వానిని మేల్కొల్పాలి. (నా.శా.)

పూలమాలలు, అంశుకాంచలము జారిపోతూఉండగా . . . . . . . . . . చేటులతో కూడినదై అతిగర్వితయై ప్రియుని అభిసరిస్తుంది. ప్రియుడు నిద్రపోతుంటే కనురెప్పలను ఎత్తిచూస్తుంది. పైట చెరగుతో వీస్తుంది. పాదమర్దన మొనరిస్తుంది. అట్లా మేల్కొల్పి బెదరిస్తుంది. ముక్కు పట్టి నులుముతుంది (భా.ప్ర.IV-226-67; 271-72).

4. పరాంగనాభిసరణాన్ని భరతముని వర్ణించలేదు; కానీ, నా.శా.లోని కులాంగనాభిసరణాన్ని అనుసరించి, శారదాతనయుడు పరాంగనాభిసరణాన్ని వర్ణించినట్లు గోచరిస్తున్నది. తన శరీరంలో తాను విలీనమవుతూ, నిశ్శబ్ద పదసంచారంతో, పదపదమున సందేహించుతూ, అధికంగా కంపంతో, స్వేదం అంగాలను తడుపుతూఉండగా, పులిని చూసిన లేడిపిల్లవలె బెదురుచూపులతో భయం భయంగా సాగుతుంది. వెన్నెలలో తమస్సులో తత్తదుచితములయిన వేషభూషలతో, నీలీ- కుసుంభ-మాంజిష్ఠరాగాలతోడి పట్టువస్త్రాలతో అవకుంఠిత సర్వాంగియై సాగుతుంది. వెళ్ళిన పిమ్మట అచ్చట ప్రియుడు నిద్రపోతూఉంటే అతని పార్శ్వంలో నిశ్చలంగా నిలుస్తుంది. శీతలానులేపనాలతో, మాల్యాలతో అలంకరిస్తుంది. భావజ్ఞురాలై మెల్లగా ప్రబోధం కలుగజేస్తుంది (భా.ప్ర.IV-259-61, 268-69).

## (9) ప్రవత్స్యత్ పతిక :

మూలం : "అగ్రిమక్షణే దేశాంతర విశ్రుతగమనే ప్రేయసి ప్రవత్స్యత్
పతికాఽపి నవమీ నాయికా భవితు మర్హసి."

-(రసమంజరి)

— ఉత్తరక్షణంలో ఎవతె యొక్క ప్రియుడు నిశ్చయంగా దేశాంతరమున కేగునో, ఆ నాయిక, ప్రవత్స్యత్‌పతిక పేర తొమ్మిదవ నాయిక అగుటకు అర్హురాలు.

టీక : భరతాదులందరు ఎనిమిది నాయికావస్థలను లేదా ఎనిమిది మంది నాయికలను వర్ణించినారు. ఇంక రసమంజరీకారుడు భానుదత్తుడు 'ప్రవత్స్యత్ పతిక' ను తొమ్మిదవ నాయికగా లేదా తొమ్మిదవ నాయికావస్థగా పేర్కొన్నాడు. ఈమె తొలి ఎనిమిది భేదాలలో అంతర్గతమవుతుందని కొందరన్నారట; అది సరికాదనీ, ఇది ప్రత్యేకభేదమనీ భానుదత్తుడు నిరూపించినాడు. అంతేకాదు. ముగ్ధా-మధ్యా-ప్రౌఢా-పరకీయా-సామాన్యలకు ఉదాహరణ లిచ్చినాడు.

కాని, 'అగ్రిమ (=ఉత్తర) క్షణంలో ప్రయాణం కానున్న' అనే భాను దత్తుని నిర్వచనాన్ని అంగీకరించక, ప్రోషితభర్తృకలోనే దీనిని ఒక భేదంగా గ్రహించినాడు శృంగారమంజరీకారుడు- ప్రోషితభర్తృక , ప్రవత్స్యత్‌భర్తృక, ప్రవసత్ భర్తృక (ప్రోషిత పదానికి త్రైకాలికార్థం చెప్పినాడు.)

## (10) వక్రోక్తి గర్విత :

మూలం : "స్వగర్వం వక్రోక్త్యా యా ప్రకాశయతి సా వక్రోక్తి గర్వితా" అని శృంగారమంజరీకారుడు. అంటే స్వీయగర్వాన్ని వక్రోక్తుల ద్వారా ప్రకాశింపజేసేది వక్రోక్తిగర్విత అవుతుంది. ఈమె నాలుగు విధాలు :

*1.* ప్రేమగర్విత : తనమీద ప్రియునకు గల ప్రేమను వక్రోక్తుల ద్వారా ప్రకాశింపజేసేది (స్వీయా- మధ్యా-ప్రౌఢా-పరకీయా-సామాన్యాలకు ఉదాహరణము లిచ్చినాడు).

*2.* సౌందర్యగర్విత : స్వీయసౌందర్యగర్వాన్ని వక్రోక్తులద్వారా ప్రకాశింపజేసేది (స్వీయాదు లైదుగురకు ఉదాహరణములున్నవి). ఈమె నాలుగు విధాలు :

స్మితగర్వితః స్వీయస్మితగర్వం వక్రోక్తులద్వారా ప్రకాశింపజేసేది.

యౌవనగర్వితః స్వీయయౌవనగర్వం " "

సౌకుమార్యగర్వితః స్వీయసౌకుమార్యగర్వం " ,,

విలాసగర్వితః స్వీయవిలాసగర్వం " "

3. సౌభాగ్యగర్వితః స్వీయ సౌభాగ్యగర్వం వక్రోక్తులు ద్వారా ప్రకాశింప జేసేది.

4. నైపుణ్య గర్వితః స్వీయనైపుణ్యాన్ని వక్రోక్తుల ద్వారా ప్రకాశింపజేసేది.

టీకః శృం.మం.లో ఈభేదం క్రొత్తగా చెప్పబడింది. ప్రాచీనులెవ్వరూ దీనివి వేరే భేదంగా చెప్పలేదు. భానుదత్తుడు చెప్పిన ప్రవత్స్యత్‌పతికాభేదాన్ని, ఈ వక్రోక్తి గర్వితాభేదాన్ని కలిపితే మొత్తం నాయికలు (లేదా నాయికావస్థలు) పదిఅవుతాయి.

కొన్ని ఉదాహరణలు :

1. స్వాధీనపతికః

ఎంతచక్కని హడెనాసామి (యదుకులకాంభోజి—ఆది) క్షేత్రయ్య

ఎందుదాచుకొందునిన్ను (కల్యాణి—ఝంప) "

కిసలయశయనతలేకురుకామిని (వాదనామక్రియ —ఆది) జయదేవుడు

2. వాసకసజ్జః

అవునమ్మా! మీకేమి అందరు (భైరవి త్రిపుట)

రారా! మాయింటికి రాతిరి నిన్ను (పంతువరాళి-త్రిపుట)

ఇంత ప్రొద్దాయె ఇంక వాడేమివచ్చీని ( " ")

3. విరహోత్కంఠితః

ముందటివలెనాపై నెనరున్నదా (భైరవి-త్రిపుట)

ఏమోరాడమ్మా! ఇందుండిపోయి (మోహన-త్రిపుట)

...సా విరహేతవ దీనా (సౌరాష్ట్ర-ఏక) - జయదేవుడు

4. విప్రలబ్ధ :

ఐరాదేనేస్తమమ్మలార! (ముఖారి-అఠ)

వదరక పోపోవే వాడేలవచ్చిని (కాంభోజి-త్రిపుట)

5. ఖండిత :

ఇంటికి రానిచ్చేనా? ఈమేనితో (సురట-త్రిపుట)

బాగాయె నీవగలెల్ల (సావేరి-చాపు)

చాలుచాలు ఈచిన్నెలతో.. (ముఖారి-అది)

రజని జనిత గురుజాగర రాగ... (భైరవి-అది) జయదేవుడు

6. కలహాంతరిత :

నాకోపమేనన్నింతజేసె-నమ్మా! (సైంధవి-అది)

మేరకాదు రమ్మనవే నాసామిని (కాంభోజి-త్రిపుట)

ఎందుకువచ్చెనో కోపమెవరేమన్నారు (బేగడ-ఏక)

హరిరభిసరతి వహతిమధుపవనే (య.కాం-అది) - జయదేవుడు.

7. ప్రోషితభర్తృక :

ఏమని తెలుపుదు ఏలాగుతాళుదు (ఆనందభైరవి-త్రిపుట)

ఎటువంటి మోహమోకాని (కాంభోజి-ఝంప)

8. అభిసారిక :

పిలువనంపె నన్నీవేళ.... (కేదారగౌళ-అది)

రతిసుఖసారేగతమభిసారే (ఘూర్జర-ఏక) - జయదేవుడు

9. వక్రోక్తిగర్వీత :

రమ్మనవే సముఖాన రాయ (కేదార-త్రిపుట)-క్షేత్రయ్య

10. ప్రవత్స్యత్పతిక :

పోయిరమ్మనే ముద్దుగుమ్మ (కేదారగౌళ-అది)

11. నాయకుడు :

అలిగియేల ఇందువచ్చితి (ఘంటారవం-రూపకం)

రామరామ ప్రాణసఖి (ఆహిరి-ఝంప)

మామియంచలితా విలోక్యా (ఘూర్జరి-యతి) — జయదేవుడు

# 11. నాయికా సహాయులు :

*(1)* దూతికలు :

మూలం : విజ్ఞాన గుణసంపన్నా కథినీ లింగినీ తథా ।
రంగోపజీవనా చాపి ప్రతిపత్తి విచక్షణా ॥
ప్రాతివేశ్యా సఖీ దాసీ కుమారీ కారు-శిల్పినీ ।
ధాత్రీ పాషండినీ చైవ దూత్య స్త్వీక్షణికా ॥
-(నా.శా.XXII-9-10)

అర్థం :విజ్ఞాన గుణసంపన్నా, కథినీ, లింగినీ (తథా) =చక్కని జ్ఞానంతో కూడుకొన్నది, కథిని (=బృహత్కథాదులందలి కథలు తెలిసినదై చక్కగా చెప్ప గలది), లింగిని (=చిత్రకారిణి); రంగోపజీవనా (చ-అపి), ప్రతిపత్తి విచ క్షణా=రంగోపజీవన (=చారణస్త్రీ లేదా రజకస్త్రీ), యుక్తి-ప్రతియుక్తులు చేయగలది; ప్రాతివేశ్యా, సఖీ, దాసీ, కుమారీ, కారు- శిల్పినీ =ప్రాతివేశ్య (=పొరుగింటి స్త్రీ), సఖి, దాసి, కుమారి (=బాలిక), కారు శిల్పినులు (=కుమ్మరిస్త్రీ కంచరస్త్రీ మొదలగువారు); ధాత్రీ, పాషండినీ (చ-ఏవ), ఈక్షణికా, దూత్యాం (తు) =ధాత్రి (=దాదికూతురు), పాషండిని (=వ్రత స్థురాలు), ఈక్షణిక (=జోస్యం చెప్పేస్త్రీ), (వీరు) దూత్యమందు (ఉప యోగపడతారు).

తాత్పర్యం : విజ్ఞాన గుణసంపన్న, కథిని, లింగిని, రంగోపజీవన, ప్రతిపత్తి విచక్షణ, ప్రాతివేశ్య, సఖి, దాసి, కుమారి, కారుశిల్పిని, ధాత్రి, పాషండిని, ఈక్షణిక - వీరు దూతీకర్మయందు నియమింపబడదగినవారు.

టీక : లింగిని మున్నగు కొన్ని పదాలకు అభినవభారతిని అనుసరించి పైన అర్థాలు వ్రాశాము; కాని అర్వాచీనులు వీనికి వేరే అర్థాలు చెప్పినారు:

లింగిని =పండిత కౌశికిమున్నగు యోగినులు; కారువు =రజకస్త్రీ; ధాత్రి =ధాత్రేయి =ఉపమాతృసుత =దాదికూతురు; శిల్పిని=చిత్రకారిణి =వీణావాద వాదులందు నిపుణురాలు; విప్రశ్నిక=దైవజ్ఞ (=ఈక్షణిక); రంగోపజీవన=నటి; ప్రాతివేశిని=పొరుగింటిస్త్రీ (=ప్రాతివేశ్య).

ధనంజయాదులు చేటిని (=పరిచారికను) కూడా పైపట్టికలో చేర్చినారు; అంతేకాదు, నాయిక స్వయంగా దూతీకర్మనెరవేర్చుకోవచ్చు - ఈమెను

'స్వయందూతి' అంటారు. వీరంతా "నేతృమిత్రగుణాన్వితాః" (=నాయక మిత్రుల యొక్క గుణాలను కలిగి ఉంటారు) అని చెప్పినారు.

*(2) దూతీ గుణాలు :*

మూలం : ప్రోత్సాహనేఽథ కుశలా మధురకథా దక్షిణాథకాలజ్ఞా ॥
లడహా సంవృతమంత్రా దూతీ త్వేభిర్గుణైః కార్యా ।
న జడం రూపసంపన్నం నార్థవంతం నాచాతురమ్ ॥
దూతం వాప్యథవా దూతీం బుధః కుర్యా త్కదాచన ।
-(నా.శా.XXIII-13)

అర్థం : ప్రోత్సాహనే, (అథ) కుశలా, మధురకథా, దక్షిణా, (అథ) కాలజ్ఞా =నాయకుని ప్రోత్సహించుటయందు కుశల, మధురమైన కథలు చెప్పగలది, దక్షిణ, కాలజ్ఞ; లడహా, సంవృతమంత్రా, ఏభిః, గుణైః, దూతీ(తు), కార్యా=ప్రగల్భ, సంవృతమంత్ర (=రహస్యాన్ని దాచగలది) - ఇటువంటి, గుణాలతో కూడిన (స్త్రీని) దూతిగా పంపించాలి; న-జడం-రూపసంపన్నం, న-అర్థవంతం, న-చ-ఆతురమ్=జడత్వం, రూపసంపద, అర్థ సంపద (=ధనం), ఆతురత- ఈగుణాలు కలవ్యక్తిని; దూతం, వా, (అపి) (అథవా), దూతీం బుధః, (న) కదాచన, కుర్యాత్ =దూతగా లేదా దూతిగా బుధుడు, ఎన్నడును, నియోగించరాదు.

తాత్పర్యం : నాయకుని ప్రోత్సహించటం (=సంముఖీకరణం)లో కుశల, మధుర కథాయుత, దక్షిణ, కాలజ్ఞ, ప్రగల్భ, సంవృతమంత్ర అయిన స్త్రీని దూతిగా పంపించాలి. జడత్వం, రూపసంపద, అర్థం, ఆతురతకల వ్యక్తిని దూతగా లేదా దూతిగా ఎన్నడును పంపరాదు.

టీక : జడత్వం ఉంటే చేయవలసిన పనిచేయలేరు; ప్రత్యుత్పన్నమతి సాధ్యాలయిన పనులు వారికి శక్యమేకావు. రూపంకాని, ధనం కాని ఉంటే స్వార్థంకోసం ప్రయత్నించగలరు. ఇంక ఆతురత కలవ్యక్తి జుగుప్సా హేతువు కావచ్చు. 'ప్రోత్సాహనమున కుశల' అన్నప్పుడు ప్రోత్సాహనశబ్దంలో రెండు ప్రేరణార్థకములు కలవు - నాయికచేత ప్రోత్సహింపబడి, నాయకుని ప్రోత్సహించటంలో కుశల అని అర్థం.

*(3) దూతీ కృత్యాలు (నా.శా.XXIII-11-12, 13-17) :*

అనేక కారణాలను పేర్కొని ఉత్సాహపర్చటం, సందేశాన్ని చక్కగా విన్నవించటం, నాయిక యొక్క భావాన్ని సరిగా ప్రదర్శించటం - ఇవి దూతి చేయవలసిన ముఖ్యమైన పనులు. అంతేకాదు. నాయికయొక్క కుల-భోగ-ధనాధిక్యాలను అధికంగా పొగడి, కామాన్ని నివేదించి, సమాగమోపాయాలను సూచించాలి. అకామ ప్రవృత్త (=కామప్రవృత్తిలేని స్త్రీ) లేదా క్రుద్ధురాలు అయిన స్త్రీతో సంగమం కలిగించరాదు. అసలు, ఉపాయరహితంగా సంగమం కలిగించరాదు. ప్రథమ సమాగమాన్ని (=గాంధర్వ వివాహ-వేశ్యా-పునర్వ్యాసంగమాలను) రాత్రి జరిగే ఉత్సవసమయాలలో, ఉద్యానంలో, మిత్రగృహంలో, ధాత్రీగృహంలో, సఖీగేహంలో, శూన్యాగారంలో ఏర్పాటుచేయాలి. జబ్బుగా ఉన్నవారిని చూడాలి లేదా ఆహ్వానం అనే మిష కల్పించి, విధిపూర్వకంగా, ఉపాయసహితంగా ప్రథమసమాగమం కలిగించాలి.

సఖిని క్రిందివిధంగా నిరూపించినాడు రసమంజరీకర్త :

మూలం : విశ్వాస విశ్రామకారిణీ, పార్శ్వచారిణీ సఖీ. అస్యా
మండనోపాలంభ-శిక్షా-పరిహాస - ప్రభృతీని కర్మాణి ।

— నాయికయొక్క విశ్వాసానికి పాత్రమైనది, ఆమెతో కూడా ఉండేది సఖి. మండనం(=నాయికను అలంకరించటం), ఉపాలంభం (=నాయకాదులను నిందించటం), శిక్ష (=కర్తవ్య బోధ), పరిహాసం (=సఖి వలెనే, నాయకుడు నాయికను గేలిచేయటం లేదా నాయిక నాయకుని గేలిచేయటం) మున్నగునవి దూతి చేయవలసి పనులు.

"పరిహాస ప్రభృతీని" అన్నదానిని పురస్కరించుకొని రసమంజరీవ్యాఖ్యాత - ప్రశంస, వినోదం, మానాపనోదం, మానోపదేశం, ఆశయప్రశ్న, విరహాశ్వాసం, వన-జల-డోలాకేళులు, పాంచాల - కందుక - భ్రమణ - నయన మీలన - ద్యూత -మధు పానకేళులు - కృత్యాలుగా అధికంగా చెప్పినాడు. వీటి అన్నింటికి వంచన, హల్లీసకం, పుష్పావచయం, వసంతకేళి అనే వాటిని అధికంగా చేర్చి, కొన్ని పదాల అర్థాలను వివరించినాడు శృంగారమంజరీకారుడు.

ఉపాలంభం రెండు విధాలు : నాయికోపాలంభం, నాయకోపాలంభం.

శిక్ష కూడా రెండు విధాలు : నాయికాశిక్ష, నాయకశిక్ష.

పరిహాసం మూడు విధాలు : సఖీపరిహాసం, నాయికా పరిహాసం, నాయక పరిహాసం.

ప్రశంస : స్తోత్రం.

మనోవినోదం రెండు విధాలు : నాయకయొక్క మానం (=కోపం) పోగొట్టడం, నాయకుని యొక్క మానం పోగొట్టటం.

భ్రమణకేళి : చరణాలు చరణాలతో కలిపి, కరాలు కరాలతో పట్టుకొని, నిరంతరంగా ఇరువురు భ్రమించటం.

దూతిని క్రిందివిధంగా నిరూపించినాడు రసమంజరీకారుడు :

మూలం : దూత్య వ్యాపార పారంగతా దూతీ తస్యాః
సంఘటన విరహ నివేదనాదీని కర్మాణి ॥

— దూత్య వ్యాపారమందు పారంగత అయినది దూతి అనబడుతుంది. సంఘటన (=నాయికానాయకులను కలపటం), విరహనివేదనమున్నగునవి ఆమె పనులు.

దూతివిషయంలో శృంగారమంజరీకారుడిట్లా విశదీకరించినాడు :

దాసి, సఖి, కారువు, ధాత్రేయి, ప్రాతివేశిని, లింగిని, శిల్పిని, స్వయం - ఇట్లా దూతి ఎనిమిది విధాలు.

లింగిని=వేషధారిణి, శిల్పిని=చిత్రకారిణి (=చిత్రపటాలు తెచ్చేది). ఈ ఎనిమిది మందికితోడు - యోగిని (=ప్రవ్రజిత), బాల(=అజ్ఞాతమన్మథ), సంబంధిని (=బంధువు), విప్రశ్నిక (=శకునజ్ఞాపిక), విశ్వస్త(=విధవ), నటి (=గాన-నటన పాటవవతి) - ఈ ఆరుగురిని కూడా దూతికలుగా అంగీకరించినాడు రసమంజరీవ్యాఖ్యాత. (8+6) ఈ 14 మందికి విక్రేత్రి, శంకిత అనే మరో రెండు భేదాలు చేర్చినాడు శృంగారమంజరీకారుడు. కాగా, మొత్తం 16 భేదాలు.

విక్రేత్రి : వస్తువిక్రయకారిణి, ఈ విక్రేత్రి అనేక విధాలు - కాచవిక్రేత్రి, పటవాస విక్రేత్రి, మణి విక్రేత్రి, ప్రసూన విక్రేత్రి అనే నాలుగు విధాలు రమణీయాలు.

శంకిత : నాయిక ఆడిన పరుషవాక్యాలు విని నాయకుడు విముఖుడు కాగలడన్న భయంతో, పరుషదూత్యవ్యాపారం నిర్వహించేది.

ప్రవ్రజిత, విప్రశ్నిక, వేషధారిణి - వీరు లింగిని భేదాలు.

సంఘటన, విరహనివేదన, అనురాగనివేదన, ప్రోత్సాహనం, నాయకాన్య సంభోగకథనం, సందేశహారిత, చిత్తజ్ఞత్వం - ఇవి దూతీవ్యాపారాలు.

విరహ-అనురాగాది వేదనలు-ప్రోత్సాహన-సందేశహారితలు —వీరు రెండేసి విధాలు - నాయికా పక్షం, నాయకపక్షం. హంసాదులు కూడా దూతలుగా నియుక్తం కావటం సాహిత్యంలో ప్రచురంగా కానవస్తున్నది. అంతేకాదు మేఘంవంటి జడాలు కూడా దూతలుగా వినియోగింపబడటం సహృదయులకు తెలిసిన సత్యమే.

# 12. అభ్యంతర పరివారం :

నాట్యమందలి ప్రకృతుల ఉపచారం (=వ్యవహారం) రెండు విధాలు— బాహ్యం, అభ్యంతరం. ఈ రెండింటికి తగిన పరివారం వేరువేరుగా ఉంటుంది. బాహ్యవ్యవహారాలకు తగిన పరివారాన్ని నాయక ప్రకరణంలో వివరించాను. ఇంక అభ్యంతర (=అంతఃపుర) వ్యవహారాలకు తగిన పరివార్నాన్ని ఇప్పుడు వివరిస్తాను. భరతముని అభ్యంతర పరివారాన్ని 18 వర్గాలుగా విభజించినాడు (నా.శా.XXIV-26-64; 64-72) :

మూలం : మహాదేవీ, తథా దేవ్యా, స్వామిన్యా, స్థాపితా అపి ।
భోగిన్యా, శిల్పకారిణ్యో, నాటకీయాఽథ నర్తకీ ॥
అనుచారికాశ్చ విజ్ఞేయా స్తథా చ పరిచారికాః ।
తథా సంచారికాశ్చైవ తథా ప్రేషణకారికాః ॥
మహత్తర్యః ప్రతీహార్యః కుమార్యః స్థవిరా అపి ।
ఆయుక్తికాశ్చ నృపతే రయం మంతఃపురో జనః ॥
-(నా.శా.XXIV-26-32)

యత్ స్యాత్ నపుంసకం నామ తృతీయా ప్రకృతిః స్మృతాః ॥
సాఽప్యంతఃపురసంచారే యోజ్యా పార్థివవేశ్మని ।
స్నాతకాః కంచుకీయాశ్చ తథా వర్షధరాః పునః ॥
ఔపస్థాయికనిర్ముండాః కక్షాస్థానేషు యోజయేత్ ।
అపుమాంసస్తు యే పురుషా యే తు స్త్రీభోగ వర్జితాః ॥
ఏతే త్వంతఃపురచరాః కార్యా నిత్యం హి నాటకే ।
-(నా.శా.XXIV-68-70)

తాత్పర్యం : *1.* మహాదేవి, *2.* దేవులు, *3.* స్వామినులు, *4.* స్థాపితలు, *5.* భోగినులు, *6.* శిల్పకారిణులు, *7.* నాటకీయులు, *8.* నర్తకి, *9.* అనుచారికలు, *10.* పరిచారికలు, *11.* సంచారికలు, *12.* ప్రేషణకారికలు, *13.* మహత్తరులు, *14.* ప్రతీహారులు, *15.* కుమారికలు, *16.* స్థవిరలు,

*17.* ఆయుక్తికలు.

-వీరు రాజుయొక్క అంతఃపురమందలి జనులు.

వీరినేకాక ఇంతకుముందు తృతీయప్రకృతిగా పేర్కొనబడిన నపుంసకులను కూడా పార్థివవేశ్మంలో (=రాజసౌధంలో) అంతఃపుర సంచారమందు నియోగించాలి— స్నాతకులు, కంచుకీయులు, వర్షధరులు, ఔపస్థాయిక- నిర్ముండులు - వీరు అభ్యంతర పరివారంలోని 18 వ వర్గం; ఆయా కక్ష్యా స్థానములందు నియుక్తులు కావలసినవారు. ఇట్లా అపురుషులు, స్త్రీభోగ విగర్హితులు అయినవారినే అంతఃపుర సంచారమందు, నాటకంలో నియుక్తులు చేవలి.

ఇంక, ఆయావర్గాలవారి గుణాదులు—

(1) మహాదేవి (పట్టపు రాణి = సమ్రాజ్ఞి) :

మూలం : (అత్ర) మూర్ధాభిషిక్తా యా కులశీల సమన్వితా ।
గుణైః యుక్తా వయఃస్థా చ మధ్యస్థాఽ క్రోధనా తథా ॥
ముక్తేర్ష్యా నృపశీలజ్ఞా సుఖ-దుఃఖ సహా సమా ।
శాంతి స్వస్త్యయనై ర్భర్తుస్సతతం మంగలైషిణీ ॥
శాంతా పతివ్రతా ధీరా అంతఃపురహితే రతా ।
ఏభి ర్గుణైస్తు సంయుక్తా మహాదేవీ త్యుదాహృతా ॥
-(నా.శా.XXIV-33-35)

తాత్పర్యం : మూర్ధాభిషిక్త (=పట్టపురాణి) 'మహాదేవి' అనబడుతుంది. కుల-శీల సమన్విత, గుణయుక్త, మధ్యవయస్సులో ఉన్నది, అక్రోధన, ఈర్ష్యను విడనాడినది, నృపునిశీలం గుర్తించినది, సుఖ-దుఃఖాలను సమానంగా సహింపగలది, ఎల్లప్పుడును భర్తకు మంగళం కోరేది, శాంతచిత్త, పతివ్రత, ధీర, అంతఃపుర హితమునందు ఆసక్తి కలది - ఇట్టిది 'మహాదేవి' అనబడుతుంది.

టీక : మహాదేవి అధికంగా శృంగారోచితకాదు. శృంగారోచితలు రాజపుత్రికలు అయినట్లే వాసవదత్తాదులనే కవులు 'దేవి' అని వ్యవహరించినారు. మహాదేవి పదానికి అర్థాలు ఒక్కటెయే; కావుననే 'మహాదేవి' అని ఏకవచనం ప్రయుక్తమైనది. దేవులు, స్వాములు మున్నగువారు అనేకులుండవచ్చు. అందుచేనే వారికి బహువచనం ప్రయుక్తమైనది (అ.భా.3 వ సంపుట 254).

ప్రాచీనభారతంలో రాజునకు పలువురు భార్యలుండటం సంప్రదాయం. బిందుసారు నకు 16 గురు, వత్సరాజామాయుడగు మహాసేనునకు 16 గురు భార్యలున్నారట!

(2) దేవులు (= రాణులు) :

మూలం : ఏభిరేవ గుణై ర్యుక్తాః తత్సంస్కార వివర్జితాః ।
గర్వితా శ్చాతిసౌభాగ్యాత్ పతిసంభోగతత్పరాః ॥
శుచినిత్యోజ్జ్వలాకారాః ప్రతిపక్షాభ్యసూయికాః ।
వయోరూప గుణాఢ్యా యా స్తా దేవ్య ఇతి భాషితాః ॥
-(నా.శా.XXIV-36-37)

తాత్పర్యం : మహాదేవీగుణాలు కలవారు; అయినప్పటికీ ఆమెవలె సంస్కారం (=మూర్ధాభిషేకం మొ ॥) పొందినవారు కారు. కాని అతి సౌభాగ్యంవల్ల గర్వితలు. పతిసంభోగతత్పరలు. శుచులు. నిత్యోజ్జ్వలాకారలు, ప్రతిపక్షమునందసూయకలవారు. వయోరూపగుణాఢ్యలు - ఇట్టివారు 'దేవులు' అనబడతారు.

టీక : దేవీ, స్వామినీ మున్నగుపదాలను ఘోష్ ఏకవచనంలో గ్రహించినప్పటికీ, అనువాదంలో బహువచనమే వాడినారు. 'దేవి' అనే పదానికి 'దేవులు' బహువచనం. దేవి ఒక్కతే ఉండవచ్చు లేదా పలువురుండవచ్చు. 'గర్వితాశ్చాతి సౌభాగ్యాత్' అన్నదానిని 'గర్వితా రాజపుత్రీచ' అని గ్రహించి నాడు ఘోష్. అంటే, దేవి గర్విత, రాజపుత్రి అని అర్థం. దేవి రాజపుత్రిక కావటమే సమంజసం. ఇంక స్వామినులు మున్నగువారు సేనాపతి, అమాత్యుల పుత్రికలు.

(3) స్వామినులు (= ఉన్నతవంశ సంజాతలు) :

మూలం : సేనాపతే రమాత్యానాం భృత్యానా మథవా పునః ।
కన్యేయః ప్రసాదాత్ స్వామిన్యః ప్రతిసమ్మానవర్ధితాః ॥
శీలరూప గుణై ర్యుక్తా వతివశ్యా నృపవల్లభాః ।
స్వగుణైః లబ్ధమాహాత్మ్యా స్వామిన్య ఇతి తాః స్మృతాః ॥
-(నా.శా.XXIV-38-39)

తాత్పర్యం : సేనాపతుల, లేదా అమాత్యుల, లేదా తదితర రాజభృత్యుల తనయలు 'స్వామినులు' అనబడతారు. వీరు ప్రతి-సమ్మానాలవల్ల వృద్ధి పొందినవారు. వీరు స్వగుణాలచేతనే లభించిన మాహాత్మ్యం (=ఉన్నతస్థితి) కలవారు.

(4) స్థాయినులు (పాఠాంతరం 'స్థాపితలు') (= సామాన్య భార్యలు) :

మూలం : రూపయౌవన శాలిన్యః కర్కశా విభ్రమాన్వితాః ।
రతిసంభోగకుశలాః ప్రతిపక్షాభ్యసూయికాః ॥
ఉత్థితాశ్చాప్రమత్తాశ్చ త్యక్తాలస్యా హ్యనిష్ఠురాః ।
మాన్యామాన్య విశేషజ్ఞాః స్థాయిన్యః సంప్రకీర్తితాః ॥
-(నా.శా.XXIV-40,42)

తాత్పర్యం : రూప-యౌవన శాలినులు, కర్కశలు (=సౌభాగ్యగర్వితలు), విభ్రమ చేష్టలు కలవారు, రతిసంభోగకుశలలు, ప్రతిపక్షమందు అసూయ కలవారు, సదాసావధానలు, కార్యములందు అప్రమత్తలు, అలసతలేనివారు, అనిష్ఠురలు, మాన్యామాన్య విశేషజ్ఞలు - ఇట్టివారు స్థాయినులు.

(5) భోగినులు (= వేశ్యలు) :

మూలం : దక్షా స్వటా హ్యుదాత్తాశ్చ గంధమాల్యోజ్జ్వలాః సదా ।
నృపతిచ్ఛంద వృత్తాశ్చ సర్వత్రేర్ష్యావివర్జితాః ॥
సుశీలా లఘుసమ్మానా మృదు ర్నాత్యుద్ధతా స్తథా ।
మధ్యస్థా నిభృతాః క్షాంతా భోగిన్య ఇతి తాః స్మృతాః ॥
-(నా.శా.XXIV-41, 43)

తాత్పర్యం : దక్షలు, కుటిలత్వం లేనివారు, ఉదాత్తలు, గంధ-మాల్యాలతో ఉజ్జ్వలంగా ఉండేవారు, నృపతి ఇంగితాన్ని ఎరింగి ప్రవర్తించేవారు, ఎన్నడూ ఈర్ష్యలేనివారు, సుశీలలు, కులీనుల గౌరవంకోరనివారు, సుకుమారులు, అత్యుద్ధతలు కానివారు, మధ్యస్థలు (ప్రతిపక్షమందు అసూయ లేని వారు), గంభీరలు, క్షాంతలు - ఇట్టివారు 'భోగినులు'.

(6) శిల్పకారికలు (= శిల్పకారిణులు)

మూలం : నానాకలా విశేషజ్ఞా నానాశిల్ప విచక్షణాః ।
గంధపుష్ప విభాగజ్ఞా నానాలేఖ్య విశారదాః ॥
శయ్యోపచారజ్ఞానజ్ఞా మధురా శ్చతురా స్తథా ।
దక్షా సౌమ్యాః స్ఫుటాః శ్లక్ష్ణా నిభృతాః శిల్పకారికాః ॥
-(నా.శా.XXIV-44-45)

తాత్పర్యం . నానాకలా విశేషజ్ఞలు, నానాశిల్ప విచక్షణలు, గంధ-పుష్ప విభాగజ్ఞలు (=పుష్పాలనుంచి అత్తరు తయారుచేసేవారు), నానాలేఖ్య విశారదలు, శయన-ఆసన- యానజ్ఞలు, మధుర స్వభావలు, చతురలు, దక్షలు, సౌమ్యలు, స్ఫుటలు, శ్లక్ష్ణలు, నిభృతలు - ఇట్టివారు శిల్పకారికలు.

టీక : ఈ పనులన్నీ ఒక్కరే చేయజాలదు; ఒక్కొక్క పనియందు ఒక్కొక్కరు నిపుణులుగా ఉంటారు; అందుచేత శిల్పకారికలు పలువురుంటారు.

(7) నాటకీయలు :

మూలం : (అథ) రూపగుణౌదార్య-సౌభాగ్య-ధైర్య-శీల సంపన్నాః
పేశల-మధుర-స్నిగ్ధానువాది కలచిత్రకంఠ్యశ్చ ॥
హేలాభావ విశేషజ్ఞాః సత్త్వేనాభినయేన చ ।
మాధుర్యేణ చ సంపన్నా హ్యాతోద్యకుశలా స్తథా ॥
స్వరతాలయతిజ్ఞాశ్చ తథాచార్యోపసేవికాః ।
చతురా నాట్యకుశలా శ్చోహాపోహా విచక్షణాః ॥
నిపుణా భాండవాద్యేషు నాటకీయాః ప్రకీర్తితాః ।
-(నా.శా.XXIV-46 5')

తాత్పర్యం : రూప-గుణ-ఔదార్య-సౌభాగ్య-ధైర్య-శీల సంపన్నలు, పేశల-మధుర-స్నిగ్ధ కంఠధ్వని కలవారు, విచిత్రమై ఆశ్చర్యకరం అయిన స్వరం కలవారు, హేలా-భావవిశేషజ్ఞలు, సాత్త్వికాభినయ (=రస-భావ ప్రకటన) మందు సమర్థలు, మధుర స్వభావలు, ఆతోద్యములందు నేర్పరులు, స్వర-తాల-యతి జ్ఞానం కలవారు, ఆచార్యుని సేవించినవారు, చతురలు, నాట్యకుశలలు, ఊహా-అపోహా విచక్షణలు, భాండవాద్యమందు నిపుణలు - ఇట్టివారు నాటకీయలు.

టీక : స్వర్గంలో రంభాదులయందు ఎట్లాం ప్రతిష్ఠితమైనట్లుగా, భూలోకమందు రాజాంతఃపురాలలో అంగనాజనం నాట్యం ప్రదర్శించటం జరుగుతుందని భరతముని 26 వ అధ్యాయంలో పేర్కొన్నాడు. కాగా, ఈ నాటకీయలు రాజాంత-పురంలో నాట్యం ప్రదర్శించే వారన్నమాట! శ్రీహర్షుని 'ప్రియదర్శిక'లో ఇట్టి సన్నివేశం ఉన్నది.

*(10)* పరిచారికలు :

మూలం : శయ్యాపాలీ ఛత్రధారీ తథా వ్యజనధారిణీ ॥
సంవాహికా గంధయోక్త్రీ తథా చైవ ప్రసాధికా ।
తథాభరణయోక్త్రీ చ మాల్యసంయోజికా తథా ॥
ఏవం విధా భవేయు ర్యాః తా విజ్ఞేయాః పరిచారికాః ।
-(నా.శా.XXIV-53-55)

తాత్పర్యం : శయ్యాపాలి (=శయ్యను అలంకరించేది), ఛత్రధారిణి, వ్యజన ధారిణి, సంవాహిక (=కాళ్ళుపిసికేది), గంధయోక్త్రి (=సువాసన ద్రవ్యాలను సిద్ధంచేసేది), ప్రసాధిక (=అలంకరణచేసేది), అభరణయోక్త్రి, మాల్యసంయోజిక - వీరు 'పరిచారికలు'.

*(11)* సంచారికలు :

మూలం : నానాకక్ష్యా విచారిణ్యః తథోపవనసంచరాః ॥
దేవతాయతన క్రీడా ప్రాసాదపరిసంచరాః ।
యామకిన్య స్తథా చైవ యాశ్చైవం లక్షణాః స్త్రియః ॥
సంచారికాస్తు విజ్ఞేయా నాట్యజ్ఞైః సముదాహృతాః ।
-(నా.శా.XXIV-55-57)

తాత్పర్యం : అంతఃపురమందలి అయాకక్ష్యలను పరిశీలించేవారు, ఉపవన సంచారికలు, దేవతాయతన (=గుడి) - క్రీడాప్రాసాద సంచారికలు, యామ కినులు (=ప్రతియామమునందు గంటలు కొట్టేవారు), ఇంకా ఇటువంటి లక్షణాలు కలవారు 'సంచారికలు'.

*(12)* ప్రేషణచారికలు (=ప్రేషణకారికలు = ప్రేషణికలు) :

మూలం : ప్రేషణే కామ సంయుతే తథా గుహ్యసముత్థితే ॥
నృపై ర్యాస్తు నియుక్తాః తాః జ్ఞేయాః ప్రేషణచారికాః ।

తాత్పర్యం : కామసంయుతాలు, రహస్యకార్యోదయాలు అయిన ప్రేషణము (=దూతీకృత్యము)లందు నృపులచేత నియుక్తులయ్యేవారు 'ప్రేషణచారికలు'.

టీక : దూతికలు బాహ్యోపచారమందు నియుక్తులవుతారు. ఇంక ఈ ప్రేషణచారికల దౌత్యం అంతఃపురంలోని బహుభార్యలకు పరిమితమైనది కావచ్చు.

**(13)** మహత్తరులు (=మహత్తరలు) :

మూలం : సర్వాంతః పురరక్షాయాం స్తుతిస్వస్త్యయనాదిభిః ॥
యా వృద్ధి మభినందంతి మహత్తర్యస్తు తాః స్మృతాః ।
-(వా.శా.XXIV-58-59)

తాత్పర్యం : స్తుతి-స్వస్తి-అయనములు నిర్వహిస్తూ, సర్వాంతఃపురరక్షణ మును అభివృద్ధిని కాంక్షించే వారు మహత్తరులు (మహత్తరి - బహువచనం - మహత్తరులు)

**(14)** ప్రతీహారులు :

మూలం : సంధివిగ్రహసంబద్ధ నానాచార సముత్థితమ్ ॥
నివేదయంతి యాః కార్యం ప్రతీహార్యస్తు తాః స్మృతాః ।
-(వా.శా.XXIV-59-60)

తాత్పర్యం : సంధి-విగ్రహాలకు సంబంధించిన, వివిధచారులవలన సేకరింప బడిన కార్యాలను ప్రభువునకు నివేదించే వారు ప్రతీహారులు.

**(15)** కుమారికలు :

మూలం : అప్రాప్తరతి సంభోగా అసంభ్రాంతా అనుద్ధతాః ॥
నిభృతాయాః సలజ్జాశ్చ తాః కుమార్య ఇతి స్మృతాః ।
-(వా.శా.XXIV-60-61)

తాత్పర్యం : అప్రాప్తరతి సంభోగలు, అసంభ్రాంతలు, అనుద్ధతలు, నిభృతలు, లజ్జావతులు— ఇట్టివారు కుమారికలు.

**(16)** వృద్ధలు (=వృద్ధురాండ్రు) :

మూలం : పూర్వరాజనయాభిజ్ఞాః పూర్వరాజాభిపూజితాః ॥
పూర్వరాజానుచరితాస్తా వృద్ధా ఇతి సంజ్ఞితాః ।
-(వా.శా.XXIV-61-62)

తాత్పర్యం : పూర్వరాజసంప్రదాయజ్ఞలు, పూర్వరాజాభిపూజితలు, పూర్వరాజచరితజ్ఞలు - ఇట్టివారు 'వృద్ధలు'.

*(17)* ఆయుక్తికలు :

మూలం : భాండాగారే ష్వధికృతా ఆయుధాది కృతా స్తథా ॥
ఫలమూలౌషధీనాం చ తథా చై వాన్నవీక్షికాః ।
గంధాభరణ మాల్యానాం వస్త్రాణాం చైవ చింతికాః ॥
బహ్వర్థేషు నియుక్తా యా ఆయుక్తికా ఇతి స్మృతాః ।
-(నా.శా.XXIV-62-64)

తాత్పర్యం : భాండాగారాధికృతలు, ఆయుధాగారాధికృతలు, ఫల - మూల - ఔషధులకు అధికారిణులు, అన్నవీక్షణికలు (=రాజుతినే అన్నం పరీక్షించేవారు), గంధ - మాల్య - ఆభరణ - వస్త్ర చింతికలు, ఇంకా అనేక అర్థములందు నియుక్తలు - వీరందరు ఆయుక్తికలు.

టీక : పై 17 వర్గములవారిని వివరించి, చివర "ఇత్యంతఃపుర చారిణ్యః స్త్రియః ప్రోక్తాః సమాసతః" అని భరతముని పేర్కొన్నాడు. అంటే అంతఃపురమందు చరించే స్త్రీలను సంక్షిప్తంగా వివరించాను అని అర్థం. (ఇంక 18వ వర్గమైన నపుంసకులను గూర్చి తరువాత వివరించినాడు.) ఆయా కార్యములందు నియుక్తులు కాదగిన వ్యక్తులు క్రింది విశేషగుణాలు కలవారు కావాలి:

"అనురక్తలు, భక్తురాండ్రు, రాజ్యమందలి అనేక పార్శ్వములనుండి వచ్చిన వారు, అనుద్ధటలు, అసంభ్రాంతలు, అలుబ్ధలు, అనిష్ఠురలు, దాంతలు క్షాంతలు, ప్రసన్నలు, జితక్రోధలు, జితేంద్రియలు, కామరహితలు (=ఇతరుల యెడ కామమును ర్రేకెత్తించలేనివారు), లోభహీనలు, స్త్రీదోషవివర్జితలు - ఇట్టివారినే అంతఃపురమందలి ఆయా కార్యములందు నృపుడు నియోగించాలి" (నా.శా.XXIV-65-68).

*(18)* నపుంసక వర్గం :

*(అ)* స్నాతకులు :

మూలం : ద్వాఃస్థంతు స్నాతకం కుర్యా దార్య మాచారసంయుతమ్ ।
బ్రాహ్మణాః కుశలా వృద్ధా కామదోషవివర్జితాః ।
ప్రయోజనేషు దేవీనాం నియోక్తవ్యా నృపైః సదా ॥

తాత్పర్యం : ఆర్యుడు, ఆచార సంయుతుడు అయిన స్నాతకుని ద్వారమందు నియోగించాలి. కుశలులు, వృద్ధులు, కామదోషవివర్జితులు అయిన

నపుంసకులు, నపుంసకుని 'మిశ్రప్రకృతి' అని కూడా అంటారు. అంటే సహజమైన అధమత్వం, స్వామిని అనుసరించి ఉండటంచేత సంక్రమించే ఉత్తమత్వప్రాప్తివలన నపుంసకుడు 'మిశ్రప్రకృతి' అవుతున్నాడు. రూపకములందలి శకారుడు, విటుడు, ప్రేష్యులు మున్నగు మిశ్రప్రకృతులందరూ అధమప్రకృతులుగానే గణింపబడతారు.

అంతఃపురసంచారంలో నపుంసకవర్గమే నియోగింపబడాలి.

ఆనంద నిష్యందిషు రూపకేషు
వ్యుత్పత్తిమాత్రం ఫలమల్పబుద్ధిః ।
యో౽పీతిహాసాదివదాహ సాధు
తస్మై నమః స్వాదుపరాఙ్ముఖాయ ॥6॥

దశరూపకం-I-6

రమ్యం జుగుప్సిత ముదార మథాపి నీచ
ముగ్రం ప్రసాది గహనం వికృతం చవస్తు ।
యద్వాప్యవస్తు కవిభావక భావ్యమానం
తన్నాస్తి యన్న రసభావముపైతి లోకే ॥

-దశరూపకం-IV-85

మంత్రే తీర్థే ద్విజే దైవే
దైవజ్ఞే భేషజే గురౌ ।
యాదృశీభావనాయత్ర
సిద్ధిర్భవతి తాదృశీ ॥

# భావాలు

మూలం : భావా నిదానీం వ్యాఖ్యాస్యామః. అత్రాహ-
భావా ఇతి కస్మాత్? కిం భవంతీతి భావాః ?
కిం వా భావయంతీతి భావాః? ఉచ్యతే-
'వాగంగ సత్త్వోపేతాన్ కావ్యార్థాన్ భావయంతీతి
భావా ఇతి'.
భూ ఇతి కరణే ధాతు స్తథా చ భావితం
వాసితం కృత మిత్యనర్థాంతరమ్. లోకేఽపి చ
ప్రసిద్ధమ్– అహో హ్యనేన గంధేన రసేన వా
సర్వమేవ భావిత మితి. తచ్చ వ్యాప్త్యర్థమ్.
శ్లోకా శ్చాత్ర-
విభావే నాహృతో యోఽర్థో హ్యనుభావైస్తు గమ్యతే
వాగంగసత్త్వాభినయైః స భావ ఇతి సంజ్ఞితః ॥
వాగంగ ముఖరాగేణ సత్త్వేనాభినయేన చ
కవే రంతర్గతం భావం భావయన్ భావ ఉచ్యతే ॥
నానాభినయ సంబద్ధాన్ భావయంతి రసా నిమాన్ ।
యస్మా త్తస్మా దమీ భావా విజ్ఞేయా నాట్యయోక్తృభిః ॥
-(నా.శా.VII-1-3)

అర్థం : ఇదానీం, భావాన్, వ్యాఖ్యాస్యామః =ఇప్పుడు, భావాలను, వ్యాఖ్యానిస్తాను.

అత్ర-ఆహ = ఇచ్చట (ఆత్రేయాదులు) చెప్పె (=అడిగి)నారు: భావాః, ఇతి, కస్మాత్=భావాలు, అని (ఆ పేరు) ఎట్లావచ్చింది? భవంతి, ఇతి, భావాః, కిం=భవంతి (=ఉన్నవి), అని, భావాలు, అనబడినవా? వా, భావయంతి, ఇతి, భావాః, కిం=లేదా, భావయంతి (=భావింపజేసేవి) అని, భావాలు, అనబడినవా?

ఉచ్యతే =(భరతమునిచేత) చెప్పబడుతున్నది.

వాక్-అంగ-సత్త్వ-ఉపేతాన్, కావ్య-అర్థాన్, భావయంతి - ఇతి, భావాః (ఇతి) =వాచిక - ఆంగిక - సాత్త్విక - అభినయాలతో కూడిన, కావ్యము లందలి అర్థాలను, భావింపజేసేవి, అవి (=కావున), భావాలు (అనబడినవి).

భూ, ఇతి, కరణే, ధాతుః ='భూ', అనేది, కరణము (=చేయటం) (అనే అర్థం గల) ధాతువు; తథా (చ), భావితం, వాసితం, కృతం, ఇతి, అనర్థ - అంతరమ్ =కావున, భావితం, వాసితం, కృతం, అని (ఇవి) ఏకార్థ కాలు; లోకే, అపి(చ), ప్రసిద్ధం =లోకంలో, కూడా, (ఇది) ప్రసిద్ధమే—

అహో, అనేన, గంధేన, వా రసేన, సర్వం-ఏవ, భావితం, ఇతి =ఓహో, ఈ, గంధంచేత, లేదా, ఈ రసంచేత, సర్వమూ, భావితం అయినది, అని (చెప్పటం). తత్(చ), వ్యాప్తి, అర్థం=అది, వ్యాప్తి (అనే) అర్థంలో, (ప్రయుక్తం). (ఇచ్చట 'భావం' అనేపదం వ్యాపించటం అనే అర్థంలో ప్రయుక్తమైనది).

అత్ర, శ్లోకాః (చ) =ఇచ్చట, (మూడు) శ్లోకాలు (ఉన్నవి): యః, అర్థః, విభావేన, ఆహృతః, =ఏఅర్థం, విభావంచేత, ఆహృతం (=నిష్పాదితం =పుట్టినది) అయి; అనుభావైః(తు) =అనుభావాలచేత; వాక్ - అంగ - సత్త్వఅభినయైః =వాచిక - ఆంగిక - సాత్త్విక అభినయాలచేత; గమ్యతే =గమ్యమానం (=అభివ్యక్తం అవుతుందో); సః, భావః, ఇతి, సంజ్ఞితః =అది, భావం, అని పేరుపొందింది.

వాక్ - అంగ - ముఖరాగేణ, సత్త్వేన - అభినయేన(చ) =వాచికం, ఆంగికం, ముఖరాగం, సాత్త్వికం - అనే అభినయాలచేత; కవేః, అంతర్గతం, భావం, భావయన్ =కవియొక్క, అంతరంగంలోని, భావాన్ని, భావింపజేయ టంచేత; భావః, ఉచ్యతే =భావం (అని) చెప్పబడుతున్నది; యస్మాత్, నానా-అభినయ సంబద్ధాన్, ఇమాన్, రసాన్, భావయంతి =ఎందుచేత, నానాభినయాలతో కూడిన, ఈ, రసాలను, భావింపజేస్తాయో; తస్మాత్, నాట్యయోక్తృభిః, అమీ, భావాః, విజ్ఞేయాః=అందుచేత, నాట్యవేత్తలచేత, ఇవి, భావాలు (అని), తెలియదగినవి.

తాత్పర్యం : "భావాలకు ఆ పేరు ఎట్లా వచ్చింది? 'భావాలు' అన్నప్పుడు 'భవంతి ఇతిభావాః' (=ఉన్నవికాన భావాలు) అని వ్యుత్పత్తియా? లేదా 'భావయంతి ఇతి భావాః' (=భావింపజేసేవి కావున భావాలు) అని వ్యుత్పత్తియా?" అని ఆత్రేయాది మహర్షులు అడిగిన ప్రశ్నకు భరతముని ఇట్లా సమాధానం చెప్పినాడు :

వాచిక - ఆంగిక - సాత్త్విక - అభినయోపేతములైన కావ్యార్థాలను (=రసాలను) భావింపజేసేవి కావున ఇవి 'భావాలు' అనబడినవి. 'భూ' అనే ధాతువునకు 'కరణం' (=చేయటం) అని అర్థం. కావుననే భావితం, కృతం, వాసితం అనేవదాలు ఏకార్థకములవుతున్నవి. లోకంలో కూడా 'అహో! ఈ గంధంచేత లేదా ఈ రసంచేత సర్వమూ భావితమైనది' అనటం ప్రసిద్ధమే. కావున 'భావ' పదానికి వ్యాప్తి లేదా వ్యాపించటం అని కూడా అర్థం. ఈ అంశాలను వివరించే ప్రాచీన శ్లోకాలు ఉన్నవి.

ఏ అర్థం విభావంచేత ఆహృతం (=నిష్పాదితం) అయి అనుభావాల చేత, వాగంగసత్త్వాభినయాలచేత గమ్యమానం (=అభివ్యక్తం) అవుతుందో, ఆ అర్థం 'భావం' అనబడుతుంది. కవ్యంతర్గతమైన భావాన్ని భావింపజేసేది అంటే ఆస్వాదయోగ్యంగా చేసేది కావున ఇది 'భావం' అనబడింది. వాగం గాది వివిధాభినయ సంబద్ధములైన రసాలను భావింపజేసేది కావున ఇది 'భావం' అనబడింది.

టీక : ప్రయోజనం, అభిప్రాయం, తాత్పర్యం, ఫలం, భావం - ఇవి పర్యాయపదాలు అని శారదాతనయుడు (II-119). కాగా, భావపదానికి మూడు ప్రసిద్ధార్థములున్నవి–

1. భావన (=ఉత్పాదించటం) - వివిధాభినయాల సాహాయ్యంతో కావ్యార్థాలను (=రసాలను) ఉత్పాదించటం.

2. ఈ రసాలను భావింపజేయటం.

3. వాసన (=వ్యాపించటం) - సహృదయుల హృదయాలలందు వ్యాపించటం (కస్తూరి కట్టిన వస్త్రమందు ఆ వాసన వ్యాపించినట్లు).

పై మూడు అర్థాలలో మొదటి రెండున్నూ కవి- నటలక్షణము దృష్టిలో పెట్టుకొన్నవి; ఇంక చివరిది ప్రేక్షకపరమైనది.

వర్ణనానిపుణుడైనవాడు కవి. 'కవ్యంతర్గతభావం' అంటే లౌకిక విషయ జన్యంకాక, అనాదిప్రాక్తనసంస్కార ప్రతిభానమయమై కవిలో భాసించే రాగాదికం. ఆ రాగాదులు కవిచేత, కావ్యమందు వర్ణింపబడతాయి. అవి, దేశ-కాలభేదరహితంగా, సర్వసాధారణీకరణభావంతో ఆస్వాదింపబడటానికి యోగ్యాలుగా ఉంటవి. అట్లా కవిచేత వర్ణితములైన భావాలు నటులచేత అభివ్యక్తములయినప్పుడు, అవి, విశిష్టచిత్తవృత్తులను (=సహృదయుల హృదయాలను) రసనయోగ్యాలుగా చేస్తాయి. అంటే కవిగతములైన రాగాదులను, నటుల ద్వారా, సహృదయగతములుగాచేసే చిత్తవృత్తి విశేషం 'భావం' అని సారాంశం. కావుననే, "రసానుకూల చిత్తవృత్తి విశేషం భావం" అని భానుదత్తుడు రసతరంగిణిలో పేర్కొన్నాడు. ఈ అంశాన్ని క్రిందివిధంగా మరింత స్పష్టం చేసినాడు స్థాయిభావవివరణలో భరతముని—

యోఽర్థో హృదయ సంవాదీ తస్య భావో రసోద్భవః ।
శరీరం వ్యాప్యతే తేన శుష్కం కాష్ఠ మివాగ్నినా ॥

-(నా.శా.VII-7)

ఏ అర్థం (సహృదయ) హృదయసంవాది అవుతుందో, తదర్థభావన (=చర్వణ లేదా సంవేదన) రసోద్భవ హేతువు అవుతుంది. శుష్కమైన (=ఎండిన) కాష్ఠమందు అగ్నివలెనే ఆస్వాదయోగ్యమైన ఆ అర్థం (=స్థాయిభావం) శరీరమంతటా వ్యాపిస్తుంది.

"తత్రాష్టౌ భావాః స్థాయినః; త్రయస్త్రింశ ద్వ్యభిచారిణః; అష్టౌ సాత్త్వికా ఇతి భేదాః. ఏవ మేతే కావ్యరసాభివ్యక్తి హేతవ ఏకోనపంచాశద్భావాః ప్రత్యవగంతవ్యాః. ఏభ్యశ్చ సామాన్య గుణయోగేన రసా నిష్పద్యంతే."

నాట్యశాస్త్రం 6వ అధ్యాయంలో భరతముని, 49 భావాలను మూడు వర్గాలుగా పేర్కొని, ఈ 49 భావాలయొక్క సామాన్య గుణయోగంవల్ల (చర్వ్యమాణములయిన ఈ భావాలవల్ల) రసాలు నిష్పన్నములవుతాయని వివరించినాడు. అంటే ఈ 49 భావాలు కావ్యరసాభివ్యక్తి హేతువులని అర్థం.

(అ) స్థాయి భావాలు (ఎనిమిది) :

రతి-ర్హాసశ్చ-శోకశ్చ-క్రోధోత్సాహౌ-భయం తథా ।
జుగుప్సా-విస్మయ శ్చేతి స్థాయి భావాః ప్రకీర్తితాః ॥

-(నా.శా.VI-17)

– 1. రతి, 2. హాసం, 3, శోకం, 4. క్రోధం, 5. ఉత్సాహం, 6. భయం, 7. జుగుప్స, 8. విస్మయం - ఈ ఎనిమిది స్థాయిభావాలు.

(ఆ) సంచారి (=వ్యభిచారి) భావాలు (ముప్పదిమూడు) :

నిర్వేద-గ్లాని-శంకాఖ్యా-స్తథాసూయా-మద-శ్రమాః ।
ఆలస్యంచైవ-దైన్యంచ-చింతా-మోహః-స్మృతి-ర్ధృతిః ॥
వ్రీడా-చపలతా-హర్ష-ఆవేగో-జడతా తథా ।
గర్వో-విషాద-ఔత్సుక్యం-నిద్రాపస్మార ఏవ చ ॥
సుప్తం-విబోధో-ఽమర్షశ్చా-వ్యవహిత్థ-మథోగ్రతా ।
మతి-ర్వ్యాధి-స్తథోన్మాద-స్తథా మరణ మేవ చ ॥
త్రాసశ్చైవ-వితర్కశ్చ-విజ్ఞేయా వ్యభిచారిణః ।
త్రయస్త్రింశ దమీ భావాః సమాఖ్యాతాస్తు నామతః ॥

-(నా.శా.VI-18-21)

– 1. నిర్వేదం, 2. గ్లాని, 3. శంక, 4. అసూయ, 5. మదం, 6. శ్రమ, 7. ఆలస్యం, 8. దైన్యం, 9. చింత, 10. మోహం, 11. స్మృతి, 12. ధృతి, 13. వ్రీడ, 14. చపలత, 15. హర్షం, 16. ఆవేగం, 17. జడత, 18. గర్వం, 19. విషాదం, 20. ఔత్సుక్యం, 21. నిద్ర, 22. అపస్మారం, 23. సుప్తం, 24. విబోధం, 25. అమర్షం, 26. అవహిత్థం, 27. ఉగ్రత, 28. మతి, 29. వ్యాధి, 30. ఉన్మాదం, 31. మరణం, 32. త్రాసం, 33. వితర్కం - ఈ ముప్పది మూడు సంచారి లేదా వ్యభిచారి భావాలు.

*(ఇ) సాత్త్విక భావాలు (ఎనిమిది) :*

స్తంభః-స్వేదోఽథ-రోమాంచః-స్వరభంగోఽథ-వేపథుః ।

వైవర్ణ్య-మశ్రు-ప్రలయ ఇత్యష్టౌ సాత్త్వికాః స్మృతాః ॥

-(నా.శా.VI-22)

– 1. స్తంభం, 2. స్వేదం, 3. రోమాంచం, 4. స్వరభంగం, 5. వేపథువు, 6. వైవర్ణ్యం, 7. అశ్రువు, 8. ప్రలయం. - ఈ ఎనిమిది సాత్త్వికభావాలు.

పురాణమిత్యేవ నసాధుసర్వం

నచాపి కావ్యం నవమిత్యవద్యమ్

సంతః పరీక్ష్యాన్యతరద్భజంతే

మూఢః పరప్రత్యయనేయ బుద్ధిః ॥

-మాలవికాగ్నిమిత్రమ్-ప్రస్తావన

# అనుభావాలు

## 1. అనుభావం :

మూలం : అథానుభావ ఇతి కస్మాత్? ఉచ్యతే. అనుభావ్యతేఽనేన
వాగంగసత్త్వకృతోఽభినయ ఇతి. అత్ర శ్లోకః :
వాగంగాభినయేనేహ యత స్త్వర్థోఽనుభావ్యతే ।
శాఖాంగోపాంగ సంయుక్త స్త్వనుభావ స్తతః స్మృతః ॥
-(నా.శా.VII-5)

అర్థం : ప్రశ్న : (అథ) అనుభావః, ఇతి, కస్మాత్? ='అనుభావం' అని, ఆ పేరు ఎట్లా వచ్చింది?

సమాధానం : ఉచ్యతే =చెప్పబడుతున్నది; వాక్-అంగ-సత్త్వ-కృతః, అభినయః, అనేన, అనుభావ్యతే, ఇతి =వాక్ (=వాచిక), అంగ(=ఆంగిక), సత్త్వ (=సాత్త్విక) (అభినయ)ములచేత చేయబడిన, అభినయం, దీనిచేత, అనుభావ్యం (=అనుభవయోగ్యం) అవుతుంది కాన, ఇది (అనుభావం), అని, (అనబడినది). ఈ సందర్భంలో ఒక శ్లోకం కలదు:

వాక్-అంగ-అభినయేన, ఇహ, యతః, అర్థః, అనుభావ్యతే =వాచిక, ఆంగిక, (సాత్త్విక) అభినయాలచేత, ఇచ్చట, ఎందుచేత, అర్థం (=కావ్యం యొక్క అర్థం), అనుభవ యోగ్యం అవుతున్నదో; తతః, అనుభావః, స్మృతః=తరువాత (=అందుచేత), అనుభావం, అని చెప్పబడింది; శాఖ-అంగ-ఉపాంగ సంయుక్తః (తు) =(ఈ అనుభావం) శాఖా (=హస్త) - అంగ-ఉపాంగ అభినయాలతో కూడి ఉంటుంది ।

తాత్పర్యం : ప్రశ్న : 'అనుభావము'నకు ఆ పేరు ఎట్లావచ్చింది?

సమా: వాగంగసత్త్వకృతమైన అభినయం దీనివల్ల అనుభావ్యమవుతుంది అంటే అనుభవయోగ్యంగా చేయబడుతుంది కావున ఇది 'అనుభావం' అనబడింది. ఈ సందర్భంలో ఒక శ్లోకం ఉంది : వాగంగాభినయాలచేత అర్థం

అనుభావ్యం అవుతుంది కావున అనుభావం అనబడింది. ఈ అనుభావం శాఖా (=హస్త)-అంగ-ఉపాంగసంయుక్తంగా ఉంటుంది.

టీక : "విభావం, అనుభావం అనేవి లోకప్రసిద్ధాలు. అవిలోక స్వభావానుగతంగా ఉంటాయి కాన అతిప్రసంగనివృత్త్యర్థం వాని లక్షణాలను వివరించటంలేదు" అని భరతముని పేర్కొన్నాడు. కాని, తరువాతి అలంకారికులు వానిని వివరించటానికి పూనుకొన్నారు. 'విభావ' విషయంలో ఆ వివరణలను పరిశీలించినాము. ఇంక అనుభావవిషయం.

"అను=పశ్చాత్, భావః=ఉత్పత్తిః, యేషాం తే అనుభావాః" అని 'అనుభావ' పదంయొక్క ఒక అర్థం. అంటే, కారణములైన రత్యాదులకు, అవ్యవహితంగా (=వెనువెంటనే) ఉత్పన్నములయ్యేవి 'అనుభావాలు'.

ఇంక రెండవ అర్థం – "అనుభావయంతి రత్యాదికం =రత్యాదిస్థాయిభావాలు, చింతాదివ్యభిచారిభావాలు సహృదయులకు అనుభవగోచరములగునట్లు చేసేవి" అని. శారదాతనయుడు విభావానుభావాలను ఇట్లా వివరించినాడు:

"అర్థా న్విభావయం తీతి విభావాః పరికీర్తితాః ।
విభావితార్థానుభూతి రనుభావ ఇతి స్మృతః" ॥ -(భా.ప్ర. I-32

– అర్థాలను విశిష్టంగా భావింపజేసేవి విభావాలు; అట్లా భావింపబడిన అర్థాల అనుభూతి 'అనుభావం' అవుతుంది. కానా, విభావం కారణం, అనుభావం కార్యం అని సారాంశం. ఈ సందర్భంలో - శారదా తనయుడు ఇంకా ఇట్లా వివరించినాడు :

"కవివర్ణనాచాతుర్యాన్ని అనుసరించి, తత్తదవస్థా విశేషవశాన, విభావం అనుభావం, అనుభావం విభావం కావటం సంభావ్యం. ఒకప్పుడు విభావ-అనుభావాలు రెండూ వ్యభిచారులు కావచ్చు. అట్లాగే వ్యభిచారిభావాలు విభావానుభావాలు కావచ్చు. అయితే, ఒకే విషయంతో మాత్రం విభావం అనుభావం, అనుభావం విభావం కావాలన్న; స్థలభేదంవల్ల, విషయ (=వస్తు) భేదంవల్ల అవి పరస్పరం మారటంకద్దు" (భా.ప్ర.I-294-95).

## 2. అనుభావభేదాలు :

భావసంసూచనాత్మకములయిన కటాక్ష-భ్రూవిక్షేపాది చేష్టలు అనుభావాలనబడుతవి; ఇవి ప్రయత్నపూర్వకములయిన చేష్టలు. ఇవి వ్యక్తం కావటానికి

మనస్సు పూర్తిగా భావావిష్టం కానక్కరలేదు. ఇంక మనస్సు పూర్తిగా భావావిష్టమైనప్పుడు, అప్రయత్నంగా అశ్రు-రోమాంచాది రూపంలో అనుభావాలు వ్యక్తమవుతాయి; కటాక్షాదులవలె ఇవి కూడా శరీరం మీదనే వ్యక్తమవుతాయి. కానీ, కటాక్షాదులు ప్రయత్నపూర్వకమైనవికాగా, అశ్రు-రోమాంచాదులు అప్రయత్నపూర్వకములైనవి. కాగా, కటాక్షాదులను కేవల-అనుభావాలు అనీ, అశ్రు-రోమాంచాదులను సాత్త్వికానుభావాలు (లేదా సాత్త్వికభావాలు) అనీ అంటారు. అందుచేతనే సాత్త్వికభావాలు వేరుగా వర్ణింపబడుతూఉంటాయి.

మూలం : భావం మనోగతం సాక్షాత్స్వహేతుం వ్యంజయంతి యే ।
తేఽనుభావా ఇతి ఖ్యాతా భ్రూవిక్షేప-స్మితాదయః ॥
తే చతుర్ధా చిత్త-గాత్ర-వాక్-బుద్ధ్యారంభ సంభవాః ।
(ర.సు.I-190-91)

అర్థం : స్వహేతుం, మనోగతం, భావం=తమకు (=తమ ఉత్పత్తికి) హేతువు అయిన, మనోగత-భావాన్ని; యే, సాక్షాత్, వ్యంజయంతి =ఏవి, ప్రత్యక్షంగా, బయలుపరుస్తున్నవో; తే, భ్రూవిక్షేప-స్మిత-ఆదయః =ఆ, భ్రూవిక్షేపం, స్మితం మున్నగునవి; అనుభావాః, ఇతి, ఖ్యాతాః =అనుభావాలు, అని, చెప్పబడినవి; తేః=అవి (=ఆ అనుభావాలు); చిత్త-గాత్ర-వాక్-బుద్ధి-ఆరంభ సంభవాః=చిత్త-ఆరంభసంభవాలు, గాత్ర-ఆరంభ సంభవాలు, వాక్-ఆరంభ సంభవాలు, బుద్ధి- ఆరంభ సంభవాలు (అని); చతుర్ధా =నాలుగు విధాలు.

తాత్పర్యం : తమ ఉత్పత్తికి హేతువు అయిన మనోగత భావాన్ని వ్యక్తం చేసే భ్రూవిక్షేప- స్మితాదులు అనుభావాలు. ఈ అనుభావాలు నాలుగు విధాలు - *1.* చిత్తారంభాలు, *2.* గాత్రారంభాలు, *3.* వాగారంభాలు, *4.* బుద్ధ్యారంభాలు.

టీక : సింగభూపాలునివలెనే శారదాతనయుడు భావప్రకాశనంలో, భోజరాజు శృంగారప్రకాశనంలో అనుభావాలను నాలుగు విధాలుగానే విభజించినారు.

1. చిత్తజారంభానుభావాలు పది : 'సామాన్యాభినయం' అనే 22వ అధ్యాయంలో భరతముని పేర్కొన్న అంగజ-అలంకారాలు మూడు, అయత్నజ అలంకారాలు ఏడు - ఈ పదింటిని సింగభూపాలాదులు 'చిత్తజారంభానుభావాలు' అన్నారు.

**2.** గాత్రాజారంభానుభావాలు పది : సామాన్యాభినయంలో భరతముని పేర్కొన్న, సహజ లేదా స్వాభావజ అలంకారాలు పదింటిని సింగభూపాలాదులు 'గాత్రజారంభానుభావాలు' అన్నారు.

**3.** వాగారంభానుభావాలు పన్నెండు (ఆలాపాదులు) : సామాన్యాభిన యంలో భరతముని పేర్కొన్న ద్వాదశాత్మకమైన వాచికాభినయాన్ని సింగభూ పాలాదులు 'వాగారంభానుభావాలు' అన్నారు.

**4.** బుద్ధ్యారంభానుభావాలు మూడు : రీతులు, వృత్తులు, ప్రవృత్తులు. పదవిన్యాసభంగి లేదా వచనవిన్యాసక్రమం 'రీతి'; వాక్-మనః-కాయ వ్యాపారాల వైచిత్రితో కూడిన చేష్ట 'వృత్తి'; ప్రకృతుల భాషా-వేష-ఆచార-వార్తలకు సంబంధించినది 'ప్రవృత్తి'. భరతముని 'వృత్తి'ని 20వ అధ్యాయంలోనూ, 'ప్రవృత్తి'ని 13వ అధ్యాయంలోనూ వివరించినాడు. 'రీతి'ని అర్వాచీనాలంకారి కులు పేర్కొన్నారు; వామనుడు 'రీతి కావ్యాత్మ' (రీతి రాత్మా కావ్యస్య) అని నిర్దేశించినాడు.

ప్రాచ్యశాస్త్రానుసిద్ధములై, దేహంమీద, యౌవనారంభంలోనే కనుపట్టే వికా రాలు లేదా పూర్వ్యాలు 'అంగజ-అలంకారాలు'. ఇంక స్వాభావజ-అయత్నజ అలంకారాలు రస-భావానుప్రాణితములై ఉంటాయి. ఇవి, ఈ జన్మయందే, విశిష్టవిభావదర్శనంవల్ల కలుగుతాయి; వీనిలో స్వాభావజాలు రత్యాది భావాలవల్ల జనించేవి; ఇంక అయత్నజాలు గుణరూపంలో ఉంటాయి.

పైని పేర్కొన్న గాత్రజాలంకారాలు, అయత్నజాలంకారాలు, సహజాలంకా రాలు స్త్రీలకు సంబంధించినవి. ఇంక పురుషులకు సంబంధించిన సహజాలంకారలు పది కలవు; వీనిని కూడా భరతముని సామాన్యాభినయంలోనే వివరించినాడు.

స్తన-కేశ-లావణ్యాదులు స్త్రీకి సామాన్యలక్షణములై యువతిత్వాన్ని స్పష్టం చేస్తున్నట్లే, ఈ చేష్టాలంకారాలు సామాన్య లక్షణములై రత్యాదులను స్పష్టం చేస్తుంటాయి. ఈ అలంకారాలు కన్పట్టినంతనే, 'ఈమె ఉత్తమశృంగార సముచిత' అని, భావాది వివేకం లేకపోయినా, తెలిసికోగలము. అట్లాగే పురు షులలో వ్యక్తములయ్యే అయత్నజ అలంకారాలను పట్టి ఇతడు 'ఉత్సాహప్రకృతి' అని తెలిసికోగలము.

ఇట్లా సామాన్యలక్షణాలను తెలియజేసేవి, సర్వావస్థలందు విడువక ఉండేవి కావటంచేత భరతముని ఈ అలంకారాలను (=అనుభావాలను), 'సామాన్యాభి నయం' అధ్యాయంలో వివరించినాడు. ఈ అలంకారాలు వాచికాది భేదాలతో

కూడి ఉన్నప్పటికీ, అవి అన్నీ సత్త్వప్రధానంగా ప్రయుక్తం అవుతాయి కాబట్టి, వీటిని అన్నింటిని 'సత్త్వజాలు' అంటారు.

రసతరంగిణి (III) లో భానుదత్తుడు అనుభావభేదాలు నాలుగని చెప్పి, భిన్నంగా వివరించినాడు :

కాయికాలు – భుజక్షేపాదులు
మానసికాలు – ప్రమోదం మున్నగునవి
ఆహార్యాలు – నాట్యమందు నాలుగేసి మున్నగు భుజాదుల జ్ఞానం
సాత్త్వికాలు – రోమాంచాదులు

## 3. అంగజ (=గాత్రజ) అలంకారాలు :

మూలం : దేహాత్మకం భవే త్సత్త్వం సత్త్వాద్భావః సముత్థితః ।
భావా త్సముత్థితో హావో హావాద్ధేలా సముత్థితా ॥
హేలా-హావశ్చ భావశ్చ పరస్పర సముత్థితాః ।
సత్త్వభేదే భవంత్యేతే శరీరే ప్రకృతి స్థితాః ॥
-(నా.శా.XXII-6-7)

అర్థం : సత్త్వం, దేహాత్మకం, భవేత్ =సత్త్వం, దేహంద్వారా, వ్యక్తమవుతుంది; భావః, సత్త్వాత్, సముత్థితః =భావం, ఈ సత్త్వంనుంచి, పుట్టింది; హావం, భావాత్, సముత్థితః =హావం, భావంనుంచి పుట్టింది; హేలా, హావాత్, సముత్థితా =హేల, హావంనుంచి, పుట్టింది. హేలా, హావః(చ), భావః(చ), పరస్పర-సముత్థితాః =(కాగా) హేల, హావం, భావం - ఇవి, పరస్పరం సముద్భవాలు కూడా.

ఏతే, సత్త్వభేదే, భవంతి =ఇవి, సత్త్వభేదాలు అవుతున్నవి; శరీరే, ప్రకృతిస్థితాః =శరీరంమీద సహజంగా, వ్యక్తమవుతాయి.

తాత్పర్యం : దేహాత్మకమైన సత్త్వంనుంచి భావం, భావంనుంచి హావం, హావం నుంచి హేల జనిస్తాయి. ఈ మూడున్నూ పరస్పరం సముద్భవ హేతువులు కూడా అవుతాయి. భావ-హావ-హేలలు మూడు సత్త్వభేదాలు. ఇవి దేహం ద్వారా వ్యక్తం అవుతాయి.

టీక :- అన్యనాయికాగత హేలావలోకనం చేత, ప్రకృత కుమారియందు భావ-హావాలు, లేదా హావదర్శనంచేత హేలా-భావాలు జనిస్తాయి; కావుననే భావ-హావ-హేలలు పరస్పరసముద్భవహేతువులనటం.

హావావస్థయందు నాయిక తన రతిభావాన్ని తాను గుర్తింపలేదు; కేవలం రతిబలంచేత తనకు తెలియకనే ఆయా వికారాలను ప్రదర్శిస్తుంది. అవి స్పష్టంగా, స్థిరంగా ఉంటాయి. ఇంక హేలయందు నాయిక, ఆ వికారాలు, తనలోగల రతిభావం చేతనే జనించినవని గ్రహిస్తుంది; ఇందలి వికారాలు వేగంగా ప్రసరిస్తాయి. (అభి.భా. 3వ సం. పుట 157).

*(1) భావం :*

మూలం : వాగంగముఖరాగైశ్చ సత్త్వేనాభినయేన చ ।
కవే రంతర్గతం భావం భావయన్ భావ ఉచ్యతే ॥
భావస్యాతికృతం సత్త్వం వ్యతిరిక్తం స్వయోనిషు ।
నైకావస్థాంతరకృతం భావం తమిహ నిర్దిశేత్ ॥

-(నా.శా. XXII-8-9)

వాక్-అంగ-ముఖరాగైః(చ)-సత్త్వేన-అభినయేన(చ) =వాచిక-ఆంగిక-అభినయాలతో, ముఖరాగాలతో, సాత్త్వికాభినయంతో; కవేః, అంతర్గతం భావం, భావయన్, భావః, ఉచ్యతే =కవియొక్క (=కవి రచన ద్వారా వ్యక్తమైన ప్రకృతియొక్క), అంతరభావం భావింప (=సహృదయునకు ప్రకటింప) జేసేది కావున 'భావం' అని చెప్పబడుతున్నది.

భావస్య, అతికృతం, సత్త్వం =భావం యొక్క, అతిశయమైన, సత్త్వం (=అనుభవం); వ్యతిరిక్తం, స్వయోనిషు =(సమ్ముఖంలో ఉన్న) వ్యతిరిక్త వ్యక్తియందు (=పురుషుని ఎదుట ఉన్న స్త్రీలో లేదా స్త్రీ ఎదుట ఉన్న పురుషునిలో); న-ఏక, అవస్థా-అంతరకృతం =అనేక అవస్థలు కలుగజేయటం చేత; తమ్, ఇహ, భావం, నిర్దిశేత్ =దానిని, ఇప్పుడు, భావం(అని), చెప్ప దగును.

తాత్పర్యం :- వాచిక-ఆంగికాభినయాలతో, ముఖరాగాలతో, సాత్త్వికాభినయంతో, కవిరచన ద్వారా వ్యక్తమైన ప్రకృతియొక్క అంతరభావాలను సహృదయునిచేత భావింపజేసేది కావున ఇది 'భావం' అనబడేంది. పురుషుని యొక్క భావాతిశయం సమ్ముఖంలో ఉన్న స్త్రీని లేదా స్త్రీయొక్క భావాతి

శయం నమ్ముఖంలో ఉన్న పురుషుని అనేక అవస్థలకులోను చేయటం కూడా 'భావం' అనబడుతుంది.

టీక : "నిర్వికారస్య చిత్తస్య భావః స్యాదాదివిక్రియా =నిర్వికారంగా ఉన్న మనస్సులో జనించిన తొలివికారం 'భావం' అనబడుతుంది" (ర.సు.I-192) అని అర్వాచీనుల భావ నిర్వచనసారం. నిర్వికారంగా ఉన్న మనస్సును 'బీజం'తో పోలుస్తారు. బీజం, సుక్షేత్రంలో నిక్షిప్తమై తడి తగిలిన తరువాత మార్పు చెంది, మొలకెత్తుతుంది. అట్లాగే, విభావం కారణంగా, మనస్సులో ఉదయించే మార్పు 'భావం' అవుతుంది. కాగా భావం అనేది 'చిత్తవృత్తి విశేషం' అని చెప్పవచ్చు. అందుచేతనే "భావమనగా రసానుకూలమైన చిత్తవృత్తి విశేషం" అని భానుదత్తుడు స్పష్టం చేసినాడు.

ఉదా : స ఏవ సురభిః కాలః, స ఏవ మలయానిలః ।
సైవేయ మబలా, కింతు మనో౽న్యదివ దృశ్యతే ॥
-(సా.ద.III-104 శ్లో. తరువాత)

— అదే వసంతకాలం, అదే మలయానిలం, ఈ అబలకూడా అదే! కానీ, ఇప్పుడు దీని మనస్సు వేరుగా కన్పిస్తున్నది. (=ఆమె మనస్సులో-ప్రథమవిక్రియ అంటే మార్పు-వచ్చినదన్నమాట!)

టీక : నాట్యశాస్త్రంలో భావనిర్వచనం రెండుచోట్ల ఉన్నది – 7 వ అధ్యాయంలో (VII-1-3), 22వ అధ్యాయంలో (XXII-809). 7 వ అధ్యాయంలో భావసాధారణ లక్షణం చెప్పబడినది (చూ. 'భావాలు'). ఇంక 22 వ అధ్యాయంలో అభినయదృష్టితో భావపదం నిర్వచింపబడింది. వర్ణనానిపుణుడైనవాడు కవి. కవ్యంతర్గత భావమనగా కవికి అనాది ప్రాక్తన సంస్కారప్రతిభానమయమైన రాగాదికం (ఇది లౌకిక విషయజన్యం కాదు). ఆ రాగాదులు కవిచేత కావ్యమందు వర్ణింపబడుతాయి. అవి దేశ-కాలాది భేదరహితంగా, సర్వసాధారణీభావంతో ఆస్వాదింపబడటానికి యోగ్యంగా ఉంటాయి (అ.భా. 1వ సం. పుటలు 445-46). అట్లా కవిచేత వర్ణింపడిన భావాలు నటునిచేత అభివ్యక్తం చేయబడినప్పుడు, అవి విశిష్టచిత్తవృత్తులను రసనయోగ్యాలుగా చేస్తాయి. అనగా కవిగతాలైన రాగాదులను సామాజికగతాలుగా చేసే చిత్తవృత్తి విశేషం 'భావం' అనబడుతుంది.

ఉత్తమాధమస్వభావాలుగల ఇరువురు బాలికలు అభినయిస్తున్నప్పుడు, ఒక బాలికయొక్క వాక్కును, ఆమె చక్షురాది వ్యాపారాలను, ముఖవైవర్ణ్యాదులను

చూచే సహృదయునకు, ఆమెయొక్క సత్త్వాదులందుగల విశేషం గోచరించి 'ఈ నాయిక ఉత్తమప్రకృతి. అయిఉండనోవు' అనే భావం కలుగుతుంది. అట్టి భావం కలిగించే దేహవికారవిశేషమే 'భావం' అనబడుతుంది (అ.భా. 2వ సం.పుట-156).

(2) హావం :

మూలం : తత్రాక్షి-భ్రూ-వికారాఢ్యః శృంగారాకార సూచకః ।
సగ్రీవారేచకో జ్ఞేయో హావః చిత్తసముత్థితః ॥
-(నా.శా.XXII-10)

అర్థం : తత్ర =భావంపుట్టిన తరువాత; అక్షి-భ్రూ-వికార-ఆఢ్యః =కనుల, కనుబొమల వికారాలతో సంపన్నమైనది; సగ్రీవా, రేచకః =గ్రీవా రేచకాలతో కూడినది; శృంగార-ఆకార, సూచకః=శృంగారోచితమైన ఆకారాన్ని సూచించేది; చిత్తసముత్థితః =మనస్సునందు పుట్టినది; హావః, జ్ఞేయః='హావం' అని తెలియాలి.

తాత్పర్యం : అక్షి-భ్రూవికార సంపన్నమైనది, గ్రీవారేచకాలతో కూడినది, చిత్తసముద్భవమైనది, శృంగారోచితమైన ఆకారం సూచించేది 'హావం' అనబడుతుంది.

టీక : 'చిత్తసముత్థితం' - దీనికి నా.శా.లో 'స్థిత సముత్థితః' అనే పాఠాంతరం ఉన్నది. దీనికి - పుట్టి స్థిరంగా ఉండేది అనే అర్థం చెప్పేవాడు అభినవగుప్తుడు.

పై చేష్టలవల్ల, కొంచెంగా ప్రకాశించిన భావమే 'హావం' అవుతుందని సింగభూపాలుడు. 'భావం' చేత కేవలం సహృదయులే నాయికయొక్క అంతరంగాన్ని గ్రహించగలరు. కాని, హావస్థితిలో, సహృదయులేకాక ఇతరులు కూడా ఆమె శృంగారోచితమైన ఆకారం కలది అని గ్రహించగలరు.

ఉదా : ధాత్రీ వచోభి ర్ధ్వనిమర్మగర్భైః
క్షణం సరోషస్మిత ఘూర్ణితాక్షీ
పాంచాలికా ద్వంద్వ మయోజయ త్తాం
సంబంధినీ వ్యస్య సఖీజనస్య ॥ -(ర.సు.I-193)

— ధ్వనితో కూడినవి, మర్మగర్భములు అయినదాదుల మాటలకు క్షణకాలం కోపం పొందినప్పటికీ చిరునవ్వుకలదై, సిగ్గుపడినదై, ఆకన్యక తన చెలికత్తెకు వియ్యపురాలై, ఆ రెండు బొమ్మలను కలిపినది.

టీక : సందర్భం - నాయిక చెలికత్తెలతో కూడి 'బొమ్మలపెండ్లి' చేయుటం. ఇందులో, చిత్తవికారాలైన రోష-సంతోష-లజ్జలను కుటిలములగు చూపులతో, చిరునవ్వులతో, వంచిన ముఖంతో వ్యక్తంచేయుటంవల్ల, ఆ కన్యకలోని చిత్తవికారాలు కొంచెంగా వ్యక్తమైనవి. అందుచేత ఇది 'హావ' అవస్థ.

3. హేల :

మూలం : యో వై హావః స ఏవైషా శృంగార రససంభవా ।
సమాఖ్యాతా బుధైః హేలా లలితాభినయాత్మికా ॥
-(నా.శా.XXII-11)

అర్థం : యః (వై), హావః =ఏ, హావం; శృంగారరస, సంభవా =శృంగార రస సంభవమూ; లలిత-అభినయాత్మికా =లలితాభినయాత్మికమూ అవుతుందో; సః ఏవ ఏషా =అదే, హావం; బుధైః, హేలా, సమాఖ్యాతా =బుధులచేత 'హేల' అని చెప్పబడింది.

తాత్పర్యం : శృంగార రససంభవమూ, లలితాభినయాత్మికమూ అయిన హావమే హేల అవుతుంది అని బుధులు చెప్పేవారు.

టీక : భావస్థితిలో రతిభావం ఉత్పన్నమైనది; హావ స్థితిలో, శృంగార-ఆకారం సూచితమైంది; ఇంక హేలస్థితిలో శృంగారం లలితాభినయాత్మకంగా వ్యక్తమైంది.

హేల, లలితాభినయాత్మకం అనే అంశాన్ని సింగభూపాలాదులు కూడా గుర్తించినారు.

ఉదా : వివృణ్వతీ, శైల సుతాపి భావ
మంగైః స్ఫురద్బాలకదంబకల్పైః ।
సాచీకృతా చారుతరేణ తస్థౌ
ముఖేన పర్యస్త విలోచనేన ॥
-(కు.సం.III-68)

– గగుర్పాటుతో బాలకదంబములవలె ఉన్న అంగాలతో శైలసుత (=పార్వతి) కూడా ప్రేమభావాన్ని వ్యక్తంచేస్తూ, ముఖాన్ని అడ్డంగా అందంగా త్రిప్పి, పర్యస్తవిలోచనాలతో అట్లనే నిలబడి ఉన్నది.

టీక : సారాంశం : భావస్థితిలో కన్యక తనలో మొలకెత్తిన రతిభావాన్ని గుర్తించలేదు; సహృదయులు మాత్రమే గుర్తించగలరు. హావస్థితిలో కూడా కన్యక తనలో మొలకెత్తిన రతిభావాన్ని గుర్తించలేకపోయినా, తనకు తెలియకనే అయా వికారాలను ప్రదర్శిస్తుంది; అందుచేత సామాన్యులు కూడా అవిషయాన్ని గుర్తిస్తారు. అయితే ఈ స్థితిలో అయా వికారాలు స్థిరంగా ఉండవు. ఇంక హేలావస్థలో ఆమె తనలోని రతిభావాన్ని గుర్తిస్తుంది; ఆ రతిభావాన్ని లలితాభినయాత్మకంగా వ్యక్తంచేస్తుంది.

## 4. స్వభావజ (=స్వాభావిక) అలంకారాలు :

మూలం : లీలా విలాసో విచ్ఛిత్తి ర్విభ్రమః, కిలికించితమ్ ।
మోట్టాయితం, కుట్టమితం, బిబ్బోకం, లలితం తథా ॥
విహృతం చేతి విజ్ఞేయా దశ స్త్రీణాం స్వభావజాః ।
-(నా.శా.XXII-12-13)

అర్థం : లీలా, విలాసః, విచ్ఛిత్తిః, విభ్రమః, కిలి(ల) కించితం, మోట్టా యితం, కుట్టమితం, బిబ్బోకం, లలితం (తథా), విహృతం(చ), ఇతి =లీల, విలాసం, విచ్ఛిత్తి, విభ్రమం, కిలి(ల) కించితం, మోట్టాయితం, కుట్టమితం, బిబ్బోకం, లలితం, విహృతం, అని; దశ స్త్రీణాం స్వభావజాః, విజ్ఞేయా =పది స్త్రీల స్వభావజ (అలంకార)ములని తెలియవలె.

తాత్పర్యం : స్త్రీల స్వభావజాలంకారాలు పది : 1. లీల, 2. విలాసం, 3. విచ్ఛిత్తి, 4. విభ్రమం, 5. కిలికించితం, 6. మోట్టాయితం, 7. కుట్ట మితం, 8. బిబ్బోకం, 9. లలితం, 10. విహృతం.

టీక : ఈ పదింటినే సింగభూపాలాదులు 'గాత్రారంభానుభావాలు' అన్నారు. భోజుడు 'క్రీడితం', 'కేళి' అనే మరో రెండింటిని గాత్రారంభానుభా వాలుగా పేర్కొన్నాడు. కాని, 'క్రీడితం' అనేది భావాదుల ఉత్పత్తికి పూర్వం, శైశవంలో, కన్యలకు వినోదమాత్రంగా ఉంటుంది; కాన అది అనుభావం

కాజాలదు. ఇంక 'కేలి' అనేది ప్రేమయందలి స్వేచ్ఛను తెలిపేది; కాన, అది కూడా అనుభావం కాజాలదు. కాగా 'గాత్రారంభానుభావాలు పది మాత్రమే' అని సింగభూపాలుని నిర్ణయం. లీలాదులు పదివిన్ని స్వభావజాలంకారాలు; వీనికి తోడు విశ్వనాథాదులు ఇంకో ఎనిమిదింటిని కూడా స్వభావజాలంకారాలుగా పేర్కొన్నారు: 1. మదం, 2. తపన, 3. మౌగ్ధ్యం, 4. విక్షేపం, 5. కుతూహలం, 6. హసితం, 7. చకితం, 8. కేలి (ఇందలి 'కేలి' సింగభూపాలుడు త్రోసిపుచ్చిన క్రీడితం లేదా కేలి వంటిది కాదు).

భానుదత్తుడు, రసతరంగిణిలో, ఈ పదింటిని 'హావములు'గా పేర్కొని, "దశ స్త్రీణాం స్వభావజాః" బదులు "దశహావాస్తు యోషితః" అని పఠించినాడు. అతడు చేసిన వివరణ ఇట్లా ఉన్నది—

"వారిమణుల శృంగారచేష్ట 'హావం' అవుతుంది. ఇది వారిమణులయందు స్వభావజం. అయితే బిబ్బోక-విలాస-విచ్ఛిత్తి-విభ్రమాలు పురుషుల పట్ల కూడా సంభవింపవచ్చును గదా అని ప్రశ్నించవచ్చు; వారిలో కూడా సంభవించటం సత్యమే. కాని వారియందు ఇవి ఔపాధికములు మాత్రమే; స్త్రీలయందు మాత్రం ఇవి స్వభావజములు. మరి ఇవి వారియందుకూడా ఎల్లప్పుడూ ఉండవేమి? అని ప్రశ్నించవచ్చు. నిజమే, ఎల్లప్పుడూ ఉండవు. ఉద్దీపకం యొక్క అన్వయ వ్యతిరేకాలవల్ల హావావిర్భావతిరోభావాలు-విభ్రమ-లలితములు శారీరములు, మోట్టాయిత- కుట్టమిత-బిబ్బోక-విహృతములు అంతరంగికములు, ఇంక కిలికించితం ఉభయసంకీర్ణం". లీలాదులకు విభావ-అనుభావాలను కూడా వివరించినాడు భానుదత్తుడు.

(1) లీల :

మూలం : వాగంగాలంకారైః శ్లిష్టైః ప్రీతిప్రయోజితై ర్మధురైః ।
ఇష్టజనస్యానుకృతి ర్లీలా జ్ఞేయా ప్రయోగజ్ఞైః ॥
-(నా.శా.XXII-14)

అర్థం: ప్రీతి ప్రయోజితైః =(ప్రియుని యందలి) ప్రీతి చేత ప్రయుక్తములైన; ఇష్టజనస్య వాక్-అంగ-అలంకారైః, శ్లిష్టైః, మధురైః =ఇష్టుని (=ప్రియుని యొక్క) వాక్కును, చేష్టను, అలంకారమును విశిష్టంగా, మధురంగా అనుకృతిః ప్రయోగజ్ఞైః లీలా జ్ఞేయా =అనుకరించటం, ప్రయోక్తలచేత 'లీల' (అని) తెలియవలె.

తాత్పర్యం : ప్రియునియందలి ప్రీతిచేత, వానియొక్క వాక్-అంగ-అలంకారాలను మధురంగా, విశిష్టంగా అనుకరించటం (=స్వీయములుగా చేసుకొని ప్రయోగించటం) 'లీల' అనబడుతుంది.

టీక : మధురాలాపాలతో కూడిన చేష్టలతో, నడకలతో, ప్రియుని అనుకరించటం 'లీల' అని సింగభూపాలాదులు. భానుదత్తుడు 'లీల'కు 'సఖీ కౌతుకకలాపం' విభావంగాను, 'ప్రియపరిహాసం' అనుభావంగాను పేర్కొన్నాడు. (రసతంగిణి-VI ).

ఉదా : మృణాళవ్యాళవలయా వేణీబంధకపర్దినీ ।
హరానుకారిణీ పాతు లీలయా పార్వతీ జగత్ ॥
(సా.ద.III-137 మా.)

— నాగకంకణాలవలె తామ్మితూడులను, జటాజూటంవలె వేవలి బంధాన్ని అమర్చుకొని లీలగా హరుని అనుకరిస్తున్న పార్వతీదేవి జగత్తును రక్షించునుగాక!

(2) విలాసం :

మూలం : స్థానాసన గమనానాం హస్త భ్రూ నేత్ర కర్మణాం చైవ ।
ఉత్పద్యతే విశేషో యః శ్లిష్టః స తు విలాసః స్యాత్ ॥
-(నా.శా.XXII-15)

అర్థం : స్థానాసన, గమనానాం =(ప్రియదర్శన సమయంలో) నిలుచుండటంలో, కూర్చుండటంలో, నడకలో; హస్త, భ్రూ, నేత్ర కర్మాణాం (చ) (ఏవ) =హస్తాల, కనుబొమల, నేత్రాల కర్మలలో (కూడా); యః, శ్లిష్టః, విశేషః, ఉత్పద్యతే =ఏ, సమగ్రమైన, విశేషం, జనిస్తుందో; సః(తు), విలాసః, స్యాత్ =అది(ఆ విశేషం), విలాసం, అవుతుంది.

తాత్పర్యం : శృంగారం ఉద్వేలంకావటంవల్ల, ప్రియుని దర్శనం అయిన సమయంలో స్థాన- ఆసన-గమనాలలో, హస్త-భ్రూ-నేత్ర కర్మలందు అపూర్వత్వంగా కనిపించే విశేషం 'విలాసం' అవుతుంది.

టీక : 'ప్రియసంప్రాప్తి సమయంలో' అనీ, తాత్కాలికంగా (=అపూర్వత్వంగా) అనీ సింగభూపాదులు విశదీకరించినారు.

విలాసమునకు - ప్రియదర్శన-స్మరణాదులు విభావాలనీ, అభిలాష - వైదగ్ధ్య ప్రకాశనాదులు అనుభావాలనీ భానుదత్తుడు (రసతరంగిణి-VI).

*(3)* విచ్ఛిత్తి :

మూలం : మాల్యాచ్ఛాదన భూషణ విలేపనానా మనాదరన్యాసః ।
స్వల్పోఽపి పరాం శోభాం జనయతి యస్మాత్తు విచ్ఛిత్తిః ॥
-(నా.శా.XXII-16)

అర్థం : మాల్య-ఆచ్ఛాదన-భూషణ-విలేపనానాం, అనాదరన్యాసః =మాలలను, వస్త్రాలను, భూషణాలను, చందనాదులను, అనాదరంతో, ఉంచినను (=ధరించినను); స్వల్పః-అపి, యస్మాత్(తు), పరాం శోభాం జనయతి =(అట్లా ధరించినవి) స్వల్పం అయినప్పటికీ, ఎందువల్ల (అవి) అధికమగు శోభను, కలిగిస్తాయో, (అందువల్ల అది), 'విచ్ఛిత్తి' (అవుతుంది).

తాత్పర్యం : మాలలను, వస్త్రాలను, భూషణాలను, చందనాదులను, అనాదరంతో స్వల్పంగా ధరించినప్పటికీ, అవి అధికమైన శోభను కలిగించటం 'విచ్ఛిత్తి' అవుతుంది.

టీక : అలంకరణ తక్కువగా ఉన్నప్పటికీ ఎక్కువ కాంతి కలిగి ఉండటం విచ్ఛిత్తి (ర.సు.I-202). కొంచెం అయినప్పటికీ కాంతిని పోషించే వేషవిన్యాసం 'విచ్ఛిత్తి' (సా.ద.III-139 మా.).

విచ్ఛిత్తికి, సౌకుమార్య-ప్రియసౌభాగ్య-సౌందర్య-గర్వ-క్రోధ-క్లేశాదులు విభావాలనీ, గర్వ-మాన-క్లేశ ప్రకాశనాదులు అనుభావాలనీ భానుదత్తుడు (రసతరంగిణి-VI).

ఉదా : అల్పైరనుమీయతే మధుకరైః కేశేషు మాల్యగ్రహః
కాంతిః కపోలయోః ప్రథయతే తాంబూల మంతర్గతమ్ ।
అంగానా మనుమీయతే పరిమలై రాలేపనప్రక్రియా
వేషః కోఽపి విదగ్ధ ఏష సుదృశః మాతే సుఖం చక్షుషోః ॥
-(ర.సు.I-202)

- పైని తిరుగుతున్న తేంట్లవల్లనే కబరీభారమందు మాల్యములున్నవని తెలుస్తున్నది. చెక్కిళుల కాంతివల్లనే తాంబూల గ్రహణం వ్యక్తమవుతున్నది.

అవయవాల పరిళమువలననే మైపూత స్పష్టమవుతున్నది. ఈ వనితయొక్క ఈ విదగ్ధవేషం కన్నులపండు వొనర్చుచున్నది.

(4) విభ్రమం :

మూలం : వివిధానా మర్థానాం వాగంగాహార్యసత్త్వయోగానామ్ ।
మదరాగహర్షజనితో వ్యత్యాసో విభ్రమో జ్ఞేయః ॥
-(నా.శా.XXII-17)

అర్థం : వాక్-అంగ-ఆహార్య-సత్త్వయోగానామ్ =వాచిక-ఆంగిక-ఆహార్య-సాత్త్వికములకు సంబంధించిన; వివిధానాం, అర్థానాం =వివిధములైన అర్థాలను; మద-రాగ-హర్ష జనితః =మదంచేత, లేదా రాగంచేత, లేదా హర్షం చేత, సంభవించిన; వ్యత్యాసః, విభ్రమః, జ్ఞేయః =వ్యత్యాసం (=వ్యత్యస్తంగా చేయటం) 'విభ్రమం' (అని) తెలియవలె.

తాత్పర్యం : వాక్-అంగ-ఆహార్య-సత్త్వములకు సంబంధించిన ఆయా అర్థాలను వ్యత్యస్తంగా చేయటం 'విభ్రమం' అవుతుంది.

టీక : "ప్రియుడు వచ్చేసమయంలో, మదనావేశంవలని తత్తరపాటుతో, భూషణాలను తారుమారుగా ధరించటం విభ్రమం" అని సింగభూపాలుడు (ర.సు.I-203).

ఉదా : శ్రుత్వా యాన్తం బహిః కాన్త మసమాప్త విభూషయా ।
భాలేఽంజనం దృశో ల్లాక్షా కపోలే తిలకం కృతః ॥
(సా.ద.III-144 నా.)

— కాంతుడు అంగణంలోకి వచ్చేస్తున్నాడన్న విన్న కాంత, [illegible] పూర్తికాలే దన్న తత్తరపాటుతో, లలాటంమీద కాటుక, కన్నులయందు లత్తుక, చెక్కిలిమీద తిలకం పెట్టుకొన్నది.

(5) కిలి(ల) కించితం :

మూలం : స్మిత-రుదిత-హసిత-భయ-హర్ష-గర్వ-దుఃఖ-శ్రమాభిలాషాణామ్ ।
సంకరకరణం హర్షా దసకృత్ కిలికించితం జ్ఞేయమ్ ॥
-(నా.శా.XXII-18)

అర్థం : హర్షాత్-హర్షంచేత; స్మిత-రుదిత-హసిత-భయ-హర్ష-గర్వ-దుఃఖ-శ్రమ- అభిలాషిణామ్ =స్మితం, రుదితం, హసితం, భయం, హర్షం, గర్వం, దుఃఖం, శ్రమ, అభిలాష - వీటిని; అసకృత్, సంకరకరణమ్ =మాటిమాటికి, సమ్మిశ్రితం చేయటం; కిలికించితం, జ్ఞేయం =కిలికించితం (అని) తెలియవలె.

తాత్పర్యం : అధిక హర్షంచేత స్మిత-రుదిత-హసిత-భయ-హర్ష-గర్వ-దుఃఖ-శ్రమ- అభిలాషములను మాటిమాటికి సమ్మిశ్రితంచేయటం 'కిలికించితం' అవుతుంది.

టీక : ధనంజయాదులు 'కిలకించితం' అన్నారు. సాంకర్యమనగా విరుద్ధ భావాల కలగలుపు.

విభ్రమమునకు - ధన-మద-రాగ-ఔత్కట్య-ఆదులు విభావాలనీ, ప్రియ పఖ్యాద్యుపహాసాదులు అనుభావాలనీ భానుదత్తుడు (రసతరంగిణి-VI).

ఉదా : పాణిరోధ మవిరోధితవాంఛం
భర్త్సనాశ్చ మధుర స్మిత గర్భాః ।
కామినః స్మ కురుతే కరభోరూ
ర్హారిశుష్క రుదితం చ సుఖేఽపి ॥

(పా.ద.III-141 సూ.)

— కరభోరువు- కాముకునకు, కోరికను విరోధించని విధంగా చేతిని అడ్డం పెడుతూ, బెదరింపును మనోహరస్మితంతో నేచేస్తూ, సుఖమందే, కన్నీటి బొట్టు రాలకుండా, మనోహరంగా ఏడుస్తున్నది.

(6) మోట్టాయితం :

మూలం : ఇష్టజనస్య కథాయాం లీలాహేలాది దర్శనే వాపి ।
తద్భావ భావనాకృత ముక్తం మోట్టాయితం నామ ॥

-(నా.శా.XXII-19)

అర్థం : ఇష్టజనస్య కథాయాం =(సఖ్యాదులు) ప్రియుని కథలు చెప్పినప్పుడు; దర్శనే వా అపి =లేదా స్వయంగా (ప్రియుని) చూసినప్పుడు; తత్-భావభావనాకృతం =(ప్రియుని) తలంపుతో, ప్రేరేపితమైన చేత జనించిన, లీలా-హేలాది =లీలా, హేలాదులున్నట్టు; మోట్టాయితం నామ ఉక్తం ='మోట్టాయితం' అనే పేరున్నదవుతుంది.

తాత్పర్యం : నఖిమున్నగువారు ప్రియుని వార్తలు చెప్పేనప్పుడు కానీ, లేదా తాను స్వయంగా ప్రియుని చూసినప్పుడుకానీ రతిభావనచేత నాయికయందు లీలా-హేలాదులు జనించటం 'మోట్టాయితం'.

టీక : "తన అభిలాష ప్రకటించటం మోట్టాయితం" అని సింగభూపాలాదులు (ర.సు.I-204). ప్రియుని వార్తయందు వైముఖ్యం పైకి చూపినప్పటికీ, రహస్యంగా అతనిని చూడటానికి అభిలషించటం మోట్టాయితం అని భానుదత్తుడు; దీనికి సపత్నీత్రాసలజ్జాదులు విభావాలనీ, మనఃప్రేమకథన-సంకేతనివేదనాదులు అనుభావాలనీ భానుదత్తుడు పేర్కొన్నాడు (రసతరంగిణి-VI).

ఉదా : సుభగ! త్వత్కథారంభే కర్ణకండూతిలాలసా ।
ఉజ్జృంభవదనాంభోజా భినత్త్యంగాని సాంగనా ॥
(సా.ద.III-142 సూ.)

— ఓ సుభగుడ! నీకథను చెప్పటం ఆరంభించగానే ఆ అంగన తన చెవిగోకికొనటం చేస్తుంది; వదనాంభోజంనుంచి ఆవులింతలు వెలువడతాయి; ఒడలు విఱుచుకొంటుంది (ఇవి అన్నీ అనురాగ సూచనలు - ఇవి పేరే వివరింపబడినవి).

(7) కుట్టమితం :

మూలం : కేశస్తనాధరాది గ్రహణా దతిహర్ష సంభ్రమోత్పన్నమ్ ।
కుట్టమితం విజ్ఞేయం సుఖమపి దుఃఖోపచారేణ ॥
-(నా.శా.XXII-20)

అర్థం : కేశ-స్తన-అధర-ఆది గ్రహణాత్ =(ప్రియుడు) కేశాలు, స్తనాలు, అధరం, మున్నగువానివి గ్రహించటంచేత (=గ్రహించినప్పుడు); అతిహర్ష-సంభ్రమ-ఉత్పన్నం =అధికహర్షం, సంభ్రమంవల్ల కలిగే (సుఖం); కుట్టమితం, విజ్ఞేయం ='కుట్టమితం' అని తెలియవలె; సుఖం అపి, దుఃఖ-ఉపచారేణ =(ఇది) సుఖం అయినప్పటికీ దుఃఖరూపంగా (ఉంటుంది).

తాత్పర్యం : ప్రియుడు కేశాలు, స్తనాలు, అధరమున్నగు వానిని పట్టుకొన్నప్పుడు అధికహర్ష సంభ్రమాలవల్ల జనించే సుఖం 'కుట్టమితం'. ఇది సుఖమే అయినప్పటికీ దుఃఖరూపంగా (=కృతకకోపాదులుగా) వ్యక్త మవుతుంది.

టీక : "ప్రియునిచేష్టలు మనస్సులో ఆనందం కలిగిస్తున్నా, పైకి దుఃఖితురాలివలె కోపిస్తుంది" అని సింగభూపాలాదులు (ర.సు.I-205).

దీనికి, రాగ-ఔత్కట్యంవల్ల దశన-కరజ (=దంత-నఖ) క్షతములు, కుంతల-అధర గ్రహణములు విభావాలనీ; కపటకాయసంకోచం, కపట సీత్కారం మున్నగునవి అనుభావాలనీ భానుదత్తుడు (రసమంజరి-VI).

(8) బిబ్బోకం :

మూలం : ఇష్టానాం భావానాం ప్రాప్తా వభిమానగర్వ సంభూతః ।
స్త్రీణా మనాదరకృతో బిబ్బోకోనామ విజ్ఞేయః ॥
-(నా.శా.XXII-21)

అర్థం : ఇష్టానాం, భావనాం, ప్రాప్తౌ =ఇష్టములయిన, భావాలు (=వస్త్రాద్యలంకారాలు) ప్రాప్తించినప్పుడు (కూడా); అభిమాన-గర్వ సంభూతః, స్త్రీణామ్, అనాదరకృతః=అభిమానంచేత, గర్వంచేత, స్త్రీలు, అనాదరం చూపటం; బిబ్బోకఃనామ విజ్ఞేయః ='బిబ్బోకం' అని తెలియవలె.

తాత్పర్యం : ఇష్టములయినవి లభించినప్పటికీ, అభిమాన-గర్వాలవల్ల వాటియందు అనాదరం చూపటం 'బిబ్బోకం'.

టీక : బిబ్బోకమునకు - యౌవనమదం, ధనమదం, కులమదం, ప్రియాపరాధం మున్నగునవి విభావాలనీ, అవహిత్థ-దుర్వచనాదుష్ప్రేక్షణాదులు అనుభావాలనీ భానుదత్తుడు (రసతరంగిణి-VI).

ఉదా : మానం (=కోపం) వలని బిబ్బోకం:
నిర్విభుజ్య దశనచ్ఛదం తతో
వాచి భర్తురవధీరణాపరా ।
శైలరాజతనయా సమీపగా
మాలలాప విజయా మహేతుకమ్ ॥
-(కు.సం.VIII-49)

— (కోపించిన) పార్వతి తన అధరాన్ని కప్పికొంటూ, భర్తయొక్క పలుకులయెడ తిరస్కారంతోనూ, సమీపమందున్న విజయతో - కారణం లేకయే సంభాషించినది.

(9) లలితం :

మూలం : హస్తపాదాంగ విన్యాసో భ్రూనేత్రోష్ఠ ప్రయోజితః ।
సౌకుమార్యా ద్భవేద్యస్తు లలితం తత్ప్రకీర్తితమ్ ॥
[కరచరణాంగన్యాసః సభ్రూనేత్రోష్ఠ సంప్రయుక్తస్తు ।
సుకుమార విధానేవ స్త్రీభి రితీదం స్మృతం లలితమ్ ॥ ]
-(నా.శా.XXII-22-23)

అర్థం : యః=ఏది; హస్త-పాద-అంగవిన్యాసః=హస్తాల, పాదాల, తక్కిన అంగాల, విన్యాసం; భ్రూ-నేత్ర-ఓష్ఠ-ప్రయోజితః =కనుబొమ్మల, నేత్రాల, ఓష్ఠాల కర్మలతో; సౌకుమార్యాత్, భవేత్(తు) =సుకుమారంగా చేయబడుతుందో; తత్, లలితం, ప్రకీర్తితం =అది లలితం (అని), చెప్పబడింది.

తాత్పర్యం : హస్త-పాద-అంగవిన్యాసాలను భ్రూ-నేత్ర-ఓష్ఠకర్మలతో సుకుమారంగా ప్రయోగించటం 'లలితం'.

*[కర-చరణ-అంగన్యాస, భ్రూ-నేత్ర-ఓష్ఠకర్మలతో సుకుమారంగా, స్త్రీల చేత ప్రయుక్తంకావటం 'లలితం' అని చెప్పబడింది].*

టీక : నా.శా.లో రెండవ లక్షణంగా ఇంకో శ్లోకం ఉంది; రెండింటి అర్థం సమానమే.

"సకలాంగ సమీచీన విన్యాసం లలితం; ఇందులో స్మితాదులు అంతర్భవిస్తాయి. మనః ప్రసాద- ప్రియతమ దృఢానురాగ-ధీరత్వాదులు విభావాలు; ప్రియవశీకరణ-లోకానురాగ-చమత్కారాదులు అనుభావాలు" అని భానుదత్తుడు (రసతరంగిణీ-VI).

ఉదా : గురుతర కలనూపురానునాదం
సలలితనర్తిత వామపాదపద్మా ।
ఇతర దనతిలోలమాదధానా
పద మథ మన్మథ మంథరం జగామ ॥
-(సా.ద.III-145 వృ.)

— అంతట, ఆమె, అందియ మధురనాదం చేయగా, వామపాద పద్మాన్ని సలీలంగా చలింపజేస్తూ, దక్షిణపాదాన్ని అనతిచపలంగా పెడుతూ, కామాలసంగా నడచినది.

*(10)* విహృతం :

మూలం : వాక్యానాం ప్రీతియుక్తానాం ప్రాప్తానాం యదభాషణమ్ ।
వ్యాజా త్స్వభావతో వాపి విహృతం నామ తద్భవేత్ ॥
[ప్రాప్తానా మపి వచసాం క్రియతే యదభాషణం హ్రియా స్త్రీభిః ।
వ్యాజాత్స్వ భావతో వాప్యేత త్సముదాహృతం విహృతం ॥ ]
-(నా.శా.XXII-24-25)

అర్థం : ప్రీతియుక్తానాం, వాక్యానాం, ప్రాప్తానాం =ప్రీతియుక్తములైన వాక్యాలు, పలుకవలసినప్పుడు (కూడా); వ్యాజాత్, అపివా స్వభావతః =వ్యాజం (=మిష) చేత, లేదా స్వభావం (=సిగ్గు) చేత; అభాషణం, యత్, తత్ =మాటాడకపోవటం, ఏదో, అది; విహృతం నామ, భవేత్=విహృతం అనే పేరుకలది, అవుతుంది.

తాత్పర్యం : ప్రీతి యుక్తములయిన వాక్యాలు చెప్పవలసినప్పుడు కూడా వ్యాజంచేత లేదా సిగ్గుతో మాటాడక ఉండటం 'విహృతం' అవుతుంది.

*[మాటాడవలసిన సమయంలో కూడా, స్త్రీలు సిగ్గుచేత లేదా వ్యాజంతో లేదా సహజంగా మాటాడకపోవటం 'విహృతం'.]*

టీక : నా.శా.లో రెండు నిర్వచనములున్నవి; రెండింటి అర్థం సమానం.

"ఈర్ష్యచేత, లేదా మానం చేత, లేదా కోపంచేత తగిన సమాధానం చెప్పక, చేష్టలతోనే తన అభిప్రాయం వ్యక్తం చేయుటం 'విహృతం' అవుతుంది" అని సింగభూపాలుడు (ర.సు.I-208-09).

"ప్రియుడు సన్నిధిలో ఉన్నప్పటికీ అభిలాష అపరిపూర్ణంగా ఉండటం విహృతం. వ్యాజ- లజ్జాదులు విభావాలు; అన్యథాచేష్టితం, అన్యథావ్యవహారం మున్నగునవి అనుభావాలు" (రసతరంగిణి-VI).

ఉదా : దూరాదాగతేన కుశలం పృష్టా నోవాచ మయా కించిత్ ।
పర్యశ్రుణీ తు నయనే తస్యాః కథయాం బభూవతుః సర్వం ॥
(సా.ద.III-147 సూ.)

— దూరదేశంనుంచి వచ్చిన నేను కుశలం అడుగగా, ప్రియురాలు ఏమీ బదులు చెప్పలేదు; కానీ, బాష్పపరిపూర్ణములయిన ఆమె నేత్రాలే సర్వం చెప్పివేసినవి. (ఈ ఉదాహరణ రసమ. నిర్వచనానికి అనుకూలంగా ఉన్నది).

## 5. విశ్వనాథుడు చెప్పిన సహజాలంకారాలు :

*1.* మదం :

మదో వికారః సౌభాగ్యయౌవనా ద్యవలేపజః ॥

-(సా.ద.III-123)

— సౌభాగ్యం, యౌవనం మున్నగువాటివలని గర్వంచేత కలిగే వికారం 'మదం' (సా.ద. 146 సూ.).

ఉదా : మా గర్వం ముద్వహ 'కపోలతలేచకాస్తి
కాన్త స్వహస్త లిఖితా మమ మఞ్జ' రీతి ।
అన్యాపి కిం న ఖలు భాజన మీదృశీనాం,
వైరీ న చే ద్భవతి వేపథు రన్తరాయః ?

— నీ చెక్కిట కాంతుడు తనచేతితో వ్రాసిన పూలగుత్తి ఉన్నదని గర్వపడకు; వేపథువు శత్రువై విఘ్నం కలిగించకఉంటే, ఇతర వనితకూడా ఇట్టివానికి పాత్రం కాదా ఏమిటి?

*2.* తపన :

తపనం ప్రియవిచ్ఛేదే స్మరావేశోత్థచేష్టితమ్ ॥ -(సా.ద.III-125)

— ప్రియమునకు విచ్ఛేదంకలుగగా మన్మథావేగం చేత కలిగే చేష్టితం 'తపన' సా.ద.148 సూ.)

ఉదా : శ్వాసా న్ముఞ్చతి, భూతలే విలుఠతి, త్వన్మార్గ మాలోకతే,
దీర్ఘంరోదితి, విక్షిప త్యత ఇతః క్షామాం భుజావల్లరీం ।
కిఞ్చ ప్రాణ సమాన, కాంక్షితవతీ స్వప్నేఽపి తే సఙ్గమం
నిద్రాం వాఞ్ఛతి, న ప్రయచ్ఛతి పున ర్దగ్ధో విధి స్తా మపి ॥

— (ఎదురు చూపిన ప్రియుడు రాలేదు; అందుచేత) ఆమె నిట్టూర్పులు విడుస్తున్నది, నేలమీద దొర్లుతున్నది, నీవువచ్చేదారి ఎదురుచూస్తున్నది, చాలాసేపు ఏడ్చినది, చిక్కిన బాహువల్లరిని ఇటునటు విసరుతున్నది. మరి, ప్రాణసమానుడా! కలలో అయినా నీపొందుకోరినదై నిద్రపోవాలని ప్రయత్నించినది, కాని పాడుదైవం నిద్రనుకూడా ఇవ్వటంలేదు.

3. మౌగ్ధ్యం :

అజ్ఞావా దివ యా పృచ్ఛా ప్రతీతస్యాపి వస్తునః ।
వల్లభస్య పురః ప్రోక్తం మౌగ్ధ్యం తత్తత్త్వవేదిభిః ॥
-(సా.ద.III-126)

— తనకు చక్కగా తెలిసిన వస్తువును గూర్చి, ఏమీ తెలియనట్లుగా వల్లభుని ప్రశ్నించటం 'మౌగ్ధ్యం' (సా.ద. 149 సూ.).

ఉదా : కే ద్రుమాస్తే? క్వ వా గ్రామే సన్తి? కేన ప్రరోపితాః ?
నాథ! మత్కఙ్కణ న్యస్తం యేషాం ముక్తాఫలం ఫలం ॥

— నాథా! నాకంకణంలో గ్రుచ్చిన ఈ ముక్తాఫలాలు (=ముత్యాలు) ఏ చెట్లఫలాలు? ఆ చెట్లు ఏ గ్రామంలో ఉన్నాయి? వాటిని పెంచినవారు ఎవ్వరు?

4. విక్షేపం :

భూషాణా మర్ధరచనా వృథా విష్వగవేక్షణమ్ ।
రహస్యాఽఽఖ్యాన మీష చ్చ విక్షేపో దయితాంతికే ॥
-(సా.ద.III-127)

— దయితుని ప్రోల భూషణాలను తక్కువగా ధరించటం, నిష్కారణంగా దిక్కులు చూడటం, కొంచెంగా రహస్యం చెప్పటం, 'విక్షేపం' (సా.ద. 150 సూ.).

ఉదా : ధమ్మిల్ల మర్ధ ముక్తం కలయతి, తిలకం తథా సకలం ।
కిఞ్చి ద్వదతి రహస్యం, చకితం విష్వగ్విలోకతే తన్వీ ॥

— ఆతన్వి - కొప్పుసగం విప్పుకొన్నది, ఫాలమందు తిలకం అరకొరగా ఉన్నది, రహస్యం కొంతవరకే చెప్పుతున్నది, బెదరుచూపులతో అంతటా చూస్తున్నది.

5. కుతూహలం :

రమ్యవస్తు సమాలోకే లోలతా స్యాత్ కుతూహలమ్ ॥
-(సా.ద.III-128)

— రమ్యవస్తువులను చూడాలనే గాఢమైన కోర్కె 'కుతూహలం' (సా.ద. 151 సూ.).

ఉదా : ప్రసాధికాలమ్బిత మగ్రపాదమాక్షిప్య కాచిద్ ద్రవరాగమేవ ।
ఉత్సృష్ట లీలాగతి రాగవాక్షా దలక్త కాఙ్కాం పదవీ తతాన ॥

— ఒకతె, అలంకరించటానికి సఖిచేత పట్టుకొన్న తనమునిపాదాన్నితడి ఓడుచున్న పారాణితోనే, లీలాగమనంమాని, కిటికీవరకును దారిని లత్తుక చిహ్నలు కలదానిని కావించినది (కిటికీ నుంచి ఏదో రమ్యవస్తువును చూడాలన్న కుతూహలంతో వేగంగా నడిచింది).

*6.* హసితం :

హసితస్తు వృథా హాసో యౌవనోద్భేద సంభవః ।
-(సా.ద.III-129)

— యౌవనోదయంతోనే కలిగే అకారణహాసం 'హసితం' (సా.ద.152 సూ.).

ఉదా : అకస్మా దేవ తన్వఙ్గీ జహాస యదియం పునః ।
నూనం ప్రసూనబాణో౽స్యాం స్వారాజ్య మధితిష్ఠతి ॥

— కారణంలేకయే అతన్వంగి మరల నవ్వింది; కావున, నిశ్చయంగా, ఈమెయందు కుసుమబాణుడు స్వారాజ్యమును అధిష్ఠించి ఉన్నాడు.

టీక : ఇది వేషభాషాది వికారజన్యమైన హాసంవంటిది కాదు; యౌవన వికారజన్యమైన హాసం.

*7.* చకితం :

కుతో౽పి దయితస్యాగ్రే చకితం భయసంభ్రమః ।
-(సా.ద.III-130)

— ఏదేని కారణంచేత ప్రియుని ముందు కలిగే భయసంభ్రమం 'చకితం' (సా.ద. 153 సూ.).

ఉదా : త్రస్యన్తీ చలశఫరీ విఘట్టితోరూ [illegible]
[illegible] ర్వామోరూ రతిశయ మాప విభ్రమస్య ।
క్షుభ్యన్తి ప్రసభ మహో వినాపి హేతో [illegible]
ర్లీలాభిః కిము సతి కారణే తరుణ్యః? [illegible]

— సంచరిస్తున్న శఫరికలు (=ఆడుబేడిసలు) ఊరువులను ఒరయుటంచేత భయపడగా ఆవామోరువుయొక్క విభ్రమవిలాసం అతిశయం పొందింది. జన రాండ్రుకారణం లేకనే క్షోభపడతారు; మరి కారణమే ఉంటే ఇంక చెప్పవలెనా?

*8. కేళి :*

**విహారే సహకాంతేన క్రీడితం కేళి రుచ్యతే ।**

-(సా.ద.III-131)

— కాంతునితో కలిసి విహరించటంలోని క్రీడితం 'కేళి' (సా.ద. 154 మా.).

ఉదా: వ్యపోహితుం లోచనతో ముఖానిలైరపారయన్తంకిల పుష్పజం రజః
పయోధరేణోరసి కాచిదున్మనా ప్రియం జఘానోన్నత పీవరస్తనీ।

— ముఖానిలంతో, తనకంటిలో పడిన పుప్పొడిని ఊదిపోగొట్టలేని ప్రియుని, ఉన్నత పీవరస్తని ఒకతె, ఉత్సుకురాలై స్తనాలతో వాని రొమ్మును పొడిచినది.

## 6. అయత్నజ-అలంకారాలు :

మూలం: శోభా కాంతిశ్చ దీప్తిశ్చ తథా మాధుర్య మేవచ ।
ధైర్యం ప్రాగల్భ్య మౌదార్య మిత్యేతే స్యు రయత్నజాః ॥

-(నా.శా.XXII-26)

అర్థం : శోభా, కాంతిః(చ), దీప్తిః(చ), (తథా) మాధుర్యం (ఏవచ), ధైర్యం, ప్రాగల్భ్యం, ఔదార్యం, ఇతి =శోభ, కాంతి, దీప్తి, మాధుర్యం, ధైర్యం ప్రాగల్భ్యం, ఔదార్యం, అని, ఏతే, అయత్నజాః, స్యుః =ఇవి, (స్త్రీల) అయత్నజ (అలంకార)ములు, అవుతాయి.

తాత్పర్యం : శోభ, కాంతి, దీప్తి, మాధుర్యం, ధైర్యం, ప్రాగల్భ్యం, ఔదార్యం - ఈ ఏడున్నూ స్త్రీల అయత్నజాలంకారాలు.

టీక : ఈ ఏడింటితోపాటు ఇంకో రెండింటిని— 1. అన్ని అవస్థలం దున్నూ అచాపల్యాన్ని 'స్థైర్యము'గాను, 2. విదితంకాని ఇంగితాకారం లక్షణాన్ని 'గాంభీర్యము'గాను పేర్కొన్నారు. "ఇవి ధైర్యమునందే

అంతర్భవిష్టాయి" అని సింగభూపాలుడు. కానీ, పౌరుషాలంకారాలుగా భరతముని పేర్కొన్న పురుషుల అలంకారాలు ఎనిమిదింటిలో స్థైర్య- గాంభీర్యాలు ఉన్నవి. బహుశః, భోజుడు, ఈ రెండింటిని స్త్రీలకు కూడా అన్వయించితుండవచ్చు. ఈ ఏడింటి ప్రయోగాన్ని గూర్చి భరతముని ఇట్లా వివరించినాడు (నా.శా.XXII-32):

మూలం : సుకుమారే భవంత్యేతే ప్రయోగే లలితాత్మకే ।
విలాస-లలితే హిత్వా దీప్తేఽప్యేతే భవంతి ॥
-(నా.శా.XXII-32)

— లలితాత్మకములైన సంభోగ-విప్రలంభాది ప్రయోగములందు ఈ అలంకారాలు సుకుమారంగా ఉంటాయి. కాని, ఈర్ష్య-అమర్ష ప్రయోగాలలో, విలాస-లలితభేదాలు తక్క తక్కినవి - దీప్తంగా ఉంటాయి.

*(1)* శోభ :

మూలం : రూప-యౌవన-లావణ్యై రుపభోగోపబృంహితైః ।
అలంకరణ మంగానాం శోభేతి పరికీర్తితా ॥
(నా.శా.XXII-27)

అర్థం : ఉపభోగ-ఉపబృంహితైః =ఉపభోగం (=ప్రియునిచేత అనుభవింపబడటం) చేత పెంపొందింపబడిన; రూప-యౌవన-లావణ్యైః =రూపం, యౌవనం, లావణ్యం - వీటివల్ల; అంగానాం, అలంకరణం =అవయవాల యొక్క అలంకరణ (=అవయవాలకు కలిగిన మాత్మవిలాసం); శోభా-ఇతి, పరికీర్తితా='శోభ', అని, చెప్పబడింది.

తాత్పర్యం : ఉపభోగంచేత పెంపొందింపబడిన రూప-యౌవన-లావణ్యాల వల్ల అవయవాలకు కలిగిన మాహాత్మ్య-అలంకారం 'శోభ' అవుతుంది.

ఉదా : అశిథిలపరిరంభా దర్దశిష్టాంగరాగా
మవిరతరత వేగా దవలంబోరుజూటమ్ ।
ఉషసి శయన గేహాదుచ్చలంతీం స్ఖలంతీమ్
కరతలధృతనీవీం కాతరాక్షీం భజామః ॥ -(ర.సు.I-196)

— గాఢాలింగనంచేత సగం [illegible] సగం [illegible] పైపూతలు, తెంపులేని రతివలన జారి అంసెములపై వ్రేలాడుతున్న పెద్దకచ్చుల [illegible], చేతితోపోక ముడి

పట్టుకొని, (పడకటింటినుంచి) వెలుపలికివస్తున్న కాతరాక్షిని (=బెదురుచూపులు కలదానిని) సేవిస్తాను.

టీక : ఈ ఉదాహరణ— క్షేత్రయ్య రచించిన "మగువ తన కేళికామందిరము వెడలెన్ . . ." అనే పదాన్ని జ్ఞప్తికి తెస్తున్నది.

*(2)* కాంతి :

మూలం : విజ్ఞేయా చ తథా కాంతిః శోభైవాపూర్ణమన్మథా ।
-(నా.శా.XXII-28)

అర్థం : (తథా) (చ) అపూర్ణమన్మథా, శోభా-ఏవ=సంపూర్ణమగు కామోపభోగంతో కూడిన, శోభయే; కాంతిః, విజ్ఞేయా=కాంతి అని తెలియవలె.

తాత్పర్యం : సంపూర్ణమగు కామోపభోగంతో కూడిన శోభయే 'కాంతి' అనబడుతుంది.

టీక : ఇంచుమించుగా అందరి నిర్వచనాలు సమానమే.

*(3)* దీప్తి :

మూలం : కాంతి రేవాతివిస్తీర్ణా దీప్తి రిత్యభిధీయతే ॥
-(నా.శా.XXII-28)

అర్థం : అతి విస్తీర్ణా, కాంతిః-ఏవ=అత్యధికమైన, కాంతియే; దీప్తిః, ఇతి-అభిధీయతే =దీప్తి, అని, చెప్పబడుతున్నది.

తాత్పర్యం : అత్యధికమైన కాంతియే 'దీప్తి' అవుతుంది.

టీక : వయస్సు, భోగం, కాలం, దేశం, గుణం మున్నగువానిచేత ఉద్దీప్తమై, విస్తృతిని పొందిన కాంతియే దీప్తి అనబడుతుంది (ర.సు.I-196).

కామోపభోగంచేత రూపాదులందు ఛాయాంతరం సంభావ్యం. ఆ అంగచ్ఛాయ (=మాధుర్యవిలాసం)లో మూడు అవస్థలున్నవి - అందు మందావస్థ 'శోభ'; మధ్యావస్థ కాంతి; తీవ్రావస్థ దీప్తి (అ.భా. తెవ సం. పుట 163).

(4) మాధుర్యం :

మూలం : సర్వావస్థావిశేషేషు దీప్తేషు లలితేషు చ ।
అనుల్బణత్వం చేష్టాయాం మాధుర్య మితి సంజ్ఞితమ్ ॥
-(నా.శా.XXII-29)

అర్థం : దీప్తేషు =దీప్తభావాలైన క్రోధాదులందు; లలితేషు(చ) =లలితములైన రతిక్రీడాదులందు; సర్వావస్థా విశేషు=(దీప్తములు లేదా లలితములు అయిన) అన్ని అవస్థావిశేషములందు; చేష్టాయాం, అనుల్బణత్వం =చేష్టలయందు అనుల్బణత్వం (మృదుత్వం =మసృణత్వం లేదా రణీయత) ఉండటం; మాధుర్యం, ఇతి, సంజ్ఞితం ='మాధుర్యం' అనే పేరుకలది అయినది.

తాత్పర్యం : దీప్తములైన క్రోధాదులు, లలితములైన రతిక్రీడాదులు మున్నగు అవస్థావిశేషాలన్నింటను చేష్ట అనుల్బణంగా ఉండటం 'మాధుర్యం'.

టీక : "చేష్ట, ఆలాపం, స్పర్శ - ఇవి స్పృహణీయంగా ఉండటం మాధుర్యం" అని శారదాతనయుడు (భా.ప్ర.I-102). సర్వావస్థలలోను చేష్టలయందు మార్దవం మాధుర్యం అని సింగభూపాలుడు (ర.సు.I-197).

ఉదా : సరసిజ మనువిద్ధం శైవలేనాపి రమ్యం
మలిన మపి హిమాంశో ర్లక్ష్మ లక్ష్మీం తనోతి ।
ఇయ మధికమనోజ్ఞా వల్కలేనాపి తన్వీ
కిమివ హి మధురాణాం మండనం నాకృతీనాం ॥ -(అ.శా.I-15)

– పద్మం నాచుకమ్మినప్పటికీ రమణీయమే. మలినమైనప్పటికీ, మచ్చ, చంద్రునకు సౌభాగ్యాన్నే చేకూరుస్తున్నది. ఈతన్వి నారచీరలో సహితం అధిక మనోజ్ఞంగా ఉంది. మధురములైన ఆకృతులకు ఏది అలంకారం కాదు?

(5) ధైర్యం :

మూలం : చాపలే నానుపహతా సర్వార్థే ష్వవికత్థనా ।
స్వాభావికీ చిత్తవృత్తిః ధైర్య మిత్యభిధీయతే ॥
-(నా.శా.XXII-30)

అర్థం : చాపలేన - అనుపహతా =చపలత్వానికి లొంగని; సర్వ-అర్థేషు - అవికత్థనా =అన్నిమాటలలోనూ ఆత్మశ్లాఘలేని; స్వాభావికీచిత్తవృత్తిః =సహజ చిత్తవృత్తి (కలిగి ఉండటం); ధైర్యం, ఇతి, అభిధీయతే =ధైర్యం, అని, చెప్పబడుతున్నది.

తాత్పర్యం : ఏ విషయమందును చాపల్యంలేని, ఏ సందర్భంలోనూ తన్నుతాను పొగడుకొనని, సహజ చిత్తవృత్తి కలిగిఉండటం 'ధైర్యం'.

టీక : "స్థిరమైన చిత్తవృత్తి (=చలించని మనోవృత్తి) ధైర్యం" అని సింగభూపాలుడు (ర.సు.I-198).

"శీలాదులను మీరకపోవటం ధైర్యం" అని విద్యానాథుడు (ప్ర.రు.య.IV-88).

ఉదా : అథ విశ్వాత్మనే గౌరీ సందిదేశ మిథః సఖీమ్ ।
దాతా మే భూభృతాం నాథః ప్రమాణీక్రియతా మితి ॥
-(కు.సం.VI-1)

– (పిదప పార్వతీదేవి) "నాతండ్రి, పర్వతరాజైన హిమవంతుడు, నన్ను మీకు ఇచ్చునట్లుగా ఏర్పాటుచేయించండి" అని, రహస్యంగా, చెలికత్తెలద్వారా, శివునకు సందేశం పంపించింది.

*(6) ప్రాగల్భ్యం :*

మూలం : ప్రయోగనిస్సాధ్వసతా ప్రాగల్భ్యం సముదాహృతమ్ ॥
-(నా.శా.XXII-31)

అర్థం : ప్రయోగనిఃసాధ్వసతా =ప్రయోగములందు (=శృంగార వ్యవహారములందు లేదా సంభాషణములందు) ధీరత్వం (=తొందరపాటు లేదా గాభరా లేకుండటం); ప్రాగల్భ్యం, సముదాహృతం ='ప్రాగల్భ్యం' (అని) చెప్పబడింది.

తాత్పర్యం : శృంగారాది ప్రక్రియలలో తొందరపాటు లేకుండా వ్యవహరించటం 'ప్రాగల్భ్యం' (=ప్రగల్భత).

ఉదా : సమాశ్లిష్టాః సమాశ్లేషైః
చుంబితా చుంబనై రపి ।

దష్టాశ్చ దంశనైః కాన్తం
దాసీ కుర్వంతి యోషితః ॥ (సా.ద.III-134 సూ.)

– ఆ స్త్రీలు, ఆలింగితలై ఆలింగనాలచేత, చుంబితలై చుంబనములచేత, దంతక్షతలై దంశనములచేత కాంతులను దాసులుగా చేసుకొంటున్నారు.

*(7)* ఔదార్యం :

మూలం : ఔదార్యం ప్రశ్రయః ప్రోక్తః సర్వావస్థానుగో బుధైః ॥
-(నా.శా.XXII-31)

అర్థం : సర్వ-అవస్థానుగః, ప్రశ్రయః =సర్వావస్థలందును విడువకుండే, వినయం (=పరుషములు పలుక కుండటం); బుధైః, ఔదార్యం, ప్రోక్తః =బుధులచేత ఔదార్యం అని చెప్పబడింది.

తాత్పర్యం : సర్వావస్థలందును అనుసరించిఉండే ప్రశ్రయం 'ఔదార్యం' అనబడుతుంది.

ఉదా : కల్యాణబుద్ధే రథవా తవాయం
న కామచారో మయి శంకనీయః ।
మమైవ జన్మాంతర పాతకానాం
విపాక విస్ఫూర్జథురప్రసహ్యః ॥ (ర.వం.XIV-62)

– ఉత్తమ బుద్ధికల నీవు, కావాలనే నన్ను విసర్జించితివని శంకించటానికి అవకాశంలేదు; నా పూర్వ జన్మ పాపంపండి, ఇట్లా భరింపరానిదై, ఈవిధంగా వజ్రవిస్ఫురంగా మారింది.

(అకారణంగా తనను అడవుల పాలుచేసిన శ్రీరాముని గూర్చి, ఔదార్యంతో, సీతాదేవి చెప్పిన మాటలివి.)

## 7. వాగారంభ-అనుభావాలు :

భరతముని, 'సామాన్యాభినయం' అనే 22 వ అధ్యాయంలో సత్త్వ జన్యమైన సామాన్యాభినయాన్ని వివరించిన పిమ్మట ఆరువిధాలైన శరీరజమగు సామాన్యాభినయాన్ని వివరించినాడు (వాక్య - సూచా - అంకుర - శాఖా - నాట్యాయిత - నివృత్త్యంకురాభినయాలు). ఈ అభినయాలు అరింటికిని

భావ- రసోచితంగా ప్రయుక్తమయ్యే వాచికం విషయం కావాలనీ, ఈ వాచికాభినయం ద్వాదశాత్మకంగా కావ్యవస్తువు (=దశరూపకము) నందుంటుందనీ చెప్పి, వాచికరూపమైన సామాన్యాభినయాన్ని వివరించినాడు.

మూలం : అలాపశ్చ ప్రలాపశ్చ విలాపః స్యా త్తథైవ చ ।
అనులాపోఽథ సంలాప స్త్వపలాప స్తథైవ చ ॥
సందేశ శ్చాతిదేశశ్చ నిర్దేశః స్యాత్తథాపరః ।
ఉపదేశోఽపదేశశ్చ వ్యపదేశశ్చ కీర్తితః ॥
-(నా.శా.XXII-52-53)

అర్థం : *ఆలాపః(చ), ప్రలాపః(చ), విలాపః, (స్యాత్-తథా-ఏవచ), అనులాపః (అథ), సంలాపః(తు), అపలాపః, ̖థా ఏవచ), సందేశః(చ), అతిదేశః(చ), నిర్దేశః (స్యాత్-తథా-అపరః), ఉపదేశః, అపదేశః(చ), వ్యపదేశః(చ), కీర్తితః=ఆలాపం, ప్రలాపం, విలాపం, అనులాపం, సంలాపం, ప్రలాపం, సందేశం, అతిదేశం, నిర్దేశం, ఉపదేశం, అపదేశం, వ్యపదేశం — (ఇట్లా వాచికాభినయం ద్వాదశాత్మకమని) చెప్పబడింది.*

తాత్పర్యం : *1. ఆలాపం, 2. ప్రలాపం, 3. విలాపం, 4. అనులాపం, 5. సంలాపం, 6. అపలాపం, 7. సందేశం, 8. అతిదేశం, 9. నిర్దేశం, 10. ఉపదేశం, 11. అపదేశం, 12. వ్యపదేశం - ఇట్లా వాచికాభినయం ద్వాదశాత్మకం.*

టీక : ఈ పన్నెండింటిని, అర్వాచీనాలంకారికులు 'వాగారంభాను భావాలు'గా పరిగణించి, వివరించినారు (ర.సు.I223-26).

*(1) ఆలాపాదులు :*

మూలం : ఆభాషణం తు యద్వాక్య మాలాపోనామ స స్మృతః ।
అనర్థకం వచో యత్తు ప్రలాపః స తు కీర్తితః ॥
కరుణప్రభావో యస్తు విలాపః స తు కీర్తితః ।
బహుశోఽభిహితం వాక్య మనులాప ఇతి స్మృతః ॥
ఉక్తి ప్రత్యుక్తి సంయుక్తః సంలాప ఇతి కీర్తితః ।
పూర్వోక్త స్యాన్యథావాదో హ్యపలాప ఇతి స్మృతః ॥
తదిదం వచనం బ్రూహీత్యేష సందేశ ఉచ్యతే ।

యత్త్వయోక్తం మయోక్తం తత్సోఽతిదేశ ఇతి స్మృతః ॥
స ఏషోఽహం బ్రవీమీతి నిర్దేశ ఇతి కీర్తితః ।
వ్యాజాంతరేణ కథనం వ్యపదేశ ఇహోచ్యతే ॥
ఇదం కురు గృహాణేతి హ్యుపదేశః ప్రకీర్తితః ।
అన్యార్థకథనం యత్ స్యాత్ సోఽపదేశః ప్రకీర్తితః ॥
ఏతే మార్గాస్తు విజ్ఞేయాః సర్వాభినయయోజకాః ।
-(నా.శా.XXII-54-60)

అర్థం : యత్-వాక్యం, ఆభాషణం(తు) =ఏవాక్యం, సంభాషణాత్మకమో; సః, ఆలాపః నామ, స్మృతః =అది, ఆలాపం (అనే) పేరు (కలదిగా), చెప్పబడింది.

యత్(తు), అనర్థకం, వచః =ఏది, అర్థరహితమైన మాటో; సః(తు), ప్రలాపః, కీర్తితః =అది ప్రలాపం (అని), చెప్పబడింది.

యః(తు), కరుణ ప్రభావః =ఏది, కరుణజన్యమో ; సః(తు), విలాపః, కీర్తితః =అది, విలాపం, (అని) చెప్పబడింది.

వాక్యం, బహుశః, అభిహితం=(ఒకే) వాక్యం, మరలమరల, చెప్పబడటం; అనులాపః, ఇతి, స్మృతః=అనులాపం, అని, చెప్పబడినది.

ఉక్తి-ప్రత్యుక్తి సంయుక్తః=ఉక్తి, ప్రత్యుక్తులతో కూడినది; సంలాపః, ఇతి, కీర్తితః=సంలాపం, అని చెప్పబడినది.

పూర్వ-ఉక్తస్య, అన్యథావాదం(హి)=ముందు చెప్పినదానిని, ఇంకో విధంగా మార్చిచెప్పటం; అపలాపః, ఇతి, స్మృతః=అపలాపం, అని చెప్పబడినది.

తత్-ఇదం, వచనం, బ్రూహి=ఆయా, మాట, (వానితో) చెప్పుము; ఏష, సందేశః, ఇతి, ఉచ్యతే =ఇది, సందేశం, అని చెప్పబడుతున్నది.

యత్-త్వయా-ఉక్తం, తత్,మయా-ఉక్తం=ఏది నీచే చెప్పబడిందో, అదే, నాచేత, చెప్పబడింది; సః, అతిదేశః, ఇతిస్మృతః =అది (=అట్లా అనటం), అతిదేశం, అని, చెప్పబడినది.

సః, ఏష-అహం, బ్రవీమి=ఆ, యీ, నేను, చెప్పుచున్నాను; ఇతి, నిర్దేశః ఇతి, కీర్తితః =అని (అనటం), నిర్దేశం, అని, చెప్పబడింది.

వ్యాజ-అంతరేణ, కథనం=(ఏదేని) ఒక మిషతో, (మాట) చెప్పటం; వ్యపదేశః (ఇహ), ఉచ్యతే=వ్యపదేశం (అని), చెప్పబడుతున్నది.

ఇదం కురు, గృహాణ, ఇతి(హి) =ఇది, చేయము, తీసుకొనము, అని (చెప్పటం); ఉపదేశః, ప్రకీర్తితః =ఉపదేశం (అని), చెప్పబడినది.

యత్, అన్య-అర్థ కథనం, స్యాత్=ఏది (=తాను చెప్పదలచినది), ఇతరులు చెప్పినట్లు చెప్పటమో; సః, అపదేశః, ప్రకీర్తితః - అది, అపదేశం, అని చెప్పబడింది.

ఏతే, మార్గాః(తు) =ఇవి (=ఈ పన్నెండు) వాక్య పద్ధతులు; సర్వాభినయయోజకాః, విజ్ఞేయాః=(ఇవి) సర్వాభినయములందును ప్రయుక్తములగునని తెలియవలెను ('సర్వాభినయయోజకాః' - దీనికి బదులు 'వాక్యాభినయ యోజకాః' అని పాఠాంతరం - ముందు వివరించిన ఆరువిధములగు శారీరాభినయమునందలి 'వాక్యాభినయమందు ప్రయుక్తములగును' అని అర్థం).

తాత్పర్యం : (i) ఆలాపం : సంభాషణాత్మకమైన వాక్యం ఆలాపం. ఎదుటి వ్యక్తితో, మధ్యమపురుషలో, ఉపదేశ శూన్యంగా మాటాడటం (అ.గు.); చాటువులతో కూడిన ప్రియోక్తులు (ర.సు.)

ఉదా : కస్తే వాక్యామృతం త్యక్త్వా శృణోత్యాన్యగిరం బుధః ।
సహకారఫలం త్యక్త్వా నింబం చుంబతి కింశుకః ॥
-(ర.సు.I-*221*)

— ఏ విద్వాంసుడు నీవాక్యామృతాన్ని విడిచి వేరొకరి మాట వింటాడు? చిలుక, తీయమామిడిపండును విడిచి, వేపపండును రుచిచూస్తుందా?

(ii) ప్రలాపం : అర్థరహిత వాక్యాలను పలుకటం.

ఉదా : మాల్యగంధం వినబడుతున్నది కాని ముక్కులలో చీకటిదూరటంవల్ల నగలచప్పుడుమాత్రం స్పష్టంగా కానబడటంలేదు (మృచ్ఛకటిక-I-శకారుడు).

(iii) విలాపం : కరుణరస సంబంధివాక్యం. దుఃఖంతో కూడినమాట (ర.సు.)

ఉదా : ఆర్యా మరణ్యే విజనే విమోక్తుం
శ్రోతుం చ తస్యాః పరిదేవితాని।
సుఖేన లంకాసమరే మృతంమా
మజీవయ న్మారుతి రాత్తవైరః ॥ (ర.సు.I-222)

— లంకలో జరిగిన యుద్ధంలో నిర్విచారంగా మరణించిన నన్ను , చావనీయక, అకారణ వైరంవూని హనుమ బ్రతికించినాడు. అట్లా బ్రతికిన నేనిప్పుడు ఉత్తమపతివ్రత అయిన సీతను విజనమగు అరణ్యంలో విడిచిపెట్టి, ఆమె ఘోరవిలాపాన్ని వినటం తటస్థపడింది (రాముని ఆజ్ఞప్రకారం సీతను అడవిలో విడిచిపెడుతున్న లక్ష్మణుని దుఃఖమిది).

**(iv) అనులాపం** : ఒకే వాక్యాన్ని వెక్కుసార్లు చెప్పటం (=ఒకే అర్థం వచ్చేమాటలను వరుసగా చెప్పటం).

ఉదా : భూమిజానికి నాతండ్రి మామగారు
నాదు తండ్రి కల్లుండు భూనాయకుండు
బావమఱదిని నేను భూపాలకునకు
భూమిపతి భర్త నాతోడబుట్టువునకు.
(శకారుడు-మృచ్ఛకటిక-IX)

**(v) సంలాపం** : ఉక్తి-ప్రత్యుక్తి సహితమైన సంభాషణ.

ఉదా : భిక్షాం ప్రదేహి లలితోత్పలవత్రనేత్రే!
పుష్పిణ్యహం ఖలు సురాసురవందనీయ!
బాలే! తథా యది ఫలం త్వయి విద్యతే మే।
వాక్యై రలం, ఫలభుగీశ వరోఽస్తి యాహి ॥

- ఉక్తి : కలువరేకులవంటి కన్నులు కలదానా! భిక్ష పెట్టు.

ప్రత్యుక్తి : నేను పుష్పిణిని (=పుష్పించినలతను =ముట్టుతను) సురాసుర వందనీయ!

ఉక్తి : ఓ బాలా! నీవు పుష్పిణివి (=పూచినదానవు) అయితే మాకు ఫలము (=పండు) నీయందు కలదని తెలుస్తున్నది.

ప్రత్యుక్తి : ఈ నీ మాటలు కట్టిపెట్టు. ఫలభోక్తవరుడు (=వరుడు) ఉన్నాడు. ఇంక నీవు పొమ్ము.

**(viii) అతిదేశం :** నీవు చెప్పిన దానినే నేను చెప్పాను; లేదా నేను చెప్పినదానినే నీవు చెప్పావు - మున్నగు వాక్యాలు.

"నా మాటలతనిమాటలే" అని చెప్పటం (ర.సు.I-*224*).

ఉదా : తనయాం తవ యాచతే హరి
ర్జగదాత్మా పురుషోత్తమః స్వయమ్ ।
గిర గహ్వర శబ్ద సన్నిభాం
గిరి మస్మాకా మవేహి వారిధే ॥

---ఓ సముద్రుడా! ఏ ప్రపంచమున కాత్మ అయినవాడు, పురుషోత్తముడు అయిన విష్ణువు స్వయంగా నీ పుత్రికను (=లక్ష్మీ దేవిని) వివాహార్థం కోరుతున్నాడు. గిరిగుహాధ్వనితో సమానమైన మామాటను ఆయన మాటగా తెలిసికొమ్ము.

**(ix)** నిర్దేశం : 'అయినానేను మాటాడుతున్నాను' అని తనను తాను నిర్దేశించుకొనటం. వాడు, వీడు, నేను - అని సూటిగా చెప్పటం (భ.ర.ప్ర.).

ఉదా : ఏతే వయ మమీదారాః కన్యేయం కులజీవితమ్ ।
బ్రూత యేనాత్ర వః కార్యమనాస్థా బాహ్యవస్తుషు ॥
(కు.సం.VI-*63*)

— (హిమవంతుడు) : ఇదిగో నేను ఉన్నాను; నా భార్య (=మేనక) ఉన్నది; మాకులజీవితమైన కన్య (=పార్వతి) ఉన్నది. మాలో ఎవరివలన పని ఉన్నదో తెలుపుడు. ఇక బాహ్యవస్తువులను గూర్చి చెప్పవలసిన పనియేలేదు.

**(x)** వ్యపదేశం : వ్యాజంతో మాటచెప్పటం. ఏదైనామిషతో, స్వాభిలాషను వ్యక్తం చేయటం (ర.సు.I-*226*).

ఉదా : అభినవ మధులోలువ స్త్వం
తథా పరిచుంబ్య చూతమంజరీమ్ ।
కమల వసతిమాత్ర నిర్వృతో
మధుకర! విస్మృతోఽస్యైనాం కథమ్ ॥

(అ.శా.V-*1*)

— ఓ మధుపమా! నీవు (=దుష్యంతుడ!) క్రొత్తమకరందమునందు మిక్కిలి ఆసక్తి కలిగి, ఆ రీతిని అపుడు చూతమంజరిని (=హంసపదికను) బాగుగా చుంబించితివి. ఇప్పుడు కేవలం కమలమునందు (=ధారుణీదేవి సౌధంలో) నివసిస్తూ తృప్తిపొంది, ఆమామిడి పూలగుత్తిని ఎట్లామరచావు?

**(xi) ఉపదేశం :** ఇదితీసుకో, ఇది చేయుము మున్నగు వాక్యాలను చెప్పటం. శిక్షార్థం (=జ్ఞానం కలిగించే నిమిత్తం) చెప్పేమాటలు ఉపదేశం (ర.సు.I-*225*).

ఉదా : సత్యంవద, ధర్మంచర . . .
మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్య
దేవోభవ, అతిథిదేవోభవ . . . (తైత్తిరీయ ఉపనిషత్-I-*1-11*)

— సత్యం పలుకు. ధర్మం అనుష్ఠించు . . . నీవు నీ తల్లిని దేవీ మూర్తిగా భజించు. తండ్రిని దేవునిగా పూజించు. గురువును దేవునిగా పూజించు. అతిథిని దేవునిగా పూజించు.

**(xii) అపదేశం :** తాను చెప్పదలచిన దానిని "అతడు ఇట్లా చెబుతున్నాడు" అని ఇంకొకడు చెప్పినట్లు చెప్పటం. వేరే అర్థం చెప్పటం (అన్యార్థ కథనం) (ర.సు.I-*226*).

ఉదా : కోశద్వంద్వ మియం దధాతి నలినీ కాదంబచంచుక్షతం
ధత్తే చూతలతా నవం కిసలయం పుంస్కోకిలాస్వాదితం ।
ఇత్యాకర్ణ్య మిథస్సఖీజనవచస్సా దీర్ఘికాయాస్తటే
చేలాంచేన తిరోదధే స్తనయుగం బింబాధరం పాణినా ॥
-(ర.సు.I-*226*)

— "ఈ పద్మలత కలహంసముక్కుచేత పొడువబడిన రెండు మొగ్గలను ధరిస్తున్నది. ఈ మామిడి మగకోకిలచేత ఆస్వాదింపబడిన క్రొంజిగురును తాల్చుచున్నది" అని చెలికత్తెలు దిగుడుబావివద్దఒకరితో ఒకరు సంభాషించగా, ఆ బాల పయటతో కుచాలను, చేతితో పెదవిని కప్పికొన్నది.

**(2) సప్తప్రకార వాచికాభినయం :**

ద్వాదశాత్మకమైన వాచికాభినయం మరల సప్తవిధాలుగా ఉంటుంది -

ప్రత్యక్షం, పరోక్షం, భూతకాలికం, వర్తమానకాలికం, భావికాలికం, ఆత్మస్థం, పరస్థం. ఉదాహరణలు :

(i) "(ఇటువంటి మాటలు) అతడు చెప్పుచున్నాడు; నేనుకాదు" - ఈ వాక్యద్వయం ప్రత్యక్షం, పరోక్షం, వర్తమానం అవుతుంది.

(ii) నీవు చెప్పినట్లుగా నేను చేస్తున్నాను, నేను వెళ్ళుతున్నాను, నేను చెప్పు చున్నాను - ఈ వాక్యత్రయం ఆత్మస్థం, వర్తమానకాలికం, ప్రత్యక్షం అవుతుంది.

(iii) నేను చేస్తాను, వెడతాను, చెబుతాను - ఈ వాక్యత్రయం ఆత్మస్థం, భవిష్యకాలికం, పరోక్షం అవుతుంది.

(iv) నాచేత శత్రువులు చంపబడినారు, ఓడింపబడినారు, చీల్చబడినారు - ఈ వాక్యత్రయం ఆత్మస్థం, పరోక్షం, వర్తమానకాలికం అవుతుంది.

(v) నీచేత (శత్రువులు) చంపబడినారు, ఓడింపబడినారు - నాట్యకర్మలో చెప్పే ఈవాక్యద్వయం పరోక్షం, పరస్థం, వర్తమానకాలికం అవుతుంది.

(vi) ఇతడు చెప్పుచున్నాడు, చేయుచున్నాడు, వెడుతున్నాడు - ఇది ప్రత్యక్షం, పరస్థం, వర్తమానకాలికం.

(vii) అతడు వెళ్ళుచున్నాడు, చేయుచున్నాడు - ఇది పరోక్షం, పరస్థం, వర్త మానకాలికం.

(viii) వారు చేస్తారు, వెళ్ళుతారు, చెబుతారు - ఇది పరోక్షం, పరస్థం, భవిష్యకాలికం.

(ix) నాచే .ఈకార్యం, నీసహకారంతో, ఇప్పుడే పూర్తికావాలి - ఇది ఆత్మస్థం, పరస్థం, వర్తమానకాలికం.

(x) నాట్యమందు హస్తాన్ని అడ్డంగాపెట్టి మాటాడటం (స్వగతం-జనాంతికం-అపవారితకం) - ఇది వక్తకు ఆత్మస్థం - హృదయస్థం, ఇతరులకు పరోక్షం అవుతుంది.

(xi) అతడిదిచేశాడు, ఇది వానిది, అతడిట్లా చేస్తున్నాడు - ఈ పరోక్షాభి నయం 'మధ్యస్థం' అవుతుంది. స్వవిషయం నిరూపించటం ఆత్మస్థం; 'పరార్థవర్ణన' పరస్థం.

ఇట్లా సప్తప్రకారాల భేదాలు తెలియవలె. ఇవి అన్నీ మార్గాభినయమందు ప్రయుక్తములవుతాయి. వీని నుంచి అనేక అభినయాలు నిష్పన్నములవుతాయి.

టీక : 'వీని నుంచి అనేక అభినయాలు నిష్పన్నములవుతాయి'. - దీనిమీద అభినవగుప్తుని వ్యాఖ్య ఇట్లా ఉన్నది : వాక్యాలు ఆలాప-సంలాపాది భేదాలచేత 12 విధాలు; అవి, మరల, ఆత్మస్థ-పరస్థ-ప్రత్యక్ష-పరోక్ష భేదాలచేత నాలుగేసి విధాలు - కాగా 48 విధాలు. ఇవి మరల మూడు కాలాలచేత విభిన్నములై మొత్తం (48×3) 144 భేదాలవుతాయి. వీటినుంచి, సంస్కృత-ప్రాకృతాదిభేదాలను అనుసరించి, సూచా-అంకురాది భేదాలను అనుసరించి అనంతములైన భేదాలు నిష్పన్నములవుతాయి (అ.భా. 3వ సం.పుటలు 179-80).

ఇట్లా, ఈ విభజనను అర్వాచీన శాస్త్రకర్తలు ఎవ్వరూ చేసినట్లు కానరాదు.

## 8. బుద్ధి-ఆరంభ-అనుభావాలు :

మూలం : బుద్ధ్యారంభా స్తథా ప్రోక్తా రీతి-వృత్తి-ప్రవృత్తయః ।

-(ర.సు.I-227)

[ప్రబంధాదిషు తే జ్ఞేయా భావశాస్త్రవిచక్షణైః]

అర్థం : తథా, రీతి-వృత్తి- ప్రవృత్తయః =ఇంక, రీతి, వృత్తి, ప్రవృత్తి - ఇవి; బుద్ధి- ఆరంభాః, ప్రోక్తా=బుద్ధి-ఆరంభ-అనుభావాలు (అని), చెప్పబడినవి.

*[తే, ప్రబంధాదిషు, భావ-శాస్త్రవిచక్షణైః, జ్ఞేయాః=ఇవి, ప్రబంధాలు మున్నగువానియందు, భావశాస్త్రం తెలిసిన వారిచేత, తెలియదగినవి - భ.ర.ప్ర.]*

తాత్పర్యం : *1. రీతి, 2. వృత్తి, 3. ప్రవృత్తి - ఈ మూడూ బుద్ధ్యారంభాను భావాలు (ఇవి, ప్రబంధాలు మున్నగువానియందు కన్పట్టగలవు).*

టీక : బుద్ధ్యారంభానుభావాలు ప్రబంధాదులందు కన్పట్టగలవని సారాంశం. ఈ మూడింటిలో 'ప్రవృత్తి'ని 13 వ అధ్యాయంలో నాట్యపరంగానే భరతముని వివరించినాడు; అట్లాగే 'వృత్తి'ని కూడా నాట్యపరంగానే 21 వ అధ్యాయంలో వర్ణించినాడు. 'రీతి' ప్రసక్తి నా.శా.లో లేదు. "పదవిన్యాసభంగి రీతి; అది కోమల, కఠిన, మిశ్రభేదాలచేత త్రివిధం. అందులో కోమల భేదాన్ని 'వైదర్భీరీతి' అని కూడా అంటారు; ఈ వైదర్భీరీతికి శ్లేషాది పదిగుణాలు ప్రాణాలు" అని వానిని వివరించినాడు సింగభూపాలుడు (ర.సు.I-227-40). రీతిప్రశస్తిని, సింగభూపాలుడు, ఇట్లా వివరించినాడు : (ర.సు.I-242)

మూలం : త ఏవ పదసంఘాతా స్తా ఏవార్థవిభూతయః ।
తథాపి నవ్యం భవతి కావ్యం గ్రథన కౌశలాత్ ॥

— పదసమూహం, అర్థసంపద అవియే. అయినా, కూర్పునందలి నేర్పు(=రీతి) చేత కావ్యం క్రొత్తదనం పొందుతుంది.

నాకవిత్వ మధర్మాయ వ్యాధయే దండనాయవా ।
కుకవిత్వం పునః సాక్షాన్మృతిమాహుః మనీషిణః ॥
-భామహకావ్యాలంకారం-I-12

అంగుల్యా కః కవాటం ప్రహరతి

కుటిలే! మాధవః. కిం వసంతః?

నో చక్రీ, కింకులాలో? నహి ధరణీధరః,

కిం ద్విజిహ్వః ఫణీంద్రః?

నాహం ఘోరాహిమర్దీ, కిమసి ఖగపతిః?

నో హరిః, కింకపీంద్రః?

ఇత్యేవం గోపకన్యా ప్రతివచన జితః

పాతువశ్చక్రపాణిః.

-శ్రీకృష్ణకర్ణామృతం-III-105

# స్థాయిభావాలు

మూలం : న హి రసాదృతే కశ్చి దర్థః ప్రవర్తతే.
తత్ర విభావాను భావ వ్యభిచారి సంయోగాత్
రసనిష్పత్తిః. కో దృష్టాంతః? అత్రాహ.
యథా హి నానావ్యంజనౌషధి ద్రవ్యసంయో
గాత్ రసనిష్పత్తిః, తథా నానాభావోప
గమా ద్రసనిష్పత్తిః. యథా హి-గుడాదిభిః
ద్రవ్యై ర్వ్యంజనై రౌషధిభిశ్చ షాడవాదయో
రసా నిర్వర్త్యంతే తథా నానాభావోప
గతా అపి స్థాయినో భావా రసత్వ మాప్ను
వంతీతి - - - - -

-(నా.శా.VI-గద్య)

అత్రాహ - యది కావ్యార్థ సంశ్రితై ర్విభావాను
భావవ్యంజితై రేకోనపంచాశద్భావైః సామాన్య
గుణయోగే నాభినిష్పద్యంతే రసాః, తత్కథం
స్థాయిన ఏవ భావా రసత్వ మాప్నువంతి?
ఉచ్యతే-యథా హి సమానలక్షణా స్తుల్య
పాణి పాదోదర శరీరాః, సమానాంగ ప్రత్యంగా
అపి పురుషాః, కులశీల విద్యాకర్మ శిల్పవిచక్ష
ణత్వా, ద్రాజత్వ మాప్నువంతి; త త్రైవ చాన్యేఽల్ప
బుద్ధయః తేషా మేవానుచరా భవంతి. తథా
విభావానుభావవ్యభిచారిణః స్థాయిభావా నుపా
శ్రితా భవంతి. బహ్వాశ్రయత్వాత్ స్వామిభూతాః
స్థాయినో భావాః. తద్వత్ స్థానీయపురుష
గుణభూతా అన్యే భావా స్తాన్ గుణతయా
శ్రయంతే, స్థాయి భావా రసత్వమాప్నువంతి,

పరిజనభూతా వ్యభిచారిణోభావాః.
అత్రాహ-కో దృష్టాంత ఇతి?
యథా నరేంద్రో బహుజన పరివారోఽపి స ఏవ
నామ లభతే నాన్యః సుమహానపి పురుషః;
తథా విభావానుభావవ్యభిచారి పరివృతః
స్థాయీ భావో రసనామ లభతే.
భవతి చాత్ర శ్లోకః -
యథా నరాణాం నృపతిః శిష్యాణాం చ యథా గురుః ।
ఏవం హి సర్వభావానాం భావః స్థాయీ మహా నిహ ॥ 8
లక్షణం ఖలు పూర్వమభిహిత మేషాం రస ... కా
నామ్. ఇదానీం భావసామాన్య లక్షణ మభిధాస్యామః.
-(నా.శా.VII-గద్యం+శ్లోకం)

అర్థం : నహి రసాత్-ఋతే, కశ్చిత్-అర్థః, ప్రవర్తతే=రసవిహీనమై, ఏ అర్థమును, ప్రవర్తించదు.

తత్ర, విభావ-అనుభావ-వ్యభిచారి సంయోగాత్, రసనిష్పత్తిః =ఇందు, విభావం-అనుభావం-వ్యభి (సం) చారిభావాలు - వీటియొక్క, సంయోగం వల్ల, రసం, నిష్పన్నమవుతుంది.

దృష్టాంతః కః=(ఋషుల ప్రశ్న) (ఇందుకు) దృష్టాంతం, ఏమిటి?

(అత్ర, ఆహ) యథా(హి), నానావ్యంజన-ఔషధి-ద్రవ్య సంయోగాత్ రస నిష్పత్తిః=ఎట్లా, వివిధములైన వ్యంజనాల (=రుచికరములైన ద్రవపదార్థాల), ఓషధుల (=పసుపు మొదలగువాని), ద్రవ్యాల (=బెల్లం మొదల గువాని) సంయోగంవల్ల (=చక్కని పాళ్ళలో కూర్చబడటంవల్ల), రసాలు (తీపిమున్నగు ఆరురసాలు) నిష్పన్నములవుతున్నవో; తథా, నానాభావ- ఉప గమాత్, రసనిష్పత్తిః=అట్లాగే, నానావిధాలైన భావాలయొక్క సంయోగం వల్ల, రసాలు నిష్పన్నము లవుతున్నవి. యథా(హి), గుడ-ఆదిభిః, ద్రవ్యైః, వ్యంజనైః, ఓషధిభిః(చ), షాడవ-ఆదయః, రసాః, నిర్వర్త్యంతే=ఎట్లా, బెల్లం మున్నగు, ద్రవ్యాల, వ్యంజనాల, ఓషధుల సంయోగంవల్ల, షాడవం మున్నగు (పాఠాంతరం-షట్=ఆరు) రసాలు, సిద్ధములవుతున్నవో; తథా, నానాభావ- ఉపగతాః, అపి, స్థాయినః, భావాః, రసత్వం, ఆప్నువంతి, ఇతి =అట్లాగే, వివిధాలైన భావాలయొక్క కలయికకలవి అయినప్పటికీ, స్థాయిభావాలు, రసత్వం, పొందుతున్నవి (=ప్రతిపాదిస్తున్నవి).

అత్ర-ఆహ=(ఋషుల ప్రశ్న) –

కావ్య-అర్థసంశ్రితైః, విభావ-అనుభావ వ్యంజితైః, ఏకోన పంచాశత్-భావైః, సామాన్య గుణయోగేన, రసాః, అభినిష్పద్యంతే, యది =కావ్యార్థాలను ఆశ్రయించుకొన్న, విభావ-అనుభావాలచేత వ్యంజితము (=వ్యక్తము) లైన, 49 భావాలయొక్క, సామాన్య గుణయోగంవల్ల, రసాలు నిష్పన్నములు అవుతున్నవి (కదా), అయితే; స్థాయినః, భావాః, ఏవ, రసత్వం, అప్నువంతి, తత్-కథం=స్థాయి భావాలు, మాత్రమే, రసత్వం, పొందు తున్నవి, అది (=అని చెప్పటం) ఏమిటి? ఉచ్యతే=(భరతమునిచేత సమాధానం) చెప్పబడుతున్నది.

యథా(హి), పురుషాః=సమాన లక్షణాః, తుల్యపాణి-పాద-ఉదర- శరీరాః, సమాన-అంగ- ప్రత్యంగాః అపి =ఎట్లా, పురుషులందరు సమానములైన లక్షణాలు, తుల్యములైన పాణులు- పాదాలు-ఉదరాలుకల శరీరాలు, సమానములగు అంగ-ప్రత్యంగాలు-కలిగి ఉన్నప్పటికీ; కుల-శీల-విద్యా-కర్మ-శిల్ప-విచక్షణత్వాత్, రాజత్వం, అప్నువంతి =(అందులో కొందరు మాత్రమే) కులం-శీలం-విద్య-కర్మ-శిల్పం-వివేకం– వీనివల్ల, రాజత్వం, పొందుతున్నారు; తత్ర-ఏవ(చ), అల్ప బుద్ధయః, అన్యే, తేషాం-ఏవ, అనుచరాః, భవంతి=అచ్చటనే, అల్పబుద్ధులుగల, ఇతరులు, వారికి, అనుచరులు, అవుతున్నారు.

తథా, విభావ-అనుభావ-వ్యభిచారిణః, స్థాయిభావాన్, ఉపాశ్రితాః, భవంతి=అట్లాగే, విభావం- అనుభావం-వ్యభిచారి భావాలు, స్థాయి భావాలను, ఆశ్రయించునవి అవుతున్నది; బహు- ఆశ్రయత్వాత్, స్థాయినః భావాః, స్వామిభూతాః=పలువురు-ఆశ్రయించి ఉండటంచేత, స్థాయిభావాలు, స్వామిత్వం పొందుతున్నవి.

తద్వత్, స్థానీయ పురుష గుణభూతాః, అన్యే, భావాః, తాన్-గుణతయా, శ్రయంతే=అట్లాగే, స్థానీయ (=రాజత్వం పొందిన) పురుషునకు (తక్కినవారు) అనుచరులైనట్లే, ఇతర, భావాలు, (స్థాయిభావాలయొక్క) గుణాధిక్యంచేత, (స్థాయిభావాలను) ఆశ్రయిస్తున్నవి; స్థాయి భావాః, రసత్వం-అప్నువంతి =(అందుచేత) స్థాయి భావాలు, రసత్వం, పొందుతున్నవి; వ్యభిచారిణః భావాః, పరిజన భూతాః=(ఇంక) వ్యభిచారి భావాలు, పరిజనతుల్యములవుతున్నవి.

(అత్ర-ఆహ) దృష్టాంతః, కః=(ఇందుకు) దృష్టాంతం, ఏమిటి? యథా, నరేంద్రః, బహుజన పరివారః-అపి, సః-ఏవ, నామ, లభతే=ఎట్లా, నరేంద్రుడు, బహుజన పరివారంతో ఉన్నప్పటికీ (=ఉన్నప్పుడే), అతడు (రాజు అనే) పేరు పొందుతున్నాడో; సుమహాన్-అపి, న-అన్యః పురుషః=ఎంత గొప్ప పురు

షుడు అయినప్పటికీ, ఇతర పురుషుడు (రాజు పేరు) పొందడో; తథా=అట్లాగే; విభావ-అనుభావ-వ్యభిచారి పరివృతః, స్థాయిభావః, రసనామ, లభతే=విభావ-అనుభావ- వ్యభిచారి పరివృతమైన స్థాయిభావం (మాత్రమే), రసం (అనే) పేరు, పొందుతున్నది.

అత్ర, శ్లోకః, భవతి(చ)=ఇచ్చట, ఒక శ్లోకం, ఉన్నది; నరాణాం, నృపతిః, యథా =నరులలో, నృపతి, ఎట్లాగో; శిష్యాణాం, గురుః, యథా =శిష్యులలో, గురువు, ఎట్లాగో; ఏవం(హి)=అట్లాగే; ఇహ, సర్వభావానాం, స్థాయీభావః, మహాన్=ఇక్కడ, సర్వభావాలలో, స్థాయిభావం, గొప్పది. రససంజ్ఞకానామ్, ఏషాం, లక్షణం(ఖలు), పూర్వం, అభిహితం=(రససంజ్ఞకల, వీటి (=స్థాయి భావాల), లక్షణం ఇంతకుముందే చెప్పబడినది (=రస లక్షణం చెప్పినప్పుడే, ఆయాస్థాయి భావాల లక్షణంకూడా చెప్పినట్లయింది); ఇదానీం, భావ సామాన్య లక్షణం, అభిధాస్యామః=ఇప్పుడు, (స్థాయిభావాలు కేవలం) భావాలుగా ఉన్నప్పటి లక్షణం, చెబుతాను.

తాత్పర్యం : రసహీనమై ఏ అర్థం ప్రవర్తించదు. అట్టి రసం విభావ-అను భావ-వ్యభిచారి భావాల సంయోగంవల్ల నిష్పన్న మవుతుంది.

ప్రశ్న : అందులకు దృష్టాంతం ఏమిటి?

సమా : వివిధములైన వ్యంజనాల (=రుచికరములైన ద్రవపదార్థాల), ఓష ధుల (=పసుపు మొ॥), ద్రవ్యాల (=బెల్లం మొ॥) సంయోగంవల్ల (లౌకిక) రసాలు నిష్పన్నములవుతున్నట్లే, నానావిధములైన, భావాల సంయోగంవల్ల (అలౌకిక లేదా నాట్య) రసాలు నిష్పన్నములవుతున్నవి. అంటే గుడాదిద్ర వ్యాల, వ్యంజనాల, ఓషధుల సంయోగంవల్ల షాడవాది (లేదా ఆరు) రసాలు సిద్ధములవుతున్నట్లే వివిధములైన భావాలతో సంయోగం పొందిన స్థాయిభావాలు రసత్వం పొందుతున్నవి (లేదా రసాలను ప్రతిపాదిస్తున్నవి).

ప్రశ్న : కావ్యార్థాలను ఆశ్రయించుకొని ఉన్న, విభావ-అనుభావ వ్యంజిత ములైన, సామాన్యగుణయోగం పొందిన 49 భావాలవల్ల రసాలు నిష్పన్నము లవుతాయని ఇంతకుముందు చెప్పబడినదికదా? మరి, స్థాయిభావాలు మాత్రమే రసత్వాన్ని పొందుతాయని చెప్పటం ఎట్లా పొసగుతుంది?

సమా : పురుషులందరు సమాన లక్షణాలు, ఒకే విధంగా అంగ-ప్రత్యంగ శరీరనిర్మాణం కలిగి ఉండినప్పటికీ అందులో కొందరు మాత్రమే కుల-శీల-విద్యా-శిల్ప-కర్మ-విచక్షణత్వాలవల్ల రాజత్వం పొందుతున్నారు; ఇంక, అల్పబుద్ధులయిన

ఇతరులు వారికి అనుచరులు అవుతున్నారు. అట్లాగే ఏకోన పంచాశత్ (=49) భావాలు సమానధర్మాలు కలవి అయినప్పటికీ, అందులో రత్యాదిస్థాయి భావాలే ప్రాధాన్యం వహిస్తున్నవి; తక్కిన భావాలు వానిని ఆశ్రయించుకొని ఉంటాయి. అంటే బహ్వాశ్రయత్వం (=చాలా భావాలకు ఆశ్రయాలు కావటం) వల్ల స్థాయిభావాలు స్వామిభూతములవుతున్నవి. అంగభూతులైన పురుషులు రాజులను ఆశ్రయించుకొని ఉన్నట్లే, అంగభూతములైన ఇతరభావాలు స్థాయిభావాలను ఆశ్రయించుకొని ఉంటాయి. కాగా, స్థాయిభావాలు రసత్వాన్ని పొందుతున్నవి. ఇంక, వ్యభిచారిభావాలు పరిజనభూతములైఉంటాయి.

ప్రశ్న : ఇందులకు దృష్టాంతం ఏమిటి?

సమా : బహుజనపరివారంతో ఉన్నప్పుడే 'నరేంద్ర' నామం కలుగుతుంది కాని, మహాపురుషుడైనంతమాత్రాన ఆ పేరు ఎవనికినిరాదు. కావున విభావ-అనుభావ-వ్యభిచారి భావాలతో సంయోగం పొందిన స్థాయిభావానికే 'రసం' అనే పేరు లభిస్తుంది. ఈ సందర్భంలో ఒక శ్లోకం ఉంది :

నరులలో నృపతి, శిష్యులలో గురువు ఎట్లా మహనీయులో, సర్వభావాలలో స్థాయిభావం అట్లా మహనీయం.

రససంజ్ఞపొందే స్థాయిభావాల (అంటే రసాల) లక్షణాలను ఇదివరకే (6 వ అధ్యాయంలో) చెప్పాను. ఇప్పుడింక, స్థాయిభావాలయొక్క సామాన్యలక్షణాలను వివరిస్తాను.

టీక : 1. రసనిష్పత్తిని గూర్చి భరతముని మూడు విధాలుగా చెప్పినాడు:

1) విభావ-అనుభావ-వ్యభిచారి భావాలయొక్క సంయోగం వల్ల రసం నిష్పన్నమవుతుంది (6 వ అధ్యా).

2) గుడాది ద్రవ్యాదుల సంయోగంవలన షాడవాది రసాలు ఉత్పన్నమైనట్లే, నానాభావోపగతములైన స్థాయిభావాలు రసత్వం పొందుతున్నవి (6 వ అధ్యా).

3) ఏకోనపంచాశత్ (49) భావాలయొక్క సామాన్య గుణయోగంవల్ల రసాలు నిష్పన్నములవుతాయి (7 వ అధ్యా).

4) నరులలో నృపతి, శిష్యులలో గురువు మహనీయులైనట్లే, భావాలలో మహనీయమైన స్థాయిభావం రసత్వం పొందుతున్నది (7 వ అధ్యా).

స్థూలంగా చూస్తే, పై మొదటి మూడు వాక్యాలు ఏకార్థబోధకాలుగా కన్పట్టవు. అందుచేత, మహర్షులు మరలమరల ప్రశ్నించటం, భరతముని సమాధానం చెప్పటం జరిగింది. ఈ మూడింటిలో మొదటిది భరతముని ప్రోక్తమైన

సుప్రసిద్ధరససూత్రం; ఇందులో స్థాయిభావప్రసక్తి లేదు. మూడవ వాక్యంలో చెప్పబడిన 49 భావాలలో స్థాయిభావాలు కూడా ఉన్నాయి. రెండవ వాక్యంలో స్థాయిభావాలే రసత్వం పొందుతున్నవని స్పష్టంచేయబడింది. అందుకు దృష్టాంతంగా ఇవ్వబడిన ప్రాచీన శ్లోకం నాలుగవది. సుప్రసిద్ధ రససూత్రాన్ని 'రసానుభూతి' చర్చలో వివరిస్తాను. ఇంక ఇచ్చట ప్రధాన అంశం "స్థాయిభావం రసంగా పరిణమిస్తుంది; లేదా రసోద్భవ హేతువు అవుతుంది" అనే విషయం. 49 భావాలలోను, ఎనిమిది స్థాయిభావాలు; ఇవే రసోద్భవసాధనాలు. స్థాయిభావాన్ని భరతముని ఇట్లా వివరించినాడు:

యోఽర్థో హృదయ సంవాదీ తస్య భావో రసోద్భవః ।
శరీరం వ్యాప్యతే తేన శుష్కం కాష్ఠ మివాగ్నినా ॥
-(నా.శా.VII-7)

— ఏ అర్థం సహృదయహృదయసంవాది అవుతుందో, తదర్థభావనయే రసోద్భవహేతువు అవుతుంది. శుష్కమైన కాష్ఠమందు అగ్నివలెనే, హృదయసంవాది అయిన ఆ అర్థం (=స్థాయిభావం) శరీరమంతటా వ్యాపిస్తుంది.

2. ధనంజయుడు స్థాయిభావాన్ని క్రిందివిధంగా నిర్వచించినాడు:

విరుద్ధై రవిరుద్ధై ర్వా భావై ర్విచ్ఛిద్యతే న యః ।
ఆత్మభావం నయత్యన్యాన్ స స్థాయీ లవణాకరః ॥
-(ద.రూ.IV-34)

— ఏ భావం - విరుద్ధాలు (=విజాతీయాలు) అయిన భావాలచేతకాని, అవిరుద్ధాలు (=సజాతీయాలు లేదా పోషకాలు) అయిన భావాలచేతకాని, విచ్ఛేదం (=తిరస్కృతి) పొందదో, లవణాకరంవలె (=ఏవిధంగా ఉప్పు సముద్రం తనలో కలిసిన నదులన్నిటికి తన గుణాన్నే కలిగిస్తుందో ఆవిధంగా తక్కిన భావాలన్నింటికి స్వీయభావం (=తన గుణం) ఆపాదిస్తుందో - అది స్థాయిభావం.

ధనంజయుని పై నిర్వచనాన్నే అర్వాచీనులందరూ అనుసరించినారు; అయితే ధనంజయుడు లవణాకరాన్ని ఉపమానంగా చెప్పగా, సింగభూపాలాదులు క్షీరసముద్రాన్ని ఉపమానంగా చెప్పినారు (సారాంశం మాత్రం ఒక్కటే).

3. "రసలక్షణాలను ఇదివరకే చెప్పాను; ఇప్పుడు భావసామాన్య లక్షణాలను వివరిస్తాను" అని చెప్పినాడుకదా భరతముని 7 వ అధ్యాయంలో. దీనిపై 'వ్యక్తివివేకం'లో మహిమభట్టు ఇట్లా వ్యాఖ్యానించినాడు:

స్థాయిభావానుకరణములే రసములు, అవియే ప్రధానములు. వాని రెండింటికిని బింబ-ప్రతిబింబ భావముండుటచే రసస్వరూపమును వర్ణించినచో స్థాయి భావరూపమును వర్ణించినట్లే అవుతుంది. రసలక్షణం 6 వ అధ్యాయంమందే వర్ణితమైనది. దానివలన స్థాయిభావలక్షణం గతార్థమే అవుతున్నది. అందుచే స్థాయిభావాలను ప్రత్యేకంగా వివరించవలసిన అవసరం లేకపోయినది. కావున వ్యభిచారిభావాలుగా ఉండే స్థాయిభావాలకే 7 వ అధ్యాయమందు లక్షణం చెప్పబడినది.

స్థాయిత్వం లేదా స్థిరంగా ఉండటం అనే ధర్మం స్థాయిభావములందే ఉంటుంది. అట్లే వ్యభిచారిత్వమనే ధర్మం వ్యభిచారి భావము లందును, సాత్త్వికత్వమనెడి ధర్మం సాత్త్విక భావములందును మాత్రమే ఉంటుంది. కాని వీనిలో స్థాయిభావములకు మాత్రం స్థాయిత్వమేకాక వ్యభిచారిత్వంకూడ ఉన్నది. అందుచే అవి స్థాయిభావములును, వ్యభిచారిభావములునుకూడా అవుతున్నవి. కావుననే స్థాయిభావములగు హాసము శృంగారమునకును, శోకము విప్రలంభమునకును వ్యభిచారి భావములుగ మారినవి. వ్యభిచారి-సాత్త్విక భావములు మాత్రమెన్నడును ఇట్లా మారవు (వివరములకు శ్రీభాగవతుల కుటుంబరాయశాస్త్రిగారి వ్యక్తివివేకానువాదమును చూడవలె - ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక).

సారాంశ మేమనగా రత్యాద్యష్ట భావాలకు స్థాయిత్వమేకాక వ్యభిచారిత్వం కూడా కలదు. నిర్వేదాదివ్యభిచారిభావాలకు వ్యభిచారిత్వమేకాని స్థాయిత్వం ఉండదు; సాత్త్వికభావాలకు ఇట్లే. కావున, రసోద్భవ హేతువులైన స్థాయిభావాల స్వరూపం రసాల స్వరూపంతో సమానమవీ, 7 వ అధ్యాయంలోని వివరణ స్థాయిభావాలు వ్యభిచారిభావాలైనప్పటి స్థితికి చెందినదని స్పష్టం.

4. శృంగారప్రకాశంలో భోజుడు - గర్వం, స్నేహం, ధృతి, మతి-అనే నాలుగు స్థాయిభావాలను అధికంగా కల్పించి, ఇవి క్రమంగా ఉద్ధతరసం, ప్రేయోరసం, శాంతరసం, ఉదాత్తరసం అనే నాలుగు రసాలకు క్రమంగా స్థాయిభావాలు అవుతాయని ప్రతిపాదించినాడు. కాని, సింగభూపాలాదులు ఈ ప్రతిపాదనను విమర్శించి, వీనికి స్థాయిభావత్వయోగ్యత లేదని నిర్ణయించినారు.

5. భరతముని అష్టరసవాది అనటం సుప్రసిద్ధం. అందుచేత ఆయన ఎనిమిది రసాలకు ఎనిమిది స్థాయిభావాలనే నిర్దేశించినాడు. కాని తరువాతివారగు ఉద్భటుడు మున్నగువారు 'శాంతము'ను 9 వ రసంగా ప్రతిపాదించి, దానికి 'శమము' స్థాయిభావమన్నారు. నాట్యశాస్త్ర వ్యాఖ్యాత యగు అభినవగుప్తుడు ఈ ప్రతిపాదనను అంగీకరించి, శాంతాన్ని 9 వ రసంగా స్థాపించి, 'తత్త్వజ్ఞానం' లేదా 'ఆత్మజ్ఞానం'ను స్థాయి భావంగా పేర్కొన్నాడు.

శమస్థాయిత్వాన్ని శారదాతనయుడు అంగీకరించలేదు - "శమంలో ఏ వ్యాపారం ఉండదు. సర్వవ్యాపారాలు అందులో విలీనమవుతాయి. అందుచేత శమంలో అనుభావాదికం ఉండదు. అనుభావరాహిత్యంవల్ల నాట్యంలో అభినయానికి అవకాశం ఉండదు. కావున శమం స్థాయిభావం కాజాలదు." (భా.ప్ర.I-285-6) కొందరు, వ్యభిచారిభావాలలో మొదటి దైన 'నిర్వేదము'ను శాంతరసస్థాయి భావంగా పేర్కొన్నారు. దీనిని కూడా శారదాతనయాదులు త్రోసిపుచ్చినారు. కాగా, భరతముని పేర్కొన్నట్లుగా, స్థాయిభావాలు ఎనిమిదే. కాని, శారదాతనయుడు శాంతరసాన్ని శ్రేష్ఠరసంగా అంగీకరించి దానిని వివరించినాడు. అయితే అది 'వికలాంగం' అన్నాడు. - అంటే అందులో అంగాలు-అనుభావాదికం-ఉండదు; దీనికి ఉపకరించే సంచారిభావాలు కూడా ఉండవు (భా.ప్ర.VI-44-58).

6. స్థాయిభావాలు రసరూపం పొందే విధానాన్ని సింగభూపాలుడు ఇట్లా వర్ణించినాడు (ర.సు.II-161-62) :

- నటనమందు (=నృత్య-నాట్యాలలో) అభినయాలద్వారా సాక్షాత్కారం పొందినట్లు చేయబడిన స్థాయిభావాలు, తమతమ విభావ-అనుభావ-వ్యభిచారిభావ-సాత్త్వికభావాలచేత, స్వాదురూపతనుపొంది, సామాజికుల మనస్సులలో రసాలుగా పరిణమిస్తున్నవి.

కావున, రసం మనస్సుచేతనే అనుభావ్యమవుతుంది; అంతేకాదు, అది భావజ్ఞుల (=సుమనస్కుల=సహృదయుల) చేతనే అనుభావ్యమవుతుంది.

## 1. రతి

మూలం : తత్ర రతిర్నామ మోదాత్మికా. ఋతు-మాల్యానులేపనాభరణ-
భోజన-వరభవనానుభవ నాప్రాతికూల్యాదిభిః
విభావైః సముత్పద్యతే. తా మభినయేత్
స్మితవదన మధురకథన భ్రూక్షేప కటాక్షాదిభిః అనుభావైః.

అత్రశ్లోకః-
ఇష్టార్థ విషయ ప్రాప్త్యా రతి రిత్యుపజాయతే ।
సౌమ్యత్వా దభినేయా సా వాఙ్మాధుర్యాంగ చేష్టితైః ॥
-(నా.శా.VII-9)

అర్థం : (తత్ర) రతిఃనామ, ప్రమోదాత్మికా=రతి అనేది ప్రమోదాత్మక మైనది; ఋతు, మాల్య-అనులేపన, ఆభరణ, భోజన, వరభవన-అనుభవన-అప్రాతికూల్య-ఆదిభిః, విభావైః, సముత్పద్యతే=(వసంతాది) ఋతువులు, పుష్పమాలలు, మైపూతలు, ఆభరణాలు, ఇష్టమైన భోజనం, మంచి ఇల్లు లభించటం, ప్రతికూలత లేకపోవటం - మున్నగు విభావాలవల్ల (రతి) జని స్తుంది; స్మితవదన, మధురకథన, భ్రూక్షేప, కటాక్ష-ఆదిభిః, అనుభావైః, తామ్, అభినయేత్=మందహాసవదనం, మధురములగు మాటలు, కనుబొమల కదలికలు, కటాక్షాలు మున్నగు, అనుభావాలతో, దీనిని, అభినయించాలి.

తాత్పర్యం : 'రతి' అనే స్థాయిభావం ప్రమోదాత్మకమైనది.

విభావాలు: వసంతాది ఋతువులు, పుష్పమాలలు, మైపూతలు, ఆభర ణాలు, మంచిభోజనం, సుందరభవనం, ప్రతికూలత లేకపోవటం మున్నగు నవి.

అనుభావాలు : మందహాసవదనం, తీయనిమాటలు, కనుబొమల కదలి కలు, కడకంటి చూపులు మున్నగునవి.

అర్థం : అత్ర శ్లోకః =ఈ సందర్భంలో, ఒక శ్లోకం (ఉంది): ఇష్టార్థ ప్రాప్త్యా, రతిః (ఇతి), ఉపజాయతే=ఇష్టార్థవిషయలాభంవల్ల, రతి (అనేది), జనిస్తుంది; సా, వాక్-మాధుర్య, అంగచేష్టితైః, సౌమ్యత్వాత్, అభినేయా=అది (=ఆ రతి) తీయనిమాటలతో, మధురములైన చేష్టితాలతో, సౌమ్యంగా, అభినయింపబడాలి.

తాత్పర్యం : 'రతి' యొక్క నిర్వచనాదులను బలపర్చే ప్రాచీన శ్లోకం ఒకటి ఉంది : ఇష్టార్థవిషయం లభించటంవల్ల రతి జనిస్తుంది. అట్లా జనించిన రతిని, తీయనిమాటలతో, ఆకర్షణీయములైన అంగచేష్టితాలతో, సౌమ్యంగా, ప్రకటించాలి.

టీక : నాట్యశాస్త్రంలో రసాధ్యాయమైన 6 వ అధ్యాయంలో వలెనే, భావాధ్యాయమైన 7 వ అధ్యాయంలో కూడా సాధారణంగా నిర్వచనాలన్నీ గద్యలోనే ఉన్నవి. గద్యలోచేయబడిన నిర్వచనాలకు - విభావ - అనుభావాదులకు ఉపబలకంగా పూర్వగ్రంథాదుల నుంచి లేదా అనువంశ్యములైన శ్లోకాలు, ఆర్యలు, ఉదాహరింపబడినవి. కావున, వీనిని చర్వితచర్వణాలుగా భావింప రాదు. ఈ నిర్వచనాదులలో "విభావాలవల్ల జనిస్తుంది" అన్నప్పుడు వానిని ఆ స్థాయిభావానికి విభావాలుగానూ, ". . . అభినయించాలి" అన్నప్పుడు వాటిని అనుభావాలుగాను గ్రహించాలి. అంటే ఆభావం జనించటానికి హేతువులను (=విభావాలను), దానిని ప్రకటించే విధానాన్ని (=అనుభావాలను) విశదం చేయడమైనదన్నమాట.

సింగభూపాలుడు రతియొక్క స్వరూప స్వభావాలను సోదాహరణంగా నిరూపించినాడు (ర.సు.భా.II-106-121).

మూలం : యూనో రన్యోన్య విషయా స్థాయీచ్ఛారతి ర్భవేత్ ।
నిసర్గేణాభియోగేన సంసర్గేణాభిమానతః ॥
ఉపమాధ్యాత్మ విషయై రేషాస్యాత్; తత్రవిక్రియాః ।
కటాక్ష భ్రూక్షేప ప్రియవాగాదయో మతాః ॥
-(ర.సు.II.105-106)

అర్థం : యూనోః, అన్యోన్య విషయా, ఇచ్ఛా, రతిస్థాయినీ, భవేత్ =యువతీ- యువకులమధ్య, పరస్పరం మొలకెత్తిన కోరిక, 'రతి (అనే) స్థాయి భావం' అవుతుంది.

నిసర్గేణ, అభియోగేన, సంసర్గేణ, అభిమానతః, ఉపమ-అధ్యాత్మ విషయైః ఏషా, స్యాత్ =స్వభావం, తదేకపరత్వం, సహవాసం, అభిమానం, ఉపమ, అధ్యాత్మం, విషయాలు-వీటివల్ల, ఇది (=ఈరతి) కలుగుతుంది.

కటాక్ష-భ్రూక్షేప-ప్రియవాక్-ఆదయః, తత్ర విక్రియాః, మతాః =కటాక్షం, భ్రూక్షేపం, ప్రియవాక్కు మున్నగునవి, అందలి, విక్రియలు (=అనుభావాలు =చేష్టలు).

తాత్పర్యం : యువతీ యువకులమధ్య పరస్పరం మొలకెత్తిన కోరిక 'రతి' అవుతుంది. ఈ రతి - స్వాభావికంగా, అభియోగంతో, సంసర్గంవల్ల, అభిమానంవల్ల, ఉపమవల్ల, అధ్యాత్మకంగా (=స్వాత్మప్రామాణ్యంవల్ల), ఆయా విషయాలవల్ల (=శబ్ద-స్పర్శ-రూప-రస-గంధాదుల వల్ల) - కలుగుతుంది.

క్రీగంటిచూపులు, కనుబొమల విరుపులు, ప్రియాలాపాలు మున్నగునవి ఇందలి విక్రియలు (=చేష్టలు).

టీక : "సంభోగ విషయకమైన ఇచ్ఛా విశేషం రతి" (ప్ర.రు.య). మనోనుకూలమైన అర్థంబున మనస్సు ఆసక్తి చెందటం రతి (సా.ద.).

ఇంచుమించుగా అందరి నిర్వచనాల సారం ఒక్కటే. అయితే, సింగభూపాలుడు, రతి జనించటానికి చెప్పిన కారణాలు గమనింపదగినవి :

రతి - సహజంగా జనించవచ్చు; తదేకంగా తలంచుకొనటం లేదా సంసర్గం (=కులీనత అందం మొ ।। ఉండటం)వల్ల జనించవచ్చు; అభిమానంవల్ల జనించవచ్చు; పోలికవల్ల జనించవచ్చు; స్వాత్మప్రామాణ్యంవల్ల జనించవచ్చు; లేదా శబ్ద-స్పర్శాదులవల్ల జనించవచ్చు. ఇట్లా జనించిన రతికి, భరతముని చెప్పిన ఋతుమాల్యాదులు దోహదకారులవుతాయి.

నిసర్గరతిమున్నగువానికి సింగభూపాలుడు ఉదాహరణ లిచ్చినాడు : అందుకొన్ని -

ఉదా : నిసర్గరతి :

అలం వివాదేన యథా శ్రుతం త్వయా
తథావిధ స్తావదశేష మస్తు సః ।
మ మాత్ర భావైకరసం మనః స్థిరం
న కామవృత్తి ర్వచనీయ మీక్షతే ।। (కు.సం.V-82)

— (ఓ బ్రహ్మచారీ!) నీతో వివాదం ఎందులకు? ఆ శివుడు నీవు వినినట్లే ఉండుగాక! లేదా అంతకంటె ఎక్కువగా ఉండిన ఉండుగాక! నామనస్సు స్థిరంగా అతనియందే లగ్నమైనది. నా ఇష్టం - ఇతరులు చెప్పేదానిపై ఆధారపడలేదు. (బ్రహ్మచారి రూపంతో వచ్చిన శివునితో పార్వతీదేవి అనినమాటలివి; ఇది జన్మాంతర వాసనారూపమైన నిసర్గరతి).

సంసర్గరతి :

ప్రియా తు సీతా రామస్య దారాః పితృకృతా ఇతి ।
గుణా ద్రూపగుణాచ్చాపి ప్రీతి ర్భూయోఽభ్యవర్ధత ।।
-(రామా.బాల. 77-29)

— తండ్రి అంగీకరించిన సంబంధం కావటంచేత సీత, రామునకు ప్రేమపాత్రమైనది.

ఆమెయొక్క సద్గుణాలచేతను, లోకోత్తర సౌందర్యంచేతను అతని ప్రేమ ఇంకను వృద్ధిచెందింది.

(తండ్రి మీది గౌరవంతో రామునకు సీతమీద ప్రీతి కలిగినది, ఆమె గుణాదులవల్ల అది మరింత వృద్ధిపొందింది).

అధ్యాత్మరతి :

అసంశయం క్షత్రపరిగ్రహక్షమా
యదార్య మస్యా మభిలాషి మేమనః ।
సతాం హి సందేహపదేషు వస్తుషు
ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయః ॥

-(అభి.శా.I-17)

— (దుష్యంతుడు శకుంతలను గూర్చి) సంశయంలేదు. పవిత్రమైన నా మనస్సు ఈమెను కోరినది కావున, ఈమె క్షత్రయుడనైన నాచేత పరిగ్రహింపదగినదే. సజ్జనులకు సందేహం కలిగినప్పుడు, దానిని తీర్చుటకు ప్రమాణం వారి మనోవృత్తియే.

*శబ్దరతి :* శ్రీకృష్ణుని వేణుగానం విన్న గోపికలకు రతికలగటం.

*గంధరతి :* పరాశరముని వరప్రభావంవల్ల దివ్యపరిమళ మబ్బిన సత్యవతిపై శంతనునకు రతి జనించటం.

**రతి-అవస్థలు**

**టీక :** ఫలవృక్షం, అంకురాది ఆరు అవస్థలను పొందుతున్నట్లే రతి, ప్రేమాది ఆరు అవస్థలను పొంది, భోగార్హమవుతుందని శారదాతనయ - సింగభూపాలాదులు పేర్కొన్నారు.

**మూలం :** అంకుర పల్లవ కలికా ప్రసూన ఫల భోగభా గియం క్రమశః ।
ప్రేమా మానః ప్రణయః స్నేహో రాగోఽనురాగ ఇత్యుక్తః ॥

-(ర.సు.II-108)

**అర్థం :** అంకుర, పల్లవ, కలికా, ప్రసూన, ఫల, భోగభాక్ =(ఫలవృక్షమునకు సంబంధించి) మొలకెత్తటం, చిగురు తొడగటం, మొగ్గతొడగటం, పూలుపూయటం, ఫలవంతంకావటం, భోగభాజనం (=తినటానికి తగినది)

కావటం (-అనే ఆరు దశలు ఉన్నట్లే); ఇయం, క్రమశః, ప్రేమా, మానః, ప్రణయః, స్నేహః, రాగః, అనురాగః, ఇతి, ఉక్తః =(రతికి సంబంధించి) ఇది (=దీనికి), క్రమంగా, ప్రేమ, మానం, ప్రణయం, స్నేహం, రాగం, అనురాగం - (అనే ఆరు దశలు ఉన్నట్లు) చెప్పబడినది.

తాత్పర్యం : ఈ రతి, క్రమంగా - అంకురం, పల్లవం, కలిక, ప్రసూనం, ఫలం, భోగం అనే ఆరు అవస్థలతో వరుసగా ప్రేమ, మానం, ప్రణయం, స్నేహం, రాగం, అనురాగం అనే రూపాలను పొందుతున్నది.

టీక : రతి, ప్రేమచేత అంకురితమవుతుంది; మానమున పల్లవితమవు తుంది; ప్రణయమున మొగ్గతొడుగుతుంది; స్నేహమున కుసుమితమవుతుంది (=వికసిస్తుంది); రాగమున ఫలయుక్తమవుతుంది; ఇంక అనురాగమున అనుభూత మవుతుంది (=అనుభవింపబడుతుంది).

కొందరు కలిక-భోగ అవస్థలను విడిచి నాలుగు అవస్థలే చెప్పినారు; కాని, ఆరు అవస్థలు సుప్రసిద్ధమైనవి. కొందరు 'ప్రీతి'ని రతిభేదంగా చెప్పినారు; కాని అది సరిగాదు; సంప్రయోగవిషయం కానట్టి ఈ ప్రీతి హర్షమందే అంత ర్భూతమవుతుంది (ర.సు.II-120-21).

భోజుడు సంప్రయోగం (=భావముల కలయిక) వల్ల కూడా రతి కలుగు తుందన్నాడు.కాని ఇది శబ్దాది రతులందే అంతర్భవిస్తుంది (ర.సు.II-107).

ఇప్పుడు ప్రేమాదులు వివరింపబడుతున్నవి.

*(i)* ప్రేమ :

మూలం : స ప్రేమా భేదరహితం యూనోర్యద్భావ బంధనమ్ ।

-(ర.సు.II-109)

అర్థం : యూనోః, భేదరహితం, యత్ భావబంధనం, సః, ప్రేమా=యువతీ యువకులయొక్క (=మధ్య), భేదరహితమైన ఏభావ బంధం (ఏర్పడిందో), అది, ప్రేమ (అనబడుతుంది).

తాత్పర్యం : యువతీయువకులమధ్య, భేదరహితమై ఏ భావబంధం (=హృద యాకర్షణ) ఉంటుందో, అది ప్రేమ అనబడుతుంది.

ఉదా : ఏకైక పుత్ర ప్రేమ భేదకారణమైనప్పటికీ, సుదక్షిణా-దిలీపుల మధ్య పరస్పరంగల ప్రేమ, తగ్గక, వృద్ధి పొందుతూనే ఉన్నది (ర.వం.III-24)

అమరు కావ్యమందలి "చిరవిరహిణోరుత్కంఠా . . . ", అనే 39వ శ్లోకం కూడా ఉదాహరణమే.

టీక : శారదాతనయుడు ప్రేమను ఇట్లా వివరించినాడు : ప్రేమపదమున ప్ర-ఇ-మ అనే మూడు వర్ణాలు ఉన్నవి. ఇ వర్ణమునకు మదనుడు అని అర్థం. ప్ర కర్షంగా మదనుడు ఇమిడి ఉండటం ప్రేమ; యువతీ యువకుల పరస్పర రతి ప్రేమాధిష్ఠానం; ప్రేమకల యువతీ యువకులకు 'ఇది, అది' అనే సంకల్పమేఉండదు. ఇట్టి రీతిని 'భావబంధం' అని మనీషులంటారు. ఒకరి స్వాతంత్ర్యం వేరొకరికి అభీష్టంగా ఉంటుంది; మనోరథనిరోధం ఉండదు. కాని, వారిలో ఒకరు గతిస్తే, ఈ ప్రేమకూడా గతిస్తుంది (భా.ప్ర.IV-18-22).

*(ii)* మానం :

మూలం : యత్తు ప్రేమానుబంధేన స్వాతంత్ర్యా ద్హృదయంగమమ్ ॥
బధ్నాతి భావకౌటిల్యం సోఽయం మాన ఇతీర్యతే ।
-(ర.సు.II-109-110)

అర్థం : యత్ (తు), ప్రేమానుబంధేన, స్వాతంత్ర్యాత్ =ఏది (=ఎప్పుడు) ప్రేమానుబంధంచేత, స్వాతంత్ర్యంచేత; హృదయంగమం, భావ కౌటిల్యం, బధ్నాతి=హృదయాకర్షకమైన, భావకౌటిల్యం (=తెచ్చిపెట్టుకొన్న కోపం) ప్రకటితమవుతుందో; సః, మానః, ఇతి, ఈర్యతే =అది, మానం, అని, చెప్పబడుతున్నది.

తాత్పర్యం : ప్రేమబంధంవల్ల, లేదా స్వాతంత్ర్యంవల్ల హృదయాకర్షకమైన భావకౌటిల్యం చూపటం 'మానం' అవుతుంది.

ఉదా : ముంచ కోప మనిమిత్తకోపనే
సంధ్యయా ప్రణమితోఽస్మి నాన్యయా ।
కిం నవేత్సి సహధర్మచారిణం
చక్రవాక సమవృత్తి మాత్మనః ॥ (కు.సం.VIII-*51*)

— (పరమేశ్వరుడు పార్వతీదేవితో) కారణంలేకనే కోపించే ఓ చెలీ! సంధ్యవలన నమస్కరింపబడినాను; వేరు వనిత చేతకాదు. నీవిభుడు చక్రవాకముతో సరి అయిన అవస్థను పొందిఉండటం చూడకున్నావేమి?

టీక : ఖండితనాయికా విషయంలో మాన ప్రస్తావన వచ్చింది. అచ్చటి మానం, ప్రియాపరాధంవల్ల జనించినది. ఇచ్చట అపరాధంలేదు. ఇది తెచ్చిపెట్టుకొన్న మానం మాత్రమే. శారదాతనయుడు 'మానము'ను ఇట్లా వివరించినాడు :

మనోరథనిరోధమునకు 'మాన'మని అర్థం. మా=వలదు; న=వద్దు అని రెండుసార్లు మనోరథమునకు, రోధము=అడ్డు కలిగించటం ఉంటుంది కాబట్టి మానం అని వ్యవహారం. స్త్రీపురుషులకు మానం రెండు విధాలు - ఈర్ష్యా మానం, ప్రణయమానం. ప్రణయమానం ప్రియునిచేత మానితం, అంటే ఇష్టంగా సంభావితం అవుతుంది. ఈర్ష్యామానం పురుషులకు వర్ణించటం ఉచితంకాదు. (భా.ప్ర.IV-23-26).

*(iii) ప్రణయం :*

మూలం : బాహ్యాంతరోపచారైః యత్ ప్రేమమానోపకల్పితైః ||
బధ్నాతి భావ విస్రంభం సోఽయం ప్రణయ ఉచ్యతే ।
-(ర.సు.II-110-111)

*అర్థం : మాన-ఉపకల్పితైః, బాహ్య-ఆంతర-ఉపచారైః =మానంచేత కల్పితమైన, బాహ్య ఉపచారాలచేత ఆంతర ఉపచారాలచేత; యత్, భావ విస్రంభం, బధ్నాతి, అయం, సః, ప్రణయః, ఉచ్యతే =ఏది, భావవిస్రంభం (=విశ్వాసం) కలిగిస్తుందో, ఆ, ఇది, ప్రణయం (అని) చెప్పబడుతున్నది.*

*తాత్పర్యం : మానంచేత కల్పితమైన బాహ్య-ఉపచారాలు వేరేవిధంగా కన్పట్టినా, ఆంతర- ఉపచారాలలో సాన్నిహిత్యం చూపటం 'ప్రణయం' అవు తుంది.*

*ఉదా : కాంచ్యాగాఢతరావ బద్ధవసనప్రాంతా కిమర్థం పునః*
*మృగాక్షీ స్వపితీతి తత్పరిజనం స్వైరం ప్రియే పృచ్ఛతి ।*
*మాతస్సుప్తి మపీహ లుంపతి మమేత్యారోపిత క్రోధయా*
*పర్యస్య స్వపనచ్ఛలేన శయనే దత్తోఽవకాశస్తయా ||*
*-(అమరుకావ్యం-20)*

*— "మీచెలి మొలనూలితో చీరనుగట్టిగా బిగించి ఏల నిద్రిస్తున్నది?" అని నాయకుడు ప్రియుధాలి పరిజనాన్ని ప్రశ్నించగా, విని, నాయిక "ఇచ్చ*

టను అయినా నిద్రపోనీయరేమమ్మా?" అంటూ నిదురమత్తు నెపంతో ఒక ప్రక్కకు ఒత్తిగిలివరుండి, శయనార్థం ప్రియునకు కొంతచోటు ఇచ్చింది.

టీక : ప్రేయసీ ప్రియుల ప్రేమ బాహ్య-అభ్యంతరోపచారవిశేషాలచేత ప్రకర్షమవుతుంది; కాని, మానప్రకర్షవలన ప్రేమాస్వాదం కషాయిత మవుతుంది. ఇరువురకు సమానమైను ప్రణయమున్నప్పుడు మానప్రసాదనం సులభమవుతుంది. అభీష్టసంగమలాభానికై, ప్రియ, ఈర్ష్యవిడనాడి ప్రసన్న కాగలదు; ఇంక ప్రియుడు సంగమార్థి కావున వెంటనే ప్రియాప్రసాదనం చేయగలడు (భా.ప్ర.IV-26-30).

*(iv)* స్నేహం :

మూలం : విస్రంభే పరమాం కాష్ఠా మారూఢే దర్శనాదిభిః ॥
యత్ర ద్రవ త్యంతరంగం స స్నేహ ఇతి కథ్యతే ।
స త్రేధా కథ్యతే ప్రౌఢ-మధ్య-మందవిభేదతః ॥
-(ర.సు.II-111-12)

అర్థం : దర్శనాదిభిః, విస్రంభే, పరమాంకాష్ఠాం, ఆరూఢే =దర్శనాదులచేత, విస్రంభం (=స్నేహం=నమ్మకం) పరాకాష్ఠ, చెంది; యత్ర, అంతరంగం, ద్రవతి, సః, స్నేహః, ఇతి, కథ్యతే=ఎచ్చట (=దేనిచేత), అంతరంగం (=మనస్సు), కరుగుతుందో, అది, స్నేహం, అని, చెప్పబడుతున్నది.

సః, ప్రౌఢ-మధ్య-మంద, విభేదతః, త్రేధా, కథ్యతే=అది (=స్నేహం), ప్రౌఢం, మధ్యమం- మందం, అనే భేదాలచేత, మూడు విధాలు (అని), చెప్పబడుతున్నది.

తాత్పర్యం : దర్శన-స్పర్శాదులచేత విస్రంభం పరమావధిని పొందగా, మనస్సు ద్రవించటం 'స్నేహం' అవుతుంది. ఇది ప్రౌఢ-మధ్య-మంద భేదాల చేత మూడువిధాలు.

ఉదా : స్పర్శవలని స్నేహం : అమరుకావ్యంలోని "గాఢాలింగన వామనీకృత . . ." అనే 35 వ శ్లోకం.

స్నేహభేదాలు :

మూలం : ప్రవాసాదిభి రజ్ఞాత చిత్తవృత్తౌ ప్రియే జనే
ఇతర క్లేశకారీ యః స ప్రౌఢ స్నేహ ఉచ్యతే ॥

ఇతరానుభవాపేక్షాం సహతే యః స మధ్యమః ।
ద్వయో రేకత్ర మానాదౌ తమన్యత్ర కరోతి యః ॥
నైవోపేక్షాం న చాపేక్షాం స స్నేహో మంద ఉచ్యతే ।
-(ర.సు.II-113-115)

అర్థం : ప్రవాసాదిభిః =ప్రవాసంమున్నగువాటివల్ల; ప్రియే, జనే, అజ్ఞాత చిత్తవృత్తౌ=ప్రియ, జనుల, చిత్తవృత్తి తెలియకపోవటం చేత; యః, ఇతర క్లేశ కారీ, సః, ప్రౌఢ స్నేహం, ఉచ్యతే=ఏది, రెండవవారికి, క్లేశం కలిగిస్తుందో, అది, ప్రౌఢ స్నేహం (అని) చెప్పబడుతున్నది.

యః, ఇతర-అనుభవ-అపేక్షాం, సహతే, సః, మధ్యమః =ఏది, (ప్రియుని యొక్క) ఇతర స్త్రీతోడి అనుభవాపేక్షను, సహిస్తుందో, అది, మధ్యమ (స్నేహం) (అవుతుంది).

ద్వయోః =ఇరువురిలో; ఏకస్యమానాదౌ =ఒకరియొక్క మానాదులలో; తమ్, అన్యత్ర, నైవ, ఉపేక్షాం, న(చ)-అపేక్షాం, కరోతి=ఇతరులయందు, ఉపేక్షనుకాని, అపేక్షనుకాని, కలిగించదో; సః, మంద స్నేహః, ఉచ్యతే =అది, మంద స్నేహం (అని), చెప్పబడుతున్నది.

తాత్పర్యం : 1) ప్రవాసంమున్నగు వానివల్ల దూరదేశంలో ఉన్న ప్రియుని లేదా ప్రియురాలి చిత్తవృత్తి తెలియకపోవటంచేత ప్రియురాలు లేదా ప్రియుడు క్లేశపడితే, అది 'ప్రౌఢ స్నేహం' అవుతుంది.

2) ఏది ప్రియునికిగల ఇతర స్త్రీ-అనుభవాపేక్షను సహిస్తుందో, అది 'మధ్యమ స్నేహం'.

3) ప్రేయసీ ప్రియులిరువురిలో ఒకరి యొక్క మానాదుల విషయంలో రెండవారికి ఉపేక్షకానీ, అపేక్షకానీ ఉండదో అది 'మంద స్నేహం' అవుతుంది.

ఉదా : ప్రౌఢ స్నేహం : మేఘదూతం, 2 వ సర్గలోని "ఏతస్మాన్మాం కుశలిన . . ." అనే శ్లోకం.

మంద స్నేహం :

మన్యే ప్రియాహృతమనా స్తస్యాః ప్రణిపాతలంఘనం సేవామ్ ।
ఏవం హి ప్రణయవతీ సా శక్య ముపేక్షితుం కలితా ॥
-(మా.అ.మి-III- )

– మాలవికపట్ల అనురాగంకల నేను, ఇరావతి నా నమస్కారాన్ని తిరస్కరించి పోవటాన్ని నాకు అనుకూలంగానే భావిస్తున్నాను; ఇందువల్ల ఇరావతిని ఉపేక్షించటానికి వీలుపడుతుంది (కోపించిన ఇరావతిమీద, రాజునకు అపేక్షకానీ, ఉపేక్షకానీ లేదు).

టీక : శారదా తనయుడు, తొలుత, సింగభూపాలాదులవలెనే స్నేహాన్ని, స్నేహభేదాలను వివరించినాడు (భా.ప్ర.IV-31-41)–

మనస్సునకు కలిగే ద్రవీభావం ఆర్ద్రత; ఇది విషయములందలి మమతాభిమానం. "ఇది నాది. ఇది నాకు" అనే మమత్వమె ఆ ఆర్ద్రత. ఇది భయావసానాత్మకం, శంకావసానాత్మకం. శంకాభయాలుంటే మమత్వముదయించదు. ఇట్టి ఈ మమత్వానికి స్నేహమని వ్యవహారం. మనస్సునకు కలిగే ద్రవం రెండు విధాల ఉంటుంది. దర్శనంవల్ల కలిగే ద్రవం, స్పర్శనంవల్ల కలిగే ద్రవం అని. వహ్నిసంస్పర్శంతో లక్క వలె ద్రవించటం, చంద్ర దర్శనంతో చంద్రకాంతమాణిక్యంవలె ద్రవించటం ఇందుకు నిదర్శనం. సర్వావస్థలలో మానసమయిన ఈ ఆర్ద్రతయొక్క శిశిరత్వం పైవిధంగా గ్రాహ్యం.

ఆ స్నేహం రెండు విధాలు : కృత్రిమస్నేహం, అకృత్రిమ స్నేహం; కృత్రిమ స్నేహం సోపాధికం, అకృతిమస్నేహం నిరుపాధికం. ఉపాధినశిస్తే తజ్జన్యమైనది నశిస్తుంది. అకృత్రిమ మయిన స్వాభావజన్యమైన స్నేహం యావద్ద్రవ్యభావిగా ఉంటుంది. ఆ ద్రవ్యమెంతవఱకుంటుందోఅది అంత వఱకుఉంటుంది. కృతకస్నేహమందు ఆ యా విక్రియాన్వేషణరూప మయిన శంక ఉదయిస్తుంది. అకృత్రిమమయిన స్నేహంలో ఆయా విషయాల ప్రమాదంవల్ల భయం కలుగుతూ ఉంటుంది.

ఆ స్నేహ మొకచో ఏకాశ్రయంగా ఉంటుంది. వేరొకచో ఉభయాశ్రయంగా ఉంటుంది. తిర్యగాదులలో అది ఏకాశ్రయం, మర్త్యాదులలో అది ఉభయాశ్రయం. ఆయా స్థలములందు స్నేహరీతులు ఆశ్రయంవల్ల సంస్కారవిశేషంవల్ల కలగటం ఉన్నది. ఏకాశ్రయస్నేహం సంస్కారవిశేషంవల్ల కలగటం, ఉభయాశ్రయస్నేహం హేతువిశేషంవల్ల కలగటం గ్రాహ్యం. ఇట్లా కృత్రిమాకృత్రిమ స్నేహస్వరూపం, తదాశ్రయం నిరూపితమయింది.

ఆ స్నేహం ప్రౌఢం మధ్యం మందం అని మూడు విధాలు. ప్రియుడు విదేశగతుడయినా, గతించినా, దుర్బలు డయినా ప్రతివేగి అయినా స్నేహం కలవారికి క్లేశకారిఅయ్యే స్నేహం ప్రౌఢస్నేహం. ఆయా వియోగజన్య మయిన

దుఃఖం ప్రతియోగివిధానమున అనుభవించిన పిమ్మట ఆ స్నేహం తగ్గిపోతే అది మధ్యస్నేహం. తత్సమయంలో వ్యసనాపత్తి మాత్రంగా ఉండే స్నేహం మందస్నేహమవుతుంది.

పై వివరణ శృంగారపరంగావే ఉన్నది. ఇంక తరువాతి సర్వసామాన్య స్నేహమును గూర్చి క్రిందివిధంగా వివరించినాడు (భా.ప్ర.IV-41-46)–

స్నేహం మూడు విధాలు : స్థిరం, గత్వరం నశ్వరం. ఉత్తమునందు స్థిరం; స్నేహం స్థిరంగా ఉంటుంది. మధ్యమునందు గత్వరం; గతి స్వభావమున ఉంటుంది. నీచునందు నశ్వరం; నాశస్వభావంలో ఉంటుంది. స్థిరాది స్నేహాలు ఉత్తమాదులందు తత్తత్కార్యవశాన ఉంటాయి.

ఉత్తమునందు స్నేహం వృద్ధిపొందుతుంది; ఉపకారం అపేక్షించదు. ఉత్తముడు తానొనరించిన ఉపకారాన్ని గుర్తింపడు. ఇట్టిది స్థిరస్నేహం. మధ్యమునందలి గత్వరస్నేహం బహూపకారప్రభవం. ఇతరులు నానావిధములైన ఉపకారాలనుచేయగా మధ్యముడిట్టి స్నేహం కలవాడవుతాడు. ఇది గత్వరం; కొంతగా ఉపకారాల వల్ల వృద్ధి పొందుతుంది. కాన గత్వరం. నీచు నందలి నశ్వరస్నేహం దోషశ్రవణ మాత్రాన సామనస్యం విడనాడి ప్రాతికూల్యమునందు ప్రవర్తిస్తుంది; అది నశ్వరస్నేహం. నీచాదులలో ఇది సామాన్యం; అస్థిరం. ఉత్తముని యందు స్థిరం. ఈవిధంగానే పుత్రికళత్రాదులలో పిత్రాదులలో పరిశీలించదగును.

*(v) రాగం :*

మూలం : దుఃఖమప్యధికం చిత్తే సుఖత్వేనైవ రజ్యతే ।।
యేన స్నేహ ప్రకర్షేణ స రాగ ఇతి గీయతే ।
కుసుంభ నీలీ మాంజిష్ఠ రాగభేదేన సః త్రిధా ।।
-(ర.సు.II-115-116)

అర్థం : యేన, స్నేహప్రకర్షేణ, దుఃఖం, అధికం అపి, చిత్తే, సుఖత్వేన-ఏవ, రజ్యతే=ఏ, స్నేహంయొక్క ఆధిక్యంచేత, దుఃఖం, అధికంగాఉన్నప్పటికీ, మనస్సులో, సుఖరూపంగానే, భాసిస్తుందో; సః, రాగః, ఇతి, గీయతే=అది (=స్నేహం), రాగం, అని, చెప్పబడుతున్నది.

సః=అది (=రాగం); కుసుంభా-నీలీ-మాంజిష్ఠరాగ భేదేన, త్రిధా=కుసుంభం, నీలం (=నీలి), మాంజిష్ఠం అనే భేదాల చేత మూడువిధాలు.

తాత్పర్యం : స్నేహంయొక్క ఆధిక్యంచేత, అధికమైన దుఃఖంకూడా సుఖంగామారి రంజింపజేస్తే, అది 'రాగం' అవుతుంది. కుసుంభ-నీలీ-మాంజిష్ఠ భేదాలచేత రాగం ముప్విధాలు.

రాగభేదాలు :

మూలం : కుసుంభరాగః స జ్ఞేయో య శ్చిత్తే సజ్జతి క్షణాత్ ।
అతి ప్రకాశమానోఽపి క్షణాదేవ వినశ్యతి ॥
నీలీరాగస్తు యః సక్తో నాపైతి న చ దీవ్యతే ।
అచిరేణైవ సంసక్త శ్చిరాదపి న నశ్యతి ॥
అతీవ శోభతే యోఽసౌ మాంజిష్ఠో రాగ ఉచ్యతే ।
-(ర.సు.II-117-119)

అర్థం : యః, చిత్తే, క్షణాత్, సజ్జతి=ఏది(=ఏరాగం), మనస్సులో, క్షణ కాలంలోనే హత్తుకొంటుందో; అతి ప్రకాశమానః అపి, క్షణాత్ ఏవ, వినశ్యతి=(అట్లా హత్తుకొన్నరాగం) అధికంగా ప్రకాశించేది అయినప్పటికీ, (ఎట్లా క్షణంలో హత్తుకొన్నదో అట్లాగే) క్షణంలో నశించిపోతుందో; సః, కుసుంభ రాగః, జ్ఞేయః=అది(=ఆరాగం) కుసుంభరాగం (అని), తెలియవలె.

యః, సక్తః=ఏది(=ఏరాగం), మనస్సులో హత్తుకొన్నప్పటికీ; న-అపైతి, న(చ) దీవ్యతే =మారిపోకుండా, ప్రకాశించకుండా అట్లాగే ఉంటుందో; నీలీ రాగం(తు) =(అది) 'నీలీరాగం' (అవుతుంది).

యః=ఏది(=ఏరాగం); అచిరేణ-ఏవ, సంసక్తః, చిరాత్-అపి, న నశ్యతి= వేగంగానే, మనస్సులో హత్తుకొన్నదై, ఎప్పటికీ, నశించకుండా ఉంటుందో; అతీవ, శోభతే=(అంతేకాదు) అధికంగా, శోభిస్తూ ఉంటుందో; అసౌ, మాంజిష్ఠః, రాగః, ఉచ్యతే=అది, మాంజిష్ఠ, రాగం (అని) చెప్పబడు తున్నది.

తాత్పర్యం : 1) క్షణకాలంలోనే మనస్సులో హత్తుకొని, క్షణకాలంలోనే నశించేది 'కుసుంభరాగం'.

2) మనస్సులో హత్తుకొన్నప్పటికీ, అది నశించదు, ప్రకాశించదు-ఇటు వంటిది నీలీరాగం.

3) వేగంగా మనస్సులో హత్తుకొని, ఎప్పటికీ నశించనిది, అధికంగా ప్రకాశించేది మాంజిష్ఠరాగం.

టీక : బహుజనపల్లి సీతారామాచార్యులవారు, శబ్దరత్నాకరంలో, మంజిష్ఠా-కుసుంభ- నీలీరాగాలను పూర్వరాగభేదాలుగా వివరించినారు :

పూర్వరాగము : శ్రవణమువలనఁగాని, దర్శనమువలనఁగాని పరస్పరము వృద్ధిఁ బొందిన యనురాగముగల నాయికానాయకులకు అయోగమునందుఁ గలిగెడు దశావిశేషము. ఇది త్రివిధము- నీలీరాగము, కుసుంభరాగము, మంజిష్ఠారాగము.

కుసుంభరాగము : బయటికి మాత్రము విశేషముగాఁ గనఁబడి లోపల బొత్తిగా లేని అనురాగము.

నీలీరాగము : బయటికి విశేషముగా కనఁబడక లోపల నెన్నటికి వీడకుండెడు గాఢానురాగము.

మంజిష్ఠారాగము : బయటికి విశేషముగా కనబడుచు లోపలను ఎప్పటికి వీడకుండెడు గాఢానురాగము.

స్నేహమే గుణ-ద్రవ్య-దేశ-కాలాదివిశేషాలవల్ల హృదయమున రాజితమైతే, చిత్తమున దీపితమైతే రాగం అనేపేరు కలదవుతుంది. సుఖదుఃఖాత్మకంగా ఉన్న భోగ్యమును సుఖంగానే అభిమానిస్తే అది, రాగమని వ్యవహృతమవుతుంది. విషయరూపంగా నాయికా నాయకులను ఇదిరంజింప జేస్తుంది కావున ఇది రాగమవుతుంది.

రాగౌపమ్యమున రాగం మూడు విధాలు - నీలీరాగం, కుసుంభరాగం, మంజిష్ఠారాగం. నీలీరాగం-క్షాలిత మయిననుపోదు; అయినను శోభింపదు - ఇట్టిది నీలీరాగం. కుసుంభరాగం - క్షాలితమయినపోతుంది; త్వరగా పోతుంది; కంటి కది శోభగా కన్పిస్తుంది. మంజిష్ఠారాగం- అత్యంతం శోభాయమానంగా ఉంటుంది. క్షాలితమయినాపోదు. వీనిలో మంజిష్ఠారాగం జ్యేష్ఠం, నీలీరాగం మధ్యమం, కుసుంభరాగ మధమం. ఈ నీల్యాదిరాగాల సామ్యంతో రతిరాగస్వరూపాలను గుర్తింపవచ్చు (భా.ప్ర.IV-46-52).

ఉదా : నీలీరాగం :

యద్దైవ పూర్వే జననే శరీరం
సా దక్ష రోషాత్సుదతీ ససర్జ ।

తదాప్రభృత్యేవ విముక్తసంగః
పతిః పశూనా మపరిగ్రహో౽భూత్ ॥ -(కు.సం.I-53)

— పూర్వజన్మమునందు సతీదేవి, దక్షుని మీది కోపంతో శరీరం విడిచిపెట్టి (=మరణించి) నది మొదలు శివుడు ఎట్టి ఆసక్తియులేనివాడై అవివాహితుడుగా ఉన్నాడు.

మాంజిష్ఠరాగం :

అద్వైతం సుఖదుఃఖయో రనుగతం సర్వాస్వవస్థాసు యత్
విశ్రామో హృదయస్య యత్ర జరసా యస్మి న్నహార్యో రసః ।
కాలేనావరణాత్యయాత్పరిణతే యత్ స్నేహ సారే స్థితం
భద్రం తస్య సుమానుషస్య కథమప్యేకం హి తత్ప్రార్థ్యతే ॥
-(ఉ.రా.I-32)

— సుఖ-దుఃఖాది భేద భావంలేనిది, అన్ని అవస్థలయందు వీడకుండేది, మనస్సునకు విశ్రాంతిస్థానమైనది, ముసలితనంలో కూడా నశించని ప్రేమ కలది, కాలాన్ని అనుసరించి ఆటంకంపోవటంవల్ల పరిణతమయిన ప్రేమసారంతో ఉన్నది— ఇట్టి సుమానుషభద్రమయిన దాంపత్యం ఒక్కటే ప్రార్థింపదగినది.

(తన ఒడిలో అదమరచి నిద్రిస్తున్న సీతను చూస్తూ రాముడు చెప్పిన మాటలు).

*(vi)* అనురాగం :

రాగ ఏవ స్వసంవేద్యదశాం ప్రాప్య ప్రకాశితః ॥ **119**
యావ దాశ్రయవృత్తిశ్చే దనురాగ ఇతీరితః ।
-(ర.సు.II-119-20)

అర్థం : రాగః ఏవ =ఆ రాగమే; స్వసంవేద్యదశాం ప్రాప్య ప్రకాశితః =స్వసంవేద్యదశను (=సుస్పష్టమయిన దశను)పొంది ప్రకాశిస్తుందో; యావత్, ఆశ్రయవృత్తిః, చేత్=ఆశ్రయవ్యాపారం ఉండు నంతవరకు, ఉంటుందో (అది); అనురాగః, ఇతి, ఈరితః=అనురాగం, అని, చెప్పబడింది.

తాత్పర్యం : సుస్పష్టమయిన దశనుపొందిన రాగమే అనురాగం అనబడుతుంది; ఇది ఆశ్రయం ఉన్నంతవరకు ఉంటుంది.

ఉదా : అశ్రాంత కంటకోద్గమ
మనవరత స్వేద మవిరతోత్కంపమ్ ।
అనిశముకులితాపాంగం
మిథునం కలయామి తదవినాభూతమ్ ॥
-(ర.సు.పుట 470)

— ఎడతెగని పులకలు, స్వేదం, అధికమైనం కంపం కలది, అనిశం ముకు లించిన అపాంగాలు కలది, అవినాభావ సంబంధం కలది - ఇట్టి మిథునమును ధ్యానిస్తాను.

రాగమవిచ్ఛిన్నంగా అనువృత్తమయితే అది అనురాగ మవుతుంది. అను రూపమగు రాగం కావున అనురాగమనే నిర్ణయం యుక్తం. అనురాగం యువ భావుల అన్యోన్యరక్తిమ. సామాన్యంగా ఇది స్వసంవేద్యం, అనుభవైకగమ్యం. గౌణవృత్తి నాశ్రయించి ఈ అనురాగపదాన్ని అన్యములందు కూడా ఉప యోగిస్తారు. ముఖ్యవృత్తి ననుసరించి తరుణీ తరుణుల అన్యోన్యరక్తిమనె ఈ పదంతో చెప్పదగును (భా.ప్ర.IV-52-55).

## 2. హాసం

మూలం : పరచేష్టానుకరణ కుహ కాసంబద్ధప్రలాప
పౌరోభాగ్య మౌర్ఖ్యాదిభిః విభావైః సముత్పద్యతే.
తమభినయేత్ పూర్వోక్తైః హసితాదిభిః అనుభావైః.
భవతి చాత్ర శ్లోకః-
పరచేష్టానుకరణా ద్ధాసః సముపజాయతే ।
స్మితహాసాతిహసితై రభినేయః స పండితైః ॥ 10
-(నా.శా.VII-10+ముందరిగద్య)

అర్థం : పరచేష్ట-అనుకరణ, కుహక, అసంబద్ధప్రలాప-పౌరోభాగ్య-మౌర్ఖ్య-ఆదిభిః, విభావైః, సముత్పద్యతే =పరులచేష్టలను అనుకరించటం, కుహకం (=వంచన లేదా మోసం, చిన్నపిల్లల చక్కిలిగింతలు), అసంబద్ధ ప్రలాపం, పౌరోభాగ్యం (=దోషాలను ఎన్నటం), మూర్ఖత్వం, మున్నగు, విభావాలవల్ల, (హాసం) జనిస్తుంది.

తమ్, పూర్వోక్తైః, హసిత-ఆదిభిః, అనుభావైః, అభినయేత్=దానిని (=హాసమును), పూర్వం (=హాస్యరస సందర్భంలో) చెప్పిన హసితం మున్నగు, అనుభావాలచేత అభినయించవలె.

తాత్పర్యం : విభావాలు : పరులచేష్టలను అనుకరించటం, కుహకం, అసంబద్ధ ప్రలాపం, దోషాలనువెన్నటం, మూర్ఖత్వం, మున్నగునవి.

అనుభావాలు : స్మితం, హసితం, విహసితం, ఉపహసితం, అపహసితం, అతిహసితం (ఇవి హాస్యరససందర్భంలో వివరింపబడగలవు).

ఇచ్చట ఒక శ్లోకం కలదు : పరచేష్టానుకరణంవల్ల హాసం జనిస్తుంది. స్మిత-హాస- అతిహసితములతో దీనిని పండితులు అభినయించవలెను.

టీక : ర.సు.లో హాసం ఇట్లా వివరింపబడింది :

మూలం : భాషణాకృతి వేషాణాం క్రియాయాశ్చ వికారతః ॥
లౌల్యాదేశ్చ పరస్థానా మేషానుకృతే రపి ।
వికార శ్చేతసో హాసః తత్ర చేష్టా స్సమీరితాః ॥
దృష్టే ర్వికాసో నాసోష్ఠకపోల స్పందనాదయః ।
-(ర.సు.II-121-23)

తాత్పర్యం : పరుల భాషణాలు, ఆకారాలు, వేషాలు, చేష్టలు, లౌల్యం - వీటియందున్న వికారాలవల్ల లేదా వీటిని అనుకరించటంవల్ల, మనస్సునకు కలిగే వికారం 'హాసం' అవుతుంది. ఇందలి చేష్టలు - దృష్టి వికాసం, ముక్కు-పెదవులు-చెక్కిళ్ళు స్పందించటం మున్నగునవి.

టీక : "వాగంగాది వికారదర్శనజన్మా వికాసాఖ్యో హాసః" అని జగన్నాథ పండితుడు - వాక్కులు, శరీరంమున్నగువాని వికారాలను చూడటం చేత కలిగే (మనో) వికాసం 'హాసం'. సింగభూపాలాదులు చెప్పిన 'మనోవికారం' కంటె జగన్నాథుడు చెప్పిన 'మనోవికాసం' అనేది సమంజసంగా ఉన్నది; 'మంచినవ్వు' ఆరోగ్యకరమంటారు కదా!

సింగభూపాలుడు ఆయా వికారాలను ఇట్లా వివరించినాడు.

భాషణ వికారం : అసంబద్ధ ప్రలాపం
ఆకార వికారం : మిక్కిలి పొట్టిగా ఉండటం,
వెలికి వచ్చిన పొడవళ్ళు మొ॥
వేషవికారం : విరుద్ధమైన అలంకారకల్పన
క్రియావికారం : వికటగమనం మొ॥

దీనికి ఉదాహరణలు కైశికీవృత్తిభేదం, శుద్ధహాస్యబం అయిన 'నర్మ' వివరణమందున్నవి.

# 3. శోకం

మూలం : ఇష్టజనవియోగ విభవనాశ వధ బంధ దుఃఖానుభవ
నాదిభిః విభావైః సముత్పద్యతే. తస్యాః
అశ్రుపాత పరిదేవిత విలపిత వైవర్ణ్య స్వరభేద
స్రస్తగాత్రతా భూమిపతన సస్వనరుది తాక్రందిత
దీర్ఘనిఃశ్వసిత జడతోన్మాద మోహ మర
ణాదిభిః అనుభావై రభినయః ప్రయోక్తవ్యః.
రుదిత మత్ర త్రివిధమ్ - ఆనందజ-మార్తిజ -
మీర్ష్యా సముద్భవం చేతి.
భవంతి చాత్రార్యాః -
[ఆనందేర్ష్యార్తికృతం త్రివిధం రుదితం సదాబుధైః జ్ఞేయమ్ ।
తస్య త్వభినయయోగా న్విభావగతితః ప్రవక్ష్యామి ॥ ]
హర్షోత్ఫుల్ల కపోలం సానుస్మరణా దపాంగవిసృతాస్రమ్ ।
రోమాంచగాత్ర మనిభృత మానందసముద్భవం భవతి ॥
పర్యాప్తవిముక్తాస్రం సస్వన మస్వస్థగాత్రగతిచేష్టమ్ ।
భూమినిపాత నివర్తిత విలపిత మిత్యార్తిజం భవతి ॥
ప్రస్ఫురితౌష్ఠకపోలం సశిరఃకంపం తథా సనిఃశ్వాసమ్ ।
భ్రుకుటీ-కటాక్ష కుటిలం స్త్రీణా మీర్ష్యాకృతం భవతి ॥
స్త్రీనీచప్రకృతిష్వేష శోకో వ్యసనసంభవః ।
ధైర్యేణోత్తమమధ్యానాం నీచానాం రుదితేన చ ॥
-(నా.శ.VII-11-14+ముందరి గద్య)

అర్థం : ఇష్టజనవియోగ, విభవనాశ, వధ, బంధ, దుఃఖ-అనుభవన-ఆదిభిః=ఇష్టజనుల వియోగం (=మరణం), విభవనాశం, వధ, బంధనం, దుఃఖానుభూతి మున్నగు; విభావైః, సముత్పద్యతే=విభావాలవల్ల, (శోకం) ఉత్పన్నమవుతుంది.

అస్రపాత, పరిదేవిత, విలపిత, వైవర్ణ్య, స్వరభేద, స్రస్తగాత్రతా, భూమి పతన, సస్వనరుదిత, ఆక్రందిత, దీర్ఘనిశ్వసిత, జడత-ఉన్మాద, మోహ, మరణ-ఆదిభిః, అనుభావైః, తస్యాః, అభినయః, ప్రయోక్తవ్యః =కన్నీరు కార్చటం, పరిదేవనం (=దుఃఖంతో మాటాడటం), విలపించటం (=దీనాలాపాలాడటం), వైవర్ణ్యం (=వెలవెల బారటం), స్వరభేదం (=కంఠంమా

రటం), అంగాలు జారిపోవటం, భూమిమీదపడటం, పెద్దపెట్టున ఏడ్వటం, ఆక్రందనచేయటం, దీర్ఘంగానిఃశ్వసించటం, జడత్వం, ఉన్మాదం, మరణం— వీటిని, దాని (=శోకం) యొక్క అభినయాలుగా ప్రయోగించవలె.

అత్ర, రుదితం, త్రివిధమ్, ఆనందజం, ఆర్తిజం, ఈర్ష్యాసముద్భవం (చ) ఇతి=ఇందు, రుదితం, మూడువిధాలు - ఆనందంవల్ల పుట్టినది, ఆర్తివల్ల పుట్టినది, ఈర్ష్యవల్ల జనించినది, అని.

అత్ర, ఆర్యాః, భవంతి(చ) =ఈ సందర్భంలో, కొన్ని ఆర్యలు కలవు.

[ఆనంద-ఈర్ష్య-ఆర్తికృతం, రుదితం, త్రివిధం, సదా, బుధైః, జ్ఞేయం =ఆనందకృతం, ఈర్ష్యాకృతం, ఆర్తికృతం (ఇట్లా), రుదితం, మూడువిధాలు (అని), ఎల్లప్పుడు, బుధులు, గ్రహించవలె; తస్య(తు), అభినయయోగాన్, విభావగతితః, ప్రవక్ష్యామి=దాని (=రుదితం) యొక్క అభినయ విధానాన్ని, విభావపూర్వకంగా, చెబుతాను.]

హర్ష-ఉత్ఫుల్లకపోలం, సానుస్మరణాత్-అపాంగ విసృత-అస్రం, రోమాంచ గాత్రం, అనిభృతం, ఆనందసముద్భవం, భవతి=హర్షంచేత వికసించిన కపోలాలు, పూర్వస్మరణంతో కూడిన వాక్యాలు, కడకన్నులనుంచి జారే అశ్రువులు (=ఆనందబాష్పాలు), మరలమరల రోమాంచం (-వీనితో కూడిన రుదితం), ఆనందంవల్ల పుట్టినది, అవుతుంది.

పర్యాప్తవిముక్త-అస్రం, సస్వనం, అస్వస్థగాత్ర - గతి - చేష్టం, భూమి నిపాత, నివర్తిత, విలపితం, ఇతి, ఆర్తిజం, భవతి=అధికంగా కన్నీళ్ళుకారటం, ధ్వనితోకూడి ఉండటం, శరీరం- గతి-చేష్టలు అస్వస్థాలుకావటం, క్రిందపడి దొర్లుతూ విలపించటం అని (-వీటిలో కూడిన రుదితం), ఆర్తిజం, అవుతుంది.

ప్రస్ఫురిత-ఓష్ఠకపోలం, సశిరఃకంపం, (తథా) సనిఃశ్వాసం, భ్రుకుటీ కటాక్ష కుటిలం, స్త్రీణాం, ఈర్ష్యాకృతం, భవతి= పెదవులు కపోలాలు బాగా చలించటం, శిరస్సు కంపించటం, నిఃశ్వాసాలధికం కావటం, బొమముడులు కటాక్షాలు కుటిలాలు కావటం (-వీటితో కూడిన), స్త్రీల (యొక్క రుదితం), ఈర్ష్యాకృతం, అవుతుంది.

విష, శోక, స్త్రీ-నీచ ప్రకృతిషు వ్యసనసంభవః; ధైర్యేణ-ఉత్తమ మధ్యానాం, నీచానాం, రుదితేన(చ) =ఈశోకం, స్త్రీలయందు నీచప్రకృతుల

యందు, వ్యసనం (=ఆపద) వలన, సంభవిస్తుంది; శోకసమయంలో ఉత్తమ-మధ్యమ ప్రకృతులు ధైర్యంతో, నీచ ప్రకృతులు రుదితంతో ఉంటారు.

తాత్పర్యం : విభావాలు : ఇష్టజనుల వియోగం, విభవనాశం, వధ, బంధనం, దుఃఖప్రాప్తి మున్నగునవి.

అనుభావాలు : అస్రపాతం, పరిదేవనం, విలపనం, వైవర్ణ్యం, స్వర భంగం, స్రస్తగాత్రత, భూమిపతనం, సస్వనరోదనం, ఆక్రందనం, దీర్ఘనిఃశ్వాసాలు, జడత, ఉన్మాదం, మోహం, మరణం మున్నగునవి.

రోదనం మూడు విధాలు : ఆనందజం, ఆర్తిజం, ఈర్ష్యాసముద్భవం.

ఈ సందర్భంలో కొన్ని ఆర్యలు కలవు :

[ఆనందకృతం, ఈర్ష్యాకృతం, ఆర్తికృతం అని రుదితం మూడువిధాలు...]

హర్షోత్ఫుల్ల కపోలాలు, సానుస్మరణ వాక్యాలు, అపాంగ విస్రుతాస్రం, అనిభృతరోమాంచగాత్రం - ఇవి ఆనందజరుదితం యొక్క చేష్టలు.

పర్యాప్తవిముక్తాస్రం, సస్వనరోదనం, అస్వస్థగాత్ర-గతి-చేష్టలు, భూమి మీద పడిదొర్లుతూ విలపించటం - ఇవి ఆర్తిజరుదితమందలి చేష్టలు.

ఓష్ఠ-కపోలాలు బాగా అదరటం, శిరం కంపించటం, నిఃశ్వాసాలు, భ్రుకుటీ కటాక్షాలు కుటిలంకావటం - ఇవి స్త్రీల ఈర్ష్యాకృతరుదితమందలి చేష్టలు.

వ్యసనసంభవమైన శోకం స్త్రీలయందు, నీచప్రకృతులయందు వ్యక్తమవుతుంది. శోకసమయంలో ఉత్తమ-మధ్యమ ప్రకృతులు ధైర్యంతో ఉంటారు; నీచప్రకృతులు రుదితంతో ఉంటారు.

టీక : "బంధువుల ఆపద, దుర్గతి, ధననాశం మున్నగు వాటివల్ల 'చిత్త క్లేశభరం' (=మనస్సు అధికంగా క్షోభించటం) శోకం" (ర.సు.II-139-40). దీనినే 'చేతోవైక్లబ్యం' అన్నాడు విశ్వనాథుడు.

సింగభూపాలుడు ఇంకా ఇట్లా వివరించినాడు :

శోకం ఉత్తమ-మధ్యమ-అధమ ప్రకృతులయందు వేర్వేరుగా వ్యక్తమవుతుంది. ఇది ఉత్తమ- మధ్యములందు రెండేసి విధాలు : పరగతం, ఆత్మగతం. అంటే పరులను ఆశ్రయించిన విభావాలచేత శోకం కలగటం పరగతం; ఇంక

స్వాశ్రయము (=ఆత్మగతము) లైన విభావాలచేత ఉత్పన్నమైనది ఆత్మగతం. ప్రాయశః శౌర్యంచేత ఆత్మగతం శాంతి పొందుతుంది. గుణాలను మత్తించటం, లోలోపల రోదించటం ఇందలి చేష్టలు.

ఉదా : పరగతభావం చేత శోకం (ఉత్తమ ప్రకృతి) :

భస్మావశేషంగా ఉన్న మన్మథుని చూసి, హృదయ విదారకంగా దుఃఖిస్తున్న రతీదేవిని చూచిన శివుని మూడవ కన్ను నీళ్ళతో నిండి చల్లారినదట!

ఆత్మగత విభావంచేత శోకం (ఉత్తమ ప్రకృతి) :
అయి కర్ణ! కర్ణసుభగం ప్రయచ్ఛ మే
గిర ముద్వమన్నివ మయి స్థిరాం ముదమ్ ।
అనుజై ర్వియుక్త మకృతాప్రియం ప్రియం
వృషసేనవత్సల! విహాయ యాసి మామ్ ॥
-(వేణీ సం. V-14)

— ఓ కర్ణా! నావట్ల ఎక్కువ ప్రేమనుచూపే కర్ణామృతమగు నీమాటను వినిపించు. నేను అనుజులచేత విడువబడి దుఃఖిస్తున్నాను. నేను నీకు ఎన్నడును అప్రియం చేయలేదుకదా! మీదు మిక్కిలి నీకు ఇష్టుడను. ఇట్టి నన్ను నీవు విడిచిపోవటం న్యాయంకాదు (దుర్యోధనుని రుదితం).

2. స్వగతములగు లేదా పరగతములగు విభావాల చేత మధ్యమ ప్రకృతు లందు శోకం మరణపర్యంతం ఉంటుంది. ఇందులో, వ్యక్తంకాని రోదనం మున్నగు చేష్టలు ఉంటాయి.

3. సాధారణంగా స్వగతములగు హేతువుల చేతనే స్త్రీలకును, నీచప్రకృతుల కును శోకం కలుగుతుంది; ఇది మరణప్రయత్నావధికమై ఉంటుంది. భూమిపై దొర్లటం, రొమ్ముబాదుకొనటం, బావురుమనటం, జుట్టువిర బోసుకొనటం, పడిపోవటం, బిగ్గరగా ఏడ్వటం మున్నగునవి ఇందలి చేష్టలు.

స్త్రీగతమగు శోకం :
అథ సా పునరేవ విహ్వలా, వసుధాలింగన ధూసరస్తనీ ।
విలలాప వికీర్ణమూర్ధజా, సమదుఃఖా మివ కుర్వతీ స్థలీమ్ ॥
-(కు.సం.IV-4)

— పిదప, (రతీదేవి) మూర్ఛలో భూమిపైపడటంచేత ధూళి నిండిన స్తనములుకలదై, జుట్టు విరబోసుకొని, అస్థలమునుకూడా, తనతో సమానంగా దుఃఖింపజేస్తున్నట్లుగా విలపించింది.

## 4. క్రోధం

మూలం : అధర్ష ణాక్రుష్ట కలహ వివాద ప్రతికూలాదిభిః
విభావైః సముత్పద్యతే. అస్య వికృష్ట నాసాపుట
ఉద్వృత్త నయన సందష్టోష్ఠపుట గండస్ఫురణాదిభిః
అనుభావై రభినయః ప్రయోక్తవ్యః.
రిపుజో గురుజశ్చైవ ప్రణయి ప్రభవః తథా ।
భృత్యజః కృతకశ్చేతి క్రోధః పంచవిధః స్మృతః ॥
అత్రార్యా భవంతి -
భ్రుకుటీకుటిలోత్కటముఖః సందష్టోష్ఠః
స్పృశన్ కరేణకరమ్ ।
క్రుద్ధః స్వభుజప్రేక్షీ శత్రౌ నిర్యంత్రణం రుష్యేత్ ॥
కించిదవాఙ్ముఖదృష్టిః సాస్ర స్వేదాపమార్జనపరశ్చ ।
అవ్యక్తోల్బణ చేష్టో గురౌ వినయయంత్రితో రుష్యేత్ ॥
అల్పతర ప్రవిచారో వికిరన్నశ్రూణ్యపాంగవిక్షేపైః ।
సభ్రుకుటీ స్ఫురితోష్ఠః ప్రణయోపగతాః ప్రియాం రుష్యేత్ ॥
అథ పరిజనేతు రోష-స్తర్జన-నిర్భర్త్స-నాక్షివిస్తారైః ।
విప్రేక్షణైశ్చ వివిధై రభినేయః క్రూరతారహితః ॥
కారణమపేక్షమాణః ప్రాయేణాయాసలింగసంయుక్తః ।
వీరరసాంతరచారీ కార్యః కృతకో భవతి కోపః ॥
-(నా.శా.VII-15-20+ముందరిగద్యం)

అర్థం : అధర్షణ, ఆక్రుష్ట, కలహ, వివాద, ప్రతికూల-ఆదిభిః, విభావైః, సముత్పద్యతే =అధర్షణం (=తిరస్కారం), ఆక్రుష్టం (=ఆక్రోశం = కేక), కలహం, వివాదం, ప్రతికూలత మున్నగు, విభావాలవల్ల, (క్రోధం) ఉత్పన్నమవుతుంది.

వికృష్టనాసాపుట, ఉద్వృత్తనయన, సందష్ట-ఓష్ఠపుట, గండస్ఫురణ-ఆదిభిః, అనుభావైః, అస్య, అభినయః, ప్రయోక్తవ్యః =నాసాపుటాలు పెద్దవి కావటం, కనులను పైకివిత్తిచూడటం, పెదవులను బిగించటం, కపోలాలు

అదరటం మున్నగు, అనుభావాలతో, దీని (=క్రోధం) యొక్క అభినయం చేయాలి.

రిపుజః, గురుజః(చఏవ), ప్రణయి ప్రభవః (తథా), భృత్యజః, కృతకః(చ), ఇతి, క్రోధః, పంచవిధః, స్మృతః=రిపుజం (=శత్రువువల్ల కలిగినది), గురుజం (=గురుజనులవల్ల కలిగినది), ప్రణయిప్రభవం (=ప్రేమ కలవారివల్ల కలిగినది), భృత్యజం (=భృత్యులవల్ల కలిగినది), కృతకం (=తెచ్చిపెట్టుకొన్నది), అని, క్రోధం, అయిదు విధాలు.

అత్ర-ఆర్యాభవంతి =ఈసందర్భంలో కొన్ని ఆర్యలు కలవు.

భ్రుకుటీ కుటిలః, ఉత్కటముఖః, సందష్ట-ఓష్ఠః, స్పృశన్ కరేణ కరం=కుటిలమైన భ్రుకుటీ, ఉత్కట (=కుటిలం లేదా మీదికి ఎత్తబడిన) ముఖం, సందష్టమైన (=పై పళ్ళతో బిగపట్టబడిన) క్రింది పెదవి, పరస్పరం రాపిడి చెందుతున్న అరచేతులు - కలవాడై; క్రుద్ధః, స్వభుజప్రేక్షీ, శత్రౌ, నిర్యంత్రణం, రుష్యేత్ =క్రుద్ధుడు (=కోపించినవాడు), తన భుజాలను చూస్తూ (లేదా జబ్బలను చరుస్తూ), శత్రువుమీద, అనియతమైన, రోషం చూపించాలి.

కించిత్-అవాక్-ముఖదృష్టిః, సాస్ర, స్వేద-అపమార్జన పరః(చ), అవ్యక్త-ఉల్బణచేష్టః, గురౌ, వినయయంత్రితః, రుష్యేత్=కొంచెం క్రింది చూపు, కన్నీరు, స్వేదం తుడుచుకొంటూ ఉండటం, వ్యక్తంకాని ఉల్బణ (=పరుషమైన) చేష్టలు (కలవాడై, క్రుద్ధుడు), వినయ సహితుడై, గురుజనుల మీద, రోషం చూపించాలి.

అల్పతర ప్రవిచారః, అశ్రూన్ వికరన్, అపాంగవిక్షేపైః, సభ్రుకుటీ, స్ఫురిత-ఓష్ఠః, ప్రణయోపగతా, ప్రియాం, రుష్యేత్=అల్పంగా కదలటం, అశ్రువులను విదిలించటం, కడకంటి చూపులు ప్రసరించటం, బొమముడి వేయటం, పెదవులు ఆదరటం (మున్నగువానితో క్రుద్ధుడు), ప్రణయినిమీద, రోషం చూపించాలి.

(అథ), తర్జన, నిర్భర్త్సన, అక్షివిస్తారైః, వివిధైః, విప్రేక్షణైః (చ), క్రూరతారహితః, పరిజనే, రోషః, అభినేయః=తర్జనం (=చేష్టాపూర్వకంగా బెదరించటం), నిర్భర్త్సనం (=మాటలతో బెదరించటం లేదా చీవాట్లు పెట్టటం), కళ్ళు పెద్దవి చేయటం, తృణీకారభావం చూపులందు అనేక విధాలుగా వ్యక్తంచేయటం - ఇటువంటి వాటితో క్రూరతారహితంగా, పరిజనులమీద, రోషంచూపాలి.

కారణం-అపేక్షమాణః, ప్రాయేణ-ఆయాసలింగ సంయుక్తః, కోపః, కృతకః, భవతి =ఏదో ఒక కారణంతో తెచ్చిపెట్టుకొన్నది, ప్రాయశః ఆయాసం వంటి కోపచిహ్నాలు కలది - ఇటువంటి కోపం, కృతకం అవుతుంది; వీరరసాంతరచారీకార్యః =(ఈకృతకకోపం) వీరరసమందు కూడా ప్రయుక్త మవుతుంది (ఉభయ రసాలకు సంబంధించినది - అని పాఠాంతరం).

తాత్పర్యం : విభావాలు : ఆధర్షణం, ఆక్రుష్టం, కలహం, వివాదం, ప్రాతికూల్యం మున్నగునవి.

అనుభావాలు : నాసా పుటాలు పెద్దవిచేయటం, కనులను పై కెత్తి చూడటం, పెదవులను బిగించటం, కపోలాలు అదరటం మున్నగునవి.

క్రోధభేదాలు : శత్రువులవల్ల జనించినది, గురుజనులవల్ల జనించినది, ప్రేమకలవారివల్ల జనించినది, భృత్యులవల్ల జనించినది, కృతకం-ఇట్లా క్రోధం అయిదు విధాలు.

ఈ విషయాలను వివరించే ఆర్యలు కలవు.

రిపుజక్రోధం : బొమముడి వేయటం, కపోలాలను పైకివిత్తటం, పెదవులను బిగించటం, అరచేతులను పరస్పరం రాపిడి పెట్టటం, జబ్బలను చరచటం - వీటితో శత్రువుమీది కోపం చూపించాలి.

గురుజక్రోధం : కొంచెం క్రింది చూపు, కన్నీరు, చెమట తుడుచు కొనటం, కోపపు చేష్టలను అవ్యక్తంగా చేయటం - వీటితో వినయసహితంగా గురుజనుల మీది కోపం ప్రకటించాలి.

ప్రణయి ప్రభవక్రోధం : స్వల్పంగా అటునిటు కదలటం, కన్నీరు, కడ కంటి చూపులు, బొమముడి, పెదవులు అదరటం - వీటితో ప్రణయినిమీది కోపం చూపించాలి.

భృత్యజక్రోధం : తర్జనం, నిర్భర్త్సనం, కళ్ళు పెద్దవిచేయటం, చూపులలో అనేకవిధాలుగా తృణీకారభావం చూపించటం - వీటితో క్రూరతారహితంగా భృత్యులమీది కోపం ప్రకటించాలి.

కృతకక్రోధం : ఏదేని ఒకవ్యాజంతో తెచ్చిపెట్టుకొన్న కోపం కృతకం అవుతుంది. ఇందులో, కోపంవల్ల కలిగే ఆయాసం మున్నగు కోపచిహ్నాలు చూపించాలి. ఈ కృతక క్రోధం వీరరసమందు కూడా ప్రయుక్తమవుతుంది.

టీక : మనస్సు క్షోభించటం శోకానికి దారి తీస్తే మనస్సు జ్వలించటం (=మండటం) క్రోధానికి దారితీస్తుంది. క్రోధాన్ని సింగభూపాలుడు ఇట్లా వివరించినాడు (ర.సు.II-1277-139) : వధ, అవమానం మున్నగువానివల్ల కలిగే చిత్తజ్వలనం 'క్రోధం'. క్రోధం, కోపం, రోషం - అనే భేదాలచేత క్రోధం మూడు విధాలు :

చంపటం, నఱకటం పర్యంతం, క్రూరజనాశ్రయంగా ఉండేది క్రోధం.

ప్రార్థించే పర్యంతం వీరజనులయందుండేది కోపం.

స్త్రీ-పురుషలకు ఒండొరులపై కలిగేది రోషం; ఇది నమ్మిక కలిగే పర్యంతం ఉంటుంది.

శత్రువులు, భృత్యులు, సుహృత్తులు (=స్నేహితులు=ప్రియులు), పూజ్యులు (=గురుజనులు) - ఈ నలుగురు క్రోధ-కోపాలకు విషయాలు.

శత్రువిషయకమైన క్రోధమందలి అనుభావాలు : మాటిమాటికి పెదవులను నొక్కిపట్టటం, బొమముడిపాటు, పండ్లుకొరకటం, అరచేతులను రాపిడిపెట్టటం, దేహం కంపించటం, ఆయుధాలవైపు చూడటం, తన భుజాలను చూసుకొనటం, గర్జించటం మున్నగునవి.

ఉదా : వధచేత శత్రువిషయకమైన క్రోధం :
కృతమనుమతం దృష్టం వా యై రిదం గురుపాతకం
మనజపశుభి ర్నిర్మర్యాదై ర్భవద్భి రుదాయుధైః ।
నరకరిపుణాసార్థం తేషాం భీమకిరీటినా
మయ మహ మసృఙ్మేదోమాంసైః కరోమి దిశాం బలిమ్ ॥
-(వే.సం.III-21)

— ఓ అరివీరులారా! మనష్యపశువులయిన మీరు, మర్యాదనతిక్రమించి, ఆయుధాలు ఉపయోగించి, (ద్రోణవధ) అనే ఈ గురుద్రోహానికి ఒడిగట్టినారు. ఈ మహాపాతకము నొనర్చినవారిని, దీనికి అంగీకరించిన వారిని, చూసినవారిని - కృష్ణ-భీమ-అర్జునులతో కూడా మీ అందరిని చంపి, మీ రక్తమాంసాలతో, మెదడులతో దిక్కులకు బలివేస్తాను (అశ్వత్థామ మాటలు).

శత్రువిషయకమైన కోపమందలి అనుభావాలు; వ్యంగ్యంగా మాటాడటం, బొమముడిపాటు, నొసట చెమట, కటాక్షాలు ఎఱ్ఱపడటం మున్నగునవి.

భృత్య-మిత్ర-పూజ్యులమీద కలిగే ముప్విధములగు కోపాలకు తత్తదుచితము లుగా అనుభావాలను ఊహించుకోవాలి.

ఉదా : కోపేన ప్రతిధూత కుంతల భర స్సర్వాంగజో వేపథుః
కించిత్ కోకనదచ్ఛదేన సదృశేన నేత్రే స్వయం రజ్యతః ।
ధత్తే కాంతి మిదంచ వక్త్ర మనయో ర్భంగేన భీమభ్రువో
శ్చంద్ర స్యోద్భ్రటలాంఛనస్య కమల స్యోద్భ్రాంత భృంగస్య చ ॥
-(ఉ.రా.చ.V-చివరిశ్లోకం)

— కోపంతో ఎగురుతున్న జుట్టుకలిగి, శరీరమంతటా కంపంపుట్టి, ఇతడు, చిన్న ఎఱ్ఱకలువ రేకులవలె ప్రకాశిస్తున్న కనులు కలిగి ఉన్నాడు; ఇతనిముఖం కాంతిమంతమై, భయంకరములైన బొమముడిపాటులతోడి లాంఛనాలతో చంద్రుని, తిరుగుతున్న తుమ్మెదలతో కూడిన కమలాయొక్క పోలికను పొందుతున్నది (లవ-చంద్రకేతుల పరస్పర కోపం భ్రూభేదాదుల వలన వ్యక్తమవుతున్నది).

భృత్యవిషయకమగు క్రోధమందలి అనుభావాలు : భయ పెట్టటం, తల వంకించటం, పెక్కు విధాలుగా బెదరించటం, మాటిమాటికి తేరిపారచూడడం మొ॥

మిత్ర విషయకమగు క్రోధమందలి అనుభావాలు : కనుకొలకులనుండి నీరుకారటం, ఊరక ఆలోచించటం, చేష్టలు లేకుండటం, మాటిమాటికి నిట్టూర్పులు విడువటం, మాటాడకుండటం, తలవటం, క్రిందికి చూడటం మున్నగునవి.

పూజ్యజన విషయకమైన క్రోధమందలి అనుభావాలు : స్వనింద, అధో ముఖత్వం, సమాధానం చెప్పకుండటం, శరీరం చెమటవట్టటం, గాద్గద్యం మున్నగునవి.

ఉదా : రామప్రవాసజననీం జననీం విలోక్య
రూక్షవివక్షు రపి గద్గదికాం దధానః ।
నమ్రముఖానన: కుటిలరజ్యదపాంగ దృష్టిః
జజ్వాల చేతసి పరం భరతో మహాత్మా ॥ -(వీరానందం)

— గొప్ప హృదయంగల భరతుడు, శ్రీరామప్రవాస హేతువు అయిన తల్లిని చూసి, ఆమెను కఠినంగా నిందింపదలచికూడా, గద్గదిక కలుగగా,

ముఖంవంచి, కుటిలంగా ప్రకాశించే అపాంగవీక్షణం ప్రసరింపజేసి, మనస్సులోనే మండిపడినాడు.

స్త్రీమీద పురుషునకు కలిగిన రోషమునందలి అనుభావాలు : కుటిల వీక్షణాలు, అధరస్ఫురణం, అపాంగరాగం, నిట్టూర్పులు,

ఉదా : భ్రూభంగ భిన్న ముపరంజితలోచనాంత
మాకంపితాధర మతిశ్వసితానుబంధమ్ ।
పత్యుర్ముఖం క్షితిసుతా పరిలోకయంతీ
కారావిముక్తి రపి కష్టతరేతి మేనే ॥ -(వీరానందం)

— బొమముడిపాటుతో కూడినదై, ఎఱ్ఱవారిన కనుకొలకులు, కంపించుతున్న పెదవులు, అధికములగు నిట్టూర్పులుకల శ్రీరాముని ముఖం చూస్తున్న క్షితిసుతకు, తాను రావణుని చెరనుండి విముక్తిని పొందటం కూడా కష్టతరంగానే భావించినది.

పురుషునిమీద స్త్రీకి కలిగే రోషం రెండు విధాలు : సపత్ని హేతుకం, ఇతర హేతుకం. సపత్ని హేతుకమైన రోషం విప్రలంభ శృంగారవివరణ సందర్భంలో విపులీకరించబడుతుంది. ఇంక, ఇతర కారణాలవల్ల కలిగే రోషంలోని అనుభావాలు, పురుషునికి కలిగే రోషంవంటివే అవుతాయి.

ఉదా : ఇతర హేతుకరోషం :
మయ్యేవ విస్మరణ దారుణ చిత్తవృత్తౌ
వృత్తం రహః ప్రణయ మప్రతిపద్యమానే ।
భేదాద్ భ్రువోః కుటిలయో రతిలోహితాక్ష్యా
భగ్నం శరాసన మివాతిరుషా స్మరస్య ॥ -(అభి.శా.V-23)

— జరిగిన ప్రణయవృత్తాంతం జ్ఞాపకంలేక, దారుణమైన మనోవ్యాపారంతో నేనుండగా, శకుంతల-వంచిన కనుబొమలను ముడివేసి, ఎఱ్ఱని కనులతో నన్ను చూసినప్పుడు, మిక్కిలి రోషంతో మన్మథుడు వింటిని విరిచినట్లు నాకుతోచినది (శకుంతలకు తనమీద కలిగిన రోషాన్నిగూర్చి దుష్యంతుడు స్మరించటం).

టీక : సింగభూపాలుడు 'కృతకక్రోధ'మనే భేదాన్ని వివరించలేదు; మిత్రవిషయక క్రోధాన్ని అధికంగా చెప్పినాడు. క్రోధాన్ని ముప్పిధాలుగా చెప్పటం కూడా సింగభూపాలుని స్వోపజ్ఞమే. అయితే భరతముని చెప్పిన ప్రణయప్రభవక్రోధాన్ని స్త్రీపురుషులయందు పరస్పరం జనించే రోషంలో అంతర్భావింపజేసినాడు.

# 5. ఉత్సాహం

మూలం : ఉత్తమప్రకృతిః. స చావిషాద శక్తి ధైర్య శౌర్యాదిభిః
విభావై రుత్పద్యతే. తస్య స్థైర్య ధైర్య త్యాగ
వైశారద్యాదిభిః అనుభావైః అభినయః ప్రయోక్తవ్యః.
అత్ర శ్లోకః -
అసమ్మోహాదిభి ర్వ్యక్తో వ్యవసాయనయాత్మకః ।
ఉత్సాహ స్త్వభినేయః స్యా దప్రమాదోత్థితాదిభిః ॥
-(నా.శా.VII-21)

అర్థం : ఉత్తమప్రకృతిః =(ఉత్సాహం) ఉత్తమ ప్రకృతులయందు ఉంటుంది; సః(చ), అవిషాద, శక్తి, ధైర్య, శౌర్య-అదిభిః, విభావైః, ఉత్పద్యతే=అది(=ఉత్సాహం), విషాదరాహిత్యం, శక్తి, ధైర్యం, శౌర్యం, మున్నగు విభావాలవల్ల జనిస్తుంది; స్థైర్య, ధైర్య, త్యాగ, వైశారద్య-అదిభిః, అనుభావైః, తస్య, అభినయః, ప్రయోక్తవ్యః =స్థైర్యం, ధైర్యం, త్యాగం, వైశారద్యం (=చాతుర్యం) మున్నగు, అనుభావాలచేత, దాని (=ఉత్సాహం) యొక్క, అభినయం, చేయాలి.

అత్ర శ్లోకః=ఈ సందర్భంలో ఒక శ్లోకం ఉంది :

అసమ్మోహ-ఆదిభిః, వ్యక్తః, వ్యవసాయ-నయాత్మకః, ఉత్సాహః(తు) అప్రమాద-ఉత్థితాదిభిః, అభినేయః, స్యాత్=అసంమోహం (=స్థిరచిత్తత) మున్నగువానిచేత అభివ్యక్తమై, వ్యవసాయ-నయాత్మకం అయిన, ఉత్సాహాన్ని, ప్రమాదహీనత, సంసిద్ధతమున్నగు వానిచేత అభినయించాలి

తాత్పర్యం : ఉత్సాహం, ఉత్తమ ప్రకృతులందు ఉంటుంది. విషాదం లేకుండటం, శక్తి, ధైర్యం, శౌర్యం-ఇవి విభావాలు. ఇంక అనుభావాలు : స్థైర్యం, ధైర్యం, త్యాగం, వైశారద్యం.

ఈ సందర్భంలో ఒక శ్లోకం ఉన్నది :

విభావాలు : స్థిరచిత్తం మున్నగునవి. వ్యవసాయం (=కృషి), నీతి-వీనితో కూడి ఉంటుంది.

అనుభావాలు : ప్రమాదహీనత, సంసిద్ధత.

టీక : "లోకోత్తర కార్యములందు స్థిరమైన ప్రయత్నం ఉత్సాహం" అని విద్యానాథుడు.

సింగభూపాలుడు ఉత్సాహాన్ని క్రిందివిధంగా వివరించినాడు (ర.సు.II-123-24):

శీలమునకు వన్నెతెచ్చే కార్యములందు శక్తి, ధైర్యం, సహాయం మున్నగు వాటివల్ల వేగంతో కూడిన మనోవ్యాపారం 'ఉత్సాహం'. సమయం కోసం చూడటం, ధైర్యం, ఉత్సాహపు మాటలు మున్నగునవి ఇందలి క్రియలు. ఈ ఉత్సాహం– సహజం, ఆహార్యం (=తెచ్చిపెట్టు కొన్నది) అనే భేదాలచేత రెండు విధాలు.

శక్తి, ధైర్యం, సహాయం - ఈ మూడింటిచేత సహజ-ఉత్సాహం మూడు విధాలు; అట్లాగే ఆహార్య- ఉత్సాహంకూడా మూడు విధాలు.

ఉదా : స్వశక్తిపూర్వక సహజోత్సాహం :
తతో రావణనీతాయా స్సీతాయా శ్శత్రుకర్శనః ।
ఇయేష పద మన్వేష్టుం చారణా చరితే పథి ॥
దుష్కరం నిష్ప్రతిద్వంద్వం చికీర్షన్ కర్మ వానరః ।
సముదగ్ర శిరోగ్రీవో గవాంపతి రివాబభౌ ॥
-(రామా.సుం.కాం.I-1-2)

– తరువాత, శత్రువులను కృశింపజేయగల హనుమంతుడు రావణునిచేత తీసుకొనిపోబడిన సీతయొక్క స్థానాన్ని అన్వేషించటానికి దేవగాయకులయిన చారణులు సంచరించే ఆకాశమార్గాన వెళ్ళవలెనని సంకల్పించినాడు. సాటిలేనిది, దుష్కరము అయిన సముద్రలంఘనం చేయవలెనని సంకల్పించిన హనుమంతుడు మెడ, తల పైకెత్తి కొండపైనిలిచి, మదించిన వృషభంవలె గోచరించినాడు.

ధైర్య-సహాయపూర్వకమైన ఆహార్య-ఉత్సాహం :
తవ ప్రసాదా త్కుసుమాయుధోఽపి
సహాయ మేకం మధు మేవ లబ్ధ్వా ।

కుర్యాం హరస్యాపి పినాకపాణేః
ధైర్యచ్యుతిః కే మమ ధన్వినోఽన్యే ॥ -(కు.సం.III-10)

– (ఓ అమరాధిపా!) నేను కుసుమాయుధుడనే అయినప్పటికి వసంతుని ఒక్కనిని సహాయంగా గ్రహించి, నీ అనుగ్రహంతో (=నీవు ఇచ్చిన ధైర్యంతో) పినాకపాణి అయిన శివునకు కూడా ధైర్యచ్యుతి చేస్తాను. తక్కిన వీరులు నాకు లెక్కలోని వారుకారు (మన్మథుడు, ఇంద్రునితో చెప్పినమాటలు - మన్మథుడు సహజంగా శక్తి లేనివాడు; కాని ఇంద్రుడు ఇచ్చిన ధైర్యం, వసంతుని సహాయం వానికి లభించాయి).

## 6. భయం

మూలం : స్త్రీనీచ ప్రకృతికమ్. గురు రాజాపరాధ శ్వాపద
శూన్యాగారాటవీ పర్వత గహన గజాది దర్శన
నిర్భర్త్సన కాంతార దుర్దిన నిశాంధకారోలూక
నక్తంచరారావ శ్రవణాదిభిః విభావైః సముత్పద్యతే.
తస్య ప్రకంపిత కరచరణ హృదయకంపన స్తంభ
ముఖశోష జిహ్వాపరిలేహన స్వేద వేపథు త్రాస
పరిత్రాణాన్వేషణ ధావనోత్క్రుష్టాదిభిః అను
భావైః అభినయః ప్రయోక్తవ్యః.
అత్రశ్లోకాః -
గురురాజాపరాధేన రౌద్రాణాం చాపి దర్శనాత్ ।
శ్రవణా దపి ఘోరాణాం భయం మోహేన జాయతే ॥
గాత్రకంపన విత్రాసై ర్వక్త్రశోషణ సంభ్రమైః ।
విస్ఫారితేక్షణైః కార్య మభినేయు క్రియాగుణైః ॥
సత్త్వవిత్రాసనోద్భూతం భయ ముత్పద్యతే నృణామ్ ।
ప్రస్తాంగాక్షినిమేషై స్తదభినేయం తు వర్తకైః ॥
అత్రార్యా భవతి :
కరచరణ హృదయకంపైః స్తంభన జిహ్వోపలేహ ముఖశోషైః ।
ప్రస్త ముషిషణ్ణ గాత్రై రస్యాభినయః ప్రయోక్తవ్యః ॥
-(నా.శా.VII-22-25+ముందరి గద్య)

అర్థం : స్త్రీ-నీచ ప్రకృతికం =(భయం) స్త్రీలయందు, నీచ ప్రకృతుల యందు కన్పట్టుతుంది; గురు-రాజ-అవరాధ, శ్వాపద, శూన్యాగార, అటవీ, పర్వత, గహన, గజ- ఆదిదర్శన, నిర్భర్త్సన, కాంతార, దుర్దిన, నిశాంధ కార, ఉలూక-నక్తంచర-ఆరావశ్రవణాదిభిః, విభావైః, సముత్పద్యతే =గురు జనులయెడ రాజువట్ల చేసిన అవరాధం, క్రూరజంతు దర్శనం, శూన్యాగార నివాసం, అడవులలో పర్వతాలమీద సంచరించటం, ఏనుగు సర్పం మున్నగు వాటి దర్శనం, నిర్భర్త్సనం, దుర్దినం (=బాగావర్షిస్తున్న పగలు), రాత్రి, చిమ్మచీకటి, గుడ్లగూబలు నక్కలు మున్నగువాని అరుపులు వినటం (నక్తంచరులు =రాత్రులందు తిరిగేవారు =రాక్షసులు అని కూడా అర్థం) మున్నగు, విభావాలవల్ల (భయం) ఉత్పన్నమవుతుంది.

ప్రకంపిత కర-చరణ, హృదయకంపన, స్తంభ, ముఖశోషణ, జిహ్వాపరిలే హన, స్వేద, వేపథు, త్రాస, పరిత్రాణాన్వేషణ, ధావన, ఉత్క్రుష్ట-ఆదిభిః, అనుభావైః, తస్య-అభినయః, ప్రయోక్తవ్యః=చేతులు కాళ్ళు వణకటం, గుండె వేగంగా కొట్టుకొనటం, స్తంభం (=నిశ్చేష్టత), నోరెండిపోవటం, నాలుకతో పెదవులను తడువుకొనటం, స్వేదం, వేపథువు, త్రాసం, రక్షణ కొరకు వెదకటం, పరుగెత్తటం, ఆక్రోశించటం, మున్నగు అనుభావాలతో, దాని (=భయం) యొక్క, అభినయం చేయాలి.

అత్రశ్లోకాః =ఈ సందర్భంలో కొన్ని శ్లోకాలు ఉన్నవి.

గురు-రాజ-అవరాధేన, రౌద్రాణాం (చ-అపి) దర్శనాత్, ఘోరాణాం, శ్రవణాత్-అపి, మోహేన, భయం, జాయతే=గురుజనులకు రాజునకు చేసిన అవరాధం, రౌద్ర విషయదర్శనం, ఘోర విషయాలను వినటం - వీటి వల్ల, (చిత్తానికి) కలిగే సమ్మోహంచేత భయం, జనిస్తుంది; గాత్రకంపన-విత్రాసైః, వక్త్రశోషణ-సంభ్రమైః, విస్ఫారిత-ఈక్షణైః, క్రియాగుణైః, అభి నేయః కార్యం=శరీరం వణకటం, త్రాసం, నోరెండిపోవటం, సంభ్రమం, నేత్రాలను పెద్దగా తెరవటం మున్నగు క్రియలతో భయాన్ని అభినయించాలి.

సత్త్వ-విత్రాసన-ఉద్భూతం, నృణామ్, భయం, ఉత్పద్యతే, తత్, స్రస్త-అంగ, అక్షినిమేషైః, నర్తకైః, అభినేయం=సత్త్వముల (=భూత, ప్రేతా దుల) వల్ల కలిగే త్రాసంచేత, మనుష్యులయందు భయం జనిస్తుంది. అది

(=అటువంటి భయం) జారిపోయిన అంగాలతో, కనుమూతలతో, నర్తకుల (=నటుల)చేత, అభినయింపబడాలి.

అత్ర-ఆర్యా భవతి=దీనిని వివరించే ఒక ఆర్యకలదు. కర-చరణ-హృదయ కంపైః, స్తంభన- జిహ్వావలేహ-ముఖశోషైః, స్రస్త-సువిణ్ణగాత్రైః, అస్య, అభినయః, ప్రయోక్తవ్యః =కర- చరణ-హృదయ కంపములు, స్తంభం, జిహ్వాతో పెదవులు నాకటం, ముఖశోషణం, అవ్యవస్థితఅవయవాలు - వీనితో, దీని (=భయం) యొక్క, అభినయం, చేయాలి.

తాత్పర్యం : భయం స్త్రీలలో, నీచప్రకృతులలో వ్యక్తమవుతుంది.

విభావాలు : రాజువట్ల గురుజనులవట్ల చేసిన అపరాధం, క్రూర మృగ దర్శనం, శూన్యాగార ప్రవేశం లేదా నివాసం, అటవీ- పర్వత ప్రదేశము లందు సంచారం, గజాదుల ఆకస్మిక దర్శనం, నిర్భర్త్సనం, కాంతార ప్రవేశం, దుర్దినం, రాత్రి, అంధకారం, ఉలూక-నక్తంచరాల అరవులు వినటం మున్నగునవి.

అనుభావాలు : ప్రకంపితకర-చరణములు, హృదయకంపనం, స్తంభం, ముఖశోషణం, జిహ్వాపరిలేహనం, స్వేదం, వేపథువు, త్రాసం, పరిత్రాణ-అన్వేషణం, ధావనం, ఉత్క్రుష్టం మున్నగునవి.

ఈ సందర్భంలో కొన్ని శ్లోకాలు :

గురు-రాజ అపరాధాలు, క్రూరమృగాల దర్శనం, ఘోరశ్రవణం— వీటివల్ల కలిగే మోహంచేత భయం కలుగుతుంది. గాత్రకంపనం, విత్రాసం, వక్త్రశోషణం, సంభ్రమం, పెద్దవైన కనులు - ఇటువంటి చేష్టలతో భయాన్ని ప్రకటించాలి. సత్త్వములవల్ల కలిగే త్రాసంచేత మనుష్యులలో భయం జనిస్తుంది. స్రస్త-అంగాలు, అక్షినిమేషాలు - వీటితో నర్తకులు భయాన్ని అభినయించాలి.

ఈ సందర్భంలో ఒక ఆర్యకూడా కలదు.

కర-చరణ-హృదయకంపాలు, స్తంభనం, జిహ్వాలేహనం, ముఖ శోషణం, స్రస్తం సువిషణ్ణం అయిన గాత్రం-వీటితో భయాన్ని అభినయించాలి.

టీక : "అపరాధం, ఘోరదర్శన-శ్రవణములు మున్నగువానివల్ల చిత్తమందు కలిగే అత్యంత చాంచల్యం భయం అనబడుతుంది" అని సింగభూపాలుడు (ర.సు.II-148). "రౌద్ర సందర్శనాదులవల్ల అనర్థాన్ని ఆశంకించటం భయం" అని విద్యానాథుడు (ప్ర.రు.య). రజః-తమః ప్రకృతులయిన నీచులందు గోచరించే భయం స్వాభావికమనీ, సత్త్వప్రధానులయిన ఉత్తములయందు గోచరించే భయం కృతకమనీ, రాజాదులు గురువులను సందర్శించునప్పుడు చూపే సత్త్వసముత్థమయిన భయం ఇట్టిదే అనీ అభినవగుప్తుడు. చిన్న పిల్లలను బెదరించటానికి పెద్దవారు భయం నటించటం కూడా కృతకమనే చెప్పాలి. -

ఉదా : ఉత్తముల హేతుజభయం :

విద్రాణే ద్రవ్యనాథే, సవితరి తరలే, జాతశంకే శశాంకే,
వైకుంఠే కుంఠగర్వే, ద్రవతి మఘవతి, క్లాంతకాంతౌ కృతాంతే ।
అబ్రహ్మణ్యం బ్రువాణే వియతి శతధృతౌ వుద్ధృతైకాగ్రహస్తే
పాయద్వః కాలకూటం ఝటితి కబలయన్ లీలయా నీలకంఠః ॥

-(ర.సు.II-150)

– కుబేరుడు పారిపోగా, సూర్యుడు చలింపగా, చంద్రుడు శంకింపగా, విష్ణుని గర్వం నశించగా, ఇంద్రుడు ద్రవింపగా, యముడు కాంతి దక్కగా, ఆకాశమున బ్రహ్మ చేయెత్తి 'అబ్రహ్మణ్యం' అని ఘోషింపగా - విలాసంగా కాలకూటాన్ని మింగిన శివుడు మమ్ము రక్షించుగాక!

టీక: సింగభూపాలుడు ఇంకా ఇట్లా వివరించినాడు (ర.సు.II-151-55):

హేతుజములగు భయాలకంటె వేరుగా రెండు విధములగు భయాలు ఉన్నవని సం.ర.కర్త - కృత్రిమం, విత్రాసికం. కృత్రిమమనేది ఉత్తమ ప్రకృతిగతం, గుర్వాది విషయం, అవాస్తవం. ఇంక బాలురుమున్నగు వారిని భయపెట్టటానికి పెద్దలుచూపే భయం విత్రాసికం. కాని విత్రాసికం అనేది ఘోరశ్రవణాదిజమగు భయంలోనే అంతర్భవిస్తుంది; భిక్షు-భల్లూక-చోర-క్రూర మృగ-విద్యుత్తులు మున్నగువాటి వల్ల కలిగే భయమే ఇది. ఇంక గుర్వాది విషయకం వినయమే కాని, భయంకాదు. కావున భయమనేది హేతుజం, ఏకైకం మాత్రమే.

. భయం కలిగించేవారు ముత్తెఅగులు : ఆకృతిభీషణులు, క్రియాభీషణులు, మాహాత్మ్యభీషణులు.

రాక్షసులు, పిశాచాలు మున్నగువారు ఆకృతిభీషణులు. వీరభద్రుడు, పరశురాముడు, పెద్దపులి, తోడేలు మున్నగువారు క్రియాభీషణులు.

రాజులు మున్నగువారు మాహాత్మ్యభీషణులు. ఇట్లా భయం ఏకైకం, హేతువులు మాత్రం పై మూడు.

## 7. జుగుప్స

మూలం : స్త్రీనీచ ప్రకృతికా. సా చాహృద్య దర్శనశ్రవణాదిభిః
విభావైః సముత్పద్యతే. తస్యాః సర్వాంగసంకోచ
నిష్ఠీవన ముఖవికూణన హృల్లేఖాదిభిః అను
భావైః అభినయః ప్రయోక్తవ్యః.
భవతి చాత్ర శ్లోకః -
నాసాప్రచ్ఛాద నేనేహ గాత్రసంకోచనేన చ ।
ఉద్వేజనైః సహృల్లేఖైః జుగుప్సా మభినిర్దిశేత్ ॥
-(నా.శా.VII-26)

అర్థం : స్త్రీ-నీచప్రకృతికా=(జుగుప్స) స్త్రీలయందు నీచప్రకృతులయందు, ఉంటుంది. సా(చ), అహృద్య దర్శన, శ్రవణ-ఆదిభిః, విభావైః, సముత్పద్యతే=అది (=జుగుప్స), హృద్యములు కాని వాటిని చూడటం, వాటిని గూర్చివినటం మున్నగు, విభావాలవలన, జనిస్తుంది; సర్వ-అంగ సంకోచ, నిష్ఠీవన, ముఖవికూణన, హృల్లేఖ-ఆదిభిః, అనుభావైః, తస్యాః, అభినయః, ప్రయోక్తవ్యః=అన్ని అవయవాలను ముడుచుకొనటం, ఉమ్మి వేయటం, మూతివంకరగా పెట్టుకొనటం, హృల్లేఖనం (=గుండె రాచుకొనటం), మున్నగు అనుభావాలచేత, దానియొక్క, అభినయం చేయాలి.

భవతి(చ)-అత్ర శ్లోకః=ఈ సందర్భంలో ఒక శ్లోకం ఉంది.

నాసాప్రచ్ఛాదనేన (ఇహ), గాత్ర సంకోచనేన(చ), ఉద్వేజనైః, సహృల్లేఖైః, జుగుప్సామ్, అభినిర్దిశేత్=ముక్కుమూసుకొనటం, గాత్రసంకోచం,

ఉద్వేజనం (=అస్థిరత్వం లేదా కలత చెందటం) - వీటి చేత జుగుప్సను నిరూపించాలి.

తాత్పర్యం : జుగుప్స స్త్రీ-నీచ ప్రకృతికం. విభావాలు : అహృద్య దర్శన-శ్రవణములు మొ ॥

అనుభావాలు : సర్వాంగ సంకోచనం, నిష్ఠీవనం, ముఖవికూణనం, హృల్లేఖం మొ॥

ఈ సందర్భంలో ఒక శ్లోకం ఉంది :

నాసా ప్రచ్ఛాదనం, గాత్ర సంకోచం, ఉద్వేజం, హృల్లేఖం - వీటిచేత జుగుప్సను నిర్దేశించాలి.

టీక : "అహృద్య పదార్థాల దర్శన-శ్రవణములు మున్నగు వాటివల్ల మనస్సంకోచం కలగటం జుగుప్స" అని సింగభూపాలుడు. నిలిచిన చోటునుంచి వేగంగా తొలగిపోవటం, అసహ్యపడటం, శరీరాన్ని కదలించటం - ఈ క్రియలు అధికంగా చెప్పినాడు సింగభూపాలుడు. ఘృణాశుద్ధమగు జుగుప్సను వేరుగా పేర్కొన్నాడు ధనంజయుడు. అది హేయమును వినటంవల్ల కలిగిన జుగుప్సకంటె భిన్నంకాదని సింగభూపాలుడు -(ర.సు.II-145-47).

## 8. విస్మయం

మూలం : మాయేంద్రజాల మానుషకర్మాతిశయ
చిత్ర-పుస్త-శిల్ప-విద్యాతిశయాదిభిః విభావైః
సముత్పద్యతే. తస్య నయన విస్తా రానిమేష
ప్రేక్షిత భ్రూక్షేప రోమహర్షణ శిరఃకంప సాధు
వాదాదిభిః అనుభావైః అభినయః ప్రయోక్తవ్యః.
భవతి చాత్ర శ్లోకః -
కర్మాతి శయ నిర్వృత్తో హర్షసంభవః ।
సిద్ధిస్థానే త్వసౌ సాధ్యః ప్రహర్షపులకాదిభిః ॥

-(నా.శా.VII-27)

అర్థం: మాయా-ఇంద్రజాల, మానుష కర్మ-అతిశయ, చిత్ర-పుస్త-శిల్ప-విద్యా-అతిశయ - ఆదిభిః, విభావైః, సముత్పద్యతే=మాయా- ఇంద్రజాలాలు, అమానుష కృత్యాలు, అతిశయంతో కూడిన చిత్రలేఖన-పుస్త- శిల్పాలు, విద్యాతిశయంమున్నగు, విభావాలవల్ల, (విస్మయం) జనిస్తుంది.

నయనవిస్తార, అనిమేష ప్రేక్షిత, భ్రూక్షేప, రోమహర్షణ, శిరఃకంప, సాధువాద-ఆదిభిః, అనుభావైః, తస్య, అభినయః, ప్రయోక్తవ్యః=కనులు పెద్దవికావటం, రెప్పవాల్చక చూడటం, కనుబొమలు ఎగుర వేయటం, రోమాంచం, తలవంకించటం, బాగుబాగు అనటం, మున్నగు అనుభావాలతో, దానియొక్క, అభినయం చేయాలి.

భవతి(చ) (అత్ర) శ్లోకః=ఇచ్చట ఒకశ్లోకం ఉంది :

కర్మ-అతిశయ నిర్వృత్తౌ సిద్ధిస్థానే హర్ష సంభవః=లోకాతిశాయి అయిన కృత్యాలు సిద్ధించటంవల్ల కలిగే హర్షం నుంచి విస్మయం జనిస్తుంది.

అసౌ(తు) ప్రహర్ష-పులక-ఆదిభిః, సాధ్యః=ఇది, ప్రహర్షం, రోమాంచం మున్నగు వాటివల్ల సాధ్యం (=అభినయించదగినది).

తాత్పర్యం : విభావాలు : మాయా-ఇంద్రజాలాలు, అమానుష కృత్యాలు, అతిశయంతో కూడిన చిత్రలేఖన-శిల్ప-పుస్తాలు, విద్యాతిశయం మున్నగునవి.

అనుభావాలు : కన్నులు పెద్దవికావటం, రెప్పవాల్చక చూడటం, కనుబొమలు ఎగురవేయటం, రోమాంచం, తలఊపటం, సాధువాదం (=మెచ్చుకొనటం) మున్నగునవి. ఈ సందర్భంలో ఒక శ్లోకం ఉన్నది. లోకాతిశాయి కృత్యం సిద్ధించటంవల్ల కలిగే హర్షంనుంచి విస్మయం జనిస్తుంది. ప్రహర్షం, రోమాంచంమున్నగువాటితో విస్మయం నిరూపించాలి.

టీక : "అపూర్వార్థ సందర్శనంవల్ల కలిగే చిత్తవిస్తారం విస్మయం" అని విద్యానాథుడు. ఆకస్మికమనోరథలాభాన్ని కూడా విభావంగా పేర్కొన్నాడు విద్యానాథుడు (ప్ర.రు.య.).

ఉదా : శిలా కంపం ధత్తే, శివశివ! వియుంక్తే కఠినతా
మహో! నారీచ్ఛాయా మయతి, వనితా రూప మయతే!

వదత్యే వం రామే వివలితముఖీ వల్కల మురః
స్థలే కృత్వా బధ్వా కచభర ముదస్థా దృషివధూః ॥
-(హనుమన్నాటకం-I-14)

— "ఆహాహా! రాయి కంపిస్తున్నది. ఓహో! కాఠిన్యం విడుస్తున్నది. ఓహో! ఆడుదాని పోలికను పొందుతునట్లున్నదే! ఆహా! ఆడుదానిగా మారినదే!" అని రాముడు పలుకుచుండగా, (గౌతమ) ఋషిపత్ని (అయిన అహల్య), ముఖంవంచుకొని, పయ్యెదసర్దుకొని, జుట్టుముడి వేసుకొని, లేచి, నిలిచినది!

శిశుర్వేత్తి పశుర్వేత్తి
వేత్తిగాన రసం ఫణీ ।
సాహిత్య రసమాధుర్యం
శంకరోవేత్తి వానవా ॥

సంగీతమపి సాహిత్యం
సరస్వత్యాః స్తనద్వయమ్ ।
ఏకమాపాతమధుర
మన్యదాలోచనామృతమ్ ॥

జయన్తితే సుకృతినో
రససిద్ధాః కవీశ్వరాః ।
నాస్తితేషాం యశఃకాయే
జరామరణజం భయమ్ ।
-భర్తృహరి నీతిశతకం-21

# సాత్త్వికభావాలు

మూలం : త్రయస్త్రింశ దిమే భావా విజ్ఞేయా వ్యభిచారిణః ।
సాత్త్వికాంస్తు పున ర్భావా న్ప్రవక్ష్యా మ్యనుపూర్వశః ॥ 93
అత్రాహ-కిమన్యేభావాః సత్త్వేన వినాఽభినీ
యంతే యస్మా దుచ్యంతే ఏతే సాత్త్వికా ఇతి?
అత్రోచ్యతే—
ఇహహి సత్త్వం నామ మనః ప్రభవమ్. తచ్చ
సమాహితమనస్త్వా దుచ్యతే. మనసః సమాధౌ
సత్త్వనిష్పత్తి ర్భవతి. తస్య చ యోఽసౌ
స్వభావో రోమాంచాశ్రు వైవర్ణ్యాది లక్షణో
యథా భావోపగతః స న శక్యోఽన్య మనసా
కర్తు మితి. లోకస్వభావానుకరణత్వా చ్చ
నాట్యస్య సత్త్వ మీప్సితమ్.
కో దృష్టాంతః --
ఇహహి నాట్యధర్మి ప్రవృత్తాః సుఖదుఃఖకృతా
భావా స్తథా సత్త్వవిశుద్ధాః కార్యాః యథా
సరూపా భవంతి. తత్ర దుఃఖంనామ రోద
నాత్మకం తత్కథ మదుఃఖితేన, సుఖం చ
ప్రహర్షాత్మక మసుఖితేన వాభినేయమ్?
ఏతదేవాస్య సత్త్వం యత్ దుఃఖితేన సుఖి
తేన వాఽశ్రు రోమాంచౌ దర్శయితవ్యౌ ఇతి
కృత్వా సాత్త్వికా భావా ఇత్యభివ్యాఖ్యాతాః.
స్తంభః స్వేదోఽథ రోమాంచః స్వరభేదోఽథ వేపథుః ।
వైవర్ణ్య మశ్రు ప్రలయ ఇత్యష్టౌ సాత్త్వికా మతాః ॥ 94
-(నా.శా.VII-93+గద్య+94)

అర్థం : ఇమే, త్రయః-త్రింశత్ భావాః, వ్యభిచారిణః, విజ్ఞేయాః=ఈ, 33 భావాలు, వ్యభిచారిభావాలు (అని), తెలియవలె; పునః, సాత్త్వికాం(తు) భావాన్, అనుపూర్వశః, ప్రవక్ష్యామి=ఇంక, సాత్త్వికభావాలను, క్రమంగా వివరిస్తాను (అని భరతముని చెప్పినాడు).

అత్ర-ఆహ=ఋషులు ఇట్లా అడిగారు—

అన్యేభావాః, సత్త్వేనవినా, అభినీయతే, యస్మాత్=ఇతర భావాలు, సత్త్వవిహీనంగా, అభినయింపబడతాయి, కాబట్టి; ఏతే, సాత్త్వికాః, ఇతి ఉచ్యంతే కిం =ఇవి, సాత్త్వికభావాలు, అని, చెప్పబడుతూ, ఉన్నవా?

అత్ర, ఉచ్యతే=ఇప్పుడు (సమాధానం) చెప్పబడుతున్నది. ఇహ(హి), సత్త్వంనామ, మనఃప్రభవం=ఇచ్చట, సత్త్వం అనేది, మనః ప్రభవం (=మనస్సునందు పుట్టేది); తత్(చ), సమాహిత, మనస్త్వాత్, ఉచ్యతే=అది (=ఆ సత్త్వం), సమాహితమైన (=ఏకాగ్రతగల) మనస్సు కలది కావటంచేత, (అట్లా) చెప్పబడుతున్నది; మనసః సమాధౌ, సత్త్వనిష్పత్తిః, భవతి=మనస్సు యొక్క సమాధి (అవస్థ) యందు, సత్త్వం, నిష్పన్నమవుతుంది; తస్య(చ), యథాభావోపగతః, రోమాంచ-అశ్రు-వైవర్ణ్య-ఆది, లక్షణః=దాని (=సత్త్వం) యొక్క, భావానుగుణంగా జనించే, రోమాంచం-అశ్రువు-వైవర్ణ్యం-మున్నగు, లక్షణాలతో కూడిన; యః, అసౌ, స్వభావః=ఏ, ఈ, స్వభావం (ఉన్నదో); సః=ఆస్వభావం; అన్యమనసా, కర్తుం, న, శక్యమ్, ఇతి =అన్యమనస్కుడు (=ఏకాగ్రత లేనివాడు), చేయుటం (=చూపటం లేదా అభినయించటం), శక్యంకాదు; లోకస్వభావ-అనుకరణత్వాత్(చ), నాట్యస్య, సత్త్వం, ఈప్సితం=(నాట్యం) లోకస్వభావానుకరణం కాబట్టి, నాట్యమందును, సత్త్వం, ఆవశ్యకమవుతున్నది.

దృష్టాంతః, కః=ఇందుకు దృష్టాంతం ఏమిటి?

ఇహ(హి), నాట్యధర్మిప్రవృత్తాః, సుఖ-దుఃఖకృతాః భావాః=నాట్యధర్మిని అనుసరించి (=నాట్యమందు) ప్రదర్శింపబడే, సుఖ-దుఃఖాలకు సంబంధించిన భావాలు; యథా సరూపాః భవంతి=ఎట్లా సరూపములు (=లోకమందలి సుఖ-దుఃఖములతో సమానములు) కాగలవో; తథా, సత్త్వవిశుద్ధాః, కార్యాః=అట్లాగే, సత్త్వ విశుద్ధంగా చేయాలి.

(తత్ర) దుఃఖంనామ రోదన-ఆత్మకం =(ఇచ్చట) దుఃఖం అనేది, రోదనంతో నిండినది; తత్, అదుఃఖితేన=అది(=దుఃఖం), దుఃఖంలేనివానిచేత;

అభినయింపబడటానికి హేతువైనది, వాని యందలి 'సత్త్వం'; ఈ సత్త్వ బలంచేతనే · నాట్యంలో దుఃఖితుడు అశ్రువును, సుఖితుడు రోమాంచమును ప్రదర్శింపగలడు; అందుచేతనే, ఇవి సాత్త్వికభావాలు అని చెప్పబడినవి.

సాత్త్వికభావాలు ఎనిమిది : స్తంభం, స్వేదం, రోమాంచం, స్వరభేదం (=స్వరభంగం, =వైస్వర్యం), వేపథువు (=కంపం), వైవర్ణ్యం (=వివర్ణత), అశ్రువు (=అస్రం), ప్రలయం.

టీక : 1) సంగీతరత్నాకరకారుడు సాత్త్వికభావాన్ని ఇట్లా వివరించినాడు (VII-1646) :

"ఇంతకుముందు వివరింపబడిన రత్యాదిస్థాయిభావాలచేత 'సంవిత్తు' (=విషయ విశేషం =consciousness) వికారం (=మార్పు) చెందినప్పుడు, ఆ సంవిత్తు ప్రాణంతో ఏకమవుతుంది (ప్రాణం=శరీరాంతశ్చరమూ, జీవన నిమిత్తము అయిన వాయువిశేషం =vital breath); అప్రాణం శరీరాన్ని స్పందింపజేస్తుంది. అప్పుడు స్తంభాదివికారాలు దేహమందు వ్యక్తమవుతాయి."

ఇట్లా విభావసంబంధి రత్యాదులచేత స్వాద్యమానములవుతూ, దేహసం స్థములయిన స్తంభాదులచేత అనుభావితములవుతూ, ఈ అంతరభావాలు సంవిత్తుతో ఏకమైన ప్రాణమందు ప్రకాశిస్తాయి. సత్త్వమనే పేరుగల ప్రాణమందు ప్రకాశించటంవల్ల ఇవి సాత్త్వికభావాలు అయినవి.

లేదా, సత్త్వమనేది సాంఖ్యసిద్ధాంతమందలి సత్త్వగుణం లేదా సాధుత్వం (goodness) అని చెప్పవచ్చు. నిర్మలములయిన ప్రాణ-దేహములు కలిగి ఉండటం సాధుత్వం; ఇట్లా సత్త్వసంపన్నములయిన భావాలు, సాత్త్వికభావాలు అని సజ్జనులమతం.

ప్రాణం, భూమి ప్రభృతి నాలుగు భూతాలను ప్రాధాన్యంతో అవలం బించి, ఒక్కొక్కప్పుడు తానే ప్రధానమై శరీరంలో సంచరిస్తూ ఉంటుంది. ప్రాణం-పృథివీభూతాన్ని అవలంబించినప్పుడు అశ్రువు; తేజోభూతాన్ని అవలంబిం చినప్పుడు వివర్ణత, స్వేదం; ఆకాశనిష్ఠమయినప్పుడు ప్రలయం సంభవిస్తాయి. ప్రాణం స్వతంత్రంగా సంచరించేటప్పుడు, దానియొక్క మంద-మధ్య-తీవ్రసంచార భేదాలను అనుసరించి, క్రమంగా రోమాంచ-వేపథు-స్వరభేదాలు కలుగుతాయి.

స్తంభాది బాహ్యవికారాలు, దేహాత్మమానినులందు సులభంగా వ్యక్తమవు తాయి. సజ్జనులయందు, అనభిమానులయందు అంతసులభంగా వ్యక్తంకావు.

2) రసతరంగిణీకర్త వ్యాఖ్యానం ఇట్లా ఉన్నది :

సాత్త్వికభావాలను అట్లా ఎందుకు పేర్కొంటున్నారు? అవి కూడా వ్యభిచారిభావాలు ఎందుకు కాకూడదు? ఇవి సకల రససాధారణములు కావటంచేత సాత్త్వికభావాలు అనబడినవి అంటారా? అయితే, కొందరు – పరగత దుఃఖభావనకు అత్యంతానుకూలత్వం 'సత్త్వం' అనీ, సత్త్వంతో కూడినవికాన సాత్త్వికభావాలు అనబడినవనీ, కావున వీనిని వ్యభిచారిభావాలు అనటం కుదరదనీ అన్నారు. ఇది సరికాదు. నిర్వేదం, స్మృతిమున్నగువాని యందు కూడా సాత్త్వికత్వం ఉంటుంది. . . . ఈ సందర్భంలో ఇట్లా తోస్తున్నది– సత్త్వం అనేది ప్రాణివాచకం. అంటే జీవయుక్తమైన శరీరం 'సత్త్వం' అని అర్థం; ఇట్టి శరీరధర్మాన్ని 'సాత్త్వికత' అంటారు. అందుచేత ఇటువంటి శరీరంమీద వ్యక్తమయ్యే భావాలు సాత్త్వికభావాలు అవుతాయి. ఇంక స్థాయి-వ్యభిచారి భావాలు అంతరమైనవి; ఇవి శరీరధర్మాలు కావు; అందుచేత ఇవి సాత్త్వికభావాలు కాజాలవు.

3) భరతముని 'సత్త్వము'ను నటుని దృష్టితో వివరించినాడు.

ఇంక విశ్వనాథాదులు 'సత్త్వము'ను సహృదయుని దృష్టితో నిర్వచించినారు– "పరగత సుఖ-దుఃఖ భావనచేత భావిత (=అత్యంతానుకూల)మైన అంతఃకరణత్వం సత్త్వం". కాగా, ఈ నిర్వచనం సహృదయునకేకాక కవికి, నటునకు కూడా అన్వయిస్తుంది.

సత్త్వబలంచేతనే కవి లేదా రూపకకర్త తానుచూడని ప్రసిద్ధవ్యక్తుల, లేదా తాను కల్పిస్తున్న వ్యక్తుల సుఖ-దుఃఖాలను భావించి, రచనలో పొందు పరుస్తాడు. సత్త్వబలం చేతనే నటుడు, కవియొక్క భావనలను భావించి, అవి తనవిగా రంగస్థలంమీద ప్రదర్శిస్తాడు. ఇంక, సహృదయుడు కూడా వాటిని అట్లాగే గ్రహించి రసానుభూతి పొందుతాడు. ఇట్లా కవి-నట- సహృదయులు ముగ్వురు భావించేవి పరగత సుఖ-దుఃఖాలే.

చిత్తవృత్తి రూపమైన ఈ సత్త్వం రెండువిధాలు :

1. అభ్యంతరం, 2. బాహ్యం. సంవేదన భూమి (=మనస్సు)లో, ప్రాణభూమియందు (=వాయు ప్రసరణ మార్గమందు) సంక్రమించి ఉండేది అభ్యంతరం. ఇంక దేహసంక్రాంతమైనది బాహ్యం; ఇది రోమాంచాది గుణ రూపంలో ఉంటుంది. ఈ బాహ్యం అనేదికూడా సంవేదన రూపమైన అభ్యంతరంయొక్క ఫలమే. అంటే అవ్యక్తంగా ఉండే చిత్తవృత్తి దేహవ్యాప్త

మైనప్పుడు రోమాంచ-అస్రాదులు జనిస్తాయి. వీటినిపట్టియే ఆభ్యంతరమైన సత్త్వం ఊహింపబడుతుంది. ఈ రోమాంచాస్రాదులు రసపోషకాలు.

సాత్త్వికభావాలు కూడా, భావసూచకములైన అనుభావాలవలెనే, నిర్వికారచిత్తమందు ప్రభవించిన భావాన్ని అనుసరించి ఉత్పన్నమవుతాయి. అనుసరించి లేదా వెనువెంటనే ఉత్పన్నమయ్యేవి కావున సాత్త్వికభావాలు కూడా అనుభావాలే. కాగా సాత్త్వికభావాలకు ప్రాచీనులు ద్వైవిధ్యం నిరూపించినారు.

4) సాత్త్వికభావాలను ఎనిమిదింటిని ఒకే నాయికాపరంగా నిరూపించిన రెండు ప్రాచీన శ్లోకాలు కలవు.

(i) ఖేదోవాచి, దృశోర్జలం, కుచతటే స్వేదః, ప్రకంపోఽధరే
పాండుర్గండతటే, తనౌ చ పులకవ్రాతో, లయశ్చేతసి ।
ఆలస్యం నయనద్వయే చరణయోః స్తంభః సముజ్జృంభతే
తత్కిం రాజపథే ప్రజేంద్రతనయః కృష్ణః త్వయాఽలోకితః ॥

(ii) వేపతే స్వేదవదనా, రోమాంచం గాత్రే వపతి
విలోలస్తతో వలయో లఘు బాహువల్ల్యాం రణతి ।
ముఖం శ్యామలం భవతి క్షణం విమూర్ఛతి విదగ్ధేవ
ముగ్ధాముఖవల్లీ తవప్రేమ్ణా సాపి న ధైర్యం కరోతి ॥

ఉ ॥ కంపముపుట్టె, మేనఁబులకల్ వొడమెన్, మొగముంజెమర్చె, బా
ష్పంపుఁగణంబులుం దొరఁగె, బల్కులన్ దడవుట్టె, మాటెర
మ్యంపు శరీరశోభ, మెయిమ్రాన్పడెఁ, దెల్వియొకింత దప్పె, న
చ్చంపకగంధి, కిఁకఁబయి జాగొనరింపకపొమ్ము మిత్రమా!

-(మల్లాది సూర్యానారాయణశాస్త్రిగారి అనువాదం)

5) సారాంశం : సత్త్వం అనేది జీవశరీరంలో మనః ప్రభవమైన ఒక విశేష స్థితి. అంతరమైన భావతీవ్రతవల్ల శరీరంమీద వ్యక్తమయ్యేవాటిని 'సాత్త్విక భావాలు' అంటారు; ఇవి ఎనిమిది. భావం తరువాత వ్యక్తమయ్యేవి కాన, వీటిని 'అనుభావాలు' అని కూడా వ్యవహరిస్తారు.

జాయసేనాపతి సత్త్వ నిర్వచనం ఇప్పట్ల స్మరణార్హం :
పరస్య సుఖదుఃఖాదిభావైః యద్భావనం భవేత్ ।
తత్రాంతఃకరణాసక్తి రత్యంతా సత్త్వ మిష్యతే ॥

-(నృ.ర.I-47)

— ఇతరుల సుఖ-దుఃఖాది భావాలను భావించేటప్పుడు, ఆ భావనయందు మనస్సునకు కలిగే అత్యంతాసక్తి 'సత్త్వం' అనబడుతుంది.

కాగా, సత్త్వప్రధానమైన ఈ అభినయాన్నే 'సాత్త్వికాభినయం' అంటారు.

# 1. స్వేదం

మూలం : క్రోధ-భయ-హర్ష-లజ్జా-దుఃఖ-శ్రమ-రోగ-తాప-ఘాతేభ్యః ।
వ్యాయామ-క్లమ-ఘర్మైః స్వేదః సంపీడనా చ్చైవ ॥
వ్యజన గ్రహణాచ్చాపి స్వేదాపనయనేన చ ।
స్వేదస్యాభినయో యోజ్య స్తథా వాతాభిలాషతః ॥
-(నా.శా.VII-95, 102)

అర్థం : క్రోధ, భయ, హర్ష, లజ్జా, దుఃఖ, శ్రమ, రోగ, తాప, ఘాతేభ్యః=క్రోధం, భయం, హర్షం, లజ్జ, దుఃఖం, శ్రమ, రోగం, తాపం, ఘాతం (=దెబ్బ=గాయం) - వీటివల్ల; వ్యాయామ, క్లమ, ఘర్మైః, సంపీడనాత్ (చ-ఏవ), స్వేదః=వ్యాయామం, క్లమం (=ప్రాణంచాలీరావటం), ఎండ (=వేసవి=విదాఘు), సంపీడనం (=శరీరం నొప్పులు) - వీటివల్లకూడా, స్వేదం (జనిస్తుంది).

వ్యజన గ్రహణాత్ (చ-అపి), స్వేద-అపనయనే (చ), (తథా) వాత-అభిలాషతః, స్వేదస్య, అభినయః, యోజ్యః=విసనకర్ర తీసుకొనటం (లేదా విసరుకొనటం), (ఫాలంమీది) చెమట తుడుచుకొనటం, గాలినికోరటం - వీటిద్వారా స్వేదాన్ని అభినయించాలి.

తాత్పర్యం : విభావాలు : క్రోధం, భయం, హర్షం, లజ్జ, దుఃఖం, శ్రమ, రోగం, తాపం, వ్యాయామం, క్లమం, ఘర్మం, సంపీడనం.

అనుభావాలు : వ్యజనగ్రహణం, స్వేదాపనయనం, వాతాభిలాషం.

టీక : శరీరంనుంచి సలిలం వెలువడటం స్వేదం అని రసతరంగిణీకారుడు స్పష్టం చేసినాడు. విభావాలలో రసతరంగిణీకారుడు మూర్ఛను, విద్యానాథుడు 'రతి'ని చేర్చినారు. 'శ్రమ' అంటే రత్యాది పరిశ్రాంతి అనీ, అదిశబ్దచేతం గీత-నృత్తశ్రాంతులు కూడా గ్రాహ్యాలనీ సింగభూపాలుడు (ర.సు.I-302-303).

ఉదా : హర్షదులన్నింటివల్ల కలిగే స్వేదాలకు ఉదాహరణలు కూడా ఇచ్చినాడు సింగభూపాలుడు. రెండు ఉదాహరణలు.

గీతశ్రాంతి :
గీతాంతరేషు శ్రమవారిలేశైః
కించిత్ సముచ్ఛ్వాసిత పత్రలేఖమ్ ।
పుష్పాసవాఘూర్ణిత నేత్ర శోభి
ప్రియాముఖం కింపురుష శ్చుచుంబ ॥ -(కు.సం.III-38)

— పాటపాడిన పిదప కలిగిన శ్రమవలని చెమట బిందువులచేత కొంతచెమర్చిన చెక్కిలి పత్రరేఖలు కలది, పుష్పమకరందపానంచేత భ్రమిస్తున్న కనులతో శోభించునది అయిన ప్రియురాలి ముఖాన్ని కింపురుషుడు ముద్దిడినాడు.

నృత్తశ్రాంతి :
చారునృత్తవిగమే చ తన్ముఖం,
స్వేదభిన్నతిలకం పరిశ్రమాత్ ।
ప్రేమదత్తవదనానిలః పిబన్
అత్యజీవ దమరాలకేశ్వరౌ ॥ -(ర.వం.XIX-15)

— సుందరమూ, నృత్తావసానమున శ్రమవలన పట్టిన చెమటచేత చెదరిన తిలకముకల ఆ నర్తకీముఖాన్ని ప్రేమతో, ముఖానిలంతో సేదతీర్చుతూ, పానంచేస్తూ, అగ్నివర్ణుడు, ఇంద్ర-కుబేరులను మించినాడు.

## 2. స్తంభం

మూలం : హర్ష-భయ-శోక-విస్మయ-విషాద-రోషాది సంభవః స్తంభః ।
నిఃసంజ్ఞో నిష్ప్రకంపశ్చ స్థితః శూన్యజడాకృతిః ।
స్కన్నగాత్రతయా చైవ స్తంభం త్వభినయే ద్బుధః ॥
-(నా.శా.VII-96, 101)

అర్థం : స్తంభః, హర్ష, భయ, శోక, విస్మయ, విషాద, రోష-ఆది సంభవః=స్తంభం— హర్షం, భయం, శోకం, విస్మయం, విషాదం, రోషం మున్నగు వాటివల్ల సంభవిస్తుంది.

నిఃసంజ్ఞః, నిష్ప్రకంపః (చ) స్థితః, శూన్య-జడ-ఆకృతిః, స్కన్నగాత్రతయా(చ-ఏవ), స్తంభం(తు), బుధః, అభినయేత్=తెలివిలేకపోవటం, చలనం లేకపోవటం, శూన్యంగాచూడటం, జడత్వంతోఉండటం, అంగ శైథిల్యం - వీనిచేత స్తంభాన్ని బుధులు అభినయించాలి.

తాత్పర్యం : విభావాలు : హర్షం, భయం, శోకం, విస్మయం, విషాదం, రోషం మున్నగునవి.

అనుభావాలు : తెలివిలేకపోవటం, చలనం లేకపోవటం, శూన్యంగా చూడటం, జడత్వంతో ఉండటం, అంగశైథిల్యం.

టీక : స్తంభం నీచ-మధ్యమ ప్రకృతులయందే గోచరిస్తుందని శారదా తనయుడు. కాని, ఉత్తమప్రకృతులయందును ఇది సంభావ్యం.

రాగం, విక్షేపం-వీటినికూడా విభావాలుగా పేర్కొన్నాడు శార్ఙ్గదేవుడు. ఈ సందర్భంలో రసతరంగిణి ఇట్లా వివరించింది : శరీరధర్మమైన గతి నిరోధింపబడటం స్తంభం. ఇట్లా చెప్పటంవల్ల నిద్ర-అపస్మారములందు అతి వ్యాప్తిలేదు. ప్రలయంలో చేష్టానిరోధం ప్రధానం. 'నిష్క్రియాంగత'ను స్తంభంగా నిర్వచించినాడు ధనంజయుడు.

ఉదా : హర్షాదులవలని స్తంభమునకు ఉదాహరణ లిచ్చినాడు సింగభూపాలుడు. రెండు ఉదాహరణలు :

హర్షంవలనిస్తంభం :
స్తంభ స్తథా దర్శితమాం నవేన
భైమీ కరస్పర్శ ముదః ప్రసాదః ।
కందర్పలక్ష్మీ కరణార్పితస్య
స్తంభస్య దంభం నచిరం యథావత్ ॥ -(నైషధీయ చరితం)

— దమయంతి కరస్పర్శవల్ల కలిగిన ముదం యొక్క ప్రసాదమగు స్తంభం నలునకు కలిగింది. అయ్యది, మన్మథశోభను ఒనర్చుటకు అర్పింపబడిన స్తంభం యొక్క సామ్యాన్ని చాలాకాలం పొందింది (దమయంతీ కరస్పర్శజన్యమైన హర్షంవల్ల నలునకు స్తంభం కలిగింది).

అద్భుతంవలనిస్తంభం :
తద్గీత శ్రవణైకాగ్రా సంసద్ అశ్రుముఖీ బభౌ ।
హిమనిష్యందినీ ప్రాత ర్నివాతేవ వనస్థలీ ॥ -(ర.వం.XV-66)

— వారి (=కుశలవుల) గానం వినటంలో ఆసక్తమైన సభఅంతా, ప్రాతఃకాలంలో గాలివీచని వనప్రదేశం మంచిబిందువులను కురుస్తున్నట్లు కన్నీరు విడుస్తూ శోభించింది.

## 3. కంపం = వేపథువు

మూలం : శీత-భయ-హర్ష-రోష-స్పర్శ-జరా-రోగజః కంపః ॥
వేపనా త్స్ఫురణా త్కంపా ద్వేపథుం సంప్రదర్శయేత్ ।
-(నా.శా.VII-96, 104)

అర్థం : కంపః-శీత, భయ, హర్ష, రోష, స్పర్శ, జరా, రోగజః =కంపం-శీతం, భయం, హర్షం, రోషం, స్పర్శ, జర (=ముసలితనం), రోగం— వీటివల్ల జనిస్తుంది.

వేపనాత్, స్ఫురణాత్, కంపాత్, వేపథుం, సంప్రదర్శయేత్ =వేపనం, స్ఫురణం (=అదరటం), కంపనం— వీటితో, వేపథువును, ప్రదర్శించాలి.

తాత్పర్యం : విభావాలు : చలి, భయం, హర్షం, రోషం, స్పర్శ, జరత్వం, రోగం.

అనుభావాలు : వేపనం, స్ఫురణం, కంపం.

టీక : శాస్త్రకర్తలు కంపమును, వేపథువును పర్యాయపదాలుగా వాడినారు.

ఆలింగనం, ఆచ్ఛురితకం (=గిలిగింతలు పెట్టటం) - ఈ రెండింటిని కూడా విభావాలుగా చెప్పినాడు సంగీతరత్నాకరకర్త. అంతే కాదు, వేపనం (shivering), స్ఫురణం (thorbbing), కంపం (shaking) - ఇవి వేపథువు (trembling) యొక్క ఉత్తరోత్తరాతిశయభేదాలని విశదంచేసినాడు.

శరీరధర్మాన్నిమించి నిస్పందం (=మిక్కిలిచలనం) వేపథువు అని రసతరంగిణీ కర్త (అంటే కన్ను అదరటంమున్నగు కేవలం శకునసూచకమైన శరీరావయకంపం ఇందులో చేరదు). హర్ష-జరా-క్రోధాలవలని వేపథువుకు ఉదాహరణలొసంగినాడు సింగభూపాలుడు.

## 4. అశ్రువు = అస్రం

మూలం : ఆనందామర్షాభ్యాం ధూమాంజన జృంభణా ద్భయా చ్ఛోకాత్ ।
అనిమేషప్రేక్షణతః శీతాద్రోగాత్ భవే దస్రః ॥
బాష్పాంబుప్లుతనేత్రత్వా న్నేత్ర సమ్మార్జనేన చ ।
ముహు రశ్రుకణాపాతై రాస్రం త్వభినయే ద్బుధః ॥
-(నా.శా.VII-97, 107)

**అర్థం** : ఆనంద-అమర్షాభ్యాం, ధూమ-అంజన-జృంభణాత్, భయాత్, శోకాత్, అనిమేష ప్రేక్షణతః, శీతాత్, రోగాత్, అశ్రుః, భవేత్ =ఆనందం అమర్షం-వీటివల్ల, ధూమం (=పొగ) అంజనం (=కాటుక) జృంభణం (=ఆవులింత) — వీటివల్ల, భయంవల్ల, శోకంవల్ల, రెప్పవాల్చక చూడటం వల్ల, చలివల్ల, రోగంవల్ల, అశ్రువు, కలుగుతుంది.

బాష్ప-అంబుప్లుతనేత్రత్వాత్, నేత్రసమ్మార్జనేన(చ), ముహుః-అశ్రుకణ పాతైః, అస్రం(తు), బుధః, అభినయేత్ =బాష్పాంబువులతో నిండిన కనులు, కనులు తుడుచుకొనటం లేదా కన్నీటి బిందువులను గోటితో విదిలించటం, మాటిమాటికి కన్నీటి బిందువులుకారటం— వీటిచేత, అస్రమును, బుధులు, అభినయించాలి.

**తాత్పర్యం** : విభావాలు : ఆనందం, అమర్షం, ధూమం, అంజనం, జృంభణం, భయం, శోకం, అనిమేషప్రేక్షణం, శీతం, రోగం.

అనుభావాలు : బాష్పాంబుప్లుత నేత్రాలు, నేత్ర సమ్మార్జనం, మరల మరల అశ్రుకణపాతం.

**టీక** : అశ్రువు, అస్రం-ఇవి పర్యాయపదాలు.

'వికారజనితమైన అక్షిసలిలం అశ్రువు' అని రసతరంగిణీకర్త.

ఉదా : విషాదంవలని అశ్రువు :

త్వా మాలిఖ్య ప్రణయ కుపితాం ధాతురాగై శ్శిలాయా
మాత్మానం తే చరణపతితం యావదిచ్ఛామి కర్తుమ్ ।
అస్రై స్తావ న్ముహు రుపచితై ర్దృష్టి రాలుప్యతే మే
క్రూర స్తస్మిన్నపి న సహతే సంగమం నౌ కృతాంతః ॥
-(మేఘదూతం-II-44)

—శిలపై, గైరికాది ధాతువులతో ప్రణయకుపితవగు నీరూపును లిఖించి, నీచరణముల సన్నిధివివడి, తృప్తిపొందుటకు నేను కోరుకొనునంతలో - పొంగి పొరలివచ్చే కన్నీరు నాదృష్టిని కప్పివేసినది. పాడుదైవం, ఈవిధంగా కూడా మన సంగమం సహించలేకున్నాడు (ఇది యక్షుడు, తన ప్రియురాలికి మేఘుని ద్వారా పంపిన వార్తలోనిది).

సంతోషంవలని అశ్రువు :
ఆనందజః శోకజ మశ్రుబాష్ప
స్తయో రశీతం శిశిరో బిభేద ।
గంగాసరయ్వో ర్జల ముష్ణతప్తం
హిమాద్రినిష్యంద ఇవావతీర్ణః ॥ -(ర.వం.XIV-3)

— (పెక్కేండ్లు వనవాసంచేసి తిరిగి వచ్చిన రామలక్ష్మణులను చూసిన కౌసల్యా-సుమిత్రలకు) కన్నులనుండి ఆనందబాష్పాలు రాలి, అంతకు పూర్వం ఉన్న శోకంవలని వేడికన్నీటిని పోగొట్టినవి; అది, చల్లని హిమవత్ప్రవాహం వేడిగా ఉన్న గంగా సరయూనదులను చల్లపరచినట్లుగా ఉన్నది.

## 5. వైవర్ణ్యం

మూలం : శీత-క్రోధ-భయ-శ్రమ-రోగ-క్లమ-తాపజం చ వైవర్ణ్యమ్ ।
ముఖవర్ణ పరావృత్యా నాడీపీడన యోగతః ।
వైవర్ణ్య మభినేతవ్యం ప్రయత్నాత్ తద్ధి దుష్కరమ్ ॥
-(నా.శా.VII-98, 105)

అర్థం : వైవర్ణ్యం, శీత, క్రోధ, భయ, శ్రమ, రోగ, క్లమ, తాపజం(చ) =వైవర్ణ్యం (=వివర్ణత=ముఖం రంగుమారటం) - శీతం, క్రోధం, భయం, శ్రమ, రోగం, క్లమం, తాపం— వీటివల్ల జనిస్తుంది.

నాడీపీడనయోగతః, ముఖవర్ణపరావృత్యా, ప్రయత్నాత్, వైవర్ణ్యం, అభినేతవ్యం, తత్(హి) దుష్కరం=నాడులను పీడించటం లేదా బిగబట్టటంతో, ముఖవర్ణమునందు మార్పుతెచ్చి, ప్రయత్నపూర్వకంగా, వైవర్ణ్యమును, అభినయించాలి. ఇదిచాలా కష్టసాధ్యం.

తాత్పర్యం : విభావాలు : శీతం, క్రోధం, భయం, శ్రమ, రోగం, క్లమం, తాపం.

అనుభావాలు : నాడీపీడనంతో ముఖంలోని రంగులో ప్రయత్న పూర్వకంగా మార్పు తీసుకొని రావటం. (ఇది కష్టసాధ్యమైన కార్యం).

టీక : నాడీపీడనంతోనేకాక సిందూరాదులను పులుముకొనటంవల్ల కూడా వైవర్ణ్యం సాధించవచ్చునని శార్ఙ్గదేవుడు. చిక్కిపోయినట్లు (=కార్శ్యం)

చూపటం కూడా అనుభావంగా పేర్కొని, విషాద-అతప- రోషాల వలని వైవర్ణ్యమునకు ఉదాహరణలు ఇచ్చినాడు సింగభూపాలుడు.

## 6. రోమాంచం

మూలం : స్పర్శ-భయ-శీత-హర్షాత్ క్రోధా ద్రోగాచ్చ రోమాంచః ॥
ముహుః కంటకితత్వేన తథోల్లుకసనేన చ ।
పులకేన చ రోమాంచం గాత్రస్పర్శేన దర్శయేత్ ॥
-(నా.శా.VII-98, 104)

అర్థం : స్పర్శ, భయ, శీత, హర్షాత్ =స్పర్శ, భయం, శీతం, హర్షం – వీటివల్ల; క్రోధాత్, రోగాత్(చ), రోమాంచః =క్రోధంవల్ల, రోగంవల్ల రోమాంచం (=గగుర్పాటు) (కలుగుతుంది).

ముహుః కంటకితత్వేన, (తథా) ఉల్లుకసనేన(చ), పులకేన(చ), గాత్ర స్పర్శేన=మాటిమాటికి వెంట్రుకలు నిక్కబొడుచుకొనటం, శరీరం కంపించటం, పులకలు కలగటం, గాత్రస్పర్శం – వీటితో రోమాంచాన్ని ప్రదర్శించాలి.

తాత్పర్యం : విభావాలు : స్పర్శ, భయం, శీతం, హర్షం, క్రోధం, రోగం.

అనుభావాలు : మరలమరల కంటకితత్వం, ఉల్లుకసనం, పులకలు, గాత్రస్పర్శ.

టీక : ఆలింగన-అచ్ఛురితకాలనుకూడా విభావాలుగా పేర్కొన్నాడు సంగీత రత్నాకరకర్త. వికారసముత్థమైన రోమోత్థానం (=వెంట్రుకలు నిక్కబొడుచు కొనటం) రోమాంచమని రసతరంగిణీకర్త. విస్మయ-ఉత్సాహాలను కూడా విభావాలుగా, శరీరస్పర్శ ఘనం (=గట్టి)గా ఉండటాన్ని అనుభావంగా పేర్కొని, విస్మయ-ఉత్సాహ-హర్షాలకు ఉదాహరణ లిచ్చినాడు సింగభూపాలుడు. తెలుగు ప్రబంధం 'పారిజాతాపహరణం'లో కంటకితత్వంకు ఉదాహరణ ఉన్నది (శ్రీకృష్ణుని మాటలలో -పాదతాడనం తరువాత).

## 7. స్వరభేదం = స్వరభంగం

మూలం : స్వరభేదో భయ-హర్ష-క్రోధ-జరా-రౌక్ష్య-రోగ-మదజనితః ।
స్వరభేదోఽభినేతవ్యో భిన్న గద్గద విస్వనైః ।
-(నా.శా.VII-99, 104)

అర్థం : స్వరభేదః, భయ, హర్ష, క్రోధ, జరా, రౌక్ష్య, రోగ, మదజనితః =స్వరభేదం- భయం, హర్షం, క్రోధం, జర, రౌక్ష్యం (=నోరెండిపోవటం), రోగం, మదం-వీటివల్ల జనిస్తుంది.

భిన్న, గద్గద, విస్వరైః, స్వరభేదః, అభినేతవ్యః =భిన్నస్వన, గద్గదస్వన, విస్వనములచేత, స్వరభేదం, అభినయింపబడాలి.

తాత్పర్యం : విభావాలు : భయం, హర్షం, క్రోధం, జర, రౌక్ష్యం, రోగం, మదం.

అనుభావాలు : భిన్నస్వనం, గద్గదస్వనం, విస్వనం.

టీక : ఉగ్రతను కూడా విభావంగా పేర్కొని సంగీతరత్నాకరకర్త ఇట్లా వివరించినాడు :

"విస్వరం, భిన్నస్వరం, గద్గదత-ఇవి అనుభావాలు. 'విస్వరం' అనగా స్థాన భ్రష్టమైన ధ్వని (=wrong articulation). భిన్నస్వరమనగా విచ్ఛిన్నమైన ధ్వని (=సాఫీగా లేదా వరుసగా లేని ధ్వని). గద్గదస్వనమనగా అవ్యవస్థితమైనధ్వని (ఉచ్చ-నీచ-తానయుక్తమైనది)".

సుఖ-దుఃఖాదులవల్ల కలిగే విస్వరత్వం గాద్గద్యమని చెప్పి, సుఖ-దుఃఖాల వల్ల కలిగే స్వరభేదానికి ఉదాహరణ లిచ్చివాడు సింగభూపాలుడు.

దుఃఖంవలని వైస్వర్యం :
విలలాప స బాష్పగద్గదం, సహజా మప్యపహాయ ధీరతామ్ ।
అభితప్తమయోఽపి మార్దవం, భజతే కైవకథా శరీరిషు ॥
-(ర.వం.VIII-43)

– అతడు (=అజమహారాజు) సహజధీరుడయినప్పటికీ, ధైర్యం విడిచి, బాష్పాలతో గద్గదిక కలుగునట్లుగా విలపించివాడు. బాగా కాలితే, ఇనుముకూడా మెత్తపడుతుంది! ఇక ప్రాణులను గూర్చి వేరే చెప్పేది ఏమి?

## 8. ప్రలయం

మూలం : శ్రమ-మూర్ఛా-మద-నిద్రాభిఘాత-మోహాదిభిః ప్రలయః ॥
[illegible]

మహీనిపాతనాచ్చాపి ప్రలయాభినయో భవేత్ ॥
-(నా.శా.VII-99, 107)

అర్థం : శ్రమ, మూర్ఛా, మద, నిద్రా, అభిఘాత, మోహ-ఆదిభిః, ప్రలయః=శ్రమ, మూర్ఛ, మదం, నిద్ర, అభిఘాతం (=దెబ్బ లేదా గాయం), మోహం మున్నగువాటివల్ల, ప్రలయం (సంభవిస్తుంది).

నిశ్చేష్టః, నిష్ప్రకంపత్వాత్, అవ్యక్తశ్వసితాత్ (అపి), మహీని పాత నాత్ (చ-అపి), ప్రలయ-అభినయః, భవేత్=చేష్టారాహిత్యం, చలన రాహిత్యం, నిఃశ్వాసం తెలియరాకపోవటం, నేలమీదపడటం - వీటిచేత ప్రలయం యొక్క అభినయం జరగాలి.

తాత్పర్యం : విభావాలు : శ్రమ, మూర్ఛ, మదం, నిద్ర, అభిఘాతం, మోహంమున్నగునవి.

అనుభావాలు : నిశ్చేష్టత, నిష్ప్రకంపత, అవ్యక్తమైన శ్వాస, మహీ నిపాతం.

టీక : నష్టసంజ్ఞత్వం ప్రలయమని ధనంజయుడు. శరీరధర్మమైన చేష్టనిరో ధింపబడటం ప్రలయమని రసతరంగిణీకర్త (చేష్టాశ్రయః శరీరమితి శాస్త్రీయం లక్షణం).

ఉదా : దుఃఖంవలని ప్రలయం :
వపుషా కరణోజ్ఝితేన సా
నిపతంతీ పతి మప్యపాతయత్ ।
నను తైలనిషేక బిందునా
సహదీపార్చి రుపైతి మేదినీమ్ ॥ -(ర.వం.VIII-38)

– (ఇందుమతి) ఇంద్రియాల చేత త్యక్తమయిన శరీరంతో నేలపై పడుతూ, భర్తను (=అజమహారాజును) కూడా పడేటట్లుచేసింది; దీపజ్వాల కారుతున్న తైలబిందువుతోకూడా నేలపై పడుతుంది కదా!

ఘాతంవలని ప్రలయం :
పూర్వం ప్రహర్తా న జఘాన భూయః
ప్రతిప్రహారాక్షమ మశ్వసాదీ ।

తురంగమ స్కంధ నిషణ్ణదేహం
ప్రత్యాశ్వసంతం రిపు మాచకాంక్ష ॥ -(ర.వం.VII-47)

— తొలుత గుఱ్ఱపురౌతు, తురగారోహి అయిన శత్రువీరుని కొట్టి, అతడు తిరిగి కొట్టుట కశక్తుడై, గుఱ్ఱంమీదనే మూర్ఛపోగా, తాను మరల కొట్టుటకు ఇచ్ఛగించటంలేదు; అంతేకాదు, ఆశత్రువీరునకు మరల తెలివి వచ్చుగాక అని కోరుకొంటున్నాడు. (ఇందులో ఘాతంవలని మూర్ఛ వర్ణితమైనది).

## 9. జృంభ

జృంభా చ నవమః సాత్త్వికో భావ ఇతి ప్రతిభాతి.
ఊర్ధ్వాస్యానన ముల్లసత్కుచయుగం స్ఫీదృత్కపోలస్థలం
కుంచత్పక్ష్మ గలద్దుకూల ముదయన్నాభి భ్రమత్ భ్రూలతమ్ ।
బాలాగ్రాంగులి బద్ధ బాహుపరిధిన్యంచ ద్వివృత్తత్రికం
త్ర్యుట్యత్కంచుక సంధి దర్శితలసద్దోర్మూల ముజ్జృంభతే ॥
ఇత్యాదౌ శృంగారతిలకాదౌ చ సాత్త్వికభావ
సామానాధికరణ్య దర్శనాత్.
నను సా భావాऽనుభావ ఇతి విపరీతమేవ కిం న
స్యాదితి వాచ్యమ్; సత్యను భావత్వే భావత్వ
విరోధాత్ పులకాదీనాం తథా దృష్టత్వాత్.
వచాంగాకృష్టి నేత్రమర్దనాదీనామపి భావత్వాపత్తిః.
తేషాం భావలక్షణాభావాత్. రసామకూలో
వికారో భావ ఇతి హి తల్లక్షణమ్. అంగాకృష్ట్యా
దయో హి న వికారాః. కింతు శరీరచేష్టాః. ప్రత్యక్ష
సిద్ధమేతత్. అంగాకృష్టిః అక్షిమర్దనం చ
పురుషై రిచ్ఛయా విధీయతే పరిత్యజ్యతే చ.
జృంభా చ వికారాదేవ భవతి; తన్నివృత్తౌ
వివర్తతే చేతి.

-(రసతరంగిణి IV-10)

తాత్పర్యం : 'జృంభ' (=ఆవులింత) అనేది తొమ్మిదవ సాత్త్వికభావంగా గోచరిస్తున్నది.

ఉదా. అబాల ఆవులిస్తున్నది – ( ఆసమయంలో ఆమె) ఆననం పైకి ఎత్తింది. కుచయుగలం ఉన్నతమైంది. కపోలములందు స్వేదబిందువులు ఉన్నవి. పక్ష్మములు కుంచితములైనవి. దుకూలం జారుతున్నది. నాభి గోచరిస్తున్నది. భ్రూలత భ్రమిస్తున్నది. రెండుచేతులు అంగుళాలయొక్క చివరలను పరస్పరం బంధించి వర్తులాకారంగా పైకెత్తింది. త్రికం కించిత్ వివృత్తమైంది. కంచుకంయొక్క ముడి విడివడింది. లసత్ బాహుమూలాలు కన్పట్టుతున్నాయి.

ఇటువంటి ఉదాహరణలనుపట్టి, 'శృంగారతిలకం' మున్నగు శాస్త్ర గ్రంథాలను అనుసరించి 'జృంభ' సాత్త్వికభావంగా గ్రహింపబడింది.

శంక : అయితే ఇది భావమా? లేదా అనుభావమా? విశిష్టమైన ప్రమాణం లేకపోవటంచేత దీనిని అనుభావంగా ఎందుకు గ్రహించరాదు? లేదా దీనిని సాత్త్వికభావం యొక్క అనుభావంగా గ్రహించినా విరోధంలేదు - ఎందుకంటే రోమాంచాదులు సాత్త్వికభావాలు, అనుభావాలు కూడా అవుతున్నాయి. అయితే, ఈవిధంగా అంగసంకోచం, నేత్రమర్దనం మున్నగు వాటిని కూడా సాత్త్వికభావాలుగా గ్రహింపవలసి ఉంటుంది.

సమా: కాని, ఇది సమంజసంకాదు - కారణం వీటిల్లో భావలక్షణం లేకపోవటమే. 'రసానుకూలమైన వికారం భావం' అని కదా చెప్పబడుతున్నది. మరి అంగసంకోచాదులు రసానుకూలాలు కాదుకదా. ఇవి శారీరక చేష్టలు మాత్రమే; ఇది ప్రత్యక్షసత్యం. అంగసంకోచం, నేత్రమర్దనం మున్నగునవి పురుషుల ఇచ్ఛానుసారంగా జరుగుతాయి - ఎప్పుడు కావాలంటే అప్పుడు చేయవచ్చు; ఎప్పుడు అక్కరలేదనుకొంటే అప్పుడు మానవచ్చు. ఇంక జృంభ అనేది ఆంతరవికారంవల్ల సంభవిస్తుంది. ఆ వికారం శాంతించగానే, ఆవులింతకూడా పోతుంది.

ఉదా : ఆధాయమౌనం రహసి స్థితాయాః
సంభావ్య జృంభామచలాత్మజాయాః ।
చుటుక్కృతిం స్మేరముఖో మహేశః
కరాంగులీభిః కలయాంచకార ॥

— మానంతో మౌనంధరించి ఏకాంతంగా ఉన్న అచలాత్మజ (=పార్వతి) అవులిస్తుండగా చూసి, నవ్వుతూ మహేశుడు (=శివుడు) చిటికెలు వేయ సాగినాడు.

టీక : తక్కిన సాత్త్విక భావాలవలెనే, జృంభకూడా అంతరవికారపరిణా మమే కావున దీనిని కూడా సాత్త్వికభావంగా గ్రహించటం సమంజసమని భానుదత్తుని ప్రతిపాదన.

వందే కవీంద్ర వక్త్రేందు
లాస్యమందిర నర్తకీమ్ ।
దేవీం సూక్తిపరిస్పంద
సుందరాభినయోజ్జ్వలామ్ ॥

-వక్రోక్తి జీవితము-కారికాప్రారంభమంగళశ్లోకం

శ్రీమద్గోపవధూస్వయంగ్రహపరిష్వంగేషు తుంగస్తన
వ్యామర్దాద్గలితేఽపి చందన రజస్యంగే వహన్ సౌరభమ్ ।
కశ్చిజ్జాగర జాతరాగ నయనద్వంద్వః ప్రభాతేశ్రియమ్
బిభ్రత్కామపి వేణునాదరసికో జారాగ్రణీః పాతు వః ॥

-పుష్పబాణవిలాసం-1

# వ్యభిచారి (=సంచారి) భావాలు

## వ్యభిచారిభావాలు

మూలం : -వ్యభిచారిణ ఇదానీం వ్యాఖ్యాస్యామః. అత్రాహ-
వ్యభిచారిణ ఇతి కస్మాత్? ఉచ్యతే— వి-అభి
ఇత్యేతా వుపసర్గౌ. చర ఇతి గత్యర్థే ధాతుః.
వివిధ మాభిముఖ్యేన రసేషు చరంతీతి
వ్యభిచారిణః. వాగంగసత్త్వోపేతాః ప్రయోగే
రసా న్నయంతీతి వ్యభిచారిణః. అత్రాహ-
కథం నయంతీతి? ఉచ్యతే—లోకసిద్ధాంత
ఏషః-యథా సూర్య ఇదం దినం నక్షత్రం
వా నయతీతి. న చ తేన బాహుభ్యాం
స్కంధేన వా నీయతే. కిం తు లోకప్రసిద్ధ
మేతత్. యథేదం సూర్యో నక్షత్రం
దినం వా నయతీతి ఏవ మేతే వ్యభి
చారిణ ఇత్యవగంతవ్యాః.

వ్యభిచారిణః, ఇదానీం, వ్యాఖ్యాస్యామః=వ్యభిచారి భావాలను, ఇప్పుడు, వ్యాఖ్యానిస్తాను.

అత్ర-ఆహ=అంతట (ఋషుల) ప్రశ్న :

వ్యభిచారిణః, ఇతి, కస్మాత్=వ్యభిచారులు, అని, ఎందుచేత (చెప్పబడినవి)?

ఉచ్యతే=(చెప్పబడుతున్నది) సమాధానం :

వి, అభి, ఇతి, ఏతే, ఉపసర్గౌ=వి, అభి-అనే, ఈ రెండు, ఉపసర్గలు.

చర, ఇతి, గతి-అర్థే, ధాతుః='చర' అనేది, గతి (=చరించటం=కదలటం), అనే అర్థంతెలిపే, ధాతువు (=క్రియ).

రసేషు, ఆభిముఖ్యేన, వివిధం, చరంతి, ఇతి, వ్యభిచారిణః=రసాలవిష యంలో, ఆభిముఖ్యం (=సహకారిత్వం)తో, వివిధంగా, చరించేవి, కావున, ఇవి వ్యభిచారులు (అనబడినవి). ప్రయోగే, వాక్-అంగ-సత్త్వ-ఉపేతాః, రసాన్, నయంతి, ఇతి, వ్యభిచారిణః=(నాట్య) ప్రయోగమందు, వాచిక-ఆంగిక-సాత్త్విక-అభినయాలతో కూడినవై, రసాలను తీసికొని వచ్చేవికావున, వ్యభిచారులు (అనబడినవి).

అత్ర-ఆహ=అంతట, (ఋషులు) ప్రశ్నించినారు: కథం, నయంతి, (ఇతి)=(వ్యభిచారులు, రసాలను) ఎట్లా, తీసుకొనివస్తాయి? ఉచ్యతే=(భరతుని చేత సమాధానం) చెప్పబడుతున్నది. ఏషః, లోకసిద్ధాంతః=ఇది (=ఇట్లా చెప్పటం) లోకప్రసిద్ధమైనదే; యథా, సూర్యః, ఇదం, దినం, వా, నక్షత్రం, నయతి, ఇతి=ఎట్లా అంటే, సూర్యుడు, ఈ దినాన్ని లేదా ఈ నక్షత్ర సముదాయాన్ని, తీసుకొనివస్తున్నాడు, అనటంవంటిదే; తేన, బాహుభ్యాం, వా, స్కంధేన, ఆనీయతే, న(చ)=(కాని) సూర్యునిచేత (=సూర్యుడు), బాహువులతో (మోస్తూ), స్కంధాలమీద (పెట్టుకొని) తీసుకొనిరావటం లేదు కదా? కింతు, ఏతత్, లోకప్రసిద్ధం =అయినా ఇది (=ఇట్లాచెప్పటం) లోకప్రసిద్ధమేకదా.

యథా, సూర్యః, ఇదం నక్షత్రం, వా, దినం, నయతి, ఇతి, ఏవం, ఏతే, వ్యభిచారిణః, ఇతి, అవగంతవ్యాః =ఎట్లా సూర్యుడు, ఈ దినాన్ని, లేదా నక్షత్రాన్ని తీసుకొని వస్తున్నాడు, అని (చెప్పటం కలదో), అట్లాగే, ఈ, వ్యభిచారులు (రసాలను తీసుకొనివస్తాయి), అని, తెలియవలె.

తాత్పర్యం : భరతముని : ఇప్పుడింక వ్యభిచారి భావాలను వివరిస్తాను.

ఋషులు : వ్యభిచారి భావాలకు ఆ పేరు ఎట్లావచ్చింది?

భరతముని : వ్యభిచారి (=వి+అభి+చర) అనేపదంలో వి-అభి- అనేవి రెండూ ఉపసర్గలు; 'చర' అనే ధాతువునకు 'గతి' (=చరించటం) అని అర్థం. రసాల విషయంలో ఆభిముఖ్యం (=సహకారిత్వం)తో, వివిధంగా చరించేవికావున ఇవి వ్యభిచారిభావాలు అనబడినవి. ఈ వ్యభిచారిభావాలు వాచిక-ఆంగిక-సాత్త్వికాభినయోపేతములై నాట్యప్రయోగమందు రసాలను 'తీసికొని వస్తాయి' (=ఆస్వాదయోగ్యాలుగా చేస్తాయి).

ఋషులు : ఎట్లా తీసికొని వస్తాయి?

భరతముని : ఇట్లాచెప్పటం లోకంలో ప్రసిద్ధమే. ఈ నక్షత్రాన్ని లేదా ఈ దినాన్ని సూర్యుడు తీసికొనివస్తాడు అనటంవంటిదే ఇదికూడా. కాని, సూర్యుడు బాహువులతోమోస్తూ లేదా స్కంధాలమీద పెట్టుకొని, వానిని తీసుకొని రావటంలేదు కదా? అయినా, సూర్యుడు దినాన్ని లేదా నక్షత్రాన్ని తీసికొనివస్తున్నాడు అని చెప్పటం లోకప్రసిద్ధమే. ఇట్లే 'వ్యభిచారి భావాలు ప్రయోగమందు రసాలను తీసికొని వస్తాయి' అని గ్రహించాలి.

టీక : 1. వి+అభి+చర (వ్యభిచారి) - ఇందులో 'వి' (=విశేషంగా), 'అభి' (=ఆభిముఖ్యంతో) అనేవి రెండున్నూ ఉపసర్గలు. ఇంక 'చర' ధాతువునకు గతి లేదా చరించటం అని అర్థం. కాగా, విశేషంగా, అభిముఖ్యంతో చరించేవి, అంటే రసాల విషయంలో అభిముఖ్యంతో లేదా సహాకారిత్వంతో, అనేక విధాలుగా చరించే భావాలకు 'వ్యభిచారి భావాలు' అని పేరు.

2. 'రసాలను తీసికొని వస్తాయి' – ఇందులో 'తీసికొనివస్తాయి' అన్నదానికి రెండు అర్థాలు ఉన్నవి - (1) రసాలను ఉత్పాదింపజేయటం (bringing Rasa into being) - అంటే స్థాయిభావాన్ని సంస్కరించి, రసనిష్పత్తికి తోడుపడటం; (2) రసాలను సామాజికులకు అభిముఖం (=ఆస్వాదయోగ్యం) చేయుటం.

3. భరతమునిని అనుసరించి, ధనంజయుడు వ్యభిచారి భావాలను క్రింది విధంగా నిర్వచించినాడు:

> విశేషాదాభిముఖ్యేన చరంతో వ్యభిచారిణః ।
> స్థాయిన్యున్మగ్న నిమగ్నాః కల్లోలా ఇవ వారిధౌ ॥
>
> -(ద.రూ.IV-7)

– వ్యభిచారిభావాలు, విశేషంగా ఆభిముఖ్యంతో చరిస్తూ, సముద్రంలో తరంగాలవలె, స్థాయిలో పుట్టుతూ, విలీనం అవుతూ ఉంటాయి (అంటే స్థాయిని సంస్కరిస్తూ, స్థాయిరూపాన్నే పొందుతాయి).

4. వ్యభిచారిభావాలను కొంతవిపులంగా వివరించినాడు సింగభూపాలుడు:

1) ఈ వ్యభిచారులు వాగంగసత్త్వాలతో కూడినవై, భావంయొక్క గతిని (=గమనాన్ని) సంచరింపజేసేవికావున ఇవి 'సంచారులు' అని కూడా వ్యవహరింపబడతాయి (ర.సు.II-2).

2) ఈ వ్యభిచారిభావాలు పరస్పరం విభావాలు (=కారణములు), అనుభావాలు (=కార్యాలు) కూడా కాగలవు; ఈ కార్యకారణాలను లోకాన్నివట్టే నిర్ణయించాలి.

ఉదా: సంతాపం-దైన్యానికి విభావం, గ్లానికి అనుభావం. విషాదం-ఉత్పాతావేగానికి అనుభావం, స్తంభానికి విభావం. ఇట్లాగే ఇతరములు (ర.సు.II-95+గద్య).

3) ఈ వ్యభిచారిభావాలు స్వతంత్రాలనీ, పరతంత్రాలనీ రెండు విధాలు – ఇతర భావానికి అంగాలై దానిని పోషించేవి పరతంత్రాలు. అట్లాకానప్పుడు స్వతంత్రాలు (ర.సు.II-96-97). సందర్భానుసారంగా వీనిని గ్రహించాలి.

4) భావం అనౌచిత్యంగా ప్రవర్తించితే 'భావాభాసం' అవుతుంది— అసత్యత్వం, అయోగ్యత అనే భేదాలచేత భావాభాసం రెండు విధాలు. అచేతనాలకు భావం (=మనోవికారాదులను) కల్పించటం 'అసత్యకృతభావాభాసం', ఇంక నీచములైన తిర్యక్కులనుకానీ, నీచమానవులనుకానీ ఆశ్రయించితే ఆ ఆభాసం అయోగ్యకృతం అవుతుంది (ర.సు.II-97-98).

5) ఈ వ్యభిచారిభావాలకు నాలుగు అవస్థలు ఉన్నవి : ఉత్పత్తి, సంధి, శబలత, శాంతి (ర.సు.II-99-101).

(i) *భావోత్పత్తి* : భావం జనించటం భావోత్పత్తి లేదా భావోదయం.

(ii) *భావసంధి* : సమానములు లేదా అసమానములు అయిన రెండు భావాలు ఒకచోట కలియటం.

(iii) *భావశబలత* : పలుభావాలకు పరస్పరం కలిగే సమ్మర్దం.

(iv) *భావశాంతి* : మిక్కిలిగావృద్ధిపొంది ఉన్న భావం నశించటం.

6) వ్యభిచారి భావాలు 'ముప్పదిమూడు' అని భరతముని నిర్దేశించినాడు. అయితే కొందరు - ఉద్వేగం, స్నేహం, దంభం, ఈర్ష్యమున్నగు చిత్తవృత్తులను వేరుగా చెప్పినారు. కాని, ఇవి అన్నీ పైనిచెప్పిన ముప్పదిమూడు వ్యభిచారి భావాలలోనే అంతర్భవిస్తాయి. భావప్రకాశనకారుడుకూడా ఇట్లాగే చెప్పినాడు.

ఉదా: దంభం పరప్రతారణరూపం; అది అమాయలో అవహిత్థలో అంతర్భవిస్తుంది. చిత్తాన్ని ద్రవింపజేసే లక్షణంకల స్నేహం హర్షంలోచేరిపోతుంది. స్వవిషయ దానమానాదిజమై, అమర్ష రూపమైన ఈర్ష్య అమర్షమునందే అంతర్భవిస్తుంది; అది పరవిషయమైతే అసూయలో అంతర్భవిస్తుంది (ర.సు.II-94).

5. 1) అటునిటు రసములందు సంచరించటం, అనేకరసనిష్ఠత్వం, అనేక రసవ్యాపృత్వం – వీనివల్ల వ్యభిచారిభావాలకు ఆపేరువచ్చింది. (భరత ముని చెప్పిన 'వివిధంగా' అన్నదానిని రసతరంగిణీకర్త ఇట్లా వివరించినాడు) (రసతరంగిణి-V-4వ శ్లోకం తరువాతి గద్య).

2) (పూర్వరాగంలోని) దశావస్థలలోని అభిలాష, గుణకథన, ప్రలాపం– ఇవి మనోభావాలు కదా? వీటిని వ్యభిచారి భావాలలో ఎందుకు గణింపలేదు? అని ప్రశ్నించుకొని, రసతరంగిణీకర్త ఇట్లా చెప్పినాడు– అభిలాష ఔత్సుక్యంలో, గుణకథనం వర్ణనాత్మక స్మృతిలో, ప్రలాపం ఉన్మాదంలో అంతర్భవిస్తాయి కావున వానిని వేరుగా గణించలేదు (రసతరంగిణి-44వ శ్లోకం తరువాతి గద్య).

6. బాలరామవర్మ 33 వ్యభిచారి భావాలను ఉత్తమ-మధ్యమ-అధమ ప్రకృతుల మధ్య ఇట్లా విభజించినాడు (పుట-197)–

ఉత్తముల భావాలు : చింత, మోహం, స్మృతి, వ్రీడ, హర్షం, ఆలస్యం, చాపలం, ఔత్సుక్యం, అవహిత్థ, ధృతి, శాంతి (=శ్రమ) (ఇవి పద్మినీజాతి స్త్రీకికూడా వర్తిస్తాయి)

మధ్యముల భావాలు : అసూయ, దైన్యం, నిర్వేదం, గ్లాని, శంక, మదం, ఉగ్రత, విషాదం, మౌనం, ఆధి (=anguish), వ్యాధి (ఇవి చిత్రిణీగుణాలు కూడా).

అధముల భావాలు : శ్వాస, నిద్ర, వితర్కం, అపస్మారం, జడత, అమర్షం, ఆవేగం, గర్వం, పాతం, సుప్తం, హతి (=మరణం) (ఇవి శంఖిణీ-హస్తినీ గుణాలు కూడా).

నాట్యంలో సంచారిభావాలను, త్రివిధ ప్రకృతులగు స్త్రీపురుషులు, దేశ-కాల-అవస్థలను అనుసరించి ప్రదర్శించాలని భరతముని చెప్పిన దానిని ఆధారంగా చేసికొని, బాలరామవర్మ పైవిభజన చేసి ఉంటాడు.

7. భరతమునిని అనుసరించి, అర్వాచీనాలంకారకులు పలువురు వ్యభిచారిభావాలు 33 అని అంగీకరించినారు. ఒకరిద్దరు మరికొన్నింటిని ప్రతిపాదించినప్పటికీ, తక్కినవారు వానిని నిరాకరించి, అవి అన్నీ, 33 భావాలలోనే అంతర్భవిస్తాయని పేర్కొన్నారు. రామచంద్ర-గుణచంద్రులు కూడా 33 భావాలనే అంగీకరించినప్పటికీ, అంతమాత్రమేకాదనీ, మరికొన్ని వ్యభిచారిభావాలు ఉండే అవకాశం ఉన్నదనీచెప్పి, క్రిందివానిని పేర్కొన్నారు :

క్షుధ (hunger), తృష్ణ (thirst),

మైత్రి (friendship), ముదిత (mirth),

శ్రద్ధ (faith)), దయ (compassion)

ఉపేక్ష (indifference), అరతి (hatred)

సంతోషం (contentment), క్షమ (patience)

మార్దవం (tenderness), ఆర్జవం (straitforwardness)

దాక్షిణ్యం (courtesy)— మున్నగునవి.

అంతేకాదు, స్థాయిభావాలు, అనుభావాలు కూడా వ్యభిచారిభావాలు కాగలవు.

స్థాయిభావాలు వ్యభిచారి భావాలు కావటం :

శృంగారంలో హాసం, శాంత-కరుణ-హాస్యాలలో రతి, భయ-శోకాలు కరుణ-శృంగారాలలో; వీరమందు క్రోధం, జుగుప్స భయానకమందు, ఉత్సాహ-విస్మయాలు అన్ని రసములందును వ్యభిచారి భావాలు కాగలవు. (రసతరం-V-చివర)

"Psychological studies in Rasa" అనే గ్రంథంలో డా. రాకేశ గుప్త స్థాయి-వ్యభిచారి భావములు నలుబది ఒక్కింటిని, అర్వాచీనాలంకారికులు పేర్కొనిన శమ-స్నేహ- భక్తి-వాత్సల్యములనెడి మరినాలుగు స్థాయిభావములను, ఫలమునెడి ఇంకొక వ్యభిచారిభావమును పరిశీలించి క్రిందివిధంగా సిద్ధాంతించినాడు (పుట-145)—

(a) All the eight Sthayibhavas of Bharata are mental affections.

(b) Out of the thirty-three Sancharibhavas of Bharata fourteen are mental affections ([illegible]-శంకా-హర్ష-దైన్య-ఉగ్రతా-చింతా- త్రాస-అసూయా-అమర్ష-గర్వ-[illegible]-ఔత్సుక్యాలు).

(c) Four are [illegible] (స్మృతి-మతి-[illegible]-అవహిత్థములు).

(d) Five are feelings [illegible] sensations (గ్లాని-శ్రమ-విబోధ-అలసతా-వ్యాధులు).

(e) And the rest ten cannot be termed as feelings or Bhavas ([illegible]).

(f) Out of the four Sthayibhavas added by others three are mental affections (స్నేహ-భక్తి-వాత్సల్యాలు).

(g) One is an unemotional feeling (శమం).

(h) The thirty-fourth Sancharibhava mentioned by Deva is an unemotional feeling (ఛలం).

డా. రాకేశగుప్త రసవిషయాన్ని మానసదృక్పథంతో లేదా పాశ్చాత్య మనశ్శాస్త్రదృష్టితో పరిశీలిస్తూ అనేక ప్రాచీన సిద్ధాంతాలను త్రోసిపుచ్చి, క్రొత్త వ్యాఖ్యానాలుచేసినాడు. అతడు రసానుభూతికి సంబంధించిన "సాధారణీకరణ స్థితి"ని అంగీకరించలేదు. వ్యభిచారిభావాలు కూడా రసత్వాన్ని పొందగలవనే రుద్రటమతాన్ని విపులంగా చర్చించి సమర్థించి, కొన్ని రసాలు దుఃఖాత్మకములని అంగీకరించినాడు.

డా. గుప్త 'రస' పదానికి రెండర్థాలు చెప్పినాడు— 1. Rasa as 'Poetic Relish' (విభావానుభావాదికమునకు సంబంధంలేనిది); 2. Rasa as 'Emotion' (విభావానుభావాదికమునకు సంబంధించినది). ఈ రెండు విధములగు అర్థములు పై గ్రంథమునందు రెండు భాగాలుగా చర్చింపబడినవి.

## 1. నిర్వేదం

మూలం : నిర్వేదోనామ దారిద్ర్య వ్యాధ్యవమానాధిక్షేపాక్రుష్ట
క్రోధ తాడ నేష్టజనవియోగ తత్త్వజ్ఞానాదిభిః
విభావైః సముత్పద్యతే స్త్రీనీచసత్త్వానాం
రుదిత నిఃశ్వసి తోచ్ఛ్వసిత సంప్రధార
ణాదిభిః అనుభావైః అభినయేత్,
భవతి చాత్ర శ్లోకః—
దారిద్ర్యేష్టవియోగాద్యైః నిర్వేదోనామ జాయతే ।
సంప్రధారణ నిఃశ్వాసైః [illegible] భవేత్ ॥
అత్రానువంశ్యే ఆర్యే భవతః—
ఇష్టజన విప్రయోగా [illegible] ।
బుద్ధివిపర్యాసాత్ [illegible]
[illegible]
[illegible] ॥

-(నా.శా. VII-28-30)

అర్థం : 1. దారిద్ర్య, వ్యాధి, అవమాన-అధిక్షేప-ఆక్రుష్ట, క్రోధతాడన, ఇష్టజనవియోగ, తత్త్వజ్ఞాన=దారిద్ర్యప్రాప్తి, (దీర్ఘ) వ్యాధి, అవమానం, ఆక్షేపం, తిట్టు, క్రోధంతో కొట్టబడటం, ఇష్టులైనవారి ఎడబాటు (లేదా మరణం), పరబ్రహ్మయొక్క జ్ఞానం కలగటం; ఆదిభిః, విభావైః, నిర్వేదః నామ సముత్పద్యతే=మున్నగు, విభావాలవల్ల, నిర్వేదం అనేది, కలుగుతుంది. స్త్రీ, నీచ, కుసత్త్వానాం=స్త్రీలు, అధమప్రకృతులు, కుత్సితులు-వీరి నిర్వేదాన్ని; రుదిత, నిఃశ్వసిత-ఉచ్ఛ్వసిత, సంప్రధారణ-ఆదిభిః, అనుభావైః, అభినయేత్=రోదనం, నిఃశ్వాసం, ఉచ్ఛ్వాసం, తర్కించటం, మున్నగు, అనుభావాలతో, అభినయించాలి.

భవతిచ-అత్రశ్లోకః=ఈ అర్థాన్ని సూచించే శ్లోకం ఒకటి ఉన్నది.

దారిద్ర్యం, ఇష్టవియోగ-ఆద్యైః=దారిద్ర్యం, ఇష్టజనవియోగం, మున్నగు వాటివల్ల; నిర్వేదః నామ, జాయతే=నిర్వేదం అనేది కలుగుతుంది; సంప్రధారణ, నిఃశ్వాసైః=మంచిచెడ్డల వివేచన, నిఃశ్వాసాలు-వీటిచేత; తస్య(తు), అభినయః, భవేత్=నిర్వేదంయొక్క అభినయం జరగాలి.

అత్ర-ఆనువంశ్యే, ఆర్యే, భవతః=ఈ అర్థాన్ని విశదంచేసే, ఆనువంశ్యము లయిన, ఆర్యావృత్తాలు రెండు ఉన్నవి.

ఇష్టజనవిప్రయోగాత్, దారిద్ర్యాత్, వ్యాధితః, తథా, దుఃఖాత్, పరస్య ఋద్ధిః దృష్ట్వా=ఇష్టులయిన వారియొక్క ఎడబాటు, దారిద్ర్యం, వ్యాధి, మరియు, దుఃఖం, పరుల అభివృద్ధి చూడటం – వీటివల్ల; నిర్వేదఃనామ, సంభవతి=నిర్వేదం అనేది, కలుగుతుంది; బాష్పపరిప్లుతనయనః, (పునః) (చ) నిఃశ్వాస, దీనముఖనేత్రః=బాష్పాలతో తడిసిన కనులు, నిఃశ్వాసాలు, దీనంగా ఉన్న ఉన్నముఖ-నేత్రాలు కలవాడై; నిర్వేదవాన్, పురుషః, యోగి-ఇవ, ధ్యానపరః, భవతి(హి)=నిర్వేదంతో ఉన్న, పురుషుడు, యోగివలె, ధ్యానపరుడు, అవుతాడు.

తాత్పర్యం : దారిద్ర్యం, వ్యాధి, అవమానం, అధిక్షేపం, ఆక్రుష్టి (=తిట్టు), క్రోధతాడనం, ఇష్టజన వియోగం, తత్త్వజ్ఞానం మున్నగు విభావాలవల్ల నిర్వేదం కలుగుతుంది. (దుఃఖం, పరుల అభివృద్ధి - ఈ రెండు విభావాలు ఆర్యావృత్తాలలో అధికంగా చెప్పబడినవి).

రోదనం, నిఃశ్వాసాలు, ఉచ్ఛ్వాసాలు, సంప్రధారణం మున్నగు అనుభావాలతో స్త్రీలు, నీచప్రకృతులు, కుత్సితులు నిర్వేదాన్ని అభినయించాలి.

ఇంక నిర్వేదంలో ఉన్న పురుషులు బాష్పపరిప్లుతనయనాలతో, నిఃశ్వాసాలతో, దీనము లైన ముఖనేత్రాలతో యోగివలె ధ్యానపరులుగా ఉంటారు.

ద.రూ : తత్త్వజ్ఞానం, ఆపద, ఈర్ష్య-మున్నగువాటివల్ల తన్ను తాను అవమానించుకొనటం (=కించపర్చుకొనటం) నిర్వేదం అవుతుంది.

ర.సు : తత్త్వజ్ఞానం, దుర్గతి, ఆపద, విప్రయోగం, ఈర్ష్య, దుఃఖం— వీటివల్ల కలిగే నిష్ఫలత్వబుద్ధి నిర్వేదం అవుతుంది.

టీక : తత్త్వజ్ఞానం=జగన్మిథ్య, బ్రహ్మసత్యం అనే జ్ఞానం కలగటం; సంప్రధారణం=మంచిచెడ్డల వివేచన లేదా అవుగాముల ఆలోచన; నిష్ఫలత్వబుద్ధి=జగత్తు మిథ్య అని తెలియటం లేదా తన ప్రయత్నాలు ఫలించకపోవటం వల్ల కలిగే నిస్పృహ.

సం.ర.లో— ఆక్రోశనం, అధిక్షేపం, వ్యాధి, క్రోధం, తాడనం, దారిద్ర్యం, ఇష్టవియోగం, పరకీయవృద్ధిదర్శనం — ఇవి నీచప్రకృతులకు విభావాలు; అవమానం, తత్త్వబోధ-ఇవి ఉత్తములకు విభావాలు. "తత్త్వజ్ఞానం కలవారికి జగత్పదార్థాలు అనుపాదేయాలు" అని శారదాతనయుడు.

ద.రూ. వ్యాఖ్యలో, ర.సు.లో తత్త్వజ్ఞానం, దారిద్ర్యం, ఆపద, విప్రయోగం, ఈర్ష్య— వీటికి ఉదాహరణములున్నవి. నిర్వేదం— విభావం, అనుభావం, రసాలకు అంగభూతంగానే కాక స్వతంత్రంగా కూడా ఉంటుంది.

ఇట్లా తక్కిన వ్యభిచారి భావాలపట్ల కూడా ఊహించాలి.

ఉదా:(i) విప్రయోగంవలని నిర్వేదం (ఆత్మావమానసహితం) :

యస్యాంతే దివసా స్తయాసహ మయా నీతా యథా స్వేగృహే
యత్సంబంధికథాభి రేవ సతతం దీర్ఘాభి రాస్థీయత ।
ఏక స్సంప్రతి నాశిత ప్రియతమ స్తామేవ రామః కథం
పాపః పంచవటీం విలోకయతు వా గచ్ఛ త్వసంభావ్య వా॥
-(ఉ.రా.II-19)

— ఈ పంచవటిలోనే మునుపు నేను ఆమె (=సీత) తో కూడి స్వగృహమునందువలె దినములు గడపినాము.

దీనిని గూర్చిన సుదీర్ఘములయిన కథలనే ఎల్లప్పుడు చెప్పుకొనేవారము. అట్టి ప్రియురాలిని పోగొట్టుకొని పాపాత్ముడయిన ఈ రాముడు, ఇపుడు ఒంటరిగా, ఈ పంచవటిని ఎట్లా చూడగలడు? చూడకయే ఎట్లా మరలిపోగలడు?

(ii) నిర్వేదం వీర-శృంగార రసాలకు వ్యభిచారిభావం కావటం (ద.రూ.వ్యాఖ్య) :

నో బాహవో న యుధి వైరికఠోర కంఠ-
పీఠోచ్ఛల ద్రుధిరరాజి విరాజితాంసాః ।
నాపి ప్రియా పృథుపయోధర పత్రభంగ-
సంక్రాంత కుంకుమరసాః ఖలు నిష్ఫలాస్తే ॥

— ఈ బాహువులు - యుద్ధమందు వైరుల కఠోరకంఠతటాలనుంచి స్రవించే రుధిరధారల చేత సుశోభితములు కాలేదు; ప్రియురాలి పీనపయోధరములందలి పత్రావళుల కుంకుమరసంచేత కూడా సుశోభితం కాలేదు; మరి ఇవి నిష్ఫలములే.

సమస్కంధుడయిన శత్రువు లభించలేదు; సుందరి అయిన ప్రియురాలయినా లభించలేదు. అందుచే వీర-శృంగార రసములందు నిర్వేదం వ్యభిచారిభావం అయింది; ఇట్లే ఇతరరసములందు కూడా నిర్వేదం అంగభూతం అవుతుంది. అయితే, నిర్వేదం రసాంగంగానే కాక స్వతంత్రంగాకూడా ఉండగలదు.

(iii) నిర్వేదం స్వతంత్రంకావటం (ద.రూ. వ్యాఖ్య) :

కస్త్వం భోః? కథయామి దైవహతకం మాం విద్ధి శాఖోటకం
వైరాగ్యాదివ వక్షి? సాధు విదితం కస్మాదిదం? కథ్యతే ।
వామేనాత్ర వట స్తమధ్వగజనః సర్వాత్మనా సేవతే
న చ్ఛాయాపి పరోపకారకరణీ మార్గస్థిత స్యాపి మే ॥

— నీవు ఎవరు? చెబుతాను. దైవహతకమైన శాఖోటకము గా నన్ను ఎరుగుము. వైరాగ్యంతో మాటాడుతున్నట్టున్నావు. చక్కగా గ్రహించావు; ఎందుకో చెబుతాను విను. నాకు ఎడం ప్రక్కన వటవృక్షమున్నది; బాటసారులను అది సర్వాత్మనా సేవిస్తున్నది. కాని, నేను దారిలో ఉన్నప్పటికీ, పరోపకారంచేసే ఛాయకూడా నావల్ల లభించటంలేదు.

(iv) తత్త్వజ్ఞానం వలని నిర్వేదం :

ప్రాప్తాః శ్రియః సకలకామదుఘా స్తతః కిమ్?
న్యస్తం పదం శిరసి విద్విషతాం తతః కిమ్?
సమ్మానితాః ప్రణయినో విభవైః తతః కిమ్?
కల్పం స్థితం తనుభృతాం తనుభి స్తతః కిమ్?

— అన్ని కోరికలను చేకూర్చగల సంపదలు లభించినవి; కాని ప్రయోజనం ఏమిటి? శత్రువుల తలలపై కాలుమోపితివి; కాని వానివలన ప్రయోజనం ఏమిటి? ప్రేమాస్పదులగు వారిని సమ్మానించితివి; కాని తృప్తి ఎంతకు? కల్పంవరకు దేహం ధరించి, జీవించినా ప్రయోజనం ఏమిటి? (ఇవి అన్నీ మిథ్య మాత్రమే).

(v) ఆపదవలని నిర్వేదం :

సురతశ్రమసంభృతో ముఖే
ధ్రియతే స్వేదలవోద్గమోఽపి తే ।
అథ చాస్తమితా త్వమాత్మనా
ధిగిమాం దేహభృతా మసారతామ్ ॥ -(ర.వం.VIII-51)

— ఓ ప్రియురాలా! సురత శ్రమమువలన కలిగిన స్వేదబిందువులు ఇప్పుడు కూడా నీముఖంమీద చూస్తూనే ఉన్నాను; కాని నీవులేకుండా పోయితివి (=అస్తమించితివి). దేహధారుల ఈ అస్థిరతను ఏమనవచ్చు?

## 2. గ్లాని

మూలం : గ్లానిర్నామ, వాంత-విరిక్త-వ్యాధి-తపోనియ-మోపవాస-మనస్తా
పాతిశయమదన-మద్యసేవ నాతివ్యాయామా మాధ్వగమన-
క్షుత్పిపాసా-నిద్రాచ్ఛేదాదిభిః విభావైః సముత్ప
ద్యతే. తస్యాః క్షామవాక్య-నయన-కపో-లోదర-
మందపదోత్క్షేపణ వేప నానుత్సాహ తనుగాత్ర
వైవర్ణ్య స్వరభేదాదిభిః అనుభావైః అభినయః
ప్రయోక్తవ్యః.
అత్రార్యే భవతః—
వాంత-విరిక్త-వ్యాధిషు తపసా జరసా చ జాయతే గ్లానిః ।
కార్శ్యేన సాభినేయా మందభ్రమణేన కంపేన ॥
గదితైః క్షామక్షామైః ర్నేత్ర వికారైశ్చ దీనసంచారైః ।
శ్లథభావేనాంగానాం ముహుర్ముహుః నిర్దిశేత్ గ్లానిః ॥
-(నా.శా.VII-గద్య+31-32)

వాంత, విరిక్త, వ్యాధి, తపః, నియమ, ఉపవాస, మనస్తాప=వాంతులు, విరేచనాలు, వ్యాధి, తపస్సు, నియమాలు, ఉపవాసం, మనోవ్యాధి; అతి

శయమదన మద్యసేవన=అధికంగా సంభోగించటం, అధికంగా త్రాగటం; అతివ్యాయమ-అధ్వగమన, క్షుత్-పిపాసా, నిద్రాచ్ఛేద=అతిగా వ్యాయామం చేయటం, ఎక్కువ దూరం నడవటం, ఆకలి, దప్పి, నిద్రాభంగం (=జాగరణ); ఆదిభిః, విభావైః, గ్లానిఃనామ, సముత్పద్యతే=మున్నగు, విభావాలవల్ల, గ్లాని అనేది కలుగుతుంది.

క్షామవాక్య-నయన కపోల-ఉదర=నీరసించిన మాటలు, కనులు, చెక్కిళ్ళు, పొట్టకలిగి ఉండటం; మందపద-ఉత్క్షేపణ, వేపన, అనుత్సాహ, తనుగాత్ర, వైవర్ణ్య, స్వరభేద=మెల్లగా అడుగులు వేయటం, వణకటం, ఉత్సాహం లేక పోవటం, శరీరం సన్నగిల్లటం, వైవర్ణ్యం, స్వరభేదం; ఆదిభిః, అనుభావైః, అభినయః, ప్రయోక్తవ్యః=మున్నగు, అనుభావాలతో, (గ్లానిని) అభినయించాలి.

అత్ర-ఆర్యే భవతః=ఈ సందర్భంలో, రెండు ఆర్యలు, కలవు.

వాంత, విరిక్త, వ్యాధిషు, తపసా, జరసా, గ్లానిః, జాయతే=వాంతులు, విరేచనములు, వ్యాధి, తపస్సు, ముసలితనం—వీటివల్ల, గ్లాని, కలుగుతుంది; కార్శ్యేన, మందభ్రమణేన, కంపేన, సా, అభినేయా=శరీరం సన్నగిల్లటం, మెల్లగా అడుగులువడటం, వణకటం— వీటితో, గ్లాని, అభినయంపబడాలి.

క్షామక్షామైః గదితైః, నేత్ర వికారైః(చ), దీనసంచారైః, అంగానాం శ్లథ భావేన, ముహుఃముహుః గ్లానిః, నిర్దిశేత్=వినీ వివిపించని మాటలు, నేత్ర సంచారాలు వికారంగా దీనంగా ఉండటం, అవయవాలు జారిపోటవం— వీటిని మరల మరల చూపటంచేత, గ్లానిని, నిర్దేశించాలి.

తాత్పర్యం : వాంతులు, విరేచనాలు, వ్యాధి, తపస్సు, వ్రతాది నియమాలు, ఉపవాసం, మనస్తాపం, అధికంగా సంభోగించటం, అధికంగా త్రాగటం, అతివ్యాయామం, దూరం నడవటం, ఆకలిదప్పులు కలగటం, నిద్రాభంగం, ముసలితనం, మున్నగు విభావాలవల్ల గ్లాని సంభవిస్తుంది.

నీరసించిన మాటలు కనులు చెక్కిళ్ళు పొట్ట కలిగిఉండటం, మెల్లగా అడుగులు వేయటం, వణకటం, ఉత్సాహం లేకపోవటం, శరీరం చిక్కటం, వైవర్ణ్యం, స్వరభేదం, నేత్రవికారాలు, మందగతి, అవయవాలు జారిపోవటం మున్నగు అనుభావాలను మరల మరల ప్రదర్శిస్తూ గ్లానిని అభినయించాలి.

టీక : ద.రూ : రతిమున్నగు వాటివల్ల, ఆయాసం దప్పి ఆకలి— వీటివల్ల, ప్రాణం చాలిరావటం గ్లాని అవుతుంది. వైవర్ణ్యం, కంపం, అనుత్సాహం, శిథిలములైన అంగములు వచనములు— ఇవి ఇందలి క్రియలు (=అనుభావాలు).

ర.సు : అధి, వ్యాధి, ముసలితనం, దప్పి, వ్యాయామం, సురతం మున్నగు వాటివల్ల ప్రాణం చాలిరావటం గ్లాని అవుతుంది. నీరసించిన అవయవములు వచనములు, తాపం, అనుత్సాహం, వైవర్ణ్యం, కనుగ్రుడ్లు తిరుగుడువడటం— ఇవి ఇందలి క్రియలు.

వ్యాధి శరీర వ్యథకాగా, అధి మనోవ్యథ. నిష్ప్రాణత=ప్రాణంచాలిరావటం లేదా ఊపిరి అందకపోవటం. గ్లాని=బలంతగ్గటం లేదా నీరసపడటం. అధి, వ్యాధి, జర, తృష్ణ, వ్యాయామం, సురతం— వీటికి ర.సు.లో ఉదాహరణలు కలవు. గ్లాని, రసాలకు అంగం కావటంలేదా స్వతంత్రంగా ఉండటం అనేవి నిర్వేదానికి చెప్పినట్లే ఊహించుకోవాలి.

అధర-నేత్ర-కపోలాలు జారటం, పాదాలయొక్క ఉత్క్షేప-నిక్షేపాలు మందం కావటం — ఇవి సం.ర.లో స్పష్టం చేయబడినవి.

ఉదాహరణలు :

(i) అతిసంభోగంవలని గ్లాని :

చొక్కి కనులు మూయు సుదతిఁ జచ్చెనటంచు
విడిచిపోఱు కాఁపు వెడఁగుఁజూచి,
ప్రత్తికొమ్మ, నగము పగిలిన కాయల-
మొగమువంచి చేల నగియెఁబోలె.

— గాథాసప్తశతి IV-60, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారి అనువాదం.

(ii) తృష్ణవలని గ్లాని :

వింధ్యాధ్వాన్తే విరల సలిలాప్తర్షిణీ తత్ర సీతా
యావన్మూర్ఛాం కలయతి కిల వ్యాకులే రామభద్రే ।
ద్రాక్ సౌమిత్రిః పుటకకలశీ మాదధానో ఫలానాం
తావత్ప్రాప్తో దధదనిభృతాం వారిధారైర్షరేణ ॥

-బాలరామాయణం-6వ అంకం

— వింధ్యపర్వత మార్గములందు నీరు దొరకటం అరుదు. అచట దప్పిగొని సీతమూర్ఛపోగా రామభద్రుడు కలతపడినాడు. అప్పుడు లక్ష్మణుడు ఆకు దొన్నెను చేతిలో పట్టుకొన్నంతలో వర్షధారపడగా అతడు దానిని గ్రహించినాడు.

(iii) ఆధి (=మనోవ్యధ) వలని గ్లాని :

కిసలయ మివ ముగ్ధం బంధనా ద్విప్రలూనం
హృదయ కుసుమశోషీ దారుణో దీర్ఘ శోకః ।
గ్లపయతి పరిపాండుక్షామ మస్యాః శరీరం
శరదిజ ఇవ ఘర్మః కేతకీపత్రగర్భమ్ ॥

-(ర.సు.-పుట 312)

— పట్టునుండి జారిపడిన లేతచిగురువలె, శరత్కాలమందలి వేడిమికి గురి అయిన కేతకీ కుసుమంయొక్క లోపలిభాగంవలె తెల్లనయిన ఈమె శరీరాన్ని, హృదయకుసుమాన్ని వాడజేసే దీర్ఘశోకం మరింత దుఃఖపెట్టుతున్నది.

(iv) వ్యాధివలని గ్లాని :

తస్య పాండువదనాల్పభూషణా
సావలంబ గమనా మృదుస్వనా ।
రాజయక్ష్మ పరిహాని రాయయౌ
కామయాన సమవస్థయా తులామ్ ॥

-(ర.వం.XIX-50)

— వానియొక్క (=అగ్నివర్ణునికి)— తెల్లబారిన ముఖం, అల్పభూషణ ధారణం, ఇతరుల సాయమున నడక, మెల్లని మాటలు — ఇట్టి క్షీణదశ రాజయక్ష్మ (=క్షయ) రోగంవలన కలిగినవి. ఈ అవస్థ విరహంలో ఉన్న కాముకుని అవస్థతో సమానంగా ఉన్నది.

## 3. శంక

మూలం : శంకానామ సందేహాత్మికా, స్త్రీనీచ ప్రభవా. చౌర్యాభిగ్రహణ
నృపాపరాధ పాపకర్మ కరణాదిభిః విభావైః
సముత్పద్యతే. తస్యా ముహుర్ముహు రవలోక
నావకుంఠన ముఖశోషణ జిహ్వాపరిలేహన
ముఖవైవర్ణ్య స్వరభేద వేపథు శుష్కోష్ఠ కంఠా

యాస సాధర్మ్యాదిభిః అనుభావైః అభినయః
ప్రయోక్తవ్యః. అత్రశ్లోకః :
చౌర్యాదిజనితా శంకా ప్రాయః కార్యా భయానకే ।
ప్రియవ్యలీకజనితా తథా శృంగారిణీమతా ॥
అత్రాకార సంవరణ మపి కేచిదిచ్ఛంతి. తచ్చ
కుశలై రుపాదిభి రింగితై శ్చైవ లక్ష్యమ్.
అత్రార్యేభవతః—
ద్వివిధా శంకా కార్యాహ్యాత్మ సముత్థా చ పరసముత్థా చ ।
యా తత్రాత్మ సముత్థా సా జ్ఞేయా దృష్టి-చేష్టాభిః ॥
కించిత్ ప్రవేపితాంగ స్త్వధోముఖో వీక్షతేచ పార్శ్వాని ।
గురుసజ్జమానజిహ్వః శ్యామాస్యః శంకితః పురుషః ॥
-(నా.శా.VII-గద్య+33-35)

అర్థం : శంకానామ, సందేహ-ఆత్మికా, స్త్రీ-నీచ ప్రభవా=శంక అనేది సందేహరూపమైనది, స్త్రీలయందును, నీచ ప్రకృతులయందును కలుగుతుంది. చౌర్య-అభిగ్రహణ, నృప-అపరాధ, పాపకర్మ కరణ-ఆదిభిః=దొంగతనం పట్టుబడం, రాజునకు అపకారం చేసి ఉండటం, పాపకార్యంచేయటం, మున్నగు; విభావైః, సముత్పద్యతే=విభావాలవలన, కలుగుతుంది.

తస్యా, అభినయః, ముహుఃముహుః-అవలోకన, అవకుంఠన, ముఖశోషణ, జిహ్వాపరిలేహన=దాని (=శంకయొక్క), అభినయం, మరలమరల (ప్రక్క లకు, వెనుకకు) చూస్తూ ఉండటం, ముఖం చాటుచేయటం లేదా తప్పించుకొన టానికి ప్రయత్నించటం, నోరు ఎండిపోవటం, నాలుకతో పెదవులను తడుపు కొనటం; ముఖవైవర్ణ్య, స్వరభేద, వేపథు, శుష్క-ఓష్ఠ, కంఠ-ఆయాస, సాధర్మ్య-ఆదిభిః, అనుభావైః, ప్రయోక్తవ్యః=ముఖం పాలిపోవటం, స్వరం భేదించటం, కంపం, పెదవులెండిపోవటం, మాటరాకపోవటం, అటువంటివే అయిన ఇతర ప్రేరణలు, మున్నగు అనుభావాలచేత, చేయాలి. ఇచ్చట ఒక శ్లోకం ఉంది.

చౌర్య-ఆది జనితా, శంకా, ప్రాయః, భయానకే, కార్యా=దొంగతనం మున్నగువానివల్ల కలిగిన, శంక, తరచుగా, భయానకరసమందు, చూపదగి నది; తథా, ప్రియవ్యలీకజనితా, శృంగారిణీ, మతా=శంక, ప్రియుడువేసిన మోసంవల్ల కలిగినది శృంగారిణి (=శృంగారరసమందు ప్రయోగింపదగినది) అని భావింపబడినది.

అత్ర, ఆకారసంవరణమ్-అపి, కేచిత్-ఇచ్ఛంతి=ఇందు, ఆకారాన్ని కప్పి పుచ్చుకొనటం కూడా కొందరు అంగీకరిస్తారు; తత్(చ), కుశలైః, ఉపాదిభిః, ఇంగితైః(చ), ఉపలక్ష్యమ్=అది (=ఆకారసంవరణం), కుశలములైన ఉపాయాలచేతను, ఇంగితములచేతను సూచింపబడాలి.

అత్ర-ఆర్యేభవతః=ఈ అర్థాన్ని సూచించే రెండు ఆర్యలు కలవు.

శంకా, ద్వివిధా, కార్యా(హి)=శంక, రెండు విధాలుగా, నిరూపితం కావాలి. ఆత్మసముత్థా(చ), పరసముత్థా(చ)=1. ఆత్మసముత్థం (=తన దోషంవలన తనయందు జనించినది), 2. పరసముత్థం (=ఇతరుల వలన తనకు సంక్రమించినది); తత్ర, యా, ఆత్మసముత్థా, సా, దృష్టిచేష్టాభిః జ్ఞేయా =ఏది, ఆత్మసముత్థమో, అది, దృష్టులవలన, చేష్టలవలన తెలియదగినది.

శంకితః, పురుషః=శంకతో కూడిన, పురుషుడు; కించిత్, ప్రవేపిత-అంగః, అధోముఖః, పార్శ్వాని-వీక్షతే(చ)=కొంచెంగా, చలిస్తున్న అంగములు, వంచినతల, ప్రక్కలకు చూడటం; గురుసజ్జమాన జిహ్వః, శ్యామ-ఆస్యః=ముద్దగాచాపబడిన, నాలుక, నల్లని ముఖం-కలిగిఉంటాడు.

తాత్పర్యం : శంక సందేహరూపమైనది; స్త్రీలయందు, నీచప్రకృతుల యందు జనిస్తుంది. చౌర్యంపట్టుబడటం, రాజునకు అపకారంచేసి ఉండటం, పాపకార్యంచేసి ఉండటం, మున్నగు విభావాలవల్ల శంకకలుగుతుంది. మరల మరల దిక్కులు చూడటం, అవకుంఠనం, ముఖశోషణం, నాలుకతో పెదవులు నాకటం, ముఖవైవర్ణ్యం, స్వరభేదం, వేపథువు, పెదవులు ఎండిపోవటం, మాటరాకపోవటం వంటి అనుభావాలచేత శంకను అభినయించాలి.

చౌర్యాదిజనితమైన శంకను సాధారణంగా భయానకరసమందు చూపవలె. ప్రియవ్యలీకకృతమైన శంకను శృంగారరసమందు చూపవలె. శంకను అభినయించటంలో ఆకారసంవరణాన్ని కొందరు కోరుతారు; దీనిని కుశలములయిన ఉపాయాలచేతను, ఇంగితాల చేతను ప్రదర్శించాలి.

ఈ సందర్భంలో రెండు ఆర్యలు కలవు.

శంక రెండు విధాలు— ఆత్మసముత్థం; పరసముత్థం. దృష్టులనుపట్టి, చేష్టలనుపట్టి ఆత్మసముత్థమయిన శంకను గుర్తించాలి. శంకతో కూడిన పురుషుడు కొంచెంగా చలిస్తున్న అంగాల , అధోముఖం, పార్శ్వవీక్షణాలు, ముద్దగా ముందుకు చాపిన నాలుక, నల్లబడిన ముఖం కలిగి ఉంటాడు.

ద.రూ : పరులక్రౌర్యంవల్ల కానీ, స్వీయదుర్ణయంవల్ల కానీ అనర్థాన్ని ఊహించటం శంక అవుతుంది. కంపం, శోషణం, వీక్షణం, వైవర్ణ్యం, స్వరభంగం అనేవి ఇందలి అనుభావాలు.

ర.సు: చౌర్యం, అపరాధంమున్నగు వాటివల్ల తనకు అనిష్టం జరుగుతుం దేమో అని సందేహించటం శంక అవుతుంది. మరల మరల ప్రక్కలకు చూస్తూఉండటం, ముఖం వాడటం, అవకుంఠనం, వైవర్ణ్యం, స్వరభంగం లేదా మెడవంచటం మున్నగునవి ఇందలి అనుభావాలు. ఆత్మోత్థం, పరోత్థం అనేభేదాలచేత శంక రెండు విధాలు. స్వకార్య జనితమైనది ఆత్మోత్థం లేదా స్వోత్థం. సాధారణంగా ఇది వ్యక్తియొక్క ఇంగితాల ద్వారా వ్యక్తమవుతుంది. భ్రూ-తారకా- దృష్టి వికారాలు ఇందలిచేష్టలు. ఇతరులయొక్క అకార్యాలవల్ల తనయందు కలిగే శంక పరోత్థం; ఆకారాన్నిపట్టి దీని చేష్టలను గ్రహించవచ్చు; ఈ ఆకారం సాత్త్వికపరమైనది. అంగ- ప్రత్యంగములందు కన్పట్టే వికారాలు చేష్టలు.

ఉదా : చౌర్యంవల్లని ఆత్మోత్థశంక :

మృద్నన్ క్షీరాది చౌర్యా న్మసృణసురభిణీ స్సృక్వణీ పాణిము ద్రైః
అఘ్రాయాఘ్రాయ హస్తం సపదిపరుషయన్ కింకిణీమేఖలాయామ్।
వారంవారం విశాలే దిశిదిశి వికిరల్లోచనే లోలతారే
మందం మందం జనన్యాః పరిసరమయితే కూటగోపాలబాలః ॥

-(ర.సు.పుట-32)

—కపట గోపాలబాలుడగు శ్రీకృష్ణుడు పాలుమున్నగు వానిని దొంగిలించి తినటంవల్ల బాగా వాసనకొట్టుతున్న దౌడలను చేతితో నాక్కుతూ, చేతిని మాటిమాటికి వాసన చూస్తూ, ఆ చేతిని గజ్జెలమొలత్రాడు పైరాస్తూ, చలిస్తున్న కనుపాపలు కలిగి, విశాలములైన దృష్టులను మాటిమాటికిని దిక్కులందు ప్రసరింపజేస్తూ, మెల్లమెల్లగా తల్లిప్రక్కకు చేరుతున్నాడు.

అపరాధంవలని పరోత్థశంక :

ప్రీతే విధాతరి పురా పరిభూయ మర్త్యాన్
వవ్రేఽన్యతో యదభయం స భవా నహంయుః।
తన్మర్మణి స్పృశతి మా మతి మాత్ర మద్య
హా! వత్స! శాంత మథవా దశకంధరోఽపి ॥

-(అనర్ఘరాఘవం-IV అంకం-9)

— నాయనా! తొల్లి బ్రహ్మ అనుగ్రహించి వరం కోరుకొమ్మని అన్నప్పుడు, నీవు గర్వించి, మనుష్యులను లెక్క చేయక, తదితరులవల్ల చావు లేకుండునట్లు వరమడిగినావు. అయ్యదినామర్కములను మిక్కిలిగా బాధిస్తున్నది. అయినా నీవు దశకంఠుడవు కదా! (ఇవి మాల్యవంతుని మాటలు).

## 4. అసూయ

మూలం : అసూయానామ, నానాపరాధ ద్వేష పరైశ్వర్య సౌభాగ్య మేధా విద్యా లీలాదిభిః విభావైః సముత్పద్యతే. తస్యాశ్చ పరిషది దోషప్రఖ్యాపన గుణోపఘా తేర్ష్యాచక్షుః ప్రదా నాధోముఖ భ్రుకుటీక్రి యావజ్ఞాన కుత్స నాదిభిః అనుభావైః అభినయః ప్రయోక్తవ్యః.
అత్రార్యే భవతః -
పరసౌభాగ్యైశ్వరతా మేధా లీలా సముచ్ఛ్రియాన్ దృష్ట్వా ।
ఉత్పద్యతే హ్యసూయా కృతాపరాధో భవేద్యశ్చ ॥
భ్రుకుటీ కుటిలోత్కటముఖైః సేర్ష్యాక్రోధపరివృత్తనేత్రైశ్చ ।
గుణనాశన విద్వేషై స్తత్రాభినయః ప్రయోక్తవ్యః ॥
-(నా.శా.VII-గద్య+36-37)

అర్థం : నానా- అపరాధ, ద్వేష, పరైశ్వర్య-సౌభాగ్య-మేధా- విద్యా-లీలా-ఆది, విభావైః, అసూయానామ, సముత్పద్యతే = వివిధములైన అప రాధాలవల్ల, ద్వేషం వల్ల, ఇతరులయొక్క సౌభాగ్యం ఐశ్వర్యం మేధ విద్య విలాసం - వీటియొక్క ఔన్నత్యం, చూడటం వల్ల, అసూయ అనేది జని స్తుంది.

పరిషది దోషప్రఖ్యాపన, గుణ-ఉపఘాత, ఈర్ష్యా చక్షుః ప్రదాన, అధో ముఖ, భ్రుకుటీక్రియ, అవజ్ఞాన, కుత్సన-ఆదిభిః, అనుభావైః, అభినయః, ప్రయోక్తవ్యః = సభలో దోషాలనే ఎన్నటం, గుణాలను నిరసించటం, ఈర్ష్యను వెలిగ్రక్కే కనులతో చూడటం, క్రింది చూపులు చూడటం, బొమముడి వేయటం, లెక్క చేయకపోవటం, నిందించటం, మున్నగు అనుభా వాలతో, (అసూయ యొక్క) అభినయం చేయాలి.

అత్ర ఆర్యే భవతః = ఈ సందర్భంలో రెండు ఆర్యలు కలవు. పర సౌభాగ్య, ఈశ్వరతా, మేధా, లీలా, సముచ్ఛ్రియాన్, దృష్ట్వా = పరుల యొక్క సౌభాగ్యం, సమృద్ధి లేదా ప్రభుత్వం, మేధ, విలాసం— వీటియొక్క

అతియం చూసి; యః, కృత-అపరాధః భవేత్(చ), అసూయా ఉత్పద్యతే (హి) = ఎవడు, ఓర్వలేడో, (అతని హృదయమందు), అసూయ జనిస్తుంది.

తత్ర = అచ్చట, కుటిల, భ్రుకుటీ- ఉత్కటముఖైః, స-ఈర్ష్యా క్రోధ పరివృత్త నేత్రైః (చ), గుణనాశన-విద్వేషైః, అభినయః, ప్రయోక్తవ్యః = కుటిలంగా భ్రుకుటి చూపటం, ముఖం త్రిప్పుకోవటం, ఈర్ష్యాక్రోధాలతో నిండిన కనులను త్రిప్పటం, గుణాలను నిరసించటం, ద్వేషించటం - వీటితో (అసూయను) అభినయించాలి.

తాత్పర్యం : విభావాలు : వివిధములైన అపరాధాలు, ద్వేషం, పరుల సౌభాగ్య-ఐశ్వర్య-మేధా- విద్యా-విలాసాదులు.

అనుభావాలు : పరిషత్తులో దోష ప్రఖ్యాపనం, గుణనిరసనం, ఈర్ష్యతో చూడటం, అధోముఖంతో చూడటం నిలవటం, బొమముడి వేయటం, నిరాదరణ చూపటం, తిరస్కరించటం, నిరసనగా చూడటం, నిందించటం మున్నగునవి.

ఈ అంశాలను వివరించే రెండు ఆర్యలు కలవు :

పరుల సౌభాగ్య-ఈశ్వరతా-మేధా-లీలల ఆధిక్యాన్ని చూడటం వల్ల, ఓర్వలేని వానియందు అసూయ జనిస్తుంది. బొమముడి పాటుతో, ఉత్కట ముఖంతో, ఈర్ష్యా-క్రోధాలు నిండిన కనులతో, గుణనిరసనంతో, ద్వేషంతో అసూయను అభినయించాలి.

**టీక :** పరుల ఉత్కర్షను సహించలేకపోవటం అసూయ అని ధనంజయుడు. పరులకు అనిష్టం కోరటం కూడా అసూయయే అని రసతరంగిణీకర్త. అంతేకాదు గర్వ-దౌర్జన్య-మన్యువులను కూడా వారిరువురు విభావాలుగా పేర్కొన్నారు. ఇట్టివారు గుణాలను కూడా దోషాలుగా నిరూపిస్తారు.

ఉదా : పరశౌర్యంవలని అసూయ (= గుణాలను దోషాలుగా చెప్పటం):

స్త్రీ మాత్రం నను తాటకా భృగుసుతో రామస్తు విప్రశ్శుచిః
మారీచో మృగ ఏవ భీతిభవనం వాలీ పువ ర్వానరః ।
భో కాకుత్థ! వికత్థసే కిమథవా వీరో జితః కస్త్వయా?
దోర్దర్పస్తు తథాపి తే యది తదా కోదండ మారోపయ ॥

-(హనుమన్నాటకం XIV-)

— ఓ రామా! మహావీరుడనని ఏల ప్రగల్భాలు పలుకుతున్నావు? నీవు చంపిన తాటక ఆడుది. పరశురాముడు శుచియగు విప్రుడు. మారీచుడు కాతరస్వభావంగల జింక. వాలి కోతి. నీవే వీరుని చంపితివో వ్రేలు మడిచి చెప్పుము. అయినప్పటికీ, నీకు భుజదర్పం ఉంటే ఇప్పుడు ఈ కోదండాన్ని ఎక్కు పెట్టు.

## 5. మదం

మూలం : మదోనామ, మద్యోపయోగా దుత్పద్యతే.
స చ త్రివిధః పంచవిధభావశ్చ.
అత్రార్యా భవంతి-
జ్ఞేయస్తు మద స్త్రి విధ స్తరుణో మధ్య స్తథావకృష్టశ్చ ।
కరణం పంచవిధం స్యాత్తస్యాభినయః ప్రయోక్తవ్యః ॥
కశ్చి న్మత్తో గాయతి రోదితి కశ్చి త్తథా హసతి కశ్చిత్ ।
పరుషవచనాభిధాయీ కశ్చి త్కశ్చిత్తథా స్వపితి ॥
ఉత్తమసత్త్వః శేతే హసతి చ గాయతి చ మధ్యమప్రకృతిః ।
పరుషవచనాభిధాయీ రోదిత్యపి చాధమప్రకృతిః ॥
స్మితవచన మధురరాగో హృష్టతనుః కించి దాకులితవాక్యః ।
సుకుమారావిద్ధగతి స్తరుణమద స్తూత్తమ ప్రకృతిః ॥
స్ఖలితా ఘూర్ణితనయనః స్రస్తవ్యాకులిత బాహువిక్షేపః ।
కుటిలవ్యావిద్ధ గతిర్మధ్యమదో మధ్యమప్రకృతిః ॥
నష్టస్మృతి ర్హతగతి శ్ఛర్దితహిక్కాకఫైః సుబీభత్సః ।
గురుసజ్జమాన జిహ్వో నిష్ఠీవతి చాధమప్రకృతిః ॥
రంగే పిబతః కార్యా మదవృద్ధి ర్నాట్యయోగమాసాద్య ।
కార్యో మదక్షయో వై యః ఖలు పీత్వా ప్రవిష్టః స్యాత్ ॥
సంత్రాసాచ్ఛోకా ద్వా భయా త్ప్రహర్షాచ్చ కారణోపగతాత్ ।
ఉత్క్రమ్యాపి హి కార్యో మదప్రణాశః క్రమాత్తజ్జైః ॥
ఏభిర్భావవిశేషై ర్మదో ద్రుతం సంప్రణాశ ముపయాతి ।
అభ్యుదయ సుఖై ర్వాక్యై ర్యథైవ శోకః క్షయం యాతి ॥
-(నా.శా. VII-38-46)

అర్థం : మద్య-ఉపయోగాత్, మదఃనామ, ఉత్పద్యతే = మద్యం, సేవించటం వల్ల, మదం అనేది కలుగుతుంది. స(చ), త్రివిధః, పంచవిధ భావః (చ) = అది (= మదం) మూడు విధాలు, (అను) భావాలు అయిదు విధాలు.

అత్ర, ఆర్యా, భవంతి = ఇక్కడ ఆర్యలు కలవు.

తరుణః, మధ్యః, (తథా) అవకృష్టః (చ), మదః, త్రివిధః, జ్ఞేయః (తు) = తరుణమదం, మధ్యమదం, అవకృష్టమదం -(ఇట్లా) మదం, మూడు విధాలు (అని) తెలియవలె.

కరణం, పంచవిధం, స్యాత్ =(మదం యొక్క) అనుభావాలు, అయిదు; తస్య, అభినయః, ప్రయోక్తవ్యః = దాని (= మదం) యొక్క అభినయం (అట్లాగే) అయిదు విధాలుగా చేయాలి.

మత్తః, కశ్చిత్ గాయతి, కశ్చిత్ రోదితి, (తథా) కశ్చిత్ హసతి, కశ్చిత్ పరుషవచనాభిదాయీ, (తథా) కశ్చిత్ స్వపితి = మత్తుడు - ఒకడు పాటలు పాడుతాడు, ఒకడు రోదిస్తాడు, ఒకడు నవ్వుతాడు, ఒకడు పరుషవచనాలు పలుకుతాడు, ఒకడు నిద్రిస్తాడు (ఇవే అయిదు విధాలైన కార్యాలు లేదా అనుభావాలు).

ఉత్తమసత్త్వఃశేతే, మధ్యమప్రకృతిః హసతి గాయతి = ఉత్తమ ప్రకృతి నిద్రిస్తాడు, మధ్యమప్రకృతి నవ్వుతాడు, పాడుతాడు; అధమ ప్రకృతిః (చ), పరుషవచనాభిధాయీ, రోదిత్యపి = అధమప్రకృతి పరుషవచనాలు పలుకుతాడు, రోదిస్తాడు.

ఉత్తమ ప్రకృతిః - స్మితవదన-మధురరాగః, హృష్టతనుః, కించిత్-ఆకులిత వాక్యః = ఉత్తమప్రకృతి—నవ్వుమొగం, మధురరాగం, సంతోషం, కొంచెంగా తడబాటుమాటలు; సుకుమార- ఆవిద్ధగతిః, తరుణమదః = తొట్రుపాటుతో కూడిన సుకుమారగతి, తరుణమదం (లో కలిగి ఉంటాడు.)

స్ఖలిత-ఆఘూర్ణితనయనః, స్రస్త-వ్యాకులిత బాహువిక్షేపః, కుటిల వ్యావిద్ధ గతిః, మధ్యమప్రకృతిః, మదః, భవతి = తిరుగుడు పడుచున్న కనుగ్రుడ్లు, జారవిడిచిన బాహువులు, అస్థిమితములైన బాహు విక్షేపాలు, నిలుకడలేని కుటిలగతి (కలిగినది), మధ్యమప్రకృతి (యొక్క) మదం అవుతుంది.

అధమ ప్రకృతిః, నష్టస్మృతిః, హతగతిః, ఛర్దిత-హిక్కా-కఫైః,

సుబీభత్సః, గురుసజ్జమాన జిహ్వః, నిష్ఠీవతి (చ) = అధమ ప్రకృతి- స్మృతి లోపం, గతిభంగం, వాంతులు-ఎక్కిళ్ళు- దగ్గులతో బీభత్సంగా ఉండటం, చాచబడిన మొద్దునాలుక, ఉమ్మి వేయటం — ఇవి కలిగి ఉంటాడు.

రంగే పిబతః, నాట్యయోగమాసాద్య, మదవృద్ధిః, కార్యా = రంగస్థల మందు త్రాగేటప్పుడు, నాట్యయోగాన్ని అనుసరించి, మదవృద్ధిని ప్రకటించాలి. యః, పీత్వా(ఖలు), ప్రవిష్టః(వై), మదక్షయః కార్యః = ఎవడు, (అదివరకే) త్రాగి, (రంగస్థలం) ప్రవేశిస్తాడో, (అతడు), మదక్షయాన్ని- అభినయించాలి. (త్రాగటానికి కూడా 'నాట్యయోగం' అన్వయిస్తుంది.

సంత్రాసాత్, శోకాత్ (వా), భయాత్, ప్రహర్షాత్ (చ), కారణ-ఉపగతః, ఉత్కృష్యః-అపి, (హి), తజ్జ్ఞైః క్రమాత్, మదప్రణాశః, కార్యః = సంత్రాసం, శోకం, భయం, ప్రహర్షం- ఇటువంటి కారణాలు ఉన్నప్పుడు, మదం అతియంగా ఉన్నప్పటికీ, తజ్ఞులు, క్రమంగా, మదప్రణాశం అభినయించాలి.

యథా అభ్యుదయసుఖైః వాక్యైః (ఏవ), శోకం, క్షయం, యాతి = ఎట్లా, అభ్యుదయ సంబంధి, సుఖసంబంధి వార్తలచేత, శోకం, పోతుందో; ఏభిః, భావవిశేషైః, మదం, ద్రుతం, సంప్రణాశం, ఉపయాతి = ఈ (= ఇంతకుముందు వివరించిన సంత్రాసాది), భావవిశేషాలచేత, మదం, వేగంగా, తొలగిపోతుంది.

తాత్పర్యం : మద్యం సేవించటం వల్ల మదం కలుగుతుంది. మదం మూడు విధాలు— తరుణమదం, మధ్యమదం, అవ(వ) కృష్ట (= అధమ) మదం. దీని అనుభావాలు అయిదు విధాలు- మత్తులో ఒకడు ఏడుస్తాడు, ఒకడు పాడుతాడు, ఒకడు నవ్వుతాడు, ఒకడు పరుషంగా మాటాడుతాడు, ఒకడు నిద్రిస్తాడు.

ఉత్తమ ప్రకృతులు : వీరిది తరుణమదం. వీరు నిద్రిస్తారు. ఇట్టివారు నవ్వుమొగం, మధురరాగం, సంతోషం, కొంచెంగా తడబడేమాటలు, తొట్రుపాటుతో కూడిన సుకుమారగతి కలిగి ఉంటారు.

మధ్యమప్రకృతులు : వీరిది మధ్యమదం. వీరు నవ్వుతారు. పాటలు పాడుతారు. ఇట్టివారు తిరుగుడు పడుతున్న గ్రుడ్లు, జారవిడిచిన బాహువులు, అస్థిమితమ్ములైన బాహువిక్షేపాలు, నిలుకడ లేని వక్రగతి కలిగి ఉంటారు.

అధమ ప్రకృతులు : వీరిది అవకృష్ట మదం. వీరు ఏడుస్తారు. పరుష వాక్యాలు పలుకుతారు. ఇట్టివారు స్మృతిలోపం, గతిభంగం, చాచబడిన మొద్దునాలుక కలిగి, వాంతులు ఎక్కిళ్ళు తుమ్ములు దగ్గులతో బీభత్సంగా ఉంటారు.

రంగస్థలం మీద మద-అభినయం : రంగస్థలం మీద త్రాగటం అభినయిం చేటప్పుడు మదవృద్ధిని చూపాలి. అదివరకే త్రాగి పిమ్మట రంగస్థలం ప్రవే శించినప్పుడు మదక్షయం చూపాలి. సంత్రాసం, శోకం, భయం, ప్రహర్షం మున్నగు కారణాలున్నప్పుడు, మదం అతిశయంగా ఉన్నప్పటికీ, ప్రయత్నంతో క్రమంగా దాని తగ్గుదలను నిరూపించాలి. అభ్యుదయాన్ని గూర్చి, సుఖాన్ని గూర్చి వార్తలు విన్నప్పుడు శోకం అంతరించునట్లే, పై భావవిశేషాల వల్ల మదం శీఘ్రంగా తొలగిపోతుంది.

టీక : మద్యం వల్ల కలిగిన ఆనంద-సమ్మోహాల మిశ్రణం మదం అని సింగభూపాలుడు (ర.సు. II-16-22). తరుణమదం ఉత్తములకు, మధ్యమదం మధ్య-నీచ ప్రకృతులకు, అవకృష్ట మదం నీచప్రకృతులకు నిరూపించాలి. శారదా తనయుడు విశేషంగా ఇట్లా వివరించినాడు : మద్యసేవనం వల్లనేకాక ఐశ్వర్యం, విద్య, అభిజాత్యం, ఉత్తమ స్త్రీ పరిష్వంగ -సంభోగాలు మున్నగు వానివల్ల కూడా మధం కలుగుతుంది.

- - - - విద్యా-అభిజాత్య-సంపత్తుల వల్ల కలిగే మదంలో సమాధాన మీయటం, సరిగా సంభాషించటం ఉండదు. వారి మాటలు తిరస్కారంతో, అనాదరంతో ఉంటాయి. సుహృదులకు కూడా వారివద్ద ఆదరం ఉండదు. మిత్రులను కూడా అవమానిస్తారు. ఉత్తమ స్త్రీ రతి కృతమయిన మదంలో హర్షం ఉంటుంది. కన్నులలో రాగం ఉంటుంది. దేహంలో పరిమలం ఉంటుంది. అవయములందు లావణ్యం ఉంటుంది. అహంకారం ఉంటుంది. అనాదరం ఉంటుంది. మదిరాకృతములైన తరుణాది మదాలలో దృష్టి భేదాలు ఇట్లా ఉంటాయి.

తరుణ మదంలో- కనుగ్రుడ్లు తిరుగుతూ ఉంటాయి. నేత్రాల చివరలు క్షామక్షామములై ఉంటాయి. నేత్రాపాంగాలు వికసితాలుగా ఉంటాయి.

మధ్యమదమందు కనుపుటలు రెండు ఆకుంచితములై ఉంటాయి. తారకలు అవ్యవస్థితాలుగా ఉంటాయి. పక్ష్మాగ్రాలు కంపితాలవుతాయి.

అధమ మదమందు నేత్రాలు నిమేషోన్మేషాలతో వికృతంగా ఉంటాయి. కనుగ్రుడ్లు లోలోన తిరుగుళ్ళు పడుతుంటాయి. అధోవలోకనం ఉంటుంది.

మధ్యమదంలో మరపును, ఆకాశ వీక్షణమును అధికంగా చెప్పినాడు శారదాతనయుడు.

ఉత్తమ-మధ్య-నీచమదములకు, ఉత్తమ-మధ్యమ-అధమ ప్రకృతుల మదములకు ఉదాహరణలిచ్చినాడు సింగభూపాలుడు.

ఉదా : అధమ ప్రకృతి మదవృద్ధి :

తథా తథా గ్రామీణవధూ ర్మదవివశా కిమపికిమపి వ్యాహరతీ ।
యథా యథా కులవధ్వః శ్రుత్వా సరంతి పిహిత కర్ణాః ॥

— మదవివశయగు పల్లెపడుచు నోటికి వచ్చినట్లు ఏమోమో బండమాటలు పల్కుతూ ఉంటే, ఆ మాటలు విని కులస్త్రీలు చెవులు మూసుకొని దూరంగా తొలగిపోతున్నారు.

టీక : ఐశ్వర్యాది కృతమైన 'మాన' మును మదంగా పేర్కొన్నాడు కదా శారదాతనయుడు! కాని, అది గర్వం యొక్క భేదంగా మాత్రమే పరిగణించినాడు సింగభూపాలుడు. హర్షోత్కర్షం 'మద' మని రసతరంగిణీకర్త. అంతేకాదు వీరరసమందు కూడా 'మదం' గోచరమవుతుంది! ఇందునయనారుణ్య చమత్కారాదులు అనుభావాలు.

మద్యపానం విభావమనీ, శయనం-హసనం-గానం-రోదనం-పరుషోక్తులు- ఈ అయిదు అనుభావాలనీ పేర్కొన్నాడు సంగీతరత్నాకరకర్త. తక్కిన వివరణ మంతా నాట్యశాస్త్రానుసారమే.

## 6. శ్రమ

మూలం : శ్రమోనామ, అధ్వ వ్యాయామ సేవనాదిభిః విభావైః
సముత్పద్యతే. తస్య గాత్రపరిమర్దన సంవాహన
నిఃశ్వసిత విజృంభిత మందపదోత్క్షేపణ
నయనవదనవికూణన సీత్కారాదిభిః
అనుభావైః అభినయః ప్రయోక్తవ్యః.
అత్రార్యా-
వృత్తాధ్వ వ్యాయామా న్నరస్య సంజాయతే శ్రమోనామ ।
నిఃశ్వాసఖేదగమనై స్తస్యాభినయః ప్రయోక్తవ్యః ॥
-(నా.శా.VII-47)

అర్థ : శ్రమఃనామ, అధ్వ, వ్యాయామ, సేవన-ఆదిభిః, విభావైః సము త్పద్యతే = శ్రమ అనేది నడక (= బహుదూర ప్రయాణం), వ్యాయామం, సేవనం మున్నగు, విభావాల వల్ల, కలుగుతుంది. గాత్రపరిమర్దన, సంవా హన, నిఃశ్వసిత, విజృంభిత, మందపద-ఉత్క్షేపణ, నయన- వదన వికూణన, సీత్కార-ఆదిభిః, అనుభావైః, తస్య, అభినయః, ప్రయోక్తవ్యః = ఒడలు మర్దించుకొనటం, కాళ్ళు పిసుకుకొనటం, నిఃశ్వాసాలు, ఆవులింతలు, మెల్లగా పదాలు వేయటం, కనులు ముఖం ముడుచుకొనటం, సీత్కారం మున్నగు అనుభావాలచేత, దాని అభినయం చేయాలి.

అత్ర ఆర్యా = ఈ అర్థాన్ని వివరించే ఆర్య ఉన్నది.

నృత్త-అధ్వ-వ్యాయామాత్, నరస్య, శ్రమః నామ, సంజాయతే = నృత్తం, బహుదూరపు నడక, వ్యాయామం-- వీటివల్ల, నరులలో, శ్రమ అనేది కలుగుతుంది. నిఃశ్వాస, ఖేద గమనైః, తస్య, అభినయః, ప్రయోక్తవ్యః =నిఃశ్వాసాలు, ఖేదగమనం-వీనితో దాని అభినయం, చేయాలి.

తాత్పర్యం : విభావాలు : బహుదూరపు నడక, వ్యాయామం, సేవనం, మున్నగునవి.

అనుభావాలు : గాత్రపరిమర్దనం, అంగసంవాహనం, నిఃశ్వాసాలు, ఆవు లింతలు, మందపదోత్క్షేపణం, నయన-వదన వికూణనం, సీత్కారం మున్నగు నవి.

టీక : ఇందులో అధికంగా స్వేదం కలుగుతుందని ధనంజయ, విద్యా నాథులు. ఆయాసం వల్ల ప్రభవించే పరాభవం (=ఖేదం) శ్రమ అని రసతరంగిణీకర్త; స్వేద-నిస్పృహతలను అనుభావాలుగా చెప్పినాడు.

ఉదా : నడకవల్ల శ్రమ :

సద్యః పురి పరిసరేఽపి శిరీషమృద్వీ
సీతా జవాత్ త్రిచతురాణి పదాని గత్వా ।
గంతవ్యమద్య కియ దిత్యసకృత్ బ్రువాణా
రామాశ్రుణః కృతవత్ ప్రథమావతారమ్ ॥

— శిరీష పుష్పం వలె మృదువయిన దేహం కలసీత నగరసమీప మందే- వేగంగా మూడు నాలుగు అడుగులు నడచి, "మనం ఇంకా ఎంతదూరం

పోవాలి" అని మాటిమాటికిని శ్రీరాముని ప్రశ్నిస్తూఉంటే ఆయనకు తొలి సారిగా కన్నులనుండి బాష్పబిందువులు రాలినవి.

నృత్తం వల్ల శ్రమ :
స్వేదక్లేదిత కంకణాం భుజలతాం కృత్వా మృదంగాశ్రయాం
చేటీహస్త సమర్పితైకచరణా మంజీరసంధిత్సయా ।
సా భూయః స్తనకంపసూచితరయం నిః శ్వాస మాముంచతీ
రంగాస్థాన మనంగపాత్ర్యతపతీ తాలావధే తస్థుషీ ।।

— చెమటచే తడిసిన కంకణాలుగల చేతిని మద్దెలపై ఉంచి, నూపురాన్ని సరిచేయటం కోసం పాదాన్ని చేటిచేతిలో ఉంచి, స్తనాల కంపంచేత వేగాన్ని సూచించే నిట్టూర్పు విడుస్తూ, ఆమె రంగభూమిని మన్మథవశమైనదై తాలావధి యందున్నది.

## 7. ఆలస్యం

మూలం : ఆలస్యంనామ, ఖేద-వ్యాధి-గర్భ-స్వభావ-శ్రమ-సౌహిత్యాదిభిః
విభావైః సముత్పద్యతే స్త్రీ నీచానామ్. తదభినయేత్
సర్వకర్మానభిలాష శయనాసన నిద్రాతంద్రీ
సేవనాదిభిః అనుభావైః.

అత్రార్యా
ఆలస్యం త్వభినేయం ఖేదోపగతం స్వభావజం చాపి ।।
ఆహారవర్జితావామారంభాణా మనారంభాత్ ।।

-(నా.శా. VII-48)

అర్థం : ఆలస్యంనామ, ఖేద, వ్యాధి, గర్భ, స్వభావ, శ్రమ, సౌహిత్య, ఆదిభిః, విభావైః, స్త్రీనీచానామ్ సముత్పద్యతే = ఆలస్యం అనేది ఖేదం, వ్యాధి, గర్భభారం, స్వభావం, శ్రమ, సౌహిత్యం (= భోజన తృప్తి) మున్నగు విభావాలచేత, స్త్రీ-నీచ ప్రకృతులయందు జనిస్తుంది.

సర్వకర్మ-అనభిలాష, శయన-ఆసన-నిద్రా-తంద్రీ సేవన-ఆదిభిః, అనుభావైః, తత్-అభినయేత్ = ఏ పనియందును ఆసక్తి లేకపోవటం, శయనించటం, కూర్చుండటం, నిద్రించటం, తంద్రీ సేవనం (= సోమరిపోతుతనం =కునికిపాట్లుపడటం) మున్నగు, అనుభావాలచేత, దానిని, అభినయించాలి.

అత్ర-ఆర్యా = ఈ సందర్భంలో ఒక ఆర్య (కలదు).

ఖేద-ఉపగతం, స్వాభావజం (చ-అపి), ఆలస్యం (తు), ఆహారవర్జితా నామ, ఆరంభాణాం-అనారంభాత్, అభినేయం = ఖేదజం, స్వాభావజం (అనే రెండు విధాల) ఆలస్యాన్ని, ఆహారం తీసుకొనటం తప్ప, తక్కిన అన్ని పనులను, త్యజించటం ద్వారా, అభినయించాలి.

తాత్పర్యం : విభావాలు : ఖేదం, వ్యాధి, గర్భం, స్వాభావం, శ్రమ, సౌహిత్యం మున్నగు విభావాలచేత ఆలస్యం స్త్రీ-నీచప్రకృతుల యందు గోచరిస్తుంది.

అనుభావాలు : ఏ పనియందును ఆసక్తి లేకపోవటం, శయనించటం, కూర్చుండటం, నిద్రించటం, తంద్రీ సేవనం.

టీక : గర్వభయాలను నిర్భయత్వాన్ని కూడా విభావాలుగా పేర్కొన్నారు కొందరు. "లేవటానికి కూడా శక్తిలేనట్లు ఉండటం ఆలస్యం" అని రసతరంగిణీకర్త.

ఉదా : సౌహిత్యం వలని ఆలస్యం:

త్రైలోక్యాభయలగ్న కేన భవతా వీరేణ విస్మారితః
తజ్జీమూత ముహూర్తమండనధనుఃపాండిత్య మాఖండలః ।
కిం చాజస్రమఖార్పితేన హవిషా సంఫుల్ల మాంసోల్లస
త్సర్వాంగీణవలీవిలుప్తనయనవ్యూహః కథం వర్తతే ॥
-(అనర్ఘరాఘవం-I-27)

— నీవు ముల్లోకాలకు వీరుడవై అభయమొసగుతూ వానిని రక్షిస్తూ ఉండగా ఇంద్రుడు, జీమూతాలకు క్షణకాలం ఆభరణమైన తన ధనుస్సు (= ఇంద్రధనుస్సు)ను, ఉపయోగించే పాండిత్యం మరచినాడు. లేకపోతే, ఎల్లప్పుడు యజ్ఞాలలోని హవిస్సును తిని, కండలు పెంచి, దానివలని అలసత చేత మూతపడిన కనులు ఎట్లా కలిగి ఉన్నాడు?

# 8. దైన్యం

మూలం : దైన్యంనామ దార్గత్య మనస్తాపాదిభిః విభావైః సముత్పద్యతే.
-తస్యాధృతి శిరోరోగ గాత్రగౌరవ వాన్యమనస్కతా

మృజాపరివర్జనాదిభిః అనుభావైః అభినయః ప్రయోక్తవ్యః.
అత్రార్యా-
చింతౌత్సుక్య సముత్థా దుఃఖాద్యా భవతి దీనతా పుంసామ్ ।
సర్వమృజా పరిహారై ర్వివిధోఽభినయో భవేత్తస్య ॥
-(నా.శా.VII-49)

అర్థం : దైన్యంనామ, దౌర్గత్య, మనస్తాప-ఆదిభిః, విభావైః, సముత్పద్యతే = దైన్యం అనేది, దుర్గతి, మనస్తాపం మున్నగు విభావాల వల్ల కలుగుతుంది.

అధృతి, శిరోరోగ, గాత్రగౌరవ, అన్యమనస్కతా, మృజాపరివర్జన-ఆదిభిః, అనుభావైః, తస్య అభినయః ప్రయోక్తవ్యః = అధైర్యం , తలపోటు, మాంద్యం (= శరీరం బరువెక్కటం), అన్యమనస్కత, అశుభ్రత, మున్నగు అనుభావాలతో , దాని అభినయం చేయాలి.

అత్ర-ఆర్యా = ఈ సందర్భంలో ఒక ఆర్య (కలదు) :

చింతా, ఔత్సుక్య సముత్థా, దుఃఖాత్, పుంసామ్, యా దీనతా, భవేత్ = చింత, ఔత్సుక్యం, దుఃఖం-వీనివల్ల, పురుషులయందు, ఏ దీనత (= దైన్యం) కలుగుతుందో దాని; సర్వమృజాపరిహారైః, వివిధః, తస్య, అభినయః, భవేత్ = అన్ని విధాల శుభ్రతను విడిచిపెట్టటం మున్నగు వివిధములైన అనుభావాలచేత, అభినయం చేయాలి.

తాత్పర్యం : విభావాలు : దుర్గతి, మనస్తాపం మున్నగునవి.

అనుభావాలు : అధైర్యం, మాంద్యం, తలపోటు, అన్యమనస్కత, శుభ్రత లేకుండటం మున్నగునవి.

ఇచ్చట ఒక ఆర్యకలదు :

చింత, ఔత్సుక్యం, దుఃఖం మున్నగువానివల్ల దైన్యం కలుగుతుంది. శుభ్రత లేకుండటం మున్నగు వివిధములైన అనుభావాలచేత దీనిని అభినయించాలి.

టీక : "హృత్తాపాదులవల్ల కలిగే అనౌద్ధత్యం (= ఔద్ధత్యం లేకుండటం) దీనత" అని సింగభూపాలుడు."దైన్యంతో ఉన్నవారు దేహాలంకారం చేసుకోరు. శరీరం బరువుగా ఉన్నట్లు భావిస్తారు" అని శారదాతనయుడు. "దురవస్థ లేదా

దుఃఖాతిరేకం దైన్యం" అని రసతరంగిణీకర్త పేర్కొని, దారిద్ర్యాదులను విభావాలుగా చెప్పినాడు.

ఉదా : పశ్చాత్తాపం వలని దైన్యం :

ఏతత్కృత్వా ప్రియ మనుచితం ప్రార్థనా దాత్మనో మే
సౌహార్దాద్వా విధుర ఇతి వా మయ్యనుక్రోశబుద్ధ్యా ।
ఇష్టాన్ దేశాన్ విచర జలద! ప్రావృషా సంభృత శ్రీ
ర్మాభూదేవం క్షణమపి చ తే విద్యుతా విప్రయోగః ॥
-(మేఘసందేశం II-55)

— ఓ మేఘుడా! నా మీది స్నేహం వల్ల కాని, నేను విరహిని అనే కనికరం వల్ల కాని, నీ వంటి వానికి తగని ఈ సందేశహరణరూపమైన ఉపకారం చేసి, ఆవుణ్యం చేత, వర్షలక్ష్మిచేత మిగులశోభిల్లి, నీ ఇష్టం వచ్చిన దేశాలు తిరుగు. నావలె నీకు, నీప్రియురాలగు మెఱుపుతో క్షణకాలం కూడా వియోగం కలుగకుండుగాక!

## 9. చింత

మూలం : చింతానామ, ఐశ్వర్యభ్రంశేష్టద్రవ్యాపహారదారిద్ర్యాదిభిః
విభావైః ఉత్పద్యతే. తామభినయేత్
నిఃశ్వసితోచ్ఛ్వసిత సంతాప ధ్యానాధోముఖ
చింతన తనుకార్శ్యాదిభిః అనుభావైః.
అత్రార్యే భవతః-
ఐశ్వర్యభ్రంశేష్టద్రవ్యక్షయయా బహుప్రకారా తు ।
హృదయవితర్కోపగతాత్ నృణాం చింతా సముద్భవతి ॥
సోచ్ఛ్వాసై ర్నిఃశ్వసితైః సంతాపైశ్చైవ హృదయశూన్యతయా ।
అభినేతవ్యా చింతా మృజావిహీనై రధృత్యా చ ॥
-(నా.శా.VII-50-51)

అర్థం : చింతానామ, ఐశ్వర్యభ్రంశ, ఇష్టద్రవ్య-అపహార, దారిద్ర్య-ఆదిభిః, విభావైః, ఉత్పద్యతే =చింతఅనేది— ఐశ్వర్యంపోవటం, ఇష్టద్రవ్యం అపహరింపబడటం, దారిద్ర్యమున్నగు, విభావాలచేత, కలుగుతుంది. నిఃశ్వసిత, ఉచ్ఛ్వసిత, సంతాప, ధ్యాన, అధోముఖ చింతన, తనుకార్శ్య-ఆదిభిః, అనుభావైః, తామ్, అభినయేత్=నిఃశ్వాసాలు, ఉచ్ఛ్వాసాలు, సంతాపం,

ధ్యానం, ముఖంవాల్చి ఆలోచించటం, శరీరం చిక్కిపోవటం మున్నగు అనుభవాలతో, దానిని (=చింతను), అభినయించాలి.

అత్ర-ఆర్యే, భవతః=ఈ సందర్భంలో రెండు ఆర్యలు కలవు. ఐశ్వర్య భ్రంశ-ఇష్టద్రవ్య క్షయయా, హృదయవితర్క-ఉపగతాత్, నృణాం, బహుప్ర కారా(తు) చింతా, సముద్భవతి=ఐశ్వర్యభ్రంశం, ఇష్టద్రవ్య నాశం, హృదయ వితర్కం— వీటివల్ల, పురుషులయందు, బహుప్రకారములుగా, చింత, కలుగు తుంది.

స-ఉచ్ఛ్వాసైః, నిఃశ్వసితైః, సంతాపైః(చ), హృదయ శూన్యతయా, మృజావిహీనైః, అధృత్యా(చ), చింతా, అభినేతవ్యా=ఉచ్ఛ్వాసాలు, నిఃశ్వా సాలు, సంతాపం, శూన్యహృదయం, శుభ్రతలేకుండటం, అధైర్యం— వీటి చేత, చింత, అభినయింపబడాలి.

తాత్పర్యం : విభావాలు : ఐశ్వర్యభ్రంశం, ఇష్టద్రవ్యాపహరణం, దారిద్ర్యం మున్నగునవి.

అనుభావాలు : నిఃశ్వాసాలు, ఉచ్ఛ్వాసాలు, సంతాపం, ధ్యానం, అధోముఖ చింతనం, తనుకార్శ్యత మున్నగునవి.

ఇచ్చట రెండు ఆర్యలు కలవు:

విభావాలు : ఐశ్వర్యభ్రంశం, ఇష్టద్రవ్యక్షయం, హృదయవితర్కం — వీటివల్ల అనేకవిధాలుగా పురుషులయందు చింతకలుగుతుంది.

అనుభావాలు : ఉచ్ఛ్వాస-నిఃశ్వాసాలు, సంతాపం, హృదయశూన్యత, మృజావిహీనత, అధైర్యం— వీటితో చింతను అభినయించాలి.

**టీక** : ఇష్టవస్తువు లభించకపోవటాన్ని కూడా విభావంగా చెప్పి, ధనం జయువివలె చింత ధ్యానంతో కూడి ఉంటుందన్నాడు సింగభూపాలుడు. ధ్యానమే చింత అవుతుందన్నాడు భానుదత్తుడు— ధ్యై అనే క్రియ చింత అనే అర్థంలో ప్రయుక్తం; చింత అనేది స్మరణం (=స్మృతి) కాదు. చిత్తైకా గ్రత మాత్రమే. వైవర్ణ్య-బాష్పాలు-వీటిని కూడా అనుభావాలుగా చెప్పినాడు భానుదత్తుడు. చింతకుముందు కానీ, తరువాతకానీ వితర్కం సంభవిస్తుందని సంగీతరత్నాకరకర్త.

ఉదా : ఐశ్వర్యనాశంవల్ల చింత :

యమోఽపి విలిఖన్ భూమిం దండేనాస్తమితత్విషా ।
కురుతేఽస్మిన్న మోఘేఽపి నిర్వాణాలాతలాఘవమ్ ॥-(కు.సం.II-23)

— నశించిన కాంతికల దండంతో నేలపైరాస్తూ యముడు కూడా ఉన్నాడు; ఆదండం అమోఘమైనదైనప్పటికీ, అతడు దానిని కాలిన కట్టెవలె తేలికగా చూస్తూఉన్నాడు.

ఇష్టవస్తువు లభించకపోవటంచేత చింత:

ఈషద్వలితావనతాస్యా కూణితపక్ష్మాంతతారకా స్తిమితా ।
దృష్టిః కపోలపాలీనిహితా కరపల్లవే మనః శూన్యమ్ ॥ -(ర.సు.)

— కొంచెం ఒకప్రక్కకు తిరిగి, వంచబడిన ముఖంకల ఆ కాంతయొక్క దృష్టి మూయబడిన రెప్పలలో స్తిమితంకాని కనుపాపలు కలిగిఉన్నది. చేతిలో చెక్కిలి చేర్చబడినది. మనస్సు శూన్యంగా ఉన్నది.

## 10. మోహం

మూలం : మోహోనామ, దైవోపఘాత వ్యసనాభిఘాత వ్యాధి భయావేగ
పూర్వవైరానుస్మరణాదిభిః విభావైః సముత్పద్యతే.
తస్య నిశ్చైతన్య భ్రమణ పతనాఘూర్ణనాదర్శ
నాదిభిః అనుభావైః అభినయః ప్రయోక్తవ్యః.
అత్ర శ్లోక స్త్వావ దార్యా చ —
అస్థానే తస్కరాన్ దృష్ట్వా త్రాసవై ర్వివిధై రపి ।
తత్ప్రతీకారశూన్యస్య మోహః సముపజాయతే ॥
వ్యసనాభిఘాత భయ పూర్వవైరస్మరణ రోగజో మోహః ।
సర్వేంద్రియ సమ్మోహా త్తస్యాభినయః ప్రయోక్తవ్యః ॥
-(నా.శా.VII-52-53)

అర్థం : మోహఃనామ, దైవ-ఉపఘాత, వ్యసనఅభిఘాత, వ్యాధి, భయ, ఆవేగ, పూర్వవైర- అనుస్మరణ-ఆదిభిః, విభావైః, సముత్పద్యతే= మోహం అనేది— దైవికంగా జీవితంలో దెబ్బ తగలటం, వ్యసనంవల్ల దెబ్బతినటం, వ్యాధి, భయం, ఆవేగం, పూర్వవైరాన్ని స్మరించటం మున్నగు, విభావాల వల్ల కలుగుతుంది.

నిశ్చైతన్య, భ్రమణ, పతన, ఆఘూర్ణన, అదర్శన-ఆదిభిః, అనుభావైః, తస్య, అభినయః, ప్రయోక్తవ్యః=చైతన్యం లేకపోవటం, భ్రమణం, నేలమీద పడటం, తిరుగుడుపడటం, చూడలేక పోవటం మున్నగు, అనుభావాలచేత, దానియొక్క, అభినయం, చేయదగును.

అత్ర శ్లోకస్తావదార్యా(చ)=ఇచ్చట ఒక శ్లోకం, ఒక ఆర్య ఉన్నవి:

అస్థానే తస్కరాన్, దృష్ట్వా, వివిధైః, త్రాసనైః (అపి), తత్-ప్రతీకార శూన్యస్య, మోహః, సముపజాయతే=హఠాత్తుగా (=అనుకోనిచోట) దొంగను చూసినప్పుడు, వివిధములైన త్రాసములు కలిగినప్పుడు, వాటికి ప్రతీకారం చేయలేకపోయిన వానియందు, మోహం, కలుగుతుంది.

వ్యసన-అభిఘాత, భయ, పూర్వవైరస్మరణ, రోగజః మోహః=వ్యసనం వల్ల కలిగినదెబ్బ, భయం, పూర్వవైరస్మరణ, రోగం-వీటినుంచి మోహం జని స్తుంది. సర్వ-ఇంద్రియ సమ్మోహాత్, తస్య, అభినయః, ప్రయోక్తవ్యః=అన్ని ఇంద్రియాలను జడీభూతం చేయటంద్వారా, మోహాన్ని అభినయించ దగును.

తాత్పర్యం : విభావాలు : దైవోపఘాతం, వ్యసనాభిఘాతం, వ్యాధి, భయం, ఆవేగం, పూర్వవైరస్మరణ మున్నగునవి.

అనుభావాలు : నిశ్చైతన్యం, భ్రమణం, భూపతనం, అఘూర్ణనం, అదర్శనం మున్నగునవి.

ఇచ్చట ఒక శ్లోకం, ఒక ఆర్యకలవు:

అస్థానమందు తస్కరుని చూడటం, వివిధములైన త్రాసాలు కలగటం, వాటికి ప్రతీకారం చేయలేకపోవటం మున్నగువానివల్ల మోహం కలుగుతుంది.

వ్యసనాభిఘాతం, భయం, పూర్వవైరస్మరణ, రోగం— వీటివల్ల మోహం కలుగుతుంది. సర్వేంద్రియాలను సమ్మోహింపజేయటం ద్వారా మోహాన్ని అభినయించాలి.

టీక : "విచిత్తత లేదా వైచిత్యం (=చిత్తవైకల్యం) మోహం" అని ధనంజయ, భానుదత్తులు. వైచిత్యం అనగా కార్యాకార్య-అపరిచ్ఛేదం అని భానుదత్తుడు. 'చిత్తంయొక్క మూఢత మోహం' అంటూ వియోగాన్ని కూడా విభావంగా చెప్పినాడు సింగభూపాలుడు. "భీతిహేతువు కన్పట్టినప్పుడు తత్ప్రతీకారం కన్పడనప్పుడు కార్య నిశ్చయంచేయలేని చిత్తవృత్తి మోహం" అంటూ మర్మావయవముల మీద దెబ్బతగలటాన్ని కూడా అనుభావంగా చెప్పినాడు సంగీతరత్నాకరకర్త.

ఉదా : భీతివలన మోహం :

స్మర స్తథాభూత మయుగ్మనేత్రం
పశ్య న్నదూరా న్మనసాఽప్యధృష్యమ్ ।
నాలక్షయ త్సాధ్వస సన్నహస్తః
స్రస్తం శరం చాపమపి స్వహస్తాత్ ॥

-(కు.సం.III-51)

— మనస్సుచేతకూడా సమీంపరానివాడు, గొప్ప తపోనియమంలో ఉన్నవాడు అగు త్రినేత్రుని, మన్మథుడు, సమీపంలో చూస్తూ భయంతో వంగిన హస్తాలు కలవాడయినాడు; అప్పుడు తనచేతినుండి బాణాలు, విల్లు జారిపోవటం కూడా ఆతడు గమనించలేదు.

స్పర్శవలని విచిత్తత :

వినిశ్చేతుం శక్యో న సుఖమితి వా దుఃఖమితి వా
ప్రమోహో నిద్రా వా కిము విషవిసర్పః కిము మదః ।
తవ స్పర్శే స్పర్శే మమ హి పరిమూఢేంద్రియగణో
వికారశ్చైతన్యం భ్రమయతి సమున్మీలయతిచ ॥

-(ఉ.రా.చ.I-28)

— (రాముడు) ప్రియా! ఏమిటిది? నీస్పర్శవల్ల నాకు చిత్తవికారం కలుగుతున్నది. ఇది సుఖమో, దుఃఖమో నిశ్చయించుకోలేకపోతున్నాను. ఇది మెలకువయో, నిద్రయో, విషమెక్కుటయో, కైపెక్కుటయో. నా ఇంద్రియములకు ఏదో మోహం కలగుతున్నది. ఇది నా ఇంద్రియాలను భ్రమింపజేస్తున్నది; వెకలించివేస్తున్నది.

## 11. స్మృతి

మూలం : స్మృతిర్నామ సుఖదుఃఖ కృతనాం భావానా మనుస్మరణం.
సా చ స్వాస్థ్య జఘన్యరాత్రినిద్రాచ్ఛేద సమానదర్శ
నోదాహరణ చింతాభ్యాసాదిభిః విభావైః సముత్పద్యతే.
తా మభినయే చ్ఛిరఃకంప నావలోకన భ్రూ
సమున్నమనాదిభి రనుభావైః.
అత్రార్యే భవతః—

సుఖదుఃఖమతిక్రాంతం తథా మతివిభావితం యథా వృత్తమ్ ।
చిరవిస్మృతం స్మరతి యః స్మృతిమానితి వేదితవ్యోఽసౌ ॥
స్వాస్థ్యాభ్యాస సముత్థా శ్రుతిదర్శనసంభవా స్మృతి ర్నిపుణైః ।
శిరఉద్వాహనకంపైః భ్రూక్షేపై శ్చాభినేతవ్యా ॥
-(నా.శా.VII-54, 55)

అర్థం : స్మృతిఃనామ, సుఖ-దుఃఖ కృతానాం, భావానామ్, అనుస్మరణం =స్మృతి అనేది, సుఖ-దుఃఖాలవల్ల కలిగిన, భావాలయొక్క, జ్ఞాపకం.

సా(చ), స్వాస్థ్య, జఘన్యరాత్రినిద్రాచ్ఛేద, సమానదర్శన-ఉదాహరణ, చింతా-అభ్యాసాదిభిః, విభావైః, సముత్పద్యతే=అది(=స్మృతి) – ఆరోగ్యంగా ఉండటం, తెల్లవారుజామున మెలకువరావటం, సమానవస్తువు (=సదృశ వస్త్వాదుల)ను దర్శించటం లేదా సమానవస్తువు ఉదాహరింపబడటం, అలవాటుగా ఆలోచించటం మున్నగు, విభావాలవల్ల (స్మృతి) కలుగుతుంది; -తామ్, శిరఃకంపన, అవలోకన, భ్రూసమున్నమన-ఆదిభిః, అనుభావైః, అభినయేత్=దానిని, తలను ఆడించటం, పరిశీలనగా చూడటం, కనుబొమలను ఎగురవేయటం మున్నగు, అనుభావాలచేత, అభినయించాలి.

అత్ర-ఆర్యే భవతః=ఇచ్చట రెండు ఆర్యలు కలవు.

యః=ఎవడు, అతిక్రాంతం, సుఖ-దుఃఖం (తథా), యథావృత్తం, మతి విభావితం=గతించిన, సుఖ-దుఃఖాలను, జరిగిన వానిని జరిగినట్లుగా, బుద్ధిలో భావిస్తాడో; చిరవ్మృత్తం, స్మరతి, అసౌ, స్మృతిమాన్, ఇతి వేదితవ్యః=ఎన్నడో జరిగిన వృత్తాంతాన్ని, స్మరిస్తాడో, అతడు, స్మృతిమంతుడు, అని, తెలియవలె. స్వాస్థ్య-అభ్యాసముత్థా, శ్రుతి-దర్శన సంభవా, స్మృతిః=ఆరోగ్యంగా ఉండటం, అలవాటు, వినటం, చూడటం-వీటివల్ల, కలుగుతుంది, స్మృతి. శిరః-ఉద్వాహన-కంపైః, భ్రూక్షేపైః (చ), నిపుణైః, అభినేతవ్యా=శిరస్సును పైకెత్తటం, ఆడించటం, కనుబొమలను ఎగురవేయటం– వీటితో, నిపుణులు, (స్మృతిని) అభినయించదగును.

తాత్పర్యం : పూర్వం అనుభవించిన సుఖ-దుఃఖ భావాలు జ్ఞప్తికి రావటం లేదా జ్ఞప్తికి తెచ్చుకోవటం 'స్మృతి' అనబడుతుంది.

విభావాలు : ఆరోగ్యంగా ఉండటం, తెల్లవారుజామున (నాలుగవజామున లేదా ప్రహరమున) మెలకువరావటం, సదృశవస్తువులు మున్నగునవి చూడటం లేదా ఉదాహరింపబడటం, అలవాటుగా ఆలోచించటం మున్నగునవి.

అనుభావాలు : శిరఃకంపనం, అవలోకనం, భ్రూక్షేపం మున్నగునవి.

ఇచ్చట రెండు ఆర్యలు కలవు :

ఎన్నడో మరచిపోయిన గతసుఖ-దుఃఖాలను, జరిగిన వాటిని జరిగినట్లు భావించేవాడు, స్మృతిమంతుడు అనబడతాడు. స్వాస్థ్యం, అభ్యాసం, సదృశ శ్రుతి-దర్శనములు— ఇవి విభావాలు.

శిరఃకంప-ఉద్వహనములు, భ్రూక్షేపాదులు— ఇవి అనుభావాలు.

టీక : "సదృశజ్ఞాన-చింతనాదుల సంస్కారంవల్ల స్మృతి కలుగుతుంది" అని ధనంజయుడు. "సుఖంకాని దుఃఖం కానీ కలిగించే చిరవిస్మృతవస్తువుల స్మరణం స్మృతి" అని సంగీతరత్నాకరకర్త. "సంస్కారజన్యజ్ఞానం స్మృతి" అని రసతరంగిణీకర్త; సంస్కారజన్యజ్ఞానం- ప్రత్యభిజ్ఞారూపంకానీ, స్మరణరూపంకాని కాదగును.

సింగభూపాలుడు స్వాస్థ్య, చింతా, దృఢాభ్యాస, సదృశాలోకములవలని స్మృతికి ఉదాహరణలిచ్చినాడు.

నిద్రాభంగంవల్ల ఏజాములో అయినాస్మృతి కలుగుతుంది. దుఃస్థితిలో ఉన్నప్పుడు కూడా పూర్వం అనుభవించినవి స్మృతికి వస్తాయి (భా.ప్ర.)

ఉదా : స్వాస్థ్యంవలని స్మృతి :

రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
పర్యుత్సుకీ భవతి య త్సుఖితోఽపి జంతుః ।
తచ్చేతసా స్మరతి నూనమబోధపూర్వం
భావస్థిరాణి జననాంతర సౌహృదాని ॥ -(అ.శా.V-2)

— రమ్యమైన వస్తువులను చూసి, మధురములైన శబ్దాలనువిని, సుఖంగా ఉన్న ప్రాణికూడా చకితుడవుతాడు. ఇట్లయినప్పుడు, వానికి, మరచిన విషయం స్మరణకువచ్చిందని నిశ్చయంగా చెప్పగలం. జన్మాంతరంలోని సంబంధాలు భావంలో స్థిరంగా ఉంటాయి.

## 12. ధృతి

మూలం : ధృతిర్నామ శౌర్య విజ్ఞాన శ్రుతి విభవ శౌచాచార గురుభక్త్యధిక మనోరథార్థలాభ క్రీడాదిభిః విభావైః సముత్పద్యతే.

తామభినయేత్ ప్రాప్తానాం విషయాణా ముపభోగాత్
అప్రాప్తాతీతోపహతవినష్టానా మననుశోచ నాదిభిః అనుభావైః.
అత్రార్యే భవతః -
విజ్ఞాన శౌచ విభవ శ్రుతి శక్తి సముద్భవా ధృతిః సద్భిః ।
భయశోకవిషాదాద్యై రహితా తు సదా ప్రయోక్తవ్యా ॥
ప్రాప్తానాముపభోగః శబ్దరసస్పర్శ రూపగంధానామ్ ।
అప్రాప్తైశ్చ న శోకో యస్యాం హి భవే ద్ధృతిః సా తు ॥
-(నా.శా. VII-56, 57)

అర్థం : ధృతిఃనామ, శౌర్య, విజ్ఞాన, శ్రుతి, విభవ, శౌచ-ఆచార, గురు భక్తి, అధికమనోరథ, అర్థలాభ, క్రీడ-ఆదిభిః, విభావైః, సముత్పద్యతే = ధృతి అనేది శౌర్యం, విజ్ఞానం, శ్రుతి (= విద్య), విభవం (= సమృద్ధి), పవిత్రత, సదాచారం, గురుజనభక్తి, అధిక అర్థలాభం, క్రీడ మున్నగు విభావాలవల్ల కలుగుతుంది. తామ్, ప్రాప్తానాం విషయాణాం, ఉపభోగాత్, అప్రాప్త-అ తీత-ఉపహత, వినష్టానాం, అననుశోచన-ఆదిభిః అనుభావైః, అభినయేత్ = దానిని (= ధృతిని), సంప్రాప్తించిన, సుఖాలను అనుభవించటం ద్వారా, లభించని-గతించిన-జారిపోయిన- నశించిన వాటిని గూర్చి శోకించకుండటం ద్వారా అభినయించదగును.

అత్ర-ఆర్యే, భవతః = ఇచ్చట, రెండు ఆర్యలు కలవు. విజ్ఞాన, శౌచ, విభవ, శ్రుతి, శక్తి సముద్భవా, ధృతిః = విజ్ఞానం, శౌచం, విభవం, శ్రుతి, శక్తి- వీటినుంచి జనించేది ధృతి.

భయ, శోక, విషాదాద్యైః, రహితా (తు), సదా సద్భిః ప్రయోక్తవ్యా = భయం, శోకం, విషాదం మున్నగునవి లేకుండా ఎల్లప్పుడు ఉత్తములు, ధృతిని ప్రయోగింపదగును.

యస్యాం= దేనియందు; ప్రాప్తానాం శబ్ద-స్పర్శ-రూప-రస-గంధానాం ఉపభోగః= ప్రాప్తములైన, శబ్ద-స్పర్శ-రూప-రస-గంధాల యొక్క, అనుభవించటం ఉంటుందో; అప్రాప్తైః (చ) న, శోకః (హి) = అప్రాప్తములైన వాటిచేత (= కొరకు) శోకించకుండటం ఉంటుందో; సా (తు), ధృతిః, భవేత్ = అది, ధృతి, అవుతుంది.

తాత్పర్యం : విభావాలు : శౌర్యం, విజ్ఞానం, విద్య, విభవం, శౌచం, సదాచారం, గురుజనభక్తి, అధికమనోరథ లాభం, అధిక అర్థలాభం, క్రీడ మున్నగునవి.

అనుభావాలు : ప్రాప్తములైన విషయాలను అనుభవించటం, లభించని, అందని, చెడిపోయిన, నశించిన విషయాలకై వగవకుండటం మున్నగునవి.

ఇచ్చట రెండు ఆర్యలు కలవు.

విభావాలు : విజ్ఞానం, శౌచం, విభవం, చదువు, శక్తి - వీటివల్ల ధృతి కలుగుతుంది.

భయ-శోక-విషాద రహితంగా దీనిని ఉత్తములు ప్రయోగించాలి.

అనుభావాలు : ప్రాప్తములైన శబ్ద-స్పర్శ-రూప-రస-గంధాలను అనుభవించటం, అప్రాప్తములైన వాటికొరకు శోకించకుండటం.

టీక : "జ్ఞాన-శక్త్యాదులవల్ల కలిగే సంతోషం ధృతి" అని ధనంజయుడు. "జ్ఞానాదులవల్ల చిత్తమందు కలిగే నైఃస్పృహ్యం (= నిఃస్పృహత =కోరిక లేకపోవటం) ధృతి (= ధీరత)" అని సింగభూపాలుడు. 'లజ్జ' ను కూడా విభావంగానూ అప్రాప్తాది విషయాలను గూర్చి అనభిసంశోధనం (= విమర్శ చేయకుండటం) అనుభావంగానూ చెప్పినాడు సింగభూపాలుడు.

"దుఃఖసమయంలో కూడా అదుఃఖబుద్ధి ధృతి" అని భానుదత్తుడు. "జ్ఞానాదులచేత, అభీష్టసిద్ధిచేత కోర్కె తీరటం ధృతి" అని విశ్వనాథుడు.

ధృతిని సంగీతరత్నాకరకర్త ఇట్లా వివరించినాడు : "వివేకం, శ్రుతి, సంపత్తి, గురుభక్తి, తపస్వీత- ఇవి విషయభావంతో, కరణత్వంతో ఉంటాయి. అధికంగా ఇష్టవస్తులాభం విషయత్వం, ఇంక క్రీడాకరణత్వం విభావం అవుతుంది."

జ్ఞాన-విజ్ఞాన-గురుభక్తి-వానార్థసిద్ధుల వల్ల కలిగే ధృతికి సింగభూపాలుడు ఉదాహరణలిచ్చినాడు.

ఉదా : జ్ఞానం వలని ధృతి :

అశీమహి వయం భిక్షా మాశావాసో వసీమహి ।
శయీమహి మహీపృష్ఠే కుర్వీమహి కి మీశ్వరైః ॥

(ర.సు.పుట 390)

— మేము భిక్షాన్నం తింటాము, దిగంబరములనే ధరిస్తాము, నేలపై పరుంటాము, ప్రభువులతో మాకేమి ప్రయోజనం?

## 13. వ్రీడ

మూలం : వ్రీడానామ, అకార్యకరణాత్మికా. సా చ గురువ్యతిక్రమ
ణావజ్ఞాన ప్రతిజ్ఞాతానిర్వహణ పశ్చాత్తాపాదిభిః
విభావైః సముత్పద్యతే. తాం నిగూఢవద
నాధోముఖవిచింత నోర్వీలేఖన వస్త్రాంగులీయస్పర్శన
నఖనికృంతనాదిభిః అనుభావైః అభినయేత్.
అత్రార్యే భవతః -
కించి దకార్యం కుర్వన్నేవం యో దృశ్యతే శుచిభి రన్యైః ।
పశ్చాత్తాపేనయుతో వ్రీడిత ఇతి వేదితవ్యోఽసౌ ॥
లజ్జానిగూఢవదనో భూమింవిలిఖ న్నఖాంశ్చ వినికృంతన్ ।
వస్త్రాంగులీయకానాం సంస్పర్శం వ్రీడితః కుర్యాత్ ॥
-(నా.శా. VII-58, 59

అర్థం : వ్రీడానామ, అకార్యకరణాత్మికా = వ్రీడ (= సిగ్గు) అనేది చేయరానివనిచేయటం వల్ల కలిగేది. సా (చ), గురువ్యతిక్రమణ, అవజ్ఞాన, ప్రతిజ్ఞా-అనిర్వహణ, పశ్చాత్తాప-ఆదిభిః, విభావైః సముత్పద్యతే = అది (= వ్రీడ) గురుజనులను లెక్క చేయకపోవటం, అవమానం, ప్రతిజ్ఞను నిర్వహించ లేకపోవటం, పశ్చాత్తాపం మున్నగు విభావాదుల వల్ల జనిస్తుంది. తాం, నిగూఢవదన, అధోముఖవిచింతన, ఉర్వీలేఖన, వస్త్ర- అంగులీయకస్పర్శన, నఖనికృంతన- ఆదిభిః, అనుభావైః, అభినయేత్= దానిని, ముఖంచూపలేకపోవటం, తలవంచి ఆలోచించటం, నేలరాయటం, వస్త్రాన్ని ఉంగరాన్ని స్పృశిస్తూ ఉండటం, గోళ్ళు గిల్లుకొనటం ( లేదా గోళ్ళు కొరకటం) మున్నగు అనుభావాలతో, అభినయించాలి.

అత్ర-ఆర్యే, భవతః = ఇచ్చట రెండు ఆర్యలు కలవు. యః, కించిత్-అకార్యం, కుర్వన్-ఏవం, శుచిభిః అన్యైః దృశ్యతే, అసౌ, పశ్చాత్తాపేన, వ్రీడితః, ఇతి, వేదితవ్యః = ఎవడు, కొంచెం అకార్యం చేస్తూ, అట్లాగే, శుచిమంతులైన, ఇతరుల చేత, చూడబడీ పశ్చాత్తాపం చెందుతాడో, అతడు, పశ్చాత్తాపం చేత 'వ్రీడావంతుడు' అని తెలియవలె.

వ్రీలితః = వ్రీడావంతుడు; లజ్జానిగూఢవదనః, భూమించిలిఖన్, నఖాం (చ) వినికృంతన్, వస్త్ర-అంగులీయకానాం, సంస్పర్శం, కుర్యాత్ = లజ్జ చేత నిగూఢవదనుడై, భూమిని (కాలితో) రాస్తూ, వస్త్ర-అంగులీయకాలను స్పృశిస్తూ, గోళ్ళు గిల్లుకొంటూ ఉండాలి.

తాత్పర్యం : వ్రీడ అకార్యకరణాత్మకం. విభావాలు : గురుజనవ్యతిక్రమణం, అవజ్ఞ, ప్రతిజ్ఞ నిర్వహించ లేకపోవటం, పశ్చాత్తాపం మున్నగునవి.

అనుభావాలు : నిగూఢవదనం, అధోముఖ విచింతనం, ఉర్వీలేఖనం, వస్త్ర-అంగులీయక స్పర్శనం, నఖ నికృంతనం మున్నగునవి.

ఇచ్చట రెండు ఆర్యలు కలవు.

ఏదేని ఒక అకార్యాన్ని చేస్తూ పెద్దల కంట పడినప్పుడు తాను చేసిన పనికి పశ్చాత్తాపపడేవాడు 'వ్రీడావంతుడు' అనబడతాడు.

అతడు లజ్జచేత నిగూఢవదనుడై, భూమిలేఖనం, నఖనికృంతనం, వస్త్రాంగులీయక సంస్పర్శనం చేస్తూ ఉంటాడు.

టీక : "దురాచార ప్రభవం, ధార్ష్ట్యహీనం అయినది వ్రీడ" అని చెప్పి, వైవర్ణ్యాన్ని ఒక అనుభావంగా పేర్కొన్నాడు ధనంజయుడు. ప్రతీకారం చేయలేకపోవటం, నూత్నసంగమం, పొగడ్త - వీనిని కూడా విభావాలుగా చెప్పినాడు సింగభూపాలుడు; అట్లాగే వెలుపలికి రాకపోవటం, దూరంగా ఉన్నప్పుడే వస్త్రంతో కప్పుకొనటం - వీటిని కూడా అనుభావాలుగా చెప్పినాడు.

"స్వచ్ఛందక్రియాసంకోచం వ్రీడ" అని భానుదత్తుడు. ఇట్లా చెప్పటం వల్ల శంకా- త్రాసములందు అతివ్యాప్తి లేదు; కారణం అప్పట్లక్రియావిరహమే కాని, క్రియాసంకోచం లేదు. అకార్యకరణం, అవజ్ఞ, స్తుతి, నవసంగమం, ప్రతీకారకరణములకు సింగభూపాలుడు ఉదాహరణలిచ్చినాడు.

ఉదా : స్తుతివలని వ్రీడ :

తస్య సంస్తూయమానస్య చరితార్థైః స్తపస్విభిః ।
శుశుభే విక్రమోదగ్రం వ్రీడాదవనతం శిరః ॥

-(ర.వం.XV-27)

— కృతార్థులగు మునుల చేత ప్రశంసింపబడుతున్న శత్రుఘ్నుని యొక్క విక్రమోదగ్రమగు శిరస్సు సిగ్గుచేత వంచబడినదై, మిగుల శోభించినది.

అకార్యకరణంవలని వ్రీడ :
గుర్వాదేశాదేవ నిర్మీయమాణో
నాధర్మాయ స్త్రీవధోఽపీప్సితోఽయమ్ ।
అద్యస్థిత్వా శ్వోగమిష్యద్భిరల్పై
లజ్జాస్మాభిర్మీలితాక్షైర్జితైవ ॥ (అనర్ఘరాఘవం -II-51)

— గురుని అజ్ఞవల్ల. చేయబడిన ఈ స్త్రీవధ అథర్మం కాకపోయినా, మనస్సునకు ఇష్టంకాదు. అల్పులము, నేడుండిరేపు పోవలసినవారము, కనులు మూసికొన్నవారము అయిన మాచేత ఇట్లా లజ్జ జయింపబడింది.

నవసంగమమందలి వ్రీడ :
పటాలగ్నే పత్యౌ నమయతి ముఖం జాతవినయా
హఠాశ్లేషం వాంఛ త్యపహరతి గాత్రాణి నిభృతమ్ ।
న శక్తా చాఖ్యాతుం స్మితముఖ సఖీదత్తనయనా
హ్రియా తామ్యత్యంతః ప్రథమపరిభోగే నవవధూః ॥
(అమరుకం-36)

— అనవవధువు–భర్త వస్త్రాన్ని పట్టుకోగా వినయంతో ముఖం వంచినది. తటాలున ఆలింగనం కోరగా అవయవములను ముడుచుకొని తప్పుకొన్నది. ఏమి చెప్పటానికి సమర్థలు కాక, చిరునవ్వుతోడి ముఖాలుగల చెలులను చూస్తూ ప్రథమసంభోగసమయంలో సిగ్గుతో మనస్సులోనే తపించింది.

## 14. చపలత

మూలం : చపలతా నామ రాగ ద్వేష మాత్సర్యామర్షేర్ష్యా
ప్రతికూలాదిభిః విభావైః సముత్పద్యతే.
తస్యాశ్చ వాక్పారుష్య నిర్భర్త్సన
వధ బంధ సంప్రహార తాడనాదిభిః అనుభావైః
అభినయః ప్రయోక్తవ్యః.
అత్రార్యాభవతి-
అవిమృశ్య తు యః కార్యం పురుషో వధతాడనం సమారభతే ।
అవినిశ్చిత కారిత్వా త్సతు ఖలు చపలో బుధైః జ్ఞేయః ॥
-(నా.శా. VII-60)

అర్థం : చపలతా నామ, రాగ, ద్వేష, మాత్సర్య, అమర్ష, ఈర్ష్యా, ప్రతికూల-ఆదిభిః, విభావైః, సముత్పద్యతే = చపలత అనేది అనురాగం, ద్వేషం, మాత్సర్యం, అమర్షం, ఈర్ష్య, ప్రతికూలత (= విరోధం), మున్నగు విభావాల వల్ల, జనిస్తుంది. వాక్పారుష్య, నిర్భర్త్సన, వధ, బంధ, సంప్రహార, తాడన-ఆదిభిః, అనుభావైః, తస్యాః (చ) అభినయః, ప్రయోక్తవ్యః = పరుషవాక్యాలు పలకటం, నిర్భర్త్సనం (=బెదరింపు), వధ, బంధనం, బాగా కొట్టటం, తన్నటం మున్నగు అనుభావాలతో దాని (= చపలత) యొక్క, అభినయం చేయాలి.

అత్ర-ఆర్యా, భవతి = ఇచ్చట, ఒక ఆర్యకలదు.

యః, పురుషః, కార్యం, అవిమృశ్య (తు), వధ, తాడనం, సమారభతే = ఏ, పురుషుడు, కార్యాన్ని (= చేసే చెడుపనిని), ఆలోచించకయే ఆరంభిస్తాడో; సః(ఖలు), అవినిశ్చితకారిత్వాత్, చపలః, బుధైః, జ్ఞేయః = అతడు, నిశ్చయం (= ఆలోచన) లేకుండానే ఆ పనిచేయటం వల్ల, చపలుడు (అని), బుధులు తెలియవలె.

తాత్పర్యం : విభావాలు : రాగ-ద్వేషాలు, మాత్సర్యం, ఈర్ష్య, అమర్షం, ప్రతికూలత మున్నగునవి.

అనుభావాలు : వాక్పారుష్యం, నిర్భర్త్సనం, వధ, బంధం, సంప్రహారం, తాడనం మున్నగునవి.

ఇచ్చట ఒక ఆర్యకలదు:

విమర్శించకయే ఎవడు వధ, తాడనం మున్నగు అకార్యాలు ఆరంభిస్తాడో, అతడు అనిశ్చితకారిత్వంవల్ల చపలుడు అనబడతాడు.

టీక : "రాగాదుల వల్ల కలిగే అనవస్థితి చాపలం" అంటూ స్వచ్ఛందాచరణాన్ని (= ఇష్టంవచ్చినట్లు చేయటాన్ని) ఒక అనుభావంగా పేర్కొన్నాడు ధనంజయుడు. చపలత, చాపలం, చాపల్యం- ఇవి సమానార్థకాలు. "రాగద్వేషాదులవల్ల చిత్తలాఘవం (= మనస్సులో తేలికతనం కలగటం) చాపలం" అని సింగభూపాలుడు. పరిరంభం (= ఆలోచనలేని కౌగిలింత), అవలంబం (= ఆధారంగా పట్టుకొనటం), నిష్కాసనం (= వెడలగొట్టటం) - ఇవి కూడా అనుభావాలుగా పేర్కొనబడినవి. "ఇతరేతరక్రియాకరణం (= ఒకేసమయంలో

పెక్కు పనులు చేయటం) లేదా క్రియాశీఘ్రత (= తొందరగా పనిముగించటం) చపలత" అని భానుదత్తుడు.

రాగద్వేషాలవలని చాపలమునకు సింగభూపాలుడు ఉదాహరణ లిచ్చినాడు.

## 15. హర్షం

మూలం : హర్షో నామ- మనోరథలాభేష్టజనసమాగమన మనఃపరితోష
దేవగురురాజభర్తృప్రసాద భోజనాచ్ఛాదన
లాభోపభోగాదిభిః విభావైః సముత్పద్యతే.
తమభినయేత్ నయనవదన ప్రసాద ప్రియభాష
ణాలింగన కంటకిత పులకి తాస్ర స్వేదాదిభిః అనుభావైః.
అత్రార్యేభవతః -
అప్రాప్యే ప్రాప్యే వా లబ్ధేఽర్థే ప్రియసమాగమే వాఽపి ।
హృదయమనోరథలాభే హర్షః సంజాయతే పుంసామ్ ॥
నయనవదనప్రసాద ప్రియభాషాలింగనైశ్చ రోమాంచైః
లలితై శ్చాంగవిహారైః స్వేదాద్యై రభినయ స్తస్య ॥
-(నా.శా. VII-61, 62)

అర్థం : హర్షో నామ = హర్షం అనేది,

మనోరథలాభ, ఇష్టజనసమాగమన, మనః పరితోష, గురు-రాజ-భర్తృ ప్రసాద, భోజన-ఆచ్ఛాదన- ధనలాభ-ఉపభోగ-ఆదిభిః విభావైః, సముత్పద్యతే = మనోరథలాభం, ఇష్టజనులతో కలయిక, మానసిక సంతుష్టి, గురువుల అనుగ్రహం, రాజానుగ్రహం, భర్తృ (= యజమాని = భర్త)ప్రసాదం, భోజన లాభం, నూతన వస్త్రప్రాప్తి, ధనప్రాప్తి, వీటి ఉపభోగం మున్నగు విభావాల వల్ల కలుగుతుంది.

నయన-వదన ప్రసాద, ప్రియభాషణ, ఆలింగన, కంటకిత, పులకిత, అస్ర, స్వేద-ఆదిభిః, అనుభావైః, తమ్, అభినయేత్ = నయనములు వదనం ప్రసన్నంగా ఉండటం, ప్రియభాషణములు, ఆలింగనం, జలదరింపు, గగు ర్పాటు, అస్రం, స్వేదం మున్నగు అనుభావాలచేత, దానిని, అభినయించాలి.

అత్ర-ఆర్యే, భవతః = ఇచ్చటరెండు ఆర్యలు కలవు :

అప్రాప్యే ప్రాప్యే (వా), అర్థేలబ్ధే, ప్రియసమాగమే (వా-అపి), హృదయ మనోరథలాభే, పుంసామ్, హర్షః, సంజాయతే=దుర్లభమైన వస్తువు

లభించటం, అర్థలాభం, ప్రియజనసమాగమం, హృదయంలోని కోరిక సిద్ధించటం- వీనివల్ల, పురుషులయందు, హర్షం, కలుగుతుంది.

నయన-వదన ప్రసాద, ప్రియభాష, ఆలింగనైః (చ), రోమాంచైః, లలితైః (చ) అంగవిహారైః, స్వేదాద్యైః, తస్య, అభినయః = ప్రసన్నములైన నయన-వదనములు, ప్రియభాషణం, ఆలింగనం, రోమాంచం, లలితములైన అంగవిన్యాసాలు, స్వేదం మున్నగువాటిచేత, దానియొక్క, అభినయం (చేయాలి).

తాత్పర్యం : విభావాలు : మనోరథలాభం, ఇష్టజనసమాగమం, మనః పరితోషం, దేవ-గురు-రాజ- భర్తృప్రసాదం, భోజన-ఆచ్ఛాదన-ధనలాభం, వీని యొక్క ఉపభోగం మున్నగునవి.

అనుభావాలు : నయన- వదన ప్రసన్నతలు, ప్రియభాషణాలు, ఆలింగనాలు, ఒడలు జలదరింపులు, రోమాంచాలు, ఆనందబాష్పాలు, స్వేదం మున్నగునవి.

ఇచ్చట రెండు ఆర్యలు కలవు.

విభావాలు : దుర్లభవస్తు ప్రాప్తి, అర్థలాభం, ప్రియసమాగమం, హృదయ మనోరథలాభం.

అనుభావాలు : నయన-వదన ప్రసన్నతలు, ప్రియభాషణాలు, ఆలింగనాలు, రోమాంచం, లలిత- అంగవిన్యాసాలు, స్వేదం మున్నగునవి.

టీక : "ప్రసత్తి (= ప్రసన్నత), పుత్రజననాది ఉత్సవాలు మున్నగు వాటివల్ల హర్షం జనిస్తుంది" అంటూ గాద్గద్యాన్ని కూడా అనుభావంగా చెప్పినాడు ధనంజయుడు. "మనోరథ లాభాదులవల్ల కలిగే మనఃప్రసాదం హర్షం" అంటూ కనులు విప్పారటాన్ని, హస్తంతో హస్తాన్ని రాయటాన్ని అనుభావాలుగా చెప్పినాడు సింగభూపాలుడు.

"చేతః ప్రసాదం (= మనః ప్రసాదం) హర్షం" అన్నాడు భానుదత్తుడు.

మనోరథలాభ-యోగ్యవస్తుసిద్ధి-మిత్రసంగమ- పూజ్యసంగమ- దేవ ప్రసాద-గురుప్రసాద-రాజప్రసాదాలవలని హర్షాలకు ఉదాహరణలొసంగినాడు సింగభూపాలుడు.

ఉదా : మనోరథలాభం వలని హర్షం :

నివాత పద్మ స్తిమితేన చక్షుషా
నృపస్య కాంతం పిబతః- సుతాననమ్ ।
మహోదధేః పూర ఇవేందు దర్శనా
ద్గురుః ప్రహర్షః ప్రబభూవనాత్మని ॥ (ర.వం.III-17)

— గాలిలేని స్థలంలో స్థిమితంగా ఉన్న పద్మాన్ని పోలిన చూపుతో రాజగు దిలీపుడు మనోహరమయిన కుమారుని ముఖం చూస్తూ, చంద్రుని చూచిన పిదప పొంగిన సముద్రం వలె అధికానందం పొందినాడు; ఆ ఆనందం అతని హృదయంలో ఇముడక పైకి పొంగినది.

## 16. ఆవేగం

ఆవేగోనామ- ఉత్పాత-వాత-వర్షాగ్ని-కుంజరోద్భ్రమణ-
ప్రియాప్రియ శ్రవణ-వ్యసనాభిఘాతాదిభిః
విభావైః సముత్పద్యతే.
తత్రోత్పాతకృతోనామ విద్యుదుల్కా నిర్ఘాత
ప్రపతన చంద్రసూర్యోపరాగ కేతుదర్శనకృతః;
తమభినయే త్సర్వాంగ ప్రస్తతా వైమనస్య
ముఖవైవర్ణ్య విషాద విస్మయాదిభిః.
వాతకృతం పున రవకుంఠ నాక్షిపరిమార్జన వస్త్ర
సంగూహన త్వరితగమనాదిభిః.
వర్షకృతం పునః సర్వాంగసంపిండన ప్రధావన
ఛన్నాశ్రయ మార్గణాదిభిః.
అగ్నికృతం తు ధూమాకులనేత్ర తాంగసంకోచన
విధూనన నాతిక్రాంతాపక్రాంతాదిభిః.
కుంజరోద్భ్రమణకృతం నామ త్వరితాపసర్పణ
చంచలగమన భయస్తంభ వేపథు పశ్చా
దవలోకన విస్మయాదిభిః.
ప్రియశ్రవణకృతంవా మాభ్యుత్థా నాలింగన
వస్త్రాభరణప్రదా నాశ్రు పులకితాదిభిః.
అప్రియశ్రవణకృతం నామ భూమిపతన
విషమవివర్తన పరిధావన విలాపనాక్రందనాదిభిః.

ప్రకృతివ్యసనకృతం నామ సహసాపసర్పణ
శస్త్ర చర్మ వర్మ ధారణ గజతురగరథారోహణ సంప్రహారణాదిభిః.
ఏవ మష్టవికల్పోఽయ మావేగః సంభ్రమాత్మకః ।
స్థైర్యేణోత్తమ మధ్యానాం నీచానాం చాపసర్పణైః ॥
అత్రార్యే భవతః :
అప్రియ నివేదవాది శ్రవణా దవధారితవచనస్య ।
శస్త్రాక్షేపా త్త్రాసా దావేగో నామ సంభవతి ॥
అప్రియనివేదనాద్యో విషాదభావాశ్రయోఽనుభావ్యోఽస్య ।
సహసారిదర్శనా చ్చే త్ప్రహరణ పరిఘట్టనైః కార్యః ॥
-(నా.శా. VII-63-65)

అర్థం : ఆవేగః నామ- ఉత్పాత, వాత, వర్ష, అగ్ని, కుంజర-ఉద్భ్రమణ, ప్రియ-అప్రియ శ్రవణ, వ్యసన-అభిఘాత-ఆదిభిః, విభావైః, సముత్పద్యతే = ఆవేగం అనేది, ఉత్పాతం = (అశుభసూచనములు), వాతం (= పెనుగాలి), వర్షం (= కుంభవృష్టి), అగ్ని (ప్రమాదం), కుంజరోద్భ్రమణం (= ఏనుగు విచ్చలవిడిగా తిరగటం), ప్రియవార్తాశ్రవణం, అప్రియవార్తా శ్రవణం, వ్యసనాభిఘాతం (= ఆపదసంభవించటం) మున్నగు విభావాల వల్ల ఆవేగం జనిస్తుంది.

*(1)* తత్ర, ఉత్పాతకృతః నామ, విద్యుత్-ఉల్కా-నిర్ఘాత ప్రపతన, చంద్ర-సూర్య-ఉపరాగ, కేతుదర్శన కృతః = ఇందు ఉత్పాతం వల్ల జనించే ఆవేగం - ఆకస్మికంగా మెరుపు కనిపించటం, ఉల్కలు పిడుగులు పడటం, చంద్ర-సూర్యగ్రహణాలు, తోకచుక్కలు కనిపించటం - వీటివల్ల కలుగుతుంది. తమ్, సర్వాంగ స్రస్తతా, వైమనస్య, ముఖవైవర్ణ్య, విషాద, విస్మయ-ఆదిభిః, అభినయేత్ = దానిని, సర్వాంగశైథిల్యం, వైమనస్యం, ముఖం పాలిపోవటం, విషాదం, విస్మయం మున్నగు వానిచేత, అభినయించాలి.

*(2)* (పునః) వాతకృతం - అవగుంఠన, అక్షిపరిమార్జన, వస్త్రసంగూహన, త్వరితగమన-ఆదిభిః, అనుభావైః = (మరల) వాతకృతమైన ఆవేగాన్ని -మునుగు వేసికొనటం, కనులను నులుముకొనటం, గాలికి ఎగురుతున్న వస్త్రాలను దగ్గరకు తీసికొనటం, వేగంగా నడవటం, మున్నగు అనుభావాలచేత (అభినయించాలి).

(3) (పునః) వర్షకృతం - సర్వాంగసంపిండన, ప్రధావన, ఛన్నాశ్రయ మార్గణ-ఆదిభిః = వర్షకృతమైన (ఆవేగాన్ని), సర్వాంగాలను పిండీకృతం చేయటం, పరుగెత్తటం, తలదాచుకొనేచోటు వెదకటం మున్నగు (అనుభావాల చేత అభినయించాలి).

(4) అగ్నికృతం (తు) - ధూమాకులనేత్రతా, అంగసంకోచన, విధూనన, అతిక్రాంత-ఆదిభిః = అగ్నికృతమైన (ఆవేగాన్ని) - పొగతో నిండిన కనులతో, అంగాలను ముడుచుకొనటం లేదా చలింపజేయటం, పెద్ద పెద్ద అంగలు వేస్తూ తొలగిపోవటం మున్నగు (అనుభావాలచేత అభినయించాలి).

(5) కుంజరోద్భ్రమణ కృతం నామ- త్వరిత-అపసర్పణ, చంచలగమన, భయ, స్తంభ, వేపథు, పశ్చాత్-అవలోకన, విస్మయాదిభిః = కుంజరోద్భ్రమణం వలన కలిగిన (ఆవేగం) అనేదానిని, వేగంగా తొలగిపోవటం, చంచల గమనం, భయం, వేపథువు, విస్మయం, వెనుకకు చూస్తూ ఉండటం-మున్నగు (అనుభావాలచేత అభినయించాలి).

(6) ప్రియశ్రవణకృతం నామ- అభ్యుత్థాన, ఆలింగన, వస్త్ర-ఆభరణ ప్రదాన, అశ్రు-పులకిత ఆదిభిః = ప్రియమైన వార్తను వినటం వల్ల కలిగే (ఆవేగం) అనే దానిని (వార్త తెచ్చినవారికి) ఎదురేగటం, ఆలింగనం చేసి కొనటం, వస్త్రాలను ఆభరణాలను కానుకగా ఇవ్వటం, అశ్రువు, పులకలు మున్నగు (అనుభావాలచేత అభినయించాలి).

(7) అప్రియ శ్రవణకృతం నామ- భూమిపతన, విషమవివర్తన, పరిధావన, విలాపన, ఆక్రందన-ఆదిభిః = అప్రియవార్తాశ్రవణకృతమైన ఆవేగం అనేదానిని, నేలమీదపడటం, తిరుగుడుపడటం, పరుగెత్తటం, విలపించటం, ఆక్రందనం చేయటం మున్నగు (అనుభావాలచేత అభినయించాలి).

(8) ప్రకృతివ్యసనకృతం నామ- సహసా- అపసర్పణ, శస్త్ర-చర్మ-వర్మ-ధారణ, గజ-తురగ-రథ- ఆరోహణ, సంప్రహారణ ఆదిభిః = ప్రకృతివైపరీత్యం వల్ల కలిగే ఆవేగం అనేదానిని- వెంటనే తొలగిపోవటం, శస్త్రం డాలు కవచం ధరించటం, గజ-రథ-తురగాలను ఆరోహించటం, దెబ్బకొట్టటం మున్నగు (అనుభావాలచేత అభినయించాలి).

సంభ్రమాత్మకః, అయం ఆవేగః, ఏవం-అష్ట వికల్పః = సంభ్రమంతో కూడిన ఈ ఆవేగం, ఇట్లా, ఎనిమిది విధాలు. ఉత్తమ మధ్యమానాం,

స్థైర్యేణ, నీచానాం, అపసర్పణైః = ఉత్తమ-మధ్యమ ప్రకృతులు స్థైర్యంతో, నీచప్రకృతులు తొలగిపోవటంతో (ఆవేగాభినయం చేయాలి).

అత్ర-ఆర్యే భవతః = ఇచ్చట, రెండు ఆర్యలు కలవు. అప్రియనివేదనాది, అవధారితవచనస్య, శ్రవణాత్, శస్త్ర-ఆక్షేపాత్, త్రాసాత్, ఆవేగః నామ, సంభవతి = అప్రియనివేదనాదుల వల్ల, (శత్రువుల) తిరస్కార పూర్వక వచనాలను వినటం వల్ల, శస్త్ర ప్రయోగంవల్ల, త్రాసం వల్ల, ఆవేగం అనేది సంభవిస్తుంది.

అప్రియనివేదనాద్యః, అస్య అనుభావః విషాద భావాశ్రయః = అప్రియ నివేదనాదులందలి అనుభావాలు విషాదభావంతో కూడిఉంటాయి. సహసా-అరిదర్శనాత్-చేత్, ప్రహరణ-పరిఘట్టనైః, కార్యః = ఆకస్మికంగా శత్రుదర్శనమైతే, అప్పటి ఆవేగంలో, ప్రహరణం, పరిఘట్టనం చేయాలి.

తాత్పర్యం : ఉత్పాతం, వాతం, వర్షం, అగ్ని, కుంజరోద్భ్రమణం, ప్రియవార్తాశ్రవణం, అప్రియవార్తాశ్రవణం, వ్యసనాభిఘాతం మున్నగు విభావాలవల్ల ఆవేగం కలుగుతుంది.

*(1)* ఉత్పాతకృత ఆవేగం :

విభావాలు : మెరుపులు-ఉల్కలు-పిడుగులు పడటం, చంద్రగ్రహణం, సూర్యగ్రహణం, కేతుదర్శనం.

అనుభావాలు : సర్వాంగస్రస్తత, వైమనస్యం, ముఖవైవర్ణ్యం, విషాదం, విస్మయం మున్నగునవి.

*(2)* వాతకృత ఆవేగం :

అనుభావాలు : అవగుంఠనం, అక్షిపరిమార్జనం, వస్త్రసంగూహనం, త్వరితగమనం మున్నగునవి.

*(3)* వర్షకృత ఆవేగం :

అనుభావాలు : సర్వాంగసంపీడనం, ప్రధావనం, ఛన్నాశ్రయమార్గణం మున్నగునవి.

*(4)* అగ్నికృత ఆవేగం :

అనుభావాలు : ధూమాకులనేత్రత, అంగసంకోచనం, అంగవిధూననం, అతిక్రాంతత మొదలగునవి.

(5) కుంజరోద్భ్రమణకృత ఆవేగం :

అనుభావాలు : త్వరితాపసర్పణం, చంచలగమనం, భయం, స్తంభం, వేపథువు, పశ్చాదవలోకనం, విస్మయం మున్నగునవి.

(6) ప్రియశ్రవణ కృత ఆవేగం :

అనుభావాలు : అభ్యుత్థానం, ఆలింగనం, వస్త్ర ప్రదానం, ఆభరణ ప్రదానం, అశ్రువు, రోమాంచం మున్నగునవి.

(7) అప్రియశ్రవణకృత ఆవేగం :

అనుభావాలు : భూమిపతనం, విషమవివర్తనం, పరిధావనం, విలాపం, ఆక్రందనం మున్నగునవి.

(8) ప్రకృతివ్యసనకృత ఆవేగం :

అనుభావాలు : సహసా అపసర్పణం, శస్త్ర-చర్మ-వర్మధారణం, గజ-తురగ-రథ-ఆరోహణం, సంప్రహారణం మున్నగునవి.

సంభ్రమంతో కూడిన ఆవేగం ఇట్లా ఎనిమిది విధాలు. ఉత్తమ-మధ్యములు స్థైర్యంతోనూ, నీచప్రకృతులు తొలగిపోవటంతోను దీనిని అభినయించాలి.

ఈ సందర్భంలో రెండు ఆర్యలు కలవు :

అప్రియనివేదనాదుల శ్రవణంవల్ల, అవధారిత వచనాలవల్ల, శస్త్ర ప్రయోగం వల్ల, త్రాసంవల్ల ఆవేగం కలుగుతుంది. అప్రియనివేదనాదుల పట్ల అనుభావాలు విషాదంతో కూడి ఉంటాయి. ఆకస్మికంగా శత్రుదర్శనమైతే, అప్పటి ఆవేగంలో ప్రహరణం, పరిఘట్టనం ఉంటాయి.

టీక : "అధీరులలో శోకజనన మాత్రమున ఆవేగం జనిస్తుంది. ఉత్తములు ప్రబలంగా ఆవేగం జనించినప్పటికీ, ధైర్యంతో దానిని ఆపుకొంటారు" అంటూ ఎనిమిది విధాల ఆవేగాలను విభావానుభావపూర్వకంగా వివరించి, ఆవేగం సంభ్రమాత్మకమన్నాడు సంగీతరత్నాకరకర్త.

"ఆవేగం అంటే సంభ్రమం" అంటూ, అభిసరాన్ని (= రాజసంబంధి విప్లవం = Coup) ఒక విభావంగా చెప్పినాడు ధనంజయుడు. ఇది ప్రకృతి వ్యసనకృతమైన ఆవేగంతో సమానమని చెప్పవచ్చు. "చిత్తం యొక్క సంభ్రమమే ఆవేగం" అంటూ శైలకంపాన్ని కూడా ఒక విభావంగా చెప్పినాడు

సింగభూపాలుడు; అంతేకాదు ఎనిమిది విధాల ఆవేగాలకు ఉదాహరణలిచ్చినాడు. ఒక ఉదాహరణ :

ఉదా : ఉత్తముని యందు శాత్రవ-ఆవేగం (సహసావిక్రమం)
రామోనామ బభూవ హుం తదబలా సీతేతి హుం తౌ పితుః
వాచా పంచవటీ తటే విహరత స్తా మాహర ద్రావణః ।
నిద్రార్థం జననీ కథా మితి హరే ర్హుంకారతః శృణ్వతః
సౌమిత్రే! క్వధను ర్ధనురితి వ్యగ్రా గిరః పాంతు వః ॥
(కృ.క.II-72)

– శ్రీకృష్ణుని నిద్రపుచ్చటానికై తల్లి కథ చెబుతున్నది : "అనగనగా రాముడు; సీత అతని భార్య. తండ్రి ఆనతివలన వారిరువురును దండకలోని పంచవటి వద్ద విహరించినారు. సీతను రావణుడు అపహరించినాడు." అని చెప్పుచుండగా, కృష్ణుడు నడుమ నడుమ 'ఊఁ' కొట్టుతూ, చివరి మాటవినగానే ఆవేగంతో "లక్ష్మణా! విల్లు ఎక్కడ? విల్లు ఎక్కడ?" అని పలికినాడు. అట్టి వ్యగ్రములైన శ్రీకృష్ణుని పలుకులు మిమ్ము రక్షించుగాక!

## 17. జడత

మూలం : జడతానామ- సర్వకార్యాప్రతిపత్తిః. ఇష్టానిష్టశ్రవణదర్శన
వ్యాధ్యాదిభిః విభావైః సముత్పద్యతే. తామభినయే
దకథనావిభాషణ తూష్ణీంభా వాప్రతి
భాఽనిమేషనిరీక్షణ పరవశత్వాదిభిః అనుభావైః.
అత్రార్యా భవతి -
ఇష్టం వాఽనిష్టం వా సుఖదుఃఖేవా నవేత్తి యో మోహాత్ ।
తూష్ణీకః పరవశగో భవతి స జడసంజ్ఞితః పురుషః ॥
-(నా.శా. VII-66)

అర్థం : జడతానామ, సర్వకార్య-అప్రతిపత్తిః = జడత అనేది, ఏ కార్యాన్ని చేయకుండటం (= సర్వకార్యాలను విడనాడటం).

ఇష్ట-అనిష్ట శ్రవణ-దర్శన, వ్యాధి-ఆదిభిః విభావైః, సముత్పద్యతే = ఇష్టములైన వానిని లేదా అనిష్టములైన వానిని చూడటం లేదా వినటం, వ్యాధి మున్నగు వానివల్ల జడత సంభవిస్తుంది. అకథన, అవిభాషణ, తూష్ణీం భావ, అప్రతిభా, అనిమేష నిరీక్షణ, పరవశత్వ-ఆదిభిః, అనుభావైః, తాం,

అభినయేత్ = బదులాడకుండటం, తడబాటుగా చెప్పటం, మిన్నకుండటం, ఏమీ పాలుపోనట్లుండటం, రెప్పవాల్చక చూడటం, పరవశత్వం మున్నగు అనుభావాలతో, దానిని అభినయించాలి.

అత్ర-ఆర్యాభవతి = ఇచ్చట ఒక ఆర్య కలదు.

యః, ఇష్టం వా, అనిష్టం వా, సుఖ-దుఃఖే వా, మోహాత్ న వేత్తి = ఎవడు, ఇష్టాన్ని కాని, అనిష్టాన్ని కాని, సుఖాన్ని కాని, దుఃఖాన్ని కాని, మోహం వల్ల తెలిసికొనలేక; తూష్ణీకః, పరవశగః, భవతి, సః, పురుషః, జడ సంజ్ఞితః = తూష్ణీంభావంతో, పరవశుడై, ఉంటాడో, ఆ పురుషుడు జడుడు అనబడుతాడు.

తాత్పర్యం : సర్వకార్యాప్రతిపత్తి (= కర్తవ్య-అకర్తవ్యజ్ఞానరాహిత్యం) జడత అవుతుంది.

విభావాలు : ఇష్టదర్శనం లేదా శ్రవణం, అనిష్టదర్శనంలేదా శ్రవణం, వ్యాధి మున్నగునవి.

అనుభావాలు : అకథనం, అవిభాషణం, తూష్ణీంభావం, అప్రతిభ, అనిమేషనిరీక్షణ, పరవశత్వం మున్నగునవి.

ఇచ్చట ఒక ఆర్యకలదు :

ఇష్టం లేదా అనిష్టం, సుఖం లేదా దుఃఖం—మోహంతో వీటిని ఎవడు గుర్తించడో, తూష్ణీంభావంతో, పరవశుడై ఉంటాడో, అతడు జడుడు.

టీక : అప్రతిపత్తి యే జడత లేదా జాడ్యం అని ఇంచుమించుగా అందరూ చెప్పినారు. విరహాన్ని కూడా విభావంగా, వినిపించకపోవటం అనుభావంగా చెప్పినాడు సింగభూపాలుడు.

"సకలవ్యవహార-అక్షమజ్ఞానవత్త్వం జడత" అని భానుదత్తుడు. ఇట్లా చెప్పటం వల్ల మూర్ఛా-అపస్మార-నిద్రా-స్వప్నములందు అతివ్యాప్తి ఉండదు; కారణం వీనిలో జ్ఞానం ఉండదు కాబట్టి. ఆలస్య-భీతి-త్రాసములందు కూడా అతివ్యాప్తి ఉండదు; కారణం అచ్చట కతిపయవ్యవహారజ్ఞానం ఉంటుంది. కావున, "మోహానికి ముందుకాని, తరువాత కాని జడత సంభవిస్తుంది" అని సంగీతరత్నాకరకర్త.

ఇష్టశ్రుతి, ప్రియదర్శన, అప్రియశ్రవణ, అనిష్టదర్శన, వియోగాలవలని జడతకు ఉదాహరణ లొసంగినాడు సింగభూపాలుడు.

ఉదా : ప్రియదర్శనంవలని జడత :

ఏష్యతి స చ ప్రోషితోఽహం చ
కుప్యేయం సోఽప్యను నేష్యతి ।
ఇతి చింతయంతీ వధూ ర్దృష్ట్వా
ప్రియం న కి మపి సంస్మరతి ॥

-(ర.సు.పుట. 370; గా.స.శతి-I-17)

— "దేశాంతరగతుడయిన ప్రియుడు రాగలడు, అపుడు నేను కోపిస్తాను, అతడునన్ను ప్రార్థింపగలడు" అని నాయిక ఆలోచించుకొంటూ, నాయకుని చూచినంతనే అసంగతియే మరచిపోయింది! (ప్రియుని చూడటం వల్ల ఆమెలో జాడ్యం కలిగింది).

అనిష్టదర్శనం వలని జడత :

శ్వశురేణ దహ్యమానే గృహనికటభవే నికుంజపుంజే ।
స్నుషా న శృణోతి శూన్యా బహుశః కథితమపి శ్వశ్ర్వా ॥

— తమయింటి సమీపాన గల పొదల గుంపును మామగారు కాల్చివేస్తూ ఉండగా చూచి, కోడలు- అత్తగారు ఎన్నో విషయాలను గూర్చి వివరిస్తూ ఉన్నప్పటికీ, శూన్యహృదయయై వినకున్నది. (ఆమె పరకీయ, కాల్చి వేయబడిన పొదలగుంపు అంతకు ముందు ఆమె రహస్య వ్యాపారానికి అనువుగా ఉండేది).

## 18. గర్వం

మూలం : గర్వంనామ— ఐశ్వర్య-కుల-రూప-యౌవన-విద్యా-బల-
ధన లాభాదిభిః విభావైః సముత్పద్యతే. తస్యాసూయావజ్ఞా-
ధర్ష-ణానుత్తరదా-నాసంభాష-ణాంగావలోకన
విభ్ర-మాపహాసన-వాక్పారుష్య-గురువ్యతిక్రమ
ణాధిక్షేప వచన-విచ్ఛేదాదిభిః అనుభావైః అభినయః
ప్రయోక్తవ్యః.
అత్రార్యాభవతి—
విద్యావాప్తే రూపా దైశ్వర్యా దథ ధనాగమా ద్వాపి ।
గర్వః ఖలు నీచానాం దృష్ట్యంగ విచారణైః కార్యః ॥

-(నా.శా.VII-67)

అర్థం : గర్వంనామ=గర్వం అనేది; ఐశ్వర్య-కుల-రూప-యౌవన-విద్యా-బల-ధనలాభ-ఆదిభిః, విభావైః, సముత్పద్యతే=ఐశ్వర్యం, కులం (=అభిజనం=ఉచ్చకులం), రూపం, యౌవనం, విద్య, బలం, ధనలాభం మున్నగు విభావాలవల్ల జనిస్తుంది.

అసూయ-అవజ్ఞా-ఘర్షణ-అనుత్తరదాన-అసంభాషణ- అంగావలోకన-విభ్రమ-అవహసన-వాక్పారుష్య- గురువ్యతిక్రమణ-అధిక్షేపవచన-విచ్ఛేద-ఆదిభిః, అనుభావైః, తస్య, అభినయః, ప్రయోక్తవ్యః=అసూయపడటం, అవమానించటం, ధిక్కరించటం (పాఠాంతరం-ఆధర్షణ=పీడించటం), సమాధానమీయకుండటం, మాటాడకపోవటం, తనశరీరాన్ని లేదా భుజాలను చూసుకొనటం, ఒళ్ళువిరుచుకొని తిరగటం, వెగటాళిగా నవ్వటం, పరుషంగా మాటాడటం, పెద్దలను లెక్కచేయకపోవటం, ఆక్షేపించటం, మధ్యలోమాటను త్రుంచివేయటం, మున్నగు, అనుభావాలతో, దాని, అభినయంచేయాలి.

అత్ర-ఆర్యా, భవతి=ఇచ్చట ఒక ఆర్యకలదు :

విద్యా-అవాప్తే, రూపాత్-ఐశ్వర్యాత్ (అథవా), ధన-ఆగమాత్ (వాపి), నీచానాం, గర్వః(ఖలు) =విద్యాప్రాప్తి, రూపం, ఐశ్వర్యం, (ఆకస్మిక) ధనప్రాప్తి, మున్నగువాటిలో, నీచప్రకృతుల యందు, గర్వం, కలుగుతుంది. దృష్టి-అంగవిచాలనైః, కార్యః=దృష్టులు, అవయవచాలనములు ద్వారా, (గర్వాభినయం), చేయాలి.

తాత్పర్యం : విభావాలు : ఐశ్వర్యం, కులం, రూపం, యౌవనం, విద్య, బలం, ధనలాభం మున్నగునవి.

అనుభావాలు : అసూయ, అవజ్ఞ, ఘర్షణ లేదా ఆధర్షణ, అనుత్తరదానం, అసంభాషణం, సవిలాసంగా అంగావలోకనం, విభ్రమం, అవహసనం, వాక్పారుష్యం, గురువ్యతిక్రమణం, అధిక్షేపవచనం, విచ్ఛేదం మున్నగునవి.

ఇచ్చట ఒక ఆర్యకలదు :

విద్యాప్రాప్తి, రూపం, ఐశ్వర్యం, ధనప్రాప్తి— వీటివల్ల నీచప్రకృతులలో గర్వం జనిస్తుంది. దృష్టుల, అవయవ విచాలనముల ద్వారా గర్వాన్ని ప్రకటించాలి.

టీక : "ఉచ్చకులాదులవల్ల కలిగే మదం గర్వం" అని ధనంజయుడు. 'తన గొప్ప తనాన్ని భావించటం గర్వం' అని శారదాతనయుడు. "బలం

మున్నగువాని వల్ల జనించేది, ఆత్మోత్కర్షను ప్రకటించుకొనేది గర్వం" అని విద్యానాథుడు. "ఐశ్వర్యాది ఇష్టలాభాదులవల్ల ఇతరులను అవజ్ఞచేయటం గర్వం" అని చెప్పి, ఐశ్వర్య-రూప-తారుణ్య-కుల-విద్యా-బల-ఇష్టప్రాప్తులకు ఉదాహరణ లిచ్చినాడు సింగభూపాలుడు. "కుల-రూపాదులవల్ల నీచులయందు గర్వం మరల మరల తల ఎత్తుతుంది... ఉత్తములయందు విద్యుత్తువలె క్షణికం మాత్రమే. ఇంక యోషితలయందు బాహుల్యంగా (=అనేక విధాలుగా) ఉంటుంది ఉదగ్రీవం, అపేక్షణం... విభ్రమం... గురుజన [illegible] మున్నగునవి అనుభావాలు... హర్ష-అనురాగ-మద-గర్వజమైన విభ్రమం (=restlessness) యోషితలలో వాక్-అంగ-సాత్త్విక-ఆహార్య-క్రియా వ్యత్యాసాలవల్ల సంభవిస్తుంది" అని సం.ర. "అందరికంటె తాను అధికమని తలంచటం లేదా అందరూ తనకంటె అధములు అని తలంచటం గర్వం" అని భానుదత్తుడు.

ఉదా : ఐశ్వర్యంవలన ఆజ్ఞాసిద్ధి; దానివలన గర్వం :
రాహో! తర్జయ భాస్కరం వరుణ హే! నిర్వాప్యతాం పావకః
సర్వే వారిముచ స్సత్యః కురుత గ్రీష్మస్య దర్పచ్ఛిదామ్ ।
ప్రాలేయాచల! చంద్ర! దుగ్ధజలధే! హేమంత! మందాకిని!
ద్రాగ్దేవస్య గృహానుపేత; భవతాం సేవాక్షణో వర్తతే ॥
-(బాలరామాయణం-V)

— ఓ రాహూ! సూర్యుని బెదరింపుము. ఓవరుణా! అగ్నిని చల్లార్చుము. ఓ సమస్తమేఘములార! మీరొక్కటిగా చేరి గ్రీష్మం యొక్క గర్వం నశింపుజేయండి. హిమాలయ, చంద్ర, క్షీరసాగర, హేమంత, గంగానదులారా! మీరు ముందుగా ప్రభువు (=రావణుని) భవనమునకు రండు; ఇది మీరాతనిని సేవించే సమయం!

## 19. విషాదం

మూలం : విషాదోనామ—
కార్యానిస్తరణ దైవవ్యాపత్తి సముత్థః. తమభి
నయేత్ సహాయాన్వేషణ ఉపాయచింత నోత్సాహ
విఘాత వైమనస్య నిఃశ్వసితాదిభిః అనుభావైః
ఉత్తమమధ్యమానాం. అధమానాంతు వివరి
ధావ నావలోకన ముఖశోషణ సృక్వపరిలేహన నిద్రా
నిఃశ్వసిత ధ్యానాదిభిః అనుభావైః.

అత్రార్యా శ్లోకా--
కార్యానిస్తరణాద్వా చౌర్యాభిగ్రహణ రాజదోషాద్వా ।
దైవా దర్థవిపత్తే ర్భవతి విషాదః సదా పుంసాం ॥
వైచిత్త్ర్యోపాయ చింతాభ్యాం కార్య ఉత్తమమధ్యయోః ।
నిద్రా నిఃశ్వసిత ధ్యానై రధమానాం తు యోజయేత్ ॥
-(నా.శా.VII-68, 69)

అర్థం: విషాదః-నామ=విషాదం అనేది;

కార్య-అనిస్తరణ, దైవవ్యాపత్తి సముత్థః=తలపెట్టిన కార్యం పూర్తి చేయ లేకపోవటం, దైవికమైన ఆపద— వీటివల్ల విషాదం జనిస్తుంది.

సహాయ-అన్వేషణ, ఉపాయచింతన, ఉత్సాహవిఘాత, వైమనస్య, నిఃశ్వసిత-ఆదిభిః, అనుభావైః, ఉత్తమ-మధ్యమానాం, తం, అభిన యేత్=సాహాయ్యం అన్వేషించటం, ఉపాయం ఆలోచించటం, ఉత్సాహానికి విఘాతం కలగటం, విమనస్కత, నిఃశ్వాసాలు మున్నగు అనుభావాలచేత, ఉత్తమ- మధ్యమ ప్రకృతులు, దానిని (=విషాదాన్ని) అభినయించాలి.

అధమానాం (తు), విపరిధావన, అవలోకన, ముఖశోషణ, సృక్వపరి లేహన, నిద్రా, నిఃశ్వసిత, ధ్యాన- ఆదిభిః, అనుభావైః, (తం, అభినయేత్) =అధములు - పరుగెత్తిపోవటం, దిక్కులు చూడటం, నోరు ఎండిపోవటం, నాలుకతో నోటిచివరలను నాకటం, నిద్ర, నిఃశ్వాసాలు, ధ్యానంమున్నగు అను భావాలచేత, (విషాదాన్ని అభినయించాలి).

అత్ర-ఆర్యా-శ్లోకా=ఇచ్చట ఒక ఆర్య, ఒకశ్లోకం (కలవు) :

కార్య-అనిస్తరణాత్(వా), చౌర్య-అభిగ్రహణ-రాజదోషాత్(వా), దైవాత్ అర్థ విపత్తేః, పుంసాం, సదా, విషాదః, భవతి=కార్యానిస్తరణం, చౌర్య గ్రహణం, రాజదోషం, దైవకృతమైన అర్థవిపత్తి- వీటివల్ల, మనుష్యులలో, ఎల్లప్పుడు, విషాదం, కలుగుతుంది.

వైచిత్ర్య-ఉపాయ చింతనాభ్యాం, ఉత్తమ-మధ్యమయోః, కార్యం=వివి ధోపాయలను చింతించటం- ఇది ఉత్తమ మధ్యమ ప్రకృతులయందలి అను భావం. నిద్రా-నిఃశ్వసిత, ధ్యానైః, అధమానాం(తు), యోజయేత్=నిద్ర, నిఃశ్వాసాలు, ధ్యానం-ఇవి అధములవట్ల ప్రయోజ్యాలు.

తాత్పర్యం : విభావాలు : కార్యానిస్తరణం, దైవవ్యాపత్తి.

అనుభావాలు : ఉత్తమ-అధమప్రకృతులు : సహాయాన్వేషణం, ఉపాయ చింతనం, ఉత్సాహవిఘాతం, వైమనస్యం, నిఃశ్వాసాలు మున్నగునవి.

అధమప్రకృతులు : వివరిధావనం, అవలోకనం, ముఖశోషణం, సృక్కపరి లేహనం, నిద్ర, నిఃశ్వాసాలు, ధ్యానం మున్నగునవి.

ఇచ్చట ఒక ఆర్య, ఒక శ్లోకం ఉన్నవి : కార్యానిస్తరణం, దొంగతనం పట్టుబడటం, రాజదోషం, దైవకృతమైన అర్థవైపరీత్యం.

అనుభావాలు : విభిన్నములైన ఉపాయ చింతనములు— ఉత్తమ-మధ్యమ ప్రకృతులు; నిద్ర నిఃశ్వసితం, ధ్యానం-అధములు.

టీక : "ఆయాకారణాలవల్ల సత్త్వసంక్షయం విషాదం" అని ధనంజయుడు. "ఆయా కారణాలవల్ల కలిగే అనుతాపం విషాదం" అని సింగభూపాలుడు. "ఇష్ట సంశయం లేదా అనిష్టజిజ్ఞాస విషాదం. 'ఇష్ట' పదంచేత జీవన-ధన-యశ-... పుత్ర-కలత్రాదులు గ్రాహ్యములు" అని భానుదత్తుడు.

ప్రారబ్ధకార్య-అనిర్వహణం, ఇష్ట-అనాప్తి, విపత్తి, అపరాధపరిజ్ఞానం వలని విషాదాలకు సింగభూపాలుడు ఉదాహరణ లిచ్చినాడు.

ఉదా : అపరాధ పరిజ్ఞానంవలని విషాదం :

హా! తాతేతి క్రందిత మాకర్ణ్య విషణ్ణః
తస్యాన్విష్యన్ వేతసగూఢం ప్రభవం సః ।
శల్యప్రోతం ప్రేక్ష్య సకుంభం మునిపుత్రం
తాపా దంతశ్శల్య ఇవాసీత్ క్షితిపోఽపి ॥

-(ర.వం.IX-75)

— 'హా! తండ్రీ!' అనే అఱుపును విని, విషణ్ణుడయిన దశరథుడు, వెద కుతూపోయి, కుండను పట్టుకొని బాణం గ్రుచ్చుకొని ఉన్న మునిపుత్రునిచూచి, తన మనస్సునకు శల్యం గ్రుచ్చుకొన్నట్లు తాపంచేత బాధపడినాడు.

## 20. ఔత్సుక్యం

మూలం : ఔత్సుక్యంనామ—

ఇష్టజన వియోగానుస్మరణోద్యానదర్శనాదిభిః
విభావైః సముత్పద్యతే. తస్య దీర్ఘనిఃశ్వసి

తాధోముఖవిచింతన నిద్రా తంద్రీ శయనాభి
లాషాదిభిః అనుభావై రభినయః ప్రయోక్తవ్యః.
అత్రార్యాభవతి—
ఇష్టజనస్య వియోగా దౌత్సుక్యం జాయతే హ్యనుస్మృత్యా ।
చింతా నిద్రా తంద్రీ గాత్రగురుత్వై రనభియోఽస్య ॥
-(నా.శా.VII-70)

అర్థం : ఔత్సుక్యంనామ, ఇష్టజన వియోగ-అనుస్మరణ, ఉద్యాన దర్శన-ఆదిభిః, విభావైః, సముత్పద్యతే=ఔత్సుక్యం అనేది, ఇష్టజనులయొక్క వియోగం, వారిని స్మరించటం, ఉద్యానదర్శనం మున్నగు, విభావాలవల్ల జనిస్తుంది.

దీర్ఘనిఃశ్వసిత, అధోముఖవిచింతన, నిద్రా, తంద్రీ, శయనాభిలాష-ఆదిభిః, అనుభావైః, తస్య, అభినయః, ప్రయోక్తవ్యః=దీర్ఘంగా నిఃశ్వసించటం, తలవంచి ఆలోచించటం, నిద్ర, సోమరితనం, శయనాభిలాష, మున్నగు అనుభావాలచేత, దానియొక్క, అభినయం, చేయాలి.

అత్ర-ఆర్యా, భవతి=ఇచ్చట ఒక ఆర్యకలదు: ఇష్టజనస్యవియోగాత్, అనుస్మృత్యా, ఔత్సుక్యం, జాయతే(హి)=ఇష్టజనుల వియోగం, వారిని స్మరించటం— వీటివల్ల ఔత్సుక్యం కలుగుతుంది. చింతా, నిద్రా-తంద్రీ-గాత్రగురుత్వైః, అస్య, అభినయః=చింత, నిద్ర, తంద్రి, శరీరం బరువుగా ఉండటం— వీటిచేత, దీనియొక్క, అభినయం (చేయాలి).

తాత్పర్యం : విభావాలు : ఇష్టజనవియోగం, వారినిస్మరించటం, ఉద్యాన దర్శనం మున్నగునవి.

అనుభావాలు : దీర్ఘనిఃశ్వాసాలు, అధోముఖవిచింతనం, నిద్ర, తంద్రి, శయనాభిలాష మున్నగునవి. ఇచ్చట ఒక ఆర్య కలదు :

విభావాలు : ఇష్టజనవియోగం, వారిని స్మరించటం.

అనుభావాలు : చింత, నిద్ర, తంద్రి, గాత్రగురుత్వం.

టీక : "రమణీయ వస్తువునందలి అభిలాష, అనురాగాదులు— వీటివల్ల కలిగే సంభ్రమంవల్ల కాలాక్షమత్వం (=ఒక క్షణం పాటి విలంబం కూడా సహించలేకపోవటం) ఔత్సుక్యం (=ఉత్సుకత)" అని ధనంజయుడు.

"ఇష్టవస్తు వియోగం, ఇష్ట వస్తుదర్శనం, రమ్యవస్తు దిదృక్షమున్నగు వానివల్ల కాలాక్షమత్వం ఔత్సుక్యం (=ఒక విధమగు తహతహ)" అని సింగభూపాలుడు.

"కాలాసహిష్ణుత్వం లేదా సకలేంద్రియాలను ఏకంచేసి క్రియారంభం చేయుటం ఔత్సుక్యం" అని భానుదత్తుడు.

ఇష్టవస్తువియోగం-ఇష్టవస్తుదర్శన-రమ్యదిదృక్షలవల్ల కలిగే ఔత్సుక్యాలకు ఉదాహరణలిచ్చినాడు సింగభూపాలుడు.

ఉదా : ఇష్టవస్తు దర్శనంవలని ఔత్సుక్యం :
"అయాతే దయితే...." -(అమరుకావ్యం-86)

## 21. నిద్ర

మూలం : నిద్రానామ-దౌర్బల్య-శ్రమ-క్లమ-మదాలస్య-చింతాఽత్యాహార-స్వభావాదిభిః విభావైః సముత్పద్యతే.
తామభినయేత్ వదనగౌరవ శరీరావలోకన
నేత్రఘూర్ణన గాత్రవిజృంభణ మాంద్యోచ్ఛ్వసిత
సన్నగాత్ర తాఽక్షినిమీల నాదిభిః అనుభావైః.
ఆలస్యా ద్దౌర్బల్యా త్క్లమా చ్ఛ్రమా చ్చింతనా త్స్వభావాచ్చ ।
రాత్రౌ జాగరణాదపి నిద్రా పురుషస్య సంభవతి ॥
తాం ముఖగౌరవ గాత్రప్రతిలోలన నయనమీలన జడత్వైః ।
జృంభణ గాత్రవిమర్దై రనుభావై రభినయే త్ప్రాజ్ఞః ॥
-(నా.శా.VII-71, 72)

అర్థం : నిద్రానామ, దౌర్బల్య, శ్రమ, క్లమ, మద, ఆలస్య, చింతా, అత్యాహార, స్వభావ- ఆదిభిః, విభావైః, సముత్పద్యతే=నిద్ర అనేది - దుర్బలత్వం, శ్రమ, క్లేశం, మదం, ఆలస్యం, చింత, అత్యాహారం, స్వభావం—మున్నగు విభావాలవల్ల వస్తుంది. వదనగౌరవ, శరీర-అవలోకన, నేత్రఘూర్ణన, గాత్రవిజృంభణ, మాంద్య, ఉచ్ఛ్వసిత, సన్నగాత్రత, అక్షినిమీలన-ఆదిభిః, అనుభావైః, తామ్, అభినయేత్=ముఖం బరువెక్కటం, శరీరంచూసుకొనటం, కనులు మూతలుపడటం, ఒడలు విరచుకొనటం, మాంద్యం, ఉచ్ఛ్వాసాలు, గాత్రశైథిల్యం, కనులు మూసుకొనటం మున్నగు అనుభావాలతో, దానిని, అభినయించాలి.

అత్ర-ఆర్యే, భవతః=ఇచ్చట రెండు ఆర్యలు కలవు. ఆలస్యాత్, దౌర్బల్యాత్, క్లమాత్, శ్రమాత్, చింతనాత్, స్వభావాత్(చ), రాత్రౌ జాగరణాత్(అపి), పురుషస్య, నిద్రా, సంభవతి=ఆలస్యం, దుర్బలత్వం, క్లమం, శ్రమ, చింతన, స్వభావం, రాత్రినిద్రలేకుండటం— వీటివల్ల, పురుషులకు, నిద్రవస్తుంది. ముఖగౌరవ, గాత్రపరిలోడన, నయనమీలన జడతైః, జృంభణ-గాత్రవిమర్దైః, అనుభావైః, ప్రాజ్ఞః, తాం, అభినయేత్=ముఖం బరువెక్కటం, శరీరం తిరుగుతున్నట్లు ఉండటం, కనులు మూతలు పడటం, జడత, ఆవులింతలు, ఒడలునొక్కుకొనటం— ఈ అనుభావాలతో, ప్రాజ్ఞులు, దానిని, అభినయించాలి.

తాత్పర్యం : విభావాలు : దౌర్బల్యం, శ్రమ, క్లమం, మదం, ఆలస్యం, చింత, అత్యాహారం, స్వభావం మున్నగునవి.

అనుభావాలు : వదనగౌరవం, శరీరావలోకనం, నేత్రఘూర్ణనం, గాత్ర విజృంభణం, మాంద్యం, ఉచ్ఛ్వాసాలు, సన్నగాత్రత, అక్షినిమీలనం మున్నగునవి.

ఇచ్చట రెండు ఆర్యలు కలవు.

విభావాలు : ఆలస్యం, దౌర్బల్యం, క్లమం, శ్రమ, చింతనం, స్వభావం, రాత్రిజాగరణ.

అనుభావాలు : ముఖగౌరవం, గాత్రపరిలోడవం, నయనమీలనం, జడత, జృంభణం, గాత్రవిమర్దనం.

టీక : "చింతాదులవల్ల మనస్సంమీలనం (=సుషుమ్నానాడివిలయంకావటం) నిద్ర" అని ధనంజయుడు. "అన్ని ఇంద్రియాలు ఒకేసారి నిమీలనంకావటం నిద్ర" అని శారదాతనయుడు. వ్యాయామ-నిశ్చింతలను కూడా విభావాలు గానూ, శరీరాన్ని ముడుచుకొనటాన్ని కూడా అనుభావంగానూ పేర్కొని, మద-స్వభావ-వ్యాయామ-నిశ్చింతల-వల్లవచ్చే నిద్రకు ఉదాహరణ లిచ్చినాడు సింగభూపాలుడు. "ఇతర ఇంద్రియాలను వదలి, మనస్సు చర్మాన్ని అంటిపెట్టుకొన్నప్పుడు నిద్రవస్తుంది. సుప్తమునకు ఈ నిద్రకారణం కాబట్టి, దీనిని నిద్రకంటె ముందుగా భరతముని పేర్కొన్నాడు; స్వప్నవాహక నాడియందు మనస్సు చరించేటప్పుడే స్వప్నాదులు సంభవిస్తాయి" అని భానుదత్తుడు.

ఉదా : శ్రమవలని నిద్ర :

అలసలలిత ముగ్ధా న్యధ్వసంపాత ఖేదాత్
ప్రశిథిలపరిరంభై ర్దత్త సంవాహనాని ।
పరిమృదితమృణాలీదుర్బలా న్యంగకాని
త్వ మురసి మమ కృత్వాయత్ర నిద్రా మవాప్తా ॥
-(ఉ.రా.చ.I-17)

— దారిలో నడవటంవలని బడలికవల్ల అలసములై, లలిత ముగ్ధము లవుతూ, నలిగిన తామర తూండ్లవలె దుర్బలములై ఉన్న నీ అవయవాలను నావక్షము నందు ఉంచినావు. అప్పుడు నేను వదులుగా వాటిని కౌగిలించి, సంవాహన మొనరించి కొంత నొప్పి తగ్గించాను. అప్పుడు నీవాస్థితిలోనే నిద్రించావు (శ్రీరాముడు సీతతో).

## 22. అపస్మారం

మూలం : అపస్మారం నామ-దేవ-యక్ష-నాగ-బ్రహ్మరాక్షస-భూత-
ప్రేత-పిశాచ గ్రహణానుస్మర ణోచ్ఛిష్ట-శూన్యాగారసేవ
నాశుచి కాలాంతరాపరిపతన వ్యాధ్యాదిభిః
విభావైః సముత్పద్యతే. తస్య స్ఫురిత
నిఃశ్వసి తోత్కంపిత ధావన పతన స్వేద
స్తంభన వదనఫేన జిహ్వాపరిలేహనాదిభిః
అనుభావైః అభినయః ప్రయోక్తవ్యః.
అత్రార్యే భవతః—
భూతపిశాచ గ్రహణానుస్మర ణోచ్ఛిష్ట శూన్య గృహగమనాత్ ।
కాలాంతరాతిపాతా దశుచేశ్చ భవత్యపస్మారః ॥
సహసా భూమౌ పతనం ప్రవేపనం వదనఫేనమోక్షశ్చ ।
నిఃసంజ్ఞ స్యోత్థానం రూపాణ్యేతాన్యపస్మారే ॥
-(నా.శా.VII-73, 74)

అర్థం : అపస్మారః నామ-దేవ-యక్ష-నాగ-బ్రహ్మరాక్షస-భూత-ప్రేత-పిశాచగ్రహణ, అనుస్మరణ, ఉచ్ఛిష్ట-శూన్యాగార సేవన, అశుచి, కాలాంతరాపరిపతన, వ్యాధి-ఆదిభిః విభావైః, సముత్పద్యతే=అపస్మారం (=అపస్మృతి) అనేది, దేవ-యక్ష-నాగ-బ్రహ్మరాక్షస-భూత- ప్రేత-పిశాచాలు ఆవే

శించటం, అటువంటి వానిని గూర్చి స్మరించటం, ఎంగిలితినటం, శూన్య భవనంలో ఉండటం, అశుచిత్వం, నిద్రా-భోజనాదులందు కాలనియమం పాటించక పోవటం, ధాతువైషమ్యం (=వాత-పిత్త-కఫాలు సరిగా లేకపో వటం), వ్యాధి మున్నగు విభావాలవల్ల కలుగుతుంది.

స్ఫురిత, నిఃశ్వసిత, ఉత్కంపిత, ధావన, పతన, స్వేద, స్తంభన, వద నఫేన, జిహ్వాపరిలేహన-ఆదిభిః, అనుభావైః, తస్య, అభినయః, ప్రయో క్తవ్యః=అదరటం, నిఃశ్వాసం, వణకటం, పరుగెత్తటం, ఆకస్మికంగా పడిపో వటం, స్వేదం, స్తంభం, నురుగులుక్రక్కటం, నాలుకతో పెదవుల మూలలు తడుపుకొనటం, మున్నగు, అనుభావాలతో, దానిని, అభినయించాలి.

అత్ర-ఆర్యే, భవతః=ఇచ్చట, రెండు ఆర్యలు, కలవు. భూత- పిశాచ గ్రహణ, అనుస్మరణ, ఉచ్ఛిష్ట, శూన్యగృహగమనాత్, కాలాంతరాతిపాతాత్. అశుచేః(చ), అపస్మారః, భవతి=భూతాలు లేదా పిశాచాలు ఆవేశిం చటం, అటువంటి వానిని గూర్చి స్మరించటం, ఉచ్ఛిష్టవస్తువును తినటం, శూన్యగృహగమనం, కాలనియమం పాటించకపోవటం, అశుచిత్వం— వీటివల్ల అపస్మారం, కలుగుతుంది. సహసాభూమౌపతనం, ప్రవేపనం, వదనఫేన మోక్షః(చ), నిస్సంజ్ఞయా-ఉత్థానం, అపస్మారే, ఏతాని, రూపాణి=ఉ న్నపాటున భూమిమీదపడటం, బాగా వణకటం, నోటినుండి నురుగు కారటం, తెలివిలేకుండగనే లేచిపోవటం— ఇవి అపస్మారమందలి రూపాలు (=అనుభావాలు).

తాత్పర్యం : విభావాలు : దేవ-యక్ష-నాగ-బ్రహ్మరాక్షస-భూత-ప్రేత-పి శాచాదులు ఆవేశించటం, అటువంటి వాటిని గూర్చి స్మరించటం, ఉచ్ఛిష్టం తినటం, శూన్యాగారమందు నివసించటం, అశుచిత్వం, కాలాంతర- పరివ ర్తనం, వ్యాధి మున్నగునవి.

అనుభావాలు : స్ఫురితాలు, నిఃశ్వసితాలు, ఉత్కంపితాలు, ధావనం, పతనం, స్వేదం, స్తంభం, వదనఫేనం, జిహ్వాపరిలేహనం మున్నగునవి.

ఇచ్చట రెండు ఆర్యలు కలవు :

విభావాలు : భూత-పిశాచగ్రహణం, తదనుస్మరణం, ఉచ్ఛిష్ట సేవనం, శూన్యగృహగమనం, కాలాంతరాతిపాతం, అశుచి.

అనుభావాలు : ఆకస్మికంగా భూమిమీదపడటం, ప్రవేపనం, వదనఫేన మోక్షణం, నిస్సంజ్ఞగా లేచిపోవటం.

టీక : దుఃఖావేశాన్ని మోహ-భయాదులను కూడా విభావంగా చెప్పినారు ధనంజయ, విద్యానాథ, భానుదత్తులు.

"భూతావేశాదులవల్ల చిత్తక్షోభ కలగటం అపస్మారం" అంటూ భ్రమణం, నేత్రవిక్రియ; పెదవికొరకటం, జబ్బలను చరచటం, లాల(=చొంగ)– వీటిని కూడా అనుభావాలుగా చెప్పినాడు సింగభూపాలుడు.

మూర్ఛ ఇందులో అంతర్భవిస్తుందని భానుదత్తుడు.

## 23. సుప్తం

మూలం : సుప్తంనామ-నిద్రాభిభవః. ఇంద్రియవిషయోపగమన
మోహన క్షితితలశయన ప్రసారణానుకర్షణాదిభిః విభావైః
సముత్పద్యతే. నిద్రాసముత్థమ్, తదుచ్ఛ్వసిత
సన్నగాత్రాక్షినిమీలన సర్వేంద్రియ సమ్మోహ
నోత్స్వప్నాయితాదిభిః అనుభావైః అభినయేత్.
అత్రార్యే భవతః–
నిద్రాభిభవేంద్రియోపరమణ మోహాన్యై ర్భవే త్సుప్తమ్ ।
అక్షినిమీలోచ్ఛ్వసనైః స్వప్నాయిత జల్పితైః కార్యః ॥
సోచ్ఛ్వాసై ర్నిః శ్వాసై ర్మందాక్షినిమీలనేన విశ్చేష్టః ।
సర్వేంద్రియ సంమోహో త్సుప్తం స్వప్నైశ్చ యుంజీత ॥
-(నా.శా.VII-75, 76)

అర్థం : సుప్తం నామ, నిద్రా-అభిభవః=సుప్తం (=సుప్తి) అనేది నిద్రవల్ల సంభవిస్తుంది.

ఇంద్రియ విషయ-ఉపగమన, మోహన, క్షితితలశయన, ప్రసారణ-అనుకర్షణ-ఆదిభిః, విభావైః, సముత్పద్యతే=ఇంద్రియవిషయాలను అనుభవించటం, మోహం, నేలమీద శయనించటం, ప్రసారణం, అనుకర్షణం (=లాగబడటం) మున్నగు, విభావాలవల్ల, (సుప్తం) సంభవిస్తుంది.

ఉచ్ఛ్వసిత, సన్నగాత్ర, అక్షినిమీలన, సర్వేంద్రియ సమ్మోహన, ఉత్స్వప్నాయిత-ఆదిభిః, అనుభావైః, నిద్రాసముత్థం, తత్, అభినయేత్=ఉచ్ఛ్వాసాలు, అంగశైథిల్యం, కనులమూతలు, సర్వేంద్రియాలు సమ్మోహం చెందటం, కలవరింతలు మున్నగు, అనుభావాలచేత, నిద్రాసముత్థమైన దానిని, అభినయించాలి.

అత్ర-ఆర్యేభవతః=ఇచ్చట, రెండు ఆర్యలు కలవు:

నిద్ర-అభిభవ-ఇంద్రియ-ఉపరమణ-మోహైః, సుప్తం, భవేత్=నిద్రకు లోనుకావటం, ఇంద్రియసంతృప్తి, మోహనం— వీటివల్ల, సుప్తం, కలుగుతుంది; అక్షినిమీలన, ఉచ్ఛ్వసనైః, స్వప్నాయిత-జల్పితైః, కార్యః=కనులు మూసికొనటం, ఉచ్ఛ్వసనాలు, కలవరింతలు, ప్రలాపాలు - వీటితో సుప్తాన్ని నిరూపించాలి.

స-ఉచ్ఛ్వాసైః, నిఃశ్వాసైః, మంద-అక్షినిమీలనేన, నిశ్చేష్టః, సర్వేంద్రియ సమ్మోహాత్, స్వప్నైః(చ), సుప్తం, యుంజీత=ఉచ్ఛ్వాసాలతో, నిఃశ్వాసాలతో, మెల్లిగా కనులు మూసికొని ఉండటంతో, నిశ్చేష్టతతో, సర్వేంద్రియ సమ్మోహంతో, స్వప్నంతో, సుప్తాన్ని నిరూపించాలి.

తాత్పర్యం : నిద్రవల్ల సుప్తం సంభవిస్తుంది.

విభావాలు : ఇంద్రియ విషయోపగమనం, మోహనం, క్షితితలశయన-ప్రసారణ-అనుకర్షణలు.

అనుభావాలు : ఉచ్ఛ్వసితాలు, సన్నగాత్రత, అక్షినిమీలనం, సర్వేంద్రియ సంమోహనం, స్వప్నాయితం మున్నగునవి.

ఇచ్చట రెండు ఆర్యలు కలవు:

విభావాలు : నిద్ర, ఇంద్రియోపరమణం, మోహనం.

అనుభావాలు : అక్షినిమీలనం, ఉచ్ఛ్వసనాలు, స్వప్నాయితం, జల్పితం, నిఃశ్వాసాలు, మందంగా కనులు మూసుకొనటం, నిశ్చేష్టత, సర్వేంద్రియ సంమోహనం, స్వప్నం.

టీక : "నిద్రయొక్క ఉద్రేకమే (=గాఢనిద్రయే) సుప్తి" అని సింగభూపాలుడు. స్పర్శను గుర్తింపలేకపోవటాన్ని కూడా అనుభావంగా చెప్పినాడు శారదాతనయుడు.

సుప్తం లేదా సుప్తిని 'స్వప్నం' అన్నాడు విశ్వనాథుడు— నిద్రలో ఉన్నవాని విషయానుభవం స్వప్నం; కోపం, తొట్రుపాటు, భయం, గ్లాని, సుఖం, దుఃఖం మున్నగునవి ఇందలి అనుభావాలు.

"చర్మాన్ని కూడా విడిచి, మనస్సు, 'పురీతతి' అనే నాడియందు చరిస్తున్నప్పుడు సుప్తం కలుగుతుంది. ఇందు విభావం— నిద్ర; నేత్రనిమీలన-ప్రలయాదులు అనుభావాలు" అని భానుదత్తుడు.

# 24. విబోధం

మూలం : విబోధో నామ-ఆహారపరిణామ నిద్రాచ్ఛేద స్వప్నాంత
తీవ్ర శబ్ద స్పర్శ శ్రవణాదిభిః విభావైః సముత్పద్యతే.
తమభినయేత్-జృంభ-ణాక్షిపరిమర్దన
శయనమోక్షణాదిభిః అనుభావైః.
అత్రార్యా భవతి—
ఆహార విపరిణామా చ్ఛబ్ద స్పర్శాదిభిశ్చ సంభూతః।
ప్రతిబోధ స్త్వభినేయో జృంభణ వదనాక్షి పరిమర్దైః॥
-(నా.శా.VII-77)

అర్థం : విబోధఃనామ— ఆహారపరిణామ, నిద్రాచ్ఛేద, స్వప్నాంత, తీవ్రశబ్ద-స్పర్శ-శ్రవణ-ఆదిభిః, విభావైః, సముత్పద్యతే=విబోధం అనేది - ఆహారం జీర్ణంకావటం, నిద్రాభంగం, స్వప్నం అంతంకావటం, తీవ్రశబ్ద శ్రవణం, తీవ్రస్పర్శమున్నగు విభావాలవల్ల, ఉత్పన్నమవుతుంది. జృంభణ, అక్షిపరిమర్దన, శయనమోక్షణ-ఆదిభిః, అనుభావైః, తమ్, అభినయేత్=ఆవులింతలు, కనులు నులుముకొనటం ప్రక్కవిడిచిపెట్టటం (ప్రక్కనుంచి లేవటం) మున్నగు అనుభావాలచేత, దానిని, అభినయించాలి.

అత్ర-ఆర్యాభవతి=ఇచ్చట ఒక ఆర్య కలదు. ఆహారవిపరిణామాత్, శబ్ద-స్పర్శ-ఆదిభిః, ప్రతిబోధః(తు), సంభూతః =ఆహారం జీర్ణం కావటం, (తీవ్ర) శబ్ద, (తీవ్ర) స్పర్శమున్నగు వాటివల్ల ప్రతిబోధం (=విబోధం=బోధం=ప్రబోధం) కలుగుతుంది; జృంభణ, వదన-అక్షిపరిమర్దైః, అభినేయః=ఆవులింతలు, కనులు నులుముకొనటం, ముఖం తుడుచుకొనటం ద్వారా (దానిని) అభినయించాలి.

తాత్పర్యం : విభావాలు : ఆహార పరిణామం, నిద్రాచ్ఛేదం లేదా నిద్ర పరిసమాప్తి, స్వప్నాంతం, తీవ్ర శబ్ద-స్పర్శములు మున్నగునవి.

అనుభావాలు : జృంభణం, అక్షిపరిమర్దనం, శయనమోక్షణం మున్నగునవి.

ఇచ్చట ఒక ఆర్యకలదు:

విభావాలు : ఆహార విపరిణామం, శబ్దం, స్పర్శ.

అనుభావాలు : జృంభణం, వదన-అక్షిమర్దనం.

టీక : "నిద్రాసంపూర్ణతాదులవల్ల చేతనావాప్తి (=తెలివిరావటం) ప్రబోధం" అంటూ బాహువిక్షేపం, అంగుళిమోటనం (=చిటికలు వేయటం), శిరః కండూయనం (=తలగోకికొనటం), అంగవలనం (=ఒడలు విరచుకొనటం)– వీటిని కూడా అనుభావాలుగా చెప్పినాడు సింగభూపాలుడు; స్వప్న-స్పర్శన-నిఃస్వాన (=తీవ్రధ్వని)-నిద్రా సంపూర్తి–వీనివలన కలిగే ప్రబోధాలకు ర.సు.లో ఉదాహరణలున్నవి.

సమ్యగ్బోధంకూడా విబోధం కాగలదనీ, దీని 'విభావాను భావా'లను లోకంనుంచి గుర్తించవలెనని సంగీతరత్నాకరకర్త. "ఇంద్రియాల ప్రథమ ప్రకాశం విబోధం" అని భానుదత్తుడు.

ఉదా : స్వప్నాంతమున విబోధం :
త్రిభాగశేషాసు నిశాసు చ క్షణం
నిమీల్య నేత్రే సహసవ్యబుద్ధ్యత ।
క్వ నీలకంఠ! వ్రజసీ త్యలక్ష్యవా
గసత్యకంఠార్పిత బాహుబంధనా ॥ (కు.సం.V-57)

– రాత్రిసమయంలో, నాలుగవజామునందు, పార్వతి క్షణకాలం కనులు మూసికొనగా, కలవచ్చి, శివుడు కన్పించినాడు; అపుడామె, "ప్రభూ! ఎక్కడికి ప్రయాణం?" అని కలవరించి, అసత్యంగా అయనకంఠాన్ని కౌగలించినదై, వెంటనే మేల్కొన్నది.

## 25. అమర్షం

మూలం : అమర్షోనామ–
విద్యైశ్వర్య శౌర్య బలాధికై రధిక్షిప్త స్యావమానితస్య
వా సముత్పద్యతే. తమభినయేత్ శిరః కంపన
ప్రస్వేద వాధోముఖచింతన ధ్యానాధ్యవసాయో
పాయ సహాయాన్వేషణాదిభిః అనుభావైః.
అత్రశ్లోకా–
ఆక్షిప్తానాం సభామధ్యే విద్యాశౌర్య బలాధికైః ।
నృణా ముత్సాహసంయోగా దమర్షోనామ జాయతే ॥
ఉత్సాహాధ్యవసాయాభ్యా మధోముఖవిచింతనైః ।
శిరఃప్రకంప స్వేదాద్యై స్తం ప్రయుంజీత పండితః ॥
-(నా.శా.VII-78-79)

అర్థం : అమర్షః నామ, విద్యా-ఐశ్వర్య-శౌర్య-బల-అధికైః, అధిక్షిప్తస్య, వా, అవమానితస్య, సముత్పద్యతే=అమర్షం అనేది - విద్య-ఐశ్వర్యం-శౌర్యం-బలం-వీటియొక్క ఆధిక్యం కలవారిచేత, అధిక్షేపింపబడిన, లేదా, అవమానింపబడిన వానియందు, జనిస్తుంది. శిరఃకంపన-ప్రస్వేదన-అధో ముఖవిచింతన-ధ్యాన- అధ్యవసాయ-ఉపాయ-సహాయ-అన్వేషణ-ఆదిభిః, అను భావైః, తమ్, అభినయేత్=తలపంకించటం, అధికంగా చెమటపట్టటం, తల వంచి ఆలోచించటం, ధ్యానం, పనికిపూనుకొనటం, ఉపాయం వెదకటం, సహాయం వెదకటం మున్నగు, అనుభావాలచేత, దానిని అభినయించాలి.

అత్ర శ్లోకౌ=ఇచ్చట రెండు శ్లోకాలు కలవు : విద్యా-శౌర్య-బలాధికైః, సభామధ్యే, ఆక్షిప్తానాం, నృణామ్, ఉత్సాహసంయోగాత్, అమర్షః-నామ, సంజాయతే=విద్యా-శౌర్య-బలాధికులైన వారిచేత, సభలో, ఆక్షేపింపబడిన, ఉత్సాహవంతులైన, నరులలో, అమర్షం, కలుగుతుంది.

ఉత్సాహ-అధ్యవసాయాభ్యాం, అధోముఖవిచింతనైః, శిరఃప్రకంప- స్వేదాద్యైః, తం, పండితః, ప్రయుంజీత=ఉత్సాహం, పట్టుదల, తలవంచి ఆలో చించటం, తలపంకించటం, స్వేదం మున్నగు అనుభావాలచేత, దానిని, పండితులు, నిరూపించాలి.

తాత్పర్యం : అధిక విద్యా-బల-ఐశ్వర్యయుతులైనవారిచేత, సభలో ఆక్షే పించబడటం లేదా అవమానింపబడటంవల్ల అమర్షం కలుగుతుంది. శిరః కంపనం, ప్రస్వేదం, అధోముఖవిచింతనం, ధ్యానం, అధ్యవసాయం, ఉపా యాన్వేషణ, సహాయాన్వేషణ మున్నగు అనుభావాలచేత అమర్షాన్ని అభిన యించాలి.

ఇచ్చట రెండు శ్లోకాలు కలవు:

విద్యా-శౌర్య-బలాధికులైన వారిచేత సభలో ఆక్షేపించబడిన, ఉత్సాహవం తులలో, అమర్షం జనిస్తుంది. ఉత్సాహం, అధ్యవసాయం, అధోముఖవిచింతన, శిరః ప్రకంపనం, స్వేదం మున్నగు అనుభావాలచేత దీనిని ప్రదర్శించాలి.

టీక : "అధిక్షేపాదులవల్ల జనించే క్రోధం, అమర్షం" అంటూ అధి క్షేప-అవమానాలవలని అమర్షానికి ఉదాహరణ లిచ్చినాడు సింగభూపాలుడు. "పరులఅహంకారాన్ని అణచివేయాలనే ఉత్కటసమీహ, అమర్షం" అని భాను దత్తుడు. ఉత్సాహవంతులయందే అమర్షం కలుగుతుందని సంగీతరత్నాకరకర్త.

ఉదా : ప్రాయశ్చిత్తం చరిష్యామి పూజ్యానాం వో వ్యతిక్రమాత్ ।
న త్వేవం దూషయిష్యామి శస్త్రగ్రహమహావ్రతం ॥
(మహావీరచరిత-III-8)

– పూజ్యులు అయిన మీమాట విననందుకు ప్రాయశ్చిత్తం చేసుకొంటాను. అంతేకాని, శస్త్రగ్రహణ మహావ్రతానికి కళంకం తేజాలను (పరశురాముడు విశ్వామిత్రునితో).

## 26. అవహిత్థం

మూలం : అవహిత్థంనామ– ఆకారప్రచ్ఛాదనాత్మకం. తచ్చ లజ్జా
భయాపజయ గౌరవ జైహ్మ్యాదిభిః విభావైః సముత్ప
ద్యతే. తస్యాన్యకథాకథ నావలోకిత కథాభంగ
కృతకధైర్యాదిభిః అనుభావైః అభినయః
ప్రయోక్తవ్యః.
అత్రశ్లోకోభవతి–
ధార్ష్ట్యజైహ్మ్యాది సంభూత మవహిత్థం భయాత్మకం ।
తచ్చాగణనయా కార్యం నాతిపోత్తరభాషణాత్ ॥
-(నా.శా.VII-80)

అర్థం : అవహిత్థంనామ, ఆకార (=అనుభావ) ప్రచ్ఛాదనాత్మకం =అవహిత్థం (=అవహిత్థ) అనేది, ఆకారం కప్పిపుచ్చుకొనటం. లజ్జా-భయ-అపజయ-గౌరవ-జైహ్మ్య- ఆదిభిః, విభావైః, తత్ (చ), సముత్పద్యతే=లజ్జ, భయం, అపజయం, గౌరవం, కుటిలత్వం మున్నగు, విభావాలవల్ల, అది, కలుగుతుంది.

అన్యకథాకథన, అవలోకిత, కథాభంగ, కృతకధైర్య-ఆదిభిః, అనుభావైః, తస్య అభినయః, ప్రయోక్తవ్యః=తాను చెప్పిన మాటనే ఇంకొకవిధంగా సర్ది చెప్పటం, క్రిందిచూపులు, మాటమధ్యలో ఆపివేయటం, లేని ధైర్యం చూపటం మున్నగు అనుభావాలచేత, దాని, అభినయం, చేయాలి.

అత్ర, శ్లోకః, భవతి=ఇచ్చట, ఒక శ్లోకం కలదు. అవహిత్థం ధార్ష్ట్య-జైహ్మ్య-ఆది సంభూతం, భయాత్మకం=అవహిత్థం, ధృష్టత, కుటిలతమున్నగు వాటివల్ల జనిస్తుంది; అది భయాత్మకమైనది.

# 27. ఉగ్రత

మూలం : ఉగ్రతా నామ- చౌర్యాభిగ్రహణ నృపాపరా ధాసత్ప్రలాపాదిభిః
విభావైః సముత్పద్యతే. తాం చ వధ బంధన
తాడన నిర్భర్త్సనాదిభిః అనుభావైః అభినయేత్.
అత్రార్యా భవతి-
చౌర్యాభిగ్రహణవశా న్నృపాపరాధా దథోగ్రతా భవతి ।
వధ-బంధన-తాడనాదిభి రనుభావై రభినయ స్తస్యాః ॥
-(నా.శా. VII-86)

అర్థం : ఉగ్రతానామ, చౌర్య-అభిగ్రహణ, నృప-అపరాధ, అసత్ప్రలాప -ఆదిభిః, విభావైః, సముత్పద్యతే=ఉగ్రత (= ఔగ్ర్యం) అనేది, దొంగతనం పట్టుబడటం, రాజుపట్ల అపరాధం చేయటం, అసత్ప్రలాపం, మున్నగు విభావాల వల్ల కలుగుతుంది.

వధ, బంధన, తాడన, నిర్భర్త్సన-ఆదిభిః, అనుభావైః, తాం (చ), అభినయేత్ = వధ, బంధనం, తాడనం, నిర్భర్త్సనం మున్నగు అనుభావాలచేత, దానిని అభినయించాలి.

అత్ర-ఆర్యా, భవతి = ఇచ్చట ఒక ఆర్య కలదు :

చౌర్య-అభిగ్రహణవశాత్, నృప-అపరాధాత్, (అథ) ఉగ్రతా, భవతి = చౌర్యం పట్టుబడటం, నృపుని పట్ల అపరాధం చేయటం- వీటివల్ల, ఉగ్రత, కలుగుతుంది. వధ, బంధన, తాడన-ఆదిభిః, అనుభావైః, తస్యాః, అభినయః = వధ, బంధనం, తాడనం మున్నగు అనుభావాలచేత, దాని, అభినయం (నిర్దేశించాలి).

తాత్పర్యం : విభావాలు : చౌర్యాభిగ్రహణం, నృపాపరాధం, అసత్ప్రలాపం మున్నగునవి.

అనుభావాలు : వధ, బంధనం, తాడనం, నిర్భర్త్సనం, మున్నగునవి.

ఇచ్చట ఒక ఆర్యకలగు.

విభావాలు : చౌర్యాభిగ్రహణం, నృపాపరాధం.

అనుభావాలు : వధ, బంధనం, తాడనం మున్నగునవి.

టీక : "దుష్టుడు చేసిన అపరాధం వల్ల, అనుచితం-అప్రియం అయిన కథనం లేదా క్రూరకర్మవల్ల జనించే 'చండత్వం' ఉగ్రత" అని ధనంజయుడు (చండత్వం = తీక్ష్ణత = క్రూరత్వం). అవమానాన్ని ధైర్యాది గ్రహణాన్ని కూడా విభావాలుగానూ, నయనరాగాన్ని కూడా అనుభావంగానూ చెప్పి, అపరాధ-అవమాన-ధైర్యాదిగ్రహణ-అసత్ప్రలాపాల వల్ల కలిగే ఉగ్రతకు ఉదాహరణలిచ్చినాడు సింగభూపాలుడు. "ఉగ్రత అనగా నిర్దయత" అన్నాడు భానుదత్తుడు. "పుత్ర-మిత్ర-కలత్రాదులకు ఇతరులవల్ల ద్రోహం జరగటం వల్ల ఉగ్రత కలుగుతుంది" అని శారదాతనయుడు.

ఉదా : అపరాధం వలని ఉగ్రత :

ప్రణయి సఖీసలీల పరిహాస రసాధిగతై-
లలితశిరీషపుష్పహననై రపి తామ్యతి యత్ ।
వపుషి వధాయ తత్ర తవ శస్త్ర ముపక్షిపత-
పతతు శిరస్య కాండ యమదండ ఇవైష భుజః ॥

(మా. మా. VI)

— ఈ మాలతిని మిక్కిలి ప్రేమించే చెలికత్తెలు పరిహాసానికై మిక్కిలి మృదువైన శిరీషపుష్పాలతో కొట్టినంత మాత్రముననే ఈమె శరీరం కందిపోతుంది. అట్టి ఈమెను చంపుటకు ఈమె దేహంపై కత్తి పెడుతున్న నీ శిరస్సుమీద, హఠాత్తుగావచ్చే యమదండం వంటి నా భుజం పడును గాక! (మాధవుని మాటలు).

## 28. మతి

మూలం : మతిర్నామ-నానాశాస్త్రవిచింత నోహాపోహాదిభిః విభావైః
సముత్పద్యతే. తామభినయే చ్ఛిష్యోపదేశ-
అర్థవికల్పన సంశయచ్ఛేదాదిభిః అనుభావైః.
భవతి చాత్రశ్లోకః -
నానాశాస్త్రార్థ బోధేన మతిః సంజాయతే నృణామ్ ।
శిష్యోపదేశార్థ కృత స్తస్యాస్త్వభినయో భవేత్ ॥

-(నా.శా. VII-82)

అర్థం : మతిః - నామ- నానాశాస్త్ర విచింతన, ఊహ-అపోహ-ఆదిభిః, విభావైః, సముత్పద్యతే = మతి అనేది, నానాశాస్త్రార్థాలను గూర్చి ఆలో

చించటం, ఊహ-అపోహలు— ఈ విభావాల వల్ల, కలుగుతుంది. శిష్యోప దేశ-అర్థవికల్పన-సంశయచ్ఛేద-ఆదిభిః, అనుభావైః, తామ్, అభినయేత్ = శిష్యులకు ఉపదేశించటం, అర్థాన్ని నిర్ధారించటం, సంశయాన్ని పోగొట్టటం, మున్నగు అనుభావాలతో, దానిని అభినయించాలి.

అత్ర, శ్లోకః, భవతి(చ)=ఇచ్చట, ఒకశ్లోకం, కలదు: నానాశాస్త్ర-అర్థ బోధేన, నృణాం, మతిః, సంజాయతే=అనేకశాస్త్రాలయొక్క అర్థబోధద్వారా, నరులయందు, మతి, జనిస్తుంది. శిష్య- ఉపదేశ, అర్థకృతః, తస్యాః(తు), అభినయః, భవేత్=శిష్యోపదేశం, అర్థవివరణ— వీటిచేత, దాని, అభినయం, జరగాలి.

తాత్పర్యం : విభావాలు : నానాశాస్త్రార్థవిచింతనం, ఊహ-అపోహలు మున్నగునవి.

అనుభావాలు : శిష్యోపదేశం, అర్థవికల్పనం, సంశయచ్ఛేదం మున్నగు నవి.

ఇచ్చట ఒక శ్లోకం ఉన్నది:

నానాశాస్త్రార్థబోధవల్ల మతి కలుగుతుంది. శిష్యోపదేశం, అర్థవివరణ— వీటిచేత మతిని అభినయించాలి.

టీక : "శాస్త్రాదులవల్ల కలిగే తత్త్వజ్ఞానం మతి" అని ధనంజయుడు. "సత్-అసత్‌లను నిశ్చయించేసే మననం మతి" అని శారదాతనయుడు; "నీతి మార్గాదులను అనుసరించి (నానాశాస్త్రార్థాలనుమథించి-వ.సు.) అర్థ నిర్ధారణ చేయటం మతి" అని విశ్వనాథుడు. "యథార్థజ్ఞానం మతి" అంటూ "నయ- వినయ-అనునయ-ఉపదేశ-ఉపాలంభాలు ఇందులో అంతర్భవిస్తాయి" అన్నాడు భానుదత్తుడు. ఉపాలంభం రెండు విధాలు- ప్రణయాత్మ, కోపాత్మ. రెండవది అమర్షంలో అంతర్భవిస్తుంది.

ఉదా : అసంశయం క్షత్ర పరిగ్రహక్షమా
యదార్య మస్యా మభిలాషి మే మనః ।
సతాం హి సందేహపదేషు వస్తుషు
ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయః ॥ (అ.శా.I-17)

— సందియంలేదు. ఈమె క్షత్రియుడు వివాహమాడదగినదే. అందులకు ఆర్యమయిన నా మనస్సు ఈమెను అభిలషించుటయే తార్కాణం. సజ్జనులకు సందేహగ్రస్త విషయములందు తమ అంతఃకరణ ప్రవృత్తియే ప్రమాణం కదా! (శకుంతల మునికుమార్తె కాదని తెలిసికొన్న దుష్యంతుని నిశ్చయం.)

సహసా విదధీత న క్రియా మవివేకః పరమాపదం పదమ్ ।
వృణుతే హి విమృశ్యకారిణం గుణలుబ్ధాః స్వయమేవ సంపదః ॥
-(కిరాతార్జునీయం-II-30)

"అపూర్వ ప్రతిభానం (extraordinary flash of insight) మతి" అంటూ అన్వయవ్యతిరేకజములైన ప్రత్యయములను గూర్చి శాస్త్రచింతనము చేయటాన్ని కూడా అనుభావంగా చెప్పినాడు సంగీతరత్నాకరకర్త; ఊహ-అపోహములనగా విధి-నిషేధములు (suppostion and disputation) అన్నాడు. ఊహమనగా పర చిత్త జ్ఞానమనీ, అపోహమనగా కర్తవ్యతాజ్ఞానమనీ అర్వాచీనులు.

## 29. వ్యాధి

మూలం : వ్యాధిర్నామ—
వాత-పిత్త-కఫ-సన్నిపాత ప్రభవః. తస్యాః జ్వరాద
యో విశేషాః. జ్వరస్తు ద్వివిధః-సశీతః సదాహశ్చ.
తత్ర సశీతోనామ-ప్రవేపిత సర్వాంగోత్కంపన
నికుంచ నాగ్న్యభిలాష రోమాంచ హనువలన నా
వికూణన ముఖశోషణ పరిదేవితాదిభిః అనుభావైః
అభినేయః. సదాహోనామ-క్షిప్తాంగకరచరణ
భూమ్యభిలా షానులేపన శీతాభిలాష పరిదేవన
ముఖశోషోత్క్రుష్టాదిభిః అనుభావైః. యే
చాన్యే వ్యాధయస్తేఽపి ఖలు ముఖవికూణన
గాత్రస్తంభ ప్రస్తాక్షి నిఃశ్వసన స్తనితోత్క్రుష్ట
వేపనాదిభిః అనుభావైః అభినేయాః.
అత్ర శ్లోకో భవతి—
సమాసతస్తు వ్యాధీనాం కర్తవ్యోఽభినయో బుధైః ।
ప్రస్తాంగగాత్ర విక్షేపై స్తథా ముఖవికూణనైః ॥
-(నా.శా. VII-83)

అర్థం : వ్యాధిఃనామ, వాత-పిత్త-కఫ-సన్నిపాత ప్రభవః=వ్యాధి అనేది, వాతం (wind), పిత్తం (biles), కఫం (phlem) — వీటియొక్క సన్నిపాతం (=వైపరీత్యంవల్ల) కలుగుతుంది. జ్వర-ఆదయః, తస్యాః, విశేషాః=జ్వరం మున్నగునవి, దానియొక్క, విశేషాలు. జ్వరః(తు), ద్వివిధః-సశీతః, సదాహః(చ)=జ్వరం రెండు విధాలు - సశీతం (=చలిజ్వరం), సదాహం (పిత్త లేదా తాపజ్వరం).

తత్ర, సశీతఃనామ=ఇందు, జలిజ్వరం అనేది; ప్రవేపిత, సర్వాంగ-ఉత్కంపన, నికుంచన, అగ్న్యభిలాష, రోమాంచ, హనువలన, నాసావికూణన, ముఖశోషణ, పరిదేవిత-ఆదిభిః, అనుభావైః, అభినేయః=వణకటం, శరీరమంతా కంపించటం, ముడుచుకొనటం, నిప్పుకాచుకొనవలెననే కోరిక, రోమాంచం, దవడలను ఆడించటం, ఎగపీల్చటం, నోరెండిపోవటం, మూలగటం మున్నగు, అనుభావాలచేత, అభినయింపబడాలి.

సదాహఃనామ-క్షిప్త-అంగ-కర-చరణ, భూమి-అభిలాష, అనులేపన, శీతాభిలాష, పరిదేవన, ముఖశోష, ఉత్క్రుష్ట-ఆదిభిః, అనుభావైః=సదాహం అనేది— అంగ-కర-చరణాలను విసరివేస్తూ ఉండటం, భూమిమీద పడుకోవాలని ఉండటం, గంధపుపూతలు మున్నగు వానిని కోరటం, శీతలవస్తువులను అభిలషించటం, మూలగటం లేదా ఆయాసపడటం, నోరెండిపోవటం, బిగ్గరగా అరవటం, మున్నగు అనుభావాలచేత (అభినయింపబడాలి).

అన్యే(చ), యే, వ్యాధయః, తే, అపి(ఖలు), ముఖవికూణన, గాత్రస్తంభ, స్రస్త-అక్షి, నిఃశ్వసన, స్తనిత, ఉత్క్రుష్ట, వేపన-ఆదిభిః, అనుభావైః, అభినేయాః=ఇతరములైన, ఏ, వ్యాధులుకలవో, అవి, కూడా— మొగం ముడుచు కొనటం, ఒడలు కొయ్యబారటం, కనులు తేలవేయటం, నిఃశ్వాసాలు, మూలుగు, బిగ్గరగా అరవటం, వణకటం మున్నగు, అనుభావాలచేత, అభినయింపబడాలి.

అత్ర, శ్లోకః, భవతి=ఇచ్చట, ఒకశ్లోకం, కలదు : సమాసతః(తు), వ్యాధీనాం, స్రస్త-అంగ, గాత్రవిక్షేపైః(తథా), ముఖవికూణనైః, బుధైః, అభినయః, కర్తవ్యః=మొత్తంమీద, వ్యాధులన్నింటనీ, గాత్రశైథిల్యం, చేతులు కాళ్ళు కొట్టుకొనటం, ముఖం ముడుచుకొనటం— వీటిచేత, బుధులు, అభినయించాలి (అంటే, ఈ మూడూ ముఖ్యములని అర్థం).

తాత్పర్యం : వ్యాధి అనేది వాత-పిత్త-కఫాల వికారంవల్ల కలుగుతుంది; ఇందువల్ల జ్వరాదులు సంభవిస్తాయి. జ్వరం రెండు విధాలు— సశీతం (=చలిజ్వరం), సదాహం (=తాప లేదా పిత్త జ్వరం).

సశీత జ్వరం : అనుభావాలు : ప్రవేపనం, సర్వాంగోత్కంపం, నికుంచనం, అగ్న్యభిలాష, రోమాంచం, హనువలనం, నాసావికూణనం, ముఖశోషణం, పరిదేవనం మున్నగునవి.

సదాహజ్వరం : అనుభావాలు : అంగ-కర-చరణ విక్షేపాలు, భూమ్యభిలాష, అనులేపనాభిలాష, శీతాభిలాష, పరిదేవనం, ముఖశోషణం, ఉత్క్రుష్టం మున్నగునవి.

ఇతర జ్వరాలు : అనుభావాలు : ముఖవికూణనం, గాత్రస్తంభం, కనులు తేలవేయటం, నిఃశ్వాసాలు, స్తనితం, ఉత్క్రుష్టం, వేపనం మున్నగునవి.

ఇచ్చట ఒక శ్లోకం కలదు:

మొత్తం మీద వ్యాధులన్నింటినీ, గాత్రశైథిల్యం, గాత్రవిక్షేపం, ముఖవికూణనం — వీటిచేత అభినయించాలి.

టీక : "రోగ-విరహాదులవల్ల కలిగే మనస్తాపం వ్యాధి... విభావం-విరహం; అనుభావం- అంగవిక్షేపాదులు" అని జగన్నాథుడు. (వ్యాధుల వివరాలు ఆయుర్వేద శాస్త్రమందు కలవు). "దోష (=వాతాదుల) -ఉద్రేక-వియోగాదులవల్ల వ్యాధి సంభవిస్తుంది" అని సింగభూపాలుడు.

"జ్వరాదుల వికారమే వ్యాధి. కుపితధాతు-భయ-కామ-క్లేశాదులు విభావాలు; దశ-ఉపద్రవాలు అనుభావాలు" అని భానుదత్తుడు (అభిలాషాది దశావస్థలే పది ఉపద్రవాలు).

వ్యాధి అనేది ధాతు వైషమ్యంవల్లనేకాక, విరహాదులవల్ల కూడా సంభవిస్తుంది. విరహంవల్ల సంభవించేది సదాహజ్వరం. దీనినే 'కామజం' అన్నాడు సంగీతరత్నాకరకర్త. దీని ఉపశమనం కోసం జరిగే శీతలోపచారాలు తెలుగు ప్రబంధాలలో విరివిగా వర్ణింపబడినవి.

## 30. ఉన్మాదం

మూలం : ఉన్మాదోనామ—

ఇష్టజన వియోగ విభవనా శాభిఘాత వాతపిత్త

శ్లేష్మప్రకోపాదిభిః విభావైః ఉత్పద్యతే.
తమనిమిత్తహసిత-రుది-తోత్కృష్టాసంబద్ధ
ప్రలాప-శయి-తోపవి-ష్టోత్థిత-ప్రధావిత-నృత్త-
గీత-పఠిత-భస్మపాం స్వవధూలన తృణ-
నిర్మాల్య-కుచేల-చీర-ఘట-కపాల-శరా
వాభరణ ధారణోపభోగై రనేకై శ్చానవస్థితై
శ్చేష్టానుకరణాదిభిః అనుభావైః అభినయేత్.
అత్రార్యే భవతః—
ఇష్టజన విభవనాశా దభిఘాతా ద్వాతపిత్తకఫ కోపాత్ ।
వివిధా చ్చిత్తవికారా దున్మాదో నామ సంభవతి ॥
అనిమిత్త రుదిత హాసి తోపవిష్ట గీత ప్రధావి తోత్కృష్టైః ।
అన్యైశ్చ వికారకృతై రున్మాదం సంప్రయుంజీత ॥
-(నా.శా.VII-84, 85)

అర్థం : ఉన్మాదఃనామ, ఇష్టజన వియోగ, విభవనాశ, అభిఘాత, వాత-పిత్త-శ్లేష్మ ప్రకోప- ఆదిభిః, విభావైః, ఉత్పద్యతే=ఉన్మాదం అనేది, ఇష్టజన వియోగం, విభవనాశం, పెద్దదెబ్బ, వాత- పిత్త-శ్లేష్మ ప్రకోపం, మున్నగు విభావాలవల్ల, కలుగుతుంది. అనిమిత్త హసిత-రుదిత- ఉత్కృష్ట, అసంబద్ధ ప్రలాప, శయిత-ఉపవిష్ట, ఉత్థిత-ప్రధావిత-నృత్త-గీత-పఠిత, భస్మ- పాంశు-అవధూలన, తృణ-నిర్మాల్య-కుచేల-చీర-ఘట-కపాల-శరావ-ఆభరణధారణ-ఉపభోగైః, అనేకైః(చ) అనవస్థితైః, చేష్టా-అనుకరణ-ఆదిభిః, అనుభావైః, తమ్, అభినయేత్=కారణం లేకుండానే నవ్వటం-రోదించటం- అరవటం-అసంబద్ధంగా ప్రలాపించటం-శయనించటం- కూర్చుండటం, లేవటం-పరుగెత్తటం-నృత్తంచేయటం-పాడటం-పఠించటం, గడ్డి-ఉపయోగింపబడిన పూలదండలు మున్నగునవి, కుళ్ళుగుడ్డలు, చింకిగుడ్డలు, కుండపెంకులు, పుర్రెలు, మూకుళ్ళు— వీటని ఆభరణాలుగా ధరించటం, ఆనందించటం, ఇంకా అనేక విధాలైన వైకిలిచేష్టలు చేయటం, ఇతరులను వెక్కిరించటం, మున్నగు అనుభావాలచేత, దానిని, అభినయించాలి.

అత్ర, ఆర్యే, భవతః=ఇచ్చట, రెండు ఆర్యలు, కలవు : ఇష్టజన-విభవనాశాత్, అభిఘాతాత్, వాత-పిత్త-కఫ-కోపాత్, వివిధాత్-చిత్తవికారాత్, ఉన్మాదఃనామ, సంభవతి=ఇష్టజననాశం, విభవనాశం, పెద్దదెబ్బ, వాత-పిత్త-

కఫ ప్రకోపం, వివిధచిత్త వికారాలు— వీనివలన, ఉన్మాదం అనేది, కలుగు తుంది.

అనిమిత్తరుదిత-హసిత-ఉపవిష్ట-గీత-ప్రధావిత-ఉత్క్రుష్టైః, అన్యైః(చ), వికారకృతైః, ఉన్మాదం, సంప్రయుంజీత=కారణం లేకుండానే రోదించటం-నవ్వటం-కూర్చుండటం-పాడటం- పరుగెత్తటం-అరవటం, ఇంకా అనేకాలైన వికారాలు- వీనిచేత, ఉన్మాదాన్ని నిరూపించాలి.

తాత్పర్యం : విభావాలు : ఇష్టజన వియోగం, విభవనాశం, అభిఘాతం, వాత-పిత్త-శ్లేష్మ ప్రకోపం మున్నగునవి.

అనుభావాలు : అనిమిత్తంగా— హసిత-రుదిత-ఉత్క్రుష్టాలు, అసం బద్ధ ప్రలాపం, శయన- ఉపవిష్ట-ఉత్థాన-ప్రధావనములు, నృత్త-గీత-పఠనాలు, భస్మ-పాంశు అవధూలనం, తృణ- నిర్మాల్య-కుచేల-చీర-ఘట-కపాల-శరావాలను ఆభరణాలుగా ధరించటం ఆనందించటం, అనేకములైన అనవస్థిత (=చంచల) చేష్టలు, ఇతరులను వెక్కిరించటం మున్నగునవి.

ఇచ్చట రెండు ఆర్యలు కలవు :

విభావాలు : ఇష్టజన-విభవనాశములు, అభిఘాతం, వాత-పిత్త-కఫ ప్రకోపం, వివిధచిత్త వికారాలు.

అనుభావాలు : అనిమిత్తంగా రోదన-హసిత-ఉపవిష్ట-గీత-ప్రధావన-ఉత్క్రుష్టాలు, ఇంకా అనేకాలైన వికారాలు.

టీక : "అప్రేక్షాకారిత్వం (=మంచిచెడ్డలు ఆలోచించకయే పనులువేయుటం) ఉన్మాదం" అని ధనంజయుడు. "వియోగాదులవల్ల కలిగే చిత్త విభ్రాంతి (=చాంచల్యం) ఉన్మాదం" అంటూ అచేతనాలతో సంభాషణాన్ని కూడా వియోగజమైన ఉన్మాదానికి, అనుభావంగా చెప్పి, ఇష్టనాశజమైన ఉన్మాదానికి ఉదాహరణ లిచ్చినాడు సింగభూపాలుడు. "విప్రలంభం, మహోపత్తి, పరమానందం మున్నగువానివల్ల జనించేది, ఇతరులకు వేరుగా భాసించేది ఉన్మాదం" అని జగన్నాథుడు. "జ్యేష్ఠప్రకృతికి అభీష్టవిరహంవల్ల, మధ్యమ ప్రకృతికి అభీష్టవిఘాతంవల్ల, నీచప్రకృతికి ధననాశాదులవల్ల ఉన్మాదం (=పిచ్చి) కలుగుతుంది" అని శారదాతనయుడు. "విచార రహితమైన ఆచరణ ఉన్మాదం; అంతమాత్రాన అగమ్యాగమనం ఉన్మాదం క్రిందకురాదు— కారణం ఉన్మాదం విచారరహితం

కావటంవల్ల, అగమ్యాగమనం కామంతో కూడినది కావటంవల్ల. అందుచేత అప్రేక్షాకారిత్వం ఉన్మాదం అనే లక్షణం అంగీకారంకాదు" అని భానుదత్తుడు.

ఉదా : ఆః! క్షుద్రరాక్షస! తిష్ఠ, తిష్ఠ, క్వమే ప్రియతమా
మాదాయ గచ్ఛసి?
నవజలధరః సన్నద్ధోఽయం దృప్తనిశాచరః
సురధనురిదం దూరాత్కృష్టం నతస్యశరాసనమ్ ।
అయమపి పటుర్ధారాసారో న బాణపరంపరా
కనకనికషస్నిగ్ధా విద్యుత్ప్రియా న మమోర్వశీ ॥
-(వి.ఊర్వ.IV-7)

— ఓరీ! నీచరాక్షస! ఆగు. ఆగు. నాప్రియతమను తీసుకొని ఎక్కడికి పోతున్నావు? ఏమిటి ఈక్రొత్తమేఘుడు సన్నద్ధుడై దగ్గరకు వస్తున్నాడు? ఈతడు గర్వించిన రాక్షసుడు కాడు. ఇది బహుదూరం వ్యాపించిన ఇంద్ర ధనుస్సేకాని వాని విల్లుకాదు. ఈతీవ్రధారలు బాణపరంపరకాదు. నికషోపలంమీది సువర్ణరేఖవంటి విద్యుత్తు ఇది. ఇది నా ఊర్వశికాదు.

(ఊర్వశీ వియోగజమైన విరహంతో ఉన్న పురూరవుని పలుకులు).

సంగీతరత్నాకరకర్త ఇట్లా వివరించినాడు:

"ఉన్మాదం వ్యాధి ప్రభవంకూడా అయినప్పటికీ, విప్రలంభాదులందు ఇది వైచిత్ర్యసహితంగా ఉంటుంది. ఇట్లాగే అపస్మారం బీభత్స-భయానకరసములు రెండింటియందు ఉంటుంది."

## 31. మరణం

మూలం : మరణం నామ—
వ్యాధిజ మభిఘాతజఞ్చ. తత్ర యదాంత్రకృ
చ్ఛూలదోష-వైషమ్య-గండ-పిటక-జ్వర-విషూచి
కాదిభిః ఉత్పద్యతే. త ద్వ్యాధి ప్రభవమ్.
అభిఘాతజం తు శస్త్రాహిదంశ విషపాన శ్వాపద
గజతురగ రథపశుయాన పాత వినాశప్రభవమ్.
ఏతయో రభినయవిశేషాన్ వక్ష్యామః—తత్ర

వ్యాధిజం విషణ్ణగాత్రావ్యాయతాంగ విచేష్టిత
నిమీలితనయన హిక్కా శ్వాసోపేతానపే
క్షితపరిజ నావ్యక్తాక్షర కథనాదిభిః అను
భావైః అభినయేత్.
అత్ర శ్లోకో భవతి–
వ్యాధీనా మేక భావో హి మరణాభినయః స్మృతః ।
విషణ్ణగా త్రై ర్నిశ్చేష్టై రింద్రియైశ్చ వివర్జితః ॥ 86
అభిఘాతజే తు నానాప్రకరా అభినయ
విశేషాః— శస్త్రక్ష తాహిదష్ట విషపీత గజాది
పతిత శ్వాపదహతాః. యథా తత్ర శస్త్రక్షతే
తావ త్సహసా భూమిపతన వేపన స్ఫురణాదిభిః
అభినయః ప్రయోక్తవ్యః. అహిదష్ట విషపీత
యో ర్విషవేగో యథా— కార్శ్య-వేపథు-
విదాహ-హిక్కా-ఫేన-స్కంధభంగ-జడతా-
మరణానీ త్యష్టౌ విషవేగాః.
అత్రానువంశ్యౌ శ్లోకౌ భవతః :
కార్శ్యంతు ప్రథమే వేగే ద్వితీయే వేపథు ర్భవేత్ ।
దాహం తృతీయే హిక్కాం చ చతుర్థే సంప్రయోజయేత్ ॥ 87
ఫేనంచ పంచమే కుర్యా త్షష్ఠే స్కంధస్య భంజనమ్ ।
జడతాం సప్తమే కుర్యా దష్టమే మరణం భవేత్ ॥ 88
అత్రార్యా భవతి :
శ్వాపద-గజ-తురగ-రథోద్భవం [illegible] పశుయానపతనజం వాఽపి ।
శస్త్రక్షతవ త్కుర్యా దనపేక్షిత గాత్రసంచారమ్ ॥ 89
ఇత్యేవం మరణం జ్ఞేయం నానావస్థాంతరాత్మకమ్ ।
ప్రయోక్తవ్యం బుధైః సమ్యగ్యథా భావాంగచేష్టితైః ॥ 90

-(నా.శా.VII-గద్య+86-90)

అర్థం : మరణంనామ— వ్యాధిజం, అభిఘాతజం(చ)=మరణం అనేది వ్యాధిజం (=వ్యాధివల్ల కలిగేది), అభిఘాతజం (=గాయాలు మొదలగు వాటి వల్ల కలిగేది) (అని రెండు విధాలు).

తత్ర, యత్, అంత్ర్యకృత్-శూలదోష-వైషమ్య-గండ-పిటక-జ్వర-విషూచిక-ఆదిభిః, ఉత్పద్యతే, తత్, వ్యాధి ప్రభవమ్=అందు, ఏది, అంత్రం (=liver), యకృత్తు (=spleen), శూల, వాత-పిత్త-కఫ వైషమ్యం, గండం (=వ్రణం), పిటకం (=పుండు), జ్వరం, విషూచి మున్నగువాటివల్ల, కలుగుతుందో, అది, వ్యాధిజం. అభిఘాతజం(తు) -శస్త్ర-అహిదంశ-విషపాన-శ్వాపద, గజ-తురగ-రథ-పశుయానపాత, వినాశ, ప్రభవమ్=ఇంక అభిఘాతజం-శస్త్రఘాతం, పాముకాటు, విషపానం, క్రూరమృగాలదెబ్బ, గజ-తురగ-రథ-పశు-వాహనాల నుంచి క్రిందపడటంవంటి వినాశం— వీనివల్ల కలుగుతుంది.

ఏతయోః, అభినయవిశేషాన్, వక్ష్యామః=వానియొక్క, అభినయ ప్రకారాలను, వివరిస్తాను.

1) తత్ర, వ్యాధిజం=అందు, వ్యాధిజం (యొక్క అభినయం) : విషణ్ణగాత్ర, అవ్యాయతాంగ- విచేష్టిత, నిమీలితనయన, హిక్కా, శ్వాసోపేత, అనవేక్షితపరిజన, అవ్యక్తాక్షరకథన-ఆదిభిః, అనుభావైః, అభినయేత్=గాత్రం విషణ్ణంకావటం, అంగవిచేష్టితాలు తగ్గిపోవటం, కనులు మూతలువడటం, ఎక్కిళ్ళు, శ్వాసబరువుగా రావటం, పరిజనులను చూడకపోవటం, గొణుగుకొనటం లేదా మాటసరిగా లేకపోవటం మున్నగు, అనుభావాలతో, అభినయించాలి.

అత్ర, శ్లోకః, భవతి=ఇచ్చట, ఒక శ్లోకం, ఉంది. విషణ్ణగాత్రైః, నిశ్చేష్టితైః, ఇంద్రియైః(చ), వివర్జితః=శిథిలగాత్రంతో, నిశ్చేష్టతతో, ఇంద్రియాలు పనిచేయకపోవటంతో— ఇట్లా; వ్యాధీనాం, మరణాభినయః, ఏకభావః(హి) స్మృతః=వ్యాధిజములైన మరణములన్నింటియందును, అభినయం, ఒకే విధంగా, ఉంటుంది.

2) అభిఘాతజే(తు)=అభిఘాతజమైన మరణమందు, అభినయవిశేషాః, నానాప్రకారాః=అభినయ విశేషాలు, అనేకవిధాలు : శస్త్రక్షత-అహిదష్ట-విషపీత-గజాదిపతిత-శ్వాపదహతాః=శస్త్రక్షతం, పాముకాటు, విషపానం, గజాదులనుంచిపడటం, క్రూరమృగములచే దెబ్బతినటం.

(యథా) తత్ర శస్త్రక్షతే=శస్త్రక్షతమరణమందు; (తావత్) సహసా భూమిపతన, వేపన, స్ఫురణ-ఆదిభిః, అభినయః ప్రయోక్తవ్యః=ఆకస్మికంగా నేలమీదకు ఒరగటం, వేపనం (=వణకటం), స్ఫురణం (=అదరటం), మున్నగు వాటిచేత, అభినయం, చేయదగును.

అహిదష్ట-విషపీతయోః, విషవేగః (యథా)=పాముకాటు-విషపానం—వీటివల్ల, విషవేగం (ఎట్లా అంటే); కార్శ్య-వేపథు-విదాహ-హిక్కా-ఫేన-స్కంధభంగ-జడతా-మరణాని, ఇతి విషవేగాః, అష్టౌ=కార్శ్యం, వేపథువు, విదాహం, హిక్క, ఫేనం, స్కంధభంగం, జడత, మరణం అని, విషవేగాలు, ఎనిమిది.

అత్ర, అనువంశ్యౌ, శ్లోకౌ, భవతః=ఇక్కడ, అనువంశ్యములైన శ్లోకాలు రెండు, కలవు:

ప్రథమే వేగే కార్శ్యం(తు), ద్వితీయే వేపథుః, భవేత్=ప్రథమ(విష) వేగమందు, కార్శ్యం (=చిక్కిపోవటం), ద్వితీయ (విషవేగ)మందు వేపథువు, కలుగుతాయి. తృతీయే, దాహం, చతుర్థే(చ), హిక్కా, సంప్రయోజయేత్=తృతీయ (విషవేగ) మందు, దాహం (=మంట), చతుర్థమందు, హిక్క (=ఎక్కిళ్ళు), ప్రయోగించదగును. పంచమే, ఫేనం(చ), షష్ఠే, స్కంధస్యభంజనం, కుర్యాత్=పంచమ(విషవేగ)మందు ఫేనం (=నురుగులు), షష్ఠమందు, స్కంధభంగం (=మెడ వ్రాలిపోవటం), చేయాలి. సప్తమే, జడతాం, కుర్యాత్, అష్టమే, మరణం, భవేత్=సప్తమ (విషవేగ) మందు జడత్వం చూపాలి; అష్టమ (విషవేగ) మందు, మరణం, కలుగుతుంది.

అత్ర-ఆర్యా, భవతి=ఇక్కడ, ఒక ఆర్య కలదు. శ్వాపద-గజ-తురగ-రథోద్భవం తు, పశు- యాన పతనజం (వా, అపి)=శ్వాపదాలచేత, గజ-తురగ-రథాలనుంచి పడటంవల్ల, పశువులు- ఇతర యానాల నుంచిపడటంవల్ల కలిగే మరణాన్ని; అనవేక్షిత-గాత్రసంచారమ్, శస్త్రక్షతవత్, కుర్యాత్=అవయవముల కదలికలు లేనివిధంగా, శస్త్రక్షతజమరణమందువలెనే, చూపాలి.

ఏవం, మరణం, నానావస్థాంతరాత్మకమ్, ఇతి జ్ఞేయం=ఇట్లా, మరణం, నానావస్థలతో కూడి ఉంటుంది అని, తెలియాలి.

భావ-అంగచేష్టితైః, యథాసమ్యక్, బుధైః, ప్రయోక్తవ్యం=భావాలతో, అంగచేష్టితాలతో, ఎట్లా సముచితమో (అట్లా), బుధులు (మరణాభినయం) ప్రయోగించాలి.

తాత్పర్యం : మరణం రెండు విధాలు : 1. వ్యాధిజం, 2. అభిఘాతజం. ఆంత్ర-యకృత్-శూల- వాతపిత్త కఫ వైషమ్యాలవల్ల, గండ-పిటక-జ్వర-విషూచిక మున్నగువానివలన సంభవించేది వ్యాధిజమరణం. శస్త్ర-అహిదంశ-విషపాన-శ్వాపద-గజ తురగ రథ పశుయాన పాతాలవల్ల కలిగే వినాశం అభిఘాతజమరణం.

ఈ రెండు విధాలైన మరణాల అభినయ విశేషాలు :

(1) వ్యాధిజమరణం : విషణ్ణగాత్రం, అవ్యాయతాంగవిచేష్టితాలు, నిమీలిత నయనాలు, హిక్కా-శ్వాసలు, అనపేక్షితపరిజనం, అవ్యక్తాక్షర కథనం మున్నగునవి ఇందలి అనుభావాలు.

ఇచ్చట ఒక శ్లోకం ఉంది :

వ్యాధిజమరణంలో అభినయం ఒకేవిధంగా ఉంటుంది— విషణ్ణగాత్రం, నిశ్చేష్టత, ఇంద్రియవివర్తనం.

(2) అభిఘాతజమరణం : శస్త్రక్షతం, అహిదష్టం, విషపానం, గజాది పతనం, శ్వాపదహతి— వీనియందు అభినయ విశేషాలు నానాప్రకారాలుగా ఉంటాయి.

శస్త్రక్షతమందు : సహసాభూపతనం, వేపనం, స్ఫురణం మున్నగునవి అనుభావాలు.

అహిదష్ట-విషపీతములందలి విషవేగాలు ఎనిమిది విధాలు— ప్రథమవేగంలో కార్శ్యం, ద్వితీయవేగంలో వేపథువు; తృతీయవేగంలో దాహం, చతుర్థవేగంలో హిక్క, పంచమవేగంలో ఫేనం, షష్ఠవేగంలో స్కంధభంగం, సప్తమవేగంలో జడత, అష్టమవేగంలో మరణం.

ఇచ్చట రెండు ఆర్యలు కలవు :

శ్వాపదహతి, గజతురగ రథపతనం, పశుయాన పతనం— వీటివల్ల సంభవించే మరణాన్ని— శస్త్రక్షతివలన కలిగే మరణమందువలెనే— అనపేక్షిత, గాత్రసంచారంతో నిరూపించాలి.

ఇట్లా మరణం నానావస్థాంతరాత్మకంగా ఉంటుంది. మరి, దీనిని తత్తదుచితములైన భావాలతో, అంగచేష్టితాలతో ప్రయోగించాలి.

టీక : "మరణం సుప్రసిద్ధంకావటంచేత, అనర్థకం కావటంచేత వివరించటంలేదు" అని చెప్పి, "శృంగారంలో మరణంయొక్క తత్పరతను మాత్రమే దిగ్దర్శనంగా వర్ణించాలికాని, మరణాన్ని సాక్షాత్తుగా వర్ణించరాదు" అని నిర్దేశించినాడు ధనంజయుడు. "ప్రకృతి-ప్రాణ వియోగం మరణం" అని శారదాతనయుడు.

"రోగాదిజన్యా, మూర్ఛారూపా, మరణ ప్రాగవస్థా, మరణం" అన్నాడు జగన్నాథుడు. అసలు మరణానికి ముందరి అవస్థఅయిన మూర్ఛయే మరణం అని అర్థం.

"ధనంజయం అనే పేరుగల వాయువు నిష్క్రమించటంవల్ల శరీరంనుంచి ఆత్మ వేరుపడటం మరణం" అని చెప్పి, అభిరామరాఘవంనుంచి, ప్రేయఃపర్మిక నుంచి ఉదాహరణ లిచ్చినాడు సింగభూపాలుడు. "ప్రాణ నిష్క్రమణం నిధనం" అన్నాడు భానుదత్తుడు.

"వ్యాధిమున్నగునవి ముదిరినప్పుడు సంభవించేది మరణం. కాని, ఇచ్చట చెప్పిన మరణం, నిధనమునకు ముందరి చిత్తవృత్తి మాత్రమే" అని సంగీత రత్నాకరకర్త.

'చిత్రాభినయం' అనే అధ్యాయంలో ఎనిమిది విషవేగాలను అభినయించే విధానం భరతముని వివరించినాడు:

కార్శ్యం—ప్రథమ వేగమందు వాడిన ముఖం చెక్కిళ్ళను కలిగి వాక్యాలను మెల్లగా పలుకుతూఉండాలి.

వేపథువు—ఇందు సర్వాంగాలను వణికిస్తూ, అంగాలను గోకికొంటూ [illegible] యథాయోగంగా హస్త-పాద-శిరముల నన్నింటిని కాని, లేదా [illegible] కంపింపజేస్తూ ఉండాలి (ఇది కాశీముద్రణ పాఠం; బరోడాముద్రణయందు లేదు).

దాహం—ఇందు, హస్త-గాత్రాలను విక్షిప్తం చేయవలె.

విలల్లిక (హిక్క-అని కాశీముద్రణ పాఠం)— మాటిమాటికి [illegible] అర్చుతూ, ఉద్గారం (=ఉమ్మి), ఛర్దనం (=వాంతులు), [illegible] ఆడించటం, అస్పష్టంగా మాటాడటం అనేవానిచేత దీనిని అభినయించవలె.

ఫేనం—ఉద్గార-వమనాలు, అనేకవిధాలైన శిరోవిలోలనాలు, నిస్సంజ్ఞత, నిమేషాలు అనే వాటిచే దీనిని అభినయించవలె.

గ్రీవాభంగం(=శిరోభంగం)— అంస-కపోలాలు కలిసేటట్లుగా శిరాన్ని వ్రేలాడవేయటం చేత దీనిని అభినయించవలె.

జడత—సర్వేంద్రియసంమోహం (=నిశ్చేష్టత) జడత అవుతుంది.

మరణం—వ్యాధి వృద్ధికావటంవల్ల లేదా పాముకాటువల్ల సంభవించే మరణాన్ని నాట్యధర్మిని అనుసరించి, నేత్రాలను సంమీలితం చేయటంచేత నిర్దేశించాలి.

## 32. త్రాసం

మూలం : త్రాసోనామ—

విద్యు దుల్కాశనిపాత నిర్ఘాతాంబుధర మహాసత్త్వ
పశురవాదిభిః విభావైః ఉత్పద్యతే. తమభి
నయేత్— సంక్షిప్తాంగోత్కంపన వేపథు స్తంభ
రోమాంచ గద్గద ప్రలాపాదిభిః అనుభావైః.
అత్ర శ్లోకో భవతి—
మహాభైరవనాదాద్యై స్త్రాసః సముపజాయతే ।
త్రస్తాంగాక్షినిమేషైశ్చ తస్య త్వభినయో భవేత్ ॥

-(నా.శా.VII-91)

అర్థం : త్రాసఃనామ, విద్యుత్-ఉల్కా-అశనిపాత-నిర్ఘాత-అంబుధర-మహాసత్త్వ-పశురవ- ఆదిభిః, విభావైః, ఉత్పద్యతే=త్రాసం అనేది, విద్యుత్తు, ఉల్క (=తోకచుక్క), అశనిపాతం (=పిడుగుపాటు), నిర్ఘాతం (=భూకంపం), మేఘధ్వని, పెద్దజంతువులు, పశువుల అరుపులు మున్నగు విభావాలవల్ల, జనిస్తుంది.

సంక్షిప్త-అంగ, ఉత్కంపన, వేపథు, స్తంభ, రోమాంచ, గద్గద, ప్రలాప-ఆదిభిః, అనుభావైః, తమ్, అభినయేత్=అవయవాలను ముడుచుకొనటం, గడగడ వణకటం, వేపథువు, స్తంభం, రోమాంచం, గాద్గద్యం, ప్రలాపం మున్నగు అనుభావాలచేత, దానిని, అభినయించాలి.

అత్ర, శ్లోకః, భవతి=ఇచ్చట, ఒకశ్లోకం, కలదు: మహాభైరవనాద-ఆద్యైః, త్రాసః, సముపజాయతే=మహాభయంకర నాదం మున్నగు వాటివల్ల త్రాసం జనిస్తుంది; స్రస్త-అంగ-అక్షినిమేషైః(చ), తస్య(తు), అభినయః, భవేత్=అంగశైథిల్యం, అక్షినిమీలనం-వీటిచేత త్రాసంయొక్క అభినయం, జర గాలి.

తాత్పర్యం : విభావాలు : విద్యుత్తు, ఉల్కలు, అశనిపాతం, నిర్ఘాతం, మేఘఘర్జన, మహాసత్త్వ దర్శనం, పశురవశ్రవణం మున్నగునవి.

అనుభావాలు : అంగసంక్షేపం, ఉత్కంపనం, వేపథువు, స్తంభం, రోమాంచం, గాద్గద్యం, ప్రలాపం మున్నగునవి.

ఇచ్చట ఒక శ్లోకం ఉన్నది :

విభావం : మహాభైరవనాదం మున్నగునవి.

అనుభావాలు : స్రస్తాంగం, అక్షినిమేషం.

టీక : "గర్జితాదులవల్ల కలిగే మనఃక్షోభం త్రాసం" అని ధనంజయుడు. "విద్యుత్-క్రవ్యాద గర్జితాదులవల్ల భుజంగాదులవల్ల కలిగే చిత్తచాంచల్యం త్రాసం" అంటూ విభ్రాంతిని, పార్శ్వస్థాలంబనాన్ని కూడా అనుభావాలుగా పేర్కొని, విద్యుత్-క్రవ్యాద, గర్జన-భేరీధ్వని-భూతదర్శన-భుజంగాలవల్ల కలిగే త్రాసాలకు ఉదాహరణ లిచ్చినాడు సింగభూపాలుడు. "భయానికి, త్రాసానికి మనఃక్షోభం కారణం; కాని విచారోత్థమనఃక్షోభం భయం; ఆకస్మికమనః క్షోభం త్రాసం" అని భానుదత్తుడు, సంగీతరత్నాకరకర్త.

ఉదా : ఉరుము వలని త్రాసం :

ప్రణయకోప భృతోఽపి పరాఙ్ముఖాః సపది వారిధరారవ భీరవః
ప్రణయినః పరిరబ్ధుమనంతరం, వవలిరే వలి రేచితమధ్యమాః ॥
(శిశుపాలవధ-II)

—ప్రణయకోపం వహించి, పరాఙ్ముఖలయి, వళులచేత తళుకులీను మధ్యములు గల యువతులు, వెంటనే ఉఱుములధ్వనులు విని భయపడి, ప్రియులను ఆలింగనం చేసుకొనుటకు తత్తరపడినారు.

# 33. వితర్కం

మూలం : వితర్కో నామ—
సందేహ విమర్శ విప్రతిపత్త్యాదిభిః విభావైః
ఉత్పద్యతే: తమభినయేత్ వివిధ విచారిత
ప్రశ్న సంప్రధారణ మంత్రసంగూహ నాదిభిః
అనుభావైః.
అత్ర శ్లోకో భవతి—
విచారణాది సంభూతః సందేహాతిశయాత్మకః।
వితర్కః సోఽభినేయస్తు శిరో భ్రూక్షేప కంపనైః॥
-(నా.శా.VII-92)

అర్థం : వితర్కఃనామ, సందేహ-విమర్శ-విప్రతిపత్తి-ఆదిభిః, విభావైః, ఉత్పద్యతే=వితర్కం (=తర్కం) అనేది సందేహం, విమర్శ, విప్రతిపత్తి (=అన్యథాభావన), మున్నగు, విభావాలవల్ల, కలుగుతుంది. వివిధవిచారిత-ప్రశ్న-సంప్రధారణ-మంత్ర సంగూహన-ఆదిభిః, అనుభావైః, తమ్, అభిన యేత్=వివిధ విచారాలు, ప్రశ్న, సంప్రధారణం (=నిర్ణయం), రహస్యం కప్పి పుచ్చటం, మున్నగు అనుభావాలచేత, దానిని, అభినయించాలి.

అత్ర, శ్లోకః, భవతి=ఇచ్చట, ఒకశ్లోకం, కలదు: వితర్కః, విచా రణ- ఆదిసంభూతః, సందేహ- అతిశయాత్మకః=వితర్కం, విచారణాదుల వల్ల జనిస్తుంది, అతిశయసందేహంతో కూడినది. శిరః- భ్రూక్షేప-కంపనైః, తమ్, అభినయేత్=తల ఆడించటం, కనుబొమలను ఎగురవేయటం— వీటి చేత, దానిని, అభినయించాలి.

తాత్పర్యం : విభావాలు : సందేహం, విమర్శ, విప్రతిపత్తి మున్నగునవి.
అనుభావాలు : వివిధ విచారణలు, ప్రశ్న, సంప్రధారణ, మంత్రగూహనం మున్నగునవి.

ఇచ్చట ఒక శ్లోకం ఉన్నది.

విచారణాదులవల్ల జనించే సందేహాత్మకమగు వితర్కాన్ని శిరఃకంపం, భ్రూక్షేపం— వీటిచేత అభినయించాలి.

**టీక :** "సహేతుకవిచారం తర్కం" అని శారదాతనయుడు. దూరంనుంచి చూసినవస్తువును నిశ్చయింపలేక, అది అవునా, కాదా అని విమర్శించాలి. మరచిన వస్తువును స్మరించటం కూడా ఇటువంటిదే— ఒకభావం గ్రహించి, దానిని విడువటం, ఇది అవునన్నప్పుడు శిరఃకంపం, ఇది కాదు అన్నప్పుడు శిరోధూననం మున్నగునవి చేయాలి (భా.ప్ర.)

"సందేహం, విమర్శ, నమ్మకం మున్నగువానివల్ల కలిగే సత్యమైన ఊహకాని, అసత్యమైన ఊహకాని నిర్ణయరూపంతాల్చితే అది తర్కం అవుతుంది" అని సింగభూపాలుడు. వితర్కసమయంలో చతురహస్తం ప్రయుక్తమవుతుంది అనీ, వితర్కంతో కూడిన స్థాయిభావం సాధారణంగా అవహిత్థతో కూడి ఉంటుంది అనీ సంగీతరత్నాకరకర్త.

## 34. ఛలం

మూలం : అత్రప్రతిభాతి ఛల మధికో వ్యభిచారి భావ ఇతి.
'తాంబూలాహరణచ్ఛలేన రభసాశ్లేషోఽపి సంవిఘ్నితః'—
ఇతి శృంగారే దర్శనాత్. రౌద్రే చేంద్రజాలాది
దర్శనాత్. హాస్యే చ వ్యపదేశాన్యాపదేశయోః
దర్శనాత్. వీథీ భేదే దర్శనాచ్చ.
సంగుప్త క్రియాసంపాదనం ఛలమ్.
విభావాః— అవమాన ప్రతిపక్ష కుచేష్టాదయః.
అనుభావాః— వక్రోక్తి నిభృత స్మితనిభృతవీక్షణ
ప్రకృతి ప్రచ్ఛాదనాదయః. -(రసతరంగిణి-V)

**తాత్పర్యం :** 'ఛలం' అనేది వేరే (=34వ) వ్యభిచారి భావంగా గోచరిస్తున్నది. తాంబూలం గ్రహించే ఛలంతో ఆకస్మికంగా (నాయికను) కౌగలించు కొనటం కూడా బాధాకరంగాఉంది— ఇది శృంగారరసంలో గోచరించేదే. రౌద్రరసమందు ఇంద్రజాలాదులు కన్పట్టుతాయి. హాస్యరసమందు (ఛలయుక్తమైన) వ్యపదేశం, అన్యాపదేశం ఉంటాయి. వీథీభేదమందు కూడా ఇది గోచరిస్తుంది.

ఏ కార్యమందైనా ఏదో గోపనంచేయాలనేచిత్తవృత్తి 'ఛలం' అవుతుంది (Trickful device; it denotes a thoughtfully workedout plan).

విభావాలు : అవమానం, ప్రతిపక్షుల కుచేష్టలుమున్నగునవి.

అనుభావాలు : వక్రోక్తి, గూఢమైన నవ్వు, గూఢమైన చూపు, స్వభావాన్ని కప్పిపుచ్చటం మున్నగునవి.

టీక : శృంగారమందలి ఛలానికి, సంగ్రామమందలి ఛలానికి భానుదత్తుడు ఉదాహరణలిచ్చినాడు. దీనిని భానుదత్తుడు తప్ప మరెవ్వరూ చెప్పలేదు.

మూకం కరోతివాచాలం పంగుం లంఘయతే గిరిమ్ ।
యత్కృపయా తమహం వందే పరమానందమాధవమ్ ॥
మందోఽప్యమందతామేతి సంసర్గేణ విపశ్చితః ।
పంకచ్ఛిదం ఫలస్యేవ నికషేణావిలం పయః ॥

-మా.అగ్ని-II-7

తవాధారే మూలే సహసమయా లాస్యపరయా
నవాత్మానం మన్యే నవరసమహాతాండవనటమ్ ।
ఉభాభ్యామేతాభ్యాముదయ విధిముద్దిశ్య దయయా
సనాధాభ్యాం జజ్ఞే జనక జననీ మజ్జగ దిదమ్ ॥

-సౌందర్యలహరి-41

# రసాలు

## 1. శృంగారం

శృంగారోనామ రతిస్థాయిభావప్రభవః, ఉజ్జ్వల
వేషాత్మకః. యథా యత్కించిల్లోకే శుచి మేధ్య
ముజ్జ్వలం దర్శనీయం వా తచ్ఛృంగారేణోపమీయతే.
యస్తావ దుజ్జ్వలవేషః స శృంగారవా నిత్యుచ్యతే.
యథా చ గోత్ర కులాచారోత్పన్నాన్యాప్తోపదేశ
సిద్ధాని పుంసాం నామాని భవంతి తథైవైషాం
రసానాం భావానాం చ నాట్యాశ్రితానాం
చార్థానామాచారోత్పన్నాన్యాప్తోపదేశ సిద్ధాని
నామాని. ఏవ మేష ఆచారసిద్ధో హృద్యోజ్జ్వల
వేషాత్మకత్వాచ్ఛృంగారోరసఇతి.
సచస్త్రీపురుష హేతుకః ఉత్తమ యువప్రకృతిః.
తస్య ద్వే అధిష్ఠానే-సంభోగో విప్రలంభశ్చ.
తత్ర సంభోగ స్తావత్-ఋతు మాల్యాను
లేపనాలంకారేష్టజనవిషయ వరభవ
నోపభోగోపవనగమనానుభవన శ్రవణ
దర్శనక్రీడాలీలాదిభిః విభావై రుత్పద్యతే.
తస్య నయనచాతుర్య భ్రూక్షేప కటాక్ష
సంచార లలిత మధురాంగహార వాక్యాదిభిః
అనుభావైః అభినయః ప్రయోక్తవ్యః.
వ్యభిచారిణశ్చాప్యాలస్యౌగ్రజుగుప్సావర్జ్యాః.
విప్రలంభకృతస్తునిర్వేదగ్లానిశంకాసూయాశ్రమ
చింతౌత్సుక్యనిద్రాసుప్త స్వప్నవిబోధ వ్యాధ్యున్మాదాప
స్మారజాడ్యమోహ మరణాదిభిః అనుభావైః అభినేతవ్యాః.
శ్యామో భవతి శృంగారః——42

శృంగారో విష్ణు దేవత్యః-----43
అత్రాహ-యద్యయం రతి ప్రభవః శృంగారః కథమస్య
కరుణాశ్రయిణో భావా భవంతి? అత్రోచ్యతే-పూర్వ
మేవాభిహితం సంభోగ విప్రలంభకృతః శృంగార ఇతి.
వైశికశాస్త్రకారైశ్చ దశావస్థోఽభిహితః, తాశ్చ
సామాన్యాభినయే వక్ష్యామః.
కరుణస్తు శాపక్లేశ వినిపతి తేష్టజన-విభవనాశ-
వధ-బంధ-సముత్థః నిరపేక్షభావః.
సాపేక్షభావో విప్రలంభకృతః ఔత్సుక్య-చింతాసముత్థః
ఏవమన్యః కరుణోఽన్యశ్చ విప్రలంభ ఇతి. ఏవమేష
సర్వభావసంయుక్తః శృంగారోభవతి.
అపిచ-
సుఖప్రాయేషు సంపన్నః ఋతుమాల్యాదిసేవకః ।
పురుషః ప్రమదాయుక్తః శృంగార ఇతి సంజ్ఞితః ॥ 46
అపి చాత్ర సూత్రార్థానువిద్ధే ఆర్యే భవతః :
ఋతుమాల్యాలంకారైః ప్రియజన గాంధర్వ కావ్యసేవాభిః ।
ఉపవనగమనవిహారైః శృంగారరసః సముద్భవతి ॥ 47
నయనవదన ప్రసాదైః స్మిత మధురవచో ధృతిప్రమోదైశ్చ ।
మధురైశ్చాంగ విహారై స్తస్యాభినయః ప్రయోక్తవ్యః ॥ 48
శృంగారం త్రివిధం విద్యాద్వాఙ్నైపథ్యక్రియాత్మకమ్ । 77
-(నా.శా.VI)

ఆలస్యౌగ్ర్యజుగుప్సాఖ్యై రేవం భావై స్తు వర్జితాః ।
ఉద్భావయంతి శృంగారం సర్వేభావాః స్వసంజ్ఞయా ॥
-(నా.శా.VII-109)

అర్థం : శృంగారః నామ రతిస్థాయిభావ, ప్రభవః =శృంగార (రస)ంఅనేది, రతి (అనే) స్థాయిభావం నుంచి, జనించేది; ఉజ్జ్వలవేషాత్మకః = ఉజ్జ్వలవేషం కలిగి ఉంటుంది. లోకే యత్-కించిత్, శుచి-మేధ్యం-ఉజ్జ్వలం-దర్శనీయం (వా) తత్, శృంగారేణ- ఉపమీయతే = లోకమందు ఏ కొంచెమైనా శుచిగా-మేధ్యం (= పవిత్రం) గా-ఉజ్జ్వలంగా- దర్శనీయంగా (ఉంటుందో) , అది, శృంగార (రసం) చేత , ఉపమింపబడుతుంది.

తావత్ యః, ఉజ్జ్వలవేషః, సః, శృంగారవాన్, ఉచ్యతే=అందుచేత, ఎవడు, ఉజ్జ్వలవేషంతో ఉంటాడో, అతడు,శృంగారవంతుడు, అని చెప్పబడు తున్నాడు.

యథా(చ) , గోత్ర-కుల-ఆచార-ఉత్పన్నా, అన్యా-ఆప్తోపదేశ, సిద్ధాని, నామాని పుంసాం, భవంతి = ఎట్లా, గోత్రం (= పితృపరంపర) - కులం (= మాతృపరంపర) - ఆచారం (వ్యవహారం)-వీటిని అనుసరించి, కలిగేవి కానీ, ఇంకా ఇతరములను (నామకరణ సమయంలో పెద్దలమాటను లేదా లోక ప్రసిద్ధిని) అనుసరించి కానీ స్త్రీ పురుషులకు, పేర్లు, ఏర్పడుతున్నవి.

తథా-ఏవ, నాట్యాశ్రితానాం (చ) ఏషాంరసానాంభావానాం(చ) అర్థానాం, ఆచారోత్పన్నా, అన్యాప్తోపదేశసిద్ధాని = అట్లాగే, నాట్యాశ్రిత ములైన ఈ రసాలకు, భావాలకు అర్థాలు పేర్లు, ఆచారముననుసరించి ఏర్పడుతాయి, ఇతరములకు ఆప్తోపదేశాన్ని పట్టి లేదా లోకప్రసిద్ధిని పట్టి ఏర్పడుతాయి.

ఏవం, హృద్య-ఉజ్జ్వలవేషాత్మకత్వాత్, ఏష శృంగారః రసః, ఆచారసిద్ధః = అట్లాగే, హృద్యం-ఉజ్జ్వలం అయిన వేషంతోకూడినది కావటం వల్ల, ఈ 'శృంగారరసం' (అనే పేరు) ఆచారసిద్ధమైనది; సః(చ) స్త్రీ-పురుష హేతుకః, ఉత్తమయువ ప్రకృతిః =అది (= శృంగారరసం), స్త్రీ-పురుషులు హేతువుగా కలది (= స్త్రీ పురుషుల మధ్య జనించేది), నిండు యౌవనంలో ఉన్న ఉత్తమ స్త్రీ పురుష ప్రకృతులకు సంబంధించినది.

తస్య, ద్వే, అధిష్ఠానే సంభోగః, విప్రలంభః (చ) = దానియొక్క (= దానికి) రెండు, అధిష్ఠానములు (= అవస్థలు) కలవు - సంభోగశృంగారం, విప్రలంభ శృంగారం.

తత్ర, సంభోగః, తావత్ = ఇందు, సంభోగశృంగారం అనేది; ఋతు, మాల్య, అనులేపన, అలంకార, ఇష్టజన విషయ, వరభవన-ఉపభోగ, ఉప వన గమన - అనుభవన, శ్రవణ, దర్శన, క్రీడా, లీల - ఆదిభిః, విభావైః, ఉత్పద్యతే = (వసంతాది) ఋతువులు, పుష్పహారాలు, (కామోద్దీపకములైన గంధాది) మైపూతలు, నగలు, (విదూషకుడు మున్నగు) ఇష్టజనులతో సహ వాసం, శ్రేష్ఠమైన భవనం అందులో నివాసం, ఉద్యానవన గమన విహారములు, వానిని గూర్చి వినటం లేదా దర్శించటం, జలక్రీడలు మున్నగు, జనుల అనుకరణ మొదలగు విభావముల వల్ల, ఉత్పన్నమవుతుంది.

నయన చాతుర్య, భ్రూక్షేప, కటాక్షసంచార, లలిత అంగహార, మధుర వాక్య-ఆదిభిః, అనుభావైః, తస్య, అభినయః, ప్రయోక్తవ్యః =కనులను చతురతతో త్రిప్పటం, కనుబొమలను కదిలించటం, కటాక్షములను ప్రస రింప జేయటం, లలితములైన అంగవిన్యాసములు చేయటం, మధురములైన మాటలు చెప్పటం - మున్నగు అనుభావాలచేత, దాని (= సంభోగశృంగారం) యొక్క, అభినయం, చేయాలి.

అన్యవ్యభిచారిణః, ఆలస్య-ఔగ్ర్య-జుగుప్సా, వర్జ్యాః=దీనియొక్క వ్యభి చారి భావాలలో ఆలస్యం, ఉగ్రత, జుగుప్స- ఈ మూడున్నూ వర్జ్య ములు. (తక్కిన 30 వ్యభిచారి భావాలను సంభోగ శృంగారమందు ప్రయోగించవచ్చు).

విప్రలంభకృతః (తు) = విప్రలంభకృతమైన శృంగారమును; నిర్వేద, గ్లాని, శంకా, అసూయా, శ్రమ, చింతా, ఔత్సుక్య, నిద్రా, సుప్త, స్వప్న, విబోధ, వ్యాధి, ఉన్మాద, అపస్మార, జాడ్య, మోహ, మరణ - ఆదిభిః, అనుభావైః, అభినేతవ్యః = నిర్వేదం, గ్లాని, శంక, అసూయ, శ్రమ, చింత, ఔత్సుక్యం, నిద్ర, సుప్తం, స్వప్నం, విబోధం, వ్యాధి, ఉన్మాదం, అపస్మారం, జాడ్యం, మోహం, మరణం - మున్నగు అనుభావాలచేత, అభినయింపదగును.

శృంగారః, శ్యామః, భవతి = శృంగారం, శ్యామవర్ణం, కలది. శృంగారః, విష్ణుదేవత్యః =శృంగారము(నకు), విష్ణువు (అధి) దైవం; అత్ర ఆహ = ఇచ్చట (ఋషులు) (ప్రశ్న) అడిగినారు.

అయం, శృంగారః రతి ప్రభవః, యది, అస్య, కరుణాశ్రయిణః, భావాః, కథం, భవంతి = ఈ శృంగారం, రతి ప్రభవమైనది (కదా), అయితే, దానికి, కరుణ రసాన్ని ఆశ్రయించే భావాలు ఎట్లా పొందుపడతాయి?

అత్ర-ఉచ్యతే = ఇచ్చట (భరతమునిచేత సమాధానం) చెప్పబడుతున్నది.

శృంగారః, సంభోగ-విప్రలంభకృతః, ఇతి, పూర్వం-ఏవ, అభిహితం =శృంగారం సంభోగం- విప్రలంభం అనే భేదాల చేత రెండు విధాలు, అని పూర్వమే చెప్పబడింది. వైశికశాస్త్రకారైః (చ), దశ-అవస్థః, అభిహితః = వైశిక(= కామ) శాస్త్రకారులచేత, దశావస్థలు (= దశకామావస్థలు), చెప్ప బడినవి. తాః (చ) సామాన్యాభినయే, వక్ష్యామః= వానిని, సామాన్యాభి నయం (అనే 22 వ అధ్యాయం) లో చెబుతాను.

కరుణః (తు), శాప, క్లేశ, వినిపతిత, ఇష్టజన-విభనాశ, వధ-బంధ- సముత్థః, నిరపేక్షభావః =కరుణము-శాపం, క్లేశం, ఇష్టజనుల (లేదా ప్రియుల) వియోగం, విభవనాశం, వధ, బంధం- వీనివల్ల ఉత్పన్నమైనది, నిరపేక్షభావం కలది (= ఆశారహితమైనది); ఔత్సుక్య-చింతా సముత్థః, సాపేక్షభావః, విప్రలంభకృతః =ఔత్సుక్యం, చింత వీనినుంచి ఉత్పన్నమైనది, సాపేక్షా భావసంయుక్తమైనది (= ఆశాసహితమైనది) విప్రలంభకృతశ్శృంగారం. ఏవం, కరుణః అన్యః, విప్రలంభః, అన్యః (చ), ఇతి = ఇట్లా కరుణం వేరు, విప్రలంభం వేరు, అని (తెలియవలె). ఏవం, ఏష, శృంగారః, సర్వభావసంయుక్తః, భవతి =ఇట్లా, ఈ శృంగారం, సర్వభావాలతో కూడి ఉంటుంది. అపి(చ) = మరియు, సుఖప్రాయేషు, సంపన్నః, ఋతు- మాల్యాది సేవకః, ప్రమదాయుక్తః = సుఖప్రాయములగు ఇష్టములతో, కూడినవాడును, ఋతు మాల్యాదులను అనుభవించువాడును, ప్రమదాయుక్తుడును (= ప్రియురాలితో కూడినవాడును) (అయిన); పురుషః, శృంగారః, ఇతి, సంజ్ఞితః = పురుషుడు, శృంగారవంతుడు, అని పిలువబడుతాడు.

అపి (చ), అత్ర, సూత్ర-అర్థ-అనువిద్ధే, ఆర్యే, భవతః = మరియు, ఇచ్చట, సూత్రం యొక్క అర్థమును వివరించే, రెండు ఆర్యావృత్తములు కలవు.

ఋతు-మాల్య-అలంకారైః, ప్రియజన-గాంధర్వ-కావ్య సేవాభిః, ఉపవనగమన-విహారైః, శృంగారరసః, సముద్భవతి =ఋతువులు-మాల్యములు-అలంకారములు-ప్రియజనులు-గీతాదివాద్య విషయములు-కావ్యశ్రవణ-పఠనములు మున్నగువానివల్ల శృంగారరసం, ఉద్భవిస్తుంది.

నయన-వదన ప్రసాదైః, స్మిత-మధురవచః, ధృతి-ప్రమోదైః (చ), మధురైః (చ)- అంగవిహారైః, తస్య, అభినయః, ప్రయోక్తవ్యః = నయనములు-వదనములు ప్రసన్నంగా ఉండటం, స్మితం, మధురవాక్కులు, ధృతి, ప్రమోదం, మధురములైన అంగవిన్యాసాలు వీనిచేత, దానియొక్క, అభినయం, చేయదగును.

వాక్-నైపథ్య-క్రియాత్మకం శృంగారం, త్రివిధం, విద్యాత్ = వాగాత్మకం, నైపథ్యాత్మకం, క్రియాత్మకం- (అనేభేదాలచేత), శృంగారం, మూడు విధాలు అవుతుంది.

ఆలస్య-ఔగ్ర్య-జుగుప్సా-ఆఖ్యైః, ఏవంభావైః (తు) వర్జితాః = ఆలస్యం, ఉగ్రత, జుగుప్స- ఈ పేర్లుగల, భావములను విడిచి; సర్వేభావాః, స్వసంజ్ఞయా, శృంగారం, ఉద్భావయంతి = తక్కిన అన్నిభావాలు, స్వీయనామములతో, శృంగారరసమును ఉద్భవింపజేస్తాయి.

తాత్పర్యం : శృంగారం 'రతి' అనే స్థాయి భావం నుంచి జనిస్తుంది. ఉజ్జ్వలవేషంతో ఉంటుంది. లోకంలో ఏదేని శుచిగా, మేధ్యంగా, ఉజ్జ్వలంగా దర్శనీయంగా ఉంటే దానిని 'శృంగారం' తో ఉపమిస్తారు. ఉజ్జ్వల వేషయుతుడు, శృంగారవంతుడు అనబడుతున్నాడు. గోత్ర-కుల- ఆచారాలను అనుసరించి కాని, పెద్దలమాటలను అనుసరించి కాని, లోక ప్రసిద్ధిని పట్టి కాని స్త్రీ-పురుషులకు పేర్లు ఏర్పడుతున్నట్లే, ఆచారాన్ని లేదా పెద్దల మాటను అనుసరించి నాట్యాశ్రితములైన రసాలకు, భావాలకు అర్థాలు, పేర్లు ఏర్పడినవి. హృద్యం, ఉజ్జ్వలం అయిన వేషం కలది కావున 'శృంగారం' అనే పేరు ఆచారసిద్ధమైనది. ఈ శృంగారరసం నిండు యౌవనంలో ఉన్న ఉత్తమ స్త్రీ పురుష ప్రకృతులకు సంబంధించినదిగా ఉంటుంది.

ఇట్టి శృంగారం-సంభోగం, విప్రలంభం అనే భేదాలతో రెండు విధాలు.

సంభోగ శృంగారం :

విభావాలు : వసంతాది ఋతువులు, పుష్పహారాలు, కామోద్దీపకములైన పూతలు, నగలు, విదూషకుడు మున్నగు ఇష్టజనుల సహవాసం, గీతాదులు, శ్రేష్ఠములైన భవనములు, వానియందలి నివాసం, ఉద్యానవిహారములు లేదా వానిని గూర్చిన ప్రశంసలు, కామోద్దీపకములైన చిత్రాదులు, ఉత్తమజనుల అనుకరణ, జలక్రీడలు మున్నగునవి.

అనుభావాలు : కనులను కనుబొమలను చతురతతో కదలించటం, కడకంటి చూపులు ప్రసరించటం, లలితములైన అంగవిన్యాసములు ప్రదర్శించటం, మధురములైన మాటలు చెప్పటం మున్నగునవి.

వ్యభిచారి భావాలు : ఆలస్యం, ఉగ్రత, జుగుప్స - ఈ మూడు తప్ప తక్కిన 30 వ్యభిచారిభావాలు ఇందు (సంభోగ విప్రలంభములు రెండింటి యందు) ప్రయుక్తమౌతాయి.

విప్రలంభశృంగారం :

అనుభావాలు : నిర్వేదం, గ్లాని, శంక, అసూయ శ్రమ, చింత,

ఔత్సుక్యం, నిద్ర, సుప్తం, స్వప్నం, ప్రబోధం, వ్యాధి, ఉన్మాదం, అపస్మారం, జాడ్యం, మోహం, మరణం మున్నగునవి.

*ఋషుల ప్రశ్న : శృంగారం రతి ప్రభవమైనది కదా? అందులో కరుణాశ్రయములైన నిర్వేదాది భావాలు ఎట్లా ఉంటాయి?*

భరతముని సమాధానం : శృంగారమందు సంభోగం, విప్రలంభం అనే రెండు భేదాలు కలవని పూర్వమే చెప్పాను కదా? అందు విప్రలంభ శృంగారం అభిలాషాది దశకామావస్థలను కలిగి ఉంటుందని వైశికశాస్త్రకారులు చెప్పారు; వానిని సామాన్యాభినయమందు వివరిస్తాను. శాపక్లేశం, ఇష్టజననాశం, విభవనాశం, వధ, బంధనం అనేవానివల్ల సముత్పన్నమై అపేక్షా (=ఆశా)రహితమైనది కరుణము. ఇంక విప్రలంభం ఔత్సుక్య-చింతల వల్ల ఉత్పన్నమై అపేక్ష (= ఆశ)తో కూడి ఉంటుంది. కరుణరస-విప్రలంభశృంగారములకు నిరపేక్షత్వ- సాపేక్షత్వములే భేదకములు కాని నిర్వేదాదిభావాభినయమందు భేదం ఉండదు. కావున శృంగారమునందు నిర్వేదాది సర్వభావములును సంభవిస్తాయి. అందుచే కరుణరసం వేరు, విప్రలంభశృంగారం వేరు అని తెలియవలెను. ఈ అంశములను వివరించే శ్లోకం కలదు.

సుఖప్రాయములైన ఇష్టములతో కూడినవాడై, ప్రమదాయుక్తుడుగా ఋతుమాల్యాదులను అనుభవిస్తూ ఉండే పురుషుడు 'శృంగార'పదవాచ్యుడవుతాడు (అంటే పై విశేషాలతో ఉన్న పురుషుడు శృంగారరసమునకు 'విభావం' అని అర్థం).

పై సూత్రాన్ని వివరించే రెండు ఆర్యావృత్తములు కలవు :

ఋతు-మాల్య-అలంకారాలు, విదూషకాది ప్రియజనులు, గీతాది హృద్య విషయాలు, కావ్యశ్రవణ- పఠనాలు, ఉద్యానవనగమన– విహారములు-ఇవి శృంగారరస సముద్భవమునకు హేతువులు. నయన-వదన ప్రసన్నతలు, స్మితం, మధురవాక్కులు, ధృతి, ప్రమోదం, మధురములైన అంగవిన్యాసములు- వీనిచేత శృంగారరసాన్ని అభినయించాలి.

శృంగారం యొక్క రంగు శ్యామవర్ణం.

శృంగారమునకు విష్ణువు అధిదైవం.

వాగాత్మకం, నైపథ్యాత్మకం, క్రియాత్మకం అనే భేదాలచేత శృంగారం మూడు విధాలు.

ఆలస్యం, ఉగ్రత, జుగుప్స- ఈ మూడు భావాలు కాక తక్కిన 30 వ్యభిచారి భావాలు స్వీయనామములతో శృంగారసోద్భవమునందు సహాయ పడతాయి.

టీక : 1. వైశికశాస్త్రం—వేశం = వేశ్యావర్గం, వారితోడి సంభోగమును గూర్చి చెప్పేది వైశిక శాస్త్రం అవుతుంది; అంటే 'కామసూత్రం' అని అర్థం (అభినవభారతి -1 వసంపుట 309).

2. కరుణం, విప్రలంభం అనే అవస్థలను రెండింటిని కలిపివేసి, విశ్వనాథాది అర్వాచీనాలంకారికులు 'కరుణవిప్రలంభం' అనే విప్రలంభ శృంగార భేదాన్ని వేరుగా చెప్పినారు. దీనిని గూర్చి తరువాత వివరిస్తాను. అంతేకాదు అయోగ విప్రలంభం, విరహవిప్రలంభం, మానవిప్రలంభం, ప్రవాసవిప్రలంభం, శాపవిప్రలంభం, అనే భేదాలను కూడా అర్వాచీనులు చెప్పినారు.

3. "గోత్ర-కుల-ఆచారాలను అనుసరించి కాని. . . . . . నామములేర్పడుచున్నట్లే . . . . . . " ఇచ్చట అభినవగుప్తుని వ్యాఖ్య ఇట్లున్నది: గోత్రం = తండ్రియొక్క తండ్రి తాతముత్తాతల యొక్క పేర్లను అనుసరించి పేర్లుపెట్టటం - ఇది బాలురకు వర్తిస్తుంది. కులం = మాతృపరంపరనుంచి పేర్లుపెట్టటం-ఇది బాలికలకు వర్తిస్తుంది.

ఆప్తోపదేశం = నామకరణ సమయంలో అచ్చటచేరిన పెద్దల సలహాను అనుసరించి పేరుపెట్టటం. ఆచారం = వ్యవహారం లేదా వృత్తిని పట్టి పేరుపెట్టటం.

4. విభావంలో ఆలంబన విభావం, ఉద్దీపన విభావం అనే భేదాలను అర్వాచీనులు చెప్పినారు. ఇది భరతప్రోక్తం కాకపోవటం చేత ఈ విభజన కాల్పనికమన్నాడు అభినవగుప్తుడు (అ.భా. 1 వ సంపుట 304).

5. 'శృంగం' అంటే ప్రధానం, శ్రేష్ఠం అని అర్థం; అది పొందినది శృంగారం. దేశ-కాల-వయో- ద్రవ్య-గుణ-ప్రకృతి-కర్మలనే భావపదార్థాలతో ఉత్తమంగా ఉన్న దానిని 'శృంగం' అంటారు. అనగా శ్రేష్ఠం అని అర్థం . సర్వప్రధానతను పొందిన వానిని 'శృంగారి' అనటంలోకరీతి (భా.ప్ర.-II-220).

6. వాగాత్మకాది భేదాలచేత శృంగారం మూడు విధాలని భరతముని చెప్పిన దానిని శారదాతనయుడిట్లా వివరించినాడు:

శృంగారం-భావగర్భం, రహస్సంవిన్మధురం. అంటే ప్రేయసీ ప్రియులు రహస్యంగా హృదయంలో ఉంచుకొన్న భావసంవేదనములను ఈ సమయంలో వ్యక్తం చేసుకొంటారు. కాబట్టి అట్టి సంవేదనం ఇచ్చట మధురంగా ఉంటుంది; ఇది

నర్మ పేశలం; నర్మం అంటే శృంగారాత్మకమైన కర్మ. దానిచేత ఇది మనోహరం. మంచి వృత్తములతో ఉంటుంది. కావ్యములందలి శృంగారసూచకములైన శ్లోకాలు, పద్యాలు శృంగారోచితములైన వృత్తాలతో ఉంటాయి - ఇవి వినుటకు ఇంపుగా ఉంటాయి. ఇట్టిది వాచిక శృంగారం లేదా వాగాత్మకం. మంచి వస్త్రాలు, అంగరాగం, ఆభరణాలు, పుష్పమాలలు మున్నగు వానితో అలంకృతమై, యౌవన సంపదతో అలరారే దేహం- ఇట్టిది ఆంగిక శృంగారం లేదా నైపథ్యాత్మకం.

దంతక్షతాలు, నఖక్షతాలు, మణితధ్వనులు, సీత్కారాలు, చుంబనాలు, చూషణములు (= పీల్చుట =అస్వాదనములు), భావ-హావ-హేలాదులు, కేళీ విలాసాలు, శయనాద్యుపచారాలు, సంగీతక్రియలు, మున్నగునవి- ఇట్టిది క్రియా శృంగారం లేదా క్రియాత్మకం.

7. భరతరసప్రకరణకర్త ఇట్లా వివరించినాడు :

విభావ-అనుభావ-సాత్త్వికభావ-వ్యభిచారిభావాల సామాన్యగుణయోగం వల్ల సదస్యులకు ఆస్వాద్యత్వం కలిగించే రతిస్థాయియే శృంగారరసం అనబడుతుంది. ఈ శృంగారరసంలో -

ఆలంబన విభావం : కావ్య-నాట్యాలలోని నాయికా-నాయకులు

ఉద్దీపనవిభావం : రూపం, యౌవనం, లావణ్యం, కులం, శీలం మున్నగు నాయికా-నాయకుల గుణాలు, మధురములైన పలుకులు, సంగీతకలాదులు.

చేష్టలు : భుజవిన్యాసం, కటాక్షం, హాసం మున్నగునవి.

తటస్థాలు : పుష్పాలు, గంధం, వస్త్రం, కటకములు మున్నగు అలంకారాలు, చంద్ర-దీపాదులు.

అనుభావాలు : కాంతదృష్టి, ప్రసన్నం-రాగరంజితం అయిన ముఖం, మధురములైన ఆలాపాలు, గుణసంకీర్తనం మున్నగునవి.

సాత్త్వికభావాలు : స్తంభం, కంపం మున్నగునవి.

వ్యభిచారి భావాలు : ఔత్సుక్యం, చింత, హర్షం మున్నగు సర్వభావాలు (భరతాదులు ఆలస్యం, ఉగ్రత, జుగుప్స, మరణం - వీనిని నిషేధించినారు).

8. శృంగారరసగతులు : దూతికదారి చూపుతూ ఉండగా, నాయకుడు రంగస్థలం ప్రవేశించి, అర్థవంతమగు 'సూచాభినయం' చేయాలి. హృద్యములగు వస్త్రాలతో, గంధ-ధూప-చూర్ణ-పుష్పమాలాదులతో అలంకృతుడై, అతిక్రాంతచారీ స్థితి పాదాలతో, లయానుసారంగా, సౌష్ఠవోపేతంగా, లలితంగా ముందుకుసాగాలి.

హస్తాలు పాదగతిని అనుసరించాలి- పాదాలు నేలమీదపడేటప్పుడు హస్తాలు పైకి లేవాలి, పాదాలు పైకి లేచినప్పుడు హస్తాలు వ్రేలాడాలి - ఇది స్వస్థకామితమందలి గతి.

పరిజనరహితుడు, స్రస్తగాత్రుడు అయిన నాయకుడు అల్పంగా భూషణాలను, తత్కాలోచితములగు వస్త్రాలను ధరించి, దీపరహితంగా, నిశ్శబ్దంగా, మందంగా, దూతికదారి చూపుతూ ఉండగా సాగాలి. శబ్దమైతే శంకతో అటునిటు చూస్తూ, ఔత్సుక్యంతో, వణకుతున్న శరీరంతో, తొట్రుపాటుతో నడక సాగాలి - ఇది ప్రచ్ఛన్నకామితమందలి గతి.

*(1)* సంభోగశృంగారం :

మూలం : స్పర్శనాలింగనాదీనా మానుకూల్యా న్నిషేవణమ్ ।
ఘటతే యత్ర యూనో ర్యత్ స సంభోగ శ్చతుర్విధః ॥
సఙ్క్షిప్తః సంకీర్ణః సంపన్నతరః సమృద్ధిమా నితి తే ।
పూర్వ్యానురాగ మాన ప్రవాస కరుణానుసంభవాః క్రమతః ॥
-(ర.సు.II-219-20)

అర్థం : యత్ర, యూనోః, అనుకూల్యాత్, స్పర్శన-ఆలింగనాదీనామ్, నిషేవణం, యత్, ఘటతే, సః, సంభోగః(చ) , చతుర్విధః = ఎచ్చట, యువతీయువకుల, పరస్పర-ఆనుకూల్యం వల్ల, స్పర్శ (= చుంబనం, అధర పానం)- ఆలింగనం మున్నగువాని అనుభవం,ఏదికలుగుతుందో, అది, సంభోగ శృంగారం అవుతుంది. ఈ సంభోగ శృంగారం నాలుగు విధాలు.

తే, సఙ్క్షిప్తః, సంకీర్ణః, సంపన్నతరః, సమృద్ధిమాన్, ఇతి = అని (= ఆ నాలుగు భేదాలు) - సఙ్క్షిప్తం, సంకీర్ణం, సంపన్నతరం, సమృద్ధిమంతం, అని.

క్రమతః, పూర్వ్యానురాగ, మాన, ప్రవాస, కరుణ-అనుసంభవాః, = ఈ నాలుగు క్రమంగా, పూర్వ్యానురాగం, మానం, ప్రవాసం, కరుణం, అనే నాలుగు (విప్రలంభ) భేదాలను అనుసరించి ఉంటాయి.

తాత్పర్యం : యువతీ-యువకులు తమ మధ్యగల పరస్పరానుకూల్యం వల్ల స్పర్శ, ఆలింగనం మున్నగునవి అనుభవించటం సంభోగ లేదా సంయోగ శృంగారం అవుతుంది. ఇది నాలుగు విధాలు.

ఆ నాలుగు భేదాలు : (1) సంక్షిప్తం, (2) సంకీర్ణం, (3) సంపన్న (తర)ం, (4) సమృద్ధిమంతం. ఇవి క్రమంగా పూర్వానురాగం, మానం, ప్రవాసం, కరుణం అనే భేదాలను అనుసరించి ఉండే ఉపచార భేదాలు.

టీక : (i) ఇంతకు పూర్వం కలయిక లేని లేదా కలసికొని ఎడబాసిన యువతీ-యువకులు ( = నాయికా నాయకులు) పరస్పరం కలిసికొన్నప్పుడు కోరిన ఆలింగనాదులు సిద్ధింపగా కలిగిన హర్షాదులచేత సంస్పృజ్యమానమై, చంద్రోదయాదులచేత వృద్ధిపొందింపబడి, స్మితాదుల చేత వ్యక్తమై, పరిపుష్టిపొంది 'సంభోగశృంగారం' అనబడుతుంది.

(ii) భరతముని సంభోగశృంగారమనగా భానుదత్తాదులు సంయోగ శృంగారమన్నారు. "యువతీయువకుల పరస్పర పరిపూర్ణ ప్రమోదం లేదా సమ్యక్సం పూర్ణరతిభావం సంయోగ శృంగారం. యువతీయువకులలో ఒకరికే ప్రమోదం కలగటం, లేదా రతిలో ఆధిక్యం లేదా న్యూనత్వం ఉండటం లేదా వ్యతిరేకత ఉండటం వల్ల పరిపూర్తి ఉండదు కాన, అది అభాసమే అవుతుంది" అని రసతరంగిణిలో భానుదత్తుడు.

భరతముని సంభోగశృంగారమునకు విభావాలు, అనుభావాలు, వ్యభిచారిభావాలు వివరించినాడేకాని, అందుభేదములున్నవని చెప్పలేదు. కాని, సింగభూపాల-శారదాతనయ -విశ్వనాథాదులు నాలుగు భేదాలు వివరించినారు.

(iii) పూర్వానురాగం తరువాత కలిగే సంయోగ శృంగారంలో కామోపచారం సంక్షిప్తంగా ఉంటుంది, మానవిప్రలంభం తరువాత సంకీర్ణంగానూ, ప్రవాసవిప్రలంభం తరువాత సంపన్నంగానూ, కరుణ విప్రలంభం తరువాత సమృద్ధిమంతంగానూ ఉంటుంది.

(అ) సంక్షిప్తం :

యువానౌ యత్ర సంక్షిప్తాన్ సాధ్వసవ్రీళితాదిభిః ।
ఉపచారాన్ విషేవంతే స సంక్షిప్త ఇతీరితః ॥ 221

అర్థం : యత్ర, యువానః, సాధ్వస-వ్రీళిత-ఆదిభిః, సంక్షిప్తాన్, ఉపచారాన్, విషేవంతే, సః, సంక్షిప్తః, ఇతి, ఈరితః = ఎక్కడ, యువతీయువకులు, సాధ్వసం, సిగ్గు మున్నగు వానివల్ల సంక్షిప్తములగు (= తక్కువ) ఉపచారాలను పొందుతారో అది 'సంక్షిప్తం' అని చెప్పబడింది.

తాత్పర్యం : యువతీ యువకులు, భయం, సిగ్గు మున్నగు వానిచేత తక్కువ (= తృప్తికరంకాని) ఉపచారములను పొందితే, అది 'సంక్షిప్తం' అనబడుతుంది.

(ఆ) సంకీర్ణం :
సంకీర్ణస్తు భవే ద్యత్ర వ్యలీకస్మరణాదిభిః ।
సంకీర్యమాణః సంభోగః కించిత్ పుష్పేషుపేశలః ॥ 222

అర్థం : యత్ర, వ్యలీకస్మరణ ఆదిభిః, సంభోగః, సంకీర్యమాణః(తు), భవేత్, (సః), సంకీర్ణః (తు) కించిత్, పుష్పేషుపేశలః, = ఎచ్చట, వ్యలీక (= అపరాధ) స్మరణాదుల చేత, సంభోగం, సంకీర్యమాణం అవుతుందో (అది) సంకీర్ణం, (అది) మన్మథచేష్టలందు సుకుమారంగా ఉంటుంది.

తాత్పర్యం : పూర్వాపరాధ స్మరణం చేత మనస్సు వ్యాకులమవుతుంది. అయినా మన్మథచేష్టలు సుకుమారంగా ఉంటే, అది సంకీర్ణం అవుతుంది.

(ఇ) సంపన్నం :
భయవ్యలీకస్మరణాద్యభావాత్ప్రాప్తవైభవః ।
ప్రోషితాగతయో ర్యూనో ర్భోగః సంపన్న ఈరితః ॥ 223

అర్థం : భయ-వ్యలీక స్మరణ -ఆది-అభావాత్, ప్రాప్తవైభవః, ప్రోషిత-అగతయోః, యూనోః, భోగః, సంపన్నః, ఈరితః = భయం, వ్యలీకం మున్నగునవి లేనిదై ప్రాప్తించిన వైభవంతో, ప్రవాసానంతరం మరల కలిసికొన్న యువతీ యువకుల, సంభోగం, 'సంపన్నం' అనబడుతుంది.

తాత్పర్యం : సంక్షిప్తమందలి సాధ్వసాదులు కానీ, సంకీర్ణమందలి వ్యలీక స్మరణాదులు కానిలేనిదై, వైభవోపేతమైనదై, ప్రవాసానంతరం మరల కలిసికొన్న యువతీయువకుల సంభోగం 'సంపన్నం' అవుతుంది.

(ఈ) సమృద్ధిమంతం :
పునరుజ్జీవతాం భోగసమృద్ధిః కియతీ భవేత్ ।
శివాభ్యామేవ విజ్ఞేయ ఇత్యయం హి సమృద్ధిమాన్ ॥ 224

అర్థం : పునః-ఉజ్జీవతాం, భోగసమృద్ధిః, కియతీభవేత్, శివాభ్యాం-ఏవ, విజ్ఞేయః, ఇతి, అయం(హి), సమృద్ధిమాన్ = తిరిగి బ్రతికి (కలిసికొన్న వారి)

భోగసమృద్ధి, ఇంతమాత్రం అని, ఆ ఆదిదంపతులకే తెలుసును, ఇటువంటిది, సమృద్ధిమంతం.

తాత్పర్యం : చనిపోయి తిరిగి బ్రతికినవారియొక్క భోగసమృద్ధి 'ఇంత మాత్రం' అని ఆదిదంపతులైన పార్వతీపరమేశ్వరులకే తెలియాలి. ఇట్టిది సమృద్ధిమంతం. (ఆ భోగ సమృద్ధి ఇంతటిది అని వారికే తెలుసును అంటే అది గణింపశక్యం కాదన్నమాట!).

టీక : (i) సంక్షిప్తం : ప్రథమ సమాగమంలో పరస్పరోపచారాలు సాధ్వ సాదులతో కూడి ఉంటాయి కాబట్టి సంభోగ ప్రక్రియా విశేషాలన్నీ మితంగానే ఉంటాయి.

సంకీర్ణం : ప్రియునితోడి సమాగమం ఇష్టమైనా, పూర్వాపరాధ స్మరణం చేత కోపం కూడా ఉంటుంది. కావున ఇచ్చట సంభోగం సంకీర్ణం.

సంపన్నం : ప్రవాసానంతరం తిరిగి కలిసికొన్నప్పటి సమ్యక్సంభోగం సంపన్నం అవుతుంది (= ఉపచారాలు అధికంగా ఉంటాయి).

సమృద్ధిమంతం : మృతులై, జీవించిన వారి సంభోగం అవధులు లేకుండా ఉంటుంది కావున సమృద్ధిమంతం అవుతుంది.

(ii) శృంగారోచిత దేశాదులు :

శృంగారరస ప్రపంచన సందర్భంలో శారదాతనయుడు క్రింది విశేషాలను వివరించినాడు (భా.ప్ర. IV58-89).

శృంగారోచితములయిన దేశాలు :

సముద్రతీరం, ఉద్యానం, నదీభాగం, శైలపరిసరం, పురప్రదేశం, రాష్ట్ర భవనం, అంబురాశి, కాంతారం, ఆశ్రమం, హర్మ్యం మొ.

శృంగారోచితకాలాలు :

వసంతాది ఋతువులు, పగటి సమయం, రాత్రిసమయం, చంద్రోదయం, చంద్రాస్తమయం, సూర్యోదయం, సూర్యాస్తమయం.

శృంగారోచితవేషం :

నాయికా-నాయకుల జాతి-కులాశ్రయమైన అలంకారయోగం 'వేషం' అవుతుంది.

శృంగారోచిత బాహ్యచేష్టలు :

ఉద్యానయాత్ర, మదిరాపానం, జలకేళి, వసంతోత్సవం, విప్రలంభం, వివాహం.

దివావిహారప్రదేశాలు :

నదీపరిసరాలు, పులినప్రదేశాలు, సాగరతీరం, కాంతారం, ఆరామం, శైలం, చిత్రములైన లతాగృహాలు, కిసలయాంచితములైన శయ్యలు.

ఉద్యానయాత్ర, సలిలక్రీడ, పుష్పాపచయం, ద్యూతం మున్నగునవి - ఇవి దివాచేష్టలు.

నిశావిహార ప్రదేశాలు :

హర్మ్య-ప్రాసాదభూములు, మంటపం, గర్భగృహం, వాసగృహం (= పడక టిల్లు), సంగీతశాల, వేశ్యాంతఃపురం.

మదిరాదులు-ఇవి నిశాచేష్టలు.

(iii) శృంగారోచితదేశ విశేష హేతువులగు కాల-గుణ-ద్రవ్య-క్రియల స్వరూపం.

కాలగుణాలు : చంద్రిక, కోకిలాలాపాలు, హంసధ్వని, సారసధ్వని, భ్రమించే తుమ్మెదల గీతాలు, సర్వసుఖావహములయిన గంధాలు, మయూరాలకేకారవాలు.

ద్రవ్యములు : పరిమలయుక్తములయిన చందనాలు, మృదులము లయిన శిలాతలాలు, చంపక- అశోక-పున్నాగ-చూతవృక్షాలు, కురవకాదులు, ప్రవాళాలతో పుష్పాలతో కూడుకొన్న మల్లికాదిలతలు, రమ్యములైన భవనాలు, మృదు వుగానుండే శయనాలు, హేమమయ-రత్నమయభూషణాలు, సురభిళపుష్పాలు, మృదుదుకూలములు, మధురసలిలాలు మున్నగునవి.

క్రియలు (=చేష్టలు) : ఉద్యానయాత్ర, దేవేంద్రపూజ, మదిరాపానం, కేళివిశేషాలు, రతోత్సవ-ఉపహారాలు, అలంకారవ్యాపారాలు మున్నగునవి.

(iv) ఋతువులు : రాగదీపన విశేషాలు :

వసంతుర్తువులో : గంధాదులు, సురభివాతములు, కుసుమాంచితము లయిన తరువులు, తుమ్మెదలు, కోకిలలు, మంచి భవనాలు, మృదులశయ్యలు, సురాసవం మున్నగునవి.

గ్రీష్మర్తువులో : ఉద్యానవిహారం, జలక్రీడ, కిసలయాలతో నిండిన తరు వుల ఛాయాప్రదేశాలు, ఏలా-లవంగ-కర్పూరాలు, హిమజలాలు, చందనాదులు,

చిత్రములయిన లతాగృహాలు, ప్రాచీనములయిన సురాసవాలు, ధారాగృహం, హిమగృహం, తామరతూడులు కూర్చిన కుట్టిమం, మణికుట్టిమం, వికసించిన కేసరాలు కల కల్హార-పాటల-ఇందీవరాదులు, ముక్తాసూత్రాలుకలభూషలు, గైరిక రూషితములయిన వస్త్రాలు, మున్నగునవి.

ప్రావృట్ (= వర్షా) ఋతువులో : కదంబ-కేతకి-లోధ్ర-కదలి-కుటజాది వృక్షాలు, నెమళ్ళు, శాద్వలాలు, ఇంద్రగోపాలు, గిరినిర్ఝరాలు, పూర్ణములయిన తటాకాలు, ప్రవహించేనదులు, వారిదములు, వారిధారలు, మెరుపులు, మేఘగర్జితాలు, మదించిన మతంగజాల క్రీడలు, గోవృషభాల అంకెలు, చంగుచంగున ఎగిరే హరిణాలు, శ్యామలములయిన వనాలు, బూరుగుదూది పరువుప్రక్క, కాలాగరుసముత్పన్నములయిన ధూపాలు, కప్పికొనుటకు తగిన మంజిష్ఠారాగ రూషితమైన దుప్పటి, పద్మరాగమయమైన భూష, ఒకచో విరలాభరణం, మున్నగునవి.

శరదృతువులో : చంద్రిక, మృదులములయిన వాయువులు, హంసలతోడి పద్మాకరాలు, ప్రసన్నమగు జలం, పులినం, నలినీదలశయ్య, వేల, సరిత్తటం, ఆరామాలు, బురదలేని భూములు, కస్తూరి పరిమల ప్రసారం, హంససారసాల ధ్వనులు, బాగా పండి తెల్లని మంచి ముత్తెములను చిమ్మె చెఱుకులు, పండిన పైరుపంటలు, బురదలేని దారులు, లలితం నాతిశీతలం-నాత్యుష్ణం అయిన శయ్య, క్రీడాస్థలి, మరకత-వైడూర్యస్థగిత భూషలు, విమలములయిన వస్త్రాలు, గంధలు, కస్తూరి ప్రభృతులు.

హేమంత-శిశిర ఋతువులలో గంధపుష్పాలు, వస్త్రాలు, భూషణాలు, శయనాలు, ఇవి నియతంగా లేదా సంకీర్ణాలుగా అనుభూయమానములు అవుతాయి.

(v) కామం : శృంగారం.

తపస్సుచేత ధర్మాన్ని, ధర్మంచేత సుఖాన్ని సాధించాలి. ఈ లోకం ఎల్లప్పుడూ సుఖాన్నే కోరుకొంటుంది. అట్టి సుఖానికి మూలం ప్రమదలే. అందుచేతనే వారితో సంయోగం కాంక్షింపబడుతుంది అని భరతముని.

ప్రాయికంగా సర్వభావాలు కామం నుంచే నిష్పన్నములవుతాయి. ఆ కామం ఇచ్ఛాగుణ సంపన్నమై (=కార్యవ్యాపారాదులకు ఉన్ముఖమైన కోరికతో కూడినదై) బహువిధాలుగా ఉంటుంది- ధర్మకామం, అర్థకామం, కామకామం, మోక్షకామం.

స్త్రీ పురుషుల సంయోగం 'కామకామం' లేదా నిరుపపదంగా 'కామం' అవుతుంది. ఈ కామం లోకమందలి సర్వసుఖ దుఃఖాలను కప్పివుచ్చి తానే అధికంగా గోచరిస్తుంది. ఇది వ్యసనమందు కూడా సుఖకరంగానే ఉంటుంది. రతి సంభోగ కారకమై, ఉత్తమ ప్రకృతిగతమైనప్పుడు 'శృంగారం' అనబడుతుంది. ఇది శుభం, ఉపచారకృతం అయి ఉంటుంది (ఉపచారం అంటే అన్యోన్య హృదయగ్రహణోచితమైన వ్యాపారం, ఉపచారకృతం అంటే ఆ వ్యాపారంతో పూర్ణమై ఉండేది) (నా.శా.).

రమ్యములైన దేశ-కాల-కలా-వేషాదులు హేతువులుగా అన్యోన్యానురక్తు లయిన యువతీ- యువకులు సన్నిహితులవుతారు. స్త్రీ పురుషులకు పరస్పరం సుఖసంవేదనాత్మకమయిన ఒక అనుభూతి మానసికంగా ఉంటుంది. ఆ అనుభూతియే 'రతి' అనబడుతుంది. ఆ సుఖసంవేదనం వారికి మాత్రమే గోచరిస్తుంది. రాగసహితులయిన యువతీ-యువకులందే ఈ రతి ప్రధానంగా ఉంటుంది, అది ప్రేయసీ-ప్రియులందు 'సంభోగ' రూపంగా ఉంటుంది.

'భోగం' అనేది సుఖసాధనం, ఇది శృంగారవిశేషంగా సుప్రసిద్ధం. భోగం, ఉపభోగం, సంభోగం - ఇవి పర్యాయపదాలు.

ఈ సంభోగం మూడు విధాలని శారదాతనయుడు :

ప్రథమంగా స్త్రీరాగం కలది అయితే, పురుషుడు అనురాగం కలవాడు కాదగును. ఇది స్వభావసుభగమైన, ఉత్తమసంభోగం.

ప్రేయసీ-ప్రియులకు అన్యోన్యరక్తిము ఏకకాలీనమయితే సంభోగలీలావర్యప సానమయితే, అది మధ్యమసంభోగం.

స్త్రీ పురుషులలో ఏకత్రానురాగం (=ఒకరికే అనురాగం) ఉన్నప్పుడు, అది అధమసంభోగం (=స్త్రీకి రాగం ఉన్నది, పురుషునకు లేదు, లేదా పురుషునకు రాగం ఉన్నది, స్త్రీకి లేదు - ఈ ఏకత్రైవానురాగాన్ని రసాభాసం అని కూడా అంటారు).

ఉపచారం :

"ఈ లోకం ఎల్లప్పుడూ అధికంగా సుఖాన్నే కోరుకొంటుంది, ఈ సుఖానికి మూలం స్త్రీలు. ఈ స్త్రీలు అనేక శీలాలు లేదా స్వభావాలు కలిగి ఉంటారు" అంటూ భరతముని 23 శీలభేదాలను వివరించినాడు 'సామాన్యాభినయం' అనే 22 వ అధ్యాయంలో . . . . . ఆయా స్వభావాలను గుర్తించి తదనుగుణంగా

ఆయా స్త్రీలపట్ల కామోపచారం నిర్వర్తించాలి. శీలానుసారంగా స్త్రీలపట్ల కావింపబడిన ఉపచారం, అదిస్వల్పమైనప్పటికీ, వారికి హార్షదాయకమవుతుంది. వారి వారి శీలాలను గుర్తించక కావించే ఉపచారం, అది ఎంత గొప్పదైనప్పటికీ వారికి తృప్తికరంకానేరదు. కోరినదానిని పొందటం వల్లనే రతి జనిస్తుంది.

(vi) కామోత్పత్తి :

ఉత్తమ-మధ్యమ-అధమ-ప్రకృతులైన స్త్రీలలో కాని, పురుషులలో కాని కామోత్పత్తి నానాభావ సముద్భవం అవుతుంది. వినటం లేదా చూడటం, చిత్రాదుల దర్శనం, అంగలీలలు, మధురాలాపాలు - వీనివల్ల 'కామం' జనిస్తుంది. కామోత్పత్తి అయిన కన్యా-కులజా-వేశ్యల ఇంగితాలు క్రింది విధంగా ఉంటాయి (నా.శా. XXII-158-68) :

కన్య : రూపం, గుణం, కలాది విజ్ఞానం, యౌవనం కల పురుషుని చూచి, యువతి మదనాతుర అవుతుంది. అట్లా కామపరవశులైన యువతీ యువకుల శరీర వికారాలు ఇట్లా ఉంటాయి : చలిస్తున్న వక్షాలు, మూయబడిన నేత్రాలు, జారిన పై రెప్పలు కలిగి లలితంగా ఉండే దృష్టి 'కామ్యదృష్టి' (= కామం వ్యక్తం చేసేది) అవుతుంది. (వలితములైన అంతములు, లాలిత్యసంమితం వ్యంజితం అయిన చూపుగలది 'లలితదృష్టి', ఇది స్త్రీల అర్ధావలోకనములందు ప్రయుక్తమవుతుంది - ఇది సంచారిభావ దృష్టులలోని లలితదృష్టి). కామోత్పత్తి సమయంలో చెక్కిళ్ళు కొంచెం ఎఱ్రబడతాయి, చిరుచెమటలు కలుగుతాయి, రోమాంచం ఉంటుంది— పోతుంది, ముఖరాగం ప్రసన్నంగా ఉంటుంది.

కులాంగన : నవ్వుతున్నట్లున్న కనులతో దీర్ఘంగా నిరీక్షించటం, నిగూఢంగా నవ్వటం, అధోముఖియై మాటాడటం, నవ్వుతూ సమాధానం చెప్పటం, స్వేదాన్ని ఆకారాన్ని కన్పట్టనీయకుండటం, అధరంచలించటం, కంగారుపడటం, మున్నగు వానివి పట్టి కులాంగన మదనాతుర అని గ్రహించాలి.

వేశ్య : కామ్యములగు అంగవికారాలు, క్రీగంటి చూపులు, అభరణాలను తడుముకొనుచుండటం, చెవిగోకికొనటం, కాలిబొటనవ్రేలితో నేలరాయటం, స్తనములు నాభిప్రదేశం కన్పడేటట్లు చేయటం, గోళ్ళు తీయటం, జుత్తు సర్దుకొనటం మున్నగు వానిని పట్టి వేశ్య మదనాతుర అని గుర్తించాలి.

కులాంగనా-వరాంగనా-వేశ్యాంగనారాగచేష్టలను శారదాతనయుడు క్రింది విధంగా వివరించినాడు (భా.ప్ర. V-115-128) :

కులాంగన : ప్రియుడు దూరంగా ఉండగానే రోమాంచం కలుగుతుంది. నేత్రాలు స్నిగ్ధం, మసృణం అవుతాయి. అధరం స్ఫుటంగా స్పందిస్తుంది. వచనం స్మితోత్తరంగా ఉంటుంది. కపోలాలు స్వేదయుతములవుతాయి. ఊరువులు, సంపీడనం (= తొడపై తొడవేసి ఒత్తటం) పొందుతాయి. బాహువులు స్వస్తికం (= కుచములను ఒత్తటం) అవుతాయి. మరల మరల సఖిని ఆలింగనం చేసుకొంటుంది. కోకముడి విడదీసి, జార్చి, ముడివేస్తుంది. కంపం పొందుతుంది. అతని పథంలో నిలబడుతుంది. మాటలో మాట కలుపుతుంది. అతడు మాటలాడనపుడు తాను మాటలాడదు. అతడు తన్ను చూచునప్పుడు తాను ఊరకనే ఉంటుంది, అటు చూడమిని నటిస్తుంది - ఇటువంటి చేష్టలు కల కులీన రాగయుక్త.

వేశ్య : కర్ణకండూయనం చేస్తుంది. నాభి ప్రదేశం కొంత ప్రకాశితం చేస్తుంది. ఊరువులను కొంతగా చాపుతుంది. కుచాలను తన యంతట తానె నులుముకొంటుంది. మరల మరల చీర ముడిని సడలించి జార్చుతుంది. అన్యాపదేశంగా పలుకుతుంది. ఇతరులతో సస్మితంగా పలుకుతుంది. సిగ్గుపడుతూ చూస్తుంది. అంగుష్ఠాగ్రంతో నేలమీద లిఖిస్తుంది. గోళ్లు గిల్లుకొంటుంది. ఆటలాడుతుంది. వ్యర్థంగా సఖులను బెదరిస్తుంది. ఒక అడుగు వేసి, అడుగులో నిలబడుతుంది. వ్యాజంతో ఆగిచూస్తుంది. దేవతావ్యాజమున అంజలిపడుతుంది. ఇట్టి చేష్టలు కల వేశ్య రాగయుక్త.

అన్య (= పరాంగన) : నాయకుడు కన్పట్టగానే దృష్టులలో వికాసం తెచ్చుకొంటుంది. హర్షం, సంభ్రమం కలుగుతుంది. ఇతరులతో సంభాషించేటప్పుడు మధురంగా మాటాడుతుంది, ముఖం ప్రసన్నంగా ఉంటుంది. అతడు కన్పించకపోతే కలవరపడుతుంది, మూర్ఛపొందుతుంది. అతని సత్కారములందు కౌతుకం చూపుతుంది. తన భర్త సన్నిధిలో, తనభర్తతోడి సురత సమయంలో ఆతనినే స్మరించుకొంటుంది. అతనికి భోగ్య వస్తువులను పంపుతుంది. కాని ఎల్లప్పుడు ఆతని వాక్యమును ప్రీతి పూర్వకంగా పరిగ్రహిస్తుంది. "అమ్మగదే! తల్లిగదే!" అని పిల్లలను లాలనం చేసేటప్పుడు, "నాథ! మన్నాథ! నా ప్రియుడ! మా అయన!" అంటూ ఉపలాలనం చేస్తుంది.

అయితే మారుతి మతంలో పైని చెప్పిన మూడు విధాలగు భావాలు, రాగచిహ్నాలు సర్వస్త్రీ సాధారణ రూపములే; వారి వారి స్వభావవిశేషం వల్ల ఇవి అన్నీ అవిశేషంగా అందరికీ ఉండవచ్చు. కావున ఆయా వనితల భావవిశేషాలను పరీక్షించి అనురక్తలైన వారిని అనుదంజనమొనర్చటం యుక్తం.

(vii) కామోపభోగం :

బాహ్య అభ్యంతరభేదాలచేత రెండు విధాలయిన కామోపభోగాన్ని భరతముని ఇట్లా వివరించినాడు (నా.శా XXII-141-56) :

నాట్యధర్మమందు (నాట్యసంబంధి ఇతివృత్తంలో) స్త్రీ-పురుష సంశ్రయమైన కామోపభోగం బాహ్య-అభ్యంతర భేదాల చేత రెండు విధాలు. వీనిలో 'అభ్యంతరం' నాటకమందు (నాటిక యందు కూడా అని అభినవగుప్తుడు), రాజులచేత అనుసరింపబడుతుంది. ఇంక, బాహ్యం ప్రకరణమందు వేశ్యాగతంగా ఉంటుంది.

ఉపచారవిధి కామతంత్ర (కామసూత్ర - కాశీముద్రణపాఠం) సముత్థితమైనది. నానాశీలములు గల స్త్రీ ప్రకృతి బాహ్య-అభ్యంతర-బాహ్యాభ్యంతర భేదాలచేత మూడు విధాలుగా ఉంటుంది. కులీన 'అభ్యంతర' అనబడుతుంది. వేశ్యాంగన బాహ్య. ఇంక కృతశౌచ అయిన (= శుద్ధశీలంకల అంటే ఒకనికే కట్టుబడి ఉన్న వేశ్య బాహ్యాభ్యంతర (ఉదా: మృచ్ఛకటిక మందలి వసంతసేన). అంతఃపురోపచారమందు నాయిక కులజ కాని, కన్యకాని (గణికాకుమారి కూడా కావచ్చు) కావాలి. రాజకృతమైన కామోపచారమందు బాహ్యస్త్రీభోగం వాంఛనీయం కాదు. అయినా, రాజునకు దివ్యవేశ్యాంగనతో సంగమం కలుగవచ్చు (ఉదా: ఊర్వశీ-పురూరవుల కథ). ఒకనియందే అనురాగం కలదై వానికే కట్టుబడియున్న వేశ్యావిషయం బాహ్యోపచారం. ఆ ఒకడు ప్రకరణాదులందువలె విప్ర-వణిక్-అమాత్యాదులలో ఒకడు కావచ్చు; లేదా విక్రమోర్వశీయమునందువలె దివ్యవేశ్యాకాముకుడైన రాజు కావచ్చు; లేదా నాటకమందలి వతాకా నాయకుడు కావచ్చు.

ఇట్లా అభ్యంతర నాయికాగతమైన కామోపభోగం రాజులకు, బాహ్యజన కామోపభోగం బాహ్యజనములకు విధింపబడింది. కులజ విషయంలో అనుసరించే కామోపచారమునే కన్యకావిషయంలో కూడా అనుసరించాలి. కామోపభోగమందు వేశ్యకూడా కులజవలెనే ప్రవర్తిస్తుంది.

(viii) అభ్యంతరకామోపచారం :

నాట్యశాస్త్రంలో అభ్యంతర కామోపచారం ఇట్లా వివరింపబడింది (నా.శా. XXII-202-210; 324-332):

ఇంక రాజునకు సంబంధించినది, కామతంత్రానుసారి అయిన అభ్యంతర కామోపచారాన్ని వివరిస్తాను. నానావిధములగు శీలములచే జనించిన సుఖ-దుఃఖ

కృతములగు భావాలలో రాజు ఏ భావాలను అవలంబిస్తాడో వానినే తక్కిన లోకమంతా అవలంబిస్తుంది. రాజులకు ఆజ్ఞామాత్రం చేతనే స్త్రీ ప్రాప్తికి ఉపాయాలు సిద్ధిస్తాయి. కాన వారికి స్త్రీలు దుర్లభలు కారు; అయినా దాక్షిణ్యసముద్భవమైన కామమే రతికరం కాగలదు.

ప్రచ్ఛన్నకామం : పట్టపురాణియందలి బహుమానం చేత, ఇతర భార్యల వలని భయం చేత వారి పరిజనము నెడగల కామాన్ని రాజు ప్రచ్ఛన్నంగా చూపాలి. అనేక విధాలుగా కామతంత్రమును నెరపదగిన అవకాశాలు నరేంద్రులకు ఉన్నను, ప్రచ్ఛన్న కామితం మాత్రమే వారికి రతికరం కాగలదు. నాయిక దుర్లభకావటం, ఆమెను పొందకుండ నివారింపబడుతూఉండటం, నివారింపబడినకొలది పట్టుదల ఎక్కువ కావటం ఏ స్త్రీ విషయంలో సంభవిస్తుందో ఆ స్త్రీ విషయకమగు కామమే అతిశయమగు ప్రీతిని కలిగిస్తుంది.

స్పష్టకామం : రాజునకు అంతఃపురజనంతో దివాసంభోగం (వరస్ప రావలోకన-ప్రణయకలహ- సంగీతకాదులు) తప్పకాదు; కాని 'వాసోపచారం' అనేది రాత్రులందే జరగాలి.

వాసకోచితకాలాలు : పరిపాటి (బహుభార్య లున్నప్పుడు వారి వారి వంతుల చొప్పున వెళ్ళటం), ఋతుకాలం (సంతానం కొరకు), నవత్వం, ప్రసవానంతర కాలం, దుఃఖసమయం, ప్రమోదసమయం అనే ఈ అరున్నూ 'వాసకములు' (వాసోచితములైన సమయాలు) అని తెలియవలెను. ఉచితమైన వాసకమందు, ఋతుకాలమందు ధర్మవృత్తియగు రాజు తనకిష్టమగు కాంతనైనను, ద్వేష్య అగు కాంతనైనను తప్పక కామోపచారాలచేత ఉపచరించాలి.

ఇంక దివ్యాంగలనతో రాజులకు సమాగమం కలుగునప్పుడు అనుసరింపదగిన కామోపచారం ఇప్పుడు వివరిస్తాను. దివ్యులగు స్త్రీ-పురుషుల శృంగారమందు వేషం నిత్యోజ్జ్వలంగాను, మనస్సు నిత్యప్రముదితంగాను, కాలం నిత్యసుఖంగాను లలితాశ్రయంగాను ఉంటుంది. ఈర్ష్య కాని, క్రోధం కాని, అసూయకాని, అనునయం కాని ఉండదు. కాని, దివ్యాంగనలు మనుష్యులతో (రాజులతో) కలియునప్పుడు మాత్రం మనుష్య లనుభవించే భావాలు, ప్రయోగించే అంగచేష్టితాలు మున్నగు వానివెల్ల వారికిని ఆపాదించాలి. శాపం చేకాని, సంతానకాంక్షచేకాని దివ్యాంగనలకు శృంగారరససమాశ్రయమగు మానుషసమాగమం కల్పించాలి.

పుష్పవాసనలచేత, ఆభరణధ్వనులచేత అగుపడకయే నాయకుని మనస్సును ఆకర్షించి, ఒక క్షణం సందర్శనమొసంగి మరల అంతర్హితం కావాలి. వస్త్ర-

ఆభరణ-మాల్యాదులను, ప్రేమలేఖలను పంపటం మొదలగు ఉపచారాలచేత నాయకుని కామం వృద్ధిపొందించాలి. ఆ విధంగా ప్రియురాలిచే రెచ్చగొచ్చబడిన కామం ప్రీతిజనకమైనట్లు స్వభావోపగతమైన కామం ప్రీతిజనకం కానేరదు.

ఇది రాజు లాచరింపదగిన ఆభ్యంతరకామోపచారం.

(ix) బాహ్యకామోపచారం :

అనురక్త :

'బాహ్యోపచారం' అనే 23 వ అధ్యాయంలో భరతముని అనురక్త-విరక్తల స్వభావాలను, తత్సంబంధి అంశాలను వివరించినాడు (నా.శా. XXIII17-23) :

నాయకుని గుణాలను సఖులకు వర్ణించిచెప్పటం, వానికి స్వీయధనం పంపటం, వాని మిత్రులను పూజించటం, వాని శత్రుజనాన్ని తాను కూడా సదాద్వేషించటం, సఖులు వానియొద్దకు రాకపోకలొనర్చితే చాలా సంతోషించటం (వాని సమాగమం కోరటం, అతడు కన్పట్టితే అధికంగా సంతోషించటం-కాశీముద్రణ పాఠం), వాని కథలను విని తుష్టినొందటం, వాని కొరకు సస్నేహంగా నిరీక్షించటం, అతడు చుంబించినచో తాను ప్రతిచుంబనం చేయటం, అతడు మేల్కొనటానికి ముందే తాను మేల్కొనటం, వానితో పాటు క్లేశాలను సహించటం, వానితోపాటు ఉత్సవములందు మోదాన్ని, వ్యసనమందు దుఃఖాన్ని పొందటం (సుఖ-దుఃఖములందు సమత్వం కలిగి ఉండటం, క్రోధం పొంద కుండటం - కాశీముద్రణపాఠం) - ఇట్టి గుణాలు కలిగిన స్త్రీ అనురక్త అవుతుంది.

సమాగమం కలిగిన పిమ్మట ఆకారాన్ని పట్టి, కామచిహ్నలను పట్టి, ఆమె తనయందు అనురక్తయో కాదో గుర్తించాలి. స్వభావాతిశయం చేతనే మదనాశ్రితయై (= సురతమందు నఖక్షతాదులను అతిశయంగా సహించటం), నిభృతలీలలను కావించే స్త్రీ 'మదనాతుర' అవుతుంది.

రక్తవనిత నిత్యం ప్రియునితో ఏకాంతాన్నే కాంక్షిస్తుందనీ, అతని ఆశ్లేషంలో ఒదిగిపోతుందనీ, స్నానాది కర్మలకై తానే ప్రేరేపించి స్వేచ్ఛగా ప్రవర్తిస్తుందనీ శారదాతనయుడు అధికంగా చెప్పినాడు (భా.ప్ర. v-129-37).

(x) రాగచేష్టలు :

రాగచేష్టలు వ్యంజకములేకాక వ్యంగ్యములు కూడా అవుతూ ఉంటాయని చెప్పి, శారదాతనయుడు పదునెనిమిది రాగచేష్టలను వివరించినాడు :

| చేష్ట | వ్యంగ్యం. |
|---|---|
| 1. కర్ణకండూయనం (చెవి గోకి కొనటం లేదా చెవిలో వ్రేలు దూర్చి త్రిప్పటం) | శుభవచనధారణం (నాయకుని శుభ వచనమును చెవిలో ఉంచాను, వెలికి పోనీను, ఇచ్చటనే నిరోధిస్తాను). |
| 2. కేశసంయమనం (జుట్టుముడి వేసి కొనటం). | శిరోలాలనం =ప్రియుని శిరమును లాలన మొనరిస్తాను). |
| 3. నాభిప్రదర్శనం (నాభిని ఇష్టులె చూడగలరు, దానిని ఇతరులు చూడరాదు. అటువంటి దానిని నాయకునకు చూపటం). | స్వీయసౌభాగ్య ప్రదర్శనం (తన సౌభాగ్యం అనుభవించుమని చెప్పటం). |
| 4. స్తనమర్దనం | గాఢాలింగనం ఇమ్మని సూచించటం. |
| 5. అధర స్పర్శనం - | చుంబించుమని సూచన. |
| 6. హాసగర్భకటాక్షం (నవ్వుతో కూడిన కడకంటి చూపు) - | సంభోగమందలి ఔత్సుక్యం చూపటం. |
| 7. నూపురధ్వనం - | పురుషాయిత ప్రక్రియను సూచించటం. |
| 8. విజృంభితం (సర్వదేహ విజృంభణం) - | సర్వాంగ సమర్పణం (నా సర్వావయవములను నీకు సమర్పించితిని అనే సూచన). |
| 9. అన్యాపదేశం (ప్రియునకు అర్థమయ్యేటట్లు వేరే విషయం ప్రస్తావించటం) | భావపరీక్షణం (నాయకుని భావం పరీక్షించటం). |
| 10. అన్యులతో సస్మిత జల్పం (ఇతరులతో నవ్వుతూ మాటాడటం) | సంభాషణ సమాదరం (నీతో మాటాడాలని ఉన్నదనే సూచన). |
| 11. లజ్జావలోకనం (సిగ్గుతో చూడటం) | స్వానుకూల్య ప్రకాశనం. |
| 12. అనుత్తర ప్రదానం (సమాధానం చెప్పకపోవటం) | స్వాతంత్ర్య ప్రకాశనం (నీకువలె నాకూ స్వాతంత్ర్యం ఉన్నదనే సూచన). |
| 13. పక్షి నిర్భర్త్సనం (సన్నిధిలో ఉన్న పక్షులను బెదరించటం) | శీఘ్ర సంగమవాంఛ. |
| 14. ఊరుపీడనం (తొడపై తొడవేసి సంపీడనం చేయటం) | అంగస్పంద (= శుభ) సూచన. |
| 15. పదాంతర స్థితి (పాదాన్ని అటూ ఇటూ పెట్టటం) | వ్యాజంతో మనోవినిమయం కోరటం. |

6. తిర్యగ్వీక్షణం (ఓరచూపు) సంకేతగమనం కోరటం.
7. బాహుస్వస్తికం (స్వస్తికహస్తం పట్టటం) గాఢాలింగనం కోరటం.
8. నీవీవహనం (పోకముడిజార్చి పట్టుకోవటం) చీర సడలించుమని కోరటం.

నాయికల అనురాగ-ఇంగితాలను విశ్వనాథుడు క్రింది విధంగా వివరించినాడు (సా.ద. 156 సూ.) :

అనురక్త అయిన నితంబిని ప్రియుడు తన చెంత చాలాసేపు ఉంటే సంతసిస్తుంది. అలంకరించుకొనే మిషతో, పైట సర్దుకొనే మిషతో స్ఫుటంగా తన బాహుమూలాలను, స్తనాలను, పొక్కిలి తమ్మిని చూపుతుంది. వాగాదులతో ప్రియుని పరిచారకులను ఆదరిస్తుంది. అతని మిత్రులను నమ్ముతుంది, వారిని గౌరవిస్తుంది. తన సఖుల నడుమ అతని గుణాలను పొగడుతుంది. అతనికి తన ధనం ఇస్తుంది. అతడు నిద్రిస్తే తాను నిద్రిస్తుంది. అతనికి దుఃఖం కలిగితే తానూ దుఃఖపడుతుంది; అతడు సుఖితుడైతే తానూ సుఖపడుతుంది. దూరం నుంచి అతడు చూస్తూ ఉండగా, అతని చూపుమార్గంలో ఉండి, తత్పరిజనంతో మాటలాడుతూ ఉంటుంది. తనకు సమ్ముఖంగా అతనియందు ఏమాత్రమైనా స్మర విక్రియకానవస్తే సంతోషంతో నవ్వుతుంది. చెవిగోకుకొంటుంది. కొప్పు విప్పి ముడుచుకొంటుంది. ఆవులిస్తుంది. ఒడలు విరుచుకొంటుంది. శిశువును కౌగిలించుకొని ముద్దాడుతుంది. చెలికత్తెకు లలాటం మీద తిలకం దిద్దుతుంది. కాలి బొటనవ్రేలికొనతో నేలగీరుతుంది. కడకంటి చూపు ప్రసరిస్తుంది. తన మోవి కరుచుకొంటుంది. అధోముఖియై ప్రియుని పలుకుతుంది. అతడెక్కడినుంచి కనపడతాడో ఆ చోటు విడువదు. ఏదేని పనిపెట్టి, అతని ఇంటికి వస్తుంది. కాంతుడేదేనా బహూకరిస్తే దానిని ధరించి మాటిమాటికి చూసుకొంటుంది. అతనితో కూటమి కలిగినప్పుడు ఎల్లప్పుడు సంతసిస్తుంది. అతనిని ఎడబాసినప్పుడు మలిన, కృశాంగి అవుతుంది. అతని నడవడిని మిక్కిలిగా గణిస్తుంది. అతనికి ప్రియమైన దానిని తాను కూడా ప్రియమైన దానినిగా పరిగణిస్తుంది. కొంచెం వెలగల వస్తువులకొరకు అతనిని యాచిస్తుంది. నిద్రలో అతనికి పెడమొగం కాదు. అతనికి ఎదురుగా ఉన్నప్పుడు సాత్త్వికవికారాలు పొందుతుంది. అనురక్తితో సత్యం పలుకుతుంది. వీనిలో నవవధువు చేష్టలు అధికలజ్జాయుతాలుగా ఉంటాయి. మధ్యచేష్టలు మధ్యమంగానూ, ప్రగల్భామధ్యా-పరకీయల చేష్టలు లజ్జారహితంగానూ ఉంటాయి. చూడటం, మృదువుగా భాషించటం, దూతి

కను పంపటం- వీటిద్వారా స్త్రీ తన భావాన్ని తెలియపరుస్తుందని పెద్దలు చెప్పినారు.

అనురక్త లక్షణాలు వివరించిన పిమ్మట భరతముని విరక్తవిషయాలు వివరించినాడు (నా.శా. XXIII-23) :

విరక్త :

విరక్తి కారణాలు : స్త్రీకాని, పురుషుడు కాని ఆదిలో అనురక్తి కలిగి ఉన్నప్పటికీ, పిమ్మట విరక్తి నొందుటకు కొన్ని కారణాలు - దారిద్ర్యం, వ్యాధి, దుఃఖం (= అపత్యమరణాదులు), పారుష్యం, దుఃశ్రవత్వం (= వారి చెడుగును గూర్చి వినటం), ప్రవాసగమనం, అతిలోభం, అతిక్రమం (= గౌరవాన్ని లెక్కచేయక పోవటం, అత్యభిగమనం (= శీలాన్ని కాపాడుకోలేకపోవటం), విప్రియచేష్టలు.

విరక్తచేష్టలు : చుంబించినా తాను తిరిగి చుంబించకపోవటం (చుంబించినచో ముఖాన్ని కడుగుకొనటం -కాశీముద్రణపాఠం), అనిష్టకథలను చెప్పటం, ప్రియం చెప్పినా కోపించటం, వాని శత్రుజనమును ఆదరించటం, పరాఙ్ముఖియై శయనించటం, వానికంటె ముందుగానే శయనించటం, మహోపకారం లేదా మహోపచారం చేత కూడా సంతుష్టి పొందకపోవటం, క్లేశాన్ని సంహించక పోవటం, అకారణంగా కోపించటం, వానిని కన్నెత్తి చూడకపోవటం, వానిని అభినందించకుండటం.

విరక్త హృదయగ్రహణోపాయాలు : అర్థప్రదర్శనం (= తనకు డబ్బు ఉన్నదని తెలియచెప్పటం), ఉపదానం (= డబ్బు ఇవ్వటం), అకారణోపన్యాసం (= తనను ఇంకో స్త్రీ ప్రేమిస్తున్నదని చెప్పించటం), వ్యాధితం (= విచిత్రములైన ఆధులు కలిగినట్లు చెప్పటం), వ్యాజత్యాగం (= విచిత్రాభిప్రాయప్రదర్శన వ్యాజంతో చెప్పకయే వెడలిపోవటం), తాను ఇంకో స్త్రీని ప్రేమిస్తున్నట్లు చెప్పించటం.

మదనాశ్రయవిషయాలలో భావగ్రహణ సమర్థములైన కార్యాలవల్ల స్త్రీలు సంతుష్టలై పురుషులకు వశలవుతారు. లుబ్ధురాలిని అర్థప్రదానం చేత, పండితురాలిని కళాజ్ఞానం చేత, చతురను లడహత్వం (= ప్రాగల్భ్యం, క్రీడనత్వం - కాశీ ముద్రణ పాఠం) చేత, కోపశీలను అనువృత్తిచేత, పురుషద్వేషిణిని ఇష్టకథాకథనం చేత, బాలను ఉపక్రీడనకాల (= ఆటవస్తువుల) చేత, భీరురాలిని అశ్వాసనముల

(= బుజ్జగింపుల) చేత, గర్వితను సేవనం (= పాదస్పర్శనాదుల) చేత, ఉదాత్తను విస్మయ హేతువులగు శిల్పదర్శనాలచేత లోబరుచుకోవాలి.

ఉపక్రమములు (నా.శా. XXIII-63-80) :

కాష్ఠంనుంచి అగ్నిపుట్టునట్లే ఉపచారబలంచేత, విప్రలంభం వల్ల స్త్రీలలో కామం జనిస్తుంది. ముఖరాగ-నేత్ర-భావ-చేష్టితాలను పట్టి తనపట్ల ద్వేషియో లేదా ప్రేమకలదియో , లేదా మధ్యస్థయో తెలిసికోవాలి. దివ్యలు, రాజుయొక్క భోగకాంతలు కాక తక్కిన వేశ్యలెల్లరు - ప్రియులైనను, ప్రియులు కాకున్నను - అర్థహేతువు చేత పురుషులను అందరిని సేవిస్తారు. వేశ్యలు, అంతకుముందు ద్వేషించిన వానిని కూడా ధనమిచ్చిన తరువాత వానిపై ప్రేమ ఒలకపోస్తారు; అంతకుముందే ప్రియుడైతే ఇప్పుడాతనిని ప్రియతమునిగా ఎన్నుతారు. అంతేకాక, దుశ్శీలుని సుశీలుడనీ, నిర్గుణుని గుణాఢ్యుడనీ వర్ణిస్తారు. ధనమిచ్చిన పురుషుని చూడగానే ఉత్ఫుల్ల తారకలు కలవారై నేత్రాలతోనే నవ్వుతున్నట్లు ఉంటారు. భావ-రూప-గుణాలచేత ప్రసన్న ముఖరాగయుక్తలుగా కన్పడతారు (అంటే వేశ్యాహృదయం గుర్తింపరానిదని భావం).

స్త్రీలు నానాశీలాలు, నిగూఢములైన అభిప్రాయాలు, కోరికలు కలవారుగా ఉంటారు. యథాసత్త్వంగా (= వారి ఆశయం ఏమిటో నిపుణంగా గుర్తించి) పురుషులు వారిని చేరాలి. ఇట్లా స్త్రీయొక్క భావాలను (= అనురాగ-విరాగాలను) తెలిసికొన్న పిమ్మట, కామతంత్రానుసారంగా, ఆయా ఉపక్రమా (=ఉపాయా) లతో పురుషుడు ప్రయత్నపూర్వకంగా స్త్రీని ఉపచరించాలి. ఆ ఉపక్రమం సామ-దాన-భేద-దండ-ఉపేక్షాభేదాలచేత అయిదు విధాలు :

(1) సామం : "నేను నీవాడను, నీవు నాదానవు, నీకు దాసుడను, నీవే నా ప్రియవు" అంటూ ఆత్మోపక్షేపణం (= నిజభావప్రదర్శనం) చేయటం సామం.

(2) దానం : తన విభవాన్ని పట్టి, ఆయా సమయాలలో (= అంటే నియతంగా కాక, నిమిత్త విశేషకృతములైన ప్రమోద-వ్యసనాది నిబంధనములందు) ఏదో వ్యాజంతో స్త్రీకి ధనం బాగా ఇవ్వటం దానం.

(3) భేదం : ఉపాయసహితంగా ఆమెయొక్క వేరొక ప్రియుని దోషాలను ప్రదర్శించటం భేదం.

(4) దండం : బంధన-తాడనాలు దండం. మధ్యస్థను సామంచేత, లుబ్ధను దానం చేత స్వీకరించాలి. అన్యాయబద్ధభావ అయిన స్త్రీ పట్ల భేదం ప్రయో

గించాలి. అన్యభావసముత్థితయై దుష్టాచారాన్ని (= దేశాంతర పలాయనం, పురుషాంతర గృహనివాసం మొ) ఆరంభిస్తే, మృదుతాడన- బంధనములచేత దండం ప్రయోగించాలి. ఇప్పట్ల త్రాడుతో కాని, వేణుదళంతో కాని తాడనం చేయాలి.

(5) ఉపేక్ష : సామాదులను యథాక్రమంగా ప్రయోగించినప్పటికీ వశురాలు కాకపోతే బుద్ధిమంతుడామెను ఉపేక్షించాలి.

అయితే, మానాదులవల్ల కలిగే విరక్తి విలక్షణమైనది, హృద్యమైనది, అనునయంతో అది తొలగిపోతుంది. ఈవిరక్తి విరక్తియే కాదు; ఇది ఒక విరహం మాత్రమే. విరహానంతరం సంభోగం సమధికతుష్టి కలిగిస్తుంది (భా.ప్ర. v-157-58).

(xi) ఈర్ష్య :

స్నేహం ఎచ్చట ఉంటుందో, అచ్చట మదనసంభవమైన ఈర్ష్య జనిస్తూ ఉంటుందనీ, వైమనస్యం, వ్యలీకం, విప్రియం, మన్యువు అనే నాలుగు హేతువుల వల్ల ఈర్ష్య జనిస్తుందనీ భరతముని ఇట్లా వివరించినాడు (నా.శా. XXII-244-94) :

(1) వైమనస్యం- వేరొక స్త్రీతో కలిపిన చిహ్నాలు, దంతక్షతాదులు కలిగినవాడై రాత్రి అంతా నిద్రలేక బడలికతో ఉదయాన మెల్లగా నడచి వస్తున్న ప్రియుని చూడటంచేత స్త్రీలయందు జనించే విముఖత 'వైమనస్యం' అనబడుతుంది. తీవ్రములు, అసూయాపూర్ణములు అయిన దృష్టులు, రోషంతో అదరుతున్న అవయవాలు కలదై 'బాగుబాగు', 'సెబాస్', 'చాలబాగున్నది' మొదలుగ వాక్యాలతో వైమనస్యజనితమైన ఈర్ష్యను అభినయించాలి.

(2) వ్యలీకం - వలదని పెక్కుసార్లు వారింపబడినప్పటికి ఆ స్త్రీతోనే మరల తన కంటబడితే మాత్సర్య-సంఘర్షాల వల్ల జనించే మానసికవ్యథ 'వ్యలీకం' అనబడుతుంది. పాదాలతో నేలను అదిమివట్టి, ఎడమచేతిని గుండెలపై ఉంచి, కుడిచేతితో విదలించికొడుతూ వ్యలీకం చేత జనించిన ఈర్ష్యను అభినయించాలి.

(3) విప్రియం- "నీతోడిదే నాజీవితం , నీకు దాసుడను, నీవే నా ప్రియవు" అని పలుమార్లు చెప్పి కూడా ప్రియుడు అన్యథా ఆచరించినప్పుడు జనించే మానసికవ్యథ 'విప్రియం'. తన్ను ప్రసన్నురాలిని చేసికొనుటకు ప్రియుడు పంపిన దూతిని లేఖను ప్రతివచనాలతో దూషిస్తూ తిరస్కరించటం, కోపంతో

కూడిన నవ్వు, ఏడుపు, శిరఃకంపం మొదలగు వానితో విప్రియం వల్ల జనించిన ఈర్ష్యను అభినయించాలి.

(4) మన్యువు - వేరొక నాయిక యొద్దనుండి తనయొద్దకు సంభోగచిహ్నాలతో సూటిగా వచ్చి తన సౌభాగ్యాన్ని ప్రశంసించుకొనే ప్రియుని చూసినప్పుడు జనించే ఆవేశం 'మన్యువు' అనబడుతుంది. జారిపోతున్న మొలనూలిని గాజులను సర్దికొంటూ, కనులనిండ నీరునింపుతూ మన్యువుచే జనించిన ఈర్ష్యను అభినయించాలి. మరియొక కాంతతో కూడినందులకు సిగ్గుపడుతూ జంకుతో నిలిచిన ప్రియతమునీ చూచి ఈర్ష్యావచనాలతో కూడిన నిందావాక్యాలతో వాని మనస్సు నొప్పించాలి. కాని, నిష్ఠురంగా మాటాడరాదు, ఎక్కువ కోపం కలిగించే పరిహాసం చేయరాదు. కనులనిండ నీరు నింపుతూ తన్నుతాను నిందించుకోవలెను.

ప్రియుడు అనునయిస్తున్నప్పుడు-నిరాదరసూచకంగా చిటికెలు వేయటం, గుండెలపై చేతినుంచటం, మీదిచూపులు కోరచూపులు చూడటం, కటిపై ఉంచిన హస్తాన్ని గిఱ్ఱున త్రిప్పటం, అంజలిని విదలించటం, తల త్రిప్పటం, క్రిందికి వాల్చటం, ప్రక్కకు పడవేయటం, దేనినేని అన్చి ఉంచటం, గంభీరంగా చూడటం, మెటికలు విరవటం, లలితంగా బెదరించటం, మున్నగు భావవిశేషాలచేత ప్రియురాలు ఈర్ష్యను అభినయించాలి. అప్పుడామె "చాల బాగున్నావు. చూచాను. వెళ్ళు. ఏమి ఆలస్యం? నన్ను స్పృశించకు, నీహృదయంలో ఉన్న ప్రియురాలి యొద్దకే వెళ్ళు. ఇంక వెళ్ళు" అని చెప్పి, వెనుదిరిగి, అంతలోనే ప్రియునివైపు మరలి ఏదేని మిషచే హర్షం కలిగినట్లు సూచించాలి.

అతడు తనదోషాన్ని గుర్తించినవాడై హస్తాన్ని కాని, వస్త్రాన్ని కాని, శిరోజాలను కాని బలాత్కారంగా గ్రహించటంతో ప్రియురాలిని అనునయించాలి. అట్లా ప్రియుడు గ్రహించిన హస్తాన్ని లేదా వస్త్రాన్ని లేదా శిరోజాలను ఆమె అతనిని ఉపసర్పిస్తూ మెల్లగా వదిలించుకోవాలి. మరల అతడు గ్రహిస్తే స్వరాశ్లాలసయై "ఊహూ. విడిచిపెట్టు" అని అనాలి. పాదాగ్రం మీద నిలిచి, అతిశయమైన కుట్టమితంతో, అశ్వక్రాంతచారితో మెల్లగా శిరోజాలను విడిపించుకోవాలి. ఇంకా అతడు విడువకుంటే. స్వేదంతో కూడినదై "హో. ఊహూ. నన్ను విడిచిపెట్టు. పొమ్ము" అంటూ స్వరాశ్లాలసాంగియై పలకాలి. "పొమ్ము" అని రోషంతో చెప్పి, తానే వెడలిపోయి, ఏదో ఒక మాటతో మరలవచ్చి "వెళ్ళుతావా? లేదా" అని అడగాలి. అప్పుడు చేతిని విదల్చించికొట్టుతూ హుంకరించాలి. ఇంకా అతడు తన్ను అనుసరిస్తూంటే ఒట్లు పెట్టి, వ్రతోపవాసాది వ్యాజాలను

దూరస్థ విరక్త: నాయకుని చూడగానే నిష్ఠీవనం చేస్తుంది. చూచిన వెంటనే వస్త్రంతో ముఖం కప్పుకొంటుంది. గూఢంగా ఒక మూలదాగి ఉంటుంది. ఏలకో వివశురాలైనట్లు ఉంటుంది. అనాదరం చూపుతుంది. నాయకుని సమీపానకు వెళ్ళవలసి ఉంటే, అస్థానంలో అకాలంలో దగ్గరకు చేరుతుంది. అతడు పిలిచి రమ్మంటే వెంటనేరాదు, కాలయాపనచేస్తుంది. నాయకుడు గంధమాల్యాదివస్తువులు పంపితే స్వీకరించదు, ఉపయోగించదు. అతడు ఆయా ఋతువులకు సంబంధించిన వస్తువులను పంపినా ఆదరించదు, విసరివేస్తుంది. అతడు తన దగ్గరకు వస్తే, తాను అస్వస్థతగా ఉన్నట్లు సాకు చెబుతుంది. దూతికలు మున్నగువారికి సమాధానం చెప్పదు.

సమీపస్థ విరక్త : నాయకుడు సమీపంలో ఉంటే తానుదూరంగా ఉంటుంది. అతడేమని అడిగితే సూటిగా పేలవంగా మాటాడుతుంది, ఏదో ఇతర విషయం మాటాడుతుంది. అతడు అధరాన్ని చుంబించితే, ముఖం తుడుచుకొంటుంది. అతడు ప్రియం పలికినా కోపిస్తుంది. అతని వైపు చూడదు. వానిని అభినందింపదు. తానే ముందుగా పడుకొంటుంది. అతడు దూరంగా వేరు శయ్యపై శయనించునట్లు చేస్తుంది. తాను శయనించిన వెంటనే నిద్రిస్తుంది. అతడు మేల్కొల్పినా కాలయాపన చేస్తుంది. సంభోగానికి ఇష్టపడదు. అతడు తనను తాకితే శరీరం ముడుచుకొంటుంది. కన్నులు మూసుకొంటుంది. స్నానం చెయ్యదు. అలంకరించుకోదు. వస్తువులను అనుభవించటంలో ఆదరం చూపదు. కన్నులు చేతులతో నులుముకొంటుంది. మరల మరల ఆవులిస్తుంది. ఒడలు విరుచుకొంటుంది, ప్రక్కకు తిరిగి ఉమ్మివేస్తుంది. అతని మిత్రులను ద్వేషిస్తుంది. ఒట్టు పెడుతూ మాటాడుతుంది, రోషంతో తిడుతుంది. తన అవయవాలను దాచుకొంటుంది. అన్యథా ప్రసంగంతో సురతమునందు భావచ్యుతి కలిగిస్తుంది. ఇంటి పనులున్నవన్న మిషతో గతాగతాలు చేస్తుంది. అతడు పోకముడిని సవరిస్తే ఒట్టుపెట్టి, చేతిని విసిరికొట్టి, ముడుచుకొని పరుంటుంది. ఈ విరక్తి చిహ్నాలు గుర్తించి, ఆ క్షణమే ఆమెను త్యజించాలి.

విరక్తి చిహ్నం ఒక్కటి గోచరించినా ఉత్తముడు తాను కూడా విరక్తు డవుతాడు. కాని, విరక్తి చిహ్నములు ఉన్నప్పటికీ, రక్తి చిహ్నములు కూడా ఉండటానికి అవకాశం ఉంటుంది. అంటే రక్తి విరక్తి చిహ్నముల సాంకర్యం ఉండవచ్చు. అప్పుడు నాయకుడు ఆ స్త్రీని ఉపచరించాలి. అప్పుడు భావసహిత మైన ఉపచార విధానం ఆవశ్యకం. భావసహితమైన ఉపచారం వల్లనే వనితలు విరక్తి చేష్టా విశేషాలను విడనాడుతారు. కావున వనితలు కూడా సావధానలై నిగ్రహంతో విరక్తిచేష్టలు మానవలెను.

నాయికా నాయకులకు విరక్తి హేతువులు అనేకములు ఉంటాయి. కార్శ్యం, వ్యాధి, శోకం, పారుష్యం, రూపనాశం, దోష శ్రవణం లేదా అపవాదశ్రవణం, మతిలోపం వల్ల ఒకరిని ఒకరు అతిక్రమించటం, దేశం కాని దేశంలో కాలంకాని కాలంలో రావటం, అందరి యెదుట మరల మరల అపకారం చేయటం మున్నగునవి. ఇట్టి కారణాలవల్ల విరక్తులయిన వారికి మరల సంగతి కలగటం సంభావ్యం కాదు.

కాని, మానాదులవల్ల కలిగే విరక్తి ఇటువంటిదికాదు, ఇది విలక్షణం, హృద్యం. ఇది ప్రధానంగా అనునయమును ఆశ్రయించి ఉంటుంది. ఒకరినొకరు అనునయించుకోగానే ఆ తాత్కాలిక విరక్తి ఉపశమిస్తుంది. అంతట వారు ప్రేయసీ ప్రియులై అన్యోన్యం అనురక్తులవుతారు. అసలు ఇది విరక్తేకాదు, ఇది ఒక విరహం మాత్రమే. విరహానంతర సంభోగం సమధిక తుష్టిని సంపాదిస్తుంది. శుభంకరమైన రతిపరిపోషాన్ని మరల మరల కలిగిస్తుంది.

కొందరు స్త్రీలు, తమ పూర్వనాయకులనే అనుసరించి ఉండాలని తలంచరు; వారిని విడిచి, వేరొకరిని పరిగ్రహించవలెనని చూస్తారు. అట్టి స్త్రీని 'గంతుకామ' అన్నాడు శారదాతనయుడు (భా.ప్ర.V-151-54- చూ. నాయికా ప్రకరణం).

## 2. విప్రలంభ శృంగారం :

రసాధ్యాయమందు విప్రలంభ శృంగారమందలి అనుభావాలను, విప్రలంభ శృంగార-కరుణ రసభేదాలను చాలా సంక్షిప్తంగా భరతముని వివరించినా (నా.శా. VI); విప్రలంభభేదాలను సమగ్రంగా వివరించలేదు. అర్వాచీనాలంకారికులు విప్రలంభమందలి భేదాలు మూడు అనీ, నాలుగు అనీ, అయిదు అనీ పేర్కొని వివరించివారు. సింగభూపాలుడిట్లా చెప్పినాడు :

> అయుక్తయో స్తరుణయోర్యోఽనురాగః పరస్పరమ్ ॥
> అభీష్టాలింగనాదీనా మనవాప్తౌ ప్రకృష్యతే ।
> స విప్రలంభో విజ్ఞేయః స చతుర్ధా నిగద్యతే ॥
> పూర్వానురాగమానౌ చ ప్రవాస కరుణావితి ।
>
> -(ర.సు. II-169-71)

— పరస్పరం కలయికలేని యువతీయువకుల అనురాగం, అభీష్టములైన ఆలింగనాదులు లభించకపోవటం చేత ప్రకర్షను పొందితే, అది విప్రలంభం

అనబడుతుంది. ఈ విప్రలంభం నాలుగు విధాలు— పూర్వానురాగం, మానం, ప్రవాసం, కరుణం.

"యూనోరన్యోన్యం ముదితానాం పంచేంద్రియాణాం
సంబంధాభావోఽభీష్టాప్రాప్తిర్వా విప్రలంభః . . . . . .
సచవిప్రలంభః పంచధా-దేశాంతరగమనా
ద్గురునిదేశా దభిలాషా దీర్ష్యాయాః శాపాచ్చేతి. సమయా
ద్దైవాద్విద్వరా దిత్యాదయోఽప్యున్నేయాః . . . ."
అని రసతరంగిణీకర్త భానుదత్తుడు.

— యువతీ-యువకులకు పరస్పరం మోదం చేకూర్చే పంచేంద్రియ సంబంధం లేదా అభీష్టప్రాప్తి లేకపోవటం విప్రలంభం అవుతుంది. . . అది అయిదు కారణాలవల్ల సంభవిస్తుంది- దేశాంతరగమనం, గురుజనుల ఆజ్ఞ, అభిలాష, ఈర్ష్య, శాపం. అంతేకాదు సమయం, దైవం, ఉపద్రవం మున్నగునవి కూడా కారణాలు కావచ్చు. (అంటే విప్రలంభానికి ఎన్నేని కారణాలు ఉండవచ్చునన్నమాట!)

అభిలాష, ఈర్ష్య, విరహం, ప్రవాసం- ఈ హేతువుల చేత విప్రలంభం చతుర్విధం అని విద్యానాథుడు (ప్ర.రు.య.)

అయితే, భరతరసప్రకరణకారుడు విప్రలంభహేతువులు అయిదు విధాలు అంటూ వేరుగా చెప్పినాడు— అయోగం, విరహం, మానం, ప్రవాసం, శాపం.

వినటం వల్ల కాని, చూడటం వల్ల కాని నాయికా-నాయకుల రతి ప్రకృష్టమైనప్పటికీ అభీష్టప్రాప్తి (=నాయకుని నాయిక లేదా నాయికను నాయకుడు పొందటం) జరుగదో అది విప్రలంభం అని విశ్వనాథుడు. ఇందుకామదశలు పది ఉంటాయి. (సా.ద.).

పైవి చెప్పినవాటిల్లో అయోగం-పూర్వరాగం- ఇవి రెండూ సమానాలు. అయోగం అంటే ప్రేమజనించినప్పటికీ సమాగమం కలుగని స్థితి. ఇంక వియోగం అంటే సమాగమం కలిగిన తరువాత సంభవించిన ఎడబాటు. ఈ అయోగాన్ని పూర్వరాగం అనీ, వియోగాన్ని విరహవిప్రలంభమనీ అంటారు. కాగా విప్రలంభ హేతువులు, భరతరసప్రకరణంలో చెప్పినట్లు అయిదు అవుతున్నాయి. ఇంక కామావస్థలు పది, అయిదు భేదాలలోనూ సంభవించవచ్చు. కాని, ఇవి ప్రధానంగా పూర్వరాగసంబంధి గానే వర్ణితములైనవి.

(1) పూర్వానురాగం లేదా అయోగవిప్రలంభ శృంగారం :

మూలం : యత్ప్రేమా సంగమాత్ పూర్వం దర్శన శ్రవణాదిభిః ॥
పూర్వానురాగః స జ్ఞేయః. శ్రవణం తద్గుణ శ్రుతిః ।
ప్రత్యక్ష చిత్ర స్వప్నాదౌ దర్శనం దర్శనం మతమ్ ॥
యతః పూర్వానురాగోఽయం సంకల్పాత్మా ప్రవర్తతే ।
సోఽయం పూర్వానురాగాఖ్యో విప్రలంభ ఇతీరితః ॥
పారతంత్ర్యాదయం ద్వేధా దేవమానుష కల్పనాత్ ।
తత్ర సంచారిణోగ్లానిః శంకాసూయే శ్రమోభయమ్ ॥
నిర్వేదౌత్సుక్యదైన్యాని చింతానిద్రే ప్రబోధతా ।
విషాదో జడతోన్మాదో మోహో మరణ మేవచ ॥
ఏతస్మిన్నభిలాషాది మరణాంత మనేకథా ।
తత్తత్సంచారిభావానా ముత్కటత్వాద్ దశాభవేత్ ॥
తథాపి ప్రాక్తనై రస్యా దశావస్థాః సమాసతః

-(ర.సు. II-171-77)

తాత్పర్యం : కలయికకు పూర్వం దర్శనం (= చూడటం), శ్రవణం (= వినటం) మున్నగు వానివల్ల కలిగే ప్రేమ పూర్వానురాగం అనబడుతుంది. 'శ్రవణం' అంటే తత్సంబంధి గుణాలను వినటం. ప్రత్యక్షంగా చూడటం, చిత్రంలో లేదా స్వప్నంలో చూడటం మున్నగునవి 'దర్శనం'. ఇచ్చట అనురాగం కేవలం సంకల్పరూపంగానే ఉన్నందున ఇది 'పూర్వానురాగం' అనే విప్రలంభంగా చెప్పబడింది.

దైవకృతం, మనుష్యకృతం అనేభేదాల వల్ల కలిగే పారతంత్ర్యం చేత పూర్వానురాగం రెండు విధాలు.

ఇందు-గ్లాని, శంక, అసూయ, శ్రమ, భయం, నిర్వేదం, ఔత్సుక్యం, దైన్యం, చింత, నిద్ర, ప్రబోధం, విషాదం, జడత, ఉన్మాదం, మోహం, మరణం - అనే సంచారి భావాలు కలుగుతాయి.

ఆయా సంచారిభావాలు ఉత్కటం అయినప్పుడు పూర్వానురాగంలో అభిలాష మొదలు మరణం వరకు అవస్థలు అనేకం కలుగుతాయి. కాని, ప్రాచీనులు ఈ అవస్థలను సంక్షేపించి, 'పది' అని చెప్పినారు.

ఉదా : శ్రవణం వలని అనురాగోదయం : హంసవర్ణనలను పట్టి దమయంతి నలునియందు అనురాగవతి కావటం.

విద్యానాథుడు, కామశాస్త్రానుసారంగా, కామావస్థలు పన్నెండు అని చెప్పి నాడు (ప్ర.రు.య. -రస ప్ర. 112-13) :

చక్షుఃప్రీతి ర్మనస్సంగ స్సంకల్పోఽథ ప్రలాపితా ।
జాగరః కార్శ్య మరతి ర్లజ్జాత్యాగోఽథ సంజ్వరః ।
ఉన్మాదో మూర్ఛనం చైవ మరణం చరమం విదుః ।
అవస్థా ద్వాదశ మతాః కామశాస్త్రానుసారతః ॥

తాత్పర్యం : కామశాస్త్రానుసారంగా కామావస్థలు పన్నెండు -

1. చక్షుఃప్రీతి, 2. మనస్సంగమం, 3. సంకల్పం, 4. ప్రలాపనం, 5. జాగరం, 6. కార్శ్యం, 7. అరతి, 8. లజ్జాత్యాగం, 9. సంజ్వరం, 10. ఉన్మాదం, 11. మూర్ఛ, 12. మరణం.

శారదాతనయుడు కూడా పన్నెండు అవస్థలను పేర్కొని "కొందరు చివరి రెండు అవస్థలను - అంటే జాడ్యం, మృతి—వీనిని విడిచి, తొలి పది అవస్థలనే గ్రహిస్తారు" అని చెప్పినాడు. శారదాతనయుడు చెప్పిన 12 అవస్థలు :

1. ఇచ్ఛ, 2. ఉత్కంఠ, 3. అభిలాష, 4. చింత, 5. స్మృతి (= జ్ఞానం), 6. గుణస్తుతి, 7. ఉద్వేగం, 8. ప్రలాపం, 9. ఉన్మాదం, 10. వ్యాధి, 11. జాడ్యం, 12. మరణం.

భరతరసప్రకరణకర్త చెప్పిన పది అవస్థలు : 1. చక్షుఃప్రీతి, 2. చింత, 3. సంకల్పం, 4. గుణనుతి, 5. క్రియాద్వేషం, 6. తాపం, 7. లజ్జాత్యాగం, 8. ఉన్మాదం, 9. మూర్ఛ, 10. మృతి.

"కొందరు-చక్షుఃప్రీతి, చిత్తాసంగం, సంకల్పం, నిద్రాచ్ఛేదం, కార్శ్యం, విషయ నివృత్తి, లజ్జానాశం, ఉన్మాదం, మూర్ఛ, మృతి అనే పది స్మరదశలు చెప్పినారు" అని విశ్వనాథుడు. పై అయిదు పట్టికలలోనూ పేర్లు వేర్వే రుగా ఉన్నాయి. శారదాతనయుని పట్టికను సింగభూపాలుడు క్రింది విధంగా సమన్వయించి భరతానుసారంగా అవస్థలు, పదే అని నిర్ణయించినాడు.

"కొందరు అభిలాషమునకు ముందుగా 'ఇచ్ఛ, ఉత్కంఠ' అనే రెండు అవస్థలను అంగీకరించి, అవస్థలు పన్నెండు అని చెప్పినారు. కాని, ఇచ్ఛ, అభిలాష కంటె వేరుకాదు; తత్ప్రాప్తియందలి తొందర అనే లక్షణం కల ఉత్కంఠ చింతలోనే చేరుతుంది. కావున మేము వానిని వేరుగా చెప్పక, ఉపేక్షించినాము" (ర.సు. II . పుట 160).

ఇంక తక్కిన రెండు పట్టికలను ఆయా పదాలను వివరించేటప్పుడు సమ న్వయిస్తాను.

*(i)* అభిలాష :

మూలం : వ్యవసాయాత్సమారబ్ధః సంకల్పేచ్ఛా సముద్భవః ।
సమాగమోపాయకృతః సోఽభిలాషః ప్రకీర్తితః ॥
నిర్యాతి విశతి చ ముహుః కరోతి చాకారమేవ మదనస్య ।
తిష్ఠతి చ దర్శనపథే ప్రథమస్థానే స్థితా కామే ॥

-(నా.శా. XXII-173-74)

తాత్పర్యం : తాను కామించిన యువతిని గూర్చిన లేదా యువకుని గూర్చిన జ్ఞానంతో ప్రారంభమై, సంకల్పపూర్వకమైన ఇచ్ఛచేత ఉద్రిక్తమై, సమాగమోపాయాన్ని వెదకటం 'అభిలాష' అవుతుంది.

ప్రియురాలు లేదా ప్రియుడు ఉన్న చోటునుంచి మాటి మాటికి రాకపో కలు సాగించటం, దర్శనపథమందు నిలవటం, మదనచిహ్నాలను ప్రకటించటం -వీనిచేత 'అభిలాష' ను అభినయించాలి (= ప్రథమావస్థయందున్న యువతి ఇట్టి క్రియలు చేస్తుంది).

టీక : ఆదరంతో దర్శించటం 'చక్షుః ప్రీతి' అని, ప్రియునియందు [illegible] చిత్తం నిత్యం విశ్రమించటం, మనస్సంగం అని నాయికయందు [illegible] 'సంకల్పం' అని విద్యానాథుడు నిర్వచించినాడు.

అభిలాషలో - ఇచ్ఛ, ఉత్కంఠ, సంకల్పం అనే మూడు అవస్థలు [illegible] మనస్సు ఒకచోట సంసక్తం కావటం (= లగ్నం కావటం) [illegible] లగ్నమైన వ్యక్తి [illegible] ఉత్కంఠ, ఇంక తన [illegible]

అభిలాషయందు [illegible] పేర్కొనగా, సాధ్యానికి [illegible] భూతిని ధనికుడు [illegible]

చక్షుఃప్రీతి ([illegible]) -

మూలం : [illegible]

చాపలస్తంభలజ్జాద్యై రనుభావ్యో భవేదయం ।
-(భ.ర.ప్ర. 300-301)

తాత్పర్యం : రమ్యములు (=హృదయాకర్షకాలు) అయినవానిని చూడటం లేదా వానినిగూర్చి వినటం చేత కలిగే కోరిక చక్షుఃప్రీతి అవుతుంది.

ఇది-కౌతుకం, స్వేదం, రోమాంచం, హర్షం, విస్మయం, సాధ్వసం, చపలత, స్తంభం, లజ్జ మున్నగు (సాత్త్విక-వ్యభిచారి) భావాలచేత అభినయింపబడాలి.

సంకల్పం (అభిలాషాభేదం) :

మూలం : మనోరథః స్యాత్సంకల్ప స్తత్సమాగమగోచరః ॥
ఔత్సుక్యస్వేదరోమాంచ స్మృతి శ్వాసాక్షిమీలనైః ।
బాహ్యార్థ స్యాపరిజ్ఞానేనానుభావ్యో భవేదసౌ ॥
-(భ.ర.ప్ర. 304-305)

తాత్పర్యం : ప్రియుని సమాగమం భావించే మనోరథం 'సంకల్పం' అవుతుంది. ఇందులో - ఔత్సుక్యం, స్వేదం, రోమాంచం, స్మృతి, శ్వాస, అక్షినిమీలనం, బాహ్యార్థ -అపరిజ్ఞానం— ఇవి అనుభావాలు.

టీక : భరతరసప్రకరణకర్త చక్షుఃప్రీతి, చింతలను వివరించిన తరువాత సంకల్పం వివరించినాడు!

'ప్రియుని విషయమైన మనోరథం సంకల్పం' అని విద్యానాథుడు.

(ii) చింత :

మూలం : కేనోపాయేన సంప్రాప్తిః కథం వాసౌ భవేన్మమ ।
దూతీనివేదితై ర్భావై రితి చింతా నిదర్శయేత్ ॥
ఆకేకరార్ధవిప్రేక్షితాని వలయరశనాపరామర్శః ।
నీవీనాభ్యః సంస్పర్శనం చ కార్యం ద్వితీయే తు ॥
-(నా.శా. XXII-175-76)

తాత్పర్యం : "ఏ ఉపాయం చేత ప్రియసమాగమం కలుగుతుంది? అతడు నావాడు ఎట్లా అవుతాడు?" ఇట్లా దూతికతో ఆలోచించటం ద్వారా చింతను ప్రదర్శించాలి. ఆకేకరదృష్టి, అరచూపులు, కంకణాలను వడ్డాణాన్ని

పరామర్శించటం (= సరిచేసుకొనటం), నీవిని నాభిని స్పృశించటం - ఇవి ఇందలి కార్యాలు.

టీక : చింత, చింతనం, విచింతనం - వీనిని పర్యాయపదాలుగా వాడినారు ఆలంకారికులు.

"ప్రియతమునియందే నిత్యం చిత్తం లగ్నం కావటం మనస్సంగమం" అని విద్యానాథుడు. కాగా చింత అనే అవస్థను విద్యానాథుడు 'మనస్సంగమం' అన్నాడని స్పష్టమవుతున్నది.

నిఃశ్వాసం, ధ్యానం, అంగాలు వదులుగా ఉండటం, స్వేదం, పులకలు, పరుండటం కూర్చుండటం ఇష్టం లేకపోవటం మున్నగు స్మరకల్పితాలయిన అనుభావాలు ఇందు ఉంటాయనీ, ?:;;;;యంగా చూడటం మున్నగునవి ఇందలి క్రియలు అనీ భరతరసప్రకరణకర్త అధికంగా చెప్పినాడు. ఇందులో కొన్నింటిని అనుస్మృతిలో చెప్పినాడు భరతముని.

*(iii)* అనుస్మృతి :

మూలం : ముహుర్ముహు ర్నిఃశ్వసితై ర్మనోరథవిచింతనైః ।
ప్రద్వేషా చ్చాన్యకార్యాణా మనుస్మృతి రుదాహృతా ॥
నైవాసనే నశయనే ధృతి ముపలభతే స్వకర్మాణి విహస్తా ।
తచ్చింతోపగతత్వాత్ తృతీయ మేవం ప్రయుంజీత ॥

-(నా.శా. XXII-177-78)

తాత్పర్యం : మాటి మాటికి నిట్టూర్పులు విడువటం, తాను కోరుతున్న దానిని గూర్చియే చింతించటం, ఇతరములైన పనులు చేయటానికి విముఖం కావటం 'అనుస్మృతి' అనబడుతుంది.

ఆసనమందు కానీ, శయనమందుకానీ స్థిరంగా ఉండలేకపోవటం, తాను చేసే పనిని ప్రియుని గూర్చిన ఆలోచనతో సగంలోనే నిలిపివేయటం మున్నగు వానిచేత అనుస్మృతిని అభినయించాలి.

టీక : "దేశ-కాలాలను అనువర్తించి, పూర్వం అనుభూతములయిన విషయాలను మరల మరల తలచుకొనటం అనుస్మృతి" అని చెప్పి, నిఃశ్వాసం-ధ్యానం-కార్యాలపట్ల అశక్తత - వీటిని అధికంగా చెప్పినాడు సింగభూపాలుడు.

భరతరసప్రకరణకర్త చెప్పిన 'క్రియాద్వేషం' అనే అవస్థను అనుస్మృతి భేదంగా చెప్పవచ్చు.

"ప్రియుని విషయంలో తప్ప, తక్కిన అన్నింటియందు ద్వేషం కలగటం క్రియాద్వేషం. చింత, నిఃశ్వాసం, దైన్యం, అశ్రువు, జాగరం, పాండుత, విషాదం, గ్లాని మున్నగునవి ఇందలి అనుభావాలు" అని భరతరసప్రకరణకర్త క్రియాద్వేషాన్ని వివరించినాడు.

*(iv)* గుణకీర్తనం :

మూలం : అంగప్రత్యంగలీలాభి ర్వాక్చేష్టాహసితేక్షితైః ।
నాస్త్యన్యః సదృశస్తేనేత్యేతత్ స్యాద్ గుణకీర్తనమ్ ॥
గుణకీర్తనోల్లుకసనై రశ్రుస్వేదాపమార్జనైశ్చాపి ।
దూత్యావిరహావిస్రంభై రభినయయోగ శ్చతుర్థేతు ॥

-(నా.శా.XXII-179-80)

తాత్పర్యం : *అంగ-ప్రత్యంగ లీలలలో, వాక్కులో, చేష్టలలో, నవ్వులో, చూపులో ప్రియుని పోలినవాడు మరొకడులేడని చెప్పటం గుణకీర్తనం. ప్రియుని గుణాలను కీర్తించటం, ఉల్లుకసనం, అశ్రువును స్వేదాన్ని తుడుచుకొనటం, దూతికతో రహస్యంగా తన విరహవేదనను తెలుపుకొనటం మున్నగువానిచేత గుణకీర్తనం అభినయించాలి.*

టీక : గుణకీర్తనం-గుణనుతి- ఇవి పర్యాయపదాలు.

"ప్రియుని సౌందర్యం మున్నగు గుణాలను ప్రశంసించటం గుణనుతి అవుతుంది. రోమాంచం, గద్గదంపు మాటలు, సాభిప్రాయ వీక్షణాలు, సఖులతో తత్సమాగమచింతనం, చెక్కిళ్ళయందు స్వేదం, ఔత్సుక్యం, హర్షం, స్మృతి మున్నగునవి ఇందలి అనుభావాలు" అని సింగభూపాలుడు.

"ప్రియునియొక్క గుణాలను వర్ణించటం ప్రలాపనం" అని విద్యానాథుడు. కాగా ఇది గుణనుతితో సమానం అని స్పష్టమవుతున్నది.

*(v)* ఉద్వేగం :

మూలం : ఆసనే శయనే చాపి న తుష్యతి న తిష్ఠతి ।
నిత్యమే వోత్సుకా చ స్యాదుద్వేగస్థానమాశ్రితా ॥

చింతానిఃశ్వాసఖేదేన హృద్దాహాభినయేన చ ।
కుర్యాత్తదేవ మత్యంత ముద్వేగాభినయేన చ ॥

-(నా.శా.XXII-181-82)

తాత్పర్యం : ఆసన-శయనములందు తుష్టికాని నిలుకడకాని లేకపోవటం, నిత్యం ప్రియుని కలియవలెనన్న ఉత్సుకతతో ఉండటం 'ఉద్వేగం' అవుతుంది. చింతా-నిఃశ్వాస-ఖేద- హృదయతాపాలను అధికంగా చూపటం ద్వారా ఉద్వేగాన్ని అభినయించాలి.

టీక : "మనస్సు కంపించటం ఉద్వేగం అవుతుంది" అని సింగభూపాలుడు. స్తంభం, అశ్రువు, వైవర్ణ్యం, దీనత్వం మున్నగు అనుభావాలను అధికంగా చెప్పినాడు సింగభూపాలుడు (ర.సు. II-187-88).

'నిద్రలేకపోవటం జాగరం అవుతుంది' అని విద్యానాథుడు చెప్పిన దానిని ఉద్వేగంతో సమన్వయం చేయవచ్చు.

*(vi)* *విలాపం :*

మూలం : ఇహాస్థిత ఇహాసీన ఇహాచోపగతో మయా ।
ఇతి తైస్తైర్విలపితై ర్విలాపం సంప్రయోజయేత్ ॥
ఉద్విగ్నాత్యర్థ మౌత్సుక్యాదధృత్యా చ విలాపినీ ।
తతస్తతశ్చ భ్రమతి విలాపస్థానమాశ్రితా ॥

-(నా.శా.XXII-183-84)

తాత్పర్యం : "ఇచ్చట నిలిచినాడు, ఇచ్చట కూర్చున్నాడు, ఇచ్చట నన్ను చేరినాడు" అంటూ ఆయా స్మృతులతో విలపించటం విలాపం అవుతుంది.

అత్యంతం ఉద్విగ్నయై, ఔత్సుక్యంతో, అధైర్యంతో విలపిస్తూ, ఇటు నటు తిరుగుతూ విలాపాన్ని అభినయించాలి.

టీక : ". . . . ఇచటినుంచి మరలిపోయినాడు . . . ." అన్నది అధికంగా చెప్పినాడు సింగభూపాలుడు. అంతేకాదు, ఎక్కడికో వెళ్ళటం, ఎక్కడనో చూడటం, ఎక్కడెక్కడనో ఉండటం, ఎచ్చటనో తిరుగటం మున్నగునవి ఇందలిచేష్టలు అని కూడా వివరించినాడు.

"సిగ్గు విడిచిపెట్టటం లజ్జాత్యాగం" అని విద్యానాథుడు చెప్పటాన్ని పట్టి లజ్జాత్యాగాన్ని విలాపంతో సమన్వయం చేయవచ్చు.

"ఔత్సుక్యం అధికం కావటం వల్ల సిగ్గు విడనాడటం 'లజ్జాత్యాగం' అవుతుంది. గౌరవం లెక్కచేయకపోవటం, మాట జవదాటటం మున్నగునవి సంభవిస్తాయి. విషాదం, వ్యగ్రత, దైన్యం మున్నగునవి ఇందలి అనుభావాలు" అని భరతరసప్రకరణకర్త.

*(vii) ఉన్మాదం :*

మూలం : తత్సంశ్రితాం కథాం యుంక్తే సర్వావస్థాగతాపి హి ।
పుంసః ప్రద్వేష్టి చాప్యన్యానున్మాదః సంప్రకీర్తితః ॥
తిష్ఠ త్యనిమిషదృష్టి ర్దీర్ఘం నిఃశ్వసితి గచ్ఛతి ధ్యానమ్ ।
రోదితి విహారకాలే నాట్య మిదం స్యాత్తథోన్మాదే ॥
-(నా.శా.XXII-185-86)

తాత్పర్యం : సర్వావస్థల యందును నాయకసంశ్రితములైన కథలనే ఎన్నుతూ, ఇతరములను ద్వేషించటం ఉన్మాదం అవుతుంది.

అనిమిషదృష్టితో నిలువటం, దీర్ఘంగా నిఃశ్వసించటం, ఏదో ఆలోచిస్తూ ఉండటం, విహారసమయంలో కూడా రోదించటం - ఇవి ఉన్మాదమందలి క్రియలు.

టీక : ఉన్మాదాన్ని సింగభూపాలుడిట్లా వివరించినాడు (ర. సు. II-191-93) :

సర్వావస్థలయందు, సర్వత్ర ప్రియునియందు దత్తచిత్తయై, ఒక వస్తువును మరియొక వస్తువుగా భావిస్తూ ఉండటం విరహంవల్ల జనించిన ఉన్మాదం అవుతుంది.

పూర్వం తనకు ఇష్టమైన వస్తువులను కూడా ఇప్పుడు ద్వేషించటం, దీర్ఘంగా ఉచ్ఛ్వాస-నిఃశ్వాసాలు ఉండటం, రెప్పపాటులేకుండా ఉండటం, కారణం లేకుండా నవ్వటం ధ్యానించటం గానం చేయటం, మాటాడకుండా ఉండటం మున్నగునవి ఇందలి చేష్టలు. అసమయంలో ఏడ్వటం లేవటం, శంక మున్నగు చేష్టలు, విషాద-మద-రోషాది వ్యభిచారిభావాలు ఇందులో ఉంటాయి (భ.ర.ప్ర.313-316).

"ఇతరములు వేనియందును ప్రీతిలేకపోవటం అరతి" అని విద్యానాథుడు చెప్పిన దానిని ఉన్మాదంతో సమన్వయం చేయవచ్చు.

వ్యభిచారిభావాలలోకూడా 'ఉన్మాదం' వర్ణితమైంది.

(*viii*) వ్యాధి :

మూలం : సామదానార్థ సంభోగైః కామ్యైః సంప్రేషణై రపి ।
సర్వై ర్నిరాకృతైః పశ్చాద్ వ్యాధిః సముపజాయతే ॥
ముహ్యతి హృదయం క్వాపి ప్రయాతి శిరసశ్చ వేదనాతీవ్రా ।
వధృతించాప్యుపలభతే హ్యాష్టమమేవం ప్రయుంజీత ॥

-(నా.శా.XXII-187-88)

తాత్పర్యం : సామ-దాన-అర్థములనే ఉపాయాలను ప్రయోగించటం, దూతికలను రాయబారమంపించటం— ఇవి నిరర్థకాలైనప్పుడు వ్యాధి జనిస్తుంది.

హృదయం మోహం చెందటం, ఎచ్చటికో తెలియకయే వెళ్ళటం, తీవ్రమైన శిరోవేదన, ధైర్యం లేకపోవటం మున్నగువానిచేత వ్యాధిని అభినయించాలి.

టీక : "కోరుకొన్న కలయిక సాధ్యం కాకపోవటం చేత కలిగే తాపం వ్యాధి అవుతుంది. సంతాపం, నిఃశ్వాసం, చల్లని వస్తువులను సేవించటం, జీవితాన్ని లెక్కచేయకపోవటం, మోహం, మరణించాలన్న తలంపు, ధైర్యం కోలుపోవటం, ఒక్కసారి (విరుచుకొని) పడిపోవడం, అవయవాలు వదులుగా ఉండటం మున్నగునవి ఇందలిచేష్టలు" అని సింగభూపాలుడు (ర.సు. II -194-95).

తాపాధిక్యం జ్వరం అనీ, శరీరం చిక్కటం కార్శ్యం అనీ విద్యానాథుడు.

"ప్రియునితోడి సమాగమం బాగా ఆలస్యం అవుతూ ఉండటం చేత కలిగే మన్మథజ్వరం తాపం అవుతుంది. వైవర్ణ్యం, అశ్రువు, విహ్వలత్వం, ప్రక్కమీద పొర్లాడటం, నిఃశ్వాసం, ముఖశోషం మున్నగునవి ఇందలి అనుభావాలు" అని భరతరసప్రకరణకర్త.

*(ix) జడత :*

మూలం : పృష్టా నకించిత్ ప్రబ్రూతే నశృణోతి నపశ్యతి ।
హాకష్టవాక్యా తూష్ణీకా జడతాయాం గతస్మృతిః ॥
అకాండే దత్తహుంకారా తథా ప్రశిథిలాంగికా ।
శ్వాసగ్రస్తాననా చైవ జడతాభినయే భవేత్ ॥

-(నా.శా.XXII-189-190)

తాత్పర్యం : ఏమి అడిగినా సమాధానం చెప్పకపోవటం, దేనినీ వినకుండటం చూడకుండటం, "హా హా" అని కష్టసూచకాలైన మాటలు అనటం, మౌనంగా ఉండటం, స్మృతిలేకుండటం, 'జడత' అనబడుతుంది. అసమయాలలో హఠాత్తుగా హుంకారం చేయటం, అంగాలు వదులుగా ఉండటం, నిఃశ్వాసాలు మున్నగువాని చేత జడతను అభినయించాలి.

టీక : 'జాడ్యం' అంటే ప్రతిపత్తి (= సరి అయిన జ్ఞానం) లేకపోవటం అని శారదాతనయుడు. (చూ. వ్యభిచారిభావాలు).

"ఇష్టం- అనిష్టం అనేవి కొంచెం కూడా తెలియకపోవటం, ప్రశ్నకు జవాబు ఈయకపోవటం, ఎవరినీ చూడకుండటం, ఏదీ వినకపోవటం, ఎవ్వరినీ కలియక ధ్యానంలో ఉండటం జడత అవుతుంది. స్పర్శ తెలియకపోవటం, వైవర్ణ్యం, శిథిలాంగత్వం, అకాండహుంకారం, స్తంభం, నిఃశ్వాసం, కృశత్వం మున్నగునవి ఇందలి అనుభావాలు" అని సింగభూపాలుడు (ర.సు. II -196-98).

"నాయకుని పొందలేకపోవటం వల్ల కలిగిన అధికమన్మథతాపం చేత జ్ఞానం (= తెలివి) నశించటం మూర్ఛ అవుతుంది" అని భరతరసప్రకరణకర్త; అనుభావాలు సింగభూపాలాదులు చెప్పినవే.

*(x) మరణం :*

మూలం : సర్వైః కృతైః ప్రతీకారై ర్యది నాస్తి సమాగమః ।
కామాగ్నినా ప్రదీప్తా యా జాయతే మరణం తతః ॥

-(నా.శా.XXII-191)

తాత్పర్యం : సమాగమోపాయాలన్నీ వ్యర్థం కావటం చేత (= సమాగమం చేకూరనప్పుడు), కామాగ్ని ప్రదీప్తమై మరణం సంభవిస్తుంది. (= మరణ ప్రయత్నం జరుగుతుంది, లేదా మరణేచ్ఛ వర్ణితమవుతుంది).

**టీక :** "రసవిచ్ఛేదకారణమవుతుంది కావున మరణం వర్ణింపనే వర్ణింపరు. ఒకవేళ వర్ణింపదలచితే, మరణప్రయత్నం మాత్రం వర్ణింపవచ్చు. ప్రత్యుజ్జీవనం శీఘ్రంగా కలిగేటట్లయితే మరణాన్ని కూడా వర్ణిస్తారు" అని విశ్వనాథుడు (సా.ద.సూ. 216).

మరణేచ్ఛ కలిగినప్పుడు -

"శీలాశుక-చకోరాదులను ఆప్తులైన చెలికత్తెలకు అప్పగింతలు పెట్టటం, కోకిలల మధురాలాపాదులు వినటం, మందానిలం ఆశ్రయించటం, వెన్నెలలో తిరుగటం, మామిడి పూలగుత్తులను చూడటం, ఉరి మున్నగు వానిని సిద్ధం చేసుకొనటం, కన్నీళ్ళ తోడి చూపు మున్నగునవి సంభవిస్తాయి" అని సింగభూపాలుడు (ర.సు. II- 198 -200).

కోకిలాలాపాలు మున్నగువానివి విరహిణులు భరించలేరు; కానీ, వానికి సుముఖత్వం చూపటమంటే ప్రాణాలకు తెగించటం అన్నమాట! ఇటు వంటి వర్ణనలు తెలుగు ప్రబంధాలలో చూడదగును. మరణాభినయం వ్యభిచారి భావములందు వివరింపబడినది.

*(2) విరహ విప్రలంభం :*

**మూలం :** కాలక్షేపస్తు సంప్రాప్తేః కార్యాద్వా పారతంత్ర్యతః ॥
ఏకగ్రామస్థయో ర్యూనో ర్విరహ స్సోఽ భిధీయతే ।
ఔత్సుక్య చింతానిఃశ్వాస వితర్కాద్యనుభావభాక్ ॥

-(భ.ర.ప్ర.321-22)

**అర్థం :** *ఏకగ్రామస్థయోః, యూనోః*=ఒకే గ్రామంలో ఉన్న యువతీ యువకులకు; *కార్యాత్, వా, పారతంత్ర్యతః* = కార్యభారం చేత, లేదా, పరాధీనత చేత; *కాలక్షేపః (తు), సంప్రాప్తేః* = కాలహరణం, సంప్రాప్తి స్తే; *సః, విరహః, అభిధీయతే* = అది, విరహం (అని) చెప్పబడుతున్నది. *ఔత్సుక్య, -చింతా, నిఃశ్వాస, వితర్క-ఆది, అనుభావభాక్* = (ఆ విరహం) ఔత్సుక్యం, చింత, నిఃశ్వాసం, వితర్కం మున్నగు అనుభావాలతో కూడి ఉంటుంది.

తాత్పర్యం : ఒకే గ్రామంలో ఉన్నప్పటికీ కార్యభారం చేత లేదా పరాధీనతవల్ల యువతీ యువకులు కలుసుకోలేకపోతే 'విరహం' సంభవిస్తుంది.

ఔత్సుక్యం, చింత, నిఃశ్వాసం, వితర్కం మున్నగు అనుభావాలు ఇందు కలుగుతాయి.

టీక : సంగమం కలిగిన తరువాత ఏదేని కారణం చేత సంభవించిన ఎడబాటు విరహం అవుతుంది. కార్యభారం చేత, లేదా పరాధీనత వల్ల కలిగిన విరహం ఇందు వర్ణితమైనది. ఇంక తదితర కారణాలవల్ల సంభవించే ఎడబాటులు తరువాత వివరింపబడగలవు. ఈ విరహంలో కూడా దశకామావస్థలకు అవకాశం ఉంటుంది.

*(3)* *మాన విప్రలంభం :*

మూలం : ముహుఃకృతో నేతినేతి ప్రతిషేధార్థ వీప్సయా ।
ఈప్సితాలింగవాదీనాం నిరోధో మాన ఉచ్యతే ॥
సోఽయం సహేతు ర్నిర్హేతు రితి ద్వేధాత్ర హేతుజః ।
ఈర్ష్యయా సంభవే దీర్ష్యా త్వన్యాసంగిని వల్లభే ॥
అసహిష్ణుత్వమేవ స్యాద్దృష్టే రనుమితేః శ్రుతేః ।
ఈర్ష్యామానే తు నిర్వేదావహిత్థా గ్లాని దీనతాః ॥
చింతా చాపల్య జడతా మోహాద్యా వ్యభిచారిణః ।
భోగాంక గోత్రస్ఖల నోత్స్వప్నై రనుమితి స్త్రిధా ॥
శ్రుతిః ప్రియాపరాధస్య శ్రుతి రాప్తసఖీ ముఖాత్ ।
కారణాభావసంభూతో నిర్హేతుః స్యాద్ ద్వయోరపి ॥
అవహిత్థాదయః తత్ర విజ్ఞేయా వ్యభిచారిణః ।
నిర్హేతుకః స్వయం శామ్యేత్ స్వయంగ్రాహి స్మితాదిభిః ॥
హేతుజస్తు శమంయాతి యథాయోగ్యం ప్రకల్పితైః ।
సామ్నా భేదేన దానేన నత్యుపేక్షా రసాంతరైః ॥
తత్రప్రియోక్తి కథనం యత్తు తత్సామగీయతే ।
సఖ్యాభి రుపాలంభ ప్రయోగో భేద ఉచ్యతే ॥
వ్యాజేన భూషణాదీనాం ప్రదానం దానముచ్యతే ।
నతిః పాదప్రణామః స్యాత్ తూష్ణీం స్థితి రుపేక్షణమ్ ॥
ఆకస్మిక భయాదీనాం కల్పనా స్యాద్రసాంతరమ్ ।
యాదృచ్ఛికం బుద్ధిపూర్వ మితి ద్వేధా నిగద్యతే ॥
అనుకూలేన దైవేన కృతం యాదృచ్ఛికం భవేత్ ।
ప్రత్యుత్పన్నధియా పుంసా కల్పితం బుద్ధి పూర్వకమ్ ॥

-(ర.సు.II.201-211)

అర్థం :న- ఇతి, ముహుః కృతః, ప్రతిషేధార్థ వీప్సయా = వద్దు, వద్దు అంటూ, మాటిమాటికీ, ప్రతిషేధార్థాలను తెలుపుతూ; ఈప్సిత-ఆలింగనాదీనాం, నిరోధః, మానః, ఉచ్యతే = అభీష్టములైన, ఆలింగనాదులను, అడ్డుకొనటం, మానం, (అని) చెప్పబడుతున్నది. సః-అయం, సహేతుః, నిర్హేతుః, ఇతి, ద్వేధా =ఆయది, సహేతుక (మానం), నిర్హేతుక (మానం), అని రెండు విధాలు.

అత్ర, హేతుజః, ఈర్ష్యయా, సంభవేత్ = ఇందు, హేతుజమైన మానం, ఈర్ష్యవల్ల సంభవిస్తుంది.

అన్యాసంగిని వల్లభే, దృష్టేః, అనుమితేః, శ్రుతేః, అసహిష్ణుత్వం-ఏవ (తు), ఈర్ష్యా = వల్లభుడు అన్యస్త్రీసక్తుడు కాగా, దానిని చూచికాని, ఊహించికాని, వినికాని సహించకుండటం ఈర్ష్య.

ఈర్ష్యామానే (తు), నిర్వేద, అవహిత్థా, గ్లాని, దీనతాః, చింతా, చాపల్య, జడతా, మోహాద్యాః, వ్యభిచారిణః = ఈర్ష్యామానమందు-నిర్వేదం, అవహిత్థ, గ్లాని, దీనత, చింత, చాపల్యం, జడత, మోహం మున్నగునవి వ్యభిచారిభావాలు.

అనుమితిః, భోగ-అంక, గోత్రస్ఖలన, ఉత్స్వప్నైః, త్రిధా = అనుమితి (= అనుమానం)—భోగచిహ్నాలు, గోత్రస్ఖలనం (= పొరపాటున వేరొక నాయిక వేరు ఉచ్చరించటం), ఉత్స్వప్నం (= స్వప్నంలో వేరొక నాయికవేరు ఉచ్చరించటం) అనే (భేదాలచేత) మూడు విధాలు.

ఆప్తసఖీముఖాత్, ప్రియాపరాధస్యశ్రుతిః, శ్రుతిః = ఆప్తులగు చెలికత్తెల ద్వారా, ప్రియుడొనర్చిన అపరాధం వినటం శ్రుతి.

కారణ-అభావసంభూతః, ద్వయోః-అపి, నిర్హేతుఃస్యాత్ = (సరిఅయిన) కారణం లేకయే, నాయికా-నాయకులకు కలిగిన మానం, నిర్హేతుకమానం అవుతుంది. తత్ర, అవహిత్థ-ఆదయః, వ్యభిచారిణః, విజ్ఞేయా = ఇందు, అవహిత్థ మున్నగునవి, వ్యభిచారిభావాలు (అని) తెలియవలె.

స్వయంగ్రాహి స్మిత-ఆదిభిః, నిర్హేతుకః, స్వయం శామ్యేత్ = తమంత కలిగిన చిరునవ్వు మున్నగు వానిచేత, నిర్హేతుకమానం, తనంతట శాంతి పొందుతుంది.

హేతుజః (తు), యథాయోగ్యం, ప్రకల్పితైః, సామ్నా, భేదేన, దానేన, నతి-ఉపేక్షా, రసాంతరైః, శమం, యాతి =సహేతుకమగుమానం-యథా యోగ్యంగా. , కల్పింపబడిన సామం, భేదం, దానం, నతి, ఉపేక్ష, రసాంతరం- వీని చేత శాంతి పొందుతుంది.

తత్ర, యత్ (తు) , ప్రియ-ఉక్తికథనం, తత్, సామః, గీయతే = అందు, ఏది, ప్రియోక్తులను చెప్పటం కలదో, అది సామం (అని) చెప్పబడుతుంది.

సఖ్యాదిభిః, ఉపాలంభ ప్రయోగః, భేదః, ఉచ్యతే = (నాయికను గూర్చి) చెలికత్తెలచేత నిందావాక్యాలు పలికించటం, భేదం (అని) చెప్పబడుతున్నది.

వ్యాజేన, భూషణ-ఆదీనాం, ప్రదానం, దానః, ఉచ్యతే = ఏదేనినెపంతో, భూషణాలు మున్నగువానిని, ఇవ్వటం, దానం (అని) చెప్పబడుతుంది.

పాదప్రణామః, నతిః, స్యాత్ = (నాయికయొక్క) పాదాలకు నమస్కరించటం, నతి అవుతుంది.

తూష్ణీంస్థితిః, ఉపేక్షణం = ఊరక ఉండటం, ఉపేక్ష. ఆకస్మిక భయ-ఆదీనాం, కల్పనా, రసాంతరం, స్యాత్ = ఆకస్మికంగా భయం మున్నగువానిని కల్పించటం, రసాంతరం అవుతుంది.

యాదృచ్ఛికం, బుద్ధిపూర్వం, ఇతి, ద్వేధా, నిగద్యతే = (రసాంతరం అనేది) యాదృచ్ఛికం, బుద్ధిపూర్వకం అనే భేదాలచేత, రెండు విధాలు (అని) చెప్పబడుతున్నది. అనుకూలేన, దైవేన, కృతం, యాదృచ్ఛికం, భవేత్ = అనుకూలదైవం చేత చేయబడినది (= ఉరుములు, మెరుపులు మున్నగునవి రావటం) యాదృచ్ఛికం,అవుతుంది.

ప్రత్యుత్పన్నధియా పుంసా, కల్పితం, బుద్ధిపూర్వకం = సమయోచితమైన బుద్ధిగల, పురుషునిచేత, కల్పింపబడినది, బుద్ధిపూర్వకం.

తాత్పర్యం : 'వద్దు వద్దు' అంటూ మాటిమాటికి వ్యతిరేకతను చూపిస్తూ, ఆలింగనాదులను అడ్డుకొనటం 'మానం' అవుతుంది. సహేతుకం, నిర్హేతుకం అని ఈ మానం రెండు విధాలు.

సహేతుకమానం : ఇది ఈర్ష్యవల్ల సంభవిస్తుంది. వల్లభుడు అన్యస్త్రీ సక్తుడుకాగా, దానిని చూచికాని, ఊహించికాని, వినికాని సహింపకుండటం ఈర్ష్య. ఈ ఈర్ష్యామానంలో -నిర్వేదం, అవహిత్థ, గ్లాని, దైన్యం, చింత,

చాపల్యం, జడత, మోహం మున్నగునవి వ్యభిచారిభావాలు. ఊహించటం (= అనుమితి) మూడు విధాలు : భోగచిహ్నాల వల్ల, గోత్రస్ఖలనం వల్ల, ఉత్స్వప్నం వల్ల. ఆప్తులైన చెలికత్తెలద్వారా ప్రియుడొనర్చిన అపరాధం వినటం శ్రుతి (= వినటం).

సహేతుకమానం, యథాయోగ్యంగా కల్పించబడిన సామం, భేదం, దానం, నతి, ఉపేక్ష, రసాంతరం - వీటి చేత శాంతి పొందుతుంది.

ఏదేని నెపంతో భూషణాదులను ఇవ్వటందానం. ప్రియోక్తులను చెప్పటం సామం.

చెలికత్తెల చేత నాయికను గూర్చి నిందావాక్యాలు పలికించటం భేదం.

నాయిక పాదాలకు నమస్కరించటం నతి. ఊరక ఉండటం ఉపేక్ష.

ఆకస్మికంగా, భయాదులను కల్పించటం రసాంతరం. రసాంతరం అనేది యాదృచ్ఛికం, బుద్ధిపూర్వకం అని రెండు విధాలు. దైవానుకూల్యంతో ఉరుములు మెరుపులు మున్నగునవి రావటం యాదృచ్ఛికం.

నాయకుడు సమయోచితమైన బుద్ధితో కల్పించినవి బుద్ధిపూర్వకం.

నిర్హేతుకమానం : సరి అయిన లేదా తగినంత కారణం లేకుండానే నాయికా-నాయకులకు కలిగేమానం నిర్హేతుకమానం అవుతుంది. ఇందులో అవహిత్థ మున్నగునవి వ్యభిచారి భావాలు. తమంత కలిగిన చిరునవ్వు మున్నగు వాటిచేత, నిర్హేతుకమానం, తనంతట శాంతి పొందుతుంది.

టీక : 1. నాయకుడు అన్యాసక్తుడు కాగా నాయికకు కలిగే చిత్తవిక్రియ 'ఈర్ష్య' అవుతుంది అని విద్యానాథుడు.

2. నిర్హేతుకమైన మానాన్ని ప్రణయమానం అన్నాడు భ.ర.ప్ర.కర్త. నిర్హేతుకమైన (ప్రణయ) మానం పురుషులకు కూడా కలుగవచ్చు — ఇంటి పనులలో తెమలక, లేదా ముస్తాబు పూర్తికాక, లేదా అత్తమామల సేవలు చేస్తూ, లేదా అడుపడుచుల వేళాకోళాలు మున్నగువాని వల్ల నాయిక పడకటింటికి చేరటం ఆలస్యమైనప్పుడు.

3. నిర్హేతుకమానంలో కోపంనెపంతో చుంబనాదుల పట్ల ఆలస్యం జరుగుతుంది. దానికి ప్రేమపరీక్ష ఫలం.

భావకౌటిల్య (= కపట) మానం అనేది కూడా నిర్హేతుకమైనదే, కాని ఇందులో చుంబనాదుల పట్ల విలంబం లేకపోవటం ఫలం.

4. సింగభూపాలుని వలెనే శారదాతనయ - విశ్వనాథులు కూడా మానవిప్రలంభాన్ని విపులంగా వివరించినారు.

5. అనునయపర్యంతం ఓర్పులేకపోతే, అది విప్రలంభ భేదం కాజాలదు. అది 'సంభోగసంచారి' అనే పేరుగల భావం అవుతుంది అని విశ్వనాథుడు.

6. నాయికా నాయకులు పరస్పరం ఆజ్ఞోల్లంఘనం చేయటం వల్ల కలిగేది ప్రణయమానం అనిచెప్పి ఈర్ష్యామానంలో ఉపాలంభం (= దూషించటం), భర్త్సనం (= బెదరించటం), తాడనం (=కొట్టటం), విముఖత్వం మున్నగువానిని అనుభావములుగా పేర్కొన్నాడు భరతరసప్రకరణకర్త.

7. స్వీయామధ్యానాయికలలోని మానభేదాలు, ఆసందర్భంలోనే వివరింపబడినవి.

*(4)* *ప్రవాస విప్రలంభం :*

మూలం : పూర్వసంగతయో ర్యూనో ర్భవే ద్దేశాంతరాదిభిః ।
చరణవ్యవధానం యత్ స ప్రవాస ఇతీరితః ॥
తజ్జన్యో విప్రలంభోఽపి ప్రవాస ఇతి సమ్మతః ।
హర్షగర్వమదవ్రీడా వర్జయిత్వా సమీరితాః ॥
శృంగారయోగ్యాస్సర్వేఽపి ప్రవాసే వ్యభిచారిణః ।
కార్యతస్సంభ్రమాచ్ఛాపాత్ త్రిధా తత్ర కార్యజః ॥
బుద్ధిపూర్వతయా యూనోః సన్నిధాన వ్యపేక్షయా ।
ధర్మార్థ సంగ్రహో బుద్ధిపూర్వో వ్యాపారః కార్యమ్ ॥
వృత్తో వర్తిష్య మాణశ్చ వర్తమాన ఇతి త్రిధా ।
ఆవేగః సంభ్రమః సోఽపి నైకో దివ్యాది భేదతః ॥

-(ర.సు.II-212-16)

అర్థం : యత్, పూర్వసంగతయోః, యూనోః, దేశాంతరాదిభిః, చరణ వ్యవధానం, భవేత్, సఃప్రవాసః, ఇతి, ఈరితః = ఏది (= ఎవ్వాడు), పూర్వం సమాగమం కలిగిన యువతీ - యువకులకు, దేశాంతరగమనం మున్నగువాని వల్ల ఎడబాటు, సంభవిస్తే, అది, ప్రవాసం అని చెప్పబడుతుంది. తత్-జన్యః, విప్రలంభః, అపి, ప్రవాసః, ఇతి, సమ్మతః = ఆ ప్రవాసం వల్ల పుట్టిన, విప్రలంభం, కూడా, ప్రవాసం అని అంగీకరింపబడింది (=దీనినే ప్రవాస విప్రలంభం అని కూడా అంటారు).

హర్ష, గర్వ, మద, వ్రీడా, వర్జయిత్వా, శృంగారయోగ్యాః, సర్వే, అపి, ప్రవాసే, వ్యభిచారిణః, సమీరితాః=హర్షం, గర్వం, మదం, వ్రీడా వీనిని విడిచి, శృంగారయోగ్యాలైన తక్కిన సర్వభావాలు, కూడా, ప్రవాసమందు, వ్యభిచారి భావాలుగా గణింపబడినవి.

తత్, కార్యతః, సంభ్రమాత్, శాపాత్, త్రిధా = అది (= ప్రవాసం), కార్యజం, సంభ్రమజం, శాపజం, (అని) మూడు విధాలు.

యూనోః, సన్నిధాన వ్యపేక్షయా, బుద్ధిపూర్వతయా కార్యజః = యువతీ-యువకులు, ఒకరిదగ్గర ఒకరు ఉండవలెనన్న కోరికతో ఉన్నప్పటికీ, బుద్ధి పూర్వకంగా కలిగినది, కార్యజం (= కార్యం వలన కలిగిన ప్రవాసం) అవుతుంది.

ధర్మ-అర్థ-సంగ్రహః, బుద్ధిపూర్వః వ్యాపారః, కార్యం = ధర్మం, అర్థం సంగ్రహించవలెననే, బుద్ధిపూర్వకమగు వ్యాపారం, కార్యం.

వృత్తః, వర్తిష్యమాణః, వర్తమానః, ఇతి, త్రిధా =(కార్యజమగు) ప్రవాసం, వృత్తం (=భూతం=జరిగినది), వర్తిష్యమాణం (=భావి =జరుగ బోయేది), వర్తమానం (=జరుగుతున్నది), అని, మూడువిధాలు.

ఆవేగః, సంభ్రమః, సః - అపి దివ్యాది భేదతః, న ఏకః = ఆవేగం అనేది సంభ్రమం; అది దివ్యాదిభేదాల చేత అనేక విధాలు.

తాత్పర్యం : పూర్వం సమాగమం కలిగిన యువతీయువకులకు దేశాంతర గమనం మున్నగు వానిచేత కలిగిన ఎడబాటు ప్రవాసం అవుతుంది. ఆ ప్రవాసం వల్ల కలిగిన విప్రలంభం కూడా ప్రవాసంగానే చెప్పబడుతుంది. ఇందులో హర్షం, గర్వం, మదం, వ్రీడ- ఇవి తప్ప శృంగారయోగ్యాలయిన తక్కిన సర్వభావాలు వ్యభిచారి భావాలుగా ప్రసక్తములవుతాయి. ప్రవాసం - కార్యజం, సంభ్రమజం, శాపజం అని మూడు విధాలు. ధర్మం అర్థం ఇవి సాధించవలెననే కోరికతో కూడిన బుద్ధిపూర్వకమగు వ్యాపారం, కార్యం. ఒకరి దగ్గర ఒకరు ఉండవలెనని కోరుకొన్నప్పటికీ, బుద్ధిపూర్వకంగా ఎడబాటు కలిగించుకొనటం కార్యజమగు ప్రవాసం అవుతుంది. ఇది, వృత్తం-వర్తిష్యమాణం-వర్తమానం అనేభేదాల చేత మూడు విధాలు.

ఆవేగమే సంభ్రమం, అది దివ్యాదిభేదాలచేత అనేక విధాలు.

టీక : ప్రోషితభర్తృక విషయంలో వృత్తాదిభేదాలు వివరింపబడినవి.

ఆవేగం యొక్క భేదాలు వ్యభిచారిభావ వివరణలో చెప్పబడినవి.

శాపజమైన ప్రవాసాన్ని వేరే భేదంగా, తరువాత వివరిస్తాము.

అనుభావాలలో లంబాలకత్వాన్ని (= వ్రేలాడే జుట్టును) అధికంగా చెప్పినాడు భరతరసప్రకరణకర్త.

కొంతకాలం కలిసి ఉన్న ప్రేయసీ ప్రియులు భిన్నదేశములందు ఉండటం ప్రవాసం; ఆ ప్రవాసం వల్ల కలిగిన విప్రలంభం కూడా 'ప్రవాసం' అనే చెప్పబడుతున్నది. ఇందు- హర్షం, గర్వం, మదం, వ్రీడ అనేవి తప్ప, తక్కిన వ్యభిచారి భావాలన్నీ ఉంటాయి.

ఈ ప్రవాసం కార్యజం, సంభ్రమజం, శాపజం అని ముప్పిధాలు.

1. కార్యజం : ధర్మం, అర్థం మున్నగునవి సంపాదించవలెనన్న బుద్ధి పూర్వకమగు వ్యాపారం 'కార్యం' అవుతుంది. వ్యాపారం కోసం దేశాంతరం వెళ్ళటం మున్నగునవి దీనికి ఉదాహరణములు. కార్యజమగు ప్రవాసం మరల మూడు విధాలు– వృత్తం, వర్తమానం, వర్తిష్యమాణం.

(i) వృత్తం : భూతపూర్వం అంటే ఇదివరకు జరిగినది.

(ii) వర్తమానం : 'వెడుతున్నాను' అని ప్రియుడు చెప్పినప్పుడు.

(iii) వర్తిష్యమాణం : ఎడబాటు ఇంక తప్పదు అని తెలిసినప్పుడు.

ప్రోషితభర్తృకాదిభేదాలు ఇప్పట్ల స్మరణార్హములు.

2. సంభ్రమజం : ఆవేగం సంభ్రమం అవుతుంది. ఇది దివ్య-మానుష-నిర్ఘాత-ఆదులవల్ల ఆకస్మికంగా కలుగుతుంది (విక్రమోర్వశీయమందలి ఊర్వశీ-పురూరవుల ఎడబాటు దివ్యసంభ్రమజం).

3. శాపజం : మేఘసందేశంలోని యక్షవిరహం.

*(5) శాప విప్రలంభం :*

మూలం : శాపో వైరూప్యతాద్రూప్య ప్రవృత్తే ర్ద్వివిధో భవేత్ ॥
ప్రవాసః శాపవైరూప్యాదహల్యాగౌతమాదిషు ।

-(ర.సం. II-216-17)

అర్థం : శాపః, వైరూప్య-తాద్రూప్యప్రవృత్తేః, ద్వివిధః, భవేత్ = శాపం (= శాపవిప్రలంభం), వైరూప్యం (= వేరురూపు కలుగటం), తాద్రూప్యం (= ఉన్నరూపే ఉండటం), అనే భేదాల చేత, రెండు విధాలు అవుతుంది.

శాపవైరూప్యాత్, ప్రవాసః, అహల్యాగౌతమాదిషు = శాపంవల్ల వైరూప్యంతోడి ప్రవాసానికి అహల్యా-గౌతములు మున్నగువారు (ఉదాహరణములు).

తాత్పర్యం : శాప విప్రలంభం అనేది రెండు విధాలు- వైరూప్యం, తాద్రూప్యం. వైరూప్యానికి అహల్యా-గౌతములు ఉదాహరణ కాగా, తాద్రూప్యానికి మేఘసందేశమందలి యక్షిణీ-యక్షులు ఉదాహరణ.

టీక : జాడ్యం వల్లకానీ, శాపం వల్ల కానీ ఒకరికొకరు దూరంగా ఉన్నా, దగ్గరగా ఉన్నా సంగమం లేకపోవటం శాపవిప్రలంభమవుతుందని భ.ర.ప్ర.కర్త. 'జాడ్యం' అంటే భయంకరరోగం అని చెప్పవచ్చు, దీనివల్ల కూడా సంగమం అసంభవమవుతుంది.

సన్నిధిలో ఉన్నా సంగమం లేకపోవటానికి ఉదాహరణ పాండురాజు పొందిన శాపం.

వైరూప్యం (= రూపం మారటం), తాద్రూప్యం (= ఉన్నరూపే ఉండటం) అనే భేదాల చేత శాపం రెండు విధాలు.

అహల్యా-గౌతమాది విషయం వైరూప్యం, యక్షవిషయం తాద్రూప్యం. శాపం వల్ల అహల్య రూపుమారిపోయింది; కానీ యక్షుడు సహజరూపంలోనే ఉన్నాడు.

ఉదా : కశ్చిత్‌కాంతా విరహగురుణా స్వాధికారాత్ప్రమత్తః
శాపేనాస్తంగమిత మహిమా వర్షభోగ్యేన భర్తుః ।
యక్షశ్చక్రే జనకతనయా స్నానపుణ్యోదకేషు
స్నిగ్ధచ్ఛాయా తరుషు వసతిం రామగిర్యాశ్రమేషు ॥
(మేఘదూతం-I-1)

—అధికార నిర్వహణలో ప్రమత్తుడుగా ఉన్న ఒకానొక యక్షుని "సంవత్సరకాలం ప్రియావిముక్తుడవు కమ్ము" అని ఇంద్రుడు శపించగా, నశించిన మహిమ కలవాడై, జనకతనయాస్నానం చేత పవిత్రములయిన జలములు, చల్లని నీడలనిచ్చు చెట్లు కల రామగిర్యాశ్రమమందు నివాసం ఏర్పరచుకొన్నాడు.

భరతాదులు చెప్పిన దశలేదా ద్వాదశకామావస్థలు కాక, విశ్వనాథుడు ప్రవాసమందు పదకొండు స్మరదశలను వేరుగా పేర్కొన్నాడు. 1. అవయవముల అసౌష్ఠవం (= మాలిన్యం), 2. తాపం (= విరహజ్వరం), 3. పాండుత, 4.

కృశత, 5. అరుచి (= వస్తువైరాగ్యం), 6. అధృతి, 7. అనాలంబం (= శూన్యహృదయం), 8. తన్మయత, 9. ఉన్మాదం, 10. మూర్ఛ, 11. మృతి.

అభిలాషాదిదశలును, ఈ దశలును - ఉభయములును ఉభయత్ర సంభవించేవి అయినప్పటికీ చిరకాల ప్రసిద్ధిని పట్టి విడదీసి చెప్పడమైనది (సా.ద. 224 సూ.).

*(6)* కరుణ విప్రలంభం :

మూలం : ద్వయో రేకస్యమరణే పునరుజ్జీవనావధౌ ॥
విరహః కరుణోఽన్యస్య సంగమాశానివర్తనః ।
కరుణభ్రమకారిత్వా త్సోఽయం కరుణ ఉచ్యతే ॥
సంచారిణోఽనుభావాశ్చ కరుణే విప్రవాసవత్ ।

-(ర.సు.II-212-14)

అర్థం : ద్వయోః ఏకస్య మరణే =ఇరువురిలో ఒకరు మరణించగా; పునః ఉజ్జీవన- అవధౌ = (వారు) తిరిగి జీవించే పర్యంతం ఉండే; విరహః కరుణః = విరహం, కరుణం (= కరుణ విప్రలంభం) అవుతుంది.

అన్యస్య సంగమ ఆశానివర్తనః = రెండవవారికి సంగమం కలుగుతుందన్న ఆశలేకపోవటం చేత; కరుణ భ్రమకారిత్వాత్ = కరుణము అనే భ్రాంతిని కలిగిస్తున్నందుచేత; సః అయం కరుణః ఉచ్యతే = ఇది కరుణము అని చెప్ప బడుతున్నది; కరుణే సంచారిణః అనుభావాః (చ) విప్రవాసవత్ = కరుణ విప్ర లంభమందు సంచారిభావాలు, అనుభావాలు ప్రవాసవిప్రలంభమందు వలెనే ఉంటాయి.

తాత్పర్యం : ప్రేయసీ ప్రియులు ఇరువురిలో ఒకరు మరణింపగా, మరణిం చిన వ్యక్తి జీవించే పర్యంతం ఉండే విరహం కరుణం అవుతుంది. జీవించిన వారికి, మరణించిన వారితో సంగమం మరల కలుగుతుందన్న ఆశలేకపోవటం చేత, ఈ అవస్థ కరుణము అనే భ్రాంతి కలిగిస్తున్నందువల్ల ఇది 'కరు ణవిప్రలంభం' అని చెప్పబడింది. ఇందలి వ్యభిచారి భావాలు అనుభావాలు ప్రవాసవిప్రలంభమందలివే అవుతాయి.

టీక : కరుణరసం, విప్రలంభ శృంగారం - వీనిభేదాన్ని భరతముని వివరించిన విధం ఇంతకు ముందే పేర్కొన్నాను. కరుణము, విప్రలంభము - అనే ఈ

రెండు అవస్థలను కలిపి అర్వాచీనాలంకారికులు 'కరుణవిప్రలంభం' అనే భేదాన్ని కల్పించారు.

శరీరంతో దేశాంతరం వెళ్ళటం ప్రవాసవిప్రలంభమవుతుంది; ఇంక ప్రాణాలతో లోకాంతరం వెళ్ళటం కరుణ విప్రలంభమవుతుంది. అయితే, దేశాంతరం వెళ్ళిన వ్యక్తి తిరిగిరావటం తథ్యమైనట్లే, లోకాంతరం వెళ్లిన వ్యక్తి కూడా తిరిగి రావటంలో నమ్మకం ఉన్నప్పుడే అది కరుణవిప్రలంభం అవుతుంది; తిరిగి రావటం లేకపోతే అది కేవలం కరుణమే అవుతుంది. సంగమప్రత్యాశ చేత రతిస్థాయిభావం కొనసాగుతూనే ఉంటుంది. కరుణవిప్రలంభమునకు ఉదాహరణములు-- నాగానందంలో మలయవతీ జీమూతవాహనులు, కుమారసంభవకావ్యంలో రతీ మన్మథులు, కాదంబరిలో మహాశ్వేతా-పుండరీకులు.

శృంగారరస-ఆభాసం :

రసాభాసాన్ని భరతముని చర్చించలేదు. శృంగారం నుండి హాస్యం జనిస్తుందని భరతముని చెప్పిన సందర్భంలో శృంగారం అనుకృతి రూపంగా అంటే ఆభాసరూపంగా హాస్యానికి హేతువు అవుతుందని, ఆభాసమంటే అనౌచిత్యమనీ, అనౌచిత్యం ఉన్నచోటనెల్ల అది ఆభాసమే అనీ అభినవగుప్తుడు వివరించినాడు. (అ.భా. 1 వ సం. పుట 295).

రసభావములందలి అనౌచిత్యప్రవృత్తి ఆభాసమని పేర్కొని, విశ్వనాథుడిట్లా వివరించినాడు (సా.ద. III-282) :

మూలం : ఉపనాయక సంస్థాయాం మునిగురుపత్నీ గతాయాం చ ।
బహునాయక విషయాయాం రతౌ తథాఽనుభయనిష్ఠాయామ్।
ప్రతినాయక నిష్ఠత్వే తద్వదధమపాత్ర తిర్యగాదిగతే ।

తాత్పర్యం : ఉపపతి విషయమైన రతి, ముని-గురుపత్నీ గతమైన రతి, బహునాయక విషయమైనరతి, ఉభయనిష్ఠం కాని రతి, ప్రతినాయకనిష్ఠమైన రతి, అధమపాత్రగతమైన రతి, పశు-పక్ష్యాదులరతి - ఇవి అనుచితాలు, కాన ఇవి శృంగారరసాభాసాలు.

టీక : అరాగం (= ఇరువురిలో ఒకరికే రాగం ఉండటం), అనేక రాగం (= ఒకస్త్రీకి పలువురు పురుషుల మీద లేదా ఒక పురుషునకు అవ్యవస్థితంగా పలువురు స్త్రీల మీద రాగం ఉండటం), మ్లేచ్ఛరాగం (= అనాగరికుల

రాగం), తిర్యగ్రాగం (= పశుపక్ష్యాదుల రాగం) అనేభేదాల చేత శృంగారాభాసం సాధారణంగా నాలుగు విధాలు.

(అనేకస్త్రీలపై వ్యవస్థితంగా ఉండే శ్రీకృష్ణరాగం అభాసంలో చేరదు - రసతరంగిణీకర్త).

ఉదా : తిర్యగ్రతి :

మధుద్విరేఫః కుసుమైకపాత్రే
పపౌప్రియాం స్వామనువర్తమానః ।
శృంగేణ సంస్పర్శ నిమీలితాక్షీం
మృగీమకండూయత కృష్ణసారః ॥ -(కు.సం.III-36)

—తన ప్రియురాలితో కూడి తుమ్మెద, పుష్పం అనే పాత్రలో మధువు త్రాగినది; స్పర్శమాత్రాన పరవశమై కనులు మూసికొన్న ఆడుజింకను మగజింక తన కొమ్ముతో గోకినది. (అకాలవసంతోదయ వర్ణనలోనిది).

మ్లేచ్ఛరాగం :

భార్యాం మోహనసుప్తాం మృతేతి మత్వా ధావితే హాలికే ।
దరస్ఫుటితఫలోదరాభిర్హసితమివకార్పాసలతాభిః ॥

-(గాథాసప్తశతి-IV-90)

— సురతమోహమున నిద్రించిన భార్యను చూసి, ఆమె మరణించినదను కొని, హాలికుడొకడు పరుగెత్తిపోతూఉండగా కొంచెం పగిలిన కాయలు గల ప్రత్తిమొక్కలు వానిని చూచి నవ్వుతున్నట్లున్నవి.

టీక : "పశు పక్ష్యాదులకు, మ్లేచ్ఛులకు గల రాగమాభాసమనటం సమంజసం కాదు; ఏలయన అచట కూడా విభావాదులుంటాయి, అవి లేనియెడల అచటి రాగ మాస్వాదమునకే రాదు కదా" అని టీకావళికర్తయగు విద్యాధరుడు పేర్కొన్నాడు. కాని, భరతముని చెప్పిన ఉజ్జ్వలత, శుచిత్వం, దర్శనీయత్వం తిర్యక్-మ్లేచ్ఛులపట్ల సంభవం కాదు కావున వారిది రసం కాక రసాభాసమే అవుతుందని తక్కిన అలంకారికులు నిర్ధారించినారు.

2. దుర్లభజనానురాగో లజ్జాగుర్వీ పరవశ ఆత్మా ।
ప్రియసఖి! విషమం ప్రేమ మరణం శరణంను వరమేకమ్ ॥

-(రత్నావళి -II-5)

– "చెలీ! నాకు దుర్లభుడగు రాజు పట్ల అనురాగం, సిగ్గో అధికం, నేనా పరాధీనను. ఇట్లా నాప్రేమ విషమమైనది.ఇప్పుడు నాకు మరణ మొక్కటే మేలైన శరణం" అని రత్నావళి చెలితో చెప్పి దుఃఖించినది. మరి ఇచ్చట ఏకత్రైవానురాగం కాబట్టి ఇది ఆభాసం కాదా? అని ప్రశ్నించవచ్చు. పిమ్మట ఉభయనిష్ఠత్వం అయినప్పటికీ, తొలుత ఏకనిష్ఠత్వమే అయితే అది ఆభాసత్వమే అని కొందరన్నారు. కాని ఇది పూర్వానురాగం. పూర్వానురాగంలో ముందుగా స్త్రీకి రాగం వర్ణించి, తరువాత పురుషునకు వర్ణించవలెనని శాస్త్రకారమతం. కావున ఇది రసాభాసం కాజాలదు. అంతేకాదు. ఇచ్చట నాయకుని పట్ల రాగం యొక్క అభావం వర్ణితమైంది. అభావం మూడు విధాలు - (1) ప్రాగభావం, 2. అత్యంతాభావం, 3. ప్రధ్వంసాభావం. వీనిలో ప్రాగభావంలో దర్శన శ్రవణాది కారణాలవల్ల రాగం జనిస్తుంది. ఇందులో ఆభాసత్వం లేదు. ఇంక తక్కిన రెండింటిలో కారణాలు ఉన్నా రాగం పుట్టదు. అందుచేత అచ్చట మాత్రమే ఆభాసం ఉంటుంది. కావున రత్నావళి ప్రభృతుల పూర్వానురాగం ఆభాసం కాజాలదు (రత్నావళి, చివరకు తాను కోరిన రాజును పొందగల్గినది).

## 2. హాస్యం

మూలం : హాస్యోనామహాసస్థాయి భావాత్మకః. స చ
వికృతపరవేషాలంకార ధార్ష్ట్య లౌల్య కుహ కాసత్
ప్రలాప వ్యంగ్యదర్శన దోషోదాహరణాదిభిః
విభావైః ఉత్పద్యతే. తస్యోష్ఠనాసాకపోల
స్పందన దృష్టివ్యాకోశాకుంచన స్వేదాస్యరాగ
పార్శ్వగ్రహణాదిభిః అనుభావైః అభినయః ప్రయోక్తవ్యః.
వ్యభిచారిణ శ్చాస్యావహిత్థాలస్య తంద్రా నిద్రా
స్వప్నప్రబోధాసూయాదయః. ద్వివిధ
శ్చాయ మాత్మస్థః పరస్థశ్చ. యదా స్వయం
హసతి తదాత్మస్థః, యదా తు పరం.
హాసయతి తదా పరస్థః.
అత్రానువంశ్యే ఆర్యే భవతః -
విపరీతాలంకారై ర్వికృతాచారాభిధానవేషైశ్చ ।
వికృతై రర్థ విశేషై ర్హసతీతి రసః స్మృతో హాస్యః ॥
వికృతాకారై ర్వాక్యై రంగవికారైశ్చ వికృతవేషైశ్చ ।

హాసయతి జనం యస్మా త్తస్మాత్ జ్ఞేయో రసో హాస్యః ॥
స్త్రీనీచప్రకృతా వేష భూయిష్ఠం దృశ్యతే రసః ।
హాస్యభేదాలు :
షడ్భేదాశ్చాస్య విజ్ఞేయా స్తాంచ వక్ష్యామ్యహం పునః ॥
స్మిత మథ హసితం విహసిత ముపహసితం చాపహసిత
మతి హసితమ్ ।
ద్వౌద్వౌ భేదా స్యాతా ముత్తమ మధ్యాధమ ప్రకృతౌ ॥
తత్ర-
స్మితహసితే జ్యేష్ఠానాం మధ్యానాం విహసితోపహసితే చ ।
అధమానా మపహసితం హ్యతిసహితం చాపి విజ్ఞేయం ॥
సితో హాస్యః ప్రకీర్తితః -42
హాస్యః ప్రమథదైవతః -44
అంగవైవథ్య వాక్యైశ్చ హాస్యః త్రిధాస్మృతః
-(నా.శా.VI-49-61, 77)

గ్లానిశంకాహ్యసూయా చ శ్రమశ్చపలతా తథా ।
సుప్తం నిద్రావహిత్థం చ హాస్యే భావాః ప్రకీర్తితాః ॥
-(నా.శా.VII-110)

అర్థం : హాస్యః-నామ, హాసస్థాయి భావాత్మకః = హాస్యం అనేది, హాసం స్థాయిభావంగా కలది.

సః (చ), వికృత పరవేష, అలంకార, ధార్ష్ట్య, లౌల్య, కుహక, అసత్ ప్రలాప, వ్యంగ్యదర్శన, దోషోదాహరణ-ఆదిభిః, విభావైః, ఉత్పద్యతే = అది (= ఆహాస్యం), వికృతములైన పరవేష (= కేశాదిరచన) అలంకారాలు, ధార్ష్ట్యం (= నిర్లజ్జత), లౌల్యం (= విషయములందు అనియతత్వం), కుహకం (= చక్కిలిగింతలు పెట్టటం), అసత్ప్రలాపం, వ్యంగ్యదర్శనం (= అంగవికలులను చూడటం), అకార్యకరణములను వికృతవేషాదులను అనిమిత్త భయాదులను వర్ణించిచెప్పటం మున్నగు విభావాల వల్ల హాస్యం జనిస్తుంది.

తస్య = దాని (= హాస్యం యొక్క); -ఓష్ఠ-నాసా-కపోల-స్పందన, దృష్టి వ్యాకోశ- కుంచన, స్వేద, ఆస్యరాగ, పార్శ్వగ్రహణ-ఆదిభిః, అనుభావైః, అభినయః, ప్రయోక్తవ్యః = పెదవులను ముక్కును చెక్కిళ్ళను స్పందింప జేయటం, కనులను కొలదిగా మూయటం విప్పారజేయటం, స్వేదం, ముఖం

రంగు మారటం, రెండు చేతులతో తన ప్రక్కలను పట్టుకొనటం మున్నగు, అనుభావాలచేత - అభినయం చేయదగినది.

అస్య, వ్యభిచారిణః (చ) = దానియొక్క, వ్యభిచారిభావాలు- అవహిత్థా, ఆలస్య, తంద్రా, నిద్రా, స్వప్న, ప్రబోధ, అసూయ-ఆదయః = అవహిత్థ, ఆలస్యం, తంద్ర (= మోహం), నిద్ర, స్వప్నం, ప్రబోధం, అసూయ మున్నగునవి.

అయం, ఆత్మస్థః, పరస్థః (చ), ద్వివిధః (చ) = అది, ఆత్మస్థం, పరస్థం అనే భేదాలచేత రెండు విధాలు.

యదా, స్వయం, హసతి, తదా, ఆత్మస్థః = ఎప్పుట, స్వయంగా నవ్వటమో, అప్పుట, ఆత్మస్థం; యదా (తు), పరం, హాసయతి, తదా, పరస్థః = ఎప్పుట, ఇతరులను నవ్వించటమో, అప్పుట, పరస్థం.

అత్ర, అనువంశ్యే, ఆర్యే, భవతః = ఇచ్చుట, అనువంశ్యములయిన, ఆర్యలు కలవు.

విపరీత-అలంకారైః, వికృత-ఆచార-అభిధాన-వేషైః(చ) = విపరీతములైన అలంకారాలు, వికృతములైన ఆచారాలు నామాలు వేషాలు- వీనిచేత; వికృతైః , అర్థవిశేషైః, హసతి- ఇతి, హాస్యరసః, స్మృతః = వికృతములైన అర్థవిశేషాలు -వీనిచేత (=చూచి) నవ్వటం హాస్యరసం, అవుతుంది (ఇచ్చుట అంగవికారాదులు కూడా ఊహనీయాలని ర.త.కర్త).

వికృత-ఆకారైః-వాక్యైః, అంగవికారైః (చ), వికృతవేషైః(చ) యస్మాత్, జనం హాసయతి, తస్మాత్, హాస్యరసః, జ్ఞేయః = వికృతములైన ఆకారాలు, వాక్యాలు, అంగవికారాలు, వికృతవేషాలు -వీనిచేత, ఎందువల్ల జనులను నవ్వించటం జరుగుతుందో, అందుచేత (ఇది) హాస్యరసం (అని) తెలియవలె (ఇచ్చుట-ఆస్యం అధరం పెద్దవికావటం, పళ్ళుబయటపడటం, నాసా-కపోలాలు స్పందించటం, దృష్టివ్యాకుంచనాదులు ఊహనీయాలు అని ర.త.కర్త).

ఏషరసః, స్త్రీ నీచప్రకృతౌ-ఏవ, భూయిష్ఠం, దృశ్యతే = ఈ (హాస్య) రసం, స్త్రీలు, నీచ ప్రకృతులు -వీరియందే అధికంగా గోచరిస్తుంది.

హాస్యభేదాలు :

అస్య, షట్-భేదాః(చ), విజ్ఞేయః = దాని (= హాస్యరసం) యొక్క ఆరుభేదాలు, ( ఉన్నవని) తెలియదగినది; పునః, తాం (చ), అహం, వక్ష్యామి = మరల, వానిని (= ఆభేదాలను) చెప్పచున్నాను.

స్మితం, (అథ) హసితం, విహసితం, ఉపహసితం (చ), అపహసితం, అతిహసితం, ద్వౌద్వౌభేదౌ, ఉత్తమ-మధ్యమ-అధమ ప్రకృతౌ, స్యాతాం = స్మితం-హసితం, విహసితం-ఉపహసితం, అపహసితం-అతిహసితం- ఇవి రెండేసి చొప్పున క్రమంగా, ఉత్తమ-మధ్యమ-అధమ ప్రకృతులకు వర్తిస్తాయి.

స్మిత-హసితే, జ్యేష్ఠానాం, విహసిత -ఉపహసితే(చ), మధ్యానాం, అపహసితం (హి)-అతిహసితం (చ- అపి), అధమానాం, విజ్ఞేయం = స్మిత-హసితాలు జ్యేష్ఠ (= ఉత్తమ) ప్రకృతులందు, విహసిత -ఉపహసితాలు మధ్యమ ప్రకృతులందు, అపహసిత-అతిహసితాలు అధమప్రకృతులందు (ఉంటాయని) తెలియదగినది.

హాస్యః, సితః, ప్రకీర్తితః = హాస్యం, సితవర్ణం (= తెలుపురంగు) (అని) చెప్పబడినది.

హాస్యః, ప్రథమదైవతం = హాస్యం ప్రమథుడు అధిదేవతగా కలది.

హాస్యం, అంగ-నైవథ్య వాక్యైః(చ), త్రిధా, స్మృతః = హాస్యం-అంగ చేష్టలు, నైవథ్యం (= వేషం), వాక్యాలు - ఇట్లా మూడు విధాలు (అని) చెప్పబడినది.

హాస్యే-గ్లాని, శంకా(హి), అసూయా(చ), శ్రమః, చపలతా, (తథా) సుప్తం, నిద్రా, అవహిత్థం (చ) - భావాః, ప్రకీర్తితాః = హాస్యమందు -గ్లాని, శంక, అసూయ, శ్రమ, చపలత, సుప్తం, నిద్ర, అవహిత్థం - ఇవి (వ్యభిచారి) భావాలుగా, చెప్పబడినవి.

తాత్పర్యం : హాస్యం, హాసమనే స్థాయిభావం నుంచి జనిస్తుంది.

విభావాలు : వికృతములైన పరవేష-అలంకారాలు, ధార్ష్ట్యం, లౌల్యం, కుహకం, అసత్ప్రలాపం, అంగవికలులను చూడటం, అనిమిత్తభయాదులు, అకార్యకరణములను వికృతవేషాదులను వర్ణించటం, మున్నగు విభావాల వల్ల హాస్యరసం ఉత్పన్నమవుతుంది.

అనుభావాలు : పెదవులను ముక్కుపుటాలను చెక్కిళ్ళను స్పందింప జేయటం, కనుకొలకులను కొంచెంగా మూయటం విస్ఫారజేయటం, స్వేదం, ముఖవైవర్ణ్యం, రెండుచేతులతో తన ప్రక్కలను పట్టుకొనటం అనే అనుభావాలచేత హాస్యాన్ని అభినయించాలి.

వ్యభిచారిభావాలు : అవహిత్థం, తంద్ర (= మోహం), నిద్ర, స్వప్నం, ప్రబోధం, అసూయ మున్నగునవి ఇందలి వ్యభిచారి భావాలు.

ఆత్మస్థ-పరస్థ భేదాలు : ఆత్మస్థ-పరస్థ భేదాలచేత హాస్యం రెండు విధాలు— (1) విభావం చూసి తానే నవ్వటం ఆత్మస్థం (= స్వనిష్ఠం) అవుతుంది. (2) ఇతరులను నవ్వించటం పరస్థం (= పరనిష్ఠం) అవుతుంది. ఈ విషయాలను వివరించే ఆర్యావృత్తాలు రెండు కలవు. విపరీతములైన అలంకారాలు, వికృతములైన అంగవికారాలు- వీనిచేత (=వీనినిచూసి) జనులు నవ్వుతారు; కాన, ఇది హాస్యం అనబడింది. స్త్రీలయందు, నీచ ప్రకృతుల యందు ఈ రసం అధికంగా గోచరిస్తుంది.

ఆరు హాస్యభేదాలు : (1) స్మితం, (2) హసితం, (3) విహసితం, (4) ఉపహసితం, (5) అపహసితం, (6) అతిహసితం - వీనిలో మొదటి రెండు భేదాలు ఉత్తమ ప్రకృతులయందు, తరువాతి రెండు మధ్యమ ప్రకృతులయందు, చివరివి రెండు నీచప్రకృతులయందు అభివ్యక్తములవుతాయి.

హాస్యం యొక్క రంగు తెలుపు.

హాస్యం యొక్క అధిదైవం-ప్రమథుడు.

హాస్యం -అంగ-నైపథ్య-వాక్యభేదాలచేత మూడు విధాలు.

గ్లాని, శంక, అసూయ, శ్రమ, చపలత, సుప్తం, నిద్ర, అవహిత్థ- ఇవి హాస్యమందలి సంచారిభావాలు.

టీక : శృంగారరసంనుంచి హాస్యం జనిస్తుందని భరతముని పేర్కొన్నాడు- జన్య-జనకరస వివేచన సందర్భంలో. ఈ అంశాన్ని అర్వాచీనాలంకారికులందరూ అనువదించారు. కాని, ఇది ఒక విధమగు భేదం మాత్రమే; రూపకములందలి విదూషకహాస్యం ఈ విధానికిచెందినది. అంతేకాదు, శృంగారం అనుకృతిరూపంగా అంటే ఆభాసరూపంగా హాస్యానికి హేతువు అవుతుంది. వికృతములైన వేష-అలంకారాలు హాస్యానికి విభావాలని చెప్పినప్పుడు 'వికృత' పదాన్ని దేశ-కాల-వయః-ప్రకృతి- అవస్థా వైపరీత్యమని అభినవగుప్తుడు వివరించినాడు. కాగా, సర్వరసములందలి అనౌచిత్యప్రవృత్తి (=ఆభాసం) హాస్యానికి విభావం అవుతుందని సారాంశం.

"వాక్-అంగ-ఆది వికారదర్శన జన్మా, వికాసాఖ్యః హాసః" అని జగన్నాథుడు—వాచికం, ఆంగికం మున్నగు వానియందలి వైపరీత్యం దర్శించటం వల్ల కలిగే మనోవికాసం 'హాసం' అనబడుతుంది.

విశ్వనాథుడు హాస్యరసాన్ని ఇట్లా వివరించినాడు :

"వికృత-ఆకార-వాక్-వేష-చేష్టాదేః నర్తకాత్ భవేత్ హాస్యః"- వికృతంగా ఉన్న ఆకారం, వాక్కు, వేషం, చేష్ట మున్నగు వానితో కూడిన నర్తకుని (= నటుని) వల్ల హాస్యం కలుగుతుంది.

కాగా-ఆకారం, వాక్కు, వేషం, చేష్టలు -అంటే అంగిక-వాచిక-ఆహార్య-సాత్త్వికాభినయములందలి వైపరీత్యం హాస్యరసహేతువు అవుతుందని అర్థం. నటునిద్వారా ఈ వైపరీత్యం దర్శించిన సదస్యునిలో కలిగే మనోవికాసం హాస్యరసానికి దారితీస్తుంది.

ఉదా :

గురోర్గిరః పంచదినాన్యధీత్య, వేదాంతశాస్త్రాణిదినత్రయంచ ।
అమీసమాఘ్రాయ చ తర్కవాదాన్ సమాగతాః కుక్కుటమిశ్రపాదాః ॥
-(లటకమేళక ప్రహసనం)

ప్రభాకరుని శాస్త్రం అయిదు దినాలలలో నేర్చి,
వేదాంతశాస్త్రాన్ని మూడు దినాలలో చదివి,
తర్కవాదాలను కూడా అఘ్రాణించి, వీరే కుక్కుట
మిశ్రపాదుల వారు వచ్చినారు!

కైశికీ వృత్తికి అంగమైన నర్మంయొక్క వివరణలో (20 వ అధ్యా. 57-58) భరతముని మూడు విధాలయిన హాసాలను వివరించినాడు. వీరరసరహితమై, విశుద్ధవ్యాపారంతో శృంగారాన్ని స్థాపించే హాసప్రధానమగు వచనం 'నర్మం'. ఇందలి హాసం మూడు విధాలు: (1) ఈర్ష్యను లేదా క్రోధాన్ని సూచించేది, (2) పరులను ఉపాలంభించటంతో కూడినది, (3) వంచనాపూర్వకంగా పరుల హృదయం గ్రహించటానికి ప్రయుక్తమయ్యేది.

ఆత్మస్థ-పరస్థ భేదాలను అభినవగుప్తుడిట్లా వివరించినాడు - విదూషకుడు ఆత్మస్థములైన వికృతవేషాది విభావాలను చూసి తానే స్వయంగా నవ్వుకొనటం ఆత్మస్థమవుతుందనీ, వాటిచేత అతడు రాణిని నవ్వించటం ఆమెకు పరస్థమవుతుందనీ కొందరంటారు, అది సరికాదు. తనలోని వికారాలను చూసి తాను నవ్వుకొనటం ఆత్మస్థమనీ, ఇతరులలోని వికారాలను చూసి నవ్వటం పరస్థమనీ కొందరంటారు. ఒకడు నవ్వుతున్నప్పుడు, హాస్యకారణాన్ని మనం ప్రత్యక్ష్యంగా

(1) ఉత్తమప్రకృతులయందు హాస్యం :

మూలం : ఈషద్వికసితైః గండైః కటాక్షైః సౌష్ఠవాన్వితైః ।
అలక్షితద్విజం ధీర ముత్తమానాం స్మితం భవేత్ ॥
ఉత్ఫుల్లాననేత్రం తు గండైర్వి కసితై రథ ।
కించిల్లక్షిత దంతం చ హసితం తద్విధీయతే ॥

-(నా.శా.VI-54-55)

అర్థం : ఈషత్-వికసితైః, గండైః, సౌష్ఠవాన్వితైః, కటాక్షైః, అలక్షిత-ద్విజం, ధీరం, ఉత్తమానాం, స్మితం, భవేత్ = కొంచెంగా వికసించిన చెక్కిళ్ళు, సౌష్ఠవంతో కూడిన కటాక్షాలు, కనిపించని పలువరుస, గంభీరంగా (కనిపించే ముఖం)- వీనితో కూడినది, ఉత్తముల యొక్క, స్మితం అవుతుంది.

(అథ)వికసితైఃగండైః, ఉత్ఫుల్ల-ఆనన-నేత్రం(తు), కించిత్-లక్షితదంతం(చ), తత్, హసితం, విధీయతే = వికసించిన చెక్కిళ్ళతో, విప్పారిన ముఖ-నేత్రాలు, కొంచెం కనిపించే పలువరుస కల దానిని హసితం అంటారు.

తాత్పర్యం : స్మితం— చెక్కిళ్ళు కొంచెంగా వికసిస్తాయి, కడకంటి చూపులు సౌష్ఠవయుతంగా ఉంటాయి. పలువరుస కనిపించకుండా, ముఖం గంభీరంగా ఉంటుంది. ఇటువంటి నవ్వు 'స్మితం' అనబడుతుంది. (కటాక్షాలలోనే నవ్వు స్పష్టమవుతుందని భ.ర.ప్ర.కర్త).

హసితం : చెక్కిళ్ళు వికసిస్తాయి, కనులు ముఖం బాగా విప్పారుతాయి. పలువరున కొంచెం కనిపిస్తుంది-ఇటువంటి నవ్వు 'హసితం' అవుతుంది.

(2) మధ్యమ ప్రకృతులయందు హాస్యం :

మూలం : ఆకుంచితాక్షిగండం యత్ సస్వనం మధురం తథా ।
కాలగతం సాస్యరాగం తద్వై విహసితం భవేత్ ॥
ఉత్ఫుల్లనాసికం యత్తు జిహ్మదృష్టి నిరీక్షితమ్ ।
నికుంచితాంసక శిరః తచ్చోపహసితం భవేత్ ॥

-(నా.శా.VI-56-57)

అర్థం : యత్, ఆకుంచిత గండ-అక్షం, (తథా) మధురం సస్వనం కాలగతం, స-ఆస్యరాగం, తత్(వై), విహసితం భవేత్ = ఏది-కొంచెంగా ముడుచుకొన్న గండాలు కనులు కలిగి, మధురంగా సస్వనంగా ఉండేది, సమయానుకూలంగా ఉండేది, ముఖం కొంచెంగా ఎఱ్ఱబడినది-అవుతుందో అది, విహసితం అవుతుంది.

యత్(తు), ఉత్ఫుల్ల నాసికం, జిహ్మదృష్టి నిరీక్షితం, నికుంచిత-అంసక శిరః, తత్ (చ), ఉపహసితం, భవేత్ = ఏది, విప్ఫారిన ముక్కుపుటాలు, వక్రంగా ఉన్న చూపులు, ముడుచుకొన్న అంసశిరములు (= మూపులు) (కలిగి ఉంటుందో), అది ఉపహసితం అవుతుంది.

తాత్పర్యం : విహసితం— కనులు చెక్కిళ్ళు కొంచెంగా ముడుచుకొని ఉంటాయి. ముఖం కొంచెం ఎరుపు ఎక్కుతుంది. సమయానుకూలంగా, మధురంగా, సస్వనంగా ఉంటుంది - ఇట్టిది 'విహసితం' అవుతుంది.

ఉపహసితం : ముక్కుపుటాలు విప్ఫారుతాయి. చూపులు వక్రంగా ఉంటాయి. అంసశిరములు ముడుచుకొంటాయి. - ఇట్టిది 'ఉపహసితం' అవుతుంది.

(3) అధమ ప్రకృతులయందలి హాస్యం :

మూలం : అస్థానహసితం యత్తు సాశ్రునేత్రం తథైవ చ ।
ఉత్కంపితాంసకశిర స్తచ్చాపహసితం భవేత్ ॥
సంరబ్ధ సాశ్రునేత్రం చ విక్రుష్టస్వర ముద్ధతమ్ ।
కరోపగూఢపార్శ్వం చ తచ్చాతిహసితం భవేత్ ॥
-(నా.శా.VI-58-59)

అర్థం : (యత్ తు) అస్థానహసితం, (తథా-ఏవచ) స-అశ్రునేత్రం, ఉత్కంపిత-అంసకశిరః, తత్(చ) అపహసితం, భవేత్ = (ఏది) అస్థానమందు (= శోకాది సమయాలలో కూడా) హసించటం, అశ్రువులతో కూడిన కనులు, పైకి ఎగురుతున్న అంసశిరములు (కలది అవుతుందో అది) అపహసితం అవుతుంది.

(యత్) సంరబ్ధ-స-అశ్రునేత్రం(చ), విక్రుష్టస్వరం, ఉద్ధతం, కర-ఉపగూఢ పార్శ్వం (చ), తత్ ( చ), అతిహసితం, భవేత్ = (ఏది)- తొట్రుపాటుతో అశ్రువులతో కూడిన కనులు, శ్రుతికటువుగా ఉద్ధతంగా ఉన్న స్వరం, చేతులతో పట్టుకోబడిన ప్రక్కలు (కలది అవుతుందో అది) అతిహసితం అవుతుంది.

తాత్పర్యం : అపహసితం : అస్థానమందు నవ్వటం, కన్నులనుండి నీరు కారటం, అంసశిరములు పైకి ఎగురుతూ ఉండటం— ఇట్టిది 'అపహసితం' అవుతుంది.

అతిహసితం : కనులు తొట్రుపాటుతో, అశ్రువులతో ఉంటాయి. స్వరం శ్రుతికటువుగా ఉద్ధతంగా ఉంటుంది. నవ్వేటప్పుడు పార్శ్వాలను చేతులతో పట్టుకోవలసి వస్తుంది. ఇట్టిది 'అతిహసితం' అవుతుంది.

మూలం : హాస్యస్థానాని యాని స్యుః కార్యోత్పన్నాని నాటకే ।
ఉత్తమాధమ మధ్యానామేవం తాని ప్రయోజయేత్ ॥
ఇత్యేష స్వసముత్థ స్తథా పరసముత్థశ్చ విజ్ఞేయః ।
ద్వివిధస్త్రిప్రకృతిగత స్త్ర్యవస్థ భావో రసో హాస్యః ॥
-(నా.శా.VI-60-61)

అర్థం : నాటకే, కార్య-ఉత్పన్నాని, యాని హాస్యస్థాని, స్యుః, తాని, ఉత్తమ-అధమ-మధ్యానాం, ఏవం ప్రయోజయేత్ = నాటకమందు, ఆయా కార్యాల వల్ల జనించిన, ఆయా హాస్యస్థానాలలో, ఉత్తమ-అధమ-మధ్య ప్రకృతులందు ఈవిధంగా (= యథోచితంగా = ఇంతకుముందు చెప్పిన విధంగా) ప్రయోగించాలి.

ఏష, స్వసముత్థః, (తథా) పరసముత్థః(చ), ఇతి, విజ్ఞేయః = ఇది (= ఈ హాస్యం), స్వసముత్థం, పరసముత్థం, అని తెలియవలెను.

హాస్యః, రసః, ద్వివిధః, త్రిప్రకృతిగతః, త్ర్యవస్థ భావః = (ఈ) హాస్య రసం (ద్వైవిధంగా) రెండు విధాలు, త్రిప్రకృతిగతమై మూడు అవస్థలు (కలిగి ఉంటుంది).

తాత్పర్యం : ఇంతవరకు వివరించిన విధంగా ఈ ఆరుభేదాలను నాటకంలో, ఆయాకార్యాల వల్ల జనించిన ఆయా హాస్యస్థానాలలో ఉత్తమ-మధ్యమ-అధమ ప్రకృతులు ప్రయోగించాలి. ఆత్మ(=స్వ) సముత్థ-పరసముత్థ భేదాలచేత రెండు విధాలైన హాస్యం ప్రకృతిత్రయ గతమై మూడు అవస్థలను కలిగి ఉంటుంది.

టీక : ప్రకృతిత్రయం వల్ల ఆత్మసముత్థం మూడు విధాలు, పరసముత్థం మూడు విధాలు- మొత్తం ఆరు విధాలు అవుతాయి.

## హాస్యరసాభాసం :

అనౌచిత్య ప్రవృత్తి ఎక్కడ ఉంటే అక్కడ అది అంతా హాస్యానికే దారితీస్తుందని ఆలంకారికమతం. అయితే ఇంక హాస్యంలో కూడా ఆభాసత్వం

ఏమిటి? అని ఆశంక కలుగవచ్చు. హాస్యంలో కూడా అనౌచిత్యం దొరలటానికి అవకాశం ఉంది. అవహసింపదగని గురువులు, పెద్దలు, దేవతలు మున్నగువారిని ఆలంబనంగా చేసుకొని ప్రవృత్తమైన హాస్యం, హాస్యాభాసం అవుతుంది.

ఉదా : (1) ఉత్తర రామచరితలో (4 వ అంకం-మిశ్రవిష్కంభం)

సౌధాతకి : ఓ భాండాయన! ముసలివాళ్ళను వెంటబెట్టుకొని వచ్చిన నారచీరధారి పేరేమిటి?

భాండాయనుడు : నీ ఎగతాళి చాలించు. ఈయన అరుంధతీపురస్కృతుడై, దశరథమహారాజు భార్యలను వెంటబెట్టుకొని వచ్చిన మహనీయుడు వశిష్ఠభగవానుడు.

సౌధాతకి : ఊఁ! వశిష్ఠుడా!

భాండా : అవును.

సౌధాతకి : నేననుకొన్నాను పులో, తోడేలో అని

భాండా : ఆ! ఆ! ఏమన్నావు?

సౌధాతకి : ఆయనగారు వచ్చీరాకముందే, పాపం, కల్యాణి అనే ఆ కపిలగోవత్సాన్ని మడమడ నవిలి గుటకాయస్వాహాచేశాడే!

విస్మయ-హర్షాదులందు మధ్యమ-అధమ ప్రకృతుల గతి విక్షిప్తపద విన్యాసంతో ఉండాలి. హాస్యాభినయంలో కూడా ఇటువంటి గతినే లేదా ఇటువంటివే అయిన ఇతరగతులను ప్రయోగించాలి. విక్షిప్త పదవిన్యాసం అంటే వ్యాకులపాటుతో ఇటునటు లఘు-ద్రుత బహుళంగా తిరగటం. హాస్యాభినయంలో ఉత్తములగతి స్వస్థం, అవహసిత-అతిహసితములందు మధ్యములగతి విక్షిప్తపదవిన్యాసం కావాలి. అధమప్రకృతులైన విదూషకాదుల గతులు వేరుగా వర్ణింపబడినవి.

## 3. కరుణం

మూలం : కరుణోనామ శోకస్థాయి భావప్రభవః. స చ
శాప క్లేశ వినిపతి తేష్టజన విప్రయోగ విభవ
నాశ వధ బంధ విద్రవోపఘాత వ్యసనసంయో
గాదిభిః విభావైః సముపజాయతే. తస్యాశ్రుపాత
పరిదేవన ముఖశోషణ వైవర్ణ్య స్రస్తగాత్రతా
నిఃశ్వాస స్మృతిలోపాదిభిః అనుభావైః అభి

నయః ప్రయోక్తవ్యః. వ్యభిచారిణ శ్చాస్య
నిర్వేద గ్లాని చింతౌత్సుక్యావేగ భ్రమ మోహ
శ్రమ భయ విషాద దైన్య వ్యాధి జడతోన్మా
దాపస్మార త్రాసాలస్య మరణ స్తంభ వేపథు వైవ
ర్ణ్యాస్రు స్వరభేదాదయః.
అత్రార్యేభవతః—
ఇష్టవధదర్శనాద్వా విప్రియవచనస్య సంశ్రవాద్వాపి ।
ఏభి ర్భావవిశేషైః కరుణరసోనామ సంభవతి ॥ 62
సస్వనరుదితై ర్మోహాగమైశ్చ పరిదేవితై ర్విలపితైశ్చ ।
అభినేయః కరుణరసో దేహాయాసాభిఘాతైశ్చ ॥ 63
రౌద్రస్యైవచ యత్కార్మ స జ్ఞేయః కరుణోరసః ॥ 40
కపోతః కరుణశ్చైవ – 42
కరుణో యమదైవతః– 44
ధర్మోపఘాతజశ్చైవ తథార్థోపచయోద్భవః ।
తథా శోకకృత శ్చైవ కరుణ స్త్రివిధః స్మృతః। 78
-(నా.శా.VI)

నిర్వేదశ్చైవ చింతా చ దైన్యం గ్లాన్యస్ర మేవచ ।
జడతా మరణం చైవ వ్యాధిశ్చ కరుణే స్మృతాః ॥
-(నా.శా.VII-111)

అర్థం : కరుణఃనామ, శోకస్థాయి భావ ప్రభవః =కరుణ(రస)ం, అనేది, శోకం అనే స్థాయిభావం నుంచి, జనించేది; సః(చ), శాప, క్లేశ, వినిప తిత-ఇష్టజన విప్రయోగ, విభవనాశ, వధ, బంధ, విద్రవ, ఉపఘాత, వ్యసన సంయోగ-ఆది, విభావైః, సముపజాయతే=అది (=కరుణరసం), శాపం, క్లేశం, దుర్గతి, ఇష్టజనవియోగం, విభవనాశం, వధ, (కారాగార) బంధనం, దేశబహిష్కారం, అగ్నిమున్నగు ప్రమాదాలు, ఆపదలు కలుగటం మున్నగు, విభావాల వల్ల ఉత్పన్నమవుతుంది.

అశ్రుపాత, పరిదేవన, ముఖశోషణ, వైవర్ణ్య, స్రస్తగాత్రతా, నిఃశ్వాస, స్మృతిలోప-ఆదిభిః, అనుభావైః, తస్య, అభినయః, ప్రయోక్తవ్యః =కన్నీళ్ళు కారటం, పరిదేవనం (=తనను లేదా దైవాన్ని లేదా ఇతరులను ఉపాలం భించటం), నోరెండిపోవటం, వైవర్ణ్యం, అంగాలు వ్రేలాడటం, నిఃశ్వాసాలు

అధికంకావటం, మరవు (=స్తంభ-ప్రలయాలు సూచితం) మున్నగు, అను భావాలచేత, దాని (=కరుణరసం) యొక్క, అభినయం, చేయాలి.

అస్య, వ్యభిచారిణః, నిర్వేద-గ్లాని, చింతా, ఔత్సుక్య, ఆవేగ, భ్రమ, మోహ, శ్రమ, భయ, విషాద, దైన్య, వ్యాధి, జడతా, ఉన్మాద, అపస్మార, త్రాస, ఆలస్య, మరణ, స్తంభ, వేపథు, వైవర్ణ్య, అశ్రు, స్వరభేదాదయః =దాని(=కరుణరసం) యొక్క, వ్యభిచారిభావాలు– నిర్వేదం, గ్లాని, చింత, ఔత్సుక్యం, ఆవేగం, భ్రమ, మోహం, శ్రమ, భయం, విషాదం, దైన్యం, వ్యాధి, జడత, ఉన్మాదం, అపస్మారం, త్రాసం, ఆలస్యం, మరణం (ఇంత వరకు ఇవి వ్యభిచారి భావాలు), స్తంభం, వేపథువు, వైవర్ణ్యం, అశ్రువు, స్వరభేదం (ఇవి సాత్త్వికభావాలు) మున్నగునవి.

అత్ర-ఆర్యే, భవతః=ఈ అంశాలను వివరించే రెండు ఆర్యలు ఉన్నవి :

ఇష్టవధదర్శనాత్, వా, విప్రియవచనస్య, సంశ్రవాత్ (వా-అపి), ఏభిః, భావవిశేషైః, కరుణరసఃనామ సంభవతి=ఇష్టజనుల వధను చూడటంచేత, లేదా, అనిష్టములైన మాటలను వినటంవల్ల, (ఇంకా) ఇటువంటి, భావ విశేషాలవల్ల, కరుణరసం అనేది సంభవిస్తుంది.

సస్వనరుదితైః, మోహ-ఆగమైః(చ), పరిదేవితైః, విలపితైః(చ), దేహ-ఆయాస-అభిఘాతైః(చ), కరుణరసః, అభినేయః=సస్వనంగారోదించటం, మోహంచెందటం, పరిదేవనంచేయటం, విలపించటం, ఆయాసపడటం, గుండెలు బాదుకొనటం- వీటిచేత కరుణరసం అభినయింపబడాలి.

రౌద్రస్య-(ఏవచ), యత్-కర్మ, సః, కరుణః రసః, జ్ఞేయః=రౌద్రరసం యొక్క, కర్మ ఏదో, అది, కరుణరసం (అని), తెలియాలి.

కరుణః(చ-ఏవ), కపోతః=కరుణరసంయొక్క రంగు కపోతవర్ణం.

కరుణః-యమదైవతః=కరుణరసం, యముడు అధిదేవతగా కలది.

కరుణః-త్రివిధః, స్మృతః– ధర్మ-ఉపఘాతజః(చ-ఏవ), (తథా) అర్థ-ఉపచయ-ఉద్భవః, (తథా) శోకకృతః (చ-ఏవ)=కరుణరసం, మూడు విధాలు (అని) చెప్పబడినది– ధర్మోపఘాతజం (=ధర్మనాశం చేత జనించేది), అర్థోపచయోద్భవం (=అర్థనాశంచేత జనించేది), శోకకృతః (=శోకం చేత కలిగేది).

తాత్పర్యం : కరుణరసం శోకం అనే స్థాయిభావంనుంచి పుట్టుతుంది.

విభావాలు : శాపం, క్లేశం, దుర్గతి, ఇష్టజనవియోగం, విభావనాశం, వధ, బంధనం, దేశబహిష్కారం, అగ్ని మున్నగునవి.

అనుభావాలు (చేష్టలు) : కన్నీళ్ళుకార్చటం, పరిదేవనం, నోరెండి పోవటం, వైవర్ణ్యం, అంగాలు వ్రేలాడటం, నిఃశ్వాసాలు అధికంకావటం, మరపు మున్నగునవి.

వ్యభిచారి భావాలు : నిర్వేదం, గ్లాని, చింత, ఔత్సుక్యం, ఆవేగం, భ్రమ, మోహం, శ్రమ, భయం, విషాదం, దైన్యం, వ్యాధి, జడత, ఉన్మాదం, అపస్మారం, త్రాసం, ఆలస్యం, మరణం; స్తంభం, వేపథువు, వైవర్ణ్యం, అశ్రువు, స్వరభేదం మున్నగునవి. ఈ అంశాలను వివరించే రెండు ఆర్యలు ఉన్నవి. ఇష్ట జనులవధను చూడటంచేత, అనిష్టములైన మాటలను వినటంవల్ల, ఇంకా ఇటువంటి భావవిశేషాలవల్ల కరుణరసం ఉత్పన్నమవు తుంది.

సస్వనంగా రోదించటం, మోహంచెందటం, పరిదేవనం, విలపించటం, ఆయాసపడటం, గుండెలు బాదుకొనటం— వీటిచేత కరుణరసాన్ని అభిన యించాలి. రౌద్రరస కర్మయొక్క ఫలం కరుణము.

కరుణరసం రంగు కపోతవర్ణం.

కరుణమునకు యముడు అధిదేవత.

కరుణరసం మూడువిధాలు : ధర్మోపఘాతజం, అర్థ-ఉపచయోద్భవం, శోకకృతం.

టీక : 1. భరతరసప్రకరణకర్త కరుణరసాన్ని క్రింది విధంగా వివరించి నాడు :

విభావ-అనుభావ-సాత్త్విక-వ్యభిచారిభావములచేత సదస్యులకు ఆస్వాద యోగ్యత పొందించిన శోకం 'కరుణరసం' అనబడుతుంది.

కరుణరసంలో—

ఆలంబన విభావాలు : ధర్మనాశం, అర్థనాశం, ఇష్టజన-బాంధవనాశం, వధ, ఉరిదీయటం, దారిద్ర్యం, పదభ్రంశం, అవమానం, దైవోపహతి, ధిక్కారం, వ్యాధి, శాపం— మున్నగునవానిని గూర్చి వినటం లేదా వానిని చూడటం లేదా అనుభవించటం.

ఉద్దీపన విభావాలు : కేశ-వస్త్ర-అంగసంస్కారాలు లేకపోవటం, దేహావయవాలు వదులుగా ఉండటం, ముఖకాంతి ఎఱ్ఱబడటం, దృష్టి బాష్పాలచేత మందగించటం.

అనుభావాలు : భూపతనం, ముఖవైవర్ణ్యం, బాహుపాతం, వికత్థనం, తలమీద చేతులు పెట్టుకొనటం, ఉచ్ఛ్వాస-నిఃశ్వాసాలు దీర్ఘంకావటం, రొమ్ము-శిరస్సు-ముఖం బాదుకొనటం, భూమిమీద పొర్లటం, హాహాకారం, ఆక్రందనం, విలాపం, పరిదేవనం.

సాత్త్వికభావాలు : స్తంభాది ఎనిమిది భావాలు.

వ్యభిచారిభావాలు : నిర్వేదం, దైన్యం, ఆలస్యం, ఉన్మాదం, వ్యాధి, సుప్తం, నిద్ర, మోహం, శ్రమ, గ్లాని, చింత, స్మృతి, అపస్మారం, విషాదం, జాడ్యం, ఔత్సుక్యం, శంక, మరణం.

ఇవి భరతముని సమ్మతములైన భావాలు; వీటిని ఉత్తమ-మధ్యమ-అధమ ప్రకృతులయందు యథోచితంగా ప్రయోగించాలి.

2. ఇష్టనాశనంవల్లనేకాక, అనిష్టప్రాప్తివల్ల కూడా శోకం సంభవిస్తుంది.

3. శారదాతనయుని వివరణ క్రిందివిధంగా ఉన్నది:

స్త్రీ-నీచాదులలో శోకం మరణప్రయత్నానికి దారితీస్తుంది. శోకంవల్ల మధ్యమ ప్రకృతులకు చనిపోవాలనే కోరిక కలుగుతుంది. ఉత్తముల శోకం ప్రౌఢమై, వివేకంవల్ల శమిస్తుంది. కరుణం మానసికం, వాచికం అని రెండు విధాలు. కేశ-వస్త్ర-అంగసంస్కారాదులలో ఉపేక్ష, నిత్యందైన్యం, అనుభవించిన వాని జ్ఞానంలేకపోవటం, చిత్తం అనవస్థితంగా ఉండటం, సర్వవిషయములందు విరక్తి, స్నిగ్ధులవిషయంలో కూడా సంబంధంలేనట్లుగా ఉండటం, ఆకాశవీక్షణం— ఇది అంతా మానసిక కరుణం.

హాహాకారం, రోదనం, ఆక్రోశం, ప్రలాపం, దీర్ఘభాషణం, దూరాహ్వానం, ఆక్రందనం— ఇదంతా వాచికకరుణం.

గుణకథనంతో కూడిన రోదనం విలాపం. గద్గద కంఠంతో గుణాఖ్యానంతో కూడిన రోదనం పరిదేవితం. బిగ్గరగా ఏడ్వటం ఆక్రందనం; ఇది శోకాతిశయం వల్ల సంభావ్యం. నికృష్టులందు విలాపం, మధ్యములందు పరిదేవితం ఉంటాయి. రుదితం మూడు విధాలు— ఈర్ష్యాజన్యం, ఆనందజన్యం, ఆర్తిజన్యం.

ఈర్ష్యాజన్యరోదనంలో—ఓష్ఠచలనం, నిఃశ్వాసం, శిరఃకంపం, వేపథువు, భ్రుకుటీకుటిలమైన విలోకనం ఉంటాయి.

ఆనందరోదనంలో– కపోలాలవికాసం, చల్లని బాష్పాలు, రోమాంచం, నిర్భ రత, గద్గదస్వనం ఉంటాయి. ఆర్తిజన్యరోదనంలో– ప్రలాపం, భూమిపతనం, మందంగా బాష్పధారలు, హాహాకారం ఉంటాయి.

సామాన్యంగా స్త్రీలకు రోదనం అధికం.

ఒకచో నీచులందునురోదనం ఉంటుంది.

ఉదా: ఇష్టజనవియోగం, దైవదూషణ :

విపినే క్వ జటానిబంధనం
తవచేదం క్వ మనోహరం వపుః ।
అనయోర్ఘటనా విధేః స్ఫుటం
ననుఖడ్గేన శిరీషకర్తనం ॥

-(విశ్వనాథుని రాఘవవిలాసం)

– అడవిలో జడలుతాల్చటం ఎక్కడ? ఈ నీ మనోహరమైన శరీరం ఎక్కడ? విధి, దీనిని సంగతపర్చటం, కత్తితో శిరీషపుష్పాన్ని ఖండించటంవంటిదే (ఇవి దశరథుని మాటలు).

4. కరుణమందు స్వనిష్ఠ-పరనిష్ఠ భేదాలను చెప్పినాడు రసతరంగిణీకర్త :

వ్యశాప-బంధన-క్లేశ-అనిష్టాలు స్వనిష్ఠ కరుణమందలి విభావాలు. పర-ఇష్టనాశ-శాప-బంధన క్లేశాదుల దర్శన స్మరణములు పరనిష్ఠ కరుణమందలి విభావాలు.

5. కరుణరసమందలి గతులు:

కరుణరసమందలి గతి విలంబితలయాన్వితమై ఉంటుంది. ఇందులో అప్రియం క్రొత్తదైనప్పుడు కన్నులనీరు నింపుతూ, స్రస్తగాత్రంతో, చేతులను పైకెత్తి పడవేస్తూ (బారలు సాచుచు), ఎలుగెత్తి ఏడుస్తూ, అధ్యర్ధికాచారితో పరిక్రమించాలి. ఇది స్త్రీ-నీచ ప్రకృతులకు సంబంధించినగతి. ఇంక ఉత్తములు దీర్ఘనిఃశ్వాసాలతో, మిన్నుచూస్తూ కన్నీళ్ళతో, ధైర్యోపేతంగా నడవాలి. వీరి గతికి నిర్దిష్ట ప్రమాణంకాని, సౌష్ఠవంకాని ఆవశ్యకాలుకావు. మధ్యమప్రకృతుల గతిని వారి వారి స్వభావాలకు అనుగుణంగా ప్రయోగించాలి. ఇష్టబంధుమరణ విష యంలో ఉత్సాహం కోల్పోయి, గుండెలు బాదుకొంటూ శోకంతో జడత్వంపొంది, కొద్దిగా ఎత్తివేయబడుతున్న పాదాలతో పరిక్రమించాలి. గాఢప్రహారాభినయమందు శిథిలాంగాలతో, ఒడలు తిరుగుతుండగా, బరువుగా అడుగులువేస్తూ, ఇతరుల

భుజాలను అనుకొని నడవాలి. చలిచేత అవయవాలను ముడుచుకొని, వణకుతూ రెండు చేతులను గుండెలమీద ఉంచుకొని, పొట్టిగా అగునట్లువంగి, పళ్ళు, పెదిమలు అదరుతూ ఉండగా చిబుకాన్ని మెల్లగా ఆడించాలి (నా.శా.XII-60-64).

కరుణరసాభాసం.

ధీరోద్ధతుడు, తనచేత చంపబడిన శత్రువును గూర్చిచేసే రోదనం కరుణ రసాభాసం అవుతుంది.

## 4. రౌద్రం

మూలం : రౌద్రోనామ క్రోధస్థాయి భావాత్మకో రక్షోదాన
వోద్ధతమనుష్య ప్రకృతిః సంగ్రామహేతుకః. సచ
క్రోధాధర్షణ ణాధిక్షే పానృతవచ నోపఘాత
వాక్పారు ష్యాభిద్రోహ మాత్సర్యాదిభిః విభావైః
ఉత్పద్యతే. తస్యచ తాడన పాటన పీడన
చ్ఛేదన భేదన ప్రహరణాహరణ శస్త్రసంపాత
సంప్రహార రుధిరాకర్ష ణాద్యాని కర్మాణి. పునశ్చ
రక్తనయన స్వేద భ్రుకుటీకరణ దంతోష్ఠపీడన
గండస్ఫురణ హస్తాగ్రనిష్పేషాదిభిః అనుభావైః
అభినయః ప్రయోక్తవ్యః.
భావా శ్చాస్యాసమ్మోహోత్సాహావేగామర్ష
చపలతౌగ్ర్య గర్వ స్వేద, వేపథు రోమాంచ
గద్గదాదయః.
అత్రాహ-యదభిహితం రక్షోదానవాదీనాం
రౌద్రో రసః; కిమన్యేషాంనాస్తి? ఉచ్యతే-
అస్త్యన్యేషామపి రౌద్రో రసః. కిం త్వధి
కారోఽత్ర గృహ్యతే. తేహి స్వభావతః
ఏవ రౌద్రాః. కస్మాత్? బహుబాహవో
బహుముఖాః ప్రోద్ధూత వికీర్ణపింగల
శిరోజాః రక్తోద్వృత్త విలోచనా భీమాసిత
రూపిణశ్చైవ. యచ్చ కించిత్ సమారభతే
స్వభావచేష్టితం వాగంగాదికం తత్సర్వం రౌద్ర
మేవైషామ్. శృంగారశ్చ తైః ప్రాయశః ప్రసభం

పేవ్యతే. తేషాం చానుకారిణో యేపురుషా స్తేషా
మపి సంగ్రామ సంప్రహారకృతో రౌద్రో రసోఽనుమంతవ్యః.
అత్రానువంశ్యే ఆర్యేభవతః—
యుద్ధప్రహార ఘాతన వికృతచ్ఛేదన విదారణై శ్చైవ ।
సంగ్రామ సంభ్రమాద్యై రేభిః సంజాయతే రౌద్రః ॥ 64
నానాప్రహరణమోక్షైః శిరః కబంధ భుజకర్తనై శ్చైవ ।
ఏభి శ్చార్థ విశేషై రస్యాభినయః ప్రయోక్తవ్యః ॥ 65
ఇతి రౌద్రరసో దృష్టో రౌద్రవాగంగ చేష్టితః ।
శస్త్ర ప్రహారభూయిష్ఠ ఉగ్రకర్మ క్రియాత్మకః ॥ 66
రౌద్రాచ్చ కరుణోరసః— 40
రక్తో రౌద్రః ప్రకీర్తితః— 42
రౌద్రో రుద్రాధి దైవత్యః— 44
అంగనైపథ్యవాక్యైశ్చ-రౌద్రః త్రిధాప్స్మృతః ॥ 77

-(నా.శా.VI)

గర్వోఽసూయా మదోత్సాహా వేగోఽమర్ష ఏవచ ।
క్రోధ శ్చపల తౌగ్ర్యంచ విజ్ఞేయా రౌద్ర సంభవాః ॥

-(నా.శా.VII-112)

అర్థం : రౌద్రఃనామ, క్రోధస్థాయి భావాత్మకః, రక్షోదానవ, ఉద్ధత మనుష్య ప్రకృతిః, సంగ్రామ హేతుకః =రౌద్రం అనేది, క్రోధం స్థాయి భావంగా కలది, రాక్షసులు-దానవులు-ఉద్ధత మనుష్యులు ప్రకృతులుగా కలది, సంగ్రామం కారణంగా కలిగేది.

సః(చ), క్రోధ-ఆధర్షణ-అధిక్షేప-అనృతవచన-ఉపఘాత, వాక్పారుష్య-అభిద్రోహ, మాత్సర్య- ఆదిభిః, విభావైః, ఉత్పద్యతే=అది (=రౌద్రం), క్రోధం, ఆధర్షణం (=ఇతరుల భార్యలను చెరటం), అధిక్షేపం (=దేవ-జాతి-అభిజన-విద్యా-కర్మలను నిందించటం), అసత్యవచనం, ఉపఘాతం (=పనివారలను బాధించటం), వాక్పారుష్యం (=కొడతాను, చంపుతాను అని బెదరించటం), అభిద్రోహం (=హత్యాప్రయత్నం చేయటం), అసూయ మున్నగు విభావాలచేత, ఉత్పన్నమవుతుంది.

తాడన, పాటన, పీడన, ఛేదన, భేదన, ప్రహరణ-ఆహరణ, శస్త్ర సంపాత, సంప్రహార, రుధిర-ఆకర్షణ-ఆద్యాని, తస్య(చ), కర్మాణి=కొట్టటం,

విరవటం, మర్దించటం, నరకటం, ముక్కలుచేయటం, ఆయుధంగ్రహించటం, శస్త్రం ప్రయోగించటం, గాఢంగా తగిలేటట్లు వేయటం, రక్తం స్రవింప జేయటం మున్నగునవి, దీనియొక్క, కర్మలు.

(పునఃచ), రక్తనయన, స్వేద, భ్రుకుటీకరణ, దంత-ఓష్ఠపీడన, గండస్ఫురణ, హస్తాగ్రనిష్పేష- ఆదిభిః, అనుభావైః, అభినయః, ప్రయోక్తవ్యః=(మరల), ఎఱ్ఱనికనులు, చెమటపట్టటం, బొమముడివేయటం, పండ్లు కొరకటం, ఔడుకరవటం, చెక్కిళ్ళు అదరటం, అరచేతులను ఒండొంటితో రాయటం మున్నగు అనుభావాలచేత, రౌద్రరసంయొక్క అభినయం, చేయాలి.

అస్య, భావాః(చ)-సమ్మోహ, ఉత్సాహ, ఆవేగ, అమర్ష, చపలత-ఔగ్ర్య, గర్వ, స్వేద, వేపథు, రోమాంచ, గద్గద-ఆదయః=రౌద్రంయొక్క, భావాలు-సమ్మోహం, ఉత్సాహం, ఆవేగం, అమర్షం, చపలత, ఉగ్రత, గర్వం, స్వేదం, వేపథువు, రోమాంచం, గద్గదత మున్నగునవి.

అత్ర-ఆహ=ఇక్కడ (ఋషులు) ప్రశ్నించారు. రౌద్రః రసః, రక్షోదానవాదీనాం, యత్, అభిమతం, అన్యేషాం, న-అస్తి-కిం?=రౌద్రరసం, రక్షోదానవాదులందు ఉంటుంది (అని), ఏది, చెప్పబడిందో, (అది), ఇతరులయందు, ఉండదా? ఉచ్యతే=(సమాధానం) చెప్పబడుతున్నది. అన్యేషాం-అపి, రౌద్రః రసః, అస్తి=ఇతరులయందుకూడా, రౌద్రరసం, ఉంటుంది; కింతు, అధికారః, అత్ర, గృహ్యతే=అయినప్పటికీ, అధికారులు (మాత్రమే), ఇచ్చట, గ్రహింపబడినారు; తే(హి), స్వభావతః-ఏవ, రౌద్రాః=వారు (=రక్షోదానవాదులు), స్వభావంచేతనే, రౌద్రమూర్తులు.

కస్మాత్=ఎందుచేత? (అని ఋషులు ప్రశ్నించినారు). (సమాధానం) - బహుబాహవః, బహుముఖాః, ప్రోద్ధూత-వికీర్ణ-పింగల శిరోజాః, రక్త-ఉద్వృత్త విలోచనాః, భీమ-అసిత రూపిణః (చ)-ఏవ=(రక్షోదానవాదులు) అనేక బాహువులు, అనేక ముఖాలు, చింపిరిగా ఉన్న పింగల శిరోజాలు, ఎఱ్ఱని మిడిగ్రుడ్లు, భయంకరములైన నల్లని రూపాలు కలిగి ఉంటారు.

ఏషాం స్వభావచేష్టితం, యత్-కించిత్, సమారభతే, వాక్-అంగాదికం, తత్-సర్వం, రౌద్రం-ఏవ=వారియొక్క సహజములైన వాచిక-ఆంగిక చేష్టలు అన్నీ, ఏ కొంచెంగా ఆరంభింపబడినప్పటికీ, రౌద్ర భూయిష్ఠాలుగానే ఉంటాయి.

తైః, శృంగారః(చ), ప్రాయశః, ప్రసభం, సేవ్యతే=వారిచేత, శృంగారం (కూడా), ప్రాయికంగా, క్రూరాకారంగానే, సేవింపబడుతుంది. తేషాం(చ), అనుకారిణః, యేపురుషాః, తే,-అపి, సంగ్రామ, సంప్రహారకృతః, రౌద్రరసః, అనుమంతవ్యః=వారిని, అనుకరించే, ఏ పురుషులు ఉంటారో, వారియందు కూడా, సంగ్రామ-సంప్రహారకృతమైన, రౌద్రరసం (ఉంటుందని) తెలుసు కోవాలి.

అత్ర అనువంశ్యే, ఆర్యాః, భవతః=ఇచ్చట, అనువంశ్యములైన ఆర్యలు కలవు. యుద్ధప్రహార, ఘాతన, వికృతచ్ఛేదన-విదారణైః (చ-ఏవ) సంగ్రామ సంభ్రమ-ఆద్యైః, ఏభిః, రౌద్రః, సంజాయతే=యుద్ధమందలి కొట్టుకొనటం, నరకటం, వికృతంగా ఛేదించటం, చీల్చటం, యుద్ధమునందలి తొట్రుపాటు మున్నగు, వానివల్ల, రౌద్రం, జనిస్తుంది.

నానాప్రహరణమోక్షైః, శిరః-కబంధ-భుజకర్తనైః (చ-ఏవ), ఏభిశ్చార్థ విశేషైః, అస్య, అభినయః, ప్రయోక్తవ్యః=వివిధములైన ప్రహరణాలను ప్రయోగించటం, శిరం మొండెం భుజాలు- వీటిని తెగనరకటం మున్నగు అర్థ విశేషాల చేత, రౌద్రంయొక్క, అభినయం, చేయాలి.

రౌద్రవాక్-అంగ-చేష్టితః, శస్త్రప్రహారభూయిష్ఠః, ఉగ్రకర్మ క్రియాత్మకః ఇతి, రౌద్రరసః, దృష్టః = రౌద్రములైన వాక్కులు అంగాలు చేష్టలు, అధి కంగా శస్త్రప్రహారాలు, ఉగ్రకర్మలు- వీటితో కూడినది, రౌద్రరసం, అని, గుర్తింపబడినది. రౌద్రాత్ (చ), కరుణఃరసః = రౌద్రకర్మఫలమే కరుణరసం.

రౌద్రః, రక్తః ప్రకీర్తితః = రౌద్రరసం, రక్తవర్ణం (కలది); రౌద్రః, రుద్ర-అధిదైవత్యః = రౌద్రరసం, రుద్రుడు, అధిదేవతగా కలది.

అంగ-నైపథ్యవాక్యైః (చ)-రౌద్రఃత్రిధాస్మృతః = ఆంగికం, నైపథ్యం, వాచికం-వీనిచేత, రౌద్రం, మూడు విధాలు.

గర్వః, అసూయా, మద, ఉత్సాహ, ఆవేగః అమర్షః (ఏవ-చ), క్రోధః, చపలత, ఔగ్ర్యం (చ), రౌద్రసంభవాః, విజ్ఞేయా = గర్వం, అసూయ, మదం, ఉత్సాహం, ఆవేగం, అమర్షం, క్రోధం, చపలత, ఔగ్ర్యం - ఇవి రౌద్రరస సంభవాలు (అని) తెలియవలెను.

తాత్పర్యం : రౌద్రరసానికి క్రోధం స్థాయిభావం. రాక్షసులు, దానవులు, ఉద్ధత ప్రవృత్తిగల మానవులు - వీరివల్లనూ, సంగ్రామకారణంగానూ రౌద్రం ఉత్పన్నమవుతుంది.

విభావాలు : క్రోధం, ఆధర్షణం, అధిక్షేపం, అసత్యవచనం, ఉపఘాతం, వాక్పారుష్యం, అభిద్రోహం, అసూయ మున్నగునవి.

అనుభావాలు (= చేష్టలు) : పాటనం, పీడనం, ఛేదనం, భేదనం, ప్రహరణం, ఆహరణం, శస్త్రసంపాతం, సంప్రహారం, రుధిరాకర్షణం మున్నగునవి. రక్తనయనం, స్వేదం, భ్రుకుటీకరణం, దంత-ఓష్ఠపీడనం, గండస్ఫురణం, హస్తాగ్రనిష్పేషణం మున్నగువాటి చేత రౌద్రాన్ని అభినయించాలి.

వ్యభిచారిభావాలు : సమ్మోహం, ఉత్సాహం, ఆవేగం, అమర్షం, చపలత, ఉగ్రత, గర్వం, స్వేదం, వేపథువు, రోమాంచం, గాద్గద్యం మున్నగునవి.

ఋషులప్రశ్న : రౌద్రరసం రక్షోదానవాదులపరంగా చెప్పబడింది కదా? మరి ఇది ఇతరుల యందు ఉండదా?

భరతముని సమాధానం : ఇతరులయందు కూడా రౌద్రరసం ఉంటుంది. అయినప్పటికీ అధికారులు మాత్రమే ఇచ్చట గ్రహింపబడినారు. రక్షోదానవాదులు స్వభావం చేతనే రౌద్రమూర్తులు.

ప్రశ్న : ఎందుచేత?

సమాధానం : రక్షోదానవాదులు అనేక బాహువులు, అనేకముఖాలు, చింపిరిగా ఉన్న శిరోజాలు, ఎఱ్ఱని మిడిగ్రుడ్లు, భయంకరములైన నల్లని రూపాలు కలిగి ఉంటారు. సహజములైన వారి అంగిక వాచిక చేష్టలు కూడా రౌద్రభూయిష్ఠాలుగానే ఉంటాయి. వారిచేత, శృంగారం కూడా ప్రాయికంగా క్రూరాకారంగానే సేవింపబడుతుంది. వారిని అనుకరించే మనుష్యులలో కూడా సంగ్రామ-సంప్రహారకృతమైన రౌద్రరసం ఉంటుంది.

ఇచ్చట ఆనువంశ్యములైన ఆర్యలు కలవు :

యుద్ధమునందలి కొట్టుకొనటం, నరకటం, వికృతంగా ఛేదించటం, చీల్చటం, యుద్ధమునందలి తొట్రుపాటు మున్నగువాటివల్ల రౌద్రం జనిస్తుంది.

వివిధములైన ప్రహరణాలను ప్రయోగించటం, శిరం మొండెం భుజాలు - వీటిని తెగనరకటం మున్నగు అర్థవిశేషాలచేత రౌద్రం యొక్క అభినయం చేయాలి. రౌద్రములైన వాక్కులు, అంగాలు, చేష్టలు, అధికంగా శస్త్ర ప్రహారాలు, ఉగ్రకర్మలు—రౌద్రరసం వీటితో కూడి ఉంటుంది.

రౌద్రకర్మ ఫలమే కరుణం.

రౌద్రం రక్తవర్ణం కలది.

రౌద్రరసానికి రుద్రుడు అధిదైవం.

ఆంగికం, నైపథ్యం, వాచికం అనే భేదాలచేత రౌద్రం మూడు విధాలు.

గర్వం, అసూయ, మదం, ఉత్సాహం, ఆవేగం, అమర్షం, క్రోధం, చప లత, ఉగ్రత- ఇవి రౌద్రరససంబంధి వ్యభిచారి భావాలు.

టీక : పరిపూర్ణక్రోధం లేదా సర్వేంద్రియములందు ఔద్ధత్యం రౌద్రం అవుతుంది- అని రసతరంగిణీకర్త.

శారదాతనయుడు రౌద్రరసాన్ని విపులంగా వర్ణించినాడు

(భా.ప్ర. III-86-92, 134-38, 184-208):

క్రోధం రౌద్రరసస్థాయిభావం. రాక్షసులు, ఉద్ధతులు, దైతేయులు క్రూర ప్రకృతులు.

విభావాలు : అసత్యవచనం,అవజ్ఞావచనం, పరుషోక్తులు ఇందు ఉంటాయి. వధ ప్రతిజ్ఞ, అన్యభార్యలను చెరబట్టటం అనే ప్రతిజ్ఞ, రాష్ట్రభంజనం, గృహ-క్షేత్ర-దారాదులను హఠాత్తుగా ఆక్రమించటం, మత్సరం, దేశ-జాతి-ఆచార-విద్యా-శౌర్యాదులను నిందించటం, ఆక్రోశం, కలహం, ఆక్షేపవచనం, ఆజ్ఞాభంజనం.

అనుభావాలు : భ్రుకుటీ-కపోలభ్రమణం, మరల మరల దంత-ఓష్ఠపీడనం, హస్తవిక్షేపణం, రక్తనేత్రత, శస్త్రాస్త్రగ్రహణం , ఛేదనం-తాడనం-మోటనం, రుధిరాదిపానం, అంత్రాదులతో అలంకరణం, అనాలోచితంగా పడవేయటం, గర్జనం, భర్త్సనం మున్నగునవి.

సాత్త్వికభావాలు : రోమాంచం, స్వేదం, కంపం మున్నగునవి.

వ్యభిచారిభావాలు : ఉగ్రత, ఆవేగం, మదం, అమర్షం, మూర్ఛ, అసూయ, అవహిత్థ, స్మృతి, చాపలం, బోధ, ధైర్యం, ఉత్సాహం.

అంగ-నైపథ్య-వాక్ భేదాలచేత రౌద్రం మూడు విధాలు. బహు శిరస్సులు, ఉద్ధూత-పింగల- మూర్ధజకేశాలు, హ్రస్వాలు లేదా దీర్ఘాలు అయిన బాహువులు, నానాశస్త్రాస్త్రాలను ధరించటం, ఉద్వృత్తములు రక్తములు అయిన నయనములు, నల్లగా ఉన్న మహాదేహములు కలిగి ఉండటం ఆంగికరౌద్రం. కృష్ణరక్తములైన

వస్త్రాలు, అనులేపాలు, మాల్యములు, భూషణాలు కలిగి ఉండటం నైపథ్యజ రౌద్రం. భేదించు, ఛేదించు, కట్టు, తిను, చంపు, కొట్టు, ఖండించు, దండించు, వీని రక్తం త్రాగుతా, నూరుతా, అరుగదీస్తా మున్నగు వాక్యాలు వాచికరౌద్రం.

అన్ృతం, అవజ్ఞ, అవమానిత, ఆక్రోశం, అక్షేపం -ఇవి గుణరూపంలో రౌద్రరసానికి విభావాలు.

ప్రసిద్ధమగు వాక్యాన్ని అర్థానుబంధం లేకుండా ప్రయోగించటం లేదా విపర్యార్థం సంభవించటం 'అన్ృతం' అవుతుంది. గొప్పవానిని అట్లా గుర్తించక పోవటం అవజ్ఞ (= న్యక్కారం =తిరస్కారం). ఉత్తమునియందు ఈ అవజ్ఞ మానసికంగా ఉంటుంది. వాచికమైన అవజ్ఞ గుణనిందారూపంగా ఉంటుంది. ఇట్లా అవజ్ఞ ముప్విధాలు. ప్రముఖులగు ఇద్దరు వ్యక్తులను సమానంగా ఒకేవిధంగా సన్మానించటం అవమానిత అవుతుంది.

అసత్యరూపంగా దోషం ఆరోపించి ఎలుగెత్తటం ఆక్రోశం. ఒకరినొకరు అనూయాదులతో క్షేపమొనర్చుకొనటం అక్షేపం.

క్రోధం, కోపం, రోషం - అనే భేదాలచేత క్రోధం మూడు విధాలు. అంతేకాదు, శత్రు-మిత్ర-ప్రియా- భృత్య-పూజ్యాదులను పట్టి క్రోధం మరల అయిదు విధాలు.

శత్రువుల మీది క్రోధంలో : కుటిల భ్రుకుటి, సృక్వభాగాలను నాలుకతో నాకటం, పెదవిని దంతములతో నొక్కి పట్టటం, దంతాలను కటకటలాడించటం, తీక్ష్ణంగా శస్త్రాలను చూడటం, గర్వించి భుజాలను చూసుకొనటం, నిలుకడగా నిలబడలేకపోవటం, కంఠగర్జితం (= సింహనాదం) చేయటం మున్నగునవి ఉంటాయి.

మిత్రులమీది కోపంలో : వ్రీడాభరంతో వినమ్రవదనుడు కావటం, కన్నీరు పెట్టటం, నిఃశ్వసించటం, ఊరకనే లక్ష్యం లేకుండా ధ్యానించటం, విశ్లేష్టుడుగా ఉండటం, శయనించటం మున్నగునవి ఉంటాయి.

ప్రియమీది కోపంలో : రోషంతో కనులు ఎర్రబడటం, భ్రుకుటి అధరం స్ఫురించటం, అల్పంగా అంగవికారం పొందటం ఉంటాయి.

భృత్యుని మీది క్రోధంలో : శిరఃకంపం, అక్షివిక్షేపం, ప్రీతితో బెదరించటం, ముహుర్ముహుర్వీక్షణం - ఇవి ఉంటాయి.

పూజ్యులమీద కోపంలో : వినమ్రవదనుడు కావటం, స్వేదంతో తడవటం, గద్గదస్వరం కలవాడై ఏమీ పలుకక ఉండటం - ఇవి ఉంటాయి.

క్రుద్ధులయిన వారికి ఎనిమిది అవస్థలు ఉంటాయని మనీషులన్నారు.

1. గుణములను నిందించటం, 2. పరుషవచనభాషణం, 3. శత్రువును నశింపజేసే ఉపాయచింతనం, 4. హననేచ్ఛ, 5. ఆయుధగ్రహణం, 6. విఘ్నములు వచ్చినప్పటికీ వేగంగా హననం చేయటం, 7. హతుని అసృక్పానం, అంత్రాకర్షణ, 8. విఘ్నవిఘాతం లేని, ఫలావధికమైన క్రోధం.

క్రుద్ధుడైనవాడు, క్రోధకౌటిల్యం వల్ల యథేష్టముగా ప్రాణాలను సైతం పరిత్యజిస్తాడు.

రౌద్రం కలవారిలో క్రోధమధికం. ధీరులలో కోపం ఉంటుంది. స్త్రీ-పురుషులకు ప్రణయారంభంగా రోషం కలుగుతుంది. క్రుద్ధులలో క్రోధం ఫలోదయపర్యంతం ఉంటుంది. బ్రతిమలాడితే, ఫలోదయమయినంతనే కోపం నివృత్తమవుతుంది. ఆయా ఉద్దీపనములచేత రోషం వృద్ధి పొందుతుంది. కాని ప్రార్థన ఉంటే సామాన్యంగా రోషం శమిస్తుంది.

భరతరసప్రకరణకర్త రౌద్రరసాన్ని క్రింది విధంగా వివరించినాడు (385-394 శ్లో) :

విభావ-అనుభావ-సాత్త్విక-వ్యభిచారి భావాల సామాన్య గుణయోగం చేత సదస్యులకు ఆస్వాద్యత్వం కలిగించే క్రోధం రౌద్రరసం అనబడుతుంది.

రౌద్రరసంలో :

ఆలంబనాలు : ఆతతాయి (= చంపటానికి ప్రయత్నించేవాడు), పిశునుడు (= కొండెకాడు), పాతకాలకు పూరికొల్పేవాడు, ఆక్షేపం-అవమానం, ఆక్రోశం-వధ-బంధనం మున్నగు వాటికి పాల్పడేవారు, ద్రోహం చేసేవారు (లేదా ఇతరద్రోహాలు చేసేవారు).

ఉద్దీపనాలు : ధృష్టత్వం, పరుషత్వం, గర్వం, ఔద్ధత్యం.

అనుభావాలు : ఎవడవురా నీవు? ఏంచేస్తున్నావురా? - ఇటువంటి పరుషోక్తులు, ద్వేషంతోటి మాటలు, తల ఆడించటం, నవ్వటం, వంకరగా చూడటం, పెదవి కరిచి పట్టటం, బొమముడి, గిరగిర తిరిగే ఎఱ్ఱని తారకలు, నేలతన్నటం, [illegible], ముష్టితో గ్రుద్దటం, చెక్కిళ్ళు అదరటం, ముఖం ఎఱ్ఱబడటం, చంపటానికి పూనుకొనటం, విరవటం, లాగటం, ఈడ్చుకొట్టటం, నరకటం, జుట్టులాగడీయటం, దండం శస్త్రం అస్త్రం ధరించటం, పరుగులుపెట్టటం, చంపటం, కన్నీరు కార్చటం, రక్తం త్రాగటం,

బాగా తరిమి కొట్టటం, "ఒరీ పాపీ, మనుష్య పశువా! ద్రోహీ! నిలునిలు. ఎచ్చటికి పారిపోతున్నావు? నీతల నరుకుతాను, నీ రొమ్ముచీలుస్తాను, పళ్ళు రాలగొడతాను, పళ్ళు చితుకపొడుస్తాను" - ఇటువంటి మాటలు, నిర్భయత్వం.

వ్యభిచారిభావాలు : అమర్షం, మదం, స్మృతి, ఔత్సుక్యం, ఆవేగం, మోహం, గర్వం, ఈర్ష్య, చపలత, ఉగ్రత, ఉన్మాదం, ఉత్సాహం, బోధ, హర్షం, అసూయ.

ఉదా : కృతమనుమతం దృష్టం వా యై రిదం గురు పాతకం
మనుజ పశుభి ర్నిర్మర్యాదై ర్భవద్భి రుదాయుధైః ।
నరక రిపుణా సార్ధం తేషాం సభీమకిరీటినా
మయ మహ మసృ జ్మేదో మాంసైః కరోమి దిశాం బలిం ॥
-(వేణీసంహారం -III-21).

"వీతమర్యాదులై గురుపాతకంబు
సలిపి, సహియించి, చూచిన నశరమనుజ
పశువులమిమ్మెల్ల, నే కృష్ణ పార్థ భీమ
యుక్తముగ భూతబలియిత్తు రక్తమునను."
-(ఇవి అశ్వత్థామ మాటలు-వసురాయ కవి అనువాదం)

## రౌద్ర రసాభాసం :

గురుజనులగు పితృ-భ్రాతృ-ముని-సుర-ఆచార్యులపై కోపించటం రౌద్రరసాభాసం అవుతుంది.

## రౌద్రరసమందలిగతి (నా.శా.XII-48-54) :

దైత్య-రాక్షసగణాలలో రౌద్రరసం ఒక్కటే స్థిరంగా ఉంటుంది. నేపథ్యజ రౌద్రం, అంగజరౌద్రం, స్వభావజరౌద్రం అనే భేదాలచేత రౌద్రం మూడువిధాలు. రక్తం ఒడలినిండా ముఖం నిండా పూసుకొని, మాంస ఖండాలను చేతులలో పట్టుకొనటం నేపథ్యజరౌద్రం. బహుబాహువులు ముఖాలు, ఆయుధాలు, ఉన్నతములు స్థూలములు అయిన దేహాలు కలిగిఉండటం అంగజ రౌద్రం. ఎఱ్ఱనికనులు, బూడిదరంగుజుట్టు, నల్లని శరీరచ్ఛాయ, వికృతమైన కంఠస్వరం కలిగిఉండి, కఠినుడు నిర్భర్త్సనపరుడుకావటం స్వభావజరౌద్రం. ఇటువంటి వారు నిలిచినా, నడిచినా పాదాల మధ్యదూరం 4 తాలములు ఉండాలి; వీరిని పోలిన ఇతరజనుల గతికూడా ఇట్లాగే ఉంటుంది.

# 5. వీరం

వీరోనా మోత్తమప్రకృతి రుత్సాహాత్మకః. స చాసంమో
హాధ్యవసాయ నయ వినయ బల పరాక్రమ
శక్తి ప్రతాప ప్రభావాదిః విభావైః ఉత్పద్యతే.
తస్య స్థైర్య ధైర్య శౌర్య త్యాగ వైశారద్యాదిభిః
అనుభావైః అభినయః ప్రయోక్తవ్యః.
భావాశ్చాస్య ధృతి మతి గర్వావేగౌగ్ర్యామర్ష
స్మృతి రోమాంచాదయః.
అత్రార్యే రసవిచారముఖే—
ఉత్సాహాధ్యవసాయా దవిషాదిత్వా దవిస్మయాత్ మోహాత్ ।
వివిధాదర్థ విశేషా ద్వీరరసోనామ సంభవతి ।। 67
శౌర్య ధైర్య వీర్య గర్వై రుత్సాహ పరాక్రమ ప్రభావైశ్చ ।
వాక్యై శ్చాక్షేపకృతై ర్వీరరసః సమ్యగభినేయః ।। 68
వీరస్యాపి చ యత్కర్మ సోఽద్భుతః పరికీర్తితః । 42
గౌరో వీరస్తు విజ్ఞేయః 43
వీరో మహేంద్రదేవః స్యాత్ 45
దానవీరం ధర్మవీరం యుద్ధవీరం తథైవ చ ।
రసం వీరమపి ప్రాహ బ్రహ్మా త్రివిధమేవ హి ।। 79

-(నా.శా.VI)

అసమ్మోహ స్తథోత్సాహ ఆవేగో హర్ష ఏవ చ ।
మతి శ్చైవ తథోగ్రత్వ మమర్షో మద ఏవ చ ।।
రోమాంచః స్వరభేదశ్చ క్రోధోఽసూయా ధృతి స్తథా ।
గర్వశ్చైవ వితర్కశ్చ వీరే భావా భవంతి ।।

-(నా.శా.VII-113-114)

అర్థం : వీరః-నామ, ఉత్తమ ప్రకృతిః, ఉత్సాహాత్మకః=వీరరసం అనేది, ఉత్తమ ప్రకృతులకు సంబంధించినది, ఉత్సాహం (స్థాయిభావంగా) కలది.

సః(చ)=అది (=ఆవీరరసం)—

అసంమోహ, అధ్యవసాయ, నయ, వినయ, బల, పరాక్రమ, శక్తి, ప్రతాప, ప్రభావ- ఆదివిభావైః, ఉత్పద్యతే=అసంమోహం (=కలత చెందకుండటం), అధ్యవసాయం (=పట్టుదల), నయం (=సంధి-విగ్రహాదుల

ప్రయోగం), వినయం (=ఇంద్రియజయం), బలం (=చతురంగ బలాల తోడ్పాటు), పరాక్రమం (=శత్రుమండలాలను ఆక్రమించేనేర్పు), శక్తి (=యుద్ధాదులందలి సామర్థ్యం), ప్రతాపం (=శత్రువులకు తాపం కలిగించే ప్రసిద్ధి), ప్రభావం (=అభిజన-ధన-మంత్రి సంపద) మున్నగు విభావాలవల్ల, జనిస్తుంది.

స్థైర్య, ధైర్య, శౌర్య, త్యాగ, వైశారద్య-ఆదిభిః, అనుభావైః, తస్య, అభినయః, ప్రయోక్తవ్యః=స్థైర్యం, ధైర్యం (=చాంచల్యం లేకపోవటం), శౌర్యం, త్యాగం (=దానాదులివ్వటం), వైశారద్యం (=సామాదులను నేర్పుతో ప్రయోగించటం) మున్నగు అనుభావాలచేత, దాని, అభినయం, చేయాలి.

అన్య, భావాః=దానియొక్క, భావాలు–

ధృతి, మతి, గర్వ, ఆవేగ, ఔగ్ర్య, అమర్ష, స్మృతి, రోమాంచ-ఆదయః=ధృతి, మతి, గర్వం, ఆవేగం, ఉగ్రత, అమర్షం, స్మృతి, రోమాంచం మున్నగునవి.

అత్ర, రసవిచారముఖే, ఆర్యే=ఇచ్చట, (వీర) రసవిచారానికి సంబంధించి, రెండు ఆర్యలు కలవు;

ఉత్సాహ-అధ్యవసాయాత్, అవిషాదిత్వాత్, అవిస్మయాత్-మోహాత్, వివిధ-అర్థవిశేషాత్, వీరరసః నామ, సంభవతి=ఉత్సాహాత్మకమైన అధ్యవసాయం, అవిషాదం, అవిస్మయం, అసంమోహం-వీనివల్ల, ఇట్టివే అయిన ఇతర అర్థవిశేషాలవల్ల, వీరరసం, సంభవిస్తుంది.

శౌర్య, ధైర్య, వీర్య, గర్వైః, ఉత్సాహ, పరాక్రమ, ప్రభావైః(చ), ఆక్షేపకృతైః, వాక్యైః(చ), వీరరసః, సమ్యక్-అభినేయః=శౌర్యం, ధైర్యం, వీర్యం, గర్వం, ఉత్సాహం, పరాక్రమం, ప్రభావం, ఆక్షేప పూర్వకాలైన వాక్యాలు-వీనిచేత వీరసాన్ని చక్కగా అభినయించాలి (విజయాదులు ఊహనీయాలని రసతరంగిణీకర్త).

వీరస్య-(అపిచ), యత్-కర్మ, సః-అద్భుతః, పరికీర్తితః=వీరంయొక్క, కర్మ ఏదో, అది, అద్భుతం (అని) చెప్పబడినది.

వీరః(తు), గౌరః, విజ్ఞేయః=వీరరసం గౌరవర్ణం కలది (అని) తెలియవలెను.

వీరః, మహేంద్రదేవః, స్యాత్=వీరరసం, మహేంద్రుడు అధిదైవంగా, కలది.

దానవీరం, ధర్మవీరం, యుద్ధవీరం (తథా-ఏవచ), వీరరసం(అపి), త్రివిధం-ఏవ(హి), బ్రహ్మ, ప్రాహ=దానవీరం, ధర్మవీరం, యుద్ధవీరం— (ఇట్లా) వీరరసం, (కూడా) మూడువిధాలే (అని), బ్రహ్మ, చెప్పినాడు.

అసంమోహః, (తథా) ఉత్సాహః, ఆవేగః, హర్షః (ఏవచ), మతిః (చ-ఏవ), (తథా) ఉగ్రత్వం, అమర్షః, మదః (ఏవచ), రోమాంచః, స్వర భేదః(చ), క్రోధః, అసూయా, ధృతిః (తథా), గర్వః (చైవ), వితర్కః(చ), వీరే, భావాః, భవంతి=అసంమోహం, ఉత్సాహం, ఆవేగం, హర్షం, మతి, ఉగ్రత్వం, అమర్షం, మదం, రోమాంచం, స్వరభేదం, క్రోధం, అసూయ, ధృతి, గర్వం, వితర్కం— ఇవి, వీరరసమందు (సంచారి-సాత్త్విక) భావాలు, అవుతాయి.

తాత్పర్యం : వీరరసం ఉత్తమ ప్రకృతులకు సంబంధించినది; దీని స్థాయి భావం ఉత్సాహం.

విభావాలు : అసంమోహం, అధ్యవసాయం, నయం, వినయం, బలం, పరాక్రమం, శక్తి, ప్రతాపం, ప్రభావం మున్నగునవి.

అనుభావాలు : స్థైర్యం, ధైర్యం, శౌర్యం, త్యాగం, వైశారద్యం మున్నగునవి.

భావాలు : ధృతి, మతి, గర్వం, ఆవేగం, ఉగ్రత, అమర్షం, స్మృతి, రోమాంచం మున్నగునవి.

ఇచ్చట రెండు అర్థాలు కలవు :

ఉత్సాహాత్మకమైన అధ్యవసాయం, అవిషాదం, అవిస్మయం, అసంమోహం-వీటివల్ల, ఇట్టివే అయిన ఇతర అర్థ విశేషాలవల్ల వీరరసం సంభవిస్తుంది.

శౌర్యం, ధైర్యం, వీర్యం, గర్వం, ఉత్సాహం, పరాక్రమం, ప్రభావం, ఆక్షేప పూర్వకాలైన వాక్యాలు— వీనిచేత వీరరసాన్ని చక్కగా అభినయించాలి.

వీరకర్మయొక్క ఫలమే అద్భుతం.

వీరం గౌరవర్ణం కలది.

వీరానికి మహేంద్రుడు అధిదైవం.

దానవీరం, ధర్మవీరం, యుద్ధవీరం, అనే భేదాలచేత వీరరసం మూడు విధాలు. అసంమోహం, ఉత్సాహం, ఆవేగం, హర్షం, మతి, ఉగ్రత్వం, అమర్షం, మదం, గర్వం, వితర్కం- ఇవి వీరరసమందలి భావాలు.

టీక : 1. భరతరసప్రకరణకర్త ఇట్లా వివరించినాడు:

విభావ-అనుభావ-సాత్త్విక-వ్యభిచారుల సంయోగంచేత, సదస్యులలో రసాను భూతి కలిగించే ఉత్సాహం వీరరసం అనబడుతుంది.

అనుభావాలు : ప్రసన్న ముఖరాగాదులు.

ఆలంబనవిభావం దానాదిగుణాలచేత ఉద్దీపితమవుతుంది. ఔత్సుక్యం, చింత, హర్షం మున్నగు సహకారులచేత పోషింపబడ్తుంది. అమర్షం, విబోధం, వితర్కం, మతి, ధృతి, క్రోధం, అసూయ, అసంమోహం, ఆవేగం, గర్వం, మదం, ఉగ్రత్వం— ఈ భావాలు వీరమందు ఉంటాయి.

2. దాన-ధర్మ-యుద్ధవీరాల్లు మూడింటికి అర్వాచీనాలంకారికులు దయా వీరం అనేనాలుగో భేదం చేర్చినారు. జగన్నాథ పండితుడు వీరరసమందు అనేక భేదములున్నవని చెప్పి, 'సత్యవీరం' అనే భేదాన్ని స్థాపించినాడు— హరిశ్చంద్రుడు ఇందుకు ఉదాహరణ. ధర్మవీరంలోనే ఈసత్యవీరం కూడా అంతర్భవిస్తుందన టానికి వీలుకాదు; అట్లా అయితే దాన-దయావీరాలు కూడా ధర్మవీరంలోనే అంతర్భవించాలి. కాని, వానిని వేరుగా గణించినట్లే సత్యవీరాన్నికూడా వేరుగానే గణించాలని అయన ప్రతిపాదన. ఇట్లాగే పాండిత్యవీరం మున్నగునవి కూడా ఉండవచ్చునన్నాడు.

3. శారదాతనయుడు శౌర్యాది 18 భావాలను ఇట్లా వివరించినాడు (భా.ప్ర.III-168-182) :

రసాలకు సంబంధించిన విభావాదులు, అట్లే అనుభావాలు సాత్త్వికాలు కూడా ఒక్కొక్కప్పుడు 'గుణములు' అవుతాయి. ఒకప్పుడు స్థాయిభావాలుకూడా నాయికానాయకాదుల వ్యాపారాదులకు అనురూప్యంగా గుణములవుతాయి. ఇంతవరకు ఎవ్వరూ చెప్పని అయావిశేషాలను ఇప్పుడు వివరిస్తాము.

1. వేగంగా విక్రమించటం శౌర్యం; 2. బుద్ధికి నిరూపావసాయం వ్యవసాయం; 3. శస్త్రాస్త్రహతుడైనప్పటికీ ఫలప్రాప్తికై వశువి ఆక్రమించటానికి మనస్సు ప్రవరిస్తే అది పరాక్రమం; 4. సోత్సాహంగా ప్రారంభించినకార్యాన్ని

ఫలప్రాప్తి పర్యంతం విడువకుండటం ప్రౌఢి; 5. విశ్వాన్ని రమింపజేసే కృతికి కీర్తి అని పేరు - ఈ కీర్తి కులక్రమాగతం కావచ్చు. 6. ఇంక తన విశిష్ట కర్మచేత కలిగేది యశస్సు; 7. లోకశాస్త్ర మర్యాదలను లంఘింపకుండటం వినయం; 8. దండనీతిని పాటించటం నయం; 9. అధికారం లేకున్నా, ఎవని సన్నిధిలో ప్రజలు తమ తమ ధర్మములందు ప్రవర్తిస్తారో అది ప్రభుత్వం; 10. భయాత్మకమైన ప్రవృత్తి ఆజ్ఞ; 11. యుద్ధకర్మలో అవ్యగ్రమైన విచిత్రప్రవృత్తి వీర్యం; 12. భుజములకు శుండములకువలె బలం ఉంటే అది శౌండం; 13. శౌండులను ప్రేరేపించటం శౌండీర్యం; 14. అభీష్ట ప్రదానంవల్ల ప్రాణికి కలిగే ప్రకర్షభావన ప్రభావం; 15. భావాలన్నీ పరోపకారార్థం అని నిరూపితం అయితే అది అనుభవం; 16. జవ-బల-ప్రాణ-కాయ-బుద్ధులలో సత్త్వంఉంటే, అది మహాసత్త్వం— ఇది ధీర పర్యాయపదం; 17. ఎవ్వరును భేదించలేకపోవటం స్థైర్యం; 18. వెంటనే చేసే కర్మ సాహసం.

4. వీరరసమందలి గతి : అనేక విధములైన చారులతో కూడినదై ద్రుతప్రచారం (ఒకే ప్రదేశమందు), పాదవిక్షేపాలు (=స్యందిత-అపస్యందితాదిచారులు) కలిగిఉంటుంది. కలా-తాలానుసారులయిన పార్శ్వక్రాంత-అవిద్ధ-సూచీచారులతో కలా-తాల (=కాల) అనుసారంగా 'ఆవేగం' ప్రయోగించాలి (నా.శా.XII-57-58).

6. వీరరస వివరణలో రసతరంగిణీ కర్త ఇంకా ఇట్లా వ్యాఖ్యానించినాడు (3వ తరంగం) : అతీంద్రియమైన రసంయొక్క జ్ఞాపకాలు (=అనుభావాలు) శరీరధర్మాలని ఇంతవరకు చెప్పినారు కదా? మరి, ధైర్యం, ఉత్సాహం అనేవి శరీరధర్మాలు కాదుకదా? అదినిజమే. ధైర్యం అంటే చాంచల్యంయొక్క అభావం అనీ, ఉత్సాహపదంచేత అశ్రుపాతాదులు వివక్షింపబడినవి అనీ తెలియాలి. లేదా, అనుభావం చతుర్విధాలు; అందులో మానస విభావం అనేది ఒకభేదం— దీని జ్ఞానమే అనుభావకమవుతుంది. కావున, మానస అనుభావం, శారీరక అనుభావం— వీనిలో భేదంలేదు.

5. వీరరస వివరణలో 'ఉత్సాహ'స్థాయి భావాన్ని ఇట్లా వివరించినాడు రసతరంగిణీకర్త (2వ తరంగం) :

మొదటిప్రశ్న : స్వనిష్ఠమైన ఉత్సాహం ఉద్దీపన విభావం ఎట్లా అవుతుంది?

సమా : ఉద్దీపనవిభావం వస్తుజ్ఞానమాత్రమేకాక, గమకం కూడా అవుతుంది. అందుచేత స్వనిష్ఠ-పరనిష్ఠ భేదములందు అంతరంలేదు.

దయావీరం, కరుణరసమందు ఏల అంతర్భవించదు? అని ఇంకో ప్రశ్న. నిస్స్వార్థంగా, పరదుఃఖ నివారణేచ్ఛ దయ అవుతుంది; ఇది కరుణం వినా సంభవించదు కదా? సమా: కరుణంయొక్క స్థాయిభావం శోకంకాగా, దయావీరం యొక్క స్థాయిభావం ఉత్సాహం; కావున, రెండూ ఒకటికావు.

7. క్రోధంలో రక్తాస్యత్వ, రక్తనేత్రత్వాలు ఉంటాయి; ఇవిలేని యుద్ధవీరం రౌద్రరసం కంటె భిన్నమవుతున్నదని విశ్వనాథుడు (సా.ద.III-233).

*(1) యుద్ధవీరం :*

మూలం : యుద్ధవీరే హర్ష గర్వ మోహాద్యా వ్యభిచారిణః ।
అసహాయ్యేఽపి యుద్ధేచ్ఛా సమరాదపాలాయనమ్ ॥
భీతాభయ ప్రదానాద్యా వికారా స్తత్ర కీర్తితాః ।
-(ర.సు.II-237-38)

తాత్పర్యం : *యుద్ధవీరమందు– హర్షం, గర్వం, మోహం మున్నగునవి వ్యభిచారిభావాలు.*

*సహాయం లేకపోయినా యుద్ధంచేయాలన్న కోరిక, యుద్ధరంగం నుంచి పారిపోకుండా ఉండటం, భయపడినవారికి అభయప్రదానంచేయటం మున్నగునవి యుద్ధవీరమందలి వికారాలు (=క్రియలు).*

టీక : యుద్ధవీరాన్ని శారదాతనయుడు ఇట్లా వివరించినాడు:

యుద్ధంలో తాను ఒక్కడేఅయినా, నిరాయుధుడయినా, యుద్ధోచితపరికరాలు సరిగా లేకపోయినా అనేకులతో యుద్ధమొనరించవలసినా– భయంలేకపోవటం, యుద్ధనిశ్చయంలో అహంభావంతో ఉండటం, శస్త్ర-అస్త్రఘాతాలు తగిలినా హర్షం వీడకుండా ఉండటం, యుద్ధనుంచి పలాయనం చేయకపోవటం, భీతులకు అభయమివ్వటం, శరణుపొందినవారి ఆర్తిని పోగొట్టటం– ఇట్టిది యుద్ధాత్మకమైన వీరం (భా.ప్ర.).

ఉదా : భోలంకేశ్వర! దీయతాం జనకజా, రామః స్వయం యాచతే
కోఽయం తే మతివిభ్రమః? స్మర నయం, నాద్యాపి కించిద్గతం।
నైవం చేత్ఖరదూషణత్రిశిరసాం కంఠాసృజాపంకిలః
పత్రీ నైష సహిష్యతే మమ ధనుర్జ్యాబద్ధ బంధూకృతః ॥
-(బాలరామాయణం)

— (శ్రీరామచంద్రుడు)— ఓ లంకేశ్వరా! ఇమ్ము జానికిని; రాముడు స్వయంగా యాచిస్తున్నాడు. నీకేల ఈ మతి విభ్రమం? నీతిని స్మరించు. ఇప్పటికీ ఏమీమించిపోలేదు. అట్లాచేయకపోతే- ఖరదూషణత్రిశిరసుల కంఠ రక్తంచేత పంకిలమైన ఈ బాణం - వింటినారి కట్టునకు బంధువుకావించబడినది (=ఎక్కు పెట్టబడినది) — నిన్ను సహించదు.

*(2)* దయావీరం :

మూలం : దయావీరే ధృతి మతి ప్రముఖా వ్యభిచారిణః ॥
స్వార్థప్రాణవ్యయేనాపి విపన్నత్రాణశీలతా ।
అశ్వాసవోక్తయః స్థైర్య మిత్యాద్యా స్తత్ర విక్రియాః ॥
-(ర.సు.II-238-39)

తాత్పర్యం : దయావీరమందు ధృతి, మతిమున్నగునవి వ్యభిచారిభావాలు. తన ధనం, తన ప్రాణం అయినాసరే ఇచ్చి, విపన్నులను రక్షించేశీలం, ఊర డింపు మాటలు చెప్పటం, స్థైర్యం మున్నగునవి ఇందలి విక్రియలు.

టీక : వ్యాధి, దారిద్ర్యం, శస్త్రాస్త్రక్షతి, ఆకలిదప్పలు మున్నగు వానిచేత పీడుతులయినవారిని ప్రేమతో అదరించటం దయావీరం (భా.ప్ర.).

ఉదా : సిరాముఖైః స్యందత ఏవరక్త
మద్యాపిదేహే మమ మాంసమస్తి ।
తృప్తిం న పశ్యామి తవాపి తావ
త్కింభక్షణాత్ త్వం విరతో గరుత్మన్॥ (నాగానందం-V-16)
— సిరాముఖములనుంచి రక్తం కారుతూనే ఉంది;
నాదేహంలో ఇంకా మాంసం మిగిలిఉంది;
నీకు ఆకలి తీరినట్లుగాలేదు; మరి,
ఓగరుత్మంతుడా! నీవు భక్షించటం
ఎందుకు మానివేశావు? (సర్పంగా భావించి తనను కొంతవరకు తిని, మరలతినటం మానివేసిన గరుత్మంతునితో జీమూతవాహనుడు చెప్పిన మాటలు).

*(3)* దానవీరం :

మూలం : దానవీరే ధృతి ర్హర్షో మత్యాద్యా వ్యభిచారిణః ।
స్మితపూర్వాభిభాషిత్వం స్మితపూర్వం చ వీక్షితమ్ ॥

ప్రసాదే బహుదాతృత్వం తద్వద్వ్యాచామోదితమ్ ।
గుణాగుణవిచారాద్యా స్త్వనుభావా స్సమీరితాః ॥
-(ర.సు.II-235-36)

తాత్పర్యం : దానవీరమందు ధృతి, హర్షం, మతి మున్నగునవి వ్యభిచారి భావాలు.

స్మితపూర్వకంగా భాషించటం, చూపులలో నవ్వు వెదజల్లటం, అనుగ్రహించినప్పుడు అధికంగా ఇవ్వటం, అనుగ్రహంతో మాటఇవ్వటం, గుణాగుణములను అరయుటం మున్నగునవి ఇందలి అనుభావాలు.

టీక : యాచకులకు అభీప్సితార్థంకంటె అధికంగా ఇవ్వటం, వారిని స్వజనులవలె మధురభాషణాలతో ఆదరించటం 'దానవీరం' అవుతుంది (భా.ప్ర.) :

ఉదా : పరశురామునిదానం - సప్తసముద్రవేష్టితమయిన భూమిని నిర్వ్యాజంగా ఇవ్వటం.

కర్ణునిదానం - అపజయం, మరణం - వీటిని లెక్కచేయకుండా తన సహజకవచకుండలాలను కోసి ఇంద్రునకు దానంచేయుటం.

(4) ధర్మవీరం :

భరతముని వీరరసం మూడువిధాలు అంటూ ధర్మవీరాన్ని ఒకభేదంగా చెప్పినాడు. కాని, అర్వాచీనాలంకారికులు ఎవ్వరూ దీనిని వివరించలేదు; ఒకరిద్దరు ఉదాహరణలు మాత్రమిచ్చినారు.

ఉదా : యుధిష్ఠిరుడు :

రాజ్యం చ వసు దేహశ్చ భార్యా భ్రాతృ సుతాశ్చ మే ।
యచ్చలోకే మమాయత్తం తద్ధర్మాయ సదోద్యతం ॥

— రాజ్యం, ధనం, దేహం, భార్య, సోదరులు, సుతులు - వీరేకాక లోకంలో ఇంకా నాఅధీనంలో ఏదికలదో అది అంతా సర్వదా నాధర్మనిర్వహణలో సిద్ధంగా ఉంటుంది.

రాముడు :

స్నేహం దయాం తథా సౌఖ్యం యది వా జానకీ మపి ।
ఆరాధనాయ లోకస్య ముంచతో నాస్తి మే వ్యథా ॥
-(ఉ.రా.I-5)

— స్నేహంకానీ, దయకానీ, సౌఖ్యంకానీ, అవసరమైతే జానకినికానీ లోకారాధనలో విడువటానికి వెనుదీయను (=నాకు బాధలేదు).

కుశుడు :

కా త్వం శుభే! కస్యపరిగ్రహోవా
కిం వా మదభ్యాగమ కారణం తే ॥
అచక్ష్వ మత్వా వశినాం రఘూణాం
మనః పరస్త్రీవిముఖ ప్రవృత్తిః ॥
-(ర.వం.XVI-8)

— ఓ కల్యాణీ! నీవెవరు? ఎవని భార్యవు? ఎందులకువచ్చావు? రఘువంశస్థులు పరస్త్రీవిముఖులని తెలిసికూడా ఎందులకు వచ్చితివో చెప్పు (శ్రీరాముని కుమారుడు కుశుడు తన మందిరంలోకి వచ్చిన అయోధ్యాపుర లక్ష్మితో, ఆమె ఎవరో తెలియక చెప్పిన మాటలు).

వీరరసాభాసం :

బ్రహ్మహత్యా మహాపాతకాలను చేయటంలో ఉత్సాహంచూపటం, అధమ ప్రకృతిగతంగా వీరాన్ని వర్ణించటం వీరరసాభాసం అవుతుంది.

## 6. భయానకం

మూలం : భయానకోనామ భయస్థాయిభావాత్మకః. స చ
వికృతరవ సత్త్వదర్శన శివోలూక త్రాసోద్వేగ
శూన్యాగారారణ్యగమన స్వజనవధబంధదర్శన
శ్రుతికథాదిభిః విభావైః ఉత్పద్యతే.
తస్య ప్రవేపిత కరచరణనయన చపల పులక
ముఖవైవర్ణ్య స్వరభేదాదిభిః అనుభావైః
అభినయః ప్రయోక్తవ్యః.
భావాశ్చాస్య స్తంభ స్వేద గద్గద రోమాంచ
వేపథు స్వరభేద వైవర్ణ్య శంకా మోహ దై

న్యావేగ చాపల జడతా త్రాసాపస్మార మరణాదయః.
అత్రార్యాః -
వికృతరవ సత్త్వదర్శన సంగ్రామారణ్య శూన్యగృహగమనాత్ ।
గురునృపయో రపరాధా త్కృతకశ్చ భయానకో జ్ఞేయః ॥ 69
గాత్రముఖదృష్టి భేదై రూరుస్తంభాభివీక్షణోద్వేగైః ।
సన్నముఖ శోష హృదయస్పందన రోమోద్గమైశ్చ భయమ్ ॥ 70
ఏతస్స్వభావజం స్యాత్సత్త్వసముత్థం తథైవ కర్తవ్యం ।
పున రేభిరేవ భావైః కృతకం మృదుచేష్టితైః కార్యమ్ ॥ 71
కరచరణవేపథు స్తంభ గాత్రహృదయప్రకంపేన ।
శుష్కోష్ఠతాలు కంఠైః భయానకోనిత్యమభినేయః ॥ 72
బీభత్స దర్శనం యచ్చ జ్ఞేయః స తు భయానకః—42
కృష్ణశ్చైవ భయానకః —43
కాలదేవో భయానకః —45
వ్యాజాచ్చైవాపరాధాచ్చ విత్రాసితక మేవ చ ।
పున ర్భయానకశ్చైవ విద్యాత్ త్రివిధమేవహి ॥ 80
-(నా.శా.VI)

స్వేదశ్చ వేపథుశ్చైవ రోమాంచో గద్గద స్తథా ।
త్రాసశ్చ మరణశ్చైవ వైవర్ణ్యం చ భయానకే ॥
-(నా.శా.VI-115)

అర్థం : భయానకఃనామ, భయస్థాయిభావాత్మకః = భయానక (రస)ంఅనేది, భయం స్థాయిభావంగా కలది.

సః (చ), వికృతరవ, సత్త్వదర్శన, శివ-ఉలూక, త్రాస-ఉద్వేగ, శూన్య-ఆగార-అరణ్యగమన, స్వజన వధ-బంధదర్శన, శ్రుతికథా-ఆదిభిః, విభావైః, ఉత్పద్యతే = అది (= భయానకరసం), వికృతరవం (వినటం), పిశాచ లేదా భయంకరజంతు దర్శనం, నక్క-గ్రుడ్ల గూబల అరపులు (వినటం), (ఇతరుల) త్రాసం ఉద్వేగం (చూడటం), శూన్యగృహంలోకి అరణ్యంలోకి వెళ్ళటం, స్వజనుల వధను లేదా బంధనమును చూడటం లేదా అటువంటి కథలను గూర్చి వినటం మున్నగు విభావాలవల్ల, ఉత్పన్నమవుతుంది.

ప్రవేపితకర-చరణ, నయన-చపల, పులక, ముఖవైవర్ణ్య, స్వరభేద-ఆదిభిః, అనుభావైః, తస్య, అభినయః, ప్రయోక్తవ్యః = బాగా కంపిస్తున్న కర

ఇంక కృతకభయాన్ని సత్త్వసముత్థంగా అభినయించాలి. ఇందలి చేష్టలు మృదువుగా ఉండాలి. పై అనుభావాలచేతనే కృతకభయాన్ని కూడా అభినయించాలి.

కర-చరణ కంపన-స్తంభనములు, గాత్రప్రకంపం, హృదయకంపం, ఎండిపోయిన పెదవులు తాలువులు కంఠం- వీటితో రెండు విధాల భయాన్ని అభినయించాలి. (సర్వాంగ ప్రకంపనం ఊహనీయమని రసతరంగిణీకర్త). బీభత్స దర్శనం వల్ల భయానకరసం ఉత్పన్నమవుతుంది.

భయానకం కృష్ణవర్ణం కలది.

భయానకానికి కాలుడు అధిదేవత.

వ్యాజం, అపరాధజం, విత్రాసికం, అనే భేదాలచేత భయానకరసం ముప్వి ధాలు.

భయానకరసమందు స్వేదం, వేపథువు, రోమాంచం, గద్గదత, త్రాసం, మరణం, వైవర్ణ్యం ఉంటాయి.

టీక : 1. భరతరసప్రకరణకర్త భయానకరసాన్ని ఇట్లా వివరించినాడు (373-380) :

విభావ-అనుభావ సాత్త్వికభావ-వ్యభిచారిభావాల యొక్క సామాన్య గుణ యోగం చేత సదస్యులకు రసానుభవం తెచ్చే భయమే భయానకరసం అనబడుతుంది.

భయానకరసంలో :

ఆలంబన విభావాలు : రాక్షసుడు, పిశాచం, ఎలుగుబంటి, పులి, పాము మున్నగువాటిని చూడటం; శూన్యంగా ఉన్న అరణ్య-గృహ-ఆరామ-శ్మశానాదులలో ప్రవేశించటం, యుద్ధం, దస్యుడు, రాజద్రోహం, వికృతం భయంకరం అయిన ధ్వని.

ఉద్దీపనవిభావం : స్వేదం మాత్రమే.

అనుభావాలు : ముఖం పెదవులు తాలువులు కంపించటం, ముఖం వాడటం, ప్రక్కలకు చూడటం, ముఖం నల్లబడటం, నల్లగ్రుడ్లు తిరుగుతూ లోపలకు పోవటం, ప్రణామం చేయుటం, పారిపోవటం, ప్రేళ్లకవచాలను కఱచుకొనటం, ఆంగికాలచేత మాటలచేత సహాయం అన్వేషించటం మొదలగునవి, "నీకు దాసుడను, నిన్ను శరణుపొందాను, నన్ను కాపాడు కాపాడు, అభయం ఇమ్ము" అనటం మున్నగునవి.

సాత్త్వికభావాలు : అన్నీ,

సంచారిభావాలు : త్రాసం, ఆవేగం, శ్రమ, స్మృతి, విషాదం, చపలత, మోహం, చింత, జాడ్యం, అపస్మృతి, దైన్యం, గ్లాని.

2. శారదాతనయుని వర్ణన ఇట్లాఉన్నది (భా.ప్ర.III-148-151):

అంగికం, మానసికం అనే భేదాలచేత భయానకం రెండు విధాలు. కాందిశీకత, మరల మరల సహాయన్వేషణం, పార్శ్వభాగాలను చూడటం, కరపాదాల కంపనం, వ్రేళులు కొరుకుకొనటం, అభయసూచనం, దంత దర్శనం మున్నగునవి అంగికభయాత్మకములు. ఊరుస్తంభం, హృదయకంపం, స్వేదం, తిరిగే తారకలు, పెదవి ఆరటం, ముఖం ఎండటం, గాద్గద్యం, వైవర్ణ్యం, విషయాలను గుర్తింపలేకపోవటం, ఉక్త-అనుక్త-అనభిజ్ఞత—ఇవి మానసిక భయాత్మకములు.

3. భయానకరసమందలి గతి :

భయానక రసమందు స్త్రీల, నీచుల, సత్త్వహీనులగు ఉత్తముల (ఉత్తరుడు మొదలగువారి) గతి ఈవిధంగా ఉంటుంది: విస్ఫారి చలిస్తున్న కనులతో, శిరస్సును ఆడిస్తూ, భయంతో ఇటునటు ప్రక్కలకు చూస్తూ, కపోతహస్తం పట్టి, శరీరమంతా వణకుతూండగా, పెదవులెండిపోగా, తొట్రుపాటుతో, బరువుగా తొందరగా అడుగులు వేస్తూ, పరిక్రమించాలి. శత్రువు వెన్నాడటం, బెదరటం, భయపడటం, వికృతజంతువులను చూడటం, వికృత ధ్వనులను వినటం మొదలగు వానిని అభినయిస్తున్నప్పుడు కూడా పై గతినే ప్రయోగించాలి. ఇది స్త్రీల విషయం. ఇంక పురుషుల విషయం: ధైర్యం తెచ్చిపెట్టుకొంటూ అభినయించాలి. ఏడకాక్రీడితమునందువలె దగ్గరగా, దూరంగా, ఒకదానిపై ఇంకొకటిగా అడుగులు వేస్తూ భయపడిన పురుషుల గతిని అభినయించాలి. హస్తాలు పాదానుసారులై ఉండాలి (నా.శా. XII-7075).

4. సహజభయం రజః-తమః ప్రకృతులైన అధములయందు ఉంటుంది. సత్త్వప్రధానులైన ఉత్తమప్రకృతులయందు సత్త్వసముత్థమైన అంటే ప్రయత్నకృతమైన (= కృతక) భయం మాత్రమే ఉంటుంది. గురువులను సందర్శించేటప్పుడు రాజాదులు సత్త్వసముత్థంగా భయం ప్రదర్శించటం ఇటువంటిదే.

5. చిన్నపిల్లలను బెదరించటానికి, పెద్దలు చూపే భయం కృతక భయంలోనే చేరుతుంది.

6. భయం యొక్క పరిపోషం లేదా సర్వేంద్రియవిక్షోభం భయానకమని నిర్వచించి, అపరాధం వల్ల కలిగే భయం స్వనిష్ఠ-పరనిష్ఠ భేదాల చేత ద్వివిధమని చెప్పి ఉదాహరణములొసంగినాడు రసతరంగిణీకర్త.

భయానకరసాభాసం :

భయానకరసం స్త్రీ-నీచ పాత్ర సాధారణం. అట్లాకాక, ఆ భయానకం ఉత్తమపాత్రగతం కావటం లేదా అట్లా వర్ణించటం భయానకరసాభాసం అవుతుంది.

## 7. బీభత్సం

మూలం : బీభత్సోనామ జుగుప్సాస్థాయిభావాత్మకః.
స చాహృద్యాప్రశస్తాప్రియాచోష్యానిష్టశ్రవణదర్శన
కీర్తనాదిభిః విభావైః ఉత్పద్యతే. తస్య
సర్వాంగసంహార ముఖవికూణ నోల్లేఖన
నిష్ఠీవ నోద్వేజనాదిభిః అనుభావైః అభినయః
ప్రయోక్తవ్యః. భావా శ్చాస్యాపస్మారోద్వేగ
మోహ వ్యాధి మరణాదయః.
అత్రానువంశ్యే ఆర్యే భవతః -
అనభిమత దర్శనేన చ గంధ రసస్పర్శ శబ్దదోషైశ్చ ।
ఉద్వేజనైశ్చ బహుభిః బీభత్సరసః సముద్భవతి ॥ 73
ముఖనేత్ర వికూణనయా నాసాప్రచ్ఛాద నావనమితాస్యైః ।
అవ్యక్తపాదపతనైః బీభత్సః సమ్యగభినేయః ॥ 74
బీభత్స దర్శనం యచ్చ జ్ఞేయః స తు భయానకః -42
నీలవర్ణస్తు బీభత్సః -43
బీభత్సస్య మహాకాలః -45
బీభత్సః క్షోభజః శుద్ధ ఉద్వేగీ స్యాత్ తృతీయకః ।
విష్ఠాకృమిభిః ఉద్వేగీ క్షోభజో రుధిరాదిజః ॥ 81
-(నా.శా.VI)

అపస్మార స్తథోన్మాదో విషాదో మద ఏవ చ ।
మృత్యుర్వ్యాధి ర్భయం చైవ భావా బీభత్స సంశ్రయాః ॥
-(నా.శా.VII-116)

అర్థం : బీభత్సఃనామ, జుగుప్సాస్థాయి భావాత్మకః = బీభత్స (రస)ంఅనేది, జుగుప్సస్థాయి భావంగా కలది. సః(చ), అహృద్య, అప్రియ, అప్రశస్త, అచోష్య, అనిష్టశ్రవణ- దర్శన-కీర్తన, ఆదిభిః, విభావైః, ఉత్పద్యతే = అది అహృద్యాలు, అప్రశస్తాలు, అప్రియాలు, అచోక్ష్యాలు (= సహజంగా శుద్ధ పదార్థాలైనా మందుల చేత దూషితాలు), అనిష్టాలుఅయిన వస్తువులను (గూర్చి) వినటం చూడటం చెప్పటం మున్నగు విభావాల వల్ల, ఉత్పన్నమవుతుంది.

సర్వాంగ సంహార, ముఖవికూణన, ఉల్లేఖన, నిష్ఠీవన, ఉద్వేజన- ఆదిభిః, అనుభావైః, తస్య, అభినయః, ప్రయోక్తవ్యః = శరీరాన్ని ముడుచు కొనటం, ముఖసంకోచం, ఉల్లేఖనం (= వాంతిచేసుకొనటం), ఉమ్మి వేయటం, గాత్రం వ్యాకులపాటు చెందటం మున్నగు, అనుభావాలచేత, దాని అభినయం చేయాలి.

అన్య, భావాః (చ) - అపస్మార, ఉద్వేగ, మోహ, వ్యాధి, మరణాదయః = దానియొక్క, భావాలు -అపస్మారం, ఉద్వేగం, మోహం, వ్యాధి, మరణం మున్నగునవి.

అత్ర-అనువంశ్యే, ఆర్యే, భవతః = ఇచ్చట, అనువంశ్యాలైన రెండు ఆర్యలు కలవు.

అనభిమత దర్శనేన (చ), గంధ-రస-స్పర్శ-శబ్దదోషైః (చ) బహుభిః, ఉద్వేజనైః (చ) బీభత్సరసః, సముద్భవతి = అభిమతం కాని వానిని దర్శించటంచేత, దోషభూయిష్ఠాలైన గంధ-రస- స్పర్శ-శబ్దాల చేత, వివిధాలైన ఉద్వేజనాలచేత, బీభత్సరసం ఉద్భవిస్తుంది.

ముఖ-నేత్రవికూణనయా, నాసాప్రచ్ఛాదన-అవనమిత-ఆస్యైః, అవ్యక్తపాదపతనైః, బీభత్సః సమ్యక్-అభినేయః = ముఖ-నేత్రాలను సంకోచింపజేయటం, ముక్కు మూసికొనటం, ముఖం వంచుకొనటం, ఎత్తెత్తి నేలకు అంటీఅంటనట్లుగా అడుగులు వేయటం - ఈ అనుభావాలచేత, బీభత్సరసాన్ని చక్కగా అభినయించాలి.

యత్ (చ), బీభత్సదర్శనం, సః (తు) భయానకః జ్ఞేయః = ఏది, బీభత్సదర్శనమో, అది, భయానకం (అని) తెలియాలి (బీభత్సరసం నుంచి భయానకం జనిస్తుందని భావం).

బీభత్సః, నీలవర్ణః (తు) = బీభత్సరసం, నీలవర్ణం (గా ఉంటుంది).

బీభత్సస్య, మహాకాలః = బీభత్సరసం యొక్క (అధిదైవం) మహా కాలుడు.

బీభత్సః, క్షోభజః, శుద్ధః, ఉద్వేగీ, తృతీయకః స్యాత్ = బీభత్సం (లో మొదటి భేదం) క్షోభజం, రెండవది శుద్ధం, (ఇంక) మూడవభేదం ఉద్వేగి అవుతుంది.

విష్ఠా, కృమిభిః, ఉద్వేగీ = మలాదులు, అసహ్యాకరములైన పురుగులు మున్నగునవి - వీనిచేత జనించేది ఉద్వేగి.

క్షోభజః, రుధిరాదిజః = క్షోభజం (అనే భేదం) రుధిరం (ఆంత్రములు= ప్రేవులు) మున్నగువానివల్ల జనిస్తుంది.

అవస్మారః (తథా), ఉన్మాదః, విషాదః, మదః (ఏవచ) మృత్యుః, వ్యాధిః, భయం (చ-ఏవ) భావాః, బీభత్స, సంశ్రయాః = అవస్మారం, ఉన్మాదం, విషాదం, మదం, మృత్యువు, వ్యాధి, భయం - ఈ భావాలు, బీభత్సాన్ని ఆశ్రయించి ఉంటాయి.

తాత్పర్యం : బీభత్సరసం జుగుప్సాస్థాయి భావాత్మకం.

విభావాలు : అహృద్యాలు, అప్రశస్తాలు, అప్రియాలు, అచోక్ష్యాలు, అనిష్టాలు అయిన వస్తువులను (గూర్చి) వినటం, చూడటం, చెప్పటం మున్నగునవి.

అనుభావాలు : శరీరాన్ని ముడుచుకొనటం, ముఖసంకోచం, ఉల్లేఖనం, ఉమ్మి వేయటం, గాత్రం వ్యాకులపాటు చెందటం మున్నగునవి.

భావాలు : అవస్మారం, ఉద్వేగం, మోహం, వ్యాధి, మరణం మున్నగునవి.

ఇచ్చట రెండు ఆర్యలు కలవు :

అభిమతం కాని వాటిని దర్శించటం, దోషభూయిష్ఠాలైన గంధ-రస-స్పర్శ-శబ్దాలు, వివిధాలైన ఉద్వేజనాలు- వీటివల్ల బీభత్సరసం ఉత్పన్నమవుతుంది. ముఖ నేత్రాలను సంకోచింపజేయటం, ముక్కు మూసికొనటం, ముఖం వంచుకొనటం, ఎత్తెత్తి నేలకు అంటీ అంటనట్లుగా అడుగులు వేయటం మున్నగు అనుభావాలచేత బీభత్సరసాన్ని అభినయించాలి.

బీభత్సదర్శనం వల్లనే భయానకం ఉత్పన్నమవుతుంది.

బీభత్సరసం నీలవర్ణం కలది.

మహాకాలుడు బీభత్సరసాధిదైవం.

క్షోభజం, శుద్ధం, ఉద్వేగి అనే భేదాలచేత బీభత్సం మూడు విధాలు.

మలాదులు, అసహ్యాకరములైన పురుగులు మున్నగు వాటివల్ల జనించేది ఉద్వేగి.

రుధిరాదుల వల్ల జనించేది క్షోభజం.

అపస్మారం, ఉన్మాదం, విషాదం, మదం, మరణం, వ్యాధి, భయం - ఇవి బీభత్సాశ్రయములైన భావాలు.

టీక : 1. శుద్ధ ఉద్వేగాన్ని భరతముని వివరించలేదు. కాని, అభినవగుప్తుని ఉపాధ్యాయుడైన భట్టతౌతుని ప్రకారం, క్షోభజం-ఉద్వేగి-ఇవి రెండున్నూ అశుద్ధ ములు; ఇంక రాగద్వేషాదులులేని మోక్షకామి అయిన వ్యక్తియొక్క వైరాగ్యం శుద్ధబీభత్సం అవుతుంది. "శౌచాత్ స్వాంగ జుగుప్సా" అని పతంజలి చెప్పినది ఇదే (యోగసూత్రాలు-2-40).

2. భరతరసప్రకరణకర్త బీభత్సాన్ని ఇట్లా వివరించినాడు :

విభావ-అనుభావ-సాత్త్వికభావ-వ్యభిచారి భావాల సామాన్యగుణయోగం చేత సదస్యులకు ఆస్వాద్యత్వం కలిగించే జుగుప్సాస్థాయిభావం బీభత్సరసం అనబడుతుంది.

బీభత్సరసంలో :

ఆలంబనాలు : రక్తం, మాంసం, వస, ఎముకలు మున్నగునవి, ఛర్ది (=వాంతి), లాలాజలం మున్నగునవి.

అనుభావాలు : వెనుకకు తిరగటం, ముఖం దృష్టి వంకరలు పోవటం, శ్యామముఖరాగం.

సాత్త్వికభావాలు : పులకలు మున్నగునవి.

వ్యభిచారి భావాలు : నిర్వేదం, శంక, అపస్మారం, విషాదం, జడత, దైన్యం, మోహం, శోకం, భయం, రోగం, మదం, ఉత్సాహం, స్మృతి.

ఈ బీభత్సరసం రెండు విధాలు : క్షోభి (=క్షోభణం), ఉద్వేగి. రక్త-మాంసాదుల వల్ల కలిగేది క్షోభిబీభత్సం; ఛర్ది-లాలాదుల వల్ల కలిగేది ఉద్వేగి బీభత్సం.

3. బీభత్సరసమందలి గతి :

అహృద్యమగు శ్మశానభూమి యందు, జుగుప్సావహమగు యుద్ధ భూమి యందు, బీభత్సాభినయగతిని ప్రయోగించాలి. ఏడకాక్రీడితచారి యందువలె దగ్గరగా, దూరంగా, ఒకదానిపై ఒకటిగా అడుగులు వేస్తూ నడవటం బీభత్స రసమందలి గతి అవుతుంది. హస్తాలు పాదానుసారులై ఉండాలి (నా.శా. XXII-55-57).

4. శారదాతనయుడు ఇట్లా వివరించినాడు (భా.ప్ర. III -102-104, 142-147) :

బీభత్సం జుగుప్సాస్థాయిభావాత్మకం. ఇది క్షోభాత్మకం, ఉద్వేగాత్మకం అని రెండు విధాలు. రక్తం, ప్రేవులు మొదలగువాని దర్శనం వల్ల కలిగేది క్షోభాత్మకం. పురుగులు, కక్కు, దుర్గంధం, పెంట మున్నగు వాని దర్శనం వల్ల కలిగేది ఉద్వేగాత్మకం. ద్వేషం, గ్లాని, భయం, మోహం, క్రోధం, నిద్ర, భ్రమ, మతి - ఇవి ఇందలి వ్యభిచారి భావాలు; ముక్కు మూసికొనటం మున్నగునవి అనుభావాలు .

మానసబీభత్సం క్షోభణాత్మకమని ప్రసిద్ధి. రక్తమాంసాదులను చూడగా మనస్సు చంచలమై క్షోభయుక్తమవుతుంది, కావున ఇది మానస బీభత్సం. భయపడటం, మ్లానం పొందటం, ద్వేషించటం, మోహం చెందటం, తెలివి పొందటం, ఆక్రందన మొనర్చటం, తొలగిపోవటం, విషాదపడటం, నిందించటం, ద - గావుమనటం, భ్రమించటం, తారసపడటం, ఊరకుండటం, దాగటం మున్నగునవి ఇందలి చేష్టలు.

ఉద్వేగజన్యమైన బీభత్సం ఆంగికంగా ఉంటుంది. వస్త్రావగుంఠనం, నాసాచ్ఛాదనం, నేత్రకూణనం, అస్పృష్టపాదపతనం, అపవర్తిత వక్రత, ద్రుతపాదాగ్రగమనం, మరల మరల నిష్ఠీవనం - ఇవి ఇందలి చేష్టలు.

5. జుగుప్స యొక్క పరిపోషం లేదా సర్వేంద్రియసంకోచం బీభత్సమని చెప్పి, అది స్వనిష్ఠ- పరనిష్ఠ భేదాలచేత ద్వివిధమని పేర్కొని, ఉదాహరణలొసంగినాడు రసతరంగిణీకర్త.

6. బీభత్సరసాభాసం :

హృద్యములు, సుందరములు అయిన వస్తువులను గురించి జుగుప్స వహించటం బీభత్సాభాసం అవుతుంది—

ఆవకాయ ఊటను నెత్తురుగా వర్ణించటం మొ.

# 8. అద్భుతం

మూలం : అద్భుతోనామ విస్మయ స్థాయిభావాత్మకః .
స చ దివ్యజనదర్శ నేప్సితమనోరథావాప్తి
ఉపవన దేవకులాది గమన సభావిమాన
మాయేంద్రజాల సంభావనాదిః విభావైః
ఉత్పద్యతే. తస్య నయన విస్తా రానిమేష
ప్రేక్షణ రోమాం చాశ్రు స్వేద హర్ష సాధువాద
దానప్రబంధ హాహాకార బాహువదన చేలాం
గులి భ్రమ ణాదిభిః అనుభావైః అభినయః
ప్రయోక్తవ్యః. భావాశ్చాస్య స్తంభాశ్రు
స్వేద గద్గద రోమాంచావేగ సంభ్రమ
జడతా ప్రలయాదయః.
అత్రానువంశ్యే ఆర్యే భవతః -
య త్వతిశయార్థయుక్తం వాక్యం శిల్పం చ కర్మ రూపం వా ।
తత్సర్వ మద్భుతరసే విభావరూపం హి విజ్ఞేయమ్ ॥ 75
స్పర్శగ్రహోల్లుకసనైః హాహాకారైశ్చ సాధువాదైశ్చ ।
వేపథు గద్గదవచనైః స్వేదాద్యైరభినయ స్తస్య ॥ 76
వీరస్యాపిచ యత్కార్మ సోఽద్భుతః పరికీర్తితః -42
పీతశ్చైవాద్భుతః --43
అద్భుతో బ్రహ్మదైవతః --45
దివ్యశ్చానందజశ్చైవ ద్విధా ఖ్యాతోఽద్భుతో రసః ।
దివ్యదర్శనజో దివ్యో హర్షాదానందజః స్మృతః ॥ 82

-(నా.శా.VI)

స్తంభః స్వేదశ్చ మోహశ్చ రోమాంచో విస్మయ స్తథా ।
ఆవేగో జడతా హర్షో మూర్ఛా చై వాద్భుతాశ్రయాః ॥

-(నా.శా.VII-117)

అర్థం : అద్భుతఃనామ, విస్మయస్థాయి భావాత్మకః = అద్భుత(రస)ంఅనేది, విస్మయం, స్థాయిభావంగా కలది.

సః (చ), దివ్యజనదర్శన, ఈప్సితమనోరథ-అవాప్తి, ఉపవన-దేవకుల-ఆదిగమన, సభా, విమాన, మాయ, ఇంద్రజాల సంభావన-ఆదిభిః, విభావైః,

ఉత్పద్యతే = అది, దివ్యజన దర్శనం, ఈప్సితమనోరథం సిద్ధించటం, ఉద్యాన వనాలకు దేవాలయాలకు వెళ్ళటం, సభలను విమానాలను మాయ లను ఇంద్రజాలాలను సందర్శించటం మున్నగు విభావాల వల్ల ఉత్పన్నమవు తుంది.

నయనవిస్తార, అనిమేషప్రేక్షణ, రోమాంచ, అశ్రు, స్వేద, హర్ష, సాధు వాద, దాన ప్రబంధ, హాహాకార, బాహు-వదన-చేల-అంగులి భ్రమణ-ఆదిభిః, అనుభావైః, తస్య, అభినయః, ప్రయోక్తవ్యః = విప్పారిన కనులు, రెప్పపాటు లేని చూపు, రోమాంచం, అశ్రుపాతం, స్వేదం, హర్షం, సాధువాదం, అధిక దానం, హాహాకారం, బాహువులను ముఖాలను వస్త్రాలను అంగుళులను ఆడిం చటం, మున్నగు అనుభావాలచేత దానియొక్క అభినయం చేయాలి.

అస్య, భావాః (చ)-స్తంభ, అశ్రు, స్వేద, గద్గద, రోమాంచ, ఆవేగ, సంభ్రమ, జడతా, ప్రలయ- ఆదయః= దానియొక్క భావాలు - స్తంభం, అశ్రువు, స్వేదం, గద్గదత, రోమాంచం, ఆవేగం, సంభ్రమం, జడత, ప్రలయం మున్నగునవి.

అత్ర-అనువంశ్యే, ఆర్యే భవతః = ఇచ్చట, అనువంశ్యములైన, రెండు ఆర్యలు, కలవు :

యత్, అతిశయార్థయుక్తం, వాక్యం-శిల్పం (చ)-కర్మ-రూపం (వా), తత్, సర్వం, అద్భుతరసే, విభావరూపం (హి), విజ్ఞేయమ్ =ఏవి, అతి శయ- అర్థంతో కూడిన వాక్యాలు, ప్రశస్త కర్మాత్మకాలైన శిల్పాలు, అత్యు త్కృష్టాలైన కర్మలు రూపాలు అవుతాయో, అవి అన్నీ అద్భుతరసమందలి, విభావాలు (అని) తెలియాలి.

తస్య, అభినయః = దానియొక్క అభినయం, స్పర్శగ్రహ-ఉల్లుకసనైః, హాహాకారైః (చ), సాధువాదైః (చ), వేపథు-గద్గదవచనైః, స్వేద-ఆద్యైః = స్పర్శగ్రహణం, ఉల్లుకసనం (= శరీరాన్ని ఆహ్లాదపూర్వకంగా ఊర్ధ్వంగా కంపింపజేయటం), హాహాకారం, సాధువాదం, వేపథువు, గద్గదవచనాలు, స్వేదం- మున్నగువానిచేత (చేయాలి).

వీరస్య(-అపిచ),యత్ కర్మ, సః, అద్భుతః, పరికీర్తితః = వీరం యొక్క, ఏకర్మ కలదో, అది అద్భుతం (అని), చెప్పబడింది (వీరరసం నుంచి అద్భుతరసం జనిస్తుందని ఇంతకుముందే చెప్పబడింది).

అద్భుతః, పీతః (చ-ఏవ) = అద్భుతం, పీత (= పసుపు) వర్ణం కలది.

అద్భుతః, బ్రహ్మదైవతః = అద్భుతం, బ్రహ్మ అధిదైవంగా కలది.

అద్భుతఃరసః, ద్విధా-ఆఖ్యాతః—దివ్యః (చ), ఆనందజః (చ-ఏవ) = అద్భుతరస(మందు) రెండు భేదాలు చెప్పబడినవి-దివ్యం, ఆనందజం.

దివ్యదర్శనజః, దివ్యః, హర్షాత్, ఆనందజః, స్మృతః = దివ్యదర్శనం వల్ల జనించేది దివ్యం; హర్షం వల్ల జనించేది,ఆనందజం (అని) చెప్పబడినది.

తాత్పర్యం : అద్భుతరసం విస్మయ స్థాయిభావాత్మకం.

విభావాలు : దివ్యజనదర్శనం, ఈప్సితమనోరథావాప్తి, ఉపవన-దేవకులాది గమనం, సభా-విమాన- మాయ-ఇంద్రజాల సంభావనాదులు.

అనుభావాలు : నయనవిస్తారం, అనిమేషప్రేక్షణం, రోమాంచం, అశ్రువు, స్వేదం, హర్షం, సాధువాదం, దానం, హాహాకారం, బాహు-వదన-చేల-అంగుళి భ్రమణం మున్నగునవి.

భావాలు : స్తంభం, అశ్రువు, స్వేదం, గద్గదత, రోమాంచం, ఆవేగం, సంభ్రమం, జడత, ప్రలయం మున్నగునవి.

ఇచ్చట రెండు ఆర్యలు కలవు :

అతిశయార్థయుక్తాలైన వాక్యాలు, ప్రశస్తకర్మాత్మకములైన శిల్పాలు, అత్యుత్కృష్టాలైన కర్మలు రూపాలు- ఇవి అద్భుతరసానికి విభావాలు. స్పర్శ, గ్రహణం, ఉల్లుకసనం, హాహాకారం, సాధువాదం, వేపథువు, గద్గదవచనాలు, స్వేదం మున్నగువానిచేత అద్భుతరసాన్ని అభినయించాలి.

వీరకర్మయొక్క ఫలమే అద్భుతం.

అద్భుతం పీతవర్ణం కలది. అద్భుతం బ్రహ్మ అధిదైవంగా కలది.

దివ్యం, ఆనందజం అనే భేదాలచేత అద్భుతం రెండు విధాలు : దివ్యదర్శనం వల్ల జనించేది దివ్యం, హర్షం వల్ల జనించేది ఆనందజం.

టీక : 1. రూపకాంతమందు (అనగా నిర్వహణ సంధిలో) అద్భుతరసం ఉండాలని భరతవచనం. మాయ అంటే రూపపరివర్తనం. ఇంద్రజాలమునేది సంభవించని వస్తువులను ప్రత్యక్షంగా చూపటం. ఆహ్లాదాతిశయంతో, శరీరాన్ని ఊర్ధ్వంగా విక్షేపించటం ఉల్లుకసనం.

2. భరతరసప్రకరణకర్త అద్భుతరసాన్ని ఇట్లా వివరించినాడు :

విభావ-అనుభావ-సాత్త్వికభావ-వ్యభిచారి భావాల సామాన్యగుణయోగం చేత సదస్యుల యందు అస్వాద్యత్వం పొందిన విస్మయస్థాయిభావం అద్భుతరసమనబడుతుంది.

అద్భుతరసంలో :

ఆలంబనాలు : అశక్యమయిన వస్తువు లభించటం, అతిమానుష మయిన కర్మ జరగటం, కాంతిచేత మాత్రమే గుర్తింపదగిన గంధర్వనగరాదులను ప్రత్యక్షంగా చూడటం.

అనుభావాలు : ప్రసన్నముఖరాగం, అక్షివిస్తారం, నిర్నిమేషత్వం, శిరః కపోలచలనాలు.

సాత్త్వికభావాలు : స్తంభాదులు (స్తంభం, స్వేదం, రోమాంచం, గద్గదస్వరం).

వ్యభిచారిభావాలు : వితర్కం, చపలత, ఆవేగం, హర్షం, జడత, విస్మయం, స్మృతి.

3. విస్మయం యొక్క సమ్యక్సమృద్ధి లేదా సర్వేంద్రియాల తాటస్థ్యం అద్భుతమని నిర్వచించి, అది స్వనిష్ఠ-పరనిష్ఠ భేదాలచేత ద్వివిధమని చెప్పి ఉదాహరణలొసంగినాడు రసతరంగిణీకర్త.

అంతేకాదు, అత్యుక్తి, భ్రమోక్తి, చిత్రోక్తి, విరోధాభాసం మున్నగునవి అద్భుతంలో అంతర్గతములే అని చెప్పి, వానికి కూడా ఉదాహరణలొసంగినాడు.

4. శారదాతనయుడు క్రింది విధంగా వివరించినాడు (భా.ప్ర. III-80-85, 129-133) :

అద్భుతం విస్మయాత్మకం, ఇది సమప్రకృతికం. మానవుల అతిశయకర్మ విశేషాలు, అద్భుతార్థప్రాప్తి, మనోరథఫలప్రాప్తి, దివ్యపదార్థదర్శనం, విమాన-ఉద్యాన-భవన-మహాసభ- ఆరామాదులను దర్శించటం, విరుద్ధ పదార్థాలకు అవిరుద్ధ సమాగమం, అసంభావ్యార్థముల సంభవం, దేశకాలాతీతవిధానాలు, అచింతితంగా అభీష్టార్థసిద్ధి - ఇవి ఇందలి విభావాలు.

స్తంభం, వేపథువు, రోమాంచం, స్వరభంగం, అశ్రువు - ఇవి ఇందలి సాత్త్వికభావాలు.

శృంగారంలో ఉపయుక్తములయ్యే వ్యభిచారిభావాలు ఇందులో కూడా ఉంటాయి.

అద్భుతం మూడు విధాలు : మానసం, ఆంగికం, వాచికం. ధ్యానం, నేత్రాలు విప్పారటం, వదనంలో చూపులలో ప్రసన్నత, ఆనందబాష్పాలు, రోమాంచం, నిర్నిమేషావలోకనం, మనస్సు నిశ్చలంగా ఉండటం - ఇవి మానసాద్భుత విశేషాలు. పైటకొంగు త్రిప్పటం, వ్రేళులు త్రిప్పటం, వేచివేచి ఎగరటం, దానం, నటన, పరస్పరాశ్లేషం, భుజాల ఆస్ఫాలనం, పరస్పరకరతలాహతి - ఇవి ఆంగికాద్భుతమందలి విశేషాలు.

హాహాకారం, సాధువాదం, కపోలాస్ఫాలన ధ్వని, పెద్దగా నవ్వటం, హర్ష ఘోషాలు, గీతం, పెద్దగా మాటాడటం - ఇవి వాచికాద్భుతమందలి విశేషాలు.

5. అద్భుతరసమందలి గతి :

విస్మయహర్షాదులందు మధ్యమ-అధమ ప్రకృతుల గతి విక్షిప్త పద విన్యాసంగా ఉంటుంది (= వ్యాకులపాటుతో ఇటునటు ద్రుత-బహుళంగా తిరగటం) (ఇచ్చట హర్షంతో పాటు విస్మయాన్ని కూడా వ్యభిచారి భావంగా పేర్కొన్నాడు అభినవగుప్తుడు), గాత్రాలింగనం, సస్మితనేత్రాలు, ఉల్లుకసనం అనేవానిచేత పురుషుడు; అకస్మికంగా కలిగిన రోమాంచంతో, ఆనందబాష్పాలతో నిండిన కనులతో, సస్మిత వాక్యాలతో ప్రీతిపూర్వకంగా స్త్రీ-హర్షాన్ని ప్రకటించాలి (నా.శా. XXII -59-60).

అద్భుతరసాభాసం :

లోకోత్తర విషయాలు కాని వానిని చూచి కూడా విస్మయంపడటం అద్భుతాభాసమవుతుంది. స్త్రీ శిశువును కనటం, చెట్టు కాయలుకాయటం మున్నగు వానిని చూచి కూడా విస్మయంపడటం ఇందులకు ఉదాహరణలు.

# 9. శాంతం

మూలం : [శాంతోనామ శమస్థాయిభావాత్మకో మోక్ష ప్రవర్తకః. స తు తత్త్వజ్ఞాన వైరాగ్యాశయ శుద్ధ్యాదిభిః విభావైః సముత్పద్యతే. తస్య యమ నియ మాధ్యాత్మ ధ్యాన ధారణోపాసన సర్వ భూతదయా లింగగ్రహణాదిభిః అనుభావైః అభినయః ప్రయోక్తవ్యః. వ్యభిచారిణశ్చాస్య నిర్వేద స్మృతి ధృతి సర్వాశ్రమశౌచ స్తంభ రోమాంచాదయః.

అత్రార్యాః శ్లోకాశ్చభవంతి -
మోక్షాధ్యాత్మ సముత్థ స్తత్త్వజ్ఞానార్థహేతు సంయుక్తః ।
నైఃశ్రేయసోపదిష్టః శాంతరసోనామ సంభవతి ॥
బుద్ధీంద్రియ కర్మేంద్రియ సంరోధాధ్యాత్మసంస్థితోపేతః ।
సర్వప్రాణిసుఖహితః శాంతరసో నామ విజ్ఞేయః ॥
న యత్ర దుఃఖం న సుఖం న ద్వేషో నాపి మత్సరః ।
సమః సర్వేషు భూతేషు స శాంతః ప్రథితో రసః ॥
భావా వికారా రత్యాద్యాః శాంతస్తు ప్రకృతిర్మతః ।
వికారః ప్రకృతే ర్జాతః పునస్తత్రైవలీయతే ॥
స్వంస్వం నిమిత్తమాసాద్య శాంతాద్భావః ప్రవర్తతే ।
పున ర్నిమిత్తాపాయే చ శాంత ఏవోపలీయతే] ॥
-(నా.శా.VI-చివరిభాగం)

అర్థం : శాంతఃనామ, శమస్థాయి భావాత్మకః, మోక్షప్రవర్తకః = శాంత(రసం) అనేది, శమం స్థాయి భావంగా కలది, మోక్షమునందు ఆసక్తి కలిగించేది. సః (తు), తత్త్వజ్ఞాన, వైరాగ్య, ఆశయశుద్ధి-ఆదిభిః, విభావైః, సముత్పద్యతే = అది (= శాంతరసం), తత్త్వజ్ఞానం, వైరాగ్యం, ఆశయ (= చిత్త) శుద్ధి, మున్నగు విభావాల వల్ల, ఉత్పన్నమవుతుంది.

యమ, నియమ, అధ్యాత్మ, ధ్యాన, ధారణ, ఉపాసన, సర్వభూత దయా, లింగగ్రహణ-ఆదిభిః, అనుభావైః, తస్య, అభినయః, ప్రయోక్తవ్యః = యమ-నియమాలు, అధ్యాత్మజ్ఞానం, ధ్యానం, ధారణం, ఉపాసన, సర్వ భూతదయ, లింగగ్రహణం (= యతివేషధారణం) మున్నగు అనుభావాల చేత, దానియొక్క అభినయం చేయాలి.

అన్య-వ్యభిచారిణః (చ) - నిర్వేద, స్మృతి, ధృతి, సర్వాశ్రమ-శౌచ, స్తంభ, రోమాంచ-ఆదయః = దానియొక్క వ్యభిచారి భావాలు -నిర్వేదం, స్మృతి, ధృతి, సర్వాశ్రమములందు పవిత్రత, స్తంభం, రోమాంచం మున్నగు నవి.

అత్ర-ఆర్యాః, శ్లోకాః (చ) భవంతి = ఇచ్చట, ఆర్యలు, శ్లోకాలు కలవు.

మోక్ష-అధ్యాత్మ, సముత్థః, తత్త్వజ్ఞాన -అర్థహేతు సంయుక్తః, నైఃశ్రే యస-ఉపదిష్టః, శాంతరసః నామ, సంభవతి = మోక్షప్రాప్తికి సంబంధిం చిన ఆధ్యాత్మిక జ్ఞానం నుంచి పుట్టినది, తత్త్వజ్ఞానం యొక్క అర్థానికి (=

నిర్వేదానికి) హేతుభూతమైనది, మోక్షజ్ఞానానికి సంబంధించిన ఉపదేశాలతో కూడినది - శాంతరసం అవుతుంది.

బుద్ధి-ఇంద్రియ-కర్మ-ఇంద్రియ-సంరోధాత్, అధ్యాత్మ సంస్థిత-ఉపేతః, శాంతరసః, నామ విజ్ఞేయః = బుద్ధి (= జ్ఞాన) ఇంద్రియ-కర్మేంద్రియాలను సంయమనం చేయటం వల్ల, పరమాత్మయందు మనస్సు లగ్నం చేయటంతో కూడినది, సర్వప్రాణిహితరూపంగా ఉండేది శాంతరసం అని తెలియాలి.

యత్ర దుఃఖం న, సుఖం న, ద్వేషః న, మత్సరః -అపి న, సర్వేషు భూతేషు సమః, సః, శాంతరసః, ప్రథితః = ఎందు దుఃఖం లేదో, సుఖం లేదో, ద్వేషం లేదో, మాత్సర్యం కూడా లేదో, ఎందు సర్వభూతములందు సమభావమే కలదో, అది శాంతరసం (అని) ప్రసిద్ధం.

శాంతః (తు), ప్రకృతిః, రతి -ఆద్యాః భావాః వికారాః, మతః = శాంతం ప్రకృతి (= ఉత్పత్తిస్థానం), రతి మున్నగు భావాలు దాని వికారాలు (అని) సిద్ధాంతం.

వికారః, ప్రకృతేఃజాతః, పునః, తత్ర-ఏవ, లీయతే = వికారం, ప్రకృతి నుంచి జనిస్తుంది, మరల, అందేలీనమవుతుంది.

స్వంస్వం నిమిత్తం-ఆసాద్య, భావః, శాంతాత్ ప్రవర్తతే = తమ తమ నిమిత్తాలు కారణంగా, భావాలు (= రత్యాదిభావాలు) శాతం నుంచి ఉత్పన్న మవుతాయి. పునః, నిమిత్త-అపాయే (చ) శాంతః, ఏవ, ఉపలీయతే = మరల, నిమిత్తాలు నశించగానే, శాంతమందే, లీనమవుతాయి.

తాత్పర్యం : శాంతరసం శమస్థాయి భావాత్మకం, మోక్ష ప్రవర్తకం.

విభావాలు : తత్త్వజ్ఞానం, వైరాగ్యం, చిత్తశుద్ధి మున్నగునవి.

అనుభావాలు : యమ-నియమాలు, అధ్యాత్మం, ధ్యానం, ధారణం, ఉపాసన, సర్వభూతదయ, లింగగ్రహణం మున్నగునవి.

వ్యభిచారిభావాలు : నిర్వేదం, స్మృతి, ధృతి, సర్వాశ్రమశౌచం, స్తంభం, రోమాంచం మున్నగునవి.

ఇచ్చట ఆర్యలు, శ్లోకాలు ఉన్నవి :

మోక్షప్రాప్తికి సంబంధించిన ఆధ్యాత్మిక జ్ఞానం నుంచి పుట్టినది, తత్త్వ జ్ఞానం యొక్క అర్థానికి హేతుభూతమైనది, మోక్షజ్ఞానానికి సంబంధించిన

ఉపదేశాలతో కూడినది శాంతరసం అవుతుంది. బుద్ధీంద్రియ కర్మేంద్రియా లను సంయమనం చేయటం వల్ల పరమాత్మయందు మనస్సు లగ్నంచేయ టంతో కూడినదై సర్వప్రాణి హితరూపంగా ఉండేది శాంతరసం.

ఎచ్చట దుఃఖం కాని, సుఖం కాని, ద్వేషం కాని, మాత్సర్యం కాని లేవో, ఎందు సర్వభూతములందును సమభావమే కలదో అచ్చటశాంత రసం ఉన్నదని తెలియవలెను. శాంతం ప్రకృతి, దాని వికారాలే రత్యాదులు; వికారం ప్రకృతినుంచి జన్మించి, మరల అందేలీనమవుతుంది. తమతమ నిమి త్తాలు కారణంగా, రత్యాదిభావాలు శాంతంనుంచి ఉత్పన్నమై, ఆ నిమిత్తాలు నశించగానే మరల ఆ శాంతమందే లీనమవుతాయి.

టీక : శృంగార-హాస్య-కరుణా-రౌద్ర-వీర-భయానకాః ।
బీభ-త్సాద్భుత సంజ్ఞే చేత్యష్టౌ నాట్యే రసాః స్మృతాః ॥
-(నా.శా. VI-15).

ఇది నాట్యశాస్త్ర పాఠం. రసాలు ఎనిమిదే అని నాట్యశాస్త్రం స్పష్టం చేస్తు న్నది. "మునినా భరతేన యః ప్రయోగో భవతీ ష్వష్టరసాశ్రయో నిబద్ధః" అని విక్రమోర్వశీయంలో కాళిదాసు అష్టరసాలనే పేర్కొన్నాడు. "శివే శృంగారార్ద్రా . . . . . " అనే సౌందర్యలహరి శ్లోకంలో కూడా ఆదిశంకరులు ఎనిమిది రసాలనే వివరించినారు. కాని, భరతుని తరువాతి వారు శాంతమును తొమ్మిదవ రసంగా పరిగణించి, రెండవ పాదాన్ని క్రింది విధంగా పఠించారు- "బీభత్సాద్భుత శాంతాశ్చనవనాట్యేరసాః స్మృతాః". అయితే భరతముని అష్టరసవాది అన్నది సుప్రసిద్ధం. అందుచేత ఆయన శాంతరసాన్ని గ్రహించి, వివరించలేదనటం స్పష్టం. భరతముని దృష్టి- ముఖరాగాదులను, స్వర-లయ-గుణ-అలంకారాదులను ఎనిమిది రసములకే పేర్కొన్నాడు. అంతేకాదు, వర్ణదైవతాలను చెప్పినప్పుడు, ప్రధాన-జన్యరసాలను వివరించినప్పుడు శాంతరస ప్రసక్తి లేనేలేదు. శాంతమును 9 వ రసంగా స్థాపించినవారిలో ధ్వన్యాలోకకర్తయగు ఆనందవర్ధనుడు ప్రధానుడు; ఈయన తన వాదానికి అనుకూలములైన వాక్యాలను నాట్యశాస్త్రంనుంచి ఉదాహరించలేదు. కావున భరతముని శాంతరసాన్ని పరిగ్రహించలేదనటం నిశ్చయం.

కానీ, నాట్యశాస్త్ర ప్రథమాధ్యాయంలో, నాట్యస్వరూపవివరణసందర్భంలో, 'క్వచిత్ శమః' అనీ, "తుష్యంతి . . . . మోక్షేష్వథ విరాగిణః" అని 27 వ అధ్యాయంలోనూ ఉండటం చేత భరతముని పరోక్షమార్గంలో

శాంతరసాన్ని అంగీకరించినట్లే అని శాంతరసవాదులు తమ ప్రతిపాదనను సమర్థించుకొన్నారు. అంతేకాదు, ఇతిహాస-పురాణ-శబ్దకోశాదులలో శాంతం రసంగా అంగీకృతమైంది. మహాభారతం శాంతరస ప్రధానమని విశ్వసింపబడుతున్నది. దీనిని బట్టి కావ్యంలో శాంతరసం అంగీకార్యమైనా, నాట్యంలో దానికి స్థానం లేదని ధనంజయాదు లభిప్రాయపడినారు. కాని ఈ అభిప్రాయాన్ని ధ్వన్యాలోకకర్త అయిన ఆనందవర్ధనుడు, నాట్యశాస్త్ర-ధ్వన్యాలోకాలను వ్యాఖ్యానించిన అభినవగుప్తుడు అంగీకరించలేదు. ప్రబోధచంద్రోదయం వంటి రూపకాలు శాంతరసప్రధానములు కావటం వీరి వాదానికి బలం చేకూరుస్తున్నది.

ఆత్మస్వరూప ప్రాప్తి లక్షణమైన మోక్షంలో ఆసక్తి కలిగించే శాంతమునందు రసత్వపోషకాలయిన వ్యభిచార్యాది భావాలు ఎట్లా ఉంటాయన్న ప్రశ్న ఉదయించవచ్చు. కానీ, నిర్వికారస్థితి గల శాంతమునందు కూడా ఉపాధివశాన వికారాలు (= భావాలు) జనిస్తూ ఉంటాయి. ఆ ఉపాధి నశించగానే అవి కూడా నశిస్తూ ఉంటాయి. అందుచేత, శాంతమునందు కూడా సర్వభావాలు సంభావ్యములవుతున్నవి. అందుచేతనే ఇది రత్యాదిభావాలకు 'ప్రకృతి' అని చెప్పబడినది.

జగన్నాథపండితుడు రసగంగాధరంలో శాంతరసాన్ని క్రింది విధంగా వివరించినాడు :

"శాంతమునకు అనిత్యమని తెలిసిన జగత్తు ఆలంబనం. వేదాంతం వినటం, తపోవనాలను తాపసులను దర్శించటం మున్నగునవి ఉద్దీపనాలు. ప్రాపంచిక విషయములందు రుచితప్పటం, శత్రుమిత్రుల యందు ఉదాసీనంగా ఉండటం, ఏమీ చేయకుండా ఉండటం, ముక్కు చివర చూపు నిలిపి ఉండటం మున్నగునవి అనుభావాలు. హర్షం, ఉన్మాదం, స్మృతి, మతి మున్నగునవి వ్యభిచారిభావాలు."

శాంతరస స్థాపనమందు శాంతరసవాదులలో ఏకవాక్యత ఉన్నప్పటికీ, స్థాయిభావవిషయంలో మాత్రం ఏకవాక్యతలేదు. భరతముని భావాలు 49 అని నిర్ణయించివేసినాడు. అందుచేత ఇంకొక క్రొత్త భావాన్ని సృష్టించటానికి ఇష్టపడక, వ్యభిచారిభావాలలో మొదటిదైన నిర్వేదాన్ని శాంతరసానికి స్థాయిభావంగా కొందరు నిర్ణయించినారు. అభినవగుప్తునకు పూర్వులు 'శమము' ను స్థాయిభావంగా గ్రహించారు; ఈ పాఠమే నాట్యశాస్త్రమందు కుంఠితీకరణములందున్నవి. శమ- శాంతములు రెండును పర్యాయపదములని కొందరభిప్రాయపడినారు. రుద్రటుడు సమ్యక్ జ్ఞానాన్నిస్థాయిగా అంగీకరించగా, భోజుడు ధృతిని స్థాయిగా

గ్రహించినాడు. కొందరు జుగుప్సను చెప్పగా, మరికొందరు ఇంకో కొన్ని భావాలు చెప్పినారు. ఇంకా కొందరు రత్యాదిభావాలన్నీ కలిసి శాంతానికి స్థాయిభావం అవుతాయన్నారు. ఈ వాదాలన్నింటిని విమర్శించి, 'తత్త్వజ్ఞానం' శాంతానికి స్థాయిభావం అని అభినవగుప్తుడు నిర్ణయించినాడు.

శాంతరస గతి :

వణిజుల, సచివుల గతి సహజంగా (ఆవేశరహితంగా) ఉండాలి. రెండు తాలముల ఎడంగల పాదాలతో, అతిక్రాంత చారిని ఆచరించాలి. కటకాముఖ వామహస్తాన్ని వెలికిలగా బొడ్డుమీదను, అరాల దక్షిణహస్తాన్ని వెలికిలగా ఒక పార్శ్వమందును ఉంచాలి. గాత్రం, విషణ్ణం, స్తబ్ధం, పరివాహితం (అధికంగా ఊగటం) కారాదు.

యతులు, శ్రమణులు, తాపసులు, నైష్ఠిక బ్రహ్మచారులు మొదలగు వారి గతి క్రింది విధంగా ఉండాలి - చాంచల్యం లేని నేత్రాలు, 4 హస్తాల దూరం మాత్రమే ప్రసరించే చూపులు, హఠాత్తుగా ఏదో సంస్కారం వల్ల కలిగిన స్మృతి, ఏకాగ్రత, వినీతవేషం, కాషాయవస్త్రాలు, నియతములైన చిహ్నాలు (జటా-భస్మ-కాపీనాదులు) కలిగిన వారై మొదట సమపాద స్థానమందు నిల్చి, ఒక హస్తాన్ని చతురహస్తంగా చేసి, రెండవ హస్తాన్ని చాచాలి.

ప్రయోగానురూపంగా ముఖాన్ని ప్రసన్నం చేసి, అనిషణ్ణగాత్రంతో అతిక్రాంత చారిని ఆచరించాలి. ఉత్తమవ్రతస్థులైన వారిగతి పై విధంగానే ఉండాలి. కపటవ్రతస్థుల విషయంలో పై గుణాలు విపరీతాలుగా ఉంటాయి. ఇంక ఇతర వ్రతస్థుల (ఆగమాదులయందు కన్పట్టే ఉన్మత్తాది వ్రతస్థుల) గతి తత్తద్వ్రతోచితమై విభ్రాంతోదాత్తం, లేదా విభ్రాంతనిభృతం కావాలి. పాశుపతులగతి శకటాస్య-అతిక్రాంత చారులతో ఉద్ధతంగా ఉంటుంది. (నా.శా. XII-76-86)

ఇది శాంతరసమందలి అభినయమని మూలమందు స్పష్టంగా లేదు. కాని వణిజాదుల, యతిప్రభృతుల గతులు శాంతరసానికి సంబంధించినవని, అంతస్సంస్కారం గల వీరందరు నాటకాదులందు శాంతరసప్రధానులుగానే కన్పట్టుతున్నారని అభినవగుప్తుడు నిర్దేశించినాడు. (అభినవభారతి -2 వ సంపుట- 148).

ఉదా : దేవతావిషయరతి :

కదా వారాణస్యా మిహ సురధునీరోధసి వసన్
వసానః కౌపీనం శిరసి నిదధానోఽఞ్జలి పుటం

'అయే, గౌరీనాథ, త్రిపురహర, శమ్భో, త్రినయన,
ప్రసీ, దేతి క్రోశ న్నిమిష మివ నేష్యామి దివసాన్ ॥

— 'ఎప్పుడు వారాణసిలో సుర నది యొడ్డున ఇట వసించుతూ, కౌపీనముం దాల్చినవాడనై, శిరమున అంజలి పుటముం జేర్చుకొని 'ఓయి గౌరీనాథుడా, త్రిపురహారుడా, శంభుడా, త్రినయనుడా, కరుణింపుము' అని మొఱయిడుచు దినము లను నిముషములుగా గడపెదనో!'

కాశీఖండంలోని "ఆనందంబున, అర్ధరాత్రమున..." అనే శ్రీనాథుని పద్యం ఇప్పట్ల స్మరణార్హం.

రసతరంగిణీకర్త భానుదత్తుని వివరణ ఇట్లా ఉన్నది :

నాట్యంకంటె భిన్నములైన కావ్యములందు నిర్వేదం స్థాయిభావం గాకల

శాంతరసం ఉంటుంది; ఇది తొమ్మిదవ రసం. నిర్వేదం యొక్క పరిపోషం లేదా దోషప్రశమనం శాంతమవుతుంది (కామ-క్రోధాదులు దోషాలు).

శాంతరసాభాసం :

శాంతం ఉత్తమ ప్రకృతికం; ఇది నీచప్రకృతినిష్ఠంకావటం శాంతాభాసమవుతుంది.

నాగానంద నాటకాన్ని శాంతరసప్రధానంగా కొందరు పేర్కొన్నారు. కాని, అందలి నాయకునకు, నాటకాంతమందు, రాజ్యప్రాప్తి, రమణీభోగం కలుగటం వల్ల, అది శాంతరసప్రధానం కాజాలదు.

## 10. కొన్ని నూత్నరసాలు

*(1)* ప్రేయోరసం :

మూలం : స్నేహ ప్రకృతిః ప్రేయాన్ సంగతశీలార్థ నాయకో భవతి ।
స్నేహస్తు సాహచర్యాత్ ప్రకృతే రుపచారసంబంధాత్ ॥
నిర్వ్యాజమనోవృత్తిః స నర్మ సద్భావపేశలాలాపః ।
అన్యోన్యం ప్రతి సుహృదోర్వ్యవహారో౽యం మత స్తత్ర ॥
ప్రస్యంది ప్రమదాశ్రుః సుస్నిగ్ధ స్ఫారలోచనాలోకః ।
అర్ద్రాంతఃకరణతయా స్నేహపదే భవతి సర్వత్ర ॥

-(కావ్యాలంకారం- XV-17-19)

తాత్పర్యం : విభావం : స్నేహం ప్రకృతి (= స్థాయి) గా కలది ప్రేయస్సు. సంగతశీలుడు నాయకుడుగా ఉంటాడు. స్నేహం సాహచర్యం వల్ల, ఉపచార సంబంధం వల్ల కలుగుతుంది.

అనుభావాలు : నిర్వ్యాజమైనమనోవృత్తి, నర్మ-సద్భావ యుక్తమైన పేశ లాలాపాలు - ఇవి సుహృత్తుల వ్యవహారంలో అన్యోన్యం ఉంటాయి. ప్రమదాశ్రువులు కారటం, స్నిగ్ధములు విస్ఫారితవి అయిన చూపులు, ఆర్ద్రమైన అంతఃకరణం- ఇవి స్నేహమందు సర్వత్ర ఉంటాయి.

టీక : "దశమో రసః ప్రేయాన్" అంటూ రుద్రటుడు తన కావ్యాలంకారంలో ప్రేయస్సును పదియవరసంగా ప్రతిపాదించినాడు. ప్రేయోరసానికి 'స్నేహం' స్థాయిభావం అన్నాడు. స్నేహం, సాహచర్యంవల్ల స్థిరపడుతుంది. కాగా, 'సుహృత్తుల అన్యోన్య వ్యవహారం ప్రేయస్సు' అని రుద్రటుని సిద్ధాంతం.

అయితే, కొందరు రుద్రటుడు స్థాయిభావంగా పేర్కొన్న స్నేహాన్నే రసంగా భావించి, దానికి ఆర్ద్రతను స్థాయిభావంగా పేర్కొన్నారు. కాని అభినవగుప్తుడు స్నేహాన్ని ఇతర రసాలలో అంతర్భావింపజేసినాడు.

*(2)* వత్సలరసం :

"అథ మునీంద్ర సమ్మతో వత్సలో రసః" అంటూ విశ్వనాథుడు 'వత్సలరసము' ను పదియవరసంగా ప్రతిపాదించినాడు.

మూలం : స్ఫుటం చమత్కారితయా వత్సలం చ రసం విదుః ।
స్థాయీ వత్సలతా స్నేహః పుత్రాద్యాలంబనం మతమ్ ॥
ఉద్దీపనాని తచ్చేష్టా విద్యా శౌర్యదయాదయః ।
ఆలింగనాంగసంస్పర్శ శిరశ్చుంబన మీక్షణమ్ ॥
పులకానందబాష్పాద్యా అనుభావాః ప్రకీర్తితాః ।
సంచారిణోఽనిష్టశంకా హర్షగర్వాదయో మతాః ॥
పద్మగర్భచ్ఛవిర్వర్ణో దైవతం లోకమాతరః ॥

-(సా.ద.III-235)

తాత్పర్యం : చమత్కారం స్ఫుటంగా ఉండటం చేత వత్సలమును కూడ రసంగా భావిస్తారు. దానికి స్థాయిభావం స్నేహం.

ఆలంబనం : పుత్రాదులు.

ఉద్దీపనాలు : పుత్రాదుల చేష్టలు—విద్య, శౌర్యం, దయ మున్నగునవి.

అనుభావాలు : ఆలింగనం, శరీరం తడవటం, శిరస్సు మూర్కొనటం, ఆర్ద్రవీక్షణం, పులకలు, ఆనందబాష్పాలు మున్నగునవి.

సంచారులు : అనిష్టశంక, హర్షం, గర్వం మున్నగునవి

వర్ణం : పద్మంలోపలి కాంతి.

దైవతం : లోకమాతలు.

టీక : నా.శా. 17 వ అధ్యాయంలో పాఠ్యాలంకారములైన వర్ణాలను వివరించేటప్పుడు "కరుణ- బీభత్స-భయానకములందు అనుదాత్త-స్వరిత-కంపిత వర్ణములతో పాఠ్యమును ప్రయోగించాలి" అనే అభినవగుప్తుని (= బరోడాముద్రణ) పాఠమునకు బదులు "కరుణ-వాత్సల్య- భయానకములందు . . . . . " అని కాశీ-బొంబాయి ముద్రణముల పాఠం. బహుశః ఈః పాఠం విశ్వనాథుని ప్రతిపాదనకు ఆకరమై ఉంటుంది. విశ్వనాథుడు వత్సలరసానికి వర్ణదైవతాలను కూడా కల్పించినాడు!

ఉదా : పుత్రగతమైన వాత్సల్యం :

యదాహ ధాత్ర్యా ప్రథమోదితం వచో
యయౌ తదీయా మవలమ్బ్య చాఙ్గులిం ।
అభూచ్చ నమ్రః ప్రణిపాత శిక్షయా
పితుర్ముదం తేన తతాన సోఽర్భకః ॥ -(ర.వం.III-25)

— 'అయర్భకుడు దాది మొదట పలికిన మాటను పలికి, దాని వ్రేలింబట్టుకొని నడచి, ప్రణమిల్ల నేర్పినప్పుడు వంగి తండ్రికి మోదం పెంచినాడు.

భ్రాతృగతమైన వాత్సల్యం :

దేశే దేశే కలత్రాణి దేశే దేశే బాంధవాః ।
తంతుదేశం న పశ్యామి యత్ర భ్రాతా సహోదరః ॥

— "దేశ దేశములందును కళత్రములు లభించవచ్చు. దేశదేశము లందును బంధువులు దొరకవచ్చు. కాని సహోదరుడుగల దేశం మాత్రం కానరాదు" (మూర్ఛచెందిన లక్ష్మణుని గూర్చి శ్రీరాముని వేదన).

కానీ, ఇది రసం కాజాలదనీ, ఇది కేవలం భావం మాత్రమే అని జగన్నాథుడు పేర్కొన్నాడు.

(3) భక్తి రసం :

భగవద్గీతలోని 18 అధ్యాయాలను స్థూలంగా మూడు భాగాలుగా విభజిస్తారు - మొదటి ఆరు అధ్యాయాలు కర్మషట్కం, తరువాతి ఆరు అధ్యాయాలు భక్తిషట్కం. చివరి ఆరు అధ్యాయాలు జ్ఞాన షట్కం. భక్తిషట్కంలో చివరి అధ్యాయం అంటే 12 వ అధ్యాయానికి 'భక్తియోగం' అని పేరు. ఎటువంటి భక్తుడు తనకు ప్రియమైనవాడో, శ్రీకృష్ణుడు ఈ అధ్యాయం చివర వివరించినాడు.

నారద భక్తిసూత్రాలలో భగవంతుని యందు 'పరమప్రేమరూపం' భక్తిగా నిర్వచింపబడింది. శాండిల్య భక్తి సూత్రాలలో భగవంతునియందు 'పరానురక్తి' భక్తిగా నిర్వచింపబడింది.

భాగవతప్రారంభంలో ఇట్లా చెప్పబడింది :

నిగమకల్పతరో ర్గలితం ఫలం శుకముఖా దమృతద్రవసంయుతమ్ ।
పిబత భాగవతం రసమాలయం ముహు రహో రసికా భువి భావుకాః ॥

దీనికి బమ్మెర పోతన్నగారి అనువాదం ఇట్లా సాగింది :

వేదకల్పవృక్ష విగలితమై, శుక
ముఖసుధాద్రవమున మొనసియున్న
భాగవతపురాణఫలరసాస్వాదన
పదవిఁ గనుడు రసికభావవిదులు.

అంతేకాదు భాగవతంలో నవవిధభక్తులు వివరింపబడినవి :

శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్ ।
అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మనివేదనమ్ ॥

- (భాగ.VII-5-23)

పెక్కుచోట్ల భక్తియొక్క మహత్తు విశదీకరింపబడింది.

"అశనం గరళం ఫణీ కలాపో, వసనం చర్మ చ వాహనం మహోక్షః ।
మమ దాస్యసి కిం కిమస్తి శంభో, తవ పాదాంబుజ భక్తిమేవ దేహి ॥

అని శివానందలహరిలో (87 శ్లో) ఆదిశంకరులు అర్థించినారు.

ఇన్ని విధాలుగా భక్తియొక్క ప్రాధాన్యం వర్ణింపబడినప్పటికీ అలంకారికులు భక్తిని రసంగా గ్రహించటానికి వెనుకాడినారు; ఇందుకు కారణాలిట్లా ఉన్నాయి.

1. భరతముని భక్తిని రసంగా పేర్కొనలేదు.

2. భక్తి అనేది శాంతరసంలో అంతర్భవిస్తుందని అభినవగుప్తుడు (స్మృతి, ధృతి, ఉత్సాహాలతో కూడిన భక్తి-శ్రద్ధ అనేవి ఈశ్వరప్రణిధాన విషయంలో ఇతర రసాలకు - శాంతమునకు— అంగములవుతాయే కాని రసాలు కానేరవు).

3. ధనంజయుడు పరమేశ్వరవిషయకమగు రతిని (= భక్తిని) కేవలం 'భావం' గానే పరిగణించినాడు.

4. దేవాదివిషయకమైన రతి (= భక్తి) భావమే కాని రసం కాదని మమ్మటుడు. ముని- గురు-నృపాది విషయకమైన రతి కూడా పరిపుష్టం కాక భావస్థితినే పొందుతుందని కూడా ఆదిపదం చేత సూచించినాడు.

5. జగన్నాథుడు 'భక్తిరసము' నకు తొలుత విభావానుభావవ్యభిచారి భావాలను నిరూపించి, చివరకు భరతముని వచనం ప్రమాణంగా స్వీకరించి, భక్తి; రసం కాదు పొమ్మన్నాడు. -"రసములు తొమ్మిదే అనటం ఏమిటి? భగవంతుడు ఆలంబన విభావంగా రోమాంచాశ్రుపాతాదులు అనుభావాలుగా హర్షాదులు వ్యభిచారులుగా కలిగి, భాగవతాది పురాణ శ్రవణ సమయంలో అనుభవింపబడే భక్తి, రసం ఏలకారాదు? ఇచ్చట భగవదనురాగరూపమైన రతియే స్థాయిభావం. దీనిని శాంతమందు అంతర్భవింపచేయరాదు. ఏలన, భక్తిరసమునకు స్థాయిభావం అనురాగరూపమైన రతి, శాంతరసానికి స్థాయి భావం వైరాగ్యం - ఇవి పరస్పరవిరుద్ధాలు. కాగా, భక్తి దేవతావిషయకమగు రతి కావున అది రసం కాదనీ, కేవలం భావమనీ చెప్పబడుతున్నది. అయితే భగవద్విషయకమగు రతి భావమైతే కామినీ విషయకమగు రతియు భావమే అవుతుంది, భగవద్రతిమాత్రమే భావమని తలంపనేల? స్థాయిభావములలో చెప్పబడిన రతి దేవతావిషయకమగు రతియే అని ఏల చెప్పరాదు? అది కామినీవిషయకమగు రతియే అని ఏల అనవలె? ఇట్లా అనరాదు. ఏది రసమో, ఏది భావమో అనే వ్యవస్థావిషయంలో భరతముని వచనమే ప్రమాణం."

(చూ. సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారి కావ్యాలంకార సంగ్రహవ్యాఖ్య-పుట. 308). కాగా జగన్నాథుడు భక్తిని శాంతమునందు అంతర్భవింపజేయటానికి కూడా అంగీకారం చూపలేదు. అయితే అలంకారికులలో ఇరువురు మాత్రమే భక్తికి రసత్వం అంగీకరించినారు :

(1) 'ఉజ్జ్వలనీలమణి' కర్త, వంగదేశీయుడు అయిన రూపగోస్వామి (క్రీ.శ. 1470-1554) ప్రథముడు.

భరతుడు చెప్పిన అష్టరసములను, శాంతమును మాత్రమే కాక వాత్సల్యము, ప్రేమ, భక్తి- వీనిని కూడా రసములుగా అంగీకరించినాడు రూపగోస్వామి. ప్రేమను అంగిరసంగా, శృంగారమును అంగరసంగా పేర్కొని, సర్వరసాలు సముద్రంలోని తరంగాల వలె ప్రేమమందు రసరూపంగా నిమజ్జనమవుతాయని ఆయన తలంచినాడు.

భక్తిని రసరాట్‌గా పేర్కొని, మధురం-ఉజ్జ్వలం అనే పేర్లతో భక్తిరసాన్ని విస్తరించి తెలిపినాడు. కాని ఈ భక్తి శ్రీకృష్ణగోపీ విషయుకం, శృంగారరూపం. దీనికి 'చిత్తద్రవం' స్థాయిభావం. ఇందు ఇతర శృంగారం ఉపాదేయంకాదు. మరి ఈ భక్తి, భక్తిలో ఏకదేశం మాత్రమే.

(2) 'భగవద్భక్తిరసాయనం' కర్త, పరివ్రాజకాచార్యుడు అయిన మధుసూదన సరస్వతి (క్రీ.శ.17 వ శతాబ్ది) రెండవవాడు.

మధుసూదనుడు భక్తిని పూర్ణరసంగా, ఉదాత్తమైనదిగా నిరూపించినాడు.

"అనుభవమాత్రం వలననే సాక్షాత్సుఖవిరుద్ధములైన శోక-క్రోధ-భయాదులకు రసత్వం అంగీకృతమైనప్పుడు, అనుభవసిద్ధమై, మిగిలిన రసములకన్న వేయిరెట్లు అధికంగా రస్యమానమవుతున్న భక్తి రసం కాదనటం ఎట్లా? రసకోవిదులు దేవాదివిషయకరతి రసం కాదనీ, భావమనీ చెప్పినారు. నిజానికి ఇతరదేవతావిషయకమగు రతి భావమే అవుతుంది; కారణం, వారు జీవులే కావటం చేత పరమానందం కలుగదు. పరమాత్మ స్వరూప శ్రీకృష్ణరతి పరమానందమునకు కొంపోతుంది. అంతేకాదు. కాంతాది విషయకములగు ఏ రసములందును భగవద్రతియందు వలె పూర్ణ సుఖం లేదా ఆనందం కలుగదు. కావున, వాటియందు తగినపుష్టిలేదు, అవి క్షుద్రరసాలు. భగవద్రతి పూర్ణరసం. అది, మిడుగురు పురుగులకాంతి కంటె సూర్యకాంతి ఎట్లా బలవత్తరమో అట్లే మిగిలిన రసములకన్న శ్రేష్ఠతరం, బలవత్తరం - - - - ఈ భక్తిరసమునకు ఆలంబన విభావం శ్రీకృష్ణుడు. తచ్చరిత్రలు విభావములు. భగవదాకార చిత్తవృత్తియే స్థాయిభావం; అదే భగవద్రతి. తత్కాలమున పులకనేత్రాది వికారాలు అనుభావాలు. నిర్వేద-శంకా-హర్షాదులు వ్యభిచారిభావాలు. ఇవి పరమానందస్వరూపమగు భక్తిరసంగా పరిణమిస్తాయి." (సన్నిధానం వారి కావ్యాలంకార సంగ్రహ వ్యాఖ్య-పుటలు-308-309). సంస్కృతాంధ్ర

స్తోత్రాలను, భాగవతాది పురాణాలను పరిశీలించినప్పుడు భక్తికి రసత్వమును అంగీకరించవలసిన అవశ్యకమున్నదని స్పష్టం కాగలదు. రసరాజమైన శృంగారం ఐహికంకాగా, భక్తి ఇహ-పరసాధనమవుతున్నది.

భగవద్రతినే 'మధురభక్తి' అంటారు.

భక్తికి రసత్వాన్ని అంగీకరించిన ఇరువురు అలంకారికులు విష్ణుభక్తిపరాయణులు; భక్తి సాహిత్యం నాలుగింట మూడు వంతులు విష్ణుభక్తి పరం కావటం గమనించవచ్చు.

అయితే, శంకరాచార్యులవారు భక్తిని నిర్వచించిన విధం గమనింపదగినది (శివానందలహరి-61 శ్లో.) :

అంకోలం నిజబీజ సంతతి, రయస్కాంతోపలం సూచికా
సాధ్వీనైజవిభుం, లతాక్షితిరుహం, సింధుస్సరిద్వల్లభమ్ ।
ప్రాప్నోతీహయథా తథాపశుపతేః పాదారవిందద్వయం
చేతోవృత్తిరుపేత్యతిష్ఠతి సదా సాభక్తి రిత్యుచ్యతే ॥

— ఊడుగువిత్తులు తల్లిచెట్టును, సూది సూదంటు రాయిని, కులసతి నిజవిభుని, లతలు భూరుహములను, నదులు సముద్రమును సదాచేరునట్లే, ఎవని చిత్తవృత్తి పరమేశ్వరుని పాదారవిందద్వయమును చేరి విడువకుండునో. అట్టిదానిని 'భక్తి' అని చెప్పుదురు.

*(4)* మాయారసం *:*

రసతరంగిణీకర్త అయిన భానుదత్తుడు 'మాయారసము' ను ప్రతిపాదించినాడు (సప్తమతరంగం) :

"చిత్తవృత్తి రెండు విధాలు— 1. ప్రవృత్తి, 2. నివృత్తి. నివృత్తియందు శాంతరసం వలె, ప్రవృత్తి యందు మాయారసం భాసిస్తుంది. ఒకచోట రసోత్పత్తి జరిగి, రెండవచోట జరుగదని చెప్పరాదు కదా! దీనిని రతి రూపంగా ఏల అంగీకరించరాదు? అని అంటే, ఇది దేనికి వ్యభిచారి భావ మవుతుంది? శృంగారమునకు విరోధి అయిన బీభత్సం ఇందులో గోచరిస్తుంది. అట్లాగే ఇతర రసములపట్ల కూడ ఇది ప్రసక్తం కాదు - - - - రత్యాదులు ఎనిమిది ప్రవృత్తియందే మెఱుపువలె పుట్టి, అణగుతూ ఉంటాయి. కావున, ఇవి అన్నీ మాయారసంలో వ్యభిచారిభావములు అవుతాయి. ఈ మాయారసమునకు స్థాయిభావం మిథ్యాజ్ఞానం. సాంసారికభోగం అర్జించే ధర్మ-అధర్మాలు విభావాలు. పుత్ర-కళత్ర-విజయ-సామ్రాజ్యాదులు అనుభావములు."

కావ్యవిలాసమున చిరంజీవి భట్టాచార్యుడు, రసచంద్రికలో విశ్వేశ్వరుడు మాయారస ప్రతిపాదనను ఖండించినారు. వారి ఖండన ఇట్లా ఉన్నది— ఏ స్థాయిభావం అయినా రసత్వం పొందవలెనంటే, అది విభావాదులచేత ప్రబుద్ధమై, వ్యభిచారులచేత పరిపుష్టమై, రసత్వం పొందుతుంది. మాయయే మిథ్యాజ్ఞానమునకు కారణం కాని, మిథ్యాజ్ఞానం మాయకు కారణం కాదు. కావున మాయకు స్థాయిభావమని చెప్పబడిన మిథ్యాజ్ఞానం ఎల్లప్పుడూ ప్రబుద్ధమయ్యే ఉంటుంది. ఇంక దానికి విభావానుభావ వ్యభిచారి సంయోగావస్థను వింగడించి చెప్పటమే కుదురదు. కావున మాయకు బ్రహ్మానందసబ్రహ్మచారి అయిన రసానుభూతి సిద్ధించదు.

యథాజీవః స్వభావం హి పరిత్యజ్యాన్య దేహికమ్ ।
పరభావం ప్రకురుతే పరభావం సమాశ్రితః ॥
ఏవం బుధః పరభావం సోఽస్మీతి మనసా స్మరన్ ।
ఏషాం వాగంగలీలాభిశ్చేష్టాభిస్తు సమాచరేత్ ॥

-నా.శా.XXVI-7-8

అవ్యగ్రైరింద్రియైః శుద్ధః ఉహాపోహ విశారదః ।
త్యక్తదోషో౽నురాగీచ స నాట్యేప్రేక్షకః స్మృతః ॥
యస్తుష్టౌతుష్టి మాప్నోతి శోకే శోకముపైతిచ ।
క్రోధేక్రుద్ధః భయే భీతః స శ్రేష్ఠః ప్రేక్షకః స్మృతః ॥

-నా.శా.XXVII-61-62

# రసమీమాంస

## 1. అలంకారశాస్త్రం

సంస్కృత సాహిత్య విమర్శనమునకు "అలంకారశాస్త్రం" అని పేరు. ఇది ఒక అనుపనిధి అనే సత్యం వేత్తలకు మాత్రమే సువిదితం. కాని, తత్పరిచయం లేనివారికి, అలంకారశాస్త్రమంటే అనుప్రాస-యమక-ఉపమా-రూపకాది శబ్దార్థోభయాలంకారాలను గూర్చిన వివరణ మాత్రమే అనే అభిప్రాయం కలగటం సహజం. ఓపికతో, అభిమానంతో పరిశీలిస్తే, ఆ గ్రంథాలు కేవలం బాహ్యస్వరూపాన్ని చర్చించేవి మాత్రమే కాదనీ కావ్య-నాట్యాలకు ప్రధానములైన అంతస్తత్త్వాలను వైజ్ఞానిక దృష్టితో, తార్కికంగా వివేచనచేసే శాస్త్ర గ్రంథాలనీ బోధపడగలదు. అలంకారశాస్త్రం కూడా తక్కిన భారతీయశాస్త్రాలవలెనే తర్క-న్యాయయుక్తులనే ఇనుపపునాదుల మీద నిర్మింపబడిన వజ్రపుకోటలు. ప్రత్యల్ప విషయం హేతు బద్ధమై అవ్యాప్తి, అతివ్యాప్తి, అసంభవాది దోషరహితంగా ఉండాలి. అట్టి నిర్వచనం తార్కికునకే సాధ్యమవుతుంది. సహృదయంతో సమ్యక్పరిశీలనం చేసినవారికి ఇవి బుద్ధివికాసం, ఆశ్చర్యం, ఆత్మానందం కలిగిస్తాయనటం నిస్సందేహం. ఈ శాస్త్రం తర్కబద్ధం కావటమే కాక, సంస్కృత భాషలో ఉండటం వల్ల కూడా సామాన్యులకు అందుబాటులో లేకున్నది. ఆదిలో పాశ్చాత్య విమర్శకులు సంస్కృతాన్ని శ్రద్ధగా చదువుకొని, ఉత్తమ అనువాదాలను, విమర్శలను వెలయించినారు. పిమ్మట ఆయాదేశ భాషలలోనికి చాలా గ్రంథాలు అనూదితములైనవి. శ్రీయుతులు ఎమ్. ఆర్.కవి, పి.వి. కాణే, యస్.కె.డే, వి.రాఘవన్ ప్రభృతులు అనేక గ్రంథాలను వెలుగులోనికి తెచ్చి, లోతుగా పరిశీలన చేసి ఆంగ్లంలో అనేక విమర్శనలను, విమర్శన గ్రంథాలను వెలయించినారు. అంతేకాదు. ప్రాచ్య-పాశ్చాత్య సిద్ధాంతాల సమన్వయానికై ప్రయత్నించి, తులనాత్మకములైన విమర్శలు కూడా వెలయించినారు.

(i) శాస్త్రనామం : లభించినంతలో భరతముని 'నాట్యశాస్త్రం' తొలి అలంకారశాస్త్రగ్రంథం. ఇది రూపకరచనకు-రూపకప్రదర్శనకు సంబంధించిన

సూత్రాల సంపుటి. ఇందులో సర్వవిషయాలు నాట్యరసాలకు సంబంధించిన విగా వివరింపబడివి. అయితే తరువాత వచ్చిన దండి-భామహ- వామనాదులు రూపక-రస ప్రస్తావనలు విడిచి వేసి కావ్యానికి సంబంధించిన గుణ-అలంకార-రీత్యాదులను వివరించినారు. అటు పిమ్మటవారైన ఆనందవర్ధనాదులు రసాన్ని కావ్యానికి కూడా అన్వయించారు. కానీ, ఈ గ్రంథాలు అన్నింటికీ 'అలంకార శాస్త్రం' అనే పేరు.

ఇంతకు, 'అలంకారం' అంటే ఏమిటి? భామహాదులు పలువురు తమ గ్రంథాలను 'అలంకార' పదంతో వ్యవహరించారు - భామహుని కావ్యాలంకారం, ఉద్భటుని కావ్యాలంకారసారసంగ్రహం, వామనుని కావ్యాలంకార సూత్రం, రుద్రటుని కావ్యాలంకారం మున్నగునవి. ఇందులకుకారణం వారి గ్రంథాలలో అలంకారాలకు ఎక్కువ ప్రాధాన్యం ఉండటమే - "ప్రాధాన్యేన వ్యపదేశా భవంతి" (=ప్రాధాన్యాన్ని పట్టి పేర్లు ఏర్పడుతుంటాయి). తమగ్రంథాలకు 'అలంకారం' అనే పేరు చేర్చకపోయినా దండిప్రభృతులు (కావ్యాదర్శం మొ.) తమ గ్రంథాలలో అలంకారాలకే ప్రాముఖ్యం ఇచ్చారు. ఆదిలో ఇట్లా అలంకారాలు ప్రాధాన్యం వహించటం చేతనే ఈ శాస్త్రానికి 'అలంకారశాస్త్రం' అనే పేరు, తత్కర్తలకు 'ఆలంకారికులు' అనే పేరు రూఢములైనాయి. అయితే, పై ఆలంకారికులందరూ తమ గ్రంథాల పేర్లకు మొదట "కావ్య" పదం చేర్చుకొనటం తప్పక గమనింపదగిన విషయం.

అలంకారపదానికి రెండు అర్థాలు ఉన్నవి :

"కావ్యం గ్రాహ్యమలంకారాత్, సౌందర్యమలంకారః" అనే వామన నిర్వచనాన్ని పట్టి అలంకారమంటే 'సౌందర్యం' అనీ (లౌకిక వ్యవహారమందును ఇదే అర్థం); సౌందర్యం ఉన్నప్పుడే కావ్యం గ్రాహ్యం అనీ, కావ్యాలంకారం అనగా, కావ్యానికి సౌందర్యాపాదకాలైన ధర్మాలను నిర్దేశించే శాస్త్రమనీ అర్థం. ఇంక రెండవ అర్థం ఉపమాది అలంకారాలకు పరిమితం. ఈ ఉపమాది అలంకారాలవల్ల కావ్యం అలంకరింపబడుతుంది (అలంక్రియతే అనేన ఇతి).'

అలంకారశాస్త్రానికి 'సాహిత్యశాస్త్రం' అని ఇంకో పేరు కూడా ఉంది; దీనినే రాజశేఖరుడు కావ్యమీమాంసలో 'సాహిత్యవిద్య' అన్నాడు. "సహితం యొక్క భావమే సాహిత్యం", "శబ్దార్థాల సాహిత్యమే కావ్యం" అనే నిర్వచనాలను పట్టి శబ్దార్థ సహితమైన కావ్యాన్ని గూర్చి చర్చించే ఈ శాస్త్రానికి

'సాహిత్యశాస్త్రం' అనే పేరు రాజశేఖరునకు ముందే వచ్చి ఉంటుంది. ఇంక కావ్య- సాహిత్య శబ్దాలు రెండూ పర్యాయపదాలైనాయి. మమ్మటుడు తన గ్రంథాన్ని 'కావ్యప్రకాశం' అంటే, విశ్వనాథుడు తన గ్రంథాన్ని 'సాహిత్యదర్పణం' అన్నాడు. కాగా, ఈ శాస్త్రానికి 'సాహిత్యశాస్త్రం' అనే పేరే సమంజసం కాగలదు. ఇంక ఆధునిక పదమైన (Aesthetics) అనే అర్థంలో దీనిని 'సౌందర్యశాస్త్రం' అనవచ్చు.

(ii) శాస్త్రప్రమేయం : అలంకారశాస్త్ర లేదా సాహిత్యశాస్త్ర ప్రథమ కర్తవ్యం కావ్యప్రయోజనాలను వివరించటం. పిమ్మట కావ్యహేతువులను గూర్చిన చర్చ. తరువాత కావ్యనిర్వచన ప్రయత్నం— ఇందులో శబ్దానికో, అర్థానికో ప్రాధాన్యమిచ్చి (ఇది కావ్యశరీరం అవుతుంది), పిమ్మట కావ్యానికి ఆత్మ ఏదో నిర్దేశింపబడుతుంది. కావ్యాత్మ విషయంలో మతభేదాలు చాలా ఉన్నవి. శబ్ద-అర్థాలు రెండూ కావ్యాంగాలే కాబట్టి శబ్దశక్తులు, శబ్ద-అర్థాల సంబంధం నిరూపింపబడుతుంది. ఈ ప్రసంగంలోనే అభిదాది శబ్దశక్తులు, వాచ్యాది అర్థ శక్తులు, వ్యంగ్య లేదా ధ్వని భేదాలు వివరింపబడతాయి. తరువాత కావ్యభేదాలను గూర్చిన చర్చ సాగుతుంది— బాహ్యస్వరూపాన్ని పట్టి గద్య-పద్య-మిశ్రాదిభేదాలు, భాషను పట్టి సంస్కృత-ప్రాకృతాది భేదాలు, ధ్వనిని పట్టి ఉత్తమాదిభేదాలు, ప్రదర్శనాది భేదాలనుపట్టి శ్రవ్య-దృశ్య భేదాలు మున్నగునవి. దృశ్య విభజన సువిశాలమైన రూపకచర్చకు దారి తీస్తుంది. ఏ కావ్యమైనా గుణసహితంగా ఉండాలి కాబట్టి కావ్యగుణాలు, ఆ గుణాలచేత ఏర్పడే రీతులు మున్నగునవి, కావ్యాలు దోషరహితంగా ఉండాలి కాబట్టి పద-వాక్య-అర్థాదిదోషాలు నిరూపింపబడతాయి. కొన్ని గ్రంథాలు కవి శిక్షాదులను గూర్చి వివరించటమే కాక, కావ్యరచనకు సంబంధించిన పెక్కు ఇతర విషయాలను (ఉదా : భూగోళజ్ఞానం మొ.) కూడా వివరించాయి. రసమే కావ్యాత్మ అనేవారు ప్రారంభంలో ప్రత్యేకంగానూ, కేవలం రూపకచర్చ చేసేవారు దానికి అన్వయించి, ధ్వనివాదులు రసధ్వనిని గూర్చి చర్చించేటప్పుడు సమగ్రరస చర్చచేశారు. రస చర్చకు సంబంధించి నాయికా-నాయకభేదాలను గూర్చి విపులమైన వివరణ ఉంటుంది. చిట్టచివర కావ్యాన్ని అలంకరించే 'శబ్ద-అర్థ- మిశ్రాలంకారాల వివరణ ఉంటుంది. ఆయా సందర్భాలలో కావ్య-శాస్త్రాల తారతమ్యం, కవిలక్షణం, వాని సామగ్రి, కావ్యసౌందర్యనిర్ణయం, ఆనందస్వరూపం, కావ్యానందానికి అధికారి అయిన సహృదయుని లక్షణం మున్నగు పెక్కు విషయాలు సూక్ష్మాతి

సూక్ష్మంగా వివేచింపబడుతాయి. అయితే, పై సర్వవిషయాలు అన్ని గ్రంథాలలో సంపూర్ణంగా వివరింపబడలేదని గుర్తుంచుకోవాలి. రచయిత ప్రతిపాదింపదలచు కొన్న దానిని బట్టి ఆయా అంశాలు ప్రసక్తములవుతూ ఉంటాయి; అంతేకాదు పైని పేర్కొన్న క్రమం కూడా భేదిస్తూ ఉంటుంది.

సాహిత్యశాస్త్ర రచన ఎప్పుడు ప్రారంభమైనదో స్పష్టంగా తెలియదు. ఋగ్వేదంలో ఉపమాది అలంకారాలు బహుళంగా ఉన్నవి. ఆ లక్ష్యాలకు లక్షణం (= శాస్త్రం) ఎప్పుడు ఉదయించిందో? ఋగ్వేదకాలంనుంచి క్రీస్తు శకారంభం వరకు గల మధ్యకాలంలో ఈ శాస్త్రాభివృద్ధి వికాసాలను నిర్ణయించటానికి ప్రయత్నాలు జరిగాయి. వాటి ఫలితము లేదైనా, మనకు లభించిన ప్రథమ సాహిత్యశాస్త్రగ్రంథం భరతముని ప్రణీతమైన నాట్యశాస్త్రం; ఇది కనీసం క్రీస్తుశకారంభ కాలంనాటిదని అంగీకరిస్తే, అప్పటినుంచి పందొమ్మిదవ శతాబ్ది వరకు - రూపక-రస-భావ-అలంకార-గుణ-దోష-రీతి-వృత్తి-పాక-శయ్య-ధ్వని-వక్రోక్తి-అనుమితి- ఔచిత్య-కవిశిక్షాది వివిధ కావ్యనాట్య విషయాలను గూర్చి ఆలంకారికులు పెక్కు గ్రంథాలను రచించారు.

(iii) సాహిత్యశాస్త్రదశలు : అజ్ఞాతకాలం నుంచి 18 వ శతాబ్ది వరకు గల కాలంలో సాహిత్యశాస్త్ర వికాసాన్ని నాలుగు యుగాలుగా విభజించినాడు ఆచార్య యస్.కె.డే.

1. ప్రారంభకాలం : అజ్ఞాతకాలం నుంచి భామహుని వరకు; ఈ కాలంలో మనకు తెలిసిన వాడు భరతముని మాత్రమే.

2. రచనాత్మకకాలం (క్రీ.శ. 600-850) : భామహుని నుండి ఆనందవర్ధనుని వరకు-

(i) భామహ-ఉద్భట-రుద్రటులు- 'అలంకార' సంప్రదాయం.

(ii) దండి-వామనులు - 'రీతి' సంప్రదాయం.

(iii) ఆనందవర్ధనుడు - 'ధ్వని' సంప్రదాయం.

3. నిర్ణయాత్మక కాలం (క్రీ.శ. 850-1050) : ఆనందవర్ధనుని నుంచి మమ్మటునివరకు -

అభినవగుప్తుడు, కుంతకుడు, మహిమభట్టు, ధనంజయుడు, భోజరాజు మున్నగువారు.

4. వ్యాఖ్యానాత్మకకాలం (క్రీ.శ. 1050-1750) : మమ్మటుని మొదలు జగన్నాథుని వరకు -

(i) మమ్మట-రుయ్యక-విశ్వనాథ-హేమచంద్ర-విద్యాధర-విద్యానాథ-జయదేవ-అప్పయ్యదీక్షితులు మున్నగువారు (ధ్వనివాదులు).

(ii) శారదాతనయ-సింగభూపాల-భానుదత్త-రూపగోస్వామి మున్నగు వారు (రసవాదులు).

(iii) రాజశేఖర-క్షేమేంద్రులు (కవిశిక్ష).

(iv) జగన్నాథుడు (రసధ్వని).

అయితే సంస్కృతసాహిత్యవిమర్శచరిత్రయందు ప్రధానంగా అయిదు దశలు గోచరిస్తున్నవి :

(1) రూపక-రస చర్చలు ప్రధానమైన కాలం. నాట్యశాస్త్ర రచనాకాలం ఇదే. ఇందులో కేవలం శ్రవ్యకావ్యానికి సంబంధించిన విషయాలు తక్కువ. దీనిని నాట్యశాస్త్రకాలం అనవచ్చు.

(2) రూపక-రస చర్చలు మృగ్యమై, కేవలం శ్రవ్యకావ్య చర్చయే ప్రాధాన్యం వహించినకాలం. ఈ కాలంలో రచింపబడిన సాహిత్య శాస్త్ర గ్రంథాలు కూడా 'కావ్య' పదయుతంగానే వ్యవహరింపబడినవి -భామహుని 'కావ్యాలంకారం', దండి 'కావ్యాదర్శం' మొ. ఈ కాలంలో ముఖ్యంగా అలంకారాల సంఖ్య అభివృద్ధి పొందింది. కావ్యమునకు అలంకారాలు ముఖ్యములనే భావన ప్రబలిన కాలమిది. ఈ కాలాన్ని అలంకారశాస్త్రకాలం అనవచ్చు. సాహిత్య విమర్శకులకు 'ఆలంకారికులు' అనే పేరు ఈ కాలంలో వచ్చి ఉండవచ్చు.

(3) రసం, కావ్యానికి కూడా ముఖ్యమని అన్వయించబడిన కాలం - ఈ కాలంలో ముఖ్యులు ఆనందవర్ధన, అభినవగుప్తులు; వీరిరువురును కావ్య-నాట్యాలకు రసం 'ఆత్మ' అని నిరూపించినారు.

'కావ్యానికి ఇతివృత్తం శరీరం' అని భరతుడు పేర్కొన్నప్పటికీ, కావ్యానికి ఆత్మ ఏదో ఆయన చెప్పలేదు. నాట్యశాస్త్రమందు రసానికి గల ప్రాధాన్యాన్ని పట్టి, భరతుని దృష్టిలో కావ్యానికి 'రసం' ఆత్మ అనేది స్పష్టం. 'రీతిరాత్మాకావ్యస్య' అంటూ వామనుడు ప్రప్రథమంగా కావ్యాత్మ

విషయం లేవనెత్తినాడు. అప్పటినుంచి కావ్యాత్మవిషయంలో అనేకవాదములు బయలుదేరినవి; వీనినే సాహిత్యసంప్రదాయాలు అంటారు.

కావ్యాంగములైన రస-అలంకార-గుణ-రీతి-ధ్వని మున్నగువానిలో ఒక్కొక్క దానిమీద ఒక్కొక్క శాస్త్రకర్త అభిమానం చూపించటం చేత ఈ మతాలు లేదా సంప్రదాయాలు వెలసినవి.

(4) రూపకచర్చ మరల ప్రాధాన్యం వహించినకాలం. తక్కిన కావ్యాంగాలు పూర్తిగా విడువబడి, రూపక-రస చర్చలు మాత్రమే ఈ కాలమందు ప్రాధాన్యం వహించినవి - ధనంజయుని దశరూపకం, సాగరనంది నాటకలక్షణరత్నకోశం, రామచంద్రగుణచంద్రుల 'నాట్యదర్పణం', సింగభూపాలుని 'రసార్ణవసుధాకరం' మున్నగునవి ఈ కాలమందలి రచనలు. నాట్య-రస విషయకములైన గ్రంథాలలో, ఈ కాలానికి చెందిన శారదాతనయుని భావప్రకాశనము, విషయవైశాల్యం గల రచన.

(5) కావ్య-నాట్య విషయాలు సర్వం ఒకే గ్రంథమందు వివరింపబడిన కాలం. విద్యానాథుని ప్రతాపరుద్ర యశోభూషణం, విశ్వనాథుని 'సాహిత్యద ర్పణం' ఈ కాలానికి చెందిన రచనలు. విషయవైశాల్యంలో నాట్యశాస్త్రమంతటి గ్రంథం- భోజుని శృంగారప్రకాశం కూడా ఈ కాలానికి చెందినదే. 'సాహిత్య శాస్త్రం' అనే పేరు అన్వర్థమైన కాలం ఇదే అని చెప్పవచ్చు.

పై అయిదు దశలలో రసానికి ప్రాధాన్యంలేనిది రెండవదశ మాత్రమే. అయితే భామహవామనాదులు దానిని పూర్తిగా విస్మరించలేదు - రసాన్ని అలంకారంగానో, గుణంగానో నిర్వచించటానికి ప్రయత్నించారు. ఇంక తక్కిన దశలలో సర్వాలంకారికులు రసానికి పట్టాభిషేకం కట్టి దానిని 'రసరాజం' చేశారు. రసం, కావ్య-నాట్యాలలో వాచ్యం కారాదనీ, వ్యంగ్యంగా ఉండాలనీ ఆనందవర్ధన-అభినవగుప్తులు సిద్ధాంతించారు; దీనికి 'రసధ్వని' అని పేరు. ఈ 'రసధ్వని' యే 'కావ్యాత్మ' గా స్థిరపడింది.

(iv) గ్రంథాలు : ఆయా రచయితల గ్రంథాలు కొన్నింటిని పేర్కొంటున్నాను.

1. నాట్యశాస్త్రం (క్రీ.పూ. 200- క్రీ.శ.200) -భరతముని ప్రణీతం, 36 అధ్యాయాలు, 6000 శ్లోకాలు. రస-రూపక-అభినయ-గీత-వాద్యాదులు వివరింపబడిన బృహద్గ్రంథం. తరువాతి సాహిత్యశాస్త్ర గ్రంథాలన్నింటికి ఇదియే మూలకందం.

2. కావ్యాదర్శం (క్రీ.శ.600- 680) - కర్తదండి, 3 పరిచ్ఛేదాలు, 660 శ్లో. కావ్యలక్షణ-భేదాలు, గుణాలు, అలంకారాలు, చిత్రబంధాలు, దోషాలు వివరింపబడినవి.

3. కావ్యాలంకారం (క్రీ.శ. 700-750) -కర్తభామహుడు, 6 అధ్యా. 400 శ్లో. కావ్యలక్షణ భేదాలు, అలంకారాలు, దోషాలు, శబ్దసాధుత్వం - ఇవి వివరింపబడినవి.

4. కావ్యాలంకార సంగ్రహం (750-850) - కర్త ఉద్భటుడు, 6 వర్గాలు, 79 కారికలు, ఒకవంద ఉదాహరణలు, 41 అలంకారాలు- ఇవి వివరింపబడినవి.

5. కావ్యాలంకార సూత్రం (800 ప్రాంతాలు) - కర్తవామనుడు, 5 అధికరణలు, 12 అధ్యాయాలు, 319 సూత్రాలు. కావ్యలక్షణ-రీతి-దోష-గుణ-అలంకార-ప్రయోగాలు చర్చింపబడినవి.

6. కావ్యాలంకారం (825-875) - కర్తరుద్రటుడు. 16 అధ్యా. 734 శ్లో. శాస్త్ర-కావ్య ప్రయోజనాలు, రీతి, భాషాలక్షణం, యమక భేదాలు, రసచర్చ, శ్లేషబంధాదులు మొ. పెక్కు విషయాలు ఇందు వివరింపబడినవి.

7. ధ్వన్యాలోకం (850-875) - కర్త ఆనందవర్ధనుడు, 4 ఉద్యోతాలు, 129 కారికలు, వృత్తి, ఉదాహరణసమేతం. ధ్వనిని గూర్చిన వాదములు, వ్యంగ్య (=అర్థ) భేదాలు, వ్యంజక (శబ్ద)భేదాలు, ధ్వనిప్రయోజనం మున్నగునవి ఇందు చర్చింపబడినవి.

8. కావ్యమీమాంస (880-925) - కర్త రాజశేఖరుడు. 18 అధికరణాలు, గద్యమయం, రస, అలంకారాదుల చర్చలేకపోయినా పెక్కు సాహిత్యవిషయాలకు ఇది గనివంటిది.

9. వక్రోక్తిజీవితం (950-1000) - కర్త కుంతకుడు. 4 ఉన్మేషాలు. కారికా, వృత్తి, ఉదాహరణ (500 శ్లో.పైగా) సహితం. కవిత్వవైచిత్ర్యలావణ్యాదులు, వర్ణవిన్యాస-పదపూర్వార్ధ, ప్రత్యయ, వాక్య వైచిత్ర్య-ప్రకరణ-ప్రబంధ వక్రతలు మొ. ఇందు చర్చింపబడినవి. ధ్వనివ్యతిరేకగ్రంథమిది.

10. అభినవభారతి, లోచన వ్యాఖ్యలు (980-1020) - కర్త అభినవగుప్తుడు. అభినవభారతి నాట్యశాస్త్రవ్యాఖ్య, లోచనం ధ్వన్యాలోకవ్యాఖ్య. ఇవి వ్యాఖ్యలైనా, మూలగ్రంథాలకు వన్నె తెచ్చినవై, పతంజలి -ఆదిశంకరుల మహాభాష్యాలకున్నంత ప్రసిద్ధిని పొందాయి.

11. దశరూపకం (974-996) - కర్త ధనంజయుడు. నాల్గు ప్రకాశాలు, సుమారు 300 కారికలు. నాట్యపరిభాష, దశరూపకాలు, నాయికా నాయకభేదాలు, రసవిచారం ఇందున్నవి. దీనికి ధనికుని 'అలోకవ్యాఖ్య' ప్రసిద్ధిపొందింది.

12. వ్యక్తి వివేకం (1020-1100) - కర్తమహిమభట్టు. 3 విమర్శలు. ఇది ధ్వని ధ్వంసకగ్రంథం. ధ్వని విమర్శన,అనౌచిత్యవిచారం, అనుమానమత స్థాపన ఇందలి విషయాలు.

13. శృంగారప్రకాశం (1005-1054)– కర్త ధారాధిపతి భోజరాజు. 36 ప్రకాశాలు. కావ్య-నాట్యాది సర్వవిషయాలు ఇందు చర్చింపబడినవి. (దీనిపై డా. రాఘవన్ ఆంగ్లంలో సవిస్తరమైన పరిశీలనాత్మక గ్రంథం ప్రకటించారు.)

14. ఔచిత్యవిచారచర్చ (990-1066)- కర్త క్షేమేంద్రుడు. 39 కారికలు. వృత్తి, ఉదాహరణసమేతం. రసజీవితభూతమైన 'ఔచిత్యం' ఇందులో బహు విధాలుగా చర్చింపబడింది. గ్రంథం చిన్నదైనా సాహిత్య శాస్త్రంలో దీనికి ఉన్నతస్థానం ఉంది.

15. అగ్నిపురాణం (900-1200) - ఇందులో 382 అధ్యాయాలున్నవి, ఇందులో పది (336-346) అధ్యాయాలు మాత్రమే సాహిత్యశాస్త్రభాగం.

16. కావ్యప్రకాశం (1050-1100) - కర్త మమ్మటుడు, 10 ఉల్లాసాలు, 143 సూత్రాలు. నాట్య విషయం తప్ప తక్కిన సాహిత్య విషయాలు అన్నీ ఇందు చర్చింపబడినవి. దీనికి సుమారు 75 వ్యాఖ్యలున్నవనే సత్యమే దీని ప్రాధాన్యమును వివరింపగలదు.

17. అలంకార సర్వస్వం (1135-1150) - కర్త రుయ్యకుడు -86 సూత్రాలు, వృత్తిసహితం. అలంకారవిషయంలో ప్రామాణికగ్రంథం.

18. కావ్యానుశాసనం (1136-1143) -కర్త హేమచంద్రుడు. 8 అధ్యాయాలు. సూత్ర, వివరణ, ఉదాహరణ సహితం. కావ్యప్రకాశమును పోలిన ఉత్తమగ్రంథం.

19. నాట్యదర్పణం (1100-1175) - కర్తలు హేమచంద్రునికి శిష్యులైన రామచంద్ర-గుణచంద్రులు. రూపకచర్చలో సాధికారకమైన గ్రంథం.

20. భావప్రకాశనం (1175-1250) - కర్త శారదాతనయుడు. పది అధికారాలు. నాట్య-రసాలపై భరతాది పూర్వాచార్యుల మతాలను పరిశీలకదృష్టితో ఆవిష్కరించిన బృహద్గ్రంథం.

21. అభిలషితార్థచింతామణి (= మానసోల్లాసం) (1131 - రచనాకాలం) - 5 భాగాలు, ఒక్కొక్క భాగంలో 20 విభాగాలు (మొత్తం నూరు అధ్యాయాలు). ఇందులో వినోదాలు అనే పేర్లతో లలితకళల చర్చ ప్రధానం.

22. చంద్రాలోకం (1200-1250) - కర్త జయదేవుడు. పదిమయూఖాలు, 350 శ్లోకాలు. కొన్ని సాహిత్య శాస్త్రవిషయాలు చర్చింపబడినప్పటికీ, ఇది అలంకారాల చర్చకు ప్రసిద్ధిపొందింది.

23. నృత్తరత్నావళి (1253-54-రచనాకాలం) కర్త-జాయసేనాని, 8 అధ్యాయాలు, మార్గదేశి నృత్యాలు వివరింపబడిన గ్రంథం.

24. సంగీతరత్నాకరం (13 వ శతాబ్ది) -కర్త శార్ఙ్గదేవుడు. 7 అధ్యాయాలు. తొలి 6 అధ్యాయాలు సంగీత చర్చ, ఇంక చివరి అధ్యాయం నృత్యచర్చ.

25. ప్రతాపరుద్రయశోభూషణం (14 వ శతాబ్ది ప్రథమభాగం) - కర్త విద్యానాథుడు. 9 ప్రకరణాలు. నాయక-కావ్య-నాటక-రస-దోష-గుణ-శబ్దార్థాలంకారల చర్చ ఇందున్నది. ఆసేతుహిమాచల పర్యంతం పఠనపాఠన వ్యవహారమందున్న గ్రంథమిది.

26. సాహిత్యదర్పణం (1300-1380) - కర్త విశ్వనాథుడు. 10 పరిచ్ఛేదాలు. సరళమైన శైలిలో కావ్య-నాట్యాలకు సంబంధించిన సర్వవిషయాలు ఇందు చర్చింపబడినవి.

27. రసార్ణవసుధాకరం (1330 ప్రాంతాల)-కర్త సింగభూపాలుడు. మూడు విలాసాలు. నాయికా నాయక, రస, రూపక చర్చలు ఇందున్నవి.

28. రసమంజరి (1450-1500) - కర్తభానుదత్తుడు. నాయికా నాయకులు, తత్సహాయులు- వీరిని గూర్చిన చర్చ ఇందున్నది.

29. ఉజ్జ్వలనీలమణి (1470-1551) - కర్త రూపగోస్వామి. చైతన్యస్వామి కృష్ణభక్తి ప్రేరకం కాగా, ఈయన దివ్యభక్తిని, తత్సంబంధాదులను రస చర్చకన్వయించి, ఐహిక వాతావరణం కల్పించి, మధురభక్తిగా భక్తిరసాన్ని ప్రతిపాదించినాడు.

30. కువలయానందం (1554-1626)-కర్త అప్పయ్యదీక్షితులు. ఇందు అలం కారాలు మాత్రమే చర్చింపబడినవి.

31. రసగంగాధరం (1620-1660) - కర్త జగన్నాథుడు. రెండు ఆననాలు మాత్రమే లభించినవి. కావ్యనిర్వచనం, హేతువులు, భేదాలు, రసమీమాంస, గుణాలు, ధ్వనిభేదాలు, అలంకారాలు -ఇవి ఇందు చర్చింపబడినవి.

32 శృంగారమంజరి (1675 ప్రాంతాలు) -దీనికర్త అక్బర్‌షా లేదా బడే సాహెబ్. రసమంజరివలె ఇది కూడా నాయికా నాయక చర్చకు సంబంధించినది, అంతకంటె సూక్ష్మ విశ్లేషణమిందున్నది.

33. భరతరసప్రకరణం (1875 ప్రాంతాల) - సంకలనకర్త శ్రీమాన్ నీడా మంగలం తిరువేంకటాచార్యులు -406 శ్లోకాలు. నాయికా నాయక, విభావ-అనుభావ, భావ-రసాలకు సంబంధించిన సంక్షిప్త గ్రంథం. సింగ భూపాలుని రసార్ణవసుధాకరం దీనికి ఆకరగ్రంథం.

సూచన : ఇంతవరకు ప్రధానములైన కొన్ని గ్రంథాలు మాత్రమే పేర్కొనబడినవి. కేవలం సంగీతానికి లేదా కేవలం నృత్యానికి సంబంధించిన గ్రంథాలు-రెండు మూడు తప్ప ఈ పట్టికలో చేరలేదు. ఈ పట్టికలోని తేదీలు మహామహోపాధ్యాయ డా. పి.వి. కాణేగారిని అనుసరించి ఇవ్వబడినవి.

## 2. సాహిత్యశాస్త్ర సంప్రదాయాలు

భరతముని నాట్యశాస్త్రమందు ప్రధానంగా రూపకరచనా ప్రయోగాలను గూర్చి వివరించినప్పటికీ, ఆ వివరణమంతా రసాన్ని కేంద్రీకరించుకొని ఉన్నది. కాగా, కావ్య-నాట్యములందు 'రసం' ప్రధానమన్నమాట. ఈ ప్రాధాన్యాన్ని పురస్కరించుకొనియే, తరువాతివారు రసాన్ని, కావ్యానికి 'జీవితం' అనీ, 'ఆత్మ' అనీ పేర్కొన్నారు. అంటే భరతముని స్పష్టంగా చెప్పకపోయినా, ఆయన దృష్టిలో కావ్యాత్మ 'రసం' అవుతున్నది; దీనిని రస సంప్రదాయం అంటారు. ప్రాసంగికంగా, సంక్షిప్తంగా మాత్రమే భరతముని అలంకార-గుణ-దోషాలను వివరించినాడు. ఇది తరువాతి వారికి నచ్చలేదు. నాట్యంలో వీటికి ప్రాధాన్యం లేకపోవచ్చును కాని, కావ్యంలో వాటికే ప్రాధాన్యమున్నదని నిర్దేశిస్తూ తరువాతి ఆలంకారికులు అలంకారాదులను విస్తరించటానికి పూనుకొన్నారు. అట్లా బయలుదేరినదే అలంకార సంప్రదాయం; దీనికి మూలపురుషుడు భాముహుడు

-వీనిని కొందరనుసరించారు. కాని ఇది కూడా మరికొందరకు నచ్చలేదు; 'గుణం' (దండి) లేదా 'రీతి' (వామనుడు) ప్రధానమని వారి నిర్ణయం. ఇట్లా గుణ సంప్రదాయం, రీతి సంప్రదాయం వెలసినవి— వీరందరూ రసాన్ని పూర్తిగా విస్మరించినట్లే. అటు పిమ్మట రసాన్ని అంగీకరించిన 'ధ్వని సంప్రదాయం' నెలకొన్నది. దీనిని ప్రతిష్ఠించి, పోషించినవారు ఆనందవర్ధన-అభినవగుప్తులు. వెంటనే ధ్వని ధ్వంసకమతాలు బయలుదేరాయి - మహిమ భట్టు 'అనుమితి సంప్రదాయం', కుంతకుని 'వక్రోక్తి సంప్రదాయం'— వీరి దృష్టిలో రసం అంగీకార్యమే, ధ్వనికి మాత్రమే వ్యతిరేకత. ఈ సంప్రదాయా లకు అనుయాయులు లేకపోవటం చేత ఇవి నామమాత్రావశేషములే అయినవి. తరువాతివారు అందరూ, రసాన్ని ధ్వనిని ఆదరించి, ఆనందవర్ధనుడు చెప్పిన 'రసధ్వని'ని కావ్యాత్మగా అంగీకరించినారు. అయితే ఈ రసధ్వని అనేది కూడా ఔచిత్యానికి లోబడి ఉండాలి కాబట్టి క్షేమేంద్రుడు తన ఔచిత్యవిచారచర్చలో 'ఔచిత్యసంప్రదాయం' ప్రతిపాదించినాడు.

రససంప్రదాయం : భరతముని ఈ సంప్రదాయ స్థాపకుడు. అంతకు ముందు కూడా 'రసజ్ఞానం' ఉన్నది (రసోవైసః మొ.). దానిని విస్తృత పరచి, సమ్యగ్వివేచన చేసిన ప్రథముడు భరతముని. నాట్యశాస్త్ర షష్ఠ-సప్త మాధ్యాయములందు రస-భావాలు క్రమంగా నిరూపింపబడినవి. ఈ భాగం విశ్వసాహిత్యశాస్త్ర ప్రపంచమందు ఒక అపూర్వఘట్టం. భరతముని రసాలను నాట్యపరంగా అన్వయించి, వాటిని 'నాట్యరసాలు' అన్నాడు. రససంప్రదాయా నికి మూలభూతమైనది "విభావానుభావ వ్యభిచారి సంయోగాత్ రస నిష్పత్తిః" అనే ప్రసిద్ధసూత్రం (నా.శా. VI-31 శ్లో. తరువాతి గద్య). ఈ సూత్రం చూపులకు చిన్నదైనా, పెక్కు వ్యాఖ్యానాలకు, వాదోపవాదాలకు దారితీసింది. ఆ వ్యాఖ్యాతలలో ప్రామాణికుడు అభినవగుప్తుడు. వాని సిద్ధాంతానికి 'అభివ్యక్తి' అని పేరు .- సంస్కారఫలములైన స్థాయిభావాలు సహృదయుని హృదయంలో శుష్కకాష్ఠమందు అగ్నివలె, వాసనా రూపంగా ఉంటాయి. నిద్రాణస్థితిలో ఉన్న ఆ భావాలు రూపకప్రయోగం దర్శిస్తున్న, కావ్యం పఠిస్తున్న సహృదయునిలో విభావాదుల వల్ల అభివ్యక్తములై, ఆనందమయ 'రస' రూపం పొందుతాయి. సర్వజన సమ్మతములైన రసాలు తొమ్మిది. లోకంలో బాధాకరములు, దుఃఖ జనకములు అయినవి కూడా కావ్యనాట్యాలలో చిత్రితములై రస్యమానములై ఆనందాన్నే కలిగిస్తున్నవి. కాగా, రసమతమే సర్వోత్కృష్టమైనది.

# 3. రసాలు : ఉత్పత్తి

"జగ్రాహపాఠ్యం ఋగ్వేదాత్ . . . . . . . " అనే నాట్యశాస్త్ర శ్లోకాన్ని పట్టి, బ్రహ్మ రసాలను అన్నింటిని అథర్వణవేదంనుంచి గ్రహించినాడని స్పష్టమవుతున్నది. కాని, నాలుగు వేదాలనుంచి నాలుగు ప్రధాన రసాలను బ్రహ్మగ్రహించినాడని శారదాతనయుని కథనం (భా.ప్ర. III-8 -12) :

సామవేదం నుంచి-శృంగారం.

ఋగ్వేదం నుంచి -వీరం.

అథర్వవేదం నుంచి-రౌద్రం.

యజుర్వేదంనుంచి -బీభత్సం.

సామములను స్మరించిన బ్రహ్మకు జగములను సృజించవలెనన్న ఇచ్ఛ (= కోరిక) కలిగింది; విషయ సంబంధమైన ఆ ఇచ్ఛయే రతి, ఆ రతియే శృంగారంగా విఖ్యాతమైనది. ఋగ్వేద ఋక్కులను స్మరించిన బ్రహ్మకు జ్ఞప్తి కలిగింది; ఇది క్రియాత్మిక. ఈ జ్ఞప్తి విషయసంబంధము కలదై ఉత్సాహాత్మకమైన వీరమైనది. అథర్వ మంత్రాలను స్మరించిన బ్రహ్మకు హింసాత్మకమైన మతి ఉదయించింది; ఇది క్రియాసంవలితమై, క్రోధాత్మకమై రౌద్రమైనది. యజుర్వేదస్మృతి వల్ల క్రియారూపమైన బ్రహ్మయొక్క ప్రవృత్తి ఫలావసానికమై బీభత్సమైనది.

నాలుగు వృత్తులతో కూడిన రసాల ఉత్పత్తిని, భంగ్యంతరంగా కూడా శారదాతనయుడు వివరించినాడు (భా.ప్ర.III-31-35) :

భావాభినయకోవిదులైన భరతులు, బ్రహ్మసభలో 'త్రిపురదాహం' అనే రూపకాన్ని ప్రదర్శించారు. ఆ ప్రయోగాన్ని చూస్తున్న బ్రహ్మయొక్క నాలుగు ముఖాలనుంచి నాలుగు వృత్తులతో కూడిన నాలుగు రసాలు ఉత్పన్నములైనవి.

భరతులు పార్వతీ-పరమేశ్వరుల సంభోగాన్ని అభినయించినప్పుడు తూర్పు దిక్కుగా ఉన్న బ్రహ్మయొక్క ముఖం నుంచి కైశికీ వృత్తితో శృంగారరసం ఉత్పన్నమైనది. భరతులు దక్షాధ్వర ధ్వంసాన్ని అభినయించినప్పుడు పశ్చిమ దిక్కుగా ఉన్న బ్రహ్మయొక్క ముఖం నుంచి ఆరభటీవృత్తితో కూడిన రౌద్రం ఉత్పన్నమైనది.

భరతులు త్రిపురమర్దనమును అభినయించినప్పుడు దక్షిణ దిక్కుగా ఉన్న బ్రహ్మయొక్క ముఖం నుంచి సాత్త్వతీవృత్తితో కూడిన వీరం ఉత్పన్నమైనది.

భరతులు శంభుని యొక్క కల్పాంతకర్మను అభినయించినప్పుడు ఉత్తరదిక్కుగా ఉన్న బ్రహ్మయొక్క ముఖం నుంచి భారతీవృత్తితో కూడిన బీభత్సం ఉత్పన్నమైనది. (ఇవి మూల లేదా జనకరసాలు; జన్యరసాల ఉత్పత్తికి చూ : రసాలు : జన్యజనకత్వాలు).

## 4. రససంఖ్య

శృంగార-హాస్య-కరుణా-రౌద్ర-వీర-భయానకాః ।
బీభ-త్సాద్భుత సంజ్ఞౌచేత్యష్టౌనాట్యేరసాః స్మృతాః ॥

– 1. శృంగారం, 2. హాస్యం, 3. కరుణం, 4. రౌద్రం, 5. వీరం, 6. భయానకం, 7. బీభత్సం, 8. అద్భుతం - ఈ ఎనిమిదిన్నీ నాట్యమందలి రసాలు. - ఇది నాట్యశాస్త్రపాఠం (VI-15). అంటే నాట్యశాస్త్రంలో ఎనిమిది రసాలే చెప్పబడినవి. అంతేకాదు. ఈ ఎనిమిది రసాలకు మాత్రమే ఎనిమిది స్థాయిభావాలు చెప్పబడినవి. కాగా, భరతముని అష్టరసవాది అనేది స్పష్టం. భరతముని అష్టరసవాది అనే అభిప్రాయాన్ని నిర్ద్వంద్వంగా చెప్పినాడు కాళిదాసు విక్రమోర్వశీయంలో (2 వ అంకం-17 వ శ్లో) :

"మునినాభరతేన యః ప్రయోగోభవతీష్వష్టరసాశ్రయోనిబద్ధః".

అయితే నాట్యశాస్త్రంలో పై శ్లోకం రెండవపాదానికి క్రింది పాఠాంతరం కూడా ఉంది :

"బీభ-త్సాద్భుత శాంతాశ్చనవనాట్యేరసాః స్మృతాః".

నా.శా.లోని పాఠాంతరం మాట ఎట్లా ఉన్నా, ఈ శ్లోకపాదం, ఉద్భటుని కావ్యాలంకారసారసంగ్రహంలో కూడా ఉన్నది. ఉద్భటుడు నాట్యశాస్త్రానికి వ్యాఖ్య రచించినాడట (ఇది అలభ్యం). మరి ఈ పాఠాంతరం ఆయన కల్పించినదై ఉండవచ్చు. కాగా, శాంతరసాన్ని ప్రతిపాదించినవాడు ఉద్భటుడవుతున్నాడు. దీనిని అంగీకరించి, అధికారికమైన చర్చచేసినవాడు ఆనందవర్ధనుడు. శాంతమును ప్రకృతిరసముగా స్థాపించినవాడు అభినవగుప్తుడు. శంకరాచార్యులవారు సౌందర్య లహరిలో 51 వ శ్లోకంలో ఎనిమిది రసాలకే దృష్టిభేదాలు చెప్పినప్పటికీ, 41 వ శ్లోకంలో 'నవరసమహాతాండవ నటనమ్' అనీ, 50 వ శ్లోకంలో 'నవరసా స్వాదతరళా' అని పేర్కొనటాన్ని బట్టి నాటికి రససంఖ్య వివాదగ్రస్తంగానే ఉన్నదేమో!

చిరకాలంగా 'నవరసాలు' అనే సూక్తి సుప్రసిద్ధమైనది; ధనంజయ, శారదా తనయులవంటివారుకాక అర్వాచీనాలంకారికులు పలువురు దీనిని అంగీకరించినారు.

రుద్రటుడు తన కావ్యాలంకారమందు 'ప్రేయస్సు' ను పదియవ రసంగా పేర్కొన్నాడు. ఈ ప్రేమ కామ సంబంధికాదు. భోజుడు ఈ ప్రేయస్సు, అహంకారశృంగారరూపమని చెప్పి, దీనిని ప్రకృతిరసంగా కూడా పేర్కొన్నాడు. విశ్వనాథుడు తన సాహిత్యదర్పణంలో 'వాత్సల్యము'ను పదియవరసంగా పేర్కొన్నాడు. కాగా, ఇప్పటికి రసాలు పదుకొండు అయినవి.

భోజుడు తన సరస్వతీకంఠాభరణం (V-14) లో ఇట్లా పేర్కొన్నాడు :

శృంగార-వీర-కరుణ-రౌద్రాద్భుత-భయానకాః ।

బీభత్స-హాస్య-ప్రేయాంసః-శాం-తోదా-త్తోద్ధతారసాః ॥

ఇందులో తొలి రసాలు ఎనిమిది, తరువాతి వారు చెప్పిన శాంత-ప్రేయస్సులు రెండు మాత్రమే కాక ఉద్ధత-ఉదాత్త రసాలు రెండు క్రొత్తగా చెప్పబడినవి. 'మతి' ఉదాత్తరసానికి స్థాయిభావంకాగా, గర్వం ఉద్ధత రసానికి స్థాయిభావం. ఉదాత్త రసాన్ని 'ఊర్జస్వి' అని కూడా పేర్కొన్నాడు భోజుడు. అంతేకాదు, శాంతం, ప్రేయస్సు వరుసగా ధీరశాంత, ధీరలలితుల రసాలు కాగా, ఉదాత్త (=ఊర్జస్వి), ఉద్ధతరసాలు ధీరోదాత్త, ధీరోద్ధతుల రసాలని వివరించినాడు. సింగభూపాలుడు తన రసార్ణవసుధాకరంలో ఈ ఉదాత్త-ఉద్ధత రసాల ప్రతిపాదనను విమర్శించినాడు (ర.సు. II-156-59).

భట్టలోల్లటాదులు 49 భావాలు రసాలు కాగలవని సూచించినారు. సంచారిభావాలు కూడా రసాలు కాగలవనిస్పష్టంగా పేర్కొనటమే కాక రసములనంతములని రుద్రటుడు సూచించినాడు.

"రసనా ద్రసత్వమేషాం మధురాదీనామివోక్తమాచార్యైః

నిర్వేదాదిష్వపితన్నికామమస్తీతితేఽపి రసాః.

భోజుడు రుద్రటమతాన్ని అంగీకరించినాడు.

రూపగోస్వామి భక్తిరసాన్ని, భానుదత్తుడు మాయారసాన్ని ప్రతిపాదించినారు. ఇందులో భక్తిని రసంగా అంగీకరించటానికి కొందరు మొగ్గు చూపినారు.

ఇన్ని ప్రతిపాదనలున్నప్పటికీ, 'నవరసములు' అన్నదే బహుజన సమ్మతంగా ఉన్నది.

నవరసాలకు ఒక క్రమాన్ని క్రింది విధంగా అభినవగుప్తుడు పేర్కొన్నాడు (అ.భా. I వ సం. పుట 267) :

కామం సకలజాతి సులభం. అది అందరకును హృద్యమైనదే. అందుచే శృంగారం మొదట చెప్పబడినది. నిరపేక్షాభావం కల హాస్యం శృంగారానుగామి, అందుచే అది రెండవది. శృంగారంయొక్క విపర్యయమే కరుణం, అందుచే అది మూడవది. పిమ్మట కరుణ నిమిత్తమైన రౌద్రం చెప్పబడినది, ఇది అమర్షప్రధానం. తరువాత కామ-అర్థములు ధర్మమూలములు కావటం చేత ధర్మప్రధానమైన వీరం చెప్పబడినది. ఈ వీరం భీతాభయప్రదానసారం కావటం చేత తదనంతరం భయానకం చెప్పబడినది. భయానక బీభత్సాల విభావాలు ఇంచుమించు సమానం, కాగా బీభత్సం వీరంచేతనే ఆక్షిప్తమవుతున్నది. వీరం యొక్క అంతమునందు తత్ఫలమే అద్భుతం. ఇవి అన్నీ త్రివర్గాత్మకాలు. వీని అనంతరం మోక్షఫలమైన శాంతం చెప్పబడినది. ఇట్లా రసాలు నవసంఖ్య కలవై ఒప్పుచున్నవి. ఈ రసాలలో శృంగారాదులు కోమల రసాలు, రౌద్రాదులు ఉద్ధతరసాలు. వీనిలో కావ్య-నాట్యములందేదేని ఒకటి 'అంగి' (ప్రధాన) రసంగా ఉంటుండగా తక్కినవానిలో కొన్ని 'అంగ' (అప్రధాన) రసాలు అవుతాయి. ఈ అంగరసాలు అంగిరసాన్ని మ్రింగివేసేటట్లుగా కాక తత్పోషకాలుగా మాత్రమే వర్ణింపబడాలి.

## 5. రసాలు : జన్యజనకత్వాలు

"శృంగారాద్ధి భవేద్ధాస్యో రౌద్రాచ్చకరుణోరసః ।
వీరాచ్చైవాద్భుతోత్పత్తి ర్బీభత్సాచ్చ భయానకః ॥
శృంగారానుకృతిర్యాతు స హాస్యస్తు పరికీర్తితః ।
రౌద్రస్యైవ చ యత్కర్మ స జ్ఞేయః కరుణోరసః ॥
వీరస్యాపి చ యత్కర్మ సోఽద్భుతః పరికీర్తితః ।
బీభత్సదర్శనం యచ్చ జ్ఞేయః సతు భయానకః ॥
-(నా.శా.VI-39-41)

— (ఎనిమిది రసాలలో ఉత్పత్తి హేతుభూతములగు రసాలు నాలుగు : శృంగార-రౌద్ర-వీర- బీభత్సాలు). శృంగారం నుంచి హాస్యం, రౌద్రంనుంచి కరుణం, వీరం నుంచి అద్భుతం, బీభత్సం నుంచి భయానకం ఉత్పన్నములైనవి.

అంటే - శృంగారానుకృతిహాస్యం అవుతుంది. రౌద్రకర్మయొక్క ఫలమే కరుణం. వీరకర్మయొక్క ఫలం అద్భుతం. ఇంక బీభత్సదర్శన జన్యమైనది భయానకం.

రసాలజన్య జనకత్వాలను శారదాతనయుడిట్లా వివరించినాడు (భా.ప్ర.III-36-47) :

భావాభినయకోవిదులైన భరతులు బ్రహ్మసభలో త్రిపురదాహం అనే రూపకాన్ని ప్రదర్శిస్తున్నారు. జటాజినధరుడు, భోగి భూషణుడు, సాగ్నిలోచనుడు, భస్మాంగరాగుడు అయిన మహాదేవునితో మహాదేవి సంభోగం కాంక్షించినది; అది చూసిన దేవిచెలికత్తెలకు గొప్పహాసముదయించింది. ఇట్లా శృంగారం నుంచి హాస్యం ఉత్పన్నమైనది.

రాక్షసులు త్రిపురములను నిర్మించినారు— ఒకటి అయోమయం, రెండవది రాజతం, మూడవది కాంచనమయం. ఒక్కొక్కపురం రక్షించటానికి మహారాక్షసులు శతసహస్రకోటి సంఖ్యాకులు నియుక్తులైనారు. అప్పుడు స్మరాంతకుడైన మహాదేవుడు అసితాపాంగాలతో ఉన్న అంబికాదేవిని అపాంగమున అవలోకిస్తూ, రాక్షసుల శరవర్షాలను సహిస్తూ, స్మయమానముఖుడై తాను ఒక్కొక్క బాణంతోనే ఆ త్రిపురాలను భస్మం చేసినాడు. అప్పుడు సర్వభూతములకు అది మహాద్భుతంగా ఉన్నది. ఇట్లా వీరం వల్ల అద్భుతం నిష్పన్నమైనది.

రుద్రుడైన వీరభద్రుని చేత దక్షప్రజాపతి యాగం ధ్వంసమయినది. నానా విధాలుగా దేవతలందరూ దండితులైనారు. వారందరి కర్ణములు, నేత్రాలు, నాసికలు ఛిన్నాభిన్నములైనవి. వారందరు కేకలు బొబ్బలు పెడుతున్నారు. వారలను చూస్తున్న సతీదేవి సఖులకు మహాదుఃఖం కలిగింది. కావున రౌద్రం వల్ల కరుణం విభావితమైనది.

అదిదేవులందరు మహాగ్నిలో దగ్ధమైనారు; భైరవుడు శ్మశానమందు వారి అస్థికలను అలంకరించుకొని, భస్మం పూసుకుని నృత్యం చేస్తుండగా చూసిన ప్రమథులు సకలభూతసంఘాలు చిత్తభ్రాంతి పొందాయి; వారిని భయం ఆవహించగా, భైరవుని శరణు పొందారు. కాగా బీభత్సం నుంచి భయానకముదయించింది.

ఇట్లా రసాలనుంచి రసాలు ఉత్పన్నమైన విధానాన్ని నారదుడు భరతునకు చెప్పినాడు, నారదుడు చెప్పిన దానినే భరతుడు అనువదించినాడు!

ఆయా రసాలకు గల సత్త్వాది గుణసంబంధాన్ని, యోగమాలాసంహితానుగుణంగా, శారదాతనయుడిట్లా వివరించినాడు (భా.ప్ర.II-173-191,212-218):

శృంగారం-రజస్సత్త్వవ్యపాశ్రయి.
హాస్యం-రజస్తమోన్వయి.
వీరం-సత్త్వరజోన్వయి.
అద్భుతం-రజస్సత్త్వోజ్జ్వలం.
రౌద్రం-రజస్తమోన్వితం.
కరుణం-తమోరూఢం.
బీభత్సం-సత్త్వరహితం.
భయానకం-తమస్సత్త్వాన్వితం.
శాంతం- రజస్తమోవిహీనం.

విభావాలలో లలితాదిభేదాలను శారదాతనయుడు ప్రథమాధికారంలో వివరించినాడు (భా.ప్ర. I.36-47). వాటిని ఇప్పట్ల అన్వయించుకోవాలి.

శృంగార-వీర-రౌద్ర-అద్భుతాలు లోకోత్తర నాయకాశ్రయములనీ, అందుచేతనే వాటి పరిపోషం కావ్య-నాటకాదులందు అతిశయంగా ఉంటుందని ప్రతాపరుద్ర యశోభూషణకర్త విద్యానాథుడు.

లౌకికంగా ఆలోచించినా, శృంగారాదులే ప్రధాన రసాలుగా గోచరిస్తాయి. సంసారబంధం ఏర్పడటానికి శృంగారం ప్రధానం. తద్రక్షణమందు వీరమావశ్యకం. దానికి అడ్డంకులెదురైతే కలిగేది రౌద్రం. సంసారం విచ్ఛిన్నమైతే కలిగేది బీభత్సం. ఇంక చివరికి మిగిలేది శాంతం!

## 6. అంగి-అంగరసాలు : రససాంకర్యం

మూలం : నహ్యేకరసజం కావ్యం కించిదస్తి ప్రయోగతః ।
భావోవాపి రసోవాపి ప్రవృత్తి ర్వృత్తిరేవచ ।।
బహూనాం సమవేతానాం రూపం యస్య భవేద్బహు ।
సః మంతవ్యోరసః స్థాయీ శేషాః సంచారిణోమతాః ।।
దీపయంతః ప్రవర్తంతే యే పునః స్థాయినం రసమ్ ।
తేతు సంచారిణో జ్ఞేయాస్తే హి స్థాయిత్వమాగతః ।।

- (నా.శా. VII- చివరి భాగం)

తాత్పర్యం : ప్రయోగమును పట్టి చూస్తే, ఏకరసజమైన కావ్యం కన్పట్టదు (అంటే ప్రయోగంలో ఆదినుండి అంతం వరకు, ఏదో ఒకరసం మాత్రమే ఉండదు). అట్లాగే కావ్యమందు ఒకే భావం, లేదా ఒకే రసం లేదా ఒకే ప్రవృత్తి, లేదా ఒకే వృత్తి ఉండవు. ఒకే కావ్యంలో కూడి ఉన్న అనేకరసాలలో ఏ రసం యొక్క రూపం అధికంగా ఉంటుందో ఆ రసం 'స్థాయిరసం' అవుతుంది. తక్కిన రసాలు 'సంచారిరసాలు' అవుతాయి. ఈ సంచారి రసాలు కూడా స్థాయిరసతుల్య (= పోషక)ములే అయినప్పటికీ అసలు స్థాయిరసాన్ని దీపింపజేస్తూ, ప్రవర్తించుతాయి కాబట్టే, ఇవి సంచారి రసాలు అనబడినవి.

టీక : అంగి-అంగరసవివేచనమును కాని, విరోధిరసవివేచనమును కాని భరతముని ప్రత్యేకంగా పేరుపెట్టి చేయలేదు. ఈ వివేచనమును నిశితంగా చేసిన ప్రథముడు ఆనందవర్ధనుడు. భరతముని పేర్కొన్న స్థాయి రసాన్ని, ఆనంద వర్ధనాదులు అంగిరసం (= ప్రధానరసం) అన్నారు, అట్లాగే సంచారిరసాలను అంగరసాలు (= అప్రధానరసాలు) అన్నారు.

పై మూడు శ్లోకాలలో చివరి రెండు శ్లోకాలు ప్రక్షిప్తాలుగా తలంప బడుతున్నవి. కాని, మొదటి శ్లోకంలోని రెండవపాదాన్ని, రెండవ శ్లోకాన్ని కలిపి సింగభూపాలుడు ఉదాహరించినాడు (ర.సు. II-253-54 మధ్య). కావ్యనాట్యములందు ప్రప్రథమంగా ప్రసక్తమై, మరల మరల అనుసంధీయమాన మవుతూ, ఇతి వృత్తమునందంతటా చక్కగా వ్యాపించి ఉండేదే స్థాయిరసం. ఇట్లా అధికవ్యాప్తి కలది కావటం చేతనే ఇది ప్రధానరసం. సంచారిరసాన్ని ప్రధాన రసం కంటె అధికంగా పోషించరాదు; అట్లా పోషించితే, అది రసదోషంగా పరిగణింపబడుతుంది. కాగా, ఎచ్చటను, రెండు రసాలకు సమప్రాధాన్యం ఉండరాదు.

రససాంకర్యం :

రసాల అంటే అంగ-అంగిరసాల సమ్మేళనమును రససాంకర్యం అనవచ్చు. దీనిని గూర్చి సింగభూపాలుడు ఇట్లా వివరించినాడు (ర.సు. II-251-261):

సమానబలం కల రసాలు రెండు ఒక్కచోట ఉన్నప్పుడు వానికి సంకరమవు తుందని కొందరు అంటారు. కాని, ఆలోచింపగా ఇది ప్రేక్షకులు అంగీకరించని, యుక్తిదూరమగు మతం. రెండును సమానమయితే, ఆ రెండింటిలో ఏది

రసమైత్రి :

నాట్యశాస్త్రంలో శృంగార-రౌద్ర-వీర-బీభత్సములు ప్రధాన (= జనక) రసములనీ, వీనినుంచి క్రమంగా హాస్య-కరుణ-అద్భుత-భయానకములు ఉత్పన్ననములు అవుతాయనీ (అంటే జన్యరసములనీ) పేర్కొనబడినవి. కాగా శృంగార-హాస్యములు, రౌద్ర- కరుణములు, వీర-అద్భుతములు, బీభత్స-భయానకములు పరస్పరం అవిరోధములు లేదా మిత్రములు అన్నమాట; దీనినే రసమైత్రి అంటారు. అంటే ఇవి పరస్పర పోషకములన్నమాట.

అంతేకాదు శృంగారమునకు హాస్యం మాత్రమే కాక అద్భుత-వీరములు కూడా పోషకరసములే. వీరమునకు శృంగార-రౌద్ర-అద్భుతములు పోషకరసములు. హాస్య-అద్భుతములకు శృంగారం, రౌద్ర-బీభత్సములకు వీరం పోషకరసాలు.

రసవిరోధం :

తన కావ్యంలో లేదా రూపకంలో రసమునకు మంచి పరిపాకం ఉండవలెనని కోరుకొనే కవి తన కృతిలో విరుద్ధ రసాంగములను నిబంధించరాదు. విరుద్ధరసాంగములను వర్ణిస్తే, తదభివృద్ధి ప్రస్తుతరసానికి బాధకమవుతుంది, లేదా సుందోపసుందన్యాయంగా ఆ రెండింటికీ హానికలుగవచ్చు; అంటే "ప్రస్తుతరసమునకు పరిపోషణము ఉండదు. అప్రకృతరసమునకు శోభ ఉండదు" అని జగన్నాథ పండితుడు స్పష్టం చేసినాడు. అయినా ఒకప్పుడు విరోధి రసాంగ వర్ణన కూడా ఆవశ్యంకావచ్చు. అటువంటి సందర్భంలో విరోధ రసాంగములు తావన్మాత్రములుగానే వర్ణితం కావాలి (ఈ రసాంగములు వర్ణితములయినంత మాత్రాన అది తద్రసపోషణ కాజాలదు). పానకాదులందు చక్కెరతోపాటుపడిన తృణాదులవలె రసాంగవర్ణన అల్పంగా ఉండాలి.

విరుద్ధరసాలకు ఒకచోట సమావేశం వర్ణింపదలచినకవి ముందుగా వాని విరోధమును పరిహరించాలి. ఈ విరోధం రెండు విధాలు : స్థితి విరోధం, జ్ఞానవిరోధం. స్థితివిరోధమంటే ఒక ఆధారమందు రెండు ఇముడలేకపోవటం; ఈ విరోధం తొలగించటానికే నాయకుని యందు వీరం, ప్రతినాయకుని యందు భయానకం వర్ణించాలి. ఇంకజ్ఞానవిరోధం. ఇద్దరు విరోధులమధ్య, సంధిసంధాత ఉన్నప్పుడు, ఆ విరోధం నివృత్తమైపోతుంది. అట్లాగే రెండు విరుద్ధరసముల మధ్య ఆ రెండింటికి అవిరుద్ధమయిన రసాంతరం వర్ణింపబడితే, జ్ఞానవిరోధం

గిపోతుంది. శాంత- శృంగారములు సహజంగా విరుద్ధరసాలు. వీనిని ఏకనా శ్రయంగా చిత్రించవలసివచ్చినప్పుడు, నడుమ అద్భుతరసం ప్రవేశపెట్టితే అ ధం నివృత్తమవుతుంది. నాగానందంలో తొలుత శాంతరసాశ్రయుడుగా వర్ణి న జీమూతవాహనుడు, మలయవతి గానాదులకు ఆశ్చర్యపడటం, తరువాత గారరసాశ్రయుడుగా వర్ణితుడు కావటం ఇందుకు ఉదాహరణ.

అయా రసములకు విరోధిరసములను, పోషక (=అవిరోధ లేదా మిత్ర) ములను పట్టికరూపములో క్రింద వివరిస్తున్నాను :

| ము | విరోధిరసములు | పోషకరసములు |
|---|---|---|
| శృంగారము | కరుణ-బీభత్స-రౌద్ర-వీర-భయానకములు | అద్భుత-హాస్య-వీరములు |
| హాస్యము | భయానక-కరుణములు | శృంగారము |
| కరుణము | హాస్య-శృంగారములు | - |
| రౌద్రము | హాస్య-శృంగార-భయానకములు | వీరము |
| వీరము | భయానక-శాంతములు | రౌద్ర-అద్భుత-శృంగారములు |
| భయానకము | శృంగార-వీర-రౌద్ర-హాస్య-శాంతములు | - |
| బీభత్సము | శృంగారము | వీరము |
| అద్భుతము | - | శృంగారము |
| శాంతము | వీర-శృంగార-రౌద్ర-హాస్య-భయానకములు | |

మహాభారతాంధ్రీకరణములో నన్నయగారు కరుణహాస్యాలకు సాంకర్యం రమ యంగా చిత్రించినారు :

"బాలకుండొక కొండుకకోల చేతఁ
బట్టికొని యేన రక్కసు, గిట్టిచంపి
చులుకవత్తు మీరేడ్వగా వలవదనుచుఁ
గలయనూరార్చెఁ దన తొక్కుపలుకులొప్ప.
-(అం. మ.భా.- I-VI-263)

బకాసురునకు ఆహారంగా వెళ్ళటానికి పరస్పరంపోటీపడి దుఃఖిస్తున్న బ్రాహ్మణ కుటుంబంలోని వారితో చిన్నపిల్లవాడు ఒకడు పలికిన మాటలివి. వాని అవ్యక్తవచనంబులు విని అందరు ఏడ్పు ఉడిగినారట!

# 8. రసాలు : అందలి విభేదాలు

భరతముని, అర్వాచీనాలంకారికులు పేర్కొన్న విభేదాలు :

*1.* శృంగారం *:* భరతముని : (1) వాగాత్మకం (= వాచికశృంగారం), (2) నైపథ్యాత్మకం (= ఉజ్జ్వలవేషాత్మక శృంగారం), (3) క్రియాత్మకం (= చేష్టాత్మక శృంగారం).

(1) సంభోగశృంగారం (2) విప్రలంభ శృంగారం.

అర్వాచీనులు : సంభోగశృంగారం నాలుగు విధాలు -

(1) సంక్షిప్తం, (2) సంకీర్ణం, (3) సంపన్నం, (4) సమృద్ధిమంతం.

విప్రలంభ శృంగారం ఆరువిధాలు-

(1) అయోగ విప్రలంభం, (=పూర్వానురాగం)

(2) వియోగ (=విరహ) విప్రలంభం.

(3) మానవిప్రలంభం, (4) ప్రవాస విప్రలంభం.

(5) శాపవిప్రలంభం, (6) కరుణ విప్రలంభం.

*2.* హాస్యం *:* భరతముని : (1) అంగం (= ఆంగిక వైపరీత్యం), (2) నేపథ్యం (=వేషవైపరీత్యం), (3) వాక్యం (= వాచిక వైపరీత్యం).

(1) ఆత్మస్థం, (2) పరస్థం.

(1)స్మితం, (2) హసితం, (3) విహసితం, (4) ఉపహసితం,

(5) అపహసితం, (6) అతిహసితం.

*3.* రౌద్రం *:* భరతముని : (1) అంగము (= చేష్టాత్మకరౌద్రం), (2) నేపథ్యం (= ఆకారరౌద్రం), (3) వాక్యం (= వాచికలేదా స్వభావరౌద్రం).

*4.* కరుణం *:* భరతముని : (1) ధర్మనాశజం, (2) అర్థనాశజం, (3) శోకజం.

శారదాతనయుడు : (1) మానసిక కరుణం. (2) వాచిక కరుణం.

*5.* వీరం : భరతముని : (1)దానవీరం, (2) ధర్మవీరం, (3) యుద్ధవీరం.

అర్వాచీనులు : (4) దయావీరం, (5) పాండిత్యవీరం.

*6.* భయానకం : భరతముని : (1) కృతకం, (2) అపరాధజం, (3) విత్రాసికం.

శారదాతనయుడు : (1)వాచికం, (2) అంగికం, (3) మానసికం.

*7.* బీభత్సం : భరతముని : (1) క్షోభణం (= శుద్ధం), (2), ఉద్వేగి (= అశుద్ధం).

శారదాతనయుడు : (1) మానసబీభత్సం (= క్షోభణాత్మకం),

(2) ఆంగికబీభత్సం (= ఉద్వేగజన్యం), (3) వాచికబీభత్సం.

*8.* అద్భుతం : భరతముని : (1) దివ్యం, (2) ఆనందజం.

శారదాతనయుడు : (1) మానసికాద్భుతం, (2) అంగికాద్భుతం.

## 9. రసాలు : స్థాయిభావాదులు

| రసం | స్థాయిభావం | వర్ణం | దైవతం |
|---|---|---|---|
| 1. శృంగారం | రతి | శ్యామవర్ణం | విష్ణువు |
| 2. హాస్యం | హాసం | సిత(=శ్వేత)వర్ణం | ప్రమథులు |
| 3. కరుణం | శోకం | కపోతవర్ణం | యముడు |
| 4. రౌద్రం | క్రోధం | రక్తవర్ణం | రుద్రుడు |
| 5. వీరం | ఉత్సాహం | గౌరవర్ణం | మహేంద్రుడు |
| 6. భయానకం | భయం | కృష్ణవర్ణం | కాలుడు |
| 7. బీభత్సం | జుగుప్స | నీలవర్ణం | మహాకాలుడు |
| 8. అద్భుతం | విస్మయం | పీతవర్ణం | బ్రహ్మ. |
| 9. శాంతం | - | - | - |

రసాధిదేవతలను శారదాతనయుడిట్లా సమర్థించినాడు (భా.ప్ర.III-155-163):

శృంగారమునకు అభిరూప్యం అధిష్ఠానం, విష్ణువు అభిరూపోత్తముడు, కావున విష్ణువు శృంగారమునకు అధిదేవత (కాని, ఇచ్చట విష్ణువు అనగా 'కామదేవుడు' అని వ్యాఖ్యానించినాడు అభినవగుప్తుడు -అభినవభారతిలో). హాస్యమునకు వికటాభినయం అధిష్ఠానం, ప్రమథునందిది ఉంటుంది, కావున హాస్యమునకు ప్రమథు డధిదైవం.

వీరమునకు అధిష్ఠానంధైర్యం, మహేంద్రుడుధీరుడు, కావున మహేంద్రుడు వీరమునకు అధిదైవం.

అద్భుతమునకు నానాశిల్పాత్మకమైన బుద్ధి అధిష్ఠానం. బ్రహ్మయందది కలదు, అందుచేత అద్భుతమునకు బ్రహ్మఅధిదైవం.

రౌద్రమునకు రోగ-రుజాత్మకకర్మ అధిష్ఠానం. రుద్రునకది కలదు. కావున రుద్రుడు రౌద్రమునకు అధిదైవం.

కరుణమునకు అధిష్ఠానం యముడు, దయతో పాపమును నియమింప జేస్తాడు. అందుచేత యముడు కరుణమునకు అధిదైవం.

బీభత్సమునకు అసృగాత్మకుడు అయిన మహాకాలుడు అధిష్ఠానం. ప్రలయ సమయంలో మహాకాలుడు అట్టివాడు. కావున మహాకాలుడు బీభత్సమునకు అధిదైవం.

భయానకమునకు వికృతాకారరూపత అధిష్ఠానం. సంహారకాలమున కాలదేవు డట్టివాడు. కావున భయానకమునకు కాలదేవుడు అధిదైవం.

ఆయారసముల అధిదైవతములు శ్యామాదివర్ణములు కలవారు కావున, రసములకు ఆయావర్ణములే చెప్పబడినవి.

ఆయా రసములందు ఉపయుక్తములయ్యే భావాలు :

1. శృంగారం : ఆలస్యం, ఉగ్రత, జుగుప్స- ఈ మూడు భావాలు తప్ప తక్కిన 30 భావాలు (నా.శా.).

విప్రలంభ శృంగారం : ఆలస్యం, గ్లాని, నిర్వేదం, శ్రమ, శంక, నిద్ర, ఔత్సుక్యం, అపస్మారం, సుప్తం, విబోధం, జాడ్యం, అసూయ (రసతరంగిణిలో అధికం).

2. హాస్యం : గ్లాని, శంక, అసూయ, శ్రమ, చపలత, సుప్తం, నిద్ర, అవహిత్థ (నా.శా.); ప్రబోధం (= విబోధం) (ర.త.).

*3.* కరుణం : నిర్వేదం, చింత, దైన్యం, గ్లాని, అస్రం, జడత, వ్యాధి, మరణం (నా.శా.).

మోహం, విషాదం, విభ్రమం, అపస్మారం, ఆలస్యం, స్మృతి, వేపథువు, స్తంభం, స్వరభేదం (ర.త.).

*4.* రౌద్రం : గర్వం, అసూయ, మదం, ఉత్సాహం, ఆవేగం, అమర్షం, క్రోధం, చపలత, ఉగ్రత (నా.శా.).

స్మృతి, స్వేదం, రోమాంచం, స్వరభేదం, కంపం (ర.త.).

*5.* వీరం : అసంమోహం, ఉత్సాహం, ఆవేగం, హర్షం, మతి, ఉగ్రత, అమర్షం, మదం, రోమాంచం, స్వరభేదం, క్రోధం, అసూయ, ధృతి, గర్వం, వితర్కం (నా.శా.).

*6.* భయానకం : స్వేదం, వేపథువు, రోమాంచం, గాద్గద్యం, త్రాసం, మరణం, వైవర్ణ్యం (నా.శా.); స్తంభం, శంక, మోహం, ఆవేగం, దైన్యం, చపలత, అపస్మారం, ప్రలయం, మూర్ఛ (ర.త.).

*7.* బీభత్సం : అపస్మారం, ఉన్మాదం, విషాదం, మదం, మృత్యువు, వ్యాధి, భయం (నా.శా.).

మోహం, వైవర్ణ్యం, ఆవేగం (ర.త.).

*8.* అద్భుతం : స్తంభం, స్వేదం, రోమాంచం, విస్మయం, ఆవేగం, జడత, మూర్ఛ, హర్షం, మోహం, (నా.శా.); గద్గదత, అశ్రువు, విభ్రమం, విస్మయం (ర.త.).

## 10. రససమీకరణం

రసములు అనంతములని రుద్రటాదులు ప్రతిపాదించగా రసం ఒక్కటే అని మరికొందరి ప్రతిపాదన. అంటే వీరి దృష్టిలో ఏదో ఒకరసం ప్రకృతి (= ప్రధాన) రసం, తక్కినవన్నీ దాని వికృతులే (=వికృతిరసములు); ఈ ప్రతిపాదననే 'రససమీకరణం' అంటారు.- ఇది అంగి-అంగరస వివేచనం కంటె భిన్నమైనది.

మహామహోపాధ్యాయ ఎస్. కుప్పుస్వామిశాస్త్రిగారు శక్తిభద్రుని ఆశ్చర్య చూడామణికి రచించిన ఆంగ్ల ఉపోద్ఘాతంలో రససమీకరణ వాదాలను ఇట్లా

వివేచించినారు : "రసతత్త్వం నిర్ధరించే పట్టున పలువురు కవిపండితులు ఒక్కొక్క రసమును అభిమానించి, అది ఒక్కటే రసమని వాదించినారు. ఆ చర్చల సారాంశంగా నాలుగు సిద్ధాంతాలు స్పష్టమైనవి. (1) మొదటిది కరుణరససమీకరణం. ప్రప్రథమమున ఈ కరుణం వాల్మీకి నుంచి ప్రభవించినది, అనంతరం భవభూతిచేత "ఏకోరసః కరుణ ఏవ" అని ప్రతిపాదింప బడింది. తరువాత ఆనందవర్ధనుని చేత "శోకఃశ్లోకత్వమాగతః" అని సిద్ధాంతింపబడింది. (2) రెండవది శాంతరససమీకరణం. ఇది మహాభారతం నుంచి అవతరించి, అశ్వఘోషుని శారిపుత్రప్రకరణం, హర్షుని నాగానందం, కృష్ణమిశ్రుని ప్రబోధ చంద్రోదయం అనే రూపకాలలో రూపుదిద్దుకొని, ఆనంద వర్ధన-అభినవగుప్తుల ప్రతిభావంతములయిన వాదములచేత సిద్ధాంతమైనది.(3) మూడవది శృంగారరస సమీకరణం. సృష్ట్యాదినుంచీ ఇది మానవ ప్రకృతి యందు నిబద్ధమై కాళిదాసాది మహాకవుల అమోఘ నిర్మాణశక్తిచేత ఇతరులకు అనుకరింపరాని విధంగా వ్యక్తమై; ఆధ్యాత్మికోన్నతిని పొందిన స్వార్థ రహితప్రేమయే లక్ష్యంగా కలది. భోజుడు దీనిని "రసోఽభిమానోఽహంకారః శృంగార ఇతి గీయతే" అని ప్రశంసించినాడు. ఇంక (4) నాల్గవది అద్భుతరస సమీకరణం. సాహిత్యదర్పణమందు ఉదాహరింప బడినట్లుగా నారాయణ -ధర్మదత్తులచేత మొదట సిద్ధాంతింపబడి, పిమ్మట ఆశ్చర్యచూడామణి- అద్భుతదర్పణములందు రూపుదిద్దుకొన్నది.

*(1) కరుణరసం :*

రససమీకరణమన్న వాదమునకు మూలపురుషుడుగా గణింపదగినవాడు, నాటకకర్త అయిన భవభూతి. భవభూతి ఉత్తరరామచరితనాటకం కరుణరస ప్రధానమైనది. ఇందులో కరుణమొక్కటే ప్రకృతి రసమన్న అభిప్రాయాన్ని అతడు భంగ్యంతరంగా ప్రకటించినాడు.

ఏకోరసఃకరుణ ఏవ నిమిత్తభేదా
ద్భిన్నః పృథక్పృథగివాశ్రయతే వివర్తాన్ ।
ఆవర్త బుద్బుద తరంగ మయాన్వికారా
నంభో యథా సలిలమేవహి తత్సమస్తమ్ ॥

-(ఉ.రా.చ. III-41)

– రసం ఒక్కటే, అది కరుణం. సముద్రంలోని నీరు అంతా ఒక్కటే అయినప్పటికీ, అది సుడులుగా బుడగలుగా తరంగములుగా

కన్పట్టునట్లే, కరుణం ఒక్కటే ఆయా కారణాలవల్ల వేరువేరు రసాలుగా గోచరిస్తుంది.

"శోకః శ్లోకత్వమాగతః" అంటూ క్రౌంచమిథునంలో ఒకదానిని బోయవాడు చంపగా దుఃఖమగ్నుడైన వాల్మీకిని గూర్చిన ప్రసంగమిది. అయన శోకం, "మానిషాద! . . . ." అనే శ్లోకరూపంగా అభివ్యక్తమైనది; రామాయణ కావ్యరచనకు. దారితీసిన సంఘటన అది.

నిజానికి, శృంగారం కంటె కూడా కరుణమే బలవత్తరమైనది, ఇది రాగి-విరాగి సాధారణం. కావున కరుణమే ప్రకృతిరసం, తక్కినవి దానికి వికృతిరస ములు అవుతాయని ఈ వాదసారాంశం.

## (2) శాంతరసం :

ఆనందవర్ధనుడు శాంతరససమీకరణ వాదాన్ని సూచించిన ప్రథముడు అవుతున్నాడు. ధ్వన్యాలోకానికి లోచనం అనే వ్యాఖ్య రచించిన అభినవ గుప్తుడు ఈ వాదాన్ని సిద్ధాంతీకరించినాడు. అయితే శాంతరస సమీకరణవాదం నాట్య శాస్త్రంలో 6 వ అధ్యాయం చివర, ప్రక్షిప్తభాగంలోనే గోచరిస్తున్నది :[1]

న యత్ర దుఃఖం న సుఖం న ద్వేషో నాపిమత్సరః ।
సమః సర్వేషుభూతేషు స శాంతః ప్రథితో రసః ॥
భావావికారా రత్యాద్యాః శాంతస్తు ప్రకృతిర్మతః ।
వికారః ప్రకృతేర్జాతః పునస్తు తత్రైవలీయతే ॥
స్వంస్వం నిమిత్త మాసాద్య శాంతాద్భావః ప్రవర్తతే ।
పున ర్నిమిత్తాపచయే శాంత ఏవోపలీయతే ॥

— ఎచ్చట దుఃఖం కాని, సుఖంకాని, ద్వేషం కాని, మాత్సర్యంకాని ఉండవో, సర్వభూతములందును సమభావమే ఉంటుందో, అచ్చట అది శాంత రసం అవుతుంది. శాంతరసం ప్రకృతి రసం, దీనినుంచే రత్యాదిభావాలు (= వికారాలు =మార్పులు) ఉత్పన్నమవుతాయి. ప్రకృతి నుంచి ఉత్పన్నమైన వికారాలు, మరల అందే లీనమవుతాయి. కాగా, స్వీయకారణాల వల్ల రత్యాదులు శాంతం నుంచి ఉత్పన్నమై, ఆకారణాలు నశించగానే మరల శాంతమందే లీనమవుతాయి.

పురుషార్థములు నాలుగింటిలో మోక్షం ఉత్తమోత్తమం; అమోక్షప్రవర్తకం శాంతం కావటం చేత ఇదే ప్రకృతి రసమని ఈ వాదసారాంశం. ఈ వాదంప్రకారం మహాభారతం శాంతరసప్రధానమైన కావ్యం; అట్లాగే కృష్ణ మిశ్రుని ప్రబోధచంద్రోదయం వంటి రూపకాలు కూడా శాంతరసప్రధానములైనవే.

*(3)* శృంగారం :

రతిప్రభవమైన శృంగారమే ప్రకృతిరసమనీ, హాస్యాదులు దాని వికృతులే అనీ, ఇందుకు కాళిదాసాదుల రూపకాలు ఉదాహరణములనీ అగ్నిపురాణం పేర్కొన్నది.

కాని, భోజుడు 'అహంకారశృంగారం' అనే క్రొత్త ప్రతిపాదనచేసి, అదే ప్రకృతి రసమని సిద్ధాంతించినాడు. ఇది రతిప్రభవమైన శృంగారం కంటె భిన్నమైనది. అహంకారం అనేది ఆత్మగుణం. దీనిని 'ఆత్మరతి' అనవచ్చు. ఈ ఆత్మరతియే రతి-హాసాదిరూపంగా వ్యక్తమవుతూ ఉంటుంది. అంటే సర్వ భావాలలోనూ అహంకారం అనుస్యూతంగా ఉంటుంది. ఈ అహంకారం వల్లనే మానవులకు తమ మీదకాని, తదితరుల మీదకాని అనురాగాదులు కలుగుతూ ఉంటాయి. కావున ఆత్మరతి ఒక్కటే రసమనే పదానికి అర్థం. అహంకారం అనేది బహుజన్మల సుకృతవిశేషం వల్ల ఉత్పన్నమవుతుంది. ఇది సాత్త్వికాహంకారం; దీనినే అభిమానమని, శృంగారమని అంటారు. ఇది లౌకికమైన గర్వం మాత్రం కాదు.

అభినవగుప్తుడు శాంతరస సమీకరణవాదాన్ని సిద్ధాంతీకరిస్తున్న సమయంలోనే భోజుడు ఈ శృంగార రస సమీకరణసిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తున్నాడని చెప్పవచ్చు. అభినవగుప్తుడు భోజునకు సమకాలికుడు లేదా కొంచె పూర్వుడు అవుతాడు.

భోజుడు అహంకారశృంగారాన్ని నాలుగు పురుషార్థాలకు అన్వయించి, నాలుగు వర్గాలుగా విభజించినాడు— ధర్మశృంగారం, అర్థశృంగారం, కామశృంగారం, మోక్షశృంగారం. అంతేకాదు, ధర్మశృంగారం ధీరోదాత్తునిదనీ, అర్థశృంగారం ధీరోద్ధతునిదనీ, కామశృంగారం ధీరలలితునిదనీ, మోక్షశృంగారం ధీరశాంతునిదనీ నిరూపించినాడు.

భోజుడు అహంకారశృంగారంలో మూడు దశలు చెప్పినాడు- పూర్వకోటి, మధ్యమావస్థ, ఉత్తరకోటి. పూర్వకోటిలో అహంకారం ఏకైకం, మధ్యమావస్థలో

అది భరతముని చెప్పిన 49 భావాలుగా అవుతుంది, ఇంక ఉత్తరకోటిలో ఈ భావాలన్నీ 'ప్రేయస్సు' యొక్క అంశాలు అవుతాయి; లేదా ప్రేయస్సుగా రూపొందుతాయి. ఈ ప్రేయస్సే మరల అహంకారశృంగారంగా అనుభూతికి వస్తుంది.

కాగా అహంకారరూపమైన ఈ ప్రేయస్సు లేదా ప్రేమ కూడా ప్రకృతిరసం అవుతున్నది– రతిప్రియుడు, రణప్రియుడు, పరిహాసప్రియుడు, అమర్షప్రియుడు - ఇల్లా సర్వభావాలు ప్రేయస్సునందే పర్యవసిస్తున్నవి.

('రసరాజం' అనే అంశం కూడా చూడవలెను).

*(4)* అద్భుతరసం :

సాహిత్యదర్పణకర్త అయిన విశ్వనాథునికి పూర్వుడు, 'నారాయణుడు' అనే అలంకారికుడు అద్భుతరసాన్ని ప్రకృతిరసంగా ప్రతిపాదించినట్లు విశ్వనాథుడు పేర్కొన్నాడు. ప్రపంచంలో కాని, కళాప్రపంచంలోకాని అద్భుతావహములయిన వన్నీ హర్షదాయకాలే. రసములందరి సారం 'చమత్కారం'; ఆ చమత్కారసారం అద్భుతం. కావున శృంగారాది రసములందు కూడా హర్షదాయకమైన అంశం అద్భుతమే! కావుననే అద్భుతం ప్రకృతి రసమవుతున్నది. శక్తిభద్రుని ఆశ్చర్యచూడామణి, కృత్యారావణం (ఇది అలభ్యం), మహాదేవుని అద్భుతదర్పణం మున్నగునవి అద్భుతరస ప్రతిపాదకాలు. నాటక-ప్రకరణాలు అద్భుతాంతములు కావాలని భరతముని పేర్కొనటాన్ని పట్టి, అద్భుత రసప్రాధాన్యం స్పష్టమవుతున్నది. అతిశయోక్తి సర్వాలంకారాలకు ప్రకృతి అనే అభిప్రాయాన్ని దండి-వామనులు వెలిబుచ్చినారు. "అత్యుక్తి, భ్రమోక్తి, చిత్రోక్తి, విరోధాభాసం మున్నగునవి అద్భుతరూపాలే" అని భానుదత్తుడు కూడా పేర్కొన్నాడు (అతిశయోక్తి =అత్యుక్తి).

*(5)* రసం ఏకైకం :

"రజస్తమో గుణాల స్పర్శలేని, శుద్ధసత్త్వస్వరూపం గల మనస్సునకు 'ఆస్వాదాంకురకందం' లేదా 'ఆనందం' అనే ధర్మం ఉంటుంది, అదే స్థాయి. కాగా రసం ఒక్కటే అనీ, దానికి 'ఆనందం' స్థాయి అనీ కవికర్ణపూర గోస్వామి సిద్ధాంతం. ఘట-శరావాది నానావిధపాత్రములందు పెక్కు బింబాలు ప్రతిఫలించినప్పటికీ, సూర్యబింబం ఒక్కటే అయినట్లుగా ఉపాధిరూపాలైన రత్యాదులందు భేదాలు కన్పట్టుతున్నవేకావి ఆనందంలో భేదంలేని ఈ ప్రతిపాదనసారం.

అన్ని రసాలవల్ల కలిగేది ఆనందమే, కావున పరమార్థంలో రసం ఏకైకం లేదా అఖండస్వరూపం. కానీ ఆ రసం రతి మున్నగు ఉపాధిభేదాలచేత శృంగారాదిరూపాలతో అనేకవిధాలుగా తోస్తున్నది. అందుచేత ఆయారసాలలో ఒకటి ప్రకృతి రసమనీ, తక్కినవి దానికి వికృతులనీ భావించటం కంటె రసం ఏకైకమనీ, శృంగారాదులన్నీ దాని వివిధస్వరూపాలే అని తలంచటం న్యాయ్యం కాగలదు.

# 11. రసరాజం

"ప్రజాతంతుం మావ్యవచ్ఛేత్సీః (= వంశపరంపరను విచ్ఛిన్నం చేయకు) -ఇది తైత్తిరీయోపనిషత్ ప్రథమవల్లిలోని ఏకాదశానువాకంలోనిది.

సమావర్తన సమయంలో ఆచార్యుడు అంతే వాసిని అనుశాసించే సందర్భమిది (సమావర్తనం = వేదాధ్యయనం పూర్తి అయిన తరువాత గురువు ఆజ్ఞ పొంది శిష్యుడు తన ఇంటికి తిరిగివెళ్ళటం, అంతే వాసి = శిష్యుడు, ఆచార్యుడు = గురువు, అనుశాసనం =ఉపదేశం లేదా ఆజ్ఞ). "వంశపరంపరను విచ్ఛిన్నం చేయకు" అంటే "గృహస్థుడవై, సత్సంతానం పడసి, వంశమును నిల్పుము" అని అర్థం. గృహస్థుడు కావటమంటే శృంగారం ప్రాధాన్యం వహించటమన్నమాట.

"ప్రాయికంగా సర్వభావాలు కామంనుంచే నిష్పన్నములవుతున్నాయి. ఆ కామం ఇచ్ఛాగుణ సంపన్నమై (= కార్యవ్యాపారాదులకు ఉన్ముఖమైన కోరికతో కూడినదై బహువిధాలుగా) (= చతుర్విధ పురుషార్థ సంబంధిగా) ఉంటుంది. - ధర్మకామం, అర్థకామం, కామకామం, మోక్షకామం. ఈ లోకం ఎల్లప్పుడూ సుఖాన్నే కోరుకొంటుంది. ఆ సుఖానికి మూలం స్త్రీలు. స్త్రీ-పురుషుల సంయోగం 'కామకామం'; దీనిని నిరుపపదంగా 'కామం' అని కూడా అంటారు. ఈ కామం ఇతర సుఖ-దుఃఖాలను కప్పివుచ్చి, తానే అధికంగా వ్యక్తమవుతుంది. ఉత్తమ ప్రకృతిగతం, రతిసంభోగకారకం అయిన స్త్రీ పురుష సంయోగం 'శృంగారం' అవుతుంది. ఇది శుభప్రదమైనది" - ఇది నాట్యశాస్త్ర ప్రసంగం (XXII-95-99). కాగా, సర్వలోకం వాంఛించేది శృంగారం అవుతున్నది.

రసప్రపంచనంలో, భరతముని ముందుగా, శృంగారాన్ని వివరించినాడు, ఇంక తక్కిన ఆలంకారికులందరూ దానినే అనుసరించారు. అంతేకాదు. వ్యభిచార్యాది సర్వభావాలను శృంగారపరంగానే విశదీకరిస్తూ వచ్చారు. భరతముని

'కామోపచారము' ను విపులంగా వర్ణించగా, శారదాతనయుడు దానిని కూడా అనువదించినాడు.

"శృంగార ఏవ మధురః పరః ప్రహ్లాదనోరసః ।
తన్మయం కావ్యమాశ్రిత్య మాధుర్యం ప్రతితిష్ఠతి ॥
-(ధ్వ.అ. II-7-16)

అంటూ పరమప్రహ్లాదనహేతువైన శృంగారరసమునకే పట్టం కట్టినాడు ఆనందవర్ధనుడు. శృంగారానికి 'అహంకారశ్శృంగారం' అని పేరుపెట్టినప్పటికీ, శృంగారానికే ప్రథమస్థానమిచ్చినాడు భోజుడు. నాటకంలో శృంగార-వీరాలలో ఏదో ఒకటి అంగిరసం కావాలని ఆలంకారికమతం. అయినప్పటికీ వీరరస ప్రధానములైన నాటకాలకంటె శృంగారప్రధానాలైన నాటకాలే అధికంగా వెలువడటం కూడా శృంగార ప్రాధాన్యాన్ని నొక్కి చెబుతున్నవి.

రసాలలో ఏది రసరాజం (= శ్రేష్ఠం) అనే చర్చ కొందరు చేశారు. పైని పేర్కొన్నట్లుగా శృంగారం 'రసరాజం' అవుతున్నది. లోకంలో శృంగారం సర్వప్రాణిసాధారణం. దీనివల్ల సంసారం ఏర్పడుతుంది. తద్రక్షణమందు వీరమావశ్యకం. ఆ సంసారం విచ్ఛిన్నమైతే కలిగేది శోకం. ఇట్లా సృష్టి-స్థితి-లయాలనే మూడు జీవితావస్థలకు మూడు నాట్యరసాలు పొందువడి ఉన్నవి. అందుచేత శృంగార-వీర-కరుణములు మూడు ప్రధానములని కొందరిమతం. కాని వీర- కరుణములు శృంగారఫలములే అని మర్చిపోరాదు. కావున, శృంగార శ్రేష్ఠతకు హాతిలేదు.

## 12. భరతరస సూత్రం

ప్రశ్నోత్తర రూపంలో రససూత్రం నాట్యశాస్త్రంలో ఇట్లా వివరింప బడింది. (నా.శా. VI-3 1 శ్లో. + తరువాతి గద్య) :

"నహిరసాదృతే కశ్చిదప్యర్థః ప్రవర్తతే.
తత్ర విభావానుభావ వ్యభిచారి సంయోగాత్ రసనిష్పత్తిః"

-(భరతముని) : రసహీనమై ఏ అర్థమూ ప్రవర్తించదు. అట్టిరసం, విభావ-అనుభావ-వ్యభిచారి భావాల సంయోగం వల్ల నిష్పన్నమవుతుంది.

ఋషులప్రశ్న : అందులకు దృష్టాంతం ఏమిటి?

సమా: వివిధములైన వ్యంజనాల (= రుచికరములైన ద్రవపదార్థాల), ఓషధుల (= పసుపు మొ.), ద్రవ్యాల (= బెల్లం మున్నగునవి) సంయోగం

(= చక్కని పాళ్ళలో కూర్చటం) వల్ల రసాలు నిష్పన్నములవుతున్నట్లే, నానావిధాలైన భావాల సంయోగం వల్ల రసం నిష్పన్నమవుతున్నది. అంటే గుడాది ద్రవ్యాల, వ్యంజనాల, ఓషధుల సంయోగం వల్ల షాడవాది రసాలు (షాడవం=అన్ని రుచులు కలియటం వల్ల ఏర్పడే వింతరుచికల పదార్థం) సిద్ధం అవుతున్నట్లే వివిధాలైన విభావాదులచేత ఉపగతాలై (= ప్రత్యక్షకల్పత్వం పొందినవై) స్థాయిభావాలు కూడా రసత్వం పొందుతున్నవి.

*ప్రశ్న : అయితే రసపదానికి అర్థం ఏమిటి?*

సమా : రస్యమానం కావటం (=అస్వాదింపబడటం) వల్ల అది 'రసం' అనబడుతున్నది.

*ప్రశ్న : రసం ఎట్లా ఆస్వాదింపబడుతున్నది?*

సమా : వివిధములైన వ్యంజనాలచేత సంస్కరింపబడిన అన్నం భుజిస్తూ, సుమనస్కులైన పురుషులు రసాలను (= రుచులను) అస్వాదిస్తూ హర్షాదులను పొందుతున్నట్లే, వాచిక-అంగిక-సాత్త్వికాభినయాల చేత ప్రదర్శింపబడుతున్న వివిధములైన భావాలచేత వ్యంజితములైన స్థాయిభావాలను సుమనస్కులైన ప్రేక్షకులు అస్వాదిస్తూ హర్షాదులను పొందుతున్నారు. కావుననే ఇవి 'నాట్యరసాలు' అనబడినవి (తీపి, వగరు మున్నగు ఆరు రసాలు 'లౌకికరసాలు').

ఈ విషయాన్ని వివరించే అనువంశ్య శ్లోకాలు (= గురుశిష్యపరంపరగా లభించినవి) రెండు ఉన్నవి :

యథాబహుద్రవ్యయుతైః వ్యంజనైః బహుభిర్యుతమ్ ।
అస్వాదయంతి భుంజానా భక్తం భక్తవిదోజనాః ॥
భావాభినయ సంబద్ధాన్ స్థాయి భావాంస్తథా బుధాః ।
అస్వాదయంతి మనసా తస్మాత్ నాట్యరసాః స్మృతాః ॥
(నా.శా.VI-32-33).

— బహుద్రవ్యాలతో బహువ్యంజనాలతో కూడిన అన్నం, అన్నం యొక్క రుచులు తెలిసిన జనులు భుజిస్తూ, రసనావ్యాపారంతో అస్వాదిస్తున్నట్లే, భావ-అభినయాలతో సంబద్ధములైన స్థాయిభావాలను చర్వణచేస్తూ, బుధులు, మనోవ్యాపారంతో (= మనస్సు) తో అస్వాదిస్తున్నారు. అందుచేతనే ఇవి 'నాట్యరసాలు' అనబడినవి.

రససూత్రంలోని 'సంయోగం', 'నిష్పత్తి' అనే పదాల అర్థాలను భరతముని స్పష్టంగా చెప్పలేదు. అందుచేత, ఆ పదాల అర్థాలను వివరించటంలో

భరతరససూత్రం అనేక వాదోపవాదాలకు గురి అయింది; వీనిలో నాలుగు ప్రధానములు. సారభూతంగా ఈ నాలుగింటిని పేర్కొంటున్నాను.

నటులు రామాదుల భూమికలను అభినయిస్తున్నప్పుడు, చూసి, సామాజికులు హర్షం పొందుతున్నారు. అయితే రసనిష్పత్తి జరిగేది రూపకమందు వర్ణింపబడిన రామాదుల (= అనుకార్యుల) లోనా? లేదా వారి భూమికలను ధరిస్తున్న నటుల(అనుకర్తల)లోనా? లేదా చూస్తున్న ప్రేక్షకులలోనా? - ఈ ప్రశ్నలే ఈ భిన్నమతాలకు కారణములైనవి. అంటే రసం అనుకార్య నిష్ఠమా? లేదా నటనిష్ఠమా? లేదా సామాజిక నిష్ఠమా? - అనేది విచారణీయాంశమన్నమాట.

మనకు తెలిసినంతలో భట్టలోల్లటుడు ప్రప్రథమంగా భరతరస సూత్రాన్ని వ్యాఖ్యానించినాడు. ఈవాదాన్ని ఖండించి శ్రీశంకుకుడు తానింకొక విధంగా వ్యాఖ్యానించినాడు. ఈ వాదాన్ని కూడా ఖండించి భట్టనాయకుడు ఇంకో విధంగా వ్యాఖ్యానించినాడు. ఈ ముప్పురి గ్రంథాలు లభించలేదు. కాని ఈ ముప్పురి వాదాలను అభినవగుప్తుడు అభినవభారతిలో పేర్కొని తననూత్న సిద్ధాంతాన్ని ప్రతిపాదించినాడు. ఈ అభినవగుప్తమతమే నేటికీ ప్రమాణంగా ఉన్నది.

భట్టలోల్లటుడు - రసం అనుకార్యులైన రామాదులయందుంటుంది. సీతాదులు విభావం; రస మీవిభావాలచే ఉత్పాదితమై, అనుభావాలచే గమ్యమానమై, సంచారులచే పుష్టినందుతుంది. నటుడీ విభావ-అనుభావ-వ్యభిచారి భావాలను అభినయిస్తున్నప్పుడు, ఆ నటనాకౌశలంచే రసం వానియందే ఉన్నట్లు గోచరిస్తుంది. దానిని కాంచి, భావించి సామాజికులు హర్షం పొందుతారు. అంటే సర్పం కాకున్నా సర్పమనే భ్రాంతిచే రజ్జువు (=త్రాడు) వల్ల భయం కలుగుతున్నట్లే రామునకు సీతయందు గల అనురాగరూపమయిన రతి నిజంగా నర్తకునియందు లేకున్నా నాట్యనైపుణ్యంచే వానియందున్నట్లు భాసించి సహృదయుల హృదయములందు చమత్కారం కలిగిస్తూ రసమని చెప్పబడుతుంది అని తాత్పర్యం. దీనికి 'ఉత్పత్తి' లేదా ఆరోపవాదమని పేరు. భట్టలోల్లటుడు మీమాంసకుడు.

రసం రామాదినిష్ఠ మన్నప్పుడు తదనుభూతి సామాజికునకు ప్రత్యక్షంగా కలగటం లేదని అంగీకరించినట్లైనది; ఇది ఇందలి లోపం.

శ్రీ శంకుకుడు - రసం నటులయందుంటుంది; అనగా అనుకర్తృనిష్ఠం. నటులు రామాదులుగా తలంపబడుతున్నారు. వారు రత్యాదులను ప్రదర్శిస్తున్నారు.

కావున వారియందు రసం ఉంటుంది. రసం లేనప్పుడు రత్యాదులకు ప్రసక్తియే లేదుకదా. కావున వ్యాప్తిమూలంగా సామాజికుడు నటునియందు రసాన్ని అనుమానిస్తున్నాడు. ఇట్లా నటగతరత్యాది స్థాయిభావాలనే సామాజికుడు అనుభవించి ఆనందిస్తున్నాడు. అనగా ధూమం వల్ల అగ్ని అనుమానింపబడి నట్లే విభావాదులచే రత్యాదిస్థాయిభావాలు అనుమితములై రసశబ్ద వాచ్యాలు అవుతాయని తాత్పర్యం. దీనికి 'అనుమితి' వాదమని పేరు. శ్రీశంకుకుడు నైయాయికుడు.

ఇందులో కూడా సామాజికునకు ప్రాధాన్యం లేదు. అంతేకాదు అనుమానజ్ఞానం ప్రత్యక్షంవలె చమత్కారజనకం కాజాలదు– ఇది ఇందలి లోపం.

భట్టనాయకుడు - రసం సామాజికనిష్ఠం. అంటే నిజంగా సామాజికుని యందే రసోత్పత్తి జరుగుతుంది. సామాజికుడు ప్రదర్శనం చూస్తున్నప్పుడు 'సాధారణీకరణం' అనే గుణవిశేషంచే నాయకాభేదం పొంది, సాక్షాన్నాయక రసానుభవం అనుభవిస్తాడు. దీనికి 'భుక్తి' వాదమని పేరు. భట్టనాయకుడు సాంఖ్యవాది.

భట్టనాయకుడు భావకత్వ-భోజకత్వాలు అనే వ్యాపారాలను కల్పించినాడు; అవి అనవసరం. సామాజికులయందు రత్యాదులు బీజరూపంగా అయినా లేకపోతే అతడు సాక్షాన్నాయకానుభవం మాత్రం ఎట్లా పొందగలడు? ఆ విషయం చెప్పలేకపోవటమే ఇందలి దోషం. ఈ లోపాన్ని అభినవగుప్తుడు తీర్చినాడు.

అభినవగుప్తుడు - రసం సామాజికనిష్ఠమే. లోకంలో సహృదయుని హృదయమందు రత్యాదిభావాలు 'వాసనా' రూపంగా ఉంటాయి. రూపక మందలి విభావాదులు ఆరత్యాదులను మేల్కొల్పి అభివ్యక్తం చేస్తాయి. పునఃపునరనుసంధానం చేత అనగా భావనాబలంచేత ఆ విభావాదులు సాధారణములు అవుతాయి. అట్టి స్థితిలో సామాజికుడు సర్వప్రపంచాన్ని మరచి, అనిర్వచనీయమైన ఆనందం అనుభవిస్తాడు. ఇట్టి ఆనందానుభవం భావకులైన సహృదయులకు మాత్రమే కలుగుతుంది: ఇతరులయందు భావనకాని రత్యాది వాసనలు కాని ఉండవు కాన వారికి రసానుభూతి లేదు. దీనికి 'అభివ్యక్తి' వాదమని పేరు. అభినవగుప్తుడు వేదాంతి. పై సిద్ధాంతాలను ప్రక్క పట్టిక రూపంలో చూడవచ్చు :

## రసనిష్పత్తి

| వ్యాఖ్యాత | దార్శనిక మతం | వాదం | రసనిష్ఠ | 'సంయోగ'పదం యొక్క అర్థం | 'నిష్పత్తి'పదం యొక్క అర్థం |
|---|---|---|---|---|---|
| 1. భట్టలోల్లటుడు | మీమాంసకుడు | ఉత్పత్తి లేదా ఆరోపం | రామాద్యను కార్యనిష్ఠం | కార్య-కారణ భావం | ఉత్పత్తి |
| 2. శ్రీశంకుకుడు | నైయాయికుడు | అనుమితి | నటనిష్ఠం | గమ్య-గమక లేదా అనుమాప్య-అనుమాపకభావం | అనుమితి |
| 3. భట్టనాయకుడు | సాంఖ్యవాది | భుక్తి | సామాజికనిష్ఠం | భోజ్య-భోజక భావం | భుక్తి |
| 4. అభినవగుప్తుడు | వేదాంతి | అభివ్యక్తి | సామాజిక నిష్ఠమే | వ్యంగ్య-వ్యంజకభావం | అభివ్యక్తి |

రససూత్రంలో 'స్థాయిభావ' పదం చేరలేదు. కాని వివరణలో "స్థాయి భావాలు రసత్వం పొందుతున్నాయి", "స్థాయిభావాలను ఆస్వాదిస్తూ లేదా చర్వణచేస్తూ సుమనస్కులు లేదా బుధులు హర్షాదులను పొందుతున్నారు" అని చెప్పటం చేత రసనిష్పత్తితో స్థాయిభావానికి ప్రాధాన్యం ఉన్నదని స్పష్ట మవుతున్నది. అందుచేత అర్వాచీనులైన ధనంజయాదులు స్థాయిభావాన్ని కూడా రసమాత్రంలో చేర్చి, ఇట్లా చెప్పినారు :

"విభావై రనుభావైశ్చసాత్త్వికై ర్వ్యభిచారిభిః ।
ఆనీయమానః స్వాద్యత్వం స్థాయీభావో రసఃస్మృతః ॥

-(ద.రూ.IV-1).

— విభావ-అనుభావ-సాత్త్విక-వ్యభిచారి భావాలచేత స్వాద్యత్వం పొందింపబడిన స్థాయిభావమే 'రసం' అనబడుతుంది.

కాని రససూత్రంలో స్థాయిపదాన్ని చేర్చవలసిన అవసరం లేదనీ, దానిని చేర్చి ఉంటే ఆ సూత్రమందు స్థాయిగ్రహణం శల్యకల్పం అయ్యేదని అభినవగుప్తుడు వివరించినాడు. మరి ఈ భిన్నాభిప్రాయాలకు సమన్వయం క్రింది విధంగా ఊహించవలసి ఉంటుంది.

లోకంలో ప్రేయసీ-ప్రియుల పరస్పరాలోకనాలు, ఆదరణ సంలాపాలు, చిరు నగవులు మొదలగు వానిని చూచినతోడనే, వివేకి, వారిరువురి చిత్తవృత్తి ప్రీతియుక్తం లేదా రతిరూపం అని ఊహించగలడు. ఆ ప్రేయసీ ప్రియులు

రతికి కారణంకావటం, పరస్పరాలోకనాదులు ఆ రతికి కార్యాలుకావటం, పై ఊహకు అవకాశమిస్తున్నవి. లోకంలో రతికి కారణాలైన స్త్రీ-పురుషులు, రతికి కార్యాలైన స్మితాదులు, తత్సహచారులైన లజ్జాదులు కావ్య- నాట్యములందు క్రమంగా విభావాలు, అనుభావాలు, వ్యభిచారి భావాలు అవుతున్నవి. లోక మందలి సీతారాములు ఈనాటివారు కారు. అయినా కావ్య-నాట్యములందలి వాక్-అంగ-సత్త్వ-ఆహార్యాలనే చతుర్విధాభినయాలు సామాజిక హృదయమునగల భావానా శక్తిని ఉద్దీపింపజేస్తాయి. అంతట సామాజికుడు భావించటం మొదలు పెడతాడు. ఈ భావాదులను సామాజికుడు పునఃపున రనుసంధానం చేయటంవల్ల అంటే చర్వణచేస్తూ ఉండటంవల్ల నటుల రూపంలో ఉన్న సీతారా ములు అలౌకికమగు భావనారూపంపొంది ఆ సామాజికునకు అలౌకిక విభావాలు అవుతారు. అంటే సీతారాములలో సీత జనకతనయగా రాముని భార్యగా కాక, అట్లాగే రాముడు దశరథతనయుడుగా సీతభర్తగా కాక లాలిత్యం, ఉజ్జ్వలత, శుచిత, దర్శనీయత మున్నగు విశిష్ట గుణములతో కూడిన ఉత్తమప్రకృతులుగానే భాసిస్తారు. ఇట్లాగే ఆయాప్రకృతుల కటాక్షాదులును లౌకికరూపం కోల్పోయి అలౌకికమగు అనుభావరూపం పొందుతాయి. వ్యభిచారి భావాల విషయం కూడా ఇట్లాగే గ్రహించాలి. ఇట్లా విభావ-అనుభావ-వ్యభిచారి భావాలయొక్క వస్తువులు భావమాత్రములు కావున అవి అలౌకికములనటం స్పష్టం. ఇవి కావ్య-నాట్యములందు మాత్రమే ఉంటాయి.

సామాజికుడు ఈ విభావాదులను కావ్యనాట్యాలలో గ్రహించేటప్పుడు వానిని తటస్థంగా గ్రహింపడు. భావకుడైన ఆ సామాజికునిహృదయ మిది వరకే పైన చెప్పినట్లుగా కార్య- కారణాద్యనుమానం మొదలగువానిచే సంస్కరింపబడి ఉన్నది. అందుచే కావ్యనాట్యములందలి విభావాలవల్ల వాని హృదయంలో రత్యాదు లుదయిస్తాయి. అభినయములన్నీ ఆ రత్యాదులకు అనుభావాలై వానికి ఉత్తేజనం కలిగిస్తాయి. విభావాదుల చర్వణవల్ల క్రమంగా సామాజికుడు తన్మయీభావం పొందుతాడు. అంటే వాస్తవిక సీతారాముల హృదయములందెట్టి చిత్తవృత్తు లుదయింపగలవో అట్టి చిత్తవృత్తులే (వ్యభిచారి భావాలు) సామా జికునియందును పుట్టుతాయి. దీనినే 'అనుభవన'మనీ, 'తన్మయీభవన'మనీ అంటారు. ఇప్పట్ల ఈ వ్యభిచారి భావాలు (=చిత్తవృత్తులు) స్థాయిభావాలను ఒరపిడి పెడతాయి. ఈ స్థితిలో, తొలుత ఖండములుగా (=వేర్వేరుగా) తోచిన విభావ-అనుభావ-సాత్త్విక-వ్యభిచారి భావములు, అఖండత్వం (=ఏకరూపం) పొందుతాయి.

ఇట్లా విభావానుభావచర్వణ, వ్యభిచారిచర్వణయందు పర్యవసిస్తుంది; ఆ విభావానుభావాలు భావితములు కాగానే వ్యభిచారులు స్ఫురిస్తాయి. ఆ వ్యభిచారులలోనే దండలో దారంవలె ఉండి స్థాయిభావం కూడా చర్వితమవుతుంది. అట్లా చర్వ్యమాణమగు స్థాయియే రసచర్వణ నొదవిస్తుంది. ఈ రసానందం బ్రహ్మానందసహోదరం.

ఇది రసప్రతీతి విధానం; ఇది అభినవగుప్త ప్రోక్తమైన అభివ్యక్తి వాదం.

ఇచ్చట ఈ క్రిందివిషయాలను స్పష్టం చేయవలసి ఉన్నది - విభావానుభావ వ్యభిచారులు సమ్యక్సంయోగం పొందటం భావకుడయిన సామాజికుని హృదయమందే. పై వివరణనుబట్టి విభావానుభావవ్యభిచారిభావాలు మూడును రత్యాది స్థాయిభావాలను సంపూర్ణంగా సంస్కరించటంవల్లనే రసం నిష్పన్నమవుతున్నది: కావున రసనిష్పత్తికి పైమూడే కారణాలు కాని స్థాయికారణం కాజాలదు. అందుచే స్థాయిపదం రససూత్రమందు సంగృహీతం కాలేదు.

చిలుముపట్టిన కంచుపాత్రను తోమితే అది ప్రకాశిస్తుంది. కాని, ఆ ప్రకాశ మనేది ఆ కంచుపాత్రయొక్క సహజధర్మంకాదు. వెలుతురువల్ల దానికి సంక్రమించిన ధర్మమది. కాని పాత్రమే ప్రకాశిస్తున్నదని మన మంటాము. అట్లే స్వచ్ఛమైన స్ఫటికం పచ్చనిరంగు చేరితే అదికూడా పచ్చగానే ఉంటుంది. ఆ పచ్చదనం దానికి సహజధర్మం కాదు, కాని దానిని 'పచ్చనిస్ఫటిక' మని మనం వ్యవహరిస్తాము. అట్లే స్థాయిభావం రసం కాదు. కాని రసం స్థాయిభావరూపోపహితమై ఆస్వాదింపబడుతున్నది కాన స్థాయియే రసమని ఔపచారికంగా అంటాము. మొదట భావుకునకు కార్యకారణానుమానాలవల్ల రత్యాది చిత్తవృత్తులే జనిస్తాయి కావునను, విభావానుభావాలొనర్చే రసాభివ్యంజనాన్ని సంస్కరించేది స్థాయియే కావటంచేతను, వ్యభిచారిచర్వణయందంతటను స్రక్సూత్ర కల్పంగా స్ఫురించేది స్థాయియేకావటం చేతను రస ప్రసంగమునందంతటను స్థాయిభావం వ్యాపించి ఉండటం స్పష్టం. అందుచే ఔచిత్యాన్ని అనుసరించి స్థాయియే రసమని అంటారు.

క్రింది ఉదాహరణంవల్ల ఈ విషయం మరింత స్పష్టంకాగలదు.

లోకంలో తంతువులు, వేమ, తురి మొదలగు వస్త్రనిర్మాణ సాధన క్రియలతో కూడినవై పటరూపంగా పరిణమిస్తున్నవి. అప్పుడు దానికి తంతు వ్యవహారం లేదు. తంతువులు పటవాచ్యము లవుతున్నవి. ఇది పటదృష్టాంతం. ఇక ఘటదృష్టాంతం—మన్ను, దండం, చక్రం, కులాలుడు మొదలగు వాని క్రియాన్వితమైన ఘటంగా పరిణమిస్తున్నది; ఘటపద వాచ్య మవుతున్నది.

ఈ దృష్టాంతాలతో ప్రకృతాన్ని భావించాలి. తంతువులవలె, మన్ను వలె స్థాయిభావాలు విభావాదులతో కూడుకొనినవై రస రూపంగా పరిణ మిస్తున్నవి; రసపదవాచ్యములు అవుతున్నవి. తంతుభేదమున పటభేదం గోచరిస్తున్నట్లు, స్థాయిభేదమున రసభేదం గోచరిస్తుంది.

బీజంనుంచి వృక్షం, వృక్షంనుంచి పుష్పఫలాలు కలుగుతున్నట్లే, సర్వ రసాలు మూలభూతాలవుతున్నవి. వాటినుంచే భావాలు వ్యవస్థితాలవుతున్నవి (భావాది వ్యపదేశం కలవి అవుతున్నవి).

రత్యాది స్థాయిభావాలు జడమగు అంతఃకరణధర్మాలు. కాని రసమనేది ఆత్మసంవేదనారూపమైనది, అనగా అది చిద్ఘనమగు ఆత్మస్వరూపం. వీనికి పరస్పరైక్యం సంభవింపదు గాన స్థాయియే రసమనటం పొసగదు. కావుననే భరతుడు సూత్రమునందు స్థాయిపదాన్ని గ్రహించలేదు; గ్రహించిఉంటే నిజంగా శల్యకల్ప మయ్యేడిదే.

పై కారణంచేతనే దృష్టాంతమందు కూడ స్థాయికల్పమైన పదం గ్రహింప బడలేదు. అభినవగుప్తుడు రసనిష్పత్తి సూత్రాన్ని దృష్టాంతంలో క్రిందివిధంగా సమన్వయించాడు. పాకరూపమైన సమ్యగ్యోజనంచేత లౌకికమైన రసం పుట్టు తున్నది. ఇచ్చట రసాభివ్యంజకమైన జలం ప్రధానం కావున ఈ వ్యంజనం విభావస్థానీయం. చింతపండు, పసుపు మొదలగునవి అనుభావప్రాయాలు. గుడాది ద్రవ్యాలు, చుక్రాది రసవిలక్షణ మధురాది యోగంచేత వ్యభిచారికల్పాలు. ఇవి అన్నీ మిశ్రితములైనప్పుడు జనించే రసవిశేషం స్థాయికల్పం; ఇది విభావకల్పమైన వ్యంజనజనితమని తెలియవలెను. కావున లౌకికమయిన రసమునందును సంయోగముచెందేవి మూడు మాత్రమే; తత్కల్పములైన విభావాదులు మూడే రససూత్రమందును గ్రహింపబడినవి [అభినవభారతి-1వ సం-పుట 288].

నిజానికి బ్రహ్మానందంకాని, రసానందంకాని అఖండరూపంగానే ఉంటుంది. కాని రసానందం తొమ్మిది విధాలయిన స్థాయిచిత్తవృత్తులచే ఉపహితంకావటం వల్ల శృంగార-వీరాదిరూపాలుగా నానావిధాలు అవుతున్నది. అంటే ఉపాధులగు రత్యాదుల ఆకారాలతో స్వప్రకాశం, పరిశుద్ధం, అఖండం అయిన రసానందం వివిధాలుగా కన్పట్టటం సంభవిస్తున్నది. ఇదియే బ్రహ్మానందానికి దీనికిని భేదం. బ్రహ్మానందంలో పరబ్రహ్మముతప్ప ఇతరమేమీ గోచరం కాదు. ఇక రసానుభవం అంతఃకరణ వృత్తులగు రత్యాదులతో ఉపహితములవుతూనే రసంగా గోచరిస్తాయి. రంగుతో కూడిన స్ఫటికం ఆ రంగుయొక్క ఆకారంతోనే కన్పట్టినట్లుగా రసానందంకూడా ఏ స్థాయి ఉపాధిఅవుతుందో ఆ స్థాయిరూపంగానే అది

అనుభవంలోనికి వస్తుంది. విభావాది చర్వణ ఉన్నంతకాలమే ఈ రసానందం ఉంటుంది.

దృశ్యప్రధానమైన నాట్యమందు ప్రేక్షకునకు రసాస్వాదం కలుగుతున్నది; సరే. మరి శ్రవ్య ప్రధానమైన కావ్యపఠనంవల్ల పఠితకు లేదా శ్రోతకు రసాస్వాదం ఎట్లా కలుగుతుంది? ఈ ప్రశ్నకు సమాధానం వాక్యపదీయకారుడైన భర్తృహరి క్రిందివిధంగా చెప్పినాడు :

శబ్దోపహితరూపాం స్తాన్ బుద్ధేఽర్విషయాతాం గతాన్ ।
ప్రత్యక్షానివ కంసాదీన్ సాధనత్వేన మన్యతే ॥

శ్రవ్యకావ్యమునందు కవికృతములైన వర్ణనలచే కంసాదులు (నాయకులు) రూపాలను పొంది సామాజికుని భావనచే వాని హృదయంలో ప్రవేశించి ప్రత్యక్షంగా గోచరిస్తారు. అప్పుడు పఠిత లేదా శ్రోత తదభేదంచెంది రసాస్వాదం చేస్తాడు. సహృదయులైన వారికి మాత్రమే కావ్యమందు రసాస్వాదం కలుగుతుంది. ఇంక నాట్యం సహృదయులనేకాక సామాన్యులను కూడ ఆకర్షించటానికి సమర్థమైనది. నాట్యమందలి ధ్రువాగీత్యాదులవల్ల, ఇంకను తత్కాలోపస్థితములైన ఇతర కారణాలవల్ల సామాజికుల హృదయాలు సంస్కరింపబడి వారి అందరి హృదయాలు ఏకరూపములై రసాస్వాదనోన్ముఖములవుతాయి. కావుననే రూపక ప్రస్తావనలోని నటీ-గీతాదులు సామాజికుల మనోనురంజనం చేయటానికి ఉద్దిష్టములై ఉన్నవి. ఇట్లా రసాస్వాదనోన్ముఖములైన హృదయములందు పైనచెప్పిన విధంగా రసనిష్పత్తి జరుగుతుంది.

రసం స్వశబ్దవాచ్యం కారాదు; అది అభివ్యంజకం కావాలి. భావ-అభినయాలేకాక అనుప్రాసాదులు, వృత్తి-రీతులు మొదలగునవి కూడా రసాభివ్యంజకములవుతున్నవి. లౌకికములైన పలుకులనే కవి కావ్యరూపంలో నిష్పాదించినప్పుడు ఈ అభివ్యంజన మేర్పడుతుంది. కనుకనే సహృదయుడు కావ్యాన్ని పలుమారు చదివి, నాటకాదుల ననేకవారములు చూసి, తనివితీరక, మాటిమాటికి చదువుతూ, చూస్తూ ఆనందసాగరమున మునుగుతున్నాడు. ఇట్లెన్ని పర్యాయాలు పఠించినా విసుగు కలుగనీయక రసాస్వాదమొనరింపగల కావ్యాలే కర్తకు 'మహాకవి' అనే ప్రసిద్ధిని కొనితేగలవు.

ఋషులు, భరతమునిని ఇంకో ప్రశ్న వేసినారు: రసాలు భావాలనుంచి నిర్వృత్తములవుతున్నవా? లేదా భావాలు రసాలనుంచి నిర్వృత్తములవుతున్నవా?

భరతముని ఇట్లా సమాధానం చెప్పినాడు: భావాలనుంచే రసాలు నిర్వృత్తములవు తున్నవి; రసాలనుంచి భావాలుకాదు. బీజంనుంచి వృక్షం, వృక్షంనుంచి పుష్పాలు, ఫలాలు కలుగుతున్నాయి. అట్లాగే రసాలు మూలం; వానినుంచే భావాలు వ్యవస్థితములవుతున్నాయి. వ్యంజనౌషధి సంయోగంచేత అన్నం స్వాదుత్వం (=ఆస్వాద్యత) పొందుతున్నది; అన్నంచేత వ్యంజనాలకు సుఖభోగ్యత కలుగు తున్నది. అట్లాగే భావాలు, రసాలు పరస్పరం భావింప బడుతున్నవి.

న భావహీనోఽస్తిరసో న భావో రసవర్జితః ।
పరస్పరకృతా సిద్ధి స్తయో రభినయేభవేత్ ॥ (-నా.శా.VI-36)

— భావహీనమైన రసం ఉండదు; అట్లే రసవర్జితమైన భావం ఉండదు. ఇట్లా పరస్పరకృతమైన రసభావాలసిద్ధి అభినయంద్వారా సంభావ్యమవుతున్నది.

## 13. రససామగ్రి : రసానుభూతి

తార్కికపదజాలాన్ని, శాస్త్రీయసంక్లిష్టతను విడనాడి రససిద్ధాంత సారాన్ని సులభగ్రాహ్యమగునట్లుగా క్రింద వివరిస్తున్నాను :

రస సామగ్రి :

1. రసానుభూతి అందరికీ కలుగదు. ఆ అనుభూతి సంస్కారవంతులైన సహృదయులకు మాత్రమే కలుగుతుంది. సంస్కారమంటే రత్యాది భావా లను ఆస్వాదింపజేసే హృదయధర్మం. ఈ భావాలు అప్పటికప్పుడు కలిగేవి కావు. బీజరూపంగా సహృదయుల మనస్సులలోనే ఉంటాయి. ఈ బీజాలు (=రత్యాది భావాలు) మొలకెత్తటానికి అవకాశం కలిగే పర్యంతం సుప్తావస్థలో హృదయమందు అణగి ఉంటాయి. వీటికి 'వాసనలు' అని పేరు. ఈ వాసనల నిద్రావస్థయే 'నిర్వికారాత్మక చిత్తస్థితి.'
2. హృదయాకర్షకమైన సన్నివేశం లేదా వస్తువు లేదా వ్యక్తి హేతువుగా నిద్రా వస్థలో ఉన్న రత్యాదిభావాలు సంస్కారబలంచేత ఉద్బుద్ధములవుతాయి. ఇట్లా రత్యాదులుద్బుద్ధములు కావటానికి హేతువైన సన్నివేశం, లేదా వస్తువు, లేదా వ్యక్తి 'విభావం' అనబడుతుంది.
3. తడి తగిలినవెంటనే బీజం నుంచి మొలక వచ్చినట్లుగా నిద్రావస్థలో ఉన్న రత్యాదులు శక్తిసంపన్నం, విశిష్టం అయిన ఈ విభావం ఆధారంగా

ఉద్బుద్ధములవుతాయి. ఇతఃపూర్వం, నిర్వికారంగా ఉన్న చిత్తమునందిట్లా ఉద్బుద్ధమయిన దానిని 'భావం' అంటారు. అనగా విభావమాధారంగా మనస్సునందు కలిగే ప్రథమవికారం లేదా చిత్తవృత్తి విశేషం 'భావం' అనబడుతుంది (అనగా విభావం కారణం, భావం కార్యం).

4. ఆ భావం చంచలం కాక రసస్ఫూర్తి వరకు స్థిరంగా ఉండాలి; ఇట్టి భావానికి 'స్థాయి భావం' అనిపేరు. ఇవియే రత్యాదులు. ఏ విధమైన ఇతర భావ సంపర్కం కలిగినా మార్పునకు లోనుగాక, ఆ భావాలను కూడా తనలో లయింపజేసికోగల లేదా తనకు పోషకమగునట్లు చేసికోగల దృఢత్వం కలదే 'స్థాయిభావం' అనబడుతుంది.

విశిష్టమైన సన్నివేశం ఆధారంగా సహృదయుడగు వ్యక్తి హృదయంలో మొలకెత్తి, వికాసంగాంచి, రసస్ఫూర్తి పర్యంతం నిలిచి ఉండే భావమేస్థాయి భావ మవుతుందని సారాంశం.

5. ఇట్లా స్థిరపడిన భావాలు విభావచర్వణాబలంతో సహృదయుని హృదయంలో ఉత్తేజం పొందుతాయి. ఇది రసోన్ముఖమైన స్థితి. వీనినే ఉద్వేగాలు అంటారు.

6. అట్లా హృదయంలో ఉత్తేజం పొందిన స్థాయిభావాలు నాయికా- నాయకుల (వారితో అభేదం చెందిన సామాజికుల) మనో-దేహాలపై ప్రాబల్యం వహించి, వారిని అనేకములగు ప్రవృత్తులకు లోనుజేస్తాయి. ఈ మార్పులు హృదయవికాసం కలిగిన వెనువెంటనే కలిగేవి కాన వీనికి 'అనుభావాలు' అని పేరు. ఈ అనుభావాలు రెండు రకాలు: వ్యక్తి ప్రయత్నపూర్వకంగా చేసే కటాక్ష-భ్రూవిక్షేపాదులు మొదటి రకం; ఇవి కేవలానుభావాలు. ఇందులకు హృదయం పూర్తిగా భావావిష్టం కానక్కరలేదు.

7. ఇంక వ్యక్తి ప్రయత్నమేమీ లేకయే దేహమునందు చూపట్టే అనుభావాలు రెండవరకం. వీనికి 'సాత్త్విక' భావాలని పేరు; ఇవియే రోమాంచాదులు. హృదయాలు పూర్తిగా భావావిష్టములైనప్పుడే ఈ భావాలు వ్యక్తము లవుతాయి. సత్త్వం అంటే హృదయగతభావాలను పైకి ప్రకాశింపజేసే మానసిక వ్యాపారం; (సాత్త్విక భావాలు కూడా నిజానికి అనుభావాలే కాన రససూత్రమందివి వేరుగా గణింపబడలేదు).

8. స్థాయిభావ ప్రాబల్యంతో ఇట్లా దైహికములైన మార్పులు మాత్రమే కాక మనస్సున పెక్కు భావపరంపరలు ఉద్బుద్ధములవుతాయి. ఈ భావపరం పరనే 'వ్యభిచారిభావాలు' లేదా 'సంచారిభావాలు' అంటారు. ఇవియే

నిర్వేదాదులు. ఈ భావాలు హృదయంలో స్థిరంగా నిలువక వెంటవెంటనే పుట్టుతూ లేస్తూ అడగుతూ ఉంటాయి. కావుననే వీనిని సముద్రపుటలలతో పోలుస్తారు. ఇవి స్థాయిభావాలను దృఢతమం చేసి రసాభిముఖంగా నడిపిస్తాయి.

9. పైన పేర్కొనబడిన విభావ-అనుభావ-సాత్త్విక-వ్యభిచారిభావాలచేత పై విధంగా స్థాయిభావాలు స్వాద్యత్వం పొందింపబడినప్పుడు సామాజికుడు శుద్ధము, స్వప్రకాశము అయిన ఆనందం అనుభవిస్తాడు. ఈ ఆనందం ఉపాధి అయిన స్థాయితో సంవలితమై ఉంటుంది. ఇట్టి ఆనందాన్నే 'రసం' అంటారు. ఈ రసానందం బ్రహ్మానందసహోదరం.

రసానుభూతి :

రసానుభూతి పొందటానికి సామాజికుడు నాలుగు అవస్థలను దాటవలసి ఉన్నదని, ఐదవదానిలో ఆనందానుభవం కలుగుతుందని అభినవగుప్తుని సిద్ధాంతం. ఆ అవస్థలను క్రింద వివరిస్తున్నాను:

1. హృదయసంవాది అయిన విభావం (Aesthetic object) సామాజికుని కనులను, చెవులను విప్పారజేస్తుంది (Sense level).

2. ఈ దర్శన-శ్రవణముల వల్ల సామాజికుడు భావన చేయటానికి మొదలు పెడతాడు. ఆ భావన వల్ల క్రమంగా అతడు ఆ విభావం యొక్క పరిమిత బాహ్యస్వరూపాన్నే కాక అందు దాగియుండి బాహ్యేంద్రియాలకు కన్పట్టని విశిష్టధర్మాన్ని అనంతత్వాన్ని దర్శింపగలుగుతాడు (Imaginative level). ఇందులకు రంగం మీద ప్రదర్శితమయ్యే, కావ్యమందు వర్ణితమైన అనుభావాదికం దోహదం చేస్తుంది.

3. ఇట్లా విశిష్ట దర్శనమైనంతనే వాని ప్రవృత్తి మారిపోతుంది. ఇప్పుడు వానికి ఎదుట ప్రత్యక్షంగా కన్పించే విభావాదులతో పనిలేదు, వాని అంతర్యం కూర్చి తాను భావనచేసిన విశిష్టస్వరూపమే వాని మనః ఫలకం ఎదుట నిలిచి ఉంటుంది. (ఇట్టి అర్థమునందే "Art is the representation of the real in its mental aspect" అని Worsfold పేర్కొన్నాడు). అంటే సామాజికుడు లౌకిక ప్రవృత్తి నుంచి మరలి, స్వీయసృష్టి అయిన ఒకానొక భావనాలోకంలో సంచరిస్తూ ఉంటాడు. ఆ స్థితిలో అతడు పునఃపునరనుసంధానం చేస్తూ తన భావనకు కారణమైన విభావంతో తాదాత్మ్యం (Identity) పొందుతాడు. అట్లా నాయకాద్యభేదం పొంది,

సాక్షాత్తుగా తదనుభవాన్నే తాను కూడా పొందటానికి అభిముఖుడవుతాడు. వెనువెంటనే నాయకాదుల ఆవేశాదులెట్టివో అట్టివే వీనికి కూడా కలుగుతాయి. అంటే వారి సుఖ-దుఃఖాలనే ఈతడు పొందుతాడు. ఇదియే ఉద్వేగస్థితి లేదా సత్త్వస్థితి (Emotional level). సామాజికుని లేదా పాఠకుని ఇట్టి స్థితిని పొందింపగల ప్రయోగం లేదా కావ్యం మాత్రమే ఉత్తమం అవుతుంది.

4. ఇట్లా సాక్షాన్నాయకాద్యనుభవాన్నే పొందుతూ ఆ భావతీవ్రతకే లోనైన సామాజికుడు క్రమంగా తన్నుతాను మరచిపోతాడు (Self-forgetfulness). అంటే అతడు స్వ-పర భేదాలకు కారణమైన వ్యక్తిత్వం కోల్పోతాడు. ఇట్టి అలౌకిక స్థితికే 'సాధారణీకరణం' (Universaliastion) అని పేరు. సంభావన సరిగా లేకపోవటం మొదలగు ఏడు విఘ్నాలను తరంచినప్పుడే సామాజికుడిట్టి స్థితిని పొందగలడు.

5. ఈ సాధారణీకరణ స్థితిలో సామాజికుని బాహ్యేంద్రియాలు పని చేయటం పూర్తిగా మానివేస్తాయి. స్థాయితో కూడిన హృదయం, ఆనందంతో నిండిన ఆత్మ- ఇవి రెండు మాత్రమే పనిచేస్తుంటాయి. ఇదియే బ్రహ్మానందసబ్రహ్మచారి అయిన రసస్థితి (Transcendency).

అసలు ఆత్మ ఆనందస్వరూపం. కాని, దానిని అజ్ఞానం లేదా విషయాంతరాలు ఆవరించి ఉంటాయి. ఆ అజ్ఞానం తొలగితే ఆనందం స్వస్వరూపంతో ప్రకాశిస్తుంది. విభావ-అనుభావ-వ్యభిచారి చర్వణ వల్ల ఆ అజ్ఞానావరణం తొలగుతుంది. అంటే మనస్సునకు ద్రుతి (కొంచెం మనస్సు కరగటం), విస్తరం (మనస్సు కొలదిగా విప్పారటం), వికాసం (మనస్సు పూర్తిగా విప్పారటం) అనేవి క్రమంగా కలుగుతాయి. అప్పుడు అనిర్వచనీయమైన ఒక చమత్కారవిశేషం జనిస్తుంది; అదియే రసం లేదా ఆనందం. విభావాది చర్వణలో ఏస్థాయిభావం చర్వితమవుతుందో తద్భావోపహితమై ఈ రసం ఆస్వాదింపబడుతుంది. విభావాదికాన్ని చర్వణచేస్తున్నంతసేపు సామాజికునకు లేదా పాఠకునకు ఈ రసానుభూతి ఉంటుంది.

"What is Art" అనే గ్రంథంలో (11 వ అధ్యా.) టాల్‌స్టాయ్ భరతుని సిద్ధాంతాలను పోలిన సిద్ధాంతాలను కొన్నింటిని ప్రతిపాదించినాడు.

ఉదా : 'రసప్రతీతి' ని అతడు "Transmission of feelings" అన్నాడు.

విభావాదికాన్ని చర్వణచేస్తున్నంతసేపు ప్రేక్షకునకు, పాఠకునకు, శ్రోతకు ఈ రసానుభూతి ఉంటుంది. అంతేకాదు తరువాతి కాలంలో, అవి జ్ఞప్తికి వచ్చినప్పుడు కూడా ఈ రసానుభూతి కలుగుతుంది.

రసానుభూతి కలగటానికి ఇన్ని దశలున్నప్పటికీ అదంతా క్షణకాలంలో ప్రేక్షకునకు, పాఠకునకు, శ్రోతకు- తెలియకుండానే జరిగిపోతుంది. అందు చేతనే "ఒక్క వాక్యమే, అది రసాత్మకమైనదైతే, కావ్యం అనిపించుకొంటుంది" ( వాక్యం రసాత్మకం కావ్యం) అని విశ్వనాథుడు ఉద్ఘోషించినాడు.

ఇంకొక్క విషయం. ఈ రసానుభూతి కావ్య-నాట్యాలకు మాత్రమే పరిమితం కాదు. సుందరమైన చిత్రాన్ని లేదా శిల్పాన్ని చూసినప్పుడు, మనోహరమైన శబ్దాన్ని విన్నప్పుడు కూడా కలుగుతుంది. ఇప్పట్ల బాలరామభరతంలో బాలరామవర్మ చేసిన వివరణ పరిశీలించటం ఫలప్రదం కాగలదు. రసం ఇంద్రియాలవల్ల తెలియవస్తుంది, అది ఆత్మజన్యగుణం. కావున జ్ఞానేంద్రియాలవల్ల, కర్మేంద్రియాలవల్ల జరిగే రసోత్పత్తిని బాలరామవర్మ ఇట్లా వివరించినాడు.

"భావోనామ ఆత్మ-మనస్సంయోగ క్రియావిశేషః, సుఖ దుఃఖాది నవరసాత్మకః" అని బాలరామవర్మ 'భావ' నిర్వచనం. —ఆత్మ-మనస్సుల సంయోగం వల్ల జరిగే క్రియావిశేషం భావమనబడుతుంది. అది సుఖ-దుఃఖాది రూపాలైన నవరసాలుగా ఉంటుంది. ఇటువంటి భావం, జ్ఞానేంద్రియాల ద్వారా లేదా కర్మేంద్రియాల ద్వారా వ్యక్తమవుతుంది- జ్ఞానేంద్రియాలద్వారా వ్యక్తమైనప్పుడు అది 'భావాత్మకం' అవుతుంది; ఇంక కర్మేంద్రియాలద్వారా వ్యక్తమైనప్పుడు క్రియాత్మకమవుతుంది. (బాలరామభరతం-పుటలు-113-116).

1. జ్ఞానేంద్రియాల వలన రసోత్పత్తి :

(i) శబ్దం వల్ల రసోత్పత్తి :

మధుర శబ్దం - శృంగారం.
క్రూర శబ్దం - కోపం.
దీన శబ్దం - కరుణం.
ఉత్తమ శబ్దం - అద్భుతం.
నికృష్ట శబ్దం - బీభత్సం.
హుంకార శబ్దం - భయం.
నిందిత శబ్దం - రౌద్రం.
వినోద శబ్దం - హాస్యం.
స్వభావ శబ్దం - శాంతం.

(ii) ధ్వని (=గీతశ్రవణాదులు) వలన రసోత్పత్తి :

| | |
|---|---|
| శుకధ్వని | - మధురం. |
| కోకిల ధ్వని | - అద్భుతం. |
| పేచక ధ్వని | - భయం. |
| బక ధ్వని | - బీభత్సం. |
| మయూర ధ్వని | - వీరం. |
| కపోత ధ్వని | - కరుణం. |
| క్రౌంచ ధ్వని | - హాస్యం. |
| ప్లవ ధ్వని | - కోపం. |
| భారద్వాజ ధ్వని | - శాంతి. |

(2) స్పర్శ (=త్వగింద్రియం) వలన రసోత్పత్తి :

| | | |
|---|---|---|
| శీతస్పర్శ | - కంపనం | - భయం. |
| ఉష్ణ " | - తాపం | - దుఃఖం. |
| సమత్వ | - సుఖం | - శృంగారం. |
| సుఖాధిక | - ధైర్యం | - వీరత. |
| వీరతా | - ఆనందం | - అద్భుతం. |
| శీతవస్త్రాది | - ఉష్ణశాంతి | - శాంతి. |
| జీర్ణవస్త్రాది | — | హాస్యం. |
| " | | బీభత్సం. |

3. దర్శనం (=చక్షువు)వలన రసోత్పత్తి :

| | |
|---|---|
| సురూపదర్శనం | - శృంగారం. |
| ప్రతిరూప | - కోపం. |
| అతిరూప | - అద్భుతం. |
| విరూప | - హాస్యం. |
| " | - బీభత్సం. |
| కురూప | - రౌద్రం. |
| సరూప | - శాంతి |

దర్శనజన్యమైన రసోత్పత్తి చేతన-అచేతన భేదంచేత రెండు విధాలు :

చేతనం— మనుష్యాదులు, చతుష్పాత్తులు, గో-మృగ-గజ-అశ్వ-ఖర-శునక-వ్యాఘ్ర-తరక్షాదులు.

అచేతనం— ప్రతిమలు, చిత్రములు.

ఇట్లా రెండు విధాల నవరసోత్పత్తి సంభవిస్తుంది. పుత్ర-దార-గురు-బంధు-మిత్ర-అమిత్ర-సమదర్శనంవల్ల కూడా నవరసోత్పత్తి సంభావ్యం.

గృహ-క్షేత్ర-విత్త-కనక-రజత-రత్నాది లాభంవలన-సంతోషం-శృంగారం.

| | |
|---|---|
| అధికలాభం | - ఉత్సాహం-వీరం. |
| ఉత్తమద్రవ్య లాభం | - అద్భుతం. |
| ద్రవ్యాది నష్టం | - బీభత్సం. |
| రాజ-చోర-ఆక్రమణం | - భయం. |
| ధూర్తవ్యయం | - హాస్యం. |
| త్యాగం | - శాంతి. |

4) రసనేంద్రియంవల్ల షడ్రసాలనుంచి నవరసోత్పత్తి :

| | |
|---|---|
| మధుర రసాస్వాదన | - శృంగారం. |
| మధురాధిక్యం | - మదం-గర్వం. |
| అద్భుత మధురభక్షణం | - అద్భుతం. |
| మధురములు దుష్టములుకావటం | - బీభత్సం |
| మధురములు విషసంయుక్తములు | - భయం. |
| మధురములు రసహీనములుకావటం | - హాస్యం. |
| మధుర-అభావం | - కరుణం. |
| మధుర అపహరణం | - రౌద్రం. |
| మధుర త్యాగం | - శాంతి. |

5) ఘ్రాణేంద్రియం (=నాసిక) ద్వారా నవరసోత్పత్తి :

మాలతీ-చంపక-కస్తూరీ-మృగమద

| | |
|---|---|
| ఆఘ్రాణంవలన | - శృంగారం |
| గంధాధిక్యం | - గర్వం |
| అతిగంధాఘ్రాణం | - అద్భుతం |

| | |
|---|---|
| నానాగంధాఘ్రాణం | - హాస్యం |
| దుర్గంధ అఘ్రాణం | - బీభత్సం |
| గంధనాశం | - దుఃఖం<br>కోపం |
| వ్యాఘ్రగంధ ఆఘ్రాణం | - భయం |
| నిర్గంధ ఆఘ్రాణం | - శాంతి |

**2. కర్మేంద్రియాలవలన రసోత్పత్తి :**

*1.* వాక్కువలన రసోత్పత్తి :

| | |
|---|---|
| సత్కథాలాపంవల్ల | - శంగారం. |
| అసత్కథాలాపం | - బీభత్సం. |
| శత్రుకథాలాపం | - కోపం. |
| చిత్రకథాలాపం | - అద్భుతం. |
| విటకథాలాపం | - హాస్యం. |
| చోర-వ్యాఘ్ర-సర్పాది కథాలాపం | - భయం. |
| రామాయణాది కథాలాపం | - విశ్వాసం-దయ. |
| అనిష్టకథాలాపం | - దుఃఖం. |
| వివేక కథాలాపం | - శాంతి. |
| ప్రమోదవచనం | - శృంగారం. |
| వీరవాదం | - వీరం. |
| అద్భుతవాక్యం | - అద్భుతం. |
| పరిహాసవాక్యం | - హాస్యం. |
| సంకటవాక్యం | - దుఃఖం. |
| నిగ్రహవాక్యం | - భయం. |
| అనుగ్రహవాక్యం | - దయ. |
| అధిక్షేపవాక్యం | - బీభత్సం. |
| ఉపరతివాక్యం | - శాంతి. |
| శుభవార్త వినటం | - శృంగారం. |
| అశుభవార్త వినటం | - కరుణం. |
| జయవార్త వినటం | - వీరం. |
| అతిశుభవార్త వినటం | - అద్భుతం. |

| | |
|---|---|
| అనర్థవార్త వినటం | - కోపం. |
| విరుద్ధవార్త వినటం | - బీభత్సం. |
| అప్రియవార్త వినటం | - అవహాసం. |
| ప్రియవార్త వినటం | - విహసితం. |
| అపవాదవార్త వినటం | - భయం. |
| నిర్దోషవార్త వినటం | - శాంతి. |

2. హస్తవ్యాపారంవలన నవరసోత్పత్తి :

| | |
|---|---|
| రసచేష్టవలన | - శృంగారం. |
| విరసం చేష్ట | - విరోధం. |
| రసాభాస చేష్ట | - బీభత్సం. |
| రసాద్భుత చేష్ట | - అద్భుతం. |
| వీరరస చేష్ట | - వీరం. |
| ఇంగిత చేష్ట | - హాస్యం. |
| సంకట చేష్ట | - భయం. |
| ,, | - దుఃఖం. |

| | |
|---|---|
| మంగలద్రవ్య దానం | - శృంగారం. |
| అమంగలద్రవ్య దానం | - కోపం. |
| అధిక ద్రవ్యప్రదానం | - వీరం. |
| అతిశయవస్తు ప్రదానం | - అద్భుతం. |
| కుత్సితద్రవ్యవస్తు ప్రదానం | - బీభత్సం. |
| విషద్రవ్యవస్తు ప్రదానం | - భయం. |
| నిష్ఫలద్రవ్యవస్తు ప్రదానం | - హాస్యం. |
| సంకట ద్రవ్యవస్తు ప్రదానం | - కరుణం. |
| సమ్మతద్రవ్య వస్తుప్రదానం | - శాంతి. |

| | |
|---|---|
| సుఖ-దుఃఖములందు | - ఆలింగనం. |
| కోపంలో | - తాడనం. |
| బీభత్సంలో | - ధిక్కారం. |
| దైన్యంలో | - యాచన |

భయంలో - వీరభావం, ధైర్యం.
అద్భుతంలో - శ్లాఘనం.
శాంతంలో - ఉపచారం.

*3. పాదవ్యాపారంవలన నవరసోత్పత్తి :*

రాజవీథీగమనం - శృంగారం.
ఉల్లాసగమనం - అద్భుతం.
యుద్ధరంగగమనం - వీరం.
కంటకమార్గగమనం - కరుణం.
వేశ్యావీథీగమనం - హాస్యం.
శత్రువీథీగమనం - కోపం.
చోరమార్గగమనం - భయం.
సంకటమార్గగమనం - బీభత్సం.
స్వేచ్ఛాగమనం - శాంతి.

*ఇతరములందు కూడా రసోత్పత్తి :*

ఇష్టప్రాప్తి - శృంగారం.
అనిష్టప్రాప్తి - కరుణం.
అభీష్టాధికప్రాప్తి - వీరం.
అభీష్టసంపూర్ణప్రాప్తి - అద్భుతం.
ఇష్టపరిత్యాగం - బీభత్సం.
ఇష్టవిరుద్ధఫలం - హాస్యం.
ఇష్టా-అనిష్టసమత్వం - శాంతి.

## 14. రసం : సుఖదుఃఖాలు

కావ్య-నాట్యాల శ్రవణ(లేదా పఠన)-దర్శనాలవల్ల కలిగేది ఆనందం అనీ, ఇది బ్రహ్మానందసహోదరమనీ అందరూ అంగీకరించినదే. అరిస్టాటిల్ మున్నగు పాశ్చాత్యులు విషాదరూపకంవల్ల కూడా ఆనందమే (pleasure) కలుగుతుందని అంగీకరించినారు. కాని, "…. స్థాయిభావాలను సుమనస్కులైన ప్రేక్షకులు ఆస్వాదిస్తూ హర్షాదులను పొందుతున్నారు" అని భరతముని చెప్పటాన్నిపట్టి

హర్షంతోపాటు 'శోక-భయాదులనుకూడా పొందుతారు' అనే అర్థం రావటానికి అవకాశంఉన్నది. అందుచేత 'హర్షం పొందుతారు' అని చెప్పటం సమంజసమని కొందరు భావించగా, మరికొందరు 'హర్షంతోపాటు శోక-భయాదులను కూడా పొందుతారు'అని భావించినారు. రసం సుఖాత్మకమేకాక దుఃఖాత్మకంకూడా అవుతుందని నాట్యదర్పణకర్తలు స్పష్టంగా పేర్కొన్నారు:

> "స్థాయిభావః శ్రితోత్కర్షో విభావవ్యభిచారిభిః ।
> స్పష్టానుభావనిశ్చేయః సుఖ-దుఃఖాత్మకో రసః" ॥

కొన్ని రసాలు నిజంగా దుఃఖాత్మకములేఅనీ, ఆ రసాలతో ఉన్న ప్రదర్శనాదులను చూసి ప్రేక్షకు డానందించటానికి కారణం నాటక కర్తలయొక్క లేదా నటులయొక్క ప్రతిభయే అని వారు నిరూపించినారు. "రసాహి సుఖ-దుఃఖావస్థారూపాః" అని భోజుడుకూడా అభిప్రాయపడినాడు. 'రసకలిక'యందు రుద్రభట్టుకూడా "కరుణామయానామప్యుపాదేయత్వం సామాజికానామ్. రసస్య సుఖ-దుఃఖాత్మకతయా తదుభయ లక్షణత్వేన ఉపపద్యతే. అత ఏవ తదుభయ జనకత్వమ్" అని చెప్పినాడు.

లోకమందలి సుఖ-దుఃఖాలే అభినయోపేతములై నాట్యమవుతున్నవని కూడా భరతముని పేర్కొన్నాడు. లోకంలో సుఖదుఃఖాలవల్ల మనకు క్రమంగా హర్ష-శోకాలు కలుగుతూఉంటాయి. కాని కావ్య-నాట్యములందు ఇట్లా జరగటం లేదు. సీతారాముల వియోగమందు కూడా నాట్యంద్వారా మనం ఆనందమే పొందుతున్నాము; ఆనందం కలుగకపోతే సొమ్ము పెట్టి టిక్కట్టు కొనుక్కోవటానికి లేదా ఆహ్వానంమీద వెళ్ళినా కొన్ని గంటలు వృధా చేయటానికి మనం అంగీకరిస్తామా? అంగీకరించం. కావున ఆనందం కొరకే మనం కావ్య-నాట్యాలను ఆదరిస్తున్నామనటం సత్యసమ్మతం.

పై అభిప్రాయాలు రెండింటియందు కొంత సత్యం, కొంత అసత్యం లేకపోలేదు. కావ్య- నాట్యాలనుంచి మనం ఆనందాన్నే పొందుతున్నామనటం సత్యం. కాని, శృంగార రసాస్వాదం, కరుణరసాస్వాదం ఒకేవిధంగా ఉంటుందని చెప్పటం సమంజసంకాదు. శృంగారమందలి ఆనందం రత్యుపహితమైనదికాగా, కరుణమందలి ఆనందం శోకోపహితమైనదనటం అసత్యంకాదుకదా? అచ్చటను ఇచ్చట ఆనందం సమానమే అన్నప్పటికీ మరి స్థాయిభావాలలోని భేదాలమాట ఏమిటి? ఈ ఉపాధిభేదాలచేతనే అఖండమైన రసానందం నవవిధాలుగా గోచరిస్తున్నదని అంగీకరించాముకదా? అందుచేత కరుణరసాస్వాదంలోని ఆనం

దంలో శోకమనేది రేఖామాత్రంగా అయినా ఉండకతప్పదు; అప్పుడు కనులవెంట నీరుకారటాన్ని విశ్వనాథుడు ఇట్లా సమర్థించినాడు :

"లౌకికములైన శోక-హర్షాదులవల్ల లోకంలో మనకు శోక-హర్షాలే కలుగుతాయి; కాని, లోకమందలి ఆ శోక-హర్షాలే కావ్య-నాట్యములందు అలౌకిక విభావాలపేర వ్యాపృతములై, అవి అన్నీ హర్షాన్నే కలిగిస్తాయి. మరి హరిశ్చంద్రాదుల చరితం చూసినప్పుడు అశ్రుపాతాదులు కలగటానికి కారణం హృదయం కరగటంచేత మాత్రమే." (సా.ద.III.377-38 సూ.).

ఇట్లా, కావ్య-నాట్యములందలి రసానందం లౌకికమైన ఆనందం కంటె భిన్నమై, 'అలౌకికానందం'గా, 'బ్రహ్మానంద సహోదరం'గా గుర్తింపబడింది. కావుననే ఈ అలౌకికరసాలను 'నాట్యరసాలు' అంటారు. 'రతి', చైతన్యంయొక్క ఆనందాంశంతో సంవలితమై శృంగారరసాన్ని స్ఫురింపజేస్తున్నట్లే, జుగుప్సా-భయ-క్రోధ-శోకాలు, చైతన్యంయొక్క ఆనందాంశతో సంవలితములై క్రమంగా బీభత్స-భయానక-రౌద్ర-కరుణరసాలను స్ఫురింపజేస్తున్నవి. ఇట్లా ఆనందాశంతో సంవలితములు కావటంచేతనే బీభత్స-భయానక-రౌద్ర-కరుణరసాలు కావ్యనాట్యములందు సంసేవ్యములవుతున్నవి.

కాగా, సంభోగమందలి దంతక్షత-నఖక్షతాదులవలెనే కరుణాదులందలి శోకాద్యనుభవం కూడా ఆస్వాద్యమానమే అవుతున్నది. అయితే లౌకికములైన సంభోగాదులవల్ల కలిగేది సుఖం మాత్రమే; అది ఆనందంకాదు. ఆనందమనేది అలౌకికమైనది; అది కావ్య-నాట్యాలవల్లనే సంభావ్యం.

## 15. రసధ్వని

రూపకతత్త్వాన్ని ప్రదర్శించిన ఖ్యాతి భరతమునికి చెందగా, కావ్యతత్త్వాన్ని ప్రదర్శించిన ఖ్యాతి ఆనందవర్ధనునకు దక్కినది. అంతవరకు 'నాట్యరసాలు' గానే ఉన్న అలౌకిరసాలు ఇంతటి నుంచి 'కావ్యరసాలు'కూడా అయినవి. కావ్యానికి 'ఆత్మ ధ్వని' అని ఆనందవర్ధనుడు నిరూపించినాడు. 'ధ్వని' విచారం ఆనందవర్ధనునకు పూర్వంకూడా లేకపోలేదు. కాని, దానిని పూర్వపక్షరహితంగా సిద్ధాంతించినవాడు ఆనందవర్ధనుడే. (ఈధ్వని సిద్ధాంతం, వైయాకరణుల 'స్ఫోటవాదము'నకు రూపాంతరం అని చెప్పవచ్చు).

శబ్దానికి మూడుశక్తులు ఉన్నవి — 1.. అభిధాశక్తి- ఇది వాచ్యార్థమును బోధిస్తుంది; 2. లక్షణాశక్తి- వాచ్యార్థము కుదురనప్పుడు రూఢినిపట్టికాని,

ప్రయోజనమును పట్టికాని, వాచ్యార్థంతోనే సంబంధంకల వేరొక అర్థాన్ని బోధిస్తుంది లక్ష్యార్థం; 3. వ్యంజనాశక్తి- వాచ్యార్థం పొసగిన పిమ్మట రమణీయమైన వేరే అర్థాన్ని స్ఫురింపజేసేది వ్యంగ్యార్థం. దీనినే 'ప్రతీయమానార్థం'అనీ, 'ధ్వని' అనీ అంటారు. ఆనందవర్ధనుడు, ధ్వనిని ఇట్లా నిర్వచించినాడు :

యత్రార్థశ్శబ్దోవా తమర్థ ముపసర్జనీకృతస్వార్థౌ ।
వ్యంక్తః కావ్యవిశేషః స ధ్వని రితి సూరిభిః కథితః ॥

— ఎందు శబ్దాలుకాని, అర్థాలుకాని ఉపసర్జనీకృత (=అప్రధానంగా చేయబడిన) స్వార్థములై, ప్రతీయమానార్థాన్ని వ్యక్తంచేస్తాయో, ఆ కావ్యవిశేషం 'ధ్వని' (కావ్యం) అవుతుందని పండితులు చెబుతారు.

ఇట్టి ధ్వని మూడు విధాలు- 1. వస్తుధ్వని, 2. అలంకార ధ్వని, 3. రసధ్వని. ఈ మూడింటిలో 'రసధ్వని' ప్రధానమైనది; వస్తు-అలంకారధ్వనులు దీనికి పోషకాలు కావాలి. వాచ్య- వ్యంగ్యభేదాలను వివరించి, ధ్వనిస్వరూపం నిర్ణయించి, భరతముని రససిద్ధాంతాన్ని పునరుద్ధరించినవాడు ఆనందవర్ధనుడు. అసలు, ధ్వని మతం రసమతానికి భాష్యమనీ, తద్భిన్నంకాదనీ విజ్ఞుల అభిప్రాయం. రసం వాచ్యరూపంగాకాక వ్యంగ్యరూపంగా ఉండాలన్నదే ఈ సంప్రదాయంలోని విశేషం. నాట్యశాస్త్ర-ధ్వన్యాలోకాలను లోకోత్తరంగా వ్యాఖ్యానించిన అభినవగుప్తుడు ఈ రసధ్వనినే అభిమానించి, అదే 'కావ్యాత్మ' అని నిర్ధరించినాడు. అర్వాచీనులపై ఈమతమే ప్రాబల్యం వహించింది.

రెండు ఉదాహరణలు :

లక్ష్యార్థం : "గంగలో గొల్లపల్లెఉన్నది" అన్నప్పుడు 'గంగానదిలో గొల్లపల్లె ఉన్నది' అని వాచ్యార్థం. కాని, గంగానదిలో గొల్లపల్లెకాదు, ఏపల్లెకూడా ఉండటం సంభావ్యంకాదు. అందుచేత, ఇచ్చట 'గంగానది ఒడ్డున గొల్లపల్లె ఉన్నది' అని అర్థం చెప్పుకోవాలి— దీనినే లక్ష్యార్థం అంటారు.

వ్యంగ్యార్థం :
అత్తపడినదింట మత్తెక్కి; పతియెందో
పోయినాడు; కుక్క పోతుసచ్చె;
ప్రత్తిచేను విఱుగబడిమేసె నెమబోతు;
దీనినతని కెవరు తెలుపువారు? (గాథాసప్తశతి-VI-49)

(శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారి అనువాదం).

ఇది పరకీయా ప్రసంగం :

వాచ్యార్థం : ఇంట ఒంటరిగా ఉన్నాను; భయంగా ఉంది; ఎవరేనా తోడుగా ఉంటే బాగుండును.

వ్యంగాలయు, ఉపపతిని, రహస్యంగా పండిన ప్రత్తిచేనులో కలిసికొనేది. ఇప్పుడు ఆ ప్రత్తిచేనును ఎనుబోతు తిన్నది; ఇంక అక్కడ కలిసికొనటానికి వీలులేదు. కాని, "ఇప్పుడు నేను ఇంటిలో ఒంటరిగా ఉన్నాను. అత్త, మత్తెక్కిపడి ఉండటంచేత, ఉన్నాలేనట్లే, కావున నీవు నిరభ్యంతరంగా ఇంటికేరావచ్చు" అనే ధ్వని పొంచి వింటున్న ఉపపతికి స్ఫురించింది.

కాగా, ఇది, వాచ్యార్థాన్నిమించి, ప్రతీయమానమైన ధ్వని; అంతేకాదు రసం వాచ్యంకాలేదు.

# 16. రసాభాసం

అదేశయుక్తో వేషోహి నశోభాం జనయిష్యతి ॥
మేఖలోరసి బద్ధాతు హాస్యం సముపపాదయేత్ ।
-(నా.శా.XXI-73-74)

— అసహజమైన వేషం శోభాకరంకాదు. మేఖల (=వడ్డాణం)ను వక్షమునందు ధరిస్తే హాస్యాస్పదం అవుతుంది కదా!

ఆహార్యాభినయ ప్రసంగంలో భరతమునిచేసిన హెచ్చరిక ఇది. అసహజమైనది హాస్యాస్పదం కావటం ఒక్కవేషం విషయంలోనే కాదని రుద్రటుడు మరింతగా విశదీకరించినాడు :

గ్రామ్యత్వ మనౌచిత్యం వ్యవహారాకారవేషవచనానామ్ ।
దేశ-కుల-జాతి-విద్యా-విత్త-వయః-స్థాన-పాత్రేషు ॥
-(రుద్రటాలంకారం-XI-9)

— దేశం, కులం, జాతి, విద్య, విత్తం, వయస్సు, స్థానం, పాత్ర- వీటి విషయాలలో వ్యవహారం, ఆకారం, వేషం, వచనం - ఇవి ఔచిత్య సహితంగా లేకపోవటం 'గ్రామ్యత్వం' అనే దోషం అవుతుంది; అంటే అవి హాస్యాస్పదములవుతాయి.

ఔచిత్య-అనౌచిత్యాలను ఆనందవర్ధనుడు క్రిందివిధంగా వివరించినాడు.

అనౌచిత్యాత్—ఋతే నాన్యత్ రసభంగస్య కారణమ్ ।
ప్రసిద్ధౌచిత్య బంధస్తు రసస్యోపనిషత్పరా ॥
-(ధ్వన్యాలోకం-III-15)

— అనౌచిత్యంవినా వేరొక్క రసభంగకారణం లేదు. ఇంక ఔచిత్యసహితమైన నిబంధనం కేవలం రసగుళికయే.

ఔచిత్యపదాన్ని స్పష్టంగా నిర్వచించటమేకాక, ఔచిత్యాన్ని ఒకప్రధాన సాహిత్యసంప్రదాయంగా స్థాపించిన క్షేమేంద్రుడు భరత-రుద్రట-ఆనందవర్ధనుల భావాలను ఇట్లా ప్రపంచించినాడు (ఔ.వి.చ-1) :

కంఠే మేఖలయా నితంబఫలకే తారేణ హారేణవా
పాణౌ నూపురబంధనేన చరణే కేయూరపాశేనవా ।
శౌర్యేణ ప్రణతే రిపౌ కరుణయా నాయాన్తి కే హాస్యతామ్
ఔచిత్యేన వినా రుచింప్రతనుతే నాలంకృతి ర్నోగుణాః ॥

— కంఠమందు మేఖల, ఫలకంవలె విశాలమైన నితంబమందు ముత్యాలహారం, చేతియందు అందెల, పాదమందు దండకడియం ధరించటం; నమస్కరించిన వానిమీద శౌర్యం- శత్రువుమీద కరుణచూపటం- వీటివల్ల ఎవరైనా హాస్యాస్పదులు కాకుండా ఉంటారా? ఔచిత్యంలేని అలంకారాలు కాని, గుణాలు కాని రచికరం కాజాలవు.

పై శ్లోకంలో, అనౌచిత్యవంతములై హాస్పాదములయ్యే నాలుగు విధాల భూషణ ధారణం, రెండు గుణాలు మాత్రమే చెప్పబడినవి. కాని, క్షేమేంద్రుడు ఈ రెండు వర్గాలతోనే ఆగక, ఔచిత్యం విధిగా పాటించవలసిన మొత్తం 27 వర్గాలను పేర్కొన్నాడు— పద్యం, వాక్యం, ప్రబంధం, గుణం, అలంకారం, రసం, క్రియ, కారకం, లింగం, వచనం, విశేషణం, ఉపసర్గ, నిపాతం, కాలం, దేశం, కులం, వ్రతం, తత్త్వం, సత్త్వం, అభిప్రాయం, స్వభావం, సారసంగ్రహం, ప్రతిభ, అవస్థ, విచారం, నామం, ఆశీర్వాదం.

క్షేమేంద్రుడు 'ఔచిత్యం' అంటే ఏమిటో ఇట్లా వివరించినాడు :

ఉచితం ప్రాహురాచార్యాః సదృశంకిల యస్యయత్ ।
ఉచితస్యచ యో భావః తదౌచిత్యం ప్రచక్షతే ॥
-(ఔచిత్యవిచారచర్చ-7 శ్లో.)

— దేనికి ఏది సదృశం (=తగినట్లు)గా ఉంటుందో అది 'ఉచితం'; ఉచితం యొక్క భావమే 'ఔచిత్యం'.

కాగా, అనౌచిత్యం ఎక్కడ ఉన్నా అది గ్రామ్యత్వం అవుతుంది. గ్రామ్యత్వం తప్పక హాస్యాస్పదమవుతుంది.

ఇంక ప్రస్తుతాంశం రసాభాసం, దానితోపాటు భావాభాసం. అనౌచిత్య ప్రవృత్తివల్ల రస-భావాలు క్రమంగా రసాభాసం, భావాభాసం అవుతాయని అర్వాచీనాలంకారికులు పేర్కొన్నారు. రసాభాసం భావాభాసం అనే పదాలను భరతుడు వాడకపోయినప్పటికి అసహజములైనవి హాస్యాస్పదాలవుతాయనటంలో ఈ అభిప్రాయం సూచితమవుతున్నది.

అయా రసాభాసాలను ఆయారసాల వివరణల చివర పేర్కొన్నాను. ఉదా: బహునాయకరతి, ఏకత్రైవానురాగం, మ్లేచ్ఛగతం, తిర్యగ్గతం, అనే భేదాలచేత శృంగారాభాసం చతుర్విధం. ఇట్లాగే తక్కిన రసాలలో, భావాలలో అభాసత్వం ఉంటుంది. ఈ అభాసంకూడా రసదోహదకారి అవుతుందా లేదా అనేది కొంత చర్చనీయాంశమైంది. అయినప్పటికీ కాళిదాసాది మహాకవులు తిర్యగ్గతాదిశృంగారాలను మనోహరంగా వర్ణించి ఉన్నారుకదా!

శృంగారం అనుకృతిరూపంలో అంటే అభాసరూపంలో హాస్యానికి హేతువు అవుతుంది. ఈ అభాసమందలి రతి కామనాభిలాషమాత్రమైన వ్యభిచారి భావమేకాని స్థాయిభావం కాజాలదు (స్థాయివలె మాత్రం గోచరిస్తుంది). తద్వశాన విభావాదులు కూడా అభాసరూపం పొందుతాయి. అభాసమంటే అనౌచిత్యప్రవృత్తి కదా. ఆ అభాసం హాస్యానికి విభావం అవుతుంది. ఇచ్చట శృంగారాభాసం తక్కిన రసాలకు ఉపలక్షకం; అంటే దీనిచేత సర్వ రసాలు గ్రాహ్యాలే- కరుణాద్యాభాసాలు కూడా హాస్యానికి విభావలే. కాగా సర్వరసములందలి అనౌచిత్యప్రవృత్తి హాస్యనికి విభావంకాగలదు. (అ.భా. 1వ సం. పుట 313).

అయా అభాసాలను శారదాతనయుడెట్లా వివరించినాడు :

హాస్యభూయిష్ఠమైన శృంగారం, శృంగారాభాసం.
బీభత్సంతో నిండినహాస్యం, హాస్యాభాసం.
భయానకప్రాయమైన వీరం, వీరాభాసం.
కరుణం ఎక్కువగాగల అద్భుతం, అద్భుతాభాసం.
శోకభయాలతోనిండిన రౌద్రం, రౌద్రాభాసం.
హాస్యంతోనిండిన కరుణము, కరుణాభాసం.

శృంగారంతోడి బీభత్సం, బీభత్సాభాసం.
రౌద్ర వీరభూయిష్ఠమైన భయానకం భయానకాభాసం.

శృంగారంలో, పిమ్మట ఉభయనిష్ఠమైనప్పటికీ, తొలుత ఏకనిష్ఠమైతే, అది శృంగారాభాసమే అవుతుందని లోచనకారుడు. ఉదా: రత్నావళియందు, అన్యోన్య సందర్శనమునకు పూర్వమే, సాగరికకు వత్సరాజునందుకల రతి.

రసదోషాలలో ప్రధానమైనది అంగంగా ఉండే రసం స్వేచ్ఛగా వృద్ధిపొందటం; అప్పుడు అంగిరసం, అవినీతిపరుడైన మంత్రివల్ల ఆ ప్రభువు అభాసతపొందునట్లే, అభాసంపొందుతుందని సింగభూపాలుడు పేర్కొన్నాడు.

రసదోషాలలో తప్పక గమనించవలసినది- రసం వాచ్యంకారాదు; అంటే ఇది శృంగారరసం, ఇది కరుణరసం అంటూ కవి వాచ్యంచేయరాదు. అతని చిత్రణలో, వర్ణనలో ఆయారసాలు ప్రతీయమానం కావాలి.

భామహాదులు రసచర్చవదలివేసినా, రసాన్నిమాత్రం అలంకారంగా పేర్కొన్నారు. రస, భావ, రసాభాస, భావాభాస, భావశాంత్యాదులు కావ్యంలో ప్రధానంగాకాక, అన్యాంగములైతే అవి రసవదాద్యలంకారాలవుతాయి.

1) రసం అప్రధానం (అంటే వేరొక రసానికి లేదా భావానికి అంగం) అయితే అది 'రసవదలంకారం'.

2) ఒకరసానికి భావంకానీ, ఒకభావానికి ఇంకో భావంకానీ అంగం అయితే అది 'ప్రేయోఽలంకారం' (=భావాలంకారం).

3) భావానికి రసాభాసం లేదా భావాభాసం అంగం అయితే అది 'ఊర్జస్వి దలంకారం'.

4) రసానికి భావశాంతి అంగం అయితే అది 'సమాహితాలంకారం'.

ఔచిత్యమనుధావంతి సర్వే ధ్వనిరసోన్నయాః ।
గుణాలంకృతి రీతీనాం నయాశ్చానృజు వాఙ్మయాః ॥

-మహామహోపాధ్యాయ ఎస్. కుప్పుస్వామిశాస్త్రి

(ఉన్నయం=అనుమతి; అలంకృతి=అలంకారం; అనృజువాక్=వక్రోక్తి)

క్షితౌరత్నచ్ఛాయాఫలన ముదకే వీచిలలితం
శిఖిన్యర్చిః ప్రేంఖా సహజగతి వైచిత్ర్యమనిలే ।
తటిత్క్రీడావ్యోమ్నిత్యకృత సుభగః పంచసుపరః
ప్రవిష్టో భూతేషు ప్రభవతి హి నృత్తస్య మహిమా ॥

-నృత్తరత్నావళి-I-10

సర్వేభవంతు సుఖినః
సర్వేసంతు నిరామయాః ।
సర్వే భద్రాణి పశ్యంతు
మాకశ్చిత్ దుఃఖభాక్ భవేత్ ॥
దుర్జనః సజ్జనోభూయాత్
సజ్జనః శాంతిమాప్నుయాత్ ।
శాంతోముచ్యేత బంధేభ్యః
ముక్తశ్చాన్యాన్ విమోచయేత్ ॥
ఓమ్. శాన్తిః, శాన్తిః, శాన్తిః.

# 1. సంప్రదించిన ప్రధాన శాస్త్ర గ్రంథములు

1. నాట్యశాస్త్రం- భరతముని ప్రణీతం- అభినవగుప్తుని "అభినవభారతీ" వ్యాఖ్యాసహితం.

   (i) శ్రీమానవల్లి రామకృష్ణకవి (యమ్.ఆర్. కవి) గారి సంపాదకత్వంలో బరోడా గేక్వాడ్ ఓరియంటల్ సీరీస్‌లో వెలువడిన నాలుగు సంపుటాలు:

   మొదటిసంపుటం - ద్వితీయపరిష్కృతముద్రణ (1956) 1-7 అధ్యా.

   రెండవ సంపుటం - ప్రథమముద్రణ (1934) 8-18 అధ్యా.

   మూడవసంపుటం - ప్రథమముద్రణ (1954) 19-27 అధ్యా.

   నాలుగవ సంపుటం - ప్రథమముద్రణ (1964) 28-37 అధ్యా.

   (ii) డా. మనోమోహన్ ఘోష్ ఆంగ్లానువాదం.

   (i) మొదటిసంపుటం - 1-27 అధ్యా. (1951)

   (ii) రెండవసంపుటం - 28-36 అధ్యా. (1961)

   (iii) డా. మనోమోహన్‌ఘోష్ సంపాదకత్వంలో వెలువడిన సంస్కృత మూలం :

   (i) మొదటిసంపుటం - 1-27 అధ్యా. (1967)

   (ii) రెండవసంపుటం - 28-36 అధ్యా. (1956)

   (iv) ఆచార్య బాబూలాల్ శుక్ల శాస్త్రి సంపాదకత్వంలో హిందీ అనువాదంతో వెలువడిన నాలుగు సంపుటాలు.

   (i) మొదటిసంపుటం - 1-7 అధ్యా. (1984)

   (ద్వితీయ పరిష్కృత ముద్రణ)

   (ii) రెండవసంపుటం - 8-19 అధ్యా. (1978)

   (iii) మూడవసంపుటం - 20-27 అధ్యా. (1983)

   (iv) నాలుగవసంపుటం - 28-36 అధ్యా. (1985)

   (v) డా.పి.యస్.ఆర్. అప్పారావు ఆంధ్రానువాదం - గుప్తభావ ప్రకాశికా సహితం - 1-36 అధ్యా. ద్వితీయముద్రణ (1982)

2. ధ్వన్యాలోకం - ఆనందవర్ధన ప్రణీతం - అభినవగుప్తుని అభినవభారతీ సహితం.

(1) డా.కె. కృష్ణమూర్తిగారి ఆంగ్లానువాదసహితం ద్వితీయముద్రణ (1982)

(2) శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యులవారి ఆంధ్రానువాదం.

3. దశరూపకం - ధనంజయ ప్రణీతం - ధనికుని 'అవలోక' సహితం. డా. బైజనాథ పాండేయ హిందీ అనువాదసహితం ప్రథమముద్రణ (1979)

4. సంగీతరత్నాకరం - శార్ఙ్గదేవప్రణీతం - (7వ అధ్యా.) - కల్లినాథ, సింగభూపాలుర వ్యాఖ్యలతో కూడినది.

మద్రాసు అడయార్ లైబ్రరీ ప్రచురణ

5. రసార్ణవసుధాకరం - సింగభూపాల ప్రణీతం - శ్రీబులుసు వేంకట రమణయ్యగారి ఆంధ్రానువాద సహితం. ప్రథమముద్రణ-1950

6. ప్రతాపరుద్ర యశోభూషణం - విద్యానాథప్రణీతం - కుమారస్వామి 'రత్నాపణ' వ్యాఖ్యాసహితం. డా.వి. రాఘవన్ సంపాదకత్వంలో వెలువడినది తృతీయముద్రణ - 1987

7. సాహిత్యదర్పణం - విశ్వనాథ కవిరాజ ప్రణీతం - లోచన - విజ్ఞానప్రియ వ్యాఖ్యలతో కూడినది.

(1) ఢిల్లీ భారతీయ బుక్ కార్పొరేషన్ ప్రచురణ (1988)

(2) కళాప్రపూర్ణ శ్రీవేదం వెంకటరాయశాస్త్రిగారి ఆంధ్రానువాదం (1935)

8. భావప్రకాశనం - శారదాతనయ ప్రణీతం.

శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారి ఆంధ్రానువాద సహితం (1973).

9. (i) నాట్యదర్పణం - రామచంద్ర - గుణచంద్ర ప్రణీతం - డా. దేవీచంద్ర శర్మ హిందీ అనువాద సహితం

(ii) The Nāṭya Darpana - A critical study by Dr. K.H. Trivedi (1966)

10. రసమంజరి - భానుదత్తప్రణీతం
శ్రీ వేదం వేంకట రాయశాస్త్రిగారి ఆంధ్రటీకాసహితం.
ప్రథమముద్రణ (1909)
11. రసగంగాధరం - జగన్నాథపండిత ప్రణీతం.
శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యులవారి శ్రీ శర్వాణీ వ్యాఖ్యా సహితం (1969)
12. రసతరంగిణి - భానుదత్త ప్రణీతం.
శ్రీగోపాలదత్తజోషీ హిందీ అనువాద సహితం
ప్రథమముద్రణ (1974)
13. శృంగారమంజరి - హజరత్ సయ్యద్ అక్బర్‌షా హుస్సేని (బడేసాహెబ్) ప్రణీతం.
డా.వి. రాఘవన్ విపుల ఆంగ్ల వ్యాఖ్యాసహితం (1951)
14. భరతరసప్రకరణం - నీడామంగలం తిరువేంకటాచార్య సంకలితం - వావిళ్ళముద్రణ (1932)
15. (i) బాలరామభరతం - బాలరామవర్మ వంచి మహారాజ ప్రణీతం - 1935
(ii) Balarama Bharatamu - critical study by Dr. E. Easwaran Nampoothiry - 1983 (Kerala Sanskritam Publication - Trivendrum)
16. ఔచిత్య విచారచర్చ - క్షేమేంద్ర ప్రణీతం డా. పుల్లెల శ్రీరామ చంద్రుడుగారి అనువాద సహితం.
17. కావ్యాలంకారం - భామహ ప్రణీతం - డా. పుల్లెల శ్రీరామచంద్రుడుగారి అనువాద సహితం - 1979
18. వక్రోక్తి జీవితం - కుంతక ప్రణీతం - డా. పుల్లెల శ్రీరామచంద్రుడు గారి అనువాద సహితం - 1977
19. Bhoja's Śṛngāra Prakāśa by Dr. V. Raghavan (1978)
20. The Number of Rasas by Dr. V. Raghavan (1940)
21. కావ్యాలంకార సంగ్రహం (నరసభూపాలీయం) - రామరాజభూషణ ప్రణీతం - శిరోమణి సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారి విపులవ్యాఖ్యాసహితం (1945)
22. సాహిత్యశిల్ప సమీక్ష - ఆచార్య పింగళి లక్ష్మీకాంతం (1970)

# 2. అకారాది పదానుక్రమణిక